వీర గాథలు-II



# కాటమరాజు కథలు

రెండవ సంపుటము

[ కాటమరాజు వుత్తరాది ఆవుల మేపు, గంగ - కాటమరాజు తరకవాదము, కాటమరాజు దక్షిణాది ఆవుల మేపు, భట్టు రాయబారము, కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ, వేడుక బొంగరాల కథ, యఱ్ఱగడ్డపాటి పోట్లాట, అగుమంచి కథ, భక్తిరన్న కథ ]

సంపాదకుడు :

డా. తంగిరాల వెంకటసుబ్బారావు, M. A., Ph. D.

సహాయకుడు :

డా. చన్నాప్రగడ తిరుపతిరావు, M. A., Ph. D.




ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమి

కళాభవన్ - సైఫాబాదు

హైదరాబాదు-4

# తొలి పలుకు

ప్రపంచపు ప్రముఖ సాహిత్యము లన్నింటియందు వలెనే, తెలుగు సాహిత్యముననూ, 'వీర గాథలు' ఒక ప్రత్యేక ప్రక్రియగ, జనానీకపు ఆదరణను, అందును ముఖ్యముగ జానపదుల మన్ననను విరివిగ ఆర్జించినవి. ఈ విషయమున తెలుగు సాహిత్యమునకు సంబంధించినంతవరకు, ఒక ప్రత్యేక విశిష్టత కన్పట్టుచున్నది. తక్కిన ప్రపంచ సాహిత్యములలో ఎచటను ఈ సాహిత్య ప్రక్రియ అగ్రశేణికి చెందిన కవులను ఆకర్షించినట్లు కన్పట్టదు. కాని తెలుగు దేశపు మేటి కవులలో ఒకడుగ చారిత్రక ఖ్యాతిని ఆర్జించి, కవి సార్వభౌముడుగ ప్రశంసితుడైన శ్రీనాథుసంతతి వానిని ఈ 'వీరగాథా' ప్రక్రియ ఆకర్షించినది. ఆయన రచించిన 'పల్నాటి యుద్ధము' నాడును నేడును పండిత పామర రంజకమై తెలుగు సాహిత్యమున వన్నె కెక్కినది. అంతేకాదు; ప్రపంచమున ఇప్పటికి వివిధ సాహిత్యములలో లభ్యమగుచున్న వీరగాథలను పరిశీలించి చూడగ, కాలరీత్యా, ప్రాచీనతయందు దీనిని అధిగమించిన వీరగాథ కనరాదని పండితుల అభిప్రాయము.

శ్రీనాథుని తరువాత ఎందరో కవులు వివిధ ప్రాంతీయ చారిత్రక సంఘటనలను ఆధారములుగ గ్రహించి అనేక వీరగాథలను రచించిరి. ఇవి యన్నియు జానపదులందు మౌఖిక ప్రచారమున మాత్రమే నిలచి ఉన్నవి. పాడుటకు అనుకూలముగ ఉండు జానపదీయ గీతశైలిలో రచితములగు ఈ గాథలు కొన్ని ప్రత్యేక ఉత్సవ సందర్భాదులందు, సాంప్రదాయిక గాథాగాయకులచేత పాడబడుచు జనులను రంజింపచేయుచున్నవి. కాని ఆధునిక నాగరికతను సంఘమున తెచ్చిన మార్పులవలన అట్టి గాథాగాయకుల సంఖ్య నానాటికి క్షీణించుచున్నది. కావున, క్రమముగ అవి లుప్తములగు పరిస్థితి ఏర్పడు అవకాశము కలదు. అట్టి దురవస్థ సంఘటిల్లక మునుపే వానికి ముద్రితరూపములను కల్పించవలసిన ఆవశ్యకత ఏర్పడినది.

ఇదివరలో వేటూరి ప్రభాకరశాస్త్రిగారివంటి పండితులు ఈ గాథలందు ఒకటి రెండింటిని, తగు పీఠికలతో ముద్రింపజేసినను అవి సమగ్రములు కావనుట సుస్పష్టము. వీరగాథలను అన్నింటిని, వాని వివిధ పాఠాంతరములను, కాటమరాజు కథలవంటి కథాచక్రములోని గాథలన్నింటిని సేకరించి, సంస్కరించి ప్రకటించుటకు వారికి ఆనాటికి అవకాశము లేకుండెను. అందువలన దొరికిన ఏ ఒకటి రెండింటినో వారు ప్రచురించిరి. ఈ లోపమును పూరించుటకై ఈ వీరగాథలను అన్నింటిని సేకరింపజేసి, సుసంస్కరితరూపములలో, విమర్శనాత్మక పీఠికలతో ప్రచురించుటకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ నిర్ణయించినది. ఆ నిర్ణయానుసారము జరిగిన కృషిలో తొలుతటిది ఈ కాటమరాజు కథలు; ఇది రెండు సంపుటముల గ్రంథము, అందిపుడు వెలువరించినది రెండవ సంపుటము. మొదటి సంపుటము గడచిన సంవత్సరము ప్రకటితమైనది.

ఈ గ్రంథ సంకలన కర్తలు డా॥ తంగిరాల వెంకటసుబ్బారావుగారు జానపద వాఙ్మయ రంగమున పరిశోధకులుగ సుప్రసిద్ధులు. ఈ వీరగాథలను, వాని వివిధ పాఠాంతరములను సేకరించుటకు ఆంధ్రప్రదేశమంతట వీరు, పర్యటించి, లభ్యములగు తాళపత్ర గ్రంథములను సాంప్రదాయిక గాథాగాయకుల నుండి లభ్యములగు గాథారూపములను సవిమర్శముగ పరిశీలించి ఈ సంపుటములను సమకూర్చుటయే గాక, ఉత్తమమైన పీఠికను రచించి, వీరగాథల పుట్టు పూర్వోత్తరములను, ఆంధ్ర సాహిత్యమున వానికి గల ప్రాముఖ్యమును సాకల్యముగ చర్చించిరి. ఇటుల బహు శ్రమకోర్చి 'కాటమరాజు కథల'ను డా॥ తంగిరాల వెంకటసుబ్బారావు గారు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ పక్షాన సిద్ధము చేసిరి. ఇందులకై వారికి అకాదమీ సదా కృతజ్ఞతాబద్ధము. ఈ గ్రంథము వ్రాత ప్రతి సిద్ధము చేసే సందర్భమున మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీలోనున్న ప్రతులను పరిశీలించనైనది. ఇట్టి పరిశీలనకు అవకాశమిచ్చి అకాడమీకి సహాయపడిన మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్ లైబ్రరీకి, ఆ లైబ్రరీ అధికారులకు అకాడమీ పక్షాన కృతజ్ఞతలు.

ఈ గ్రంథముద్రణను చక్కగ సకాలమున నిర్వహించిన నాగలక్ష్మి ఆర్ట్ ప్రింటర్స్, హైదరాబాదు వారికి మా కృతజ్ఞతలు.

హైదరాబాదు

27-1-1978

దేవులపల్లి రామానుజరావు

కార్యదర్శి

# ప్రస్తావన

ఈ కాటమరాజు కథా చక్రమును గూర్చి నాకు తెలిసిన సమస్త విషయములు మొదటి సంపుటము పీఠికలో విపులముగా చర్చించియుంటిని. ఇటీవల కొన్ని నూతన విశేషములు తెలియ వచ్చినవి. వానినిట స్మరించుట సముచితము.

**కథల వరుసక్రమము :-**

ఈ వీరగాథా చక్రము (ballad-cycle)న ముప్పది రెండు కథలున్నవని చెప్పుదురు. వీని వరుస క్రమమును గూర్చి మొదటి సంపుటమున తెల్పియుంటిని. ఆ క్రమములో పెద్దిరాజు కథకును పోలురాజు కథకును మధ్య నుండదగు సింహాద్రిరాజు కథ, ఎఱనూకరాజు కథ, నలనూకరాజు కథ అను మూడు కథలు అలభ్యములని వ్రాసియుంటిని. కాని వానిలో ఇటీవల ఎఱనూక రాజు కథ లభించినది. దానిని ఈ రెండవ సంపుటములో మొదటి అనుబంధముగా నిచ్చితిని.

'కాటమరాజు దక్షిణాది ఆవుల మేపు' అను కథకే 'పుల్లరి కథ' అను నామాంతరము కలదని మొదటి సంపుటము పీఠికలో వ్రాసియుంటిని. అది సరికాదు. పుల్లరికథ అనునది ప్రత్యేకముగా నున్నదని నా ఇటీవలి పరిశోధన వలన తెలిసికొంటిని.

'గంగ-కాటమరాజు తరకవాదము' అను కథ తరువాత 'ఎఱ్ఱయ్య వాదము' అను కథ వచ్చునని తెలిపియుంటిని. కాని ఈ రెండు కథలను నిశితముగా పరిశీలింపగా 'గంగ-కాటమరాజు తరకవాదము' యొక్క మరియొక రూపమే 'ఎఱ్ఱయ్య తరకవాదము' అని తెలియవచ్చినది. ఇందు కాటమరాజునకు బదులుగా ఎఱ్ఱయ్య గంగతో తరకవాదము చేయును. అందువలన దీనిని ప్రధాన కథల వరుసలో కన్న అనుబంధమున నుంచుట సముచితమని తోచినది. పైగా దీని వ్రాత మిక్కిలి దుష్టముగాను, అన్వయక్లిష్టముగాను ఉన్నది.

'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను వీరగాథకు ప్రత్యంతరమొకటి కలదు. దీనిని అనుబంధములో నిచ్చితిని. ఇది అసంపూర్ణము. అయినను ఇందు కాటమరాజు యుద్ధప్రయత్నములు (బొల్లావును ప్రార్థించి తెచ్చుట, వీరిసీనికి శాణ్యము నేర్పరుచుట మున్నగునవి) విపులముగా వర్ణింపబడినవి. ఇవి ప్రధాన కథలో లేవు.

మొదటి సంపుటమున ఎనిమిది వీరగాథల నిచ్చియుంటిని. అవి వరుసగా (1) ఆవుల వలురాజు కథ (2) పంపాద్రి కథ (3) పెద్దిరాజు కథ (4) పోలు రాజు కథ (5) బల్లి కురవ పోట్లాట (6) కాటమరాజుకు పట్నం కట్టిన కథ (7) కరియావులరాజు కథ (8) పాపనూక కథ. ఈ రెండవ సంపుటమున తక్కిన తొమ్మిది కథలను వరుసగా నిచ్చుచున్నాను. (9) కాటమరాజు ఉత్తరాది ఆవుల మేపు (10) కాటమరాజు దక్షిణాది ఆవుల మేపు (12) భట్టు రాయబారము (13) కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ (14) వేడుక బొంగరాల కథ (15) ఎఱ్ఱగడ్డ పాటి పోట్లాట (ఏడు కాండలు) (16) అగుమంచి కథ (17) భక్తిరన్న కథ. వీనిలో వేడుక బొంగరాల కథకు 'అలుగుల-పోలు', 'ముమ్మయ్య-పోచయ్య బొంగరాలు' అను రెండు అసంపూర్ణ ప్రత్యంతరములు కలవు. వానిని అనుబంధమున చేర్చితిని. అట్లే 'భక్తిరన్న కథ'కు గల ఒక అసంపూర్ణ ప్రత్యంతరమును కూడ అనుబంధమున నిచ్చియున్నాను. అనుబంధములలో ప్రత్యంతర వీరగాథలేకాక ఈ కాటమరాజు కథాచక్రపు టవగాహనకు తోడ్పడెడి గుండ్లపాలెము శిలాశాసనము, ఖడ్గతిక్కన వృత్తాంతమును దెలిపెడి కొన్ని కైఫీయతులు, చాటుపద్యములు చేర్చితిని.

ఈ రెండవ సంపుటమున తొమ్మిది వీరగాథలున్నవి. ఇందు అనుబంధముగా నిచ్చిన యరనూకరాజు కథను కూడ మొదటి సంపుటమున చేర్చు కొనినచో అందలి వీరగాథల సంఖ్యకూడ తొమ్మిదియేయగును. ఇట్లు మొత్తము నాకు లభించిన వీరగాథల సంఖ్య పదునెన్మిది యగుచున్నది. నా దృష్టిలో ఈ కథాచక్రమున ఇంకను లభింపవలసిన కథలు:

1. గంగ పుట్టుక
2. పల్లికొండ పుట్టుక
3. సింహాద్రిరాజు కథ

4. నలనూకరాజు కథ
5. భైరవ కురువ యుద్ధము
6. పుల్లరి కథ
7. సాపనూక వలపోత
8. ఆగుమంచి వలపోత

**భాషా విశేషములు :—**

ఈ కాటమరాజు కథల భాషను గూర్చి భాషా శాస్త్రజ్ఞులు కూలంకషముగా పరిశోధింప వలసియున్నది. ఇది జానపదుల సజీవభాష. ఉచ్చారణ విధేయమగు శక్తిమంతమైన వ్యావహారిక భాష. ఇట్టి నిసర్గ భాషలోని ద్రుతము మీది యడాగమములు, విసంధిలో యడాగమములు, పదాదిని వచ్చెడి 'యి, యీ, యె, యే, వు, వూ, వొ, వో'లు మున్నగువానిని నేను మొదటి సంపుటమున అచ్చులుగా చేసి సరళ గ్రాంథికముగా మార్చివేసితిని ( అప్పుడు గురువర్యులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతము గారి పల్నాటి వీర చరిత్ర పరిష్కరణమును ఆదర్శముగా పెట్టుకొంటిని). అట్టి సంస్కరణము కూడ తప్పనియు, అది భాషా శాస్త్రజ్ఞుల పరిశోధనకు ఆటంకమును కలిగించుటయే కాక వారిని తప్పుదారులు పట్టించు ననియు గుర్తించి ఈ రెండవ సంపుటమున ఆ పరిష్కరణ సాహసమును విడనాడితిని. నా స్థూలదృష్టికి ఈ వీరగాథల భాషలో కానవచ్చిన కొన్ని విశేషముల నిట నుట్టంకింతును.

(1) అచ్చులలో 'అ, ఆ' లు మాత్రమే కలవు. తక్కినవేవియునులేవు. 'ఇ, ఈ లకు బదులు 'యి, యీ' లును, 'ఉ, ఊ, లకు బదులు 'వు, వూ,లును, 'ఋ' కు మారుగా 'రు' అను అక్షరమును, 'ఎ, ఏ', లకు బదులుగ 'యె, యే' లును, 'ఐ' కు బదులు 'అయి' అనియు, 'ఒ, ఓ' లకు బదులు 'వొ, వో' లును, 'ఔ'కి బదులు 'అవు' అనియు కలవు. పూర్ణబిందువు, విసర్గ ఉన్నవి. అనునాసికోచ్చారణమును సూచించుటకై ఈ పూర్ణబిందువు 'బ్రహ్మ' వంటి శబ్దములలో కూడ 'బ్రంహ్మ' అను రూపమున చొప్పింపబడినది. దీనికి బ్రెంహ్మ, 'బ్రెమ్మ' అను రూపాంతరములు కూడ కలవు దీర్ఘము మీద సాఘ్యపూర్ణము కొన్ని పదములలో కానవచ్చు చున్నది.

ఉదా: ఫోంగాను, రాంగాను, కాంగ, యేంటి గంగ.

(౭) శిష్ట భాషలో కొన్ని పదములలో రెండవ అక్షరములో నుండు హ్రస్వ అకారము ఈ జానపద భాషలో హ్రస్వ ఉకారముగా మారుట సాధారణము. ఈ మార్పు దేశిపదములలోను, తత్సమ పదములలోను కూడ కానవచ్చుచున్నది.

ఉదా: మెదురైన, బలుగము, బసువన్న, పరుమటి, తలుపు (తలపు), గంగురేగులు, పణుతులు, వుదుకము, పరుమాన్నము, తముకము, జలుకము, దేవుతులు, సిరుస్సు, సురులు, ఆరుభటము, పరుష

దీనికి వ్యతిరిక్తమగు మార్పుకూడా ( -ఉ- > -అ- ) అచ్చటచ్చట కాననగును.

ఉదా: 'కుసమ పువ్వుల రవికె'
'ధారణీశ్వరుడు', మగవరో! (మగువరో!)

మరికొన్ని పదములలో రెండవ అక్షరములోని ఇకారము కూడ ఉకారముగా మారినది.

ఉదా: పెద్దురాజు, వారుజనేత్రి, ఆరుషించి, పారుజాత మరికొన్ని మార్పులు:

అ > ఎ: గెద్ద, పచ్చ గెద్దలు, యరగెద్దపాడు, రెణభేరి, రెణబొబ్బలు, యెతీశ్వరులార, కెంభునిగుడి, కెలవు, శెంఖము, శెరములు, శెంక, చెదరంగము, జెయము

ఇ-> ఐ-: తైత్రిమూర్తులు

ఋ-> రి-: క్రిష్ణస్నానము, ప్రిథివి, ద్రిష్టముగ, వ్రితా ( వృథా )

-క్షి-> -అ-: దక్షణము ( దక్షిణము )

ఔ-> అమ్-/అవ్-: కంసల్య ( కౌసల్య )
కమిగిలి ( కౌగిలి )
గవిరీ మనోహర ( గౌరీ మనోహర )
సవిఖ్యంబు ( సౌఖ్యంబు )

(3) ఈ కాటమరాజు కథలలో లిపి చిహ్నములేని రెండు ముఖ్యధ్వని విశేషములున్నవి. (i) 'అ-ఎ' లకు మధ్యగా ఒక ధ్వని కలదు (x). ఇది కొన్నిచోట్ల 'అ, ఆ'ల తోను, మరి కొన్నిచోట్ల 'ఏ' తోను హల్లులకు చేర్చి వ్రాయబడినది. ఈ హల్లులలో కూడా 'య, శ,చ' అనునవి ఎక్కువగా ఉపయోగింపబడినవి. ఇంకను కొన్ని చోట్ల ఈధ్వని 'ౄ' వత్తుతో సూచింప బడినది. ఈ ధ్వని యందు హ్రస్వదీర్ఘములు రెండును కలవు. ఇది పదాదిని, పదమధ్యమున, పదాంతమున కూడ వచ్చును.

ఉదా: x-: యఱ్ఱన్న, యలమంచి, యసగంగ, యలనాగ, యాద దూరిన, యామారక, యాదవ బలము. యాణ్ణర్థము, యాటలు, శలవు, శానలు, శాయక, చమట, చవులు, చాత.,

-x-: పాడావులు, పాదేవులు, బొల్లావు, బొల్లేవు, పళ్లాలు, బల్లేలు, మొండ్యాలు, బల్యాలు, పళ్యాలు, తాటాకు. రాగాకు, మామిడాకు,

-x : దివ్య"

ఈ ధ్వని క్రియాపదముల చివర కూడా కానవచ్చు చున్నది.

ఉదా: వచ్చ, చూచ, పాయ, ఆయ, యెత్తించ, చింద్య,

ఈ ధ్వని పెక్కుచోట్ల యతిస్థానములో కానవచ్చుచున్నది. దీనికి ఇ,ఈ, ఎ,ఏలతో బహుళముగాను, అ,ఆ,ఐ,ఔలతో క్వాచిత్కముగాను యతిమైత్రి పాటింపబడినది.

(ii) అట్లే 'అ-ఒ' లకు మధ్యగా మరియొక ధ్వని కలదు (ɔ) (ఇది తుళుభాషలో ప్రత్యేక వర్ణముగా నున్నది). ఇది ఎక్కువగా 'వ' అను హల్లుతో కలిసి వచ్చును. 'క,బ'లతో క్వాచిత్కముగా నున్నది. ఉదా: వరి, వరుగు, వనధి, వనర, వక వయినాన (వైనాన) వయ్యాన, వశీకరము, వలురాజు, వనమాల, వనిత, వన్నెల, వార్తలు, వౌక్షము (వక్షము), వొౢాలు, వొచ్చె. కౌమారుడు, బత్తుకు, బంగరాలు. ఈ ధ్వని కూడ అ-ఒ లు రెంటితోను యతి మైత్రి నెరపు చున్నది.

హల్లులు :

ఈ కథలలో ఒక్క శకట రేఫ తప్ప తక్కిన హల్లులన్నియు కలవు. మహాప్రాణములకు బదులు అల్పప్రాణములు (గనమైన, బారము, దనకొండ, సిద్దిరాజు ఇత్యాది), అల్పప్రాణములకు బదులు మహాప్రాణములు (వఖటి, శంఖ, ఖరములు, ఖంధువులు, సొంభమూర్తి, ధొరలు ఇత్యాది) కొన్ని తావులలో వాడ బడినవి. అయినను మహాప్రాణములు చాలవరకు సరిగా పాటింప బడిన వనియే చెప్పవచ్చును.

దంత మూలీయమైన చ 'కారము' త్స' గా వ్రాయబడినది. (పత్సల వడ్యాణము) దీనికి స,త లతో యతి వేయబడినది. తాలవ్య చకారము ఇ,ఈ, ఎ,ఏ లతోనే కాక అ,ఔ లతో కూడ కూడియున్నది. 'చెవులు' అను పదము 'చౌలు'గా వ్రాయబడినది. కొన్ని చోట్ల 'చవులు' గా కూడ వ్రాయబడినది. అకారముతో కూడిన చ, జలు దంతమూలీయములైనను వ్యవహారములో కొన్ని పదములలో నవి తాలవ్యములుగనే ఉచ్చరింప బడును. ఈ కథలలో తాలవ్యో చ్చారణ గల బెల్లపు చారు, జడ మొదలగు పదములున్నవి. వ్యవహారములో దంతమూలీయోచ్చారణ కల పదములు ఈ కథలలో కొన్నిచోట్ల తాలవ్యములుగా నుచ్చరింప బడినవి. ('చదరంగమాడుచు చెల్లింపుకొనుచు')

సకారమునకు బదులు శకారము, లకారమునకు బదులు ళకారము ఈ కథలలో ఎక్కువగా ప్రయోగింప బడినవి.

స > శ : శిరిదేవి, శెలవు, శలవు, తులశి, వెగశి, వాశిగా, శింహ్మాసనము, పశిలన్న, కశిసీడు, పశిబిడ్డ, సమిశెను, శావలు, దరిశించెను, కాశ

ల > ళ : నళనన్న, స్థళము, భూతళము, తుళసి, కళిసములు, కళ్యాణము

శ్వాసాక్షరమైన 'హ' నాదాక్షరముగా నుచ్చరింపబడు సందర్భములలో 'హ్వ' లేదా 'హ్మ' గా చూపబడినది.

ఉదా: 'సింహ్వము' 'శింహ్మాసనము' (= సింహాసనము)

శకటరేఫ యెక్కడను వాడబడలేదు. 'భస్మము' అను అర్థము నిచ్చెడి 'నీఱు' శబ్దము కూడ సాధురేఫముతోనే వ్రాయబడినది. ('నిన్ను నీరు ఛేయక నిలువ మిచ్చోట')

శిష్టభాషలోని హల్లులు ఈ కాటమరాజు కథలలోని జానపద భాషలో ఎట్లు మార్పు చెందినవో ఈ క్రింది విధముగా చూపవచ్చును.

జ్ఞ > గ్న : సర్వగ్నుడు, యగ్నెఫలము, మనోగ్నానము.
చ - > శ -: శక్రము, శాట (చేట)
చ - > స -: సచ్చిన, సంపి, సయ్యన
చ - > త్స : పత్సల, రత్సరావులు, ఉత్సగా,
- జ - > - ద -: పూదించె (పూజించె)
- టివ్ -> - స్మ్ -: యిసుమంటి (ఇటువంటి)
- డ - /- డ > ణ : పణతి (పడతి), పషిణి (పసిడి)
- ండ -> - న్న -: వున్నంగ (వుండంగ)
- డ్ - > - ట్ -: వేట్కు (వేడ్కు)
త్స్య > ష : మషరేఖలు, మషవల్లభుండు
- ద - > - గ -: ముంగల (ముందర)
- ద - > - త -: వుతకాలు
- ద > - న : మీన (మీద)
- న - > - ణ -: వణిత, మణిషి, ముణిగితేను
- న > - ణ : కామిణి, అంగణామణులు
- న్ - > - డ్ -: మడిసి (మనిషి)
- ర > - ల : ముంగల (ముందర), ముంగల (ముందర)
- ల - > - ళ -: నళనన్న, సళము మొదలగునవి.
- ళ - > - ల -: (మిక్కిలి తక్కువ) కల్యాంబు
- వ - > - మ -: శిముడు, దేముడు
- వ - > - బ -: దైబాల (దైవాల)
శ > ప : (తక్కువ) పసుపతి, సూరుల మఠము, పసువులు
శ > ష : పషువులు
ష > స : (తక్కువ) మడిసి (మనిషి)
స > శ : (చాల ఎక్కువ) శిరిదేవి, శెలవు, శలవు, తులశి ఇత్యాది

స > ష : పషిడి (పసిడి), పరుష (పరుస)

-ంహ-> -హ్వ-/-ంహ్మ-: 'సింహ్వాము', శింహ్మాసనము

## సంధులు:

యకారంబును వు వూ వొ వో లును తెలుగు మాటలకు, పద్యపాద ములకు మొదటనే కలవు. ద్రుతము మీద యడాగమములు, విసంధి కోకొల్లలు. ఒక్కమాటలో చెప్పవలెనన్న ఈ కాటమరాజు కథలు సర్వత్ర జానపదుల ఉచ్చారణకు విధేయమైన లిపిలో నున్నవి.

అత్తునకు కొన్ని చోట్ల నిత్యసంధి కానవచ్చుచున్నది.

ఉదా: అమ్మాడు మాటలు, అత్తాడు మాటలు

ఇత్తునకు అచ్చు పరమైనపుడు సంధి నిత్యము.

ఉదా: తాటాకు (తాటి + ఆకు)

రాగాకు (రాగి + ఆకు) = (రావియాకు)

మామిడాకు (మామిడి + ఆకు)

ఇత్తునకు హల్లు పరమైనపుడు కూడ సంధి కానవచ్చును.

ఉదా: కాశాత్ర = (కాశి + యాత్ర)

ఉత్తునకు అచ్చు పరమైనపుడు మాత్రము సంధి నిత్యము కాదు. ఇంచు మించు ప్రతి సందర్భమునందును విడదీసి యడాగమము చేసి వ్రాయబడినది. ఒకవేళ సంధి జరిగినచో జానపదోచ్చారణమే పాటింప బడినది.

ఉదా: అపుడిట్లగనియె.

పైకి వ్యతిరేకార్థకము వలెనున్నను వ్యవహారములో విధ్యర్థకములగు సంధులు కొన్ని కలవు ఇవి ఈ కథలలో హెచ్చుగానున్నవి. ఉదా: చెప్ప మనెను ( చెప్పుము + అనెను ), చేయమనెను ( చేయుము + అనెను ). కొన్ని కొన్ని పదములలో 'కొని' కి కాదేశము చేయబడి వ్యతిరేక క్త్వార్థకము వలె భాసించుట కూడ కలదు. తృణము చేబూనక (చేబూనుకొని). కొన్ని పదము లలో పదమధ్యాచ్చు లోపించు చున్నది. ఉదా. ధేన్వలు, మడ్సులు, గోపాల్కులు, బస్వన్న, వేట్క,

కొన్ని తత్సమ పదములలో గుణసంధికి బదులు సవర్ణదీర్ఘసంధి చేయబడినది ('వసుధీశ').

అక్షటాదులలోనే కాక తత్సమ పదములలో కూడా జడ్డ లోపించుచున్నది.

ఉదా: అయలార = (అయ్యలార), యరనన్న = (యర్రనన్న), యరగడ్డపాడు (యర్రగడ్డపాడు), యరనూకరాజు (యర్రనూకరాజు), నలనూకరాజు (నల్లనూకరాజు)

## సర్వనామము:

'తాను' అను ఆత్మార్థక సర్వనామము ఈ కాటమరాజు కథలలో అన్ని చోట్ల 'నేను' అను ఉత్తమ పురుషార్థములో ప్రయోగింప బడినది.

ఉదా: తాను = నేను
తనను = నన్ను
తా = నే (తా జూడవలెను = నే జూడవలెను)
తనకు = నాకు, తనవి = నావి, తమరు = మేము, తమను = మమ్ము.

శిష్టోచ్చారణాభాసము: ( Hyper Standardization )

ఉదా: శంఖ (శంక), ఖరములు (కరములు), వఖటి (వకటి), ఖండ్రించి (ఖండించి), వేడికలు (ఏడికలు), హేష్యము (ఏష్యము), వెర్రయ్య (ఎఱ్ఱయ్య), యిఘ (ఇక), అఘుమంచి (అగుమంచి), సాంభమూర్తి (సాంబమూర్తి), భూటకము (బూటకము), ఖద్దు (కద్దు), యిఖను (ఇకను), హాసమాన ఘనుడు (ఆసమాన ఘనుడు), హల్లకల్లోలము (అల్లకల్లోలము, ప్రవశించె (పవశించె), వెదిరించి (ఎదిరించి), విద్దరు (ఇద్దరు). వెగిసెను (ఎగిసెను), వీదేర్చు (ఈదేర్చు), హాశ్చర్యము (ఆశ్చర్యము), శఖునము (శకునము), ఖరవాలము (కరవాలము), ఘట్టిగా (గట్టిగా),

వ్యాకరణ విరుద్ధములగు పదములు, సమాసములు :

ఉదా: వస్తిమి, చేస్తిమి, చూస్తిమి, కరవాలు (కరవాలము), దివ్వన (దీవెన),

కాబట్టదు (అవసరము లేదు), దేశాంతి (దేశదిమ్మరి), నీరజనేత్రి, వారుజనేత్రి, పల్లవనేత్రి, చంద్రబింబ (చందబింబానన), కమలజగర్భుడు (కమల గర్భుడు లేదా కమలజుడు), దేశాద్రిపతులు (దేశాధిపతులు), త్రైమూర్తులు, ఆదశ్రీలు, అన్నము భోంచేసి, రాజుకు, రణముకు, మొ॥

## వైరి సమాసములు :

ఉదా: గోత్ర పెద్దలు, దేవతా బొంగరాలు, చిత్ర కన్నుంద, రెణబొబ్బలు, రక్త పచ్చదము, రక్త యేరులు, పుడమీశ్వరుడు.

**జానపద నిరుక్తి: ( Folk etymology)**

ఉదా: దశవాయువులు (దశవాయులు), పరమ వుపకారి (పరోపకారి), వేడుకలు (ఏడికలు), పంచమవాయిద్యములు (పంచ మహా వాద్యములు), జలా చంద్రుడు (జరాసంధుడు), మధురాక్షి (మదిరాక్షి), అనిరుద్రుడు (అనిరుద్ధుడు), అగిచంద్రుడు (హరిశ్చంద్రుడు), విడిమేలు (విడియ ములు), పట్టాభిరుద్రుడు (ప్రతాపరుద్రుడు), పదివేలు చేయించి(పదిలము చేయించి), అవుసత్యము (అసత్యము), శ్రీలు (స్త్రీలు), అనియేక (అనేక) మధురాయతాక్షి (మదిరాయతాక్షి).

## వాక్యనిర్మాణము :

ఈ ద్విపదలలో ఏ పాదమున కాపాదమే తెగ చెప్పబడినది. ఒక పాదము నుండి తరువాతి పాదమునకు వ్యాపించిన వాక్యములు అసలు లేవనియే చెప్ప వచ్చును. అయినను కర్తృపదము బహువచనములోను, దానికి సంబంధించిన క్రియ ఏకవచనములోను ఉన్నవాక్యములు పెక్కుచోట్ల కలవు.

ఉదా: కాంతలు-వచ్చె; వనితలు చల్లె;
అందరు-పడును;
రఘుపతి నలనన్న-భాషించు చుండె;
వల్లవ వీరులు-ఒరిగెను;
పొలసినవారు-కన్పించె;
అమరంగ గుండాన అందరు బడును.

ద్విపద పాదములను జానపద వృత్తిగాయకులు పాడుచు వ్యాఖ్యానించు టలో కొన్ని మాటలు అధికముగా చేరి ఛందస్సునకు శైథిల్యము తెచ్చినవి.

ఉదా: "మత్స్యావతారమున-(వస్తివోయి)-మదనవల్లభుడ!"

"చప్పన్న దేశాల-(ధేన్వల)-చాలమేపితిని"

కొన్నిచోట్ల ఈ శైథిల్యము మరింత హెచ్చుటచే రచన వచన ప్రాయ మగుట కూడ సంభవించినది.

ఉదా: 'వారికి పడబడ్డ పుల్లరి ధనమెల్ల పప్పించవలెను'

ఈ వాక్యమునందు పద్యపాదము 'వారికి పుల్లరి పప్పించవలెను' అని కాని లేదా 'వడబడ్డ ధనమెల్ల పప్పించవలెను' అని కాని ఉండవలెను.

ఈ కాటమరాజు కథలలోని భాషను గూర్చియు నిఘంటువులకెక్కని పదజాలమును గూర్చియు, ఆనాటి జానపదుల ఆచార వ్యవహారములను గూర్చియు, నమ్మకములను గూర్చియు—కిశోర పరిశోధకులు ప్రత్యేకముగా కృషి చేయవలసి యున్నది.........

## కృతజ్ఞతలు :

ఈ రెండవ సంపుటమును సమకూర్చుటలో నేను సంపాదించిన తాళపత్ర గ్రంథములతోపాటు ఆంధ్రప్రదేశ్ యాదవ సంఘ మాజీకార్యదర్శి శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు (తెనాలి తాలూకా, యడవూరు) దయతో నొసంగిన 'కాటమ రాజు ఉత్తరాది ఆవులమేపు', 'బొంగరాల కథ', 'శక్తిరన్న కథ' అను వాని నుపయోగించు కొంటిని. అనుబంధములో నిచ్చిన 'ఎఱనూకరాజు కథ'ను ప్రసా దించిన వారు కూడ శ్రీ పిచ్చయ్యగారే! అట్లే మదరాసు ప్రభుత్వ ప్రాచ్యలిఖిత పుస్తక భాండాగారమున నున్న 'కాటమరాజు చరిత్ర' (D. No. 1040) 'భట్టు రాయబారము' (D. No. 1043), ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' (D. No. 1031) 'కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ' (D. No. 1031)-అను వ్రాత ప్రతులను కూడ నేను పరిశీలించితిని. ఆ పుస్తక భాండాగారాధిపతి (క్యూరేటరు) శ్రీ సి. ఆర్. విట్టోబాబుగారు పై వ్రాతప్రతులకు పుత్రికలు తీయించి నాకు సకాలములో పంపించినారు.

మొదటి సంపుటము నందు వలెనే దుష్కరమైన ఈ రెండవ సంపుట పరిష్కరణమున గూడ ప్రియమిత్రులు డా. చన్నాప్రగడ తిరుపతిరావుగారు నాతోపాటు అహోరాత్రములు శ్రమించి నాకు చేదోడు వాదోడుగా నున్నారు.

పై ముఫ్వురకును నా కృతజ్ఞతా పూర్వక నమస్కృతులు...........

శుద్ధప్రతులను సిద్ధము చేయుటలో నాకు తోడ్పడిన చిరంజీవి జి. యస్. మోహన్‌కు నా శుభాశీస్సులు............

కాటమరాజు కథ లనేకములు నిరక్షరకుక్షులైన గాథాకారుల నోళ్ళలో భ్రష్టములగుచు, చివికి పోవుచున్న తాళపత్ర గ్రంథములలో క్రిమిదష్టములగుచు నశించి పోవుచున్నవి. ఇట్టి వానిని నేను అష్టకష్టముల కోర్చి సేకరించి రెండు వేల అయిదువందల పుటలకు పైగా నున్న ఈ గాథాచక్రమును నిర్మించితిని. సాహసౌదార్యములతో ముందునకు వచ్చి ఈ కాటమరాజు వీరగాథలను రెండు సంపుటములుగా ప్రకటించిన ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ వారికి ఐదుకోట్ల తెలుగు ప్రజానీకముతో పాటు నేనును మిక్కిలి ఋణపడి యున్నాను.........

ఇట్లు
సుధీ జన విధేయుడు

తంగిరాల వెంకట సుబ్బారావు
30-7-1977

'జ్ఞాన భారతి'
బెంగుళూరు
పింగళ-'వ్యాస పూర్ణిమ'

# విషయసూచిక

విషయము | పుట



## 9. కాటమరాజు వుత్తరాది ఆవులమేపు
### (ఆవులమేపులు - వుత్తరకాండం)

పుట.

# 10. గంగ-కాటమరాజు తరకవాదము
## ['గంగ తర్కము' లేక పాలేటి కథ]

పుట

# 11. కాటమరాజు దక్షిణాది ఆవులమేపు
## ['ఆవులమేపులు-దక్షిణ కాండం' లేక జన్నివాడ కథ]

పుట

# 12. భట్టు రాయబారము
## (కల్లి రాయభారము)

పుట

# 13. కోటపాటి తాటి వృక్షం తెచ్చే కథ

# 14. వేడుక బొంగరాల కథ

# 15. యఱ్ఱగడ్డపాటి పోట్లాట



## మొదటి కాండము

## 'తిక్కనామాత్యుని కథ' లేక 'చల్లవారి జగడము'

## రెండవ కాండము

## బొల్లావు జగడము

## మూడవ కాండము

## బీరినీడు యుద్ధము



## నాల్గవ కాండము

## కరియావుల రాజు యుద్ధము

## ఐదవ కాండము –బాలరాజుల యుద్ధము



## ఆరవ కాండము

## ఆవుల యెద్దుల జగడము-- య్ర

## ఏడవ కాండము - కాటమరాజు యుద్ధము



# 16. అగుమంచి కథ

# 17. భక్తిరన్న కథ

# అనుబంధము — i

## యరనూకరాజు కథ

[ మొదటి సంపుటమున పెద్దిరాజు కథకును పోలురాజు కథకును మధ్య నుండవలసిన వీరగాథ ]

# అనుబంధము -- II
## యర్రయ్య తరకవాదము



# అనుబంధము - III
## i అలుగులు పోలు

## ii ముమ్మయ్య పోచయ్య బొంగరాలు



# అనుబంధము - iv

## యఱ్ఱగడ్డపాటి పోట్లాట

### (ప్రత్యంతరము)

పుట

# అనుబంధము - V
## భక్తిరన్న కథ
## (ప్రత్యంతరము)

# అనుబంధము-vi

## శాసనములు-కైఫీయతులు

# అనుబంధము vii

## కంసుడు కథ (విష్ణుభాగవతము)

—o—

# కాటమరాజు వుత్తరాది ఆవులమేపు

## ఆవుల మేపులు - వుత్తరకాండం

### ప్రార్థన

శ్రీ మల్లికార్జునుని సేవించి మ్రొక్కి    పరగ జాహ్నవి గంగను ప్రార్థన జేసి
అమరంగ గణపతిని ఆత్మలో దలచి    శారదను కొనియాడి చెయ్యెత్తి
కమలగర్భునికిన్ని[1] కరములు మొగిచి    మ్రొక్కి
.........నామది దలచి    కవులను ప్రార్థించి కథ చెప్పెదాను

### కాటమరాజు ఆవులను మేపుచు శ్రీశైల మల్లికార్జునుని దర్శించుట

గోరక్ష పాలకుడు కొదమసింహంబు    సుగ్రీవునివంటివాడు శూరుడు పద్మ
గోవుల రక్షకుడు గోపాలకుండు    నాయుండు
శివరూపమైనట్టి శివుని పంపునను    శూరతనాయుడు శూరతమ్ముండు
శివపురాణమ్ములు చెలగి చదువుచును    వరపాలకులు సురులు గోపాలకూలు
రవితేజు యాదవ రాజశేఖరుడు    సుందరీమణులు లక్షనాణ్యాలవంటి
ఆమికతొ భూమెల్ల ఆవులమేపి    వారు
రఘురామునివంటివాడు రాజు కాటమ    (రఘురామునివంటివాడు) రాజు
రాజు    కాటమరాజు

---

1. 'కమబజు గర్భునికి' అని మూలము

(లక్ష్మణునివంటివాడు) తమ్ముడు యర్రయ్య
సంగతితో హనుమంతు చట్టివారి యర్రయ్య
ఘనతతో వుత్తర కాంభోజి మేపి
సరువవైరులనెల్ల చట్టలుచీరి
తెగువ వీరులద్రుంచి ధీరుడనిపించి
తరతరము పగలెల్ల తరిమి పోరాడి
చెరుకూరు పగకు-రాజు-చతురత మెరసి
మరియు క్రిష్ణరేవున[2] మందలావులు దాపె
తొమ్మిది దోనల బండ-కాటమరాజు-తోరణముదూరి
తేరాలసిద్దప్ప అనే దేవునికి మ్రొక్కి
తెలుగురాయుని చెర్లో ధేన్వలు నిలిపి

మరునాడు పర్వతము మాధవుడు యెక్కి
పర్వతాల మల్లప్పకు పడిసాగి మ్రొక్కి
బూదిగై కొని పెద్దభూపతి సుతుడు
భక్తితో శివునికి పరగతానపుడు
జంగమార్చనచేసి సద్భక్తితోను
లింగవస్త్రములిచ్చి లీలతోడుతను
సంగతితో గంటలు శంకు లిప్పించి
వడియలకు గోవుల వకకోటి యిప్పించి
తడియక యిప్పించి తావుదొడ్లు వేయించి
పన్నెండు యేండ్లు రాజు పన్నెండు మలలూ
దండి శూరుడు మేపె తరగనిపూరి.

## కాటమరాజు శ్రీశైల పర్వత ప్రాంతమున పండ్రెండేండ్లు ఆవులను మేపుట

యాడాదిమేపినా యేమి తరుగదాయ
అంబట్ల మలయెక్కి ఆవులుమేశ
పెంపైన దేన్వలు పెద్దమలయెక్కె

సంపూర్ణముగ మందలు సాగెనావేళ
సిద్దుల మేళముచొచ్చి యెద్దులుమేశ
యెద్దులూ సిద్దులు యేకాంతమాడి

2. మరియు కృష్ణ డెబ్బైరెండు రేవుల — పాఠాంతరము

ముద్దు తమ్మునితోటి ముచ్చటలాడి
ఆమనిగ మందలు ఆజోతిమల
యెక్కె
అగణితముగ మందలు అచ్చోట తర్లి
పేరుసాగి మందలు పిల్లుట్ల మల
యెక్కె
తర్లక యాడాది తగమేయుచూను
నందిముద్ర యెద్దులు మానందిమల
యెక్కె
అందమైయుండెను ఆవులు యెద్దులు
జోకైన కవులావు లచ్చోట దిగెను
మేకపోతు కురువ యెక్కి మేయుచు
నుండె
నీలవర్ణుని మందలో నీరు పూరియును
ఆరుట్ల మలమెక్కి ఆవులు మేశ
వాలాయముగ మేశ వకకొన్ని
దినములు
పక్షిణికొండమల యెక్కి పాడావులు
మేశ
యేనుగ కురువయెక్కి యెద్దులుమేశ

దొనబండ కురువ యెక్కి దోరావులు
మేశ
అనువైన మందలు ఆ తావు తర్లి
కనిమొన చేసుక కవులావులు మేశ
మన్నిని యెద్దులు మలలెక్కి మేశ
ఎరుకుమలయెక్కి యెద్దులు మేశ
చుక్కల పరవతము చొక్కముగ
యెక్కి
గ్రక్కున పాతాళగంగ నదికి వచ్చి
సంగతితో యాదవులు స్నానంబు
చేసిరి
శృంగారముగ కళలతో సిరిగలిగి
యుండె
చెరుకూరి పగ మరచి శివుని
పూజింపుచు
సరసుండు పన్నెండు సంవత్స
రములు
పన్నెండు పర్వతాలు పశుపతిరాజు
నిండిన వైపుల నిదానముగ మేపె.

## యాదవుల ఆయుష్షను గూర్చి శివుడు బ్రహ్మను ప్రశ్నించుట

అంతట వకనాడు హరుడు తలపోసి
సంతతముగ బ్రంహ్మను చారంగ
బిలిచి

చింతకాయక యితడు చేరి పర్వతాలు
సంతోషమున పగ సాధించబోక
పగమరచి యిటువోలె పశువుల మేపుచు
భోగములుమించి పోడుయెక్కడను

యాదవులకు ఆవిస్సు యెన్నాళ్ళు యిచ్చానో
వెదకి కవిలెలు చూచి యెరిగింపు మనిన-
బ్రంహ్మ కవిలెలు చూచి పరమేశు కనియె

## చిత్రభాను సంవత్సరములో యాదవులు చెల్లనున్నారని బ్రహ్మ శివునితో చెప్పుట

"పరమేశ్వర ! యాదవులకు పనిలేదు యిఖను
యేటిమీద ఆరునెలలకు యెద్దులు ఆవులు
చిత్రభాను సంవత్సరాన చెల్లనున్నారు
అరవైయేండ్ల సంవత్సరము అంత్యము తిరిగి

చేరువకు వచ్చె" నని చెప్పెను బ్రంహ్మ
బ్రంహ్మచెప్పిన వినెను పరమేశ్వరుండు
గ్రహములన్నిటి వక్రగతులు గమ్మనెను
అరసి యామందలకు అపజయ మాయె.

## కాటమరాజుమందలో శివుడు క్షామమును సృష్టించుట

కార్తెలన్నియు వరిశ* కవులావులు చిక్కె
పశువులు నీరుపూరికి ప్రళాపించసాగె
దేవతామలమీద ధేన్వులుండగను

దేవతామల్లలకు క్షామడాంబ్రము బుట్టె
శంభుని మందకు చేటు గల్పించె
అంభోయని అరిచె ఆవులు యెద్దులు

*. 'వఱపు' కలిగెను

మలల శ్యామడాంబ్రము మందమీదికి
వచ్చి
యరగోలుచిచ్చుపడి యెదురుమల[3]గాలె
పెట్లు చిచ్చులుబడి పెద్దమల గాలె
మాను మాను వొరిశ మంటలు మండె
తనకు తానే తగులుకొని తర్లువులుగాలె
యేపెమ్రాకులయట్ట[4] యెద్దులకు వచ్చె
ఆరెమ్రాకులయట్ట ఆవులకువచ్చె
జమ్మిపండ్లు తిని దేనువులు దగ్గుతికలు
పెట్టెను
తునికిపండ్లు తిని ధేనువులు దూపలు
గొనెను
తోకచుక్కయట్ట ఆవుల దొడ్డిమీదికి
వచ్చె
నూతిలో నల్లనీరు జుంటితేనియ లాయ[5]
భూమిలో కసువు పచ్చ కర్పూర
మాయ
నిండిన చెరువులు నిర్భమై తోచ[6]
దొరువులు భావులు యెండి దొడ్డ
యట్ట తోచ
మేనులు వరిశ మేత కరువాయ
కాలము కురుదలించె కవులావులు
చిక్కె

ధేన్వులు వుసూరుమని దెసపడసాగె
కురులేగటావులకు గుండెలు పగిలె
నర్రావులు యెత్తుబడి నడువ లేవాయ
యడ వయపులకు యెద్దుల యెన్నులు
యెండె
మిన్ను వురమదాయ మేఘాలు లేవాయ
మేఘాలు పడవాయ మెరుపు పుట్టదాయ
వాన కురవదాయ వలగాల మాయ
దేశముల కరువాయ ధేన్వులు చిక్కె
ఆరుద్ర వరిశ ఆరుకార్తెల వరుపాయ
పునర్వసు పుష్యమి వరిశ భూమి
కరువాయ
మఖపుబ్బ వరిసి మండు వేసంగులాయ
వుత్తర హస్తమి వారిశ వుడిగె వాన
కాలము
చిత్త స్వాతి వారిశ సీమ కరువాయ
విశాఖ వారిశ ఆవులకు విషమైతోచె
అనూరాధ వారిశ ఆవులు నొచ్చె
జ్యేష్ఠ మూలలు వారిశ ధేన్వులు చిక్కె
లేగలు చిక్కెను లెస్సయట్ట కాలమాయ
శ్రీరామ కవులావులు చికుక్కపడె నన్ని
పంచవన్నె కవులావులకు ప్రాణ
అవస్థలాయ[7].

3. వెదురుమల 4. వెట్ట—వేడి 5. తేనియలాయె(—వానకురువదయ్యెను)
6. తోచెను 7. ప్రాణావస్థలాయె

## మేపులు లేక ఆవులు కృశించుచున్నవని కాటమరాజు పద్మనాయునితో చెప్పికొని వ్యథనొందుట

ఆవుల బడలికె ఆవులన్న జూచి
నలనన్న యా పద్మనాయుని బిలిచి
"నమ్మిన సంగడమా! నా చిన్ని
మరిది!
రేచర్ల గోత్రుడా! రేమంతుడ వినుమ!
రణ రంగ పార్థుడ! రాఘవ చంద్ర!
వేళ్ళ వుంగరాల వేలాపతి యలమ![8]
మంతనాల చిలుక! మరిది పద్మరాఘవ
యెల్లవారు బట్టింది యలమ! పాలకూటి
సంగడము!
నీవు నేను బట్టింది నెత్తురుకూటి
సంగడము
నెత్తురుకూటికి నెనరైన మరది!
వేలాపతి యలమ! వేలు మన్నిద!
యేగినాడు యలనాడు[9] వక యేడు
దున్ని
యెలిగినాడు యలనాడు చక్క
సమయమందు
వెదబెట్టించిన వెలమనాయుని కుమార!
నగిరె కంటికి నాయుడ! నాదెండ్ల
కల్లుడ!

బలువైన గూడూరు బంది ఆత్మకూరు
యేలూరు చెందలూరు ఏలిన యలమ!
కటార్ల బొల్లవరము కాణయాచి
యలమ!
మేడితోక బట్టని మేదినీశ్వరుడ!
నల్లబాలు త్రొక్కని నాయుని కుమార!
వింటికి అర్జునుడ! విప్పర్ల సింహము!
గాజు యింటికి కర్త! ఘన రాజు
లకు మరది!
నాయుడ! నీతోటి సంగడము పట్టిన
నాటి నుంచియూను
ఆవులకు యిటువంటి అవిధి నే యెరుగ
దండి కాకెలు వరిశ నాయుడ ధరి
యింప రాదు
పన్నెండు కాకెలు వరిశ నాయుడ
బలువు యట్ట దోచె
మహా ప్రళయమైన క్షామ డాంబము
మంద మీదికి వచ్చె
కొమ్ముగల నడ్రావులను కొండలపాలు
చేస్తిని

8. ఇలాపతి వెలను! 9. వేగినాడు, వెలనాడు

మంచి మంచి కవులావుల మహనంది
మఅ పాలుజేస్తి
కోలు పెట్టితినోయి కొదువలేని ధేన్వల
అమ్మనాటి ధేన్వల అఖట్లమల పాలుచేస్తి
పెద్దల్లనాటి ధేన్వల పెద్దఘ్మల పాలుచేస్తి
పారుట్లమలకు గోవుల ప్రాణాలు
ధారపోస్తి
యేలాగు ధరియింతు యేమి సేయుదు
నాయుడ ?
గట్లకు దారపోస్తి గంగి మైలావుల
చట్లకు దారపోస్తి ఐడదార యెద్దుల
యేలాగు ధరియింతు లింగముద్ర
యెద్దులు చెల్లె
రాళ్ళకు కోలుపెట్టితి రాచకన్నెలను
భద్రేభములవంటి బసవముద్ర యెద్దులు
నిద్రబోయిన రీతి నిలమీద చెల్లె
నద్రావు లన్నియు నాకు సైదోడు
విడనాడి ధేన్వలు విడిచి పోగాను
పగవారమై చూడ భావ్యంబు గాదు
యెద్దుల శల్యాలు యేరులై నిండె
పండుటావుల శల్యాలు పడుగు
పేకలాయె
పోవులు వైచినట్లు భూమిమీద టాను
బోయల జాగిలాలు బొజ్జలు పెంచె
మాలవాండ్ల బిడ్డలకు మాశ్చర్యము
పెరిగె

మరియు పంతపోత మారికే వై వె
అడవిలో మృగములు అవి తెల్లబారె
పల్లికొండ మన మంద పరిణామము
వింటె ,
మనమున దూరుచు మరియు నేమనునో?
శివ గురువు భత్తినన్న[10] చింతించు
నేమొ ?
అలుగునేమొ మనమీద అమ్మ యే
మనునా ?
అమ్మ దూరిన అయితన్న యేమనునో?
కొమరక్క మనమీద కోపగింఛునేమొ?
పుత్తమరాజు మనమీద పోనాడునేమొ
వల్లవులు తిరమందులు వగిసేరు[11]
నాయుడ !
నాయుని సంగడము బట్టి యెర్రి
అయ్యననియేరు
పద్మనాయుని సంగడము బట్టి గోవుల
పరామర్శింపక
రాఘవుని సంగడము బట్టి రాజు
ఆవుల మరిచె ననియేరు
ఆవులమీది ప్రేమ అది మరిచెనని
యేరు
మలల ధేన్వల దించక మంచి పని కాదు
పర్వతాలు దించక పశువులు బ్రతుకవు
యేరువ భూమికి యేగవలె'' ననుచు
శిముని దగ్గరకు శీఘ్రమ వచ్చి

10. భక్తిరన్న 11. వగచెదరు

పాలు నేతులు అమృత పళ్ళెమున
నుంచి
పర్వతాల మల్లయ్యను ప్రార్థన జేసె ;
"కరుణించు వో స్వామి ! కైలాస
నిలయ !
నీలకంఠ స్వామి ! నీకు మ్రొక్కెదను
పశువులకు కరువాయ పట్టంగ రాదు
యిక్కడ వుండుట మాకు వుచితంబు
గాదు
పోయి వచ్చెద" నని పురహరుని తోను
చెప్పి తా కదిలెను సర్వ శానలును

## కాటమరాజు ఆలమందలను కొండలు దింపుట

బంధువర్గము బిలిచి పయనము
గమ్మటంచు
"మాపటి వేళను మందలు దాటించి
పరామరిక లేకుంటె పాపము తగిలీని[12]
ఆదరణ లేకుంటె ఆత్య[13] తగిలీని
మలల ధేనువు లుంచ మంచిది గాదు
పర్వతాలు దించకుంటె పశువులు
బ్రతుకవు
తర్లించు గోకులము తముకు సేయించి
జయవారము చాటించు" మని చెప్పె
నపుడు
యర్రయ్య పద్మనాయుడు యాదవ
వీరులు
తర్లుమని డాంకలు తముకు సేయించె
వుర్లబడి మందలు వుండక కదిలె
బల్లాలు వంకిళ్ళు బాకునై జాలు
వల్లవులు యాదవులు సాహసోత్తములు
మొల్లమిగల గొల్లలు మూకలు కదిలె
గొల్లైన యెద్దులు కోరకావళ్ళు
చల్లవారి మందలు సయ్యాన కదలె.
యర్రపట్టు గుడార్లు వింజామరములు
మర్లవారి మందలు మరి వేగ కదిలె
హనుమంతు పడిగెలు ఆలవట్టములు
ఘనమైన యాదవులు కదిలిరి కొంత
మొఖమన్నె గుడార్లు మోనుచెక్కేలు[14]
రాఘవుని మందలు రయమొప్పకదిలె.
వెనకముందుగాను యెద్దులు కదిలె.
కోట గోపాలకులు గొబ్బున కదలె

---

12. తగులును సుమా ! 13. హత్య 14. మీనచెక్కెములు (?)

గోపాలకులంత సెలగోలల బట్టి
పూపెట్టి ధేన్వల పూర్ల బిలుచుచును
యేపెల కురువను యెద్దులు దిగెను.
దాపుదాపున కదిలె దండైన కోడెలు
హనుమంతు మోద బెడ్లు ఆవులు లేగలు
ఘనమైన ధేన్వలు కానలుబట్టె
చెలరేగి ధిగివచ్చె శిఖిరేశ్వరముకు[15]
అనువైన మందలు ఆ ఠావు తర్లె
పులిచెరువు మడ్రతోవ భోరున కదిలె
ఆమనిగా మరియు ఆవులెల్లాను
పాముదొన కురువన బాగొప్పదిగెను
దూడల తల్లులు తుమ్మలబయలు
దాడివెళ్ళినరీతి తర్లెనావేళ
పెద్దబామకురువన యెద్దులు దిగెను
మద్దులనీడన మర్రిత్రాగె నీళ్ళు
అద్దుగా యెగదల ఆవులెల్లాను
పెద్దచెరువున నీళ్లు పేర్మితో త్రాగె
ముందరి మందకు మురికాయె నీళ్ళు
యెనికి గోకుళముకు యినికెను బురద
ఆకొని ధేన్వలు అరవంగ సాగె
కావిరాళ్ళకురువ గ్రక్కున దిగెను
యెంకటేశుని కురువన యెద్దులు నడిచె
పంగిటిపాయన పాడావులు నడిచె
సంగడావులు కుదుప చాలున నడిచె
సర్లకొండన నడిచె సలుగుబెడ్లన్ని
మర్లవారి ధేన్వలు పులలన్ని నడిచె.

సంగడిపాయన సలుగుబెద్దులు దిగెను
నడిగడ్డ ప్రాంతాన నడిచె గోకులము
యెన్నుకుంట సవ్వలకు యెద్దులు మేసె
యెగువమల గోకులము దిగువమల నిల్చె
దిగువమల గోకులము దీమషమ్ము చెదక
పాడావుల కురువన వారి భోగపతులు
దిగెను
యెత్తుటావుల కురువన యల్లావులు
దిగెను
మత్తేభములవంటి మన్నెసలుకుబెడ్లు
యెత్తుబడి ధేన్వలు యేపెలకు వరిగె
పర్వతాననుండి బాటలవెంట
ద్వారావతిరాజుమంద తర్లక నిలచె
నిలచెను మందనావులు
నిట్టుపాసములను
తెరువులు తొలిగి ఆవులు తేకు[17]లకు
వరిగె
మానావతి కవులావులు మద్దులకువరిగె
కాట్రేని కవులావులు కానుగులకు వరిగె
వేపల నీడను రాజు వెల్లావుల నిలిపె
తుమికి మానుల నీడన తూలెడి ధేన్వలు
వల్లవుల గోవులు వనము నీడన నిలచె
ఆరుట్ల నీడన రాజు ఆవులు నిలచె
చెట్లనీడన రాజు చెలపెయ్యలు నిలచె
పెదవిళ్ళ కవులావులు పేర్మితో నిలచె
ముష్టి కవులావులు ముమ్మరమాయె

15. శిఖరేశ్వరము 17. తేకు

మంతనాల ప్రాంతాన మళ్ళి మెయ్య (సాగె)
(కొండల) ప్రాంతాన కోడెలు మేసె
నడిగడ్డ ప్రాంతాన నడిచె గోకుళము
పడుమటి ధేన్వలు ప్రాంత్యానరాగ
నరసింహాల కొండన న్రావులు (మేసె)
(బో) దవాడ రేవున బోరున వచ్చి
మోదమున ధేన్వలు ముందుగా వచ్చి

ముసిలి గయ చాల్వున ముంచిమేయ సాగె
రచ్చయేముల [18] కాడ (రాజుధేన్వలు మేసె)
కోడి కురువన గుడార్లు దిగెను
అరవై స్తంభాల అమృతపు బావి
గుడారు యెత్తించె గొబ్బున రాజు
గుడారులో............
రాజు రాఘవుండు రయమొప్పనుండిరి.

## ఆవుల అవస్థలను జూచి త్రిమూర్తులు తమలో తాము ఆలోచించుట

ఆరీతి వున్నంగ[19] అపుడు న్రావులు
యేబైకు వొరుగుచుయెడ లేక మేళ[20]
......లోని ధేన్వలు తల్లడిల్లసాగె
పశుపతిరాజు మంద పట్టజాలక వుండె
యాదవరాజు మంద యాక [21] శోక మాయ
ఆవుల ఘోరము ఆకాశ మంటె
కవులావుల ఆపద కైలాసమంటె
సురభుల బడిలికె సురలెల్ల వినిరి

మందలావుల ఆపద మరియు దేవతలు వినిరి
బ్రంహ్మా విష్ణు మొదలైవ పరమేశ్వరుండు
మూడుకోట్ల మునులు ముదము తోడు తను
ఆరుకోట్ల రుషులు అష్టదిక్పాలకులు వినిరి
ఆవులు ఆకటికి అఘోరింపగాను

---

18. వేముల 19. ఉండగా 20. మేసెన్లు. 21. ఏక

త్రయమూర్తులు ముగ్గురు తలపోత చేసిరి:
"అవిస్సు[22] ప్రమాణం యాదవులకు యికను
చిత్రభాను సంవత్సరాన చెల్లనున్నారు
యాదవులకు అవిస్సు యాణ్ణర్థముంది
తొల్లిపగ యాదవులకు తొలగి పోరాదు
ముత్తువతాత పగలు ముందరున్నావి
దక్షిణాదిన యాదవులకు సమయ కారణము
వర్షవలె మేఘాలు వారి భూములను
కురువవలె వరుషాలు కుంభద్రోణముగ
పట్టవలె మేలుపులు పరిపూర్తిగాను
పల్లవాది రాజు మనస్సు భ్రమియించ వలెను
నీరున పుట్టిన పూరి నీకిస్తి మనుచు
మాయచేసి వీరిని వారిని మడియించ వలెను
కనక రథాలెక్కి కవులావుల చూచి
పుష్ప రథాలెక్కి పుణ్యానావులచూచి
చెరిచేవారము మనమె మేపులు చెప్పే వారము మనమె
పశువుల బ్రతికించ మనమె పగదీర్చ మనమె
ముగురు త్రయమూర్తులు మూడురూప ముల
బలిజల రూపమున బడుగుల రాజుకు
మేపులు చెప్పవలె మేపించవలెను."

## త్రిమూర్తులు బలిజల వేషములతో కాటమరాజు ఆలమందను పరిశీలించుట

అసిమి సంచులు తమ అంకెమున జేర్చుక
విశ్వేసు డప్పుడు వీరిశెట్టి ఆయ
చెలువందగ విష్ణు చెన్నమశెట్టి ఆయ
బ్రంహ్మదేవుడపుడు బ్రంహ్మశెట్టి ఆయ
కడమ దేవతులంత గౌరీలు అయిరి
పయినగాండ్లవలె వచ్చి పశువులజూచి
మళ్ళి మళ్ళిచూచి వారిమందలావులను
దేవతులౌట యెర్గిగి దేవతాసురభులు
పొర్లి బెదరినయట్టి పొదగని నిలిచ

22. ఆయుష్షు.

గంగమైలావులు లింగముద్ర యెద్దు
బసువన్న మొదులైన బసువముద్ర
యెద్దు
శివునికి యెదురుగా నిలిచి చింతింప
సాగె
చల్లవారి పుల్లయెద్దు సలుకుటెద్దులును
బ్రంహ్మదేవునిచూచి బాలుబాలున
అరిచె
బొల్లావు శంఖుచక్రాల పోతుకోడెలును
ఆదివిష్ణును జూచి అంభోయని అరిచె
యాజ్ఞార్థమని ధేన్వలు హేష్యంబు ఎరిగి
ముక్తి గలిగెననుచు ముగురుమూర్తుల
జూచి

కరువుదీరె మనకు కలిగె మోక్షంబు
ధేన్వల సంతోషము దేవతులు వినిరి
సురభుల బడిలికె సురులెల్లజూచి
కదలేని భక్తితో కవులావులజూచి
'పాలసముద్రము వుబ్బి పారినయట్లు
చాలినన్ని ధేన్వల సంతరించినాడు
యెంత ఘనుడో యితడు యెవ్వడో'
యనుచు
'కాపువారివి ధేన్వలు' అనిరి గౌరీలు
అంత
'కాపువారివికావు బలిజల కవులావు'
లనిరి
అవియన్ని పెద్దవిళ్ళ[23]ఆవులు అనిరి
యవరివిగావు యివి యాదవుల వనిరి

## బలిజలు ఆలమందల అధిపతిని ఆక్షేపించుట

కొందరు బలిజలు కోపంబుతోను
"కండితముగ యాదవులవికావు
యివి యవరివో
యాదవులయితే వారు యరగకున్నార ?
వానకురిసిన తావున వారు మేపుదురు
పురిగలతావున పుల్లరిబెట్టి
సీరుగల తావున నిలిచి మేపుదురు

మూసిచెప్పను యింత మూర్ఖులా వారు
ాటువంటి సురభుల యేలిన ఘనుడు
కటకటా మరిచెనో కడు పాపమనక
'వుంద్రపువ్వనరావులు వుదతసార
యెద్దు
బొద్దుమచ్చసక్కని బోగపతులాను
లెక్కపెట్టగరాని లక్కపెయ్యావులు

23. పెద యిండ్ల.

పొడవన్నె జాలలు బూదముట్టెలును
పొగరవయసు కోడెలు పోతుపెద్దులును
సముద్రము యెళ్ళియురసిన యట్లు[24]
సంగడావులును
కడుమంచి ధేన్వాలు గాలిధూళికిని
మేపులులేక కన్నికెలు రూపులుచెడెను
కొమ్ము సన్నముగల కోరక్రేవులు[25]
అడుగులు సన్నాలు అచ్చుక్రేవులు
బోడెంత చక్కన బోగపతులూను
వేలాపతి ధేన్వాలకు వెన్నులు యెండినవి
మానావతి దేన్వాలకు మలుగులు
యెండినవి
మోహావ్వతి ధేన్వాలకు మనసులునొచ్చె
సిరిగల ధేన్వాలు చిన్నబోయినవి
ఆవుల యేలిన ధాత అవనిలో లేడు
కాబోలు
దిక్కుగలిగి వుంటె భూమిఃతిరిగి
మేపుదురు
దిక్కులేని ధేన్వాలుగాగ డెసపడు
చున్నవి
పశువులయేలిన్నదాత ఫరిణాన వుంటె
పశువుల మేపక ఆతని ప్రాణ
మెట్లుండు ?
యిన్ని ధేన్వాలను యేలినరాజు
వున్నాడొ లేడొ యీ వుసురు తమకేల
అన్నదమ్ములు లేరొ? అతిపతి[26]లేడొ
ప్రధాని లేడొ? యిందుకు పాలనలేదొ?
యెడపక నూరావును యేలిన వానిల్లు
అంపకోలంత పొగ అనరంగ వినర?
తమవంటి ఆకలి తమవంటే దప్పికి
తమవలె చూడక ధర్మంబు దప్పె
పశువుల యేలనేల? యింత పాపంబు
యేల?
గోవుల యేలనేల? యీ ఘోషతమకేల?
వణ్ణంబు గుడిచిన వంటిన బట్టున?
పరిమళ ద్రవ్యంబు మైనిండ నలది
పరుపుమీద తాను పవళించ చెల్లున?
నిద్రయెట్లు బట్టు నిర్భాణుడగుచు?
అధికమగు పాపంబు అంటక పోదు
మేపేమన్న వారికి మేపులు లేవ?
యిచ్చగా మేపులు యెచ్చోట గలవు.''
తలావొక మాటాడి తమకేల యనుచు
అని అయ్యగాండ్లు ఆ తెరువులు బట్టిరి
గోవుల గాచేటి గోపాల వారులు
గొరికలు, అన్నమాట గ్రక్కున వినిరి
అయ్యలు అన్నమాటలు అందరు వినిరి
యాదవ వీర వరులు యేమని పలికిరి?

24. వెళ్లి విరిసినయట్లు 25. కటియావులు. 26. అధిపతి.

‘ఆవులన్నకు తమ్ముడు ఆవులమందకు దళవాయు
యర్రయ్యకు యీ వార్త యెరిగింపవలెను’
గోపాలకులు యర్రయ్య కొలువులో నిలిచి:
“బెజవాడ బెబ్బులి! పెయ్యలెర్రయ్య!
నతసూర రాజుకు నందనుడ వనగ
గోవుభాష క్షత్రీడ! కొదమ సింహంబ!
యెద్దుల జ్ఞానంబు యెర్రయ్యకు తెలును
తెలిసి తెలియగలేక ధేన్వాలు చిక్కె
పయనాలు నడిచేటి బలిజీలు వారు
మనమంద నావులజూచి మరి చెప్పినారు
కడలేని మేపులు కలిగివున్నంగ
యాల మేపరు ధేన్వాల! యాల పాపంబు?
కదిలిపోయిరి చెప్పిక్రమమెల్ల మనకు
విన్నవించితిమి మీకు వివరమంతయును”
అనిన దిగ్గునలేచి అతి వేడ్కతోను
అన్న కొలువుకు వచ్చె యాదవులు తాను
కాటరాజు కొలువు యేక్రవ్యమున నున్నది!
యెండకు యెత్తించె రాజు యెండి పట్టుగుడార్లు
నీడలకు యెత్తించె రాజు నీలి పట్టుగుడార్లు
మంచుకు యెత్తించె రాజు మైనపు జిడ్డిగుడార్లు
పన్నెండు స్తంభాల గుడార్లు బాగుగా యెత్తించె
మూడుగుడార్లనడుమ ముత్యాలపందిరి
ముత్యాల పందిరిక్రింద దేవేంద్ర తమకము
దేవేంద్ర తమకముమీద కాటమరాజు
పద్మనాయుడు తాను పరగ కూర్చుండి
చదరంగమాడుచు చెల్లింపుకొనుచు
మెండైన బలములు మెరసి కొలువంగ
సంతోషమునవున్న సమయంబునందు
అన్నకు మ్రొక్కుచు అటు చిన్నబోయి
వలనొప్ప తముకాన వరిగె యర్రయ్య
వరుగుట తాజూచి వల్లవులరాజు :
“నా తమ్మునివంక పద్మనాయుడా చూడు
సిరిరప్పి యర్రయ్య చిన్నబోయినాడు
కోలకేటి గోపాలకులు కొంగుబట్టువారు
చీనివారు గోపాలకులు చేబట్టినారు
పగడసాల పందెము పట్టె ఆడితివె?
పందెమాడి వోడితివా పట్న పావులను?

సలుగు ఎద్దుల పందెము చయ్యనవాడి వోడివాస్తి వేమి వొలురాజు
మనమడ!''

## బలిజల ఆక్షేపణను ఎఱ్ఱయ్య కాటమరాజుతో చెప్పుట

"అన్నరో వోయన్న! ఆవులన్న
వినవె!
వోడిసీ కొలువుకు వొకనాడు రాను
వొలురాజు మనమడ! వల్లవులరాజ!
కల్యాణపు సోముని కాంత పెద్దమ్మ
యేడి వరమడిగి యాలమంచి పెద్దమ్మ
కులపగలు దీర్చ నిను కొడుకును
గన్నది
ఆవుల మీద ప్రేమ అన్న! లేదాయ
కాట కోటేశ్వర! కాటమరాజ!
కటకట గొరీలు కవులావుల జూచి
తెలిపిన మాటలు తెలియ జెప్పెను
'ఆవులే తల్లులు ఆంబోతులే తండ్రులు
తొలుచూరు పడ్డలు తోడబుట్టువులు
మలుచూరు పడ్డలు అక్కచెల్లెళ్ళు
అక్కచెల్లెళ్ళ ఆకలి యరగనిది
ఆకలి యారగనిది అది ఎంత బ్రతుకు?
మనుష్యుల వలె మన మంద నావుల
జూచి
'పరోపకారులు నోరు యెరుగని
సురభులు
మేపక చంపేది మేలటే తమకు?'
ఆవుల పొగిడిరి అన్న నిన్ను దిగనాడిరి
యెద్దుల జూచి మన యాదవుల తిట్టిరి
పశువుల జూచి మన పద్మనాయుని
దూరిరి
'మందకు దళవాయి లేడ?' అనిరి
మరియు పోనాడిరి
'హీనత్వమున ధేన్వులు వూరికే వుండ
పన్ని పూరి కసువు పరిపూర్తిగాను
కిద్దని' అని చాల కడుదూరి పోయిరి."

## బలిజలను తోడితెమ్మని కాటమరాజు ఎఱ్ఱయ్యను ఆజ్ఞాపించుట

యెఱ్ఱయ్య మాటలు యదపు లోపలను
సురియలు గాడినరీతి సురుక్కుమనెను:
"యెందరు గొరీలు? యెఱ్ఱయ్య!
యెంత లెక్క పోదురు?

వారిని తోడి తేవలెను వాలాయముగను
భూములు చరించేటి పుణ్యాలు వారు
కామదేనువులకు మేతలు కలవని తాము
యెరుగకుంటే వారు యెట్లు ఆడేరు ?
వారిని తోడి తేవలెను వాలాయముగను
దండిగా పోషించి తోడితే'' మ్మనిన
అని చెప్పి యఱ్ఱయ్య కతి వేగమునను
గంధ విడియం బిచ్చి కమిగిట జేర్చి
అంపిన యఱ్ఱయ్య ఆయత్తపడెను
పైనమై సెలగోల పట్టించుకోని
లేగదూడ లఘువున లేడి లాగునను
పొదలకు వడిగను పోయి వురుకుచును
వాగులు కుప్పించి వడి వెగయుచూను
తన పొడుగు చెట్లను వెగర దాటుచును
కనుచూపు మేరను కనెను గౌరీల
పొడిమి అటు జూచి పోయేటి వారిని
కూడ బోయి గౌరీల కూతవేసి నిలిపె
చై చాచి కేకలు చయ్యన వేసి
నిలువుమని యఱ్ఱయ్య నిముష
మాత్రమున
బాట కడ్డము వచ్చి పరగ నిట్లనియె:
"పోకుడు గౌరీలు యాల పోవు
చున్నారు ?
వినరయ్య చెప్పేను విశదంబుగాను
ఘనుడైన మా యన్న కాటమరాజు
మా యన్న మీతోను మాట్లాడ వలసి
మనవి చెప్పి మిమ్మున మళ్ళి
రమ్మనెను"
పోయేటి గౌరీలు పోక అటు నిలచి
"అన్న యవ్వరో మీరు అడవిలో
మమ్ము
రమ్మని పిలిచేరు రాము పో"మ్మనిరి

## ఎఱ్ఱయ్య బలిజలను బ్రతిమాలి తీసికొని వచ్చుట

ఆ మాట యెఱ్ఱయ్య అడ్డంబు వచ్చి
శరణార్థి నేనని చెయ్యెత్తి మ్రొక్కి
శ్రీ మహావిష్ణువుకు సరివచ్చునట్టి
బలిజలతో జూచి పరగ నిట్లనియె:
"బసువన్న పాదమాన ! బత్తుని యాన !
పర్వతాల మల్లప్ప పాదాల సాక్షి !
బొల్లేవు[27] పాదమాన ! పల్లికొండసాక్షి !
అందరి యాన దాటి అరిగితిరైన

27. బొల్లియావు

తన శిరసు ఖండించి తప్పక యిపుడు
చరణముల సన్నిధి, జేరుతు''ననిన
నిలిచిరి బలిజీలు నీవెవ్వరనిరి
అడిగిన యర్రయ్య హరుషంబుతోను
తన సవిస్తానంబు తగ చెప్పదొణిగె [28]
"యెల్ల సంపన్నుడ, యేకాంతరాయుడ
పద్దల సంపన్నుడ, భరతుడయర్రయ్య,
రాచమందకు దళవాయి, రాజుకు
తమ్ముడ,
శూరత్వ రణరంగ శూరుడనేను
మరి కటరౌతు వాలు మన్నీల బంటను
సుఖవాణి బంటను శూరుడ నేను
మంద నావుల కెల్ల మన్నీడనేను
గపిసెన పిల్లంగ్రోవి గంద్ర గొడ్డలియు
అల్లికె వుశిళాల[29] అడ్డ విభూది
జంపోత పైడంత్ర జంధ్యము గలుగు
నంమని వంశము నలనూట రాజు
పుత్రుడ నేను మరి పృథి వెల్లయెరుగ
బెజవాడ బెబ్బులి పెట్టని కోట
సపకోటి ధేన్వల నయమెప్ప గలిగిన
యేరువ రాజుకు తమ్ముడ యర్రయ్య
తన పేరు"
వారు యేమి యెరుగని వారుల వలెను
"యెందుకు బిలిచెను యాదవ రాజు ?"
ఆ తావుతర్లి మంద కరిగి రావేళ
కాటమరాజుని కన్నుల జూచి
వొప్పగ రాజును వొర్ణించి రిట్లు
"నిండు చంద్రుని బోలు నీమోము తీరు
చెక్కుటద్దము బోలు చెక్కిళ్ళ తీరు
వజ్రముల కిరీటము వాలు గన్నులును
కృష్ణవంశము రాజును కృష్ణు డన
వచ్చును.''
ఆ రాజు మోముకాంతి అప్పుడు
చూడగను
విభూది గుడార్ల కిందను విడిమట్లు చేసి
అవుల లేగల అటు పాయ దోలి
గోపాలకులు నిద్రించిరి గుడార్లలోన

## గోపాలకులు ఆవులను పేరుపేరున పిలుచుట

అంతట చుక్క పొడిచె అటు తెల్లవారె
కోటి గోపాలకులు గొబ్బున లేచి
పక్టరి వుసుదాళ్ళ పాల కడవలును
కోటి గోపాలకులు తలకోల లందిరి
మరుగుచు హే యని మందలావులను
పేరెన్ని కవులావుల పేరుపేర పిలిచిరి
"సురభి ధేనువ రావె! సుందరి రావె!
గరుటుని తల్లి రావె! కావేరి రావె!
పాలవెల్లి రావె! పాంచాలి రావె!
చాల కొడుకుల తల్లి ధర్మసాదమ్మ!

---

28. సవిస్తరము 29. అల్లిక వడిసెల

శ్రీ లక్ష్మమ్మ! సిరి ముద్దుబొమ్మ!
బాల బ్రహ్మచారి! పాండవుల గొంతి!
శృంగారు కన్య రావె! చిత్తారు ప్రతిమె!
గంగా భవాని రావె! కామాక్షి రావె!
పార్వతీ దేవమ్మ! భాగిర్తి[30] రావె!
కొదుమ సింహమ రావె: గోపిదేవమ్మ!
కలికి చిలుకల కొలికి! కాముని తల్లి!
తొలకరి మెరుపు రావె! దొరసాని రావె!
మూల ధనమ రావె! మురిపెమ రావె!
పెయ్యల తల్లి రావె! పెరుమాళ్ళు రావె!
రాముదేవి రావె! రాజ హంసము రావె!
పాల బిందె! పచ్చిపగడమ రమ్మ!
వింజామరమ రావె! విరజాజి పంక్తి!
గజేంద్రుని తల్లి రావె! కంసల్య[31] రావె!
నిత్యమల్లి రావె! నిధ్యామ రావె!
పైడి కొండ రావె! పరమ వుపకారి!
అమ్మ నీవు రావె! అంజని రావె!
కల్పతరువు రావె! కరువలి రావె!
సొర్ణ టంకమ రావె! శుభముని రావె!
భోగావతీ రావె! బొండు మల్లె రావె!
మానవతి రావమ్మ! మదరాక్షి రావె!
త్రిపుర సుందరి రావె! తియ్యమామిడి! రావె!
శ్రీగంధమా రావె! చిన్నారి రావె!
కంచి కామాక్షమ్మ! గవిరిదేవమ్మ!
యక్రమల్లి రావె! యశోద రావె!
గుమ్మపండు రావె! గురివింద రావె!
ప్రాణప్రదమ రావె! భాగీరథి రావె!
కలుపస్తరువ[32]! శ్రీగంధపు మాన!
చిప్ప ముత్యమ రావె! చిలుకలకొలికి!
ఆణి ముత్యము రావె అమరుల తల్లి!
పంచ రత్నమరావె బాంధవుల బాసి!"

## గోపాలకులు ఆవుల పాలు పితుకుట

హస్త మెత్తి మ్రొక్కి ఆవుల బిలచి
తొలు చుక్క పొడవంగ దోరావును బితికిరి
మలు చుక్క బొడువంగ మారావును బితికిరి
పెండి పోయిన ఆవుకు అలిమిరి బుట్టె
వొట్టి పోయిన ఆవుకు వొచ్చె ప్రాణాలు
త్రయమూర్తులు మంద జొచ్చిరి దగ దూప దీరె
దేవతలు మందలు జొచ్చిరి ధేన్వులు బ్రతికె
గౌరీలు మంద జొచ్చిరి కరువులు దీరె

30. భాగీరథి 31. కౌసల్య 32. కల్పతరువు

ఆవుఆవు వద్దను అమృతము పితికిరి
ఆవు ఆవు పితికిరి అరిచేతి గుంటెడు
ఆవుల పితికిన పాలు ఆరు కాగు లాయ
ఆరు కాగుల పాలు అతివేగమునను
మూడు కాగులుగ కాచి ముద మొప్పనంత
ముందుగా గౌరీలకు మీదు వక కాగు
తీసిరి కడగాను తీపరంబుగను
చల్లవారి పుల్లయెద్దుకు మర్లవారి మట్టె యెద్దుకు
యెద్దులకు కాగెడు పాలు యత్రయ్య పంపించ
గోలెములో పాలు త్రాగి గుడార్లో పవళించ.

# బీర్నని జాగిలముల పూర్వజన్మ వృత్తాంతము

గోవర్ధన గిరిని గొడుగుగా యెత్తిన
మాధవు గోపాలు మడుగున డాగి
బెడిదంపు రాళ్ళవాన దెబ్బలు తాకి
పడిపోవుచు కృష్ణుని పాదములకు వొరిగి
నిజరూపమైనట్టి నీలవర్ణునితో
మాధవ మీ వంశమువారి మందతో మేము
జాగిలాలమై పగ సాధింతు మయ్య
ఆహారమ మాకేమి ఆన తిమ్మనిన
అడిగిన శ్రీకృష్ణు ఆహారము చెప్పె
వాలాయముగ మా వంశమువారి మందలోన
పోతు జాగిలాలై పుట్టిన యపుడే
పాలు నేతులే గాని మాముసం భక్షింప రాదు
కడసారి రణమున కట్టడ మీకు
వైరుల మాములంబు వారి రక్తంబు
హరి నియమించిన ఆనతి చాత
మాట తప్పక కవులావుల మందలో బుట్టె
గుణవంతుడనే జాగిలము గొడుగుల నీడనువచ్చు
హనుమంతుడనే జాగిలము అందలములో వచ్చు
ప్రతాపుడనే జాగిలము పల్లకిలో వచ్చు
హరి యానతిచ్చిన అమృతమె గాని
మాంస్సం బక్షింపవు మన్నిని గండ్లు
కాగెడు పాలు బీర్నేని గండ్లకు బంపిరి.
బసువముద్ర గుడార్లలో బ్రాహ్మణుల చాత

## కాటమరాజు బలిజలకు విందు చేయించుట

గౌరీలకు యిందు[33] గావించి రవుడు
దోరావుల పాయసము దొప్పలతో నెయ్యి
తరిపియావుల పాయసం జున్నావుల
పెరుగు
మీగడతో పిండి వంటలు మినియపు
కూరలు
అల్లంపువూరగాయలు అనియేక రుచులు
బెల్లపు చారును పేరిన నెయ్యి
పక్వంగ వండిరి పాల కడియాలు
పంచ పదార్థములు పాకంబు చేసి
"రారయ్య గౌరీలార! రాజుల బిలచీని
మాతోను యిందులు మందలో
బక్షింతురు''
అనిన గౌరీలు తాము అప్పుడిట్లనిరి :
''మీ ఆవులు పేదలు మీరు పేదలును
మాకేమి యిందులు మీ మందలోను ?"
ఆమాటకు గోపాలకులు అప్పుడిట్లనిరి:
''మా యావులు పేదలైతే మేము
పేదలమ?
అష్ట అవిశ్వర్యములు[34] ఆవుల
మందలో గలవు
వచ్చేది మంచిది మీవారము మేము''
అని చెప్పి యాదవులు అతి వేగమునను
ప్రాజమ్మాకు విస్తళ్ళు పంచ పళ్ళాలు
గావించి
పన్నీట జలకమాడి బంతులు సాగించి,
నేరేడాకులు తెప్పించి నైతేలు గూర్చి

బంతులు సాగి కూర్చుండిరి వాగుగా
వారు
అయ్యగారి ముందర ఆనైతేలు వేసి
జలకము చిలకరించి జాగు శాయకను
పాయసము వడ్డించిరి బంతుల వెంట
సకల పదార్థములు సద్రుసు లెల్ల
గంగిమైలావుల కమ్మని నెయ్యి
వాసిగా శివపూజ వారంతచేసి
కందమూల ఫలాదులు కాయగూరలును
పచ్చళ్ళువూరగాయ పెరుగు తొరపండ్లు
ప్రసాదపడిరంత పరగ గౌరీలు
హేమ చెంబులతోను యేన్నీళ్ళు వార్చి
యెండి చెంబులనీరు యెంగిలి వార్చి
పట్టు జముకానము పరిపించి వేగ
కూర్చుండ నుంచిరి కూర్మితోడుతను
గౌరీలకు కుంకుమ గోవ జవ్వాజి
అగరు శ్రీగంధము అనుపంద గూర్చి
ఆవులన్న పద్మనాయుడు అతివేడ్క-
తోను
కల్యాన జేసిన శ్రీగంధమలది
గౌరీలకు చైముట్టి గంధంబు నలది
పచ్చని బాకాలు పండుటాకులును
గాలించిన సున్నము గంధ విడియములు
తాంబూలములు యిచ్చి పట్టు తశిరీబులు
గప్పిరి
మందవెల్లి పచ్చడాలు మరియు దుప్పట్లు
శ్రీరామ మాడలు శివకొల్లగాను

---

33. విందు 34. అష్టైశ్వరములు

మూడావుల గుడిచేటి ముచ్చుకరికోడెను
యిచ్చిరి గౌరీలకు యేకచిత్తమున
నాలుగావుల గుడిచేటి నల్ల జార్లకోడెను
చెట్లకు [35] కానుకలు యిచ్చిరివేగ
యేడావుల గుడిచేటి యెఱ్ఱమట్టికోడెను
యిచ్చిరి గౌరీలకు యేక చిత్తమున
కాటమరాజుతో గౌరీలు అనిరి:

## బలిజలు కాటమరాజు పూర్వవృత్తాంతము చెప్పుట

"వినవయ్య యాదవ విమల చారిత్ర:
మరియు మీ పురోత్ర మంతాయు[36]
వినుమ!
శంకరుడు కాముడు సరిపందెమాడి
కాముని వోడింప ఘనుడు శంకరుడు
అంభోజుబెళము[37]కు అటుచారవచ్చి
అంభోజుబెళమున అన్నమమృతాము[38]
అక్షయమైవుంటే అపవిర్ధి[39] గాను
కరువాయ భూమెల్ల కాముడు చిక్కె
సురులు మునులు రుషులు సుడిబడి
చిక్కె
సరగున దేవతలు శంకరుని వెతికిరి
సుడివడి దేవతలు సురలెల్ల గూడి
అలసి ఆకలిగొని అన్నిట వెరచి
అంభోజు బెళముకు అరుదెంచిరంత
ఆవులు గల రాజు ఆ బెళములోన
గోపాలు లంత వొక కుండకు పెరుగు
వోసుక అటు జుర్రి పొదిలోన కుండ
మాటి తామందకు మరలి యుండగను
కోటి దేవతులెల్ల గొబ్బున వచ్చి
చాటున వున్నట్టి చల్లబాన చూచి
చుట్టుచేరుక దధి జుర్రిరివారు
రెట్టన బోయడు లేచి వారిని జూచి
ఘట్టిగా చేదుడ్డు కట్టెతో బూని
కొట్ట బోవగ తాము గొబ్బున లేచి
తిట్టకురా మేము దేవతుల మనిరి
కొట్టబోయిన సెలగోల తావిడిచి
అయ్యయ్యో యీ యెంగిలమృతము
మీరు
నెయ్యము తోడుత నేల యంటితిరి ?
అనిన దేవతులు తా మప్పుడిట్లనిరి
'అమృత మెంగిలని అననేల మీరు ?
యెంగిలి అమృతానికి యెగ్గులేదనుచు'
అని దేవతలు సురలానంద మంది
బడుగులైన దేవతలు బడలిక దీరి
'బడుగుల రాజ'ని పలికిరి వారు
బడుగుల రాజనే పద్దు చెల్లినది
వారె మనమలు మీరు వారంతవారు

---

35. సెట్టులకు 36. పూర్వోత్తరమంతయు 37. బిలము
38. అన్నము, అమృతము 29. అభివృద్ధి.

బాటసారులు అనక బలిజలు అనక
ఆరగింపులు మాకు అటు లెస్సనాయ
ఆనందపిందులు అమరి తినుటాయ
యెందుకు బిలిస్తివి యాదవరాజ?
యిందులు పెట్టిన యివరంబు యేమి.'

గౌరీల మాటలకు కాటమరాజు
"భూములు చరించేటి పుణ్యాత్ములు
మీరు
కామధేన్వలకు మేత కద్దు యే తావున"

## దక్షిణాదిని నల్లసిద్ధి రాజ్యములో మేపులు విస్తారముగా కలవని బలిజలు చెప్పుట

ఆవులన్న మేపులు అడిగినయపుడె
చేకొని గౌరీలు చెప్పంగ సాగిరి :
"యిక్కడ నుండి పాకనాడు యిటు
తర్లవయ్య
నవనిధానము కద్దు నలసిద్ధి భూమిన
నెలకు మూడు వరుషాలు నెల్లూర గలవు
యీ దినము మొదలుకొని యిడువని
వానలు
పొర్లెను కాల్వలు పొలుప
వారుద లాయ[40].
మడుగులలో నీళ్ళు మరి పొలములో
మేపు
కుంటల వుడుకాలు[41] గురుతైన మేపులు

చెరువులలో నీళ్ళు క్షేమకాలము కద్దు
గుంటలలో నీళ్ళు గుళ్ళకమ్మకు సాటి
చవిటి మడుగులలో నీళ్ళు
సముద్రముకు సరివచ్చు
పాలేరు దాటినది మొదలు పారిమెయ్య
కద్దు
యేరుదాటితే కద్దు యెద్దులకు మేత
మొలకల చెరువు వెనుక ముంచి
మెయ్య కద్దు
తీగెల చెరువు వెనుక తిరిగి మెయ్యకద్దు
ఆ భూమిన మేపులు అధికముగ గలవు
దేశముల కేడువేలు కనిగిరి చెరువు
ఆ భూమిగాని మీ ఆవులకు చాలదు

## గడ్డిజాతులు

పెసరేమిడి గడ్డి పెద్దావుల పొడువు
గునుకు చెంగలగడ్డి కుర్రలేగల పొడువు

మలప వంకెన గడ్డి మనుముల పొడువు
చేసు బోదగడ్డి చెట్ల పొడువున కద్దు

40. వఅవలాయె 41. ఉదకములు

గోగుద నేద్రగడ్డి గొడ్డుటావుల పొదువు
కారె కామంచి కరియావుల పొదవు
దోమకాలిగడ్డి దోసిమేయ కద్దు
మడుగుల వెంట గరిక మసిలి మేయ కద్దు
ముల్లు గుచ్చి యింతరాని పిల్ల బిసర అలుము
బొంత చిప్పెర గడ్డి, పోక బొగడ పూరి,
వెన్నముద్ద గడ్డి, వెల వడపు గడ్డి,
చిలుక వాటుగాను చెలికెల మేపు
చెలికెల మేపులు చేరిమెయ్య కద్దు
పెంట యిరుగుడు గడ్డి పెంట చామపూరి
పెంట తర్లితె మేసు పెద్ద బక్కావులు
వూదరగడ్డి వుర్రంకి గడ్డి
దొండపాల గడ్డి దొడ్డి యిరుమేల
యెలికె నాచుగడ్డి యర్ర చిప్పెర అలుము
ఖానలకు పచ్చిగడ్డి వరపాటిగాను
పల్ల చిప్పెర గడ్డి పచ్చని గునుక
కురులేగ టావులకు కుందురు గడ్డి
గోళ్ళ చిప్పెర గడ్డి గోగల గడ్డి
కాకి చిప్పెర గడ్డి కారెనుసు గడ్డి
పద్మతీగెల గడ్డి పాలేరు యిరుమేల
నల్లగోగడ గడ్డి నర్రావుల పొదువు
నెల్లి చామ గడ్డి నెదురు గడ్డి
లంక రాముడి గడ్డి రాచిలుక రెక్క
పాల కోవెల గడ్డి పాడావుల మేత
కొండ చిప్పెర గడ్డి కొండకామంచి

యెలికె కొమ్ముల అలుము యెదురు నాలుకయు
సంత కుదురు గడ్డి సవ్వడు సన్నపు గడ్డి
వుప్పి చెరువు వెనక వున్నది చాల
రెల్లు గడ్డి కలదు రెక్కకామంచి
నేలసోము గడ్డి నెదురు గడ్డి
దొక్కదోలుడు గడ్డి దోరావుల పొదుగు
పిల్ల బాలుడు గడ్డి పిల్లపిసర అలుము
పాల కావలి గడ్డి పాడియావుల మేత
కొండ సోమి గడ్డి కొండ కామంచి
యేటివెంట కద్దు యెద్దులకు మేత
కారుజొన్న కారుకంది కారు అనపతీగె
కారు అలుము కారు గండుత్తరేణి
కొండ గుమ్మడి బెండ గోకులపు గడ్డి
తమ్మడి గింజ అలుము తుమ్మిపిండి
రొమ్ముబండ కుచ్చెలి రోకటి బండ అలుము
మదనపువ్వు మారేడు మాదేవి సోదేవి
కారాడు సాల్వబండి గణపతి అలుము
మూడాకు అలుము మువ్వంబి పొన్న
కలపొన్న నెలపొన్న తెల్లగురివింద
శేషగుత్తి అలుము చెప్పనలవి గాదు
పల్లేరు దూసరి పాపటి గంజేరు
ఆటి మామిడి పుల్ల ఆకు తీగెలును
బిలుకోట తుత్తురు పిల్ల బిచ్చి అలుము
నక్కపెంటి తుత్తురు లెక్క లేదనిన
పేరైన బెంచలి పిల్లి బిచ్చిలిని

పల్లేర్లపాటి మీద పాలబుంగలు
దాయవచ్చు
యెటువంటి మేపులు యెద్దులకు గలవు!
వడ్లపేర్లకన్న గడ్లపేర్లు చాల
గడ్లపేర్లకన్న వడ్లపేర్లు చాల
గొల్లరాజ! పశువులకు కొల్లలు మేపు!''
అని చెప్పి గౌరీలు అదృశ్యమైరి
ఆవులన్న పద్మనాయుడు ఆశ్చర్యపడిరి
కంపటీలు గోపాలుకులు కలుషర పడిరి
రాజు రాఘవుండు రాస్యము[42]
తలపోసిరి

''పరగంగ దళవాయు వో
పద్మనాయుడ!
చల్లగుండ్ల యిప్పేర్ల యేలిన చాల
భాగ్యమంతుండ
గౌరీలు కారు వీరు దేవతులుగాని
తక్కిన దేవతలుగారు త్రయిమూర్తులు
గాని''
చేతులో చెయివేసి చెల్లించి నవ్వీరి,
తనకు వేయించి గోకులము తర్లుమని
సాటించె.

## కాటమరాజు ఆలమందలతో దక్షిణాదికి తరలుట

ఆ మరునాడు మందలు ఆమనిగ కదిలె
గుడార్లు కదిలెను కోటియెద్దులు కదిలె
మంకెనయెడ్లు కదిలె మంద సంపదలు
కదిలె
కోడెకతో కదిలెను కోడెలొాక కోటి
కోడెలు కదలెను గొడుగులు కదిలె
ఆరిగెలు కదిలెను ఆ గొబ్బగాను
పల్లకీలు కదిలె పశుపతి కదిలె
పేరు సాగి కదిలెను పేరైన కవులావులు
శ్రీరామ కవులావులు చేరి సాగి నడిచె
బాపతేరు తీసినట్లు సాగె గోకులము
సముఖమున ధేన్వులు కూరపెంట
చాలున వచ్చి

యంకజేశని మడన యల్లావులు మేశ
చేకులపెంట దనుక సెలపెయ్యలు మేశ
టుంకి మానివాగు సుడిపెలపాడు
గురుగుల పాయమడ గుట్టలతోక
చిందగమానితోక అందగల మోట
జర్లమూల దనుక సలగుటెద్లు మేశ
మోతాన యెక్కెను మర్లవారి ధేన్వులు
నార్లపాయ కురవన సత్రావులు దాటి
యెలగలపాయ చవ్వలకు యెక్కి తా
వచ్చె
నూతి కొండలు యెక్కి ఖ్యాతైన
ధేన్వులు
అంబట్ల కొండంత ఆవులు నిండె

42. రహస్యము

యిశినేకువ్వ చవ్వలకు యేతెంచెధేన్వలు
పొదిచెత్త మేయుచు పోవంగ సాగె
ఆవులన్న పద్మనాయుడు అందరు
యాదవులు
యిశినేకువ్వ యెక్కిరి యదుకులోత్త
ములు

## కాటమరాజు యిశినేకువ్వ వద్ద మజిలీ చేయుట

"వినవోయి మరిది రాఘవా! విమల
చారిత్ర
యిశినేకువ్వ మహస్తశము విను
రాఘవేంద్ర!
యిటువంటి తావున యీ రాత్రి మనము
వుండవలె యిక్కడ వొకవార్త వినుము
ఆవులకు యిక్కడ అతివేగ దొడ్లు
వేయించుమని చెప్పె వేగాళమునను
రాజుమాటలు విని రాఘవేశ్వరుడు
పసుల వారిని బిలిచి బాగుమీరంగ
తెట్టెలు బెట్టించ దిట్టముగాను
గుడారు వక్కటి గురుతు మీరంగ
యెత్తించ దొడ్ల నడుమ పేరాళము
గను
జముఖానము పరిపించిరి జననాథు
లిద్దరు
అనాగతము తలపోసి అప్పుడిట్లనియె:
"వకనాటి పూటకు వో రాజ నీవు
ఘట్టిగా దొడ్లు వెయ్యటకు కారణం
బేమి?"
"వినవయ్య రాఘవ! వివరమంత
మును
మనము దక్షిణాదికి మరి పోవు
చున్నాము
మళ్ళి వచ్చేది నిజమో మరుణమే నిజమొ
అది తెలియరాదయ్య అరిహరుల మాయ
కలియుగ ప్రమాణము కడవెళ్ళదనుక
నిలుపవలె మన కీర్తి నిఖిలంబులోన
కువ్వతొక్కి మనము గోపాల్కులంత
దవ్వుల దేశాల తార్కాణముగను
చూతాము రావయ్య చోద్యంబుగాను"
అని వారు యిద్దరు అరుషంబుతోను
కువ్వపైకి వచ్చిరి, గుణవిశాలుండు
చవ్పన్నదేశాలు తార్కాణముగను
తప్పక చూచెను ధారుణీశ్వరుడు
"విప్పార్ల సింహ్వామ! వినవోయి
మరిది!
తప్పక నీవు చూడు దవ్వుల చూపు
దొడ్డైన యా కొండ దొనకొండ చూడు
పేర్మితో ఆ మిరు పెయ్యల తప్ప
చూడవోయి రాఘవ! చోద్యంబుగాను
పరుగ దక్షిణాది పాటించి చూడు
పశిమిగ వున్నాది పాకనాడంత
సూర్యాధిపతిచేత చోద్యంబుగాను

నీళ్ళు గనిపించును నిజముగాచూడు !''
వో రాజశేఖరా ! వల్లవుల రాజ!
దూర భారపు చూపు చోద్యమై యుంశు
సూర్యకిరణాలను చూచితిని అచట
అంటివి గాకను అవులరాజ !
యెక్కడి దూరంబు యెంత భారంబు
అగుపడునని మీరు ఆనతిచ్చితిరి
కానిమ్ము అటకు మరి కడువేగమునను
పోవుచున్నాము భూతలాధీశ !''
అనిన కాటమరాజు అప్పుడిట్లనియె :
"వచ్చిపోయినది గురుతు వరమైన
గురుతు
వొంచి పోవలెనయ్యా వో రాఘవేంద్ర
యెల్ల లోకములకు యెన్నికగాను
యెల్ల నిశాని తా యెత్తించు" మనెను
రాజు మాటలు పద్మరాఘవుడు వినియు
నిశాని యెత్తించి నిఖిలంబు లెరుగ
పశుపతి రాజేంద్రు పద్మరాఘవుడు
కుశలముగ ఆ కొండ గొబ్బున దిగిరి
పసమించు తముకముపైన కూర్చుండిరి
ఆ రాత్రి ప్రొద్దుబుచ్చి అతివేగమునను
భారత పురాణముల్ బాగుగా వినుచు
యీ రీతిగా నుండె యిలనాథుచంద్రుడు
అంతలోపల చంద్రుడు దరుదెంచి వచ్చె
కాంతిగా వెన్నెల కాయంగసాగె
అంత చుక్క బొడిచ అటు తెల్లవారె.
కాంతుడే యాదవ కాటమరాజు
వుదయకాలమున శివపూజ తాచేసి
కదులుమని సాటించె కంపటంబులను
రాజు మాటలు విని రయము తోడుతను
పొదుల వాకిళ్ళు తా భోరున దీసి
వుర్ల బిలచిరి ధేన్వల మర్ల చాల్పునను
తర్లిరి కంపటము దరిమేర లేక
వుర్లకొండ కురువన వుత్తముని ధేన్వులు
తర్లెను మందలు దాపు దాపునను
కొమ్ముపాయ చాల్పున కోడెలు నడిచె
యర్ర జరితోకన యెక్కి యా ధేన్వులు
లందపాయ వంపున మందలు దిగెను
యీదువ కట్టవ యెల్లావుల జరియు
శోధించి తూళ్ళపొడి చెట్లు తా త్రవ్వి
మోదము తోడుత మందలు దిగియు
మెరుగు చెన్నుని కురువ మీనుగ వచ్చి
పులిబండ కురువ యురుమేల తా మేశ
గూబలవాగు మడకు గొబ్బున వచ్చె
రాజు గోపాల్కులు రయముతో వచ్చి
పరగ యేణ్ణూతలపాటను దిగిరి

## ఏడునూతలపాటి వద్ద చిలుకల అలజడికి కొన్ని యెద్దులు చెల్లుట

అంబట్లమల చిలుకలు అమృత
మూరగించ మరిగి
శంభుని మందయెంట చెల్లించినడిచె
జ్యోతిమల చిలుకలు మేతలు మరిగి

ఆడతర్లి చిలుకలు ఆవుల మీదికి వచ్చె
రాంభవుని చిలుకలు రావిలుకలు కదిలె
ఆకుచిలుకలు కదిలె ఆవులవెంట
యెండిపోయిన నక్రావుల మీద
వేగమె వ్రాలె
చిలుకలు పచ్చగా వ్రాలె ఆకులవలెను
ఆరునూరు యెద్దులు అర్రెత్తి చూచి
చిగురుటాకని భ్రమసి శిరసెత్తి చూచి
ఆశచే యెద్దులు అందుకోబోగ
గుబగుబ యెగసి చిలుకలు కొండలకు
వురికె
యెగిసిన చిలుకల యెద్దులు చూచి
భ్రమలుడిగి యెద్దులు బాలుబాలున
అరిచి
ఆరునూర్ల యెద్దులు అర్లు కిందుగను
కొమ్ములు కిందుగ బడి గోవులు చెల్లె
ఆశ దప్పి యెద్దులు అవనిపై వొరిగె
ఆరు నూర్లు లెక్కపుడు గవినెలు
త్రవ్వించి
పసుగంగ యెద్దుల పాతివేయించ
గంధము కస్తూరి కలిపించి చల్లి
పునుగూను జవ్వాజి పువ్వులు బరిపించి
వుత్తమ జంగాలు వుగేయనంగ
సత్యమా జంగాలు శంఖులు పూరింప
ఘనగన వాయిద్యములు ఘంటనాదులు
మ్రోవంగ
ఆవులన్న పద్మనాయుడు అతివేట్కతోను
గంటవేసి యెద్దుల కైలాసమంపె

## ఎద్దులు చెల్లినందులకు కాటమరాజు దుఃఖించుట

యతి పట్టభద్రుడు యెద్దులకుగాగ
ఆపరాని శోకము అణచంగలేక
మరియు పద్మనాయునితో మందలింప
సాగె
గోడుగోడున అడిలి గోళ్ళ కన్నీరు
వేళ్ళను చిమ్ముచు వెతపడసాగె
"యీడైన సంగడము యిప్పర్ల మరిది
మలన చెల్లిన ధేన్వులు మనసులో వుండె
యింతగా దుఃఖము యిటువలె నుండ
యెద్దులు వొరిగెను వోర్వంగలేను
గుంభిళ్ళ పెద్దయ్య కూలిన వెనుక
కల్యాణాన బుట్టి కన్నవారిని గలిస్తిమి
కన్నవారిని యెడబాసి కవులావుల
గలిసితిమి
వేక[43] గర్భమునందు వెడలిన పాప
మనుమలేక సన్యాసియై మేడమీద
మందలింపగను
పాపకు కస్తిపడనోయి పద్మరాఘ
వుడ !
ఆవులే తల్లులు ఆభోతులు తండ్రులు

43. ఏకగర్భము.

తొలుచూరి పడ్డలు తోడబుట్టువులు
మలుచూరి పెయ్యలు మాకు సైదోడు
అబోతు కోడెలు అన్నదమ్ములును
బసువన్న పాదానకు తన శిరస్సుకు
ప్రతిలంకె చేస్తి
నమ్మిన ధేన్వలు నన్ను యెడబాసి
చెల్లిపోగా గుండె చెదరెను రాఘవ!"
అని గోడు గోడున అడిలె నలనన్న
పశుపతి అడలంగ పద్మరాఘవుడు:
"రాజులకు కస్తిపడ రాదయ్యా బావ!
బావ పట్టపురాజ! ప్రలాపించనేల?
బ్రహ్మవ్రాలు తప్పవు బావ యిటు
వినుము"
అంతట రాజు ఆ నాయునితో ననియె:
"కల్యాణమున మాతల్లి కంగన్ననాడు
యింత దుఃఖము లేదు యిటువిను మరిది!
అయ్యా చెల్లిన వెనుక అయ్య అసువాలు
లెంకలు తెచ్చిననాడు లేదు దుఃఖంబు
పద్మనాయుడ! యేడేండ్ల బాలుడై నేను
తల్లి చాత అంపించుక తండ్రి రణముకు
బోతి
కానక వెతికితి కడు దుఃఖము లేదు
దేవతల పంపున తెస్తి తమ తండ్రిని
తన ప్రాణవిభుసిమీద తరుణి పెద్దమ్మ
గొనకొని నిప్పుల గుండముకు బోత
నిండిన ప్రాణము నిప్పులకు యిస్త
తముకము మీద నుండి తల్లి పాప
నూకకు
చన్ను యిచ్చేటి ఆ సమయంబు నందు
పాప కనకన అడితే ప్రజలు కస్తి
పడిరి
నన్ను జూచి కవకవ నవ్వె మా తల్లి
తల్లి ముఖముచూచి తాను నవ్వితిని
చెల్లెలికి వగువనైతి యెడ్లచెట్టకు వగపు
పెట్టి"
ఆ రాజు మాటలకు ఆ నాయుడిట్లనియె:
"యెన్నరాని శోకము యెట్లనోయి రాజ
మీరిన దుఃఖము మీకేల బావ!"
అనిన రాఘవునితో అప్పుడిట్లనియే:
"యినవోయి రాఘవ! యీ ధేన్వలన్ని
పసిచెడి పోవంగ పశుపతి రాజు
చూచెనని జనులంత చోద్యపడియేరు
యీ ప్రాణమేటి" కని ఈశ్వరుని దలచి
నిలచి స్తోత్రముచేసె నీలపర్ణుడు:

## వర్షము కురిపింపుమని కాటమరాజు ఈశ్వరుని ప్రార్థించుట

"పార్వతీశ్వర! యీశ! పాకశాసనవద!
గవిరీ మనోహర! గంగ ప్రాణేశ!
యీశ్వర సరివేశ[44]! యీశ మందార!
దోష నివారణ! దురిత సంహార!
ఫాలలోచన యీశ! బసువ వాహనుడ!
అలనాడు సురులను అసురులు గూడి

44. సర్వేశ.

పసలుచు పర్వతము మని కడలి దించి
తరుపగా ఫణి బలికె 'దధిలోన నేను
విషము గ్రక్కుదుగాన విడువు' మని
పలికె
విడువక తరిచిన విషములు గ్రక్కి
విషము బుట్టిన మరి విడిచి దేవతులు
వెల్‌బడుచు నీ మరుగు వెనుక
జొచ్చినను
విషమారగించిన వీశ[45]మందార !
రసికుడ మమ్ముల రక్షణ సేయు
దీక్షించు[46] మమ్ముల దీనశరణ్య!
యేరువ భూమికి యేగ వెళ్లుతాపు
కడువేగ నంపించు ఘన మేఘములను
ఘనుడవు మాపాలి కర్తవు నీవు
కూరిమి వరుషంబు కురియించు స్వామి
పశువుల బతికించు ఫాలలోచనుడ!"
అని పెక్కు విధముల హరుని
కొనియాడి
ఘనమైన వల్లవుల కాటమరాజు :
"పంతమా నాతోను పలుకవు నీవు
యంత చేసితి నీకు యీశ! లోకేశ!
సంతరించేటి మాపాలి స్వామి నీవనుచు
యెంత ప్రార్థన చేస్తి యిందాక నిన్ను"

## కాటమరాజు ప్రాణత్యాగమునకు సిద్ధపడుట

అని శివుని దూరుచు ఆ వలనన్న
తన చేతి కుంతళము తగ ఝళిపించి
యెగవేసి రాజు తా యెదురొమ్ము వొడ్డె
హరిహరాదుల మాటుచే ఆ కుంతళంబు
గగన మార్గంబున దలక నిలిచె
పరుగు బారుచు నారదుడు
పరమేశ్వరుని కడకేగి
కరములు ముకుళించి ఘనత నిట్లనియె :
"పరమేశ వినవయ్య! పశుపతిరాజు
పశువులకొరకు తా ప్రాణాత్యము[47]గను
వగదెంచి యున్నాడు వల్లవుల రాజు
హరహరా అక్కడికి అరుదెంచకున్న
సమయమౌట నిజము స్వామి యీవేళ"
అని చెప్పి నారదుడు అరిగెను వేగ.

## ఈశ్వరుడు కాటమరాజునకు ప్రత్యక్షమగుట

పరమాత్మ డప్పుడు పరువున వచ్చి
ఘంటల కుంతళం ఘనుడందుకోని
దివినుండి పరమేశు దిగివచ్చి నిలచి
పశుపతి రాజుకు ప్రత్యక్షమాయె
శరణార్థి చేసెను చేయెత్తి రాజు
యెక్కడి శరణార్థి యాదవరాజ?

45. ఈశ 46. దీవించు 47. ప్రాణహత్య

యెంత సాహసుడవు యేల నీకింత
అంతకము యేటికి అవుఁరాజ !
కచ్చితము శాయను కారణంబేమి !
"యినవయ్య లోకేశ! యీశ్వరా! నివు
నా స్తితి చెప్పేను నా స్వామి వినుమ!
చప్పన్న దేశాల-ధేన్వల-చాల మేపితిని
అప్పెనము బెట్టక అవుల మేపితి
దుర్గాలు మేపితి తుమురు తుమురుగను
భార్గవి నది దాటి పరువున వాస్తి
పన్నెండు వత్సరములు పరువతం మీద
అవుల మేపితి హరహర వినుమ!
శంభుడ! అవులకు క్షామ బాంధ్రము తోచె
అక్కడ కొన్ని ధేన్వలు హతమాయ స్వామి
పులలు దిగివా స్తిమి మంతనాల చాయన
గౌరీలు-పాక నాట-మేపులు కలవని చెప్పిరి
పోవుచున్నాము భూతేశ వినుమ!
యిక్కడికి వస్తిమి యీశ్వరా నేడు
వొచ్చిన యెడ్లు యీడ వారిగెను కొన్ని
యిఫ నేమి సేయుదు యీశ్వరా నేను!"

## ఈశ్వరుడు పశువులకొరకై పాతాళగంగను పైకి తెప్పించుట

అని తలపోయంగ ఆ సాంభమూర్తి :
"తలపోయ నేటికి తాపత్రయమేల ?
గోవులకు నీళ్ళు మరి కొల్లయు సేతు"
అని తలచి శివమూర్తి తన చాతనున్న
త్రిశూలం గిరగిర త్రిప్పి కానచట
గజశూలముతోన గడ్డ పెకిగించె
గుబగుబమని వురమి గుబ్బ బిలుకొనుచు
జలము లుద్భవించి జలజలు బారె
గూబగుండము వాగు గుబ్బ టిలిపారె
అవులు నీళ్ళు త్రాగి ఆనందమందె
ఘనుడు సాంబమూర్తి కైలాసమరిగె
ఘనుడైన వల్లిపుర కాటమరాజు
వేవేగ తన మరిదితో విచారముచేసే:
"నాయుడా! యిటు వినుమ నా చిన్న మరిది !
అవులకు యిక్కడ అలసట తీరె
పోపలె యెత్తు తర్లి ప్రొద్దున లేచి
పాక నాటికి బోవలె పద్మరాఘవుడ !
కలియుగ ప్రమాణము కడ వెళ్ళుద నక
నిలువవలె మన కీర్తి నిఖిలంబు లెరుగ
తన రూపు త్రాయించె ధారుణీశ్వరుడు
కలియుగము లోపల ఘనులార వినుడి
తనపేరు నిలువవలె ధరజను లెరుగ"
అని పద్మనాయునితో అనతి ఇచ్చె

## కాటమరాజు ధనకొండకు పోయి సిరిదేవి దీవెనలు పొందగోరుట

"వినవయ్య రాఘవ విన్నవించెదను
దినకరుడ భూములు తిరిగి మేపితిమి
సీమ భూములకు మళ్ళితిరిగి వొచ్చితిమి
నవలక్ష పరువతాలు శోధించి వొస్తిమి
మాల్యవంతములు ఆవుల మేపుక వస్తిమి
భూములు తిరిగిన ఆవులకు భూతబలి
పెట్టవలెను
నానా దేశము తిరిగిన ఆవులకు
నరబలి పెట్టవలెను
పాళ్ళు తిరిగిన ఆవులకు పచ్చబలి
పెట్టవలెను
అమ్మతో విచారము చేసి ఆవుల దొడ్డి
గుడుపవలెను
అమ్మ దీవెనలేక అరుగంగరాదు
తల్లి దీవెనలేక దక్షిణాది పోరాదు
మేలు కీడుకు లోనై మేసత్త వున్నది
వారికి యెరిగింపక పోను వరుసగాదు
నాయుడా!
ముందుగా విచారింపక ముప్పవును
మరిది!
అయితన్న యేలే ధనముకొండకు
అంపుమా తనను"
పద్మనాయుడు ఆ మాటకు పకపక
నవ్వె:
"అదేమయ్య ధనముకొండమీగ
ఆశ పుట్టిందా
అన్నలు తమ్ములు మీ అమ్మ వుండంగ
బావలు మరదలు-మీకు-బంధువులు
వుండంగ
కులకోటి బంధువులు మీకు ఘనవుగ
వుండంగ
తనకు యెవ్వరు లేక తలిదండ్రులు లేక
బంధువులు లేకుండ బలగము లేక
రాజ్యభూములు లేక రాజులముగాక
పాపము వహదొలిగే కొరకు పట్టితిమి
సంగడము
పద్నాల్గు యేండ్లు పట్టితిమి సంగడము
పరచిత్తము పరజ్ఞానము పరగ నీ వెరు
గవు
పతిలంకె సంగడము పాయకు బావ!
పూరిమెట్లవారు యీ భూములు యేలేటి
నాకు
తొల్లి ధనముకొండన తొమ్మిది
అంగళ్లు
యిప్పుడు ధనముకొండన యిన్నూరు
అంగళ్లు
బ్రొద్దుపోయి ధనముకొండన పొన్నూరు
అంగళ్ళు
ఝాము బోయి ధనముకొండ నజాజుల
అంగళ్ళు
పువ్వుల అంగళ్లు పుర వీధులంత
పసుపుకాటుక అంగళ్లు పట్నాన తరుచు
పద్దెనిమిది ఫణాలవారు పట్నాన
వున్నారు

వృద్ధిబొందె వున్నారని వినిబడె తనకు
సాసివాడలు జూచి సాగి రాలేవు
వేశ్యవాడలు జూచి వెళ్ళి రాలెవు
ఆటపాట వారిని చూచి ఆదమరచేవు

తమ్ములు యేలే ధనముకొండ జూచి
తమను మరిచేటి
పట్నము జొచ్చిన మరునాడు పశువుల
మరిచేవు
పశువుల మరచిన పరగతులు నిండు
మమ్ముల మరిచేవు మాధవుడ నీవు
ఆ లక్షగోపాల్కుల అందరిని మరిచేవు
సిరిగల బసువన్న శివపూజ మరిచేవు
నాయుని మాటలు ఆవులన్నీకు
నారాసాలాయ
"యెంత మాటాడితివి యేమయ్య
మరిది!
యెరిగి పద్మానాయుడా యేటి కాడితివి?
దొడ్డిన గట్టిన బిరుదు దొనకొండన
విడువ
మందన గట్టిన కాళ మాయమ్మ
నగరున విడువ
తల్లివున్న ధనముకొండకు తగనంపు
నన్ను

తొలుచూరి పద్దలు తోడబుట్టువులు
పలుచూరి పెయ్యలు మాకు సైదోడు
కామధేన్వులు మాకు కన్నతల్లులును
యితరులు నాకేల యిక నమ్మ రాఘవ
వున్నవూరి ఆడవారు కన్నతల్లులును
తోలుమోకులు దండెగోలలు యమారక
నీవు
పరామరికె వుంచు పశువులమీద
మునిమాపున పడ్డ ఆవుల ముని
మాపున యెత్తించు
నడిజామున పడ్డ ఆవుల నడి జామున
యెత్తించు
నీయెదుట పడ్డ ఆవుల నీవె సారక
యెత్తించు
మానావతీ ధేన్వుల మనసులో వుంచు
శ్రీరామ కవులావుల నీచిత్తాన వుంచు!"
యర్రయ్య పద్మనాయుడు యాదవు
లందరికి
కర్పూర విడియము గంధ కస్తూరి
ఆలది
కవులావుల వప్పగించి కమిగిట జేర్చి
అందరిచాత దివ్యన[48] అపుడు పుచ్చుకొని
తిరుమందుల వారి దిండ్లమీద శ్రీరామ
ముద్రికలు మోపె

## కాటమరాజు దొనకొండ ప్రయాణము

అజానబాహులు యాదవవరులు
రాజువెంట పంచనమైరి రణశూరులెల్ల

48. దీవెన.

నందగోపాల్కుల నలసన్న చూచి
ముందుగా అందరు ముస్తీదులైరి
పల్లవులు గోపాల్కులు వైళంబుగాను
వల్లవులు రాజులు యిరవంకల
గొలుప
తిరుమందుల వారు తిరుగ బారుకొని
మెరసి ఫలములతోను మెండుగా
గొలువ
పంకజనాభుని యిరు పార్శ్వములందు
పమిడికాడ వింజామరములు యాదవ
రాజుకు విసర
వెండికాడ సురటీలు యిరుప్రక్కల
విసర
నడ వింధ్యాద్రిబోలె నలనన్న కదిలె
అయోధ్యరాజు తమ అమ్మను జూడ
ద్వారావతిరాజు తమ తల్లిని జూడ
కొంచరొప్ప దిగివచ్చి కొణతాల
నడువ
కనుపేయగా తూర్పుగండికి వచ్చి
జవొడ్డునసిలచి...............
"యా స్తళము మహస్తళము
యినరయ్య మీరు
మను గన్న తల్లియు మగువ
పెద్దమ్మ
.......................యాడ
ప్రతి శిల సిలుపవలె పరగంగ యాడ
అని తల్లి మాపంబు అపుడు గావించి
.........కస్తూరి ఘనత నైవేద్య
ఆమరంగ యిచ్చి తమ అమ్మతో
ననియె
"వినవమ్మ వో.............
....................పూజ
జగములో నడిపింతు జనులు
మెచ్చంగ'
అని చెప్పి రాజు తానచ్చోటు తర్లి
మారుకాపురము వెళ్ళి మాధవుడు
కదిలె
చేరి దరిశించెను చెన్నరాయులను
"శ్రీహరి నందన! శ్రితపారుజాత!
దేవేంద్ర వందిత! దీనుల దాత!
ప్రహ్లాదు కభయంబు పరగంగ నిచ్చి
కశ్యపు దునిమిన ఘననారసింహ
ద్రవుపతి [49]మానంబు తగు వేట్కగాచి
అక్షయ వలువలు యిచ్చిన స్వామి
కరుణించువే మమ్ము కంసమర్దను!"
రక్షించుమని మొక్కి రాజు తాకదలె
యిండ్ల చెరువుకు వెళ్ళి వేగమె వొచ్చె
కుభేరు చింతకాడ కూడి పారె దండు
వుత్తరాది పగలు వుక్కణగించి
పోరుకు దక్షిణావి పోవలె ననుచు
మనిసితోలు తమటాలు మరి వేగ
యెత్తించ
గుబులు గుబులున వురిమె గుబ్బటిలి
నట్లు
తమటాలు వాయించిరి తగు వేట్కతోను
పినయెరువ బెదిరె పెదయెరువ బెదిరె

49. ద్రౌపది

రాజు వున్న ధనముకొండ రంతు
ఘనమాయ
దిగులుపడి ధనముకొండ దిశలెల్లగప్పె
రేపటి కొలువున రేమంతుని వీర
బయట
మూడు సిలువుల పొడువు ముత్యాల
మేడ
గడియారము మొగసాల కల మండ
పము క్రింద
కనక సింహాసనాల గద్దె మీదటను
ఘనుడు ఆయితమ రాజు గాంభీర్య
శాలి
పల్లికొండ రఘుపతి పరగ పల్లభన్న
అన్నలు తమ్ములు ఆత్మవర్గంబు
బావలు మరుదులు బంధుజనంబు
వెరసి విరువై[50] నాలుగువేల బలంబు
కాలిబలంబులు కదసి తనను గొల్వ
దండిగా రాగాలు జంటగ బాడువారు
సరి పందెము లాడుచు సయ్యనువారు
కిన్నెరుల్ మీటుచు కీర్తనలవారు
రావణ అస్త్రాల వారు రాజుకొలువునను
వోరుగంటి మేళాలు వొరుసతో
కదిలె
చంద్రగిరి మేళాలు సానె భోగముల
వారు
ఆటపాటలవారు అక్కడ తరుచు

వాయించేటి వాయిద్యములు వాలు
మేళాలు
కాళవారిగంగు గజ్జెల తిమ్మి
అలరంగ వైభోగముల ఆ రాజు
కొలువున
కుభేరు చింతకారు గుభుల్ గుభుల్
మనుచు
తమటాల ధ్వనులకు ధరణీశు కొలువు
విని అశ్చర్యపడిరి వీరు వారణక
పట్నము యిట్లట్లాయ ప్రజలు
భీతిల్లిరి
చూపులవారు అయితన్నకు సుద్ది
వినిపించిరి
"బాలరాజు అయితన్న! మన
పట్నంబుమీద
అప్పటప్పటికిని ఆర్భాటము లాయ
తమాటాల మ్రోతలు తరుచుగనాయ
గొడుగులు పడిగెలు కొమ్ములు
వీరణాలు
తడుములు వాయించిరి తుది
మేరగాను"
ఆవార్త విని అయితన్న అపుడిట్ల
గనియె:
"బావా! పల్లికొండ! మన పట్నము
మీన[51]
యెవ్వరి దళమోకాని యెరిగింపు
మనిన

---

50. ఇరువై 51. మీద

పల్లికొండ అయితమరాజుతో పలికి
యిట్లనియె:
"పగవారొ మనవారొ పముజు
లేర్పరచి
యెదురుగ వచ్చిన యెరిగింతు మీకు
యెవ్వరోకాని వారు యెరుకలె" దనిన
పల్లికొండ మాటలకు పట్టభద్రుండు
అయితన్న పుత్తన్నతో అరుషించి
పలికె
"పూరిమెట్ల చెన్నకేశవ: పుత్తమ
రాజ !
పసగ ధనముకొండ మన పట్నము
మీద
వచ్చేవారు ఎవ్వరో వైనము తెలియ
దాయ
హరిగురువు పల్లికొండ నడిగిన
యపుడె
మరుగుబెట్టి పలికె మనకు తెలియ
దాయ
పల్లికొండకు తెలియని భావ్యంబు
యేమి?
గతహేష్య మెరిగిన ఘనుడు
పల్లికొండ
మనవారొ పగవారొ మనస్సున చూడ
మతిలోన మన్నించి మరుగు బెట్టి
నాడు
నడి తముకు సేయించి నాగరమైన
గుర్రాల పంజుల గొబ్బున దండు
రప్పించు" మని శలవు రాజు తాసిచ్చె
ఆమాటకు పుత్తన్న అతి శీగ్రముునను
మాచకూళ్ల మల్లును మరి వేగ బిలిచి
"గోటకంబుల మంచి గోవ తేజీల
పల్లన గట్టించు" మని పలికె నావేళ

## అయితమరాజాదులు కాటమరాజును ఎదుర్కొనుట

రాజు మాటలు విని రయమున నపుడు
వాజీల కన్నింటికి వైనవైనాన
పల్లికొండ యెక్కేటి పంచకల్యాణికి
పిల్లి జల్లులు మంచి బిరుదు లమరించి
వల్లభన్న యెక్కేటి వాసిగల తేజికి
తెల్లని ముత్యాల తెలివైన సరులు
అయితన్న యెక్కేటి అల రూప
రాయునికి
పైడిది పల్లంబు పచ్చల వాగె
రారేఖలు మరియు రత్నభూషణ
ములు
కరియావుల రాజు యెక్కేటి గండ
గత్తెర తేజికి
బిరుదైన ముత్యాలు పిల్లి జల్లులును
నాచకూళ్ళమనేని నట బిత్తర తేజికి

హెచ్చైన ముత్యాలు హేమంపు
మణులు
కూర్చిన సరులు మెడ గుండ్ల
పేరులును
పు త్తమ రాజు యెక్కేటి పువ్వుల
సీలనికి
కుక్కల కల్యాంబు కంచు పక్కెరయు
సిరిబాల ముమ్మయ్య యెక్కేటి
చిత్రపిడుగును
బాగైన కంఠాణి బన్నసరములును
కల్లందుల పోచయ్య యెక్కేటి
కత్తు తేజీకి
మల్లెపువ్వుల సరులు మణులు
మెడకొండ
మర్ల పిన్నమనేని మడిమె తిరుగని
బంటును
మావకూళ్ళ మల్లురౌతుల మంచి
తేజీల
పల్లాలు గట్టించి పయనంబు జేసె
అర్చుచు కదిలెను యాదవ బలము
గడల అరిగెలవారు కత్తులవారు
కాలిమూకల భూమి గ్రక్కటిలగాను
తిరుమందులు యెక్కిరి దివ్యతేజీల
వల్లవులు యెక్కిరి వాహనంబులను
విలుమూక బల్లాలు వీరనాయకులు
తేజీల నెక్కిరి నైజాలవారు
తుపాకి విలుమూక తురుతున కదిలె

తప్పెట్లు పిల్లంగ్రోవులు
ధారబూరలును
తమటాల మోతలకు భూమి
తత్తరపడగ
సన్నాయిలు గిడిగిళ్లు సన్నవీరణాలు
వన్నెగా పంచమ వాయిద్యములతోను
పచ్చల పాలకి పల్లికొండ యెక్కె
హంసల పాలకి అయితన్న యెక్కె
వాహనంబుల యెక్కిరి వారు వీరనక
గుడిపాటి గుమిడిన గుర్రాల పంజులు
గదిలె
మర్రిపాటి గమిడిన మన్నీలు కదిలిరి
యిండ్లచెరువు గమిడినయిలుమూక
కదిలె
దొండవాగు మొదలుకొని దొరమన్నె
వారు
నలనన్న దళములు నడచి రాగాను
అయితన్న పంజులు ఆదికొని నడిచ
కాటమరాజు అవుట క్రమమెరుగలేక
యెదురుగా అయితన్న యేతెంచెదండు
హనుమంత పడిగెలు ఆలవట్నములు
జూచి
అవులన్న యనుచు అయితన్న
అతి సంతసించె
గరుడ పడిగెలు జూచి కాటమరాజు
అనుచు

పెరిగెను భుజములు పెద్దరాజు అనుచు
యాదవరాజు గా దెలసి అందలాలు
దిగిరి
అవులన్నను జూచి అయితన్న పాలకి
దిగెను
పచ్చల పాలకీలో పల్లికొండ రాగ
పశుపతిరాజు పల్లకి దిగెను
వేనుయొక వేడ్కతో యెదురుగా
వొచ్చి
పల్లికొండకు మ్రొక్కి ప్రార్థన చేశ
అంతట పల్లికొండ అతి సంతసించి
కనకదండ పల్లకిలో రాజును
కమిగిట జేర్చి
అయితమరాజు అవులన్నను జూచి
దయతోను సాష్టాంగ దండంబు బెట్టె.
తమ్ముని కమగిట జేర్చి తప్పకజూచి
యెనియొక* ప్రియముతో
యెదమున జేర్చె
కొమరమ్మ పుత్తమరాజు గొబ్బున
వొచ్చి
తమ బావ నలనన్నకు దండంబుబెట్టె
కరియావుల రాజు కడువేడ్క[52] తో
వొచ్చి
కరుణతో నలనన్నను కమిగిలించు
కొనెను
వల్లభన్న వొచ్చి వందన మొనర్చె
అల్లు దాడెన్న వొచ్చి అతి భక్తితో
మ్రొక్కె

అయితన్నను కొలిచిన మొదులైన
వారు
దీనులై మ్రొక్కిరి దీవించె గురువు
అన్నలు దమ్ములు ఆత్మవర్గంబు
బావలు మరుదులు బంధుజనంబు
అంజలి చేసికొని ఆనందమంది
బలాదూరు ద్రిష్టితీసిరి పట్టపురాజుకు
అన్నకు యెదురుగా వొచ్చిన
అపకీర్తి యనుచు
ధరణీశు డయితన్న షోడశ దానంబు
లిచ్చె
అవులమంద పరిణామము అడిగె
అయితన్న
సర్వగ్నుడు ధనము కొండ
సంతోషమడిగె
అవులన్నను కొలిచిన యాదవ
సేనలకు
అయితన్న తాంబూళం అందరికి నిచ్చె
పల్లికొండను కొలచిన పరివారమునకు
కర్పూరవిడెము కాటమరాజు యిచ్చె
పల్లికొండ అవులన్న పల్లకీలు
యెక్కిరి
పల్లవులు తిరుమందులు వయినాన
గొలువ
ఆ తమ్ములు గలసి అశ్వాల నెక్కి
బాలరాజులు యేలేటి పట్నానికి
కదిలిరి

*అనియేక 52. వేడ్క

అమ్మకు కొమరిగిరికి అప్ప
యరణప్పకు
మాధవుడు వచ్చెనని మరి వేగ చెప్పిరి
ఆవార్త కొమరగిరి అమ్మసిరిదేవి
యరణప్ప అప్ప అఘుమంచి
యాదవ సతులు
వీనుల పండుగ విని సంతసించి

కన్నుల పండుగ కలిగెను చూడ
కోలవారి నాగినేని గొబ్బున బిలచి
'వల్లవుల రాజు ధనముకొండకు
వచ్చుచున్నాడు
సిరిగల పట్నము శృంగారించు'
మనిన

## కాటమరాజు స్వాగతమునకై దొనకొండ పట్టణమును అలంకరించుట

అని ఆనతిచ్చిన ఆ పనులవారు
పరికింప వీథులు బాగుసేయించి
వీథులు వూడ్పించి విడినీళ్ళు చల్లించి
అంగళ్ళు అలికిరి అతివేగమునను
శ్రీగంధాన అలుకులు చిలికించి
రపుడు
కాంతలు చల్లిరి కస్తూరి వేగ
మెండైన గోడలు మెలపన చేసిరి
అగరు పన్నీరు ఆడకాడకును
చిక్కని గంధము చిలుకులు చల్లిరి
వల్లవుల దివాణము వన్నెలు దీర్చిరి
తిరుమందులవారి దివాణము తిరుతిరు
పరచి
దొనకొండ శృంగారించి తోరణాలు
గట్టిరి
రాగాకు * తోరణాలు రాచలోగిళ్ళు

మామిడాకు తోరణాలు మర్లవారి
యిండ్ల
అందముగ తోరణాలు అంగళ్ళవెంట
తమలపాకు తోరణాలు తగువేట్క
గట్టిరి
వట్టివేళ్ళ సపారాలు వాడవాడలను
కురివేళ్ల సపారాలు కూటాల నడుమ
పట్నము శృంగారించి బాగేరు పరచి
వారివారి లోగిళ్ళు వైనవైనాన
ముత్యాలతో పంచవన్నె ముగ్గులు
పరచి
పైడి పళ్లెములో నివాళి బాగేరు
పరచి
మంగళా హారతులు దీర్చిరి మగువ
లందరును

*రాగి + ఆకు = రావియాకు

అంగనలు సంతోషమున అటు కొలువు
దీర్చిరి
ఆవులన్న పల్లికొండ అయితమ
రాజు
పట్నము జొచ్చెను యాదవ పట్ట
భద్రుండు
అడుగులకు సిరిదేవి అతిప్రియము
తోను
మడుపులు ఐరిపించ మాధవుడు
రాను
బజార్ల వెంటను పల్లకీలు జేర్చి
అడ్డగోడలవెంట అందలాలు జేర్చిరి
వీర పరివారమును విడిమట్టున
వుంచిరి
మొగసాల ముందర రాజు తా నిలచె
మొల్లల చవికెలో మొక మండపాన
అల్లుని గనుగొనె అక్క కొమరక్క
బలాదూర్ల దిష్టితీసిరి పట్టపురాజుకు
పళ్లెమున నివ్వాళి పట్టి పాడిరపుడు
యదటను అవులన్న యరణప్పను
కనుగొని
పాదాలకు మ్రొక్కెను పట్టభద్రుండు
ఆవెనుక కొమరగిరి అత్తకు
మ్రొక్కెను
తమ తల్లి సిరిదేవికి దండంబు బెట్టెను

"నాతండ్రి నీకీర్తి నధి నిధులకన్న
అన్నాళ్ళు వర్ధిల్లు అన్నరో నీవు!''
ఘనమైన రాజుకు ఘనత తోడుతను
జముఖానము పరిపించి చదు
రేరుపరచి
పల్లికొండ కూర్చున్న పట్టభద్రుండు
వల్లవులరాజు యిరువంశల నుండి
దివాణములో పరువాదిగు పారవేసి
శావలు [58]చేసిరి చెలువొప్పగాను
ఆవేళ సిరిదేవి అక్కకొమరక్క
కర్పూర విడెములు గంధకస్తూరి
తబుకుతో తాంబూళము తల్లితానిచ్చె
అందరికి పంచిపెట్టి ఆవులన్న
యపుడు
తాను విద్యము శాయక తలవొంచు
కొనెను
బాల కొమారుని చూచి భగ్గుమనె
గుండె
''నీవేల తలవొంచేవు? నీకేల తండ్రి?
కనుగొంటి నిన్నునే కాటమరాజ!
వినిపించు మందపరిణామము విన్న
పము యేమి?
జయమొ అపజయమొ చెప్పవలెగాక
జయము చాలదని నీవు చింతింపు
చున్నావా?''

58. సేవలు

## కాటమరాజు తనకును తన చెల్లెలు పాపనూకకును జరిగిన అన్యాయమును సిరిదేవితో చెప్పికొని దుఃఖించుట

తలయెత్తి నలనన్న తల్లివంక జూచి
తలుపులో శోకము తట్టు ముట్టాడి
"యేమి చెప్పుదు తల్లి యెరుగరా
మీరు?
అమ్మను యేమందు? అయితన్నను
యేమందు?
యరణప్పను యేమందు? తనకు
యవ్వరున్నారు?
పల్లికొండకు దూర పనియేమి తనకు
తమ్ముల దూరను ధర్మమా తనకు?
మమతల మణిషివి మగువరో నీవు
నీకులేని దయ మరి వకరి కేల?
తమ తండ్రి పెద్దన్న పెద్దమా
దేవులు
కళ్యాణము పోయి కాలము చేసిరి
సాహసమంతులు దామసాని మామలు
చెల్లిరి
[illegible]గూటి చెల్లిరి యాదవులు
కొంత
అమ్మగుండాన హతమయ్యె నాకు
అమ్మకూడి చెల్లిరి యాదవ సతులు
కన్న తల్లిదండ్రులు కళ్యాణాన
చెల్లగాను
దాపు దండె లేరు తమకు ఎవ్వరు లేరు

పెందోట ముద్దమ్మను మాయమ్మ
పేర్మితో బిలిచి
నామారె నీవని నమ్మికె పుచ్చుకొని
అప్పుడు ముద్దమ్మ అమ్మతో ననెను:
కన్న కుమారుడు నాకు కాటమరాజు
తమ్ముడు రాఘవన్నతోటి దయ
వుంచి పెంతు
వస్తుభూషణాలు వారి కిద్దరికి
యిచ్చెను నమ్మవే యింతి సాక్షిగను
చెంచీతిరాలి కన్న చిన్ని పాపమ్మను
పెంచి యీడేర్తును పేర్మి తోడుతను
ఆరీతి కళ్యాణాన అరమర లేక
యెండ నీడ కన్ను యెరగక తాము
కళ్యాణాన పెరుగంగ కరకంఠ
మూర్తి
వల్లవుల భక్తిసన్న వచ్చె అక్కడికి
చెంచీతరాలు చెల్లెలు పాపనాక్షి
కుందెన వారిపాలు కుప్పించి పోసి
వల్లవులవారి వంశము యెత్తి
పాపమ్మ
పాపమ్మ గోత్రాలు పాడంగ వినియు
తిరుమందులవారి వంశము తీర్చి
పాడంగ

భారి గోత్రాలు పాడంగ భత్తినన్న వినెను
పల్లికొండ మొదలైన పందుముల వార్ని
చెల్లెలు పాడంగ శంకరుడు వినెను
శివగురువు విని చిరునవ్వు నవ్వె
ముద్దుచెల్లెలు మాటలకు ముచ్చట పడెను:
'మా పెదతండ్రి పెద్దమాదేవులు
దేశముగాని దేశములకు వొచ్చి
అన్నదమ్ముల బాసి హతమైరియాడ
కాటమరాజును కాంత పాపనాక్షి
కలిగినారని విని కరుణతో నేను
వచ్చినాను యిక్కడికి వల్లవుల గురువ
పెంచి యీదేర్చినవారు పేర్మితో మీరు
చెల్లెలిని తమ్ముని చేపట్టినారు
అన్నదమ్ముల పుత్రులము అరమర లేదు'
అందుకు ముద్దమ్మ అప్పుడిట్లనెను:
'మాటయేమి యెరుగక కాడితిరి
మాయలవారు మీరు
భూములు తిరిగేటివారి మాటలు
భూటకముగాక
వారు యాదవుల సోమవంశము వారు
కుంభిళ్ళపై పెద్దరాజు కూలుట
యెరుగవు
అంబ్యార వీథి రాగ అమ్మ పెద్దమ్మ
గుండానకు పయనమై గురుతులు
చెప్పె
మాకు వప్పగించి మడిసి రిక్కడను
నావారు అంటివి నమ్మికగాను
నీవారు అయితేను నిజమేది మాకు?
ముద్దులు మారేళ్ళ మారు పలుకవలెను
పెద్దన్న పెద్దమాదేవులు పేర్వేడ వలెను
రాతి నందులెల్ల రంకె వెయ్యవలెను
కలుకోడి కుయ్యవలె కలుపొన్న
పుయ్యవలెను
సాక్షుల పలికించి సభ మెస్తేగాని
రాచబాలల యివ్వరాదయ్య మాకు'
అమ్మ ముద్దమ్మ ఆడిన మాటలకు
అన్న భత్తినన్న ఆలాగె యనుచు
సోమవారమునాడు సోమశేఖరుని
నమ్మి పూదించెను నరనాథగురువు
అమ్మ గుండాన అన్న భత్తినన్న
పువ్వులువేయించి పూర్వము దెలిపి
ఆరిన గుండాన అగ్ని పుట్టించి
వారిని బలికించి వారివారె యనిరి
ముద్దుల బలికించి మారెళ్ళ బలికించి
గంగురావుల చేత ఖద్దు అనిపించి
పాడిగ గూర్చున్న ప్రజల మెప్పించి
సభవారి నందరిని సయ్యనిపించి
పల్లకీలు అందలాలు పదార్థములు
వస్తువ వాహనములు వరుసతో
యిచ్చిరి

గెలసి తెచ్చి గురువు మమ్మ్మ కడ
గెలిపించి
కన్నవారిని అన్నమమ్మ్మ కలిపెనని
వుంటిమి
అయ్యవంక వారిని గలిస్తిమి
అయ్యయో తల్లి
కన్నవారిని గలిస్తిమి కడతేర
దాయెను
భక్తినన్న యేమి చేసు భ్రమ యింతె
కాక?
హరిగురువు పల్లికొండ అతదేమి
చేసు?
పూర్వకృతము యీరీతి పూనివుండ
గాను
అందరు కాపురాలు శాయంగ చెల్లిలికి
అంత్రత మేడలాయ
పశువుల మందలో పట్నంబు తనది
యెద్దులగూడి తనకు యెతి పట్న
మాయ
బసువన్న పాదానకు తన శిరస్సుకు
ప్రతిలంకె చేస్తి
అయ్యనాటి ధేన్వాలు అడివి పాలాయ
నీనాటి ధేన్వాలు నిమిషమున చెల్లె
పెద్దలనాటి ధేన్వాలు బెళమున చెల్లె
గుండ్లమల పాలాయ గోవులు కొన్ని
యత్రమలకు కోలుపెట్టితి యెద్దుల
కొన్ని
బాలు బాలున అరిచ బసువమ్మద్ర
యెద్దులు
పాలుట్ల మల పాలాయ పాడేవులూను
శంఖుచక్రాల చక్కని యెద్దులు
అంక వొంకముగ దరికొని అవి
కొన్ని చెల్లెను
దిక్కుదెస లేకుండ ధేన్వాలు చెల్లె
వాగుల పాలాయ వడి లేగతల్లులు
కొలుకుల కన్నీరు గొదకొని
కురియంగ
చిలుకలవంటి ధేన్వాలు చెల్లెనో తల్లి
హంసల వంటి ధేన్వాలు అడివి
పాలాయ
సమిశను నేటితో సరిపుచ్చుకువెను
నీకు సొద లేదాయ నిజమంతురాల
నందుల వంటివి న్రావులు చెల్లె
దగ దూపలు లేక తల్లడింపుమను
పొగలుచు ధేన్వాలు పోయెను తల్లి
మన్నె కవులావుల వెన్నులు వెండి
కన్నీరు బెట్టుచు గడగడ వణుకుచు
సొగెమ్మ సగిలేటి వెంట సత్యమ
సురుభులు
వొర్లుచు అవి కొన్ని వొరిగెనోయెమ్మ
యెన్ని చెల్లిన తన కేమియని వుంటివే?
మందలావులు చెల్లంగ మంచిదే తల్లి?
పశువుల చెల్లెను పగడిరెనా తల్లి?
యెద్దులు చెల్లంగ యేటికని వుంటివే.
గురాలు వున్నంగ న్రావులు
యాలనని
సిరిగల ధేన్వాలు చెల్లగా నీవు
సిరి నమ్మి వుంటివే చల్లంబో తల్లి?

అందలాల నమ్మి మందలు మరచి
చిందైన ధేన్వాలు నీకు చిత్తాన లేవు
పల్లకీలు నమ్మి పశువుల మరచి
మూడుకోట్ల ధనము ముందర
వున్నంగ
కోడేలు చల్లంగ నీకు గుండె లెటు
నిలిచ
యేడుకోట్ల ధనము నీయెదుట
వున్నంగ
అడివిన వున్న రాజుమీద అణికె
లేదాయ
పల్లెలు పట్నాలు బంధువుల జూచుక
రాజ్యభూములు జూచుక రాజువను
జూచుక
ఆవులన్నను తలవని ఆత్మ వున్నాదె?
నీ కొమాళ్ల జూచితే నిండెనా మనసు?
మామీద నీకెట్లు మర్లు లేదాయ?
అల్లుండ్లు ఆడబిడ్డలు అల్లుదామెర
బలుగము
బావకొమారుదను తల్లి పగవాడను
గాను
మేలు కీడు యెరుగవు మేలటే తల్లి?
ఆవులమంద పరిణామము అదియేమి
యెరుగవు
మరచితివె కవులావుల మా తల్లి నీవు
యారాలి బిడ్డలముగాగ యెరపరికము
చేస్తివి
పేరు నడుగవైతివి పెద్దరాజు
సుతుడని
తోడికోడలు కొడుకునుగాగ దొరియ
చూచితివి
యెందు బోయ మామీద దయ యేటికి
లేదు
పగవార మైతిమి పరామరిక లేదు
సిరిదేవి మామీద చిత్తంబు లేదు
న్యాయమా నీకు న్రావుల నూక?
కోమలి నీవు గన్న కొడుకులైతేను
ప్రేమవుంచి వారిని పెంపు
సేయుదువు
పుణ్యాంగన నీవు గన్న పుత్రులైతేను
మన్నించక తమవలె మరిచేవ తల్లి?
రాజ్యభూములు యేలించి రాజుల
శాయక
యలనాగ నీవు యాల యేరుచేసేవు?
తల్లిదండ్రులు వుంటే తమకు యిలాగ
కారడవి పట్నము కట్టుదురా తల్లి?''
పల్లికొండను దూరి బాంధువుల దూరి
తమ్ముని అయితన్నను తల్లిని దూరి
ఆందోళన పడంగ ఆవులన్నను చూచి
రఘుపతి పల్లికొండ రాజును జూచి
సిరిగల పుత్తమరాజు చింతింపసాగె
కొలుకుల కన్నీరు కొమరగిరి
దెచ్చెను
యరణప్ప దుఃఖించె యాదవ సత్తులు

నలసన్న దూరంగ నారసాలాయ
బావకొమారుని మాటలకు భగ్గుమనె
గుండె

శివశివా యని మ్రొక్కి సిరిదేవి లేచి
రాజు చరణములకు వొరిగె రామ
రామా యనుచు

## సిరిదేవి కాటమరాజును ఓదార్చుట

"నా తండ్రి! నా యన్న! నా బావ
పుత్ర!
మాకు అధిపతిని మా యయ్య! నీవు
యేటికి రావోయి వో యెట్టి కొమార!
నీ తమ్ముడు యేలే భూమి నీవు
యేలుట గాద ?
పాలకీలు అందలాలు పాదార్థ మెల్ల
నీ సొమ్ములు గావ పుత్ర :
నీకేల చింత ?
బావలు మదురులు యింత బలుగము
గలిగి
తండ్రి! నీ యంతేసి తమ్ములు గలిగి
అప్పలు చెల్లెండ్లు గలిగి అత్మలు
గలిగి
నీ వెనుకవారే నీ తమ్ము లెల్లాను
నీ సొమ్ములు అవి, నీ కేల చింత ?
పెద్దల నాటి ధేన్వలు సస్తె పెయ్య
లుండీ?
పదివేల గోవుల పాలు బోసి పెంతు
తలావులు బోతేను తరుపుల వీదేరు
అయ్యలనాటి ధేన్వలు హతమైపోతేను
నీనాటి ధేన్వలు నిలిచీని తండ్రి!
వెన్న బెట్టి పెంతును వెలలేని పెయ్యల

పసిమసి యన్నారు ప్రళాపము
యాల
కోటి లేగలు పది కోట్లగా బెంతు
పచ్చిక లేకుండ పద్దలావుల యీడేర్తు
కూడు బెట్టి పెంతును కోటానకోట్లు
ము త్తరపి లేగల ముత్యాల వలెను
యెత్తుపద్ద గోవుల యీడేర్చి పెంతు
ఆనాటి ధేన్వలకు అనుమాన పడకు
వెయ్యిలక్షలుగా పెంతును
యీడేర్తును తండ్రి!
మానాటి ధేన్వలకు మగువ మంచిది
కాదు
యీనువడిగా మందలు యీడేర్తు
తండ్రి!
పోయిన అవులు పొంకము గావు
యిమ్మడి ముమ్మడిగా యీడేర్చి
పెంతును
యేడుకోట్ల ధనము యేటికి తనుకు ?
గొబ్బున యీడేర్తు కోడెలావులను
మూడుకోట్ల అర్థము ముంగిట గలిగి
తాత ముత్తాతల తండ్రుల పగలు
పుత్తముడ! సాధిస్తివి వొక్కడివె
ఛాలు

నాయన్న! పెద్దన్న నలసన్న! వినుమ!
పాయక నీవు కులపగలను దీర్చ
ఆ ఘనమే చాలు అర్థము యాల ?
పశువుల చావు ఘనము? నీ ప్రాణమే
ఘనము
మీరు లెస్సై వున్నది మాకును చాలు
బాగై వున్నది భాగ్యంబు గలిగె
వో అయ్య! నా మాట వొక్కటి
వినుమ
అక్కడ చెల్లిన గోకులముకు
అనుమాన పడకు
సాగెమ్మ సగిలేటివెంట చక్కగా నీవు
మిగిలిన గోవులు మీరు యాదవులు
సగిలేటి వెంటను చాలుగ నీవు
యేటివెంట దిగిన యంతలోపల
ఝటుకున నూటొక్క నూతులు
త్రవ్వింతు తండ్రి!
నూతులకు యాతాలు నూటొకటి
బెట్టి
బాగుగా నూటొక్క బావులు
త్రవ్వింతు
గోవులు నీళ్ళుత్రాగ గోలంకులు
త్రవ్వింతు

అగణితముగ నేను అరఘడియలోను
కుంటలు వేయింతు కోపము నీకేల?
తాల్మితో చెరువులు తగువేట్ల
వేయింతు
కరువులు కట్టలు కట్టుకయుండిన
నీకు బుద్ధులు చెప్ప నిన్నుపోషింప
నాకు తరముగాదు ననుగన్న తండ్రి!
వేగమే నీవును యెద్దు లావులను
కడువేగ నంపించు కాటమరాజ!
తెప్పలుగ ఆసింతు చొప్పవాములును
తీగెవాములు బెట్టి ధేన్వుల యీడేర్తు
కొండల పొడవున కొర్ర కుప్పలును
వున్న ఆవుల బెంచి తండలు సేతు
అమరగ సేయింతు ఆవులకు
యెద్దులకు
అల్లికె చొప్పవాములు అరిసె
గోవులకు
తమిదె వాములు బెట్టింతు తరము
గాకుండ
కోరిన గడ్డిమోపులు కోసి తెప్పించి
గబటార్ల చాతను ఘట్టి వాములు
పెట్టింతు"

## కాటమరాజు దక్షిణాదికి పోవుటకై తల్లి సిరిదేవి దీవెనలు కోరుట

ఆమ్మాడు మాటలకు అదిరిపడె రాజు
కోపము పట్టలేక కొంకక తల్లికై
చూచి :

"నన్నావుల సిరిదేవి! నాతల్లి వినవె!
యెరగని మాటలు యేటి కాడితివి ?
సాగెమ్మన సగిలేటి చాలుగా నీవు

నూతులు త్రవ్వించేసని నుడివి వితల్లి!
సాగెమ్మ సగిలేట నూతుల బండలు
బడును
యీ నూతుల యాతాలు యిరుసులు
యిరుగును
బావులలో చట్టుబండలు బడును
చెరువులు కుంటలన్ని చెట్లలో గలాసు
పెట్టిన వాములు పెనుచిచ్చు పడును
వాములన్నియు కాలి వట్టి కరువవును
అంత ఆగర్వ్వ యిటువిను తల్లి!
పట్టరాదు చేకుచెట్లు బయలుగ మేపితి
యేపెకు వొరుగు యెడలేక మేపిత
గోడుగోడు మనంగ గుణహూడ
వాస్తిని
ఆ యావుల పంచితము అగె నీరులాయ
దవ్వగాదు యిదిగో దక్షిణాది భూమిన
ఆవులకు మేపులు అనుమానము లేదు
దక్షిణాది బోసగిరి తలుపుక వచ్చి
పచ్చిపూరి కసువు పరిపూర్ణగాను
కంచి నెల్లూరి దనుక కదలేసి మేపులు
మంచి మేపులు గలవు మందలావులకు
నెలకు మూడు వరుషాలు నెల్లూర గలవు
గౌరీలు మేపులు గలవని చెప్పిరి
పాకనాటికి బలిజలు పైనమై పోవుచు
మాకు చెప్పిరి మేపులు మందలావులకు
పర భూములు తిరిగిన పంచపన్నె
ధేన్వులకు
బలిబెట్టక ఆవులకు బడిలికె తీరదు
కులగిరి పర్వతాలు తిరిగిన ఆవులకు
కుంభాలు పోయవలెను

కుంభాలు బొయ్యకగాని కూడదు తల్లి
ఆవులలో దొడ్డిగుడుపు ఆమనిగాను
భూములు దిరిగిన ఆవులకు భూతబలి
బెట్టవలెను
శక్తుల భుక్తుల చాలుననిపించి
కొండ భూతాలకు కోబలి బెట్టవలెను
ఆశించి వచ్చె మన ఆవుల వెంట
ఆవులకు జయము అందాక లేదు
అమ్మ కొమరగిరి ఆవులలోను
దొడ్డిగుడుపు సేయుడు దొరకొని
మీరు
చల్లంగ మందలో సరిపాలు బెట్టి
తల్లి సిరిదేవి మాకు దక్షిణాది బంపు
కోబలి అనిపించు గోవులలోను
అమ్మా! దక్షిణాదికి అంపుమా నేడు
కొమరగిరి నీవు దొడ్డిగుడిపిన వెనుక
దీవించి శాసలు ధీరత వేసి
అడవుల పాకనాటికి అంపుమమ్మ
యిపుడె
అత్త దీవెనలును అమ్మ దీవెనలు
మర్త్యలోకమున యీ మాట నిలిచేసి!''
అమ్మాను కొమరగిరి ఆ మాటల
కపుడు
అమ్మలు గుచ్చినట్లు అభులు గుభు
లాయ
ఝుడుపు బుట్టి గుండె ఝల్లుమనగాను
కొడుకాడు మాటలకు గోరకలై నట్టి*
జీవము యిట్లను సిరిదేవి బలికె:

*ఘోరకలి అయినట్టి (?)

## సిరిదేవి పాకనాటిలోని పాతపగలు జ్ఞప్తికి తెచ్చి కాటమరాజును పోవలదనుట

''యిటువంటి మాటలు నీవు
యిట్లాడవచ్చున ?
కట్టడి దక్షిణాది పొమ్మన్న ఖర్మలు
యవ్వరు ?
పాకనాటికి పొమ్మన్న పాపకర్మలు
యవ్వరు?
వక్కనాటికి పాకనాడు వద్దోయి
కొడుక!
అరువుల పాకనాడు అయిరాదు తండ్రి!
నీకు యవ్వరు చెప్పిరి నీలవర్ణునక?
కంచి నెల్లూరి దనుక కదుల నీకేల?
మంచి పని కాదు నా మనవి ఒకటి
వినుమ!
దక్షిణ బోనగిరి తలవకు తండ్రి!
మచ్చరములు వచ్చిని మాధవ
వినుమ!
తర్లవద్దు దక్షిణాది మీన తండ్రి!
పగలు వున్నాయి
పోలురాజు పగ వున్నది పోవద్దు కొడుక!
వాలాయముగ పాకనాడు వద్దోయి
కొడుక!
పగభూపులకు బోయేది పంతంబు
గాదు
పగవారము గాదు యీ మాటలు
పలుక
మేనత్త వద్దనగ మేము వద్దనగ
మానుమా తలంపు మాతండ్రి నీవు!''
అమ్మాడు మాటలు అన్నియు వినియు
సమ్మతంబున కార్యసాహసంబునను
కాంతిగల చంద్రుండు కాటమరాజు
కాంతల మాటలు విని కపకప నవ్వె

## కులపగ తీర్తునని కాటమరాజు ప్రతిజ్ఞ చేయుట

''పశువుల మేపులు అడుగ వొస్తె
పగదెలుప మన్నాన?
పగదెలిపితివి నాకు పరిణామమాయె
చెప్పితివి గురుతులు సిరిదేవి యిఖను
మరచి వెరచి యుంటె మాకేమి కీర్తి?
మొగవారికి చెల్లున? మగువలకు
చెల్లునుగాక
కాంత సోముని పరమడిగె కాంత
పెద్దమ్మ

కొడుకును యిమ్మనెను కులపగలు
డీర్చ
తల్లి ప్రతిజ్ఞ నిలుప తగ వీరకీర్తి
కల్ల గాదు జగములో కానవొచ్చిని
పోయిన పగ మేము పొదలుగ చేసి
సాధించకుంటేను జన్మమా తల్లి?
ఆరిన పగలు అడుగుజాడ యెత్తు
కున్న

శూరుల సాధించని శూరత్వమేల?
వాలాయముగ దక్షిణాది వలగొని
పోదు''
తాముగ దంపమువంటి బలుగము
తల్లడింపుచును
తెగ కార్యపు మాటలు నలనన్న
తెగువతో నాడె

## పగభూములలో పశువుల మేపులు వలదని సిరిదేవి వారించుట

ఆవులన్న మాటలకు అంతట సిరిదేవి:
"అయిదుగురు మీ తండ్రులు హత
మైన వెనుక
అయిదుగురికి శిలమొదులు అన్నలార
మీరు
కలిగి కడతేరిరని కన్నుల జూస్తి
యిరువంద కలిగి యీడేరి గనుచు
మరి వెనకటి వార్తలు మరచి
యున్నాము
మరచిన మాటలు మర్మాటలు చేసి
కొరువులు యగదొయ్యకు కొమార
నీవు!
ఆరిన పగలకు అందరు హతమైనారు
బంధువులు చెల్లంగ బాలలున్నారు
బాలల పాశనాటి పాలు చేసేవ?
పెద్దలు చెల్లంగ పిల్లలున్నారు

పిల్లల పేరుపేరు పేరు లణచేవ?
యంమంచి ఆకుతీగె కొనసాగెనని
వుంటి
కొనసాగిన ఆకుతీగె కొనలు తుదిమెట్టి
రాజుల సంగడము పద్మరాఘవుడు
బట్టె
నాయుని సంగడనుబట్టి నట్టేట పుట్టి
ముంచితివి
పద్మనాయుడు నాయింటికి
పాపాత్ముడాయ
కాటమురాజు నాయింటికి కాలమృత్యు
వాయె
యఱ్ఱయ్య నాయింటికి యము
డయ్యేది యెరుగ
కోటి గోపాల్కులు దానవుల పగదీర్ప

చట్టివారి యర్రయ్య చలపట్టుట
యెరుగ
వల్లవుల తిరుమందులవారిని
పురికొల్పి
వల్లవుల మొగరాజ! వద్దయ్య! పగలు
నామాట వినవోయి ననుగన్న తండ్రి!
మారుభూములు మేప మానుమ తలంపు"

## కాటమరాజు సిరిదేవిని దొడ్డికుడుపు కోరుట

అనిన హాగ్రుడై ఆవులన్న బలికె:
"ఆడిన మాటలు ఆడకె అమ్మ
న్నుఅంపు దొడ్డిగుడిపి నగ్రావుల
నూక!"
దొడ్డిగుడుపుమన్న మాటకు దొరకొని
అడిలె
చెడ్డపని యిది యేమని చేతులు పిసికె
"వింటివే యరణప్ప యీ నలనన్న
మాటలు
యీ చెల పోట్లాయ యీ మాటలెల్ల
యలమంచి వోలురాజు యేలు
గాలమున
తామరదంపమైన తనయులు దాము
త్రుళ్ళుద్రూగుచునుండె తుదను
మీ తాత
దొడ్డి గుడుపుచేసె దొడ్డ రణమాయ
అయిన పుత్రులు అయిదుగురు వారు
అన్నల మొఖము తమ్ములు గానక
ఖండ్రెల కేర్పడిరి మిమ్ముగన్న
వారలును
మాకు పెదబావ మీకు పెదతండ్రి
శ్రీవైష్ణుల వెనుక వేసుక చిందుభళ్ళా
శాలిని
చంపి తా చెల్లిరని చెప్పగా వినవ?
యెంటనే మీ పినతండ్రి యరనూక
రాజు
దొడ్డిగుడిపిన మరునాడు తొలగక
కొమార!
మరునాడు మందపోటు బోయ మరచి
రందరును
యరభూపతిరాజుతో యరనూకరాజు
పీరుడౌట యెరుగవా వినుము కొమార!
వారి నాటినుండి మన వంశంబువారు
మంద దొడ్డిగుడుపు మరచియున్నాము
దొడ్డిగుడుపు చేస్తేను దొడ్డరణమాయ
మందగుడుపు చేస్తేను మరి లెస్స గాదు
వకర్నాటికి దొడ్డిగుడుపు వప్పదు
తండ్రి!"
సిరిదేవి మాటలకు చిరునవ్వు నవ్వి-
"మరువవే యిన్నాళ్ళదనుక మహా
లెస్సాయె తల్లి!
యవ్వరిని దొడ్డిగుడుపు యేమిచేసింది?

కారుణము యిటువలె కానున్నదని
పలికె
వారివలె బెదరించి వద్దనకు అమ్మ!
అందరి బెదరు నాకు అటు చెప్పకు తల్లి!
వారినాటి దొడ్డిగుడుపు వమ్మకుంటేను
నానాటి దొడ్డిగుడుపు నాకు వొమ్ము
నమ్మ
అయివొచ్చు దొడ్డిగుడుపు ఆవులకు
తనకు
అయిరాదని మాటలు అమ్మ వద్దనకు
నీవు దొడ్డిగుడుపు నీపాదాల సాక్షి
తలచిన పని నీవు తల్లి వద్దనకు
హరిగురుపు కన్నను అధికులు లేరు
హరిగురుపు పాదమాన అడ్డమాడితి
వైన!
బసువన్న పాదమాన! బత్తుని ఆన!
ఆదివిష్ణు బొల్లావు పాదమాన!
హరిహరుల యాన!
ఆదివారంఅమావాస్య నేటికి అయిదు
దినము లున్నది
ఆదివారం దొడ్డిగుడుపు ఆవులలోను
పట్నములో వారు మీరు పైనమైవచ్చి
మెండైన దొడ్డిగుడుపు బెట్టు మేదిని
లోన యెరుగ"
అమ్మ సిరిదేవి అత్త కొమరక్క
మారు మాటాడక మంచిదని వొప్పిరి
ప్రజలు మంచిదనిరి పల్లికొండ వొప్పె
రాజుమాటలకు అయితమరాజు
తావొప్పె

"నలనన్న! యిఖ నొకటి నామాట
వినుమ!
నీ తమ్ముడు యేలే ధనముకొండ
ద్వారావతి బోలు
అమరావతి అయివున్నది
అన్నదమ్ములకు
పల్లికొండ మీరు పట్నము కేగి
యేర్పాటుగా పట్నము యేలు
మా తండ్రి!"
తల్లి ఆడుమాటలకు తలవంచుకొనెను:
"చెల్లంటో వో తల్లి! చెప్పితివి అవునె
అవులే తల్లులు అంబోతులే తండ్రులు
తొలుచూరి పెయ్యలు తోడబుట్టుకలు
మలుచూరి పెయ్యలు మాకు చెల్లెండ్లు
అవులలో అబోతు కోడెలు
అన్నదమ్ములును
నాయకమైన ఆడవారు నాకు సైతోడు
వారకాంతలు నాకు వావి చెల్లెండ్లు
దొనకొండ ఆడవారు తోడబుట్టువారు
యెరిగి యెరుగకను యేటి కాడితివి తల్లి?
అమ్మ! నిను చూస్తి అత్తను చూస్తి
పందుముల యరణప్పను జూస్తి
భ్రామిత బాళ
కడమవారిని చూడ కారణము లేదు
యీడ వున్నవారిని యిందరిని
చూస్తి
పరస్త్రీలను చూడ పట్నము చూడ
పరమ పతివ్రత ప్రాప్తంబు లేదు"

అమ్మ నూకాంబికె అన్నము
భోంచేయమనెను
సజ్జనాల మేడకు సయ్యన నేతెంచి
చిరిసాప బరిపించి సిరిదేవి యపుడు
పల్లికొండ నడుమ బావమరుదులు
యిరుమేర
ఆవులన్న నడుమ అన్నదమ్ములు
యిరుమేర
పంచపదార్థము పరుగ భోంచేసి
వారంత యెంగిళ్ళు వార్చించిరపుడు
కమ్మని గంధము కస్తూరి నలది
పచ్చిపోకలు మంచి పండుటాకులును
యిచ్చగా మరుదులకు యిచ్చె పల్లికొండ.
రాజును గొలచిన రాచ పరివారముకు
షడ్రుచులు చేసి సంతోషపరచి
అయితన్న పల్లికొండ అప్ప కొమరప్ప
"పద్మనాయుని మహాప్రాణ
ప్రదముగాను
ఆశీర్వాదముచేసి అడిగితి నసుమి
యర్రయ్య చట్టివారి యర్రయ్య
యాదవుల
అందరిని అడిగితిమని చెప్పు
అవులన్న నీవు"

## కాటమరాజు మందకు తిరిగి వచ్చుట

ఆవులన్న లేచి అమ్మకు
మ్రొక్కెను.
తెరమరుగునవున్న దెస రాజుమ్రొక్కె
అతివేగ పల్లకీలు అందలాలు యెక్కిరి
ఆడత్రీల కందరికి అతివేగ చెప్పెను
దొడ్డిగుడుపుకు రమ్మనెను దొరల
అయితన్నను
పశుపతిరాజు హనుమంతుని గమిని
పట్నము వెళ్ళి
రఘుపతి మొదలైన రాజు లందరికి
వుండుమని వొప్పగించి వుర్వీశ్వరుడు
గదిలె.
మూపటివేళను మంద కేతెంచె
కలవల రాజువొలె కత్రీడు రాగ
గుడారులో కొలువున్నవారు గొబ్బున లేచి
పద్మనాయుడు హంసల పాలకీ
యెక్కెను
యర్రయ్య చట్టివారి యర్రయ్య వేగ
సరస పల్లకీలు యెక్కి సంతోషముసను
గోపాల్కులు అతని పాలకులెల్ల
యాదవరాజుకు యెదురుగా వొచ్చిరి.
పద్మనాయుడు రాజు పల్లకి దిగిరి.
కమిగిట చేర్చుకొని కడుసంతసించి
"దిండు విడువనని నాతో దీమసము
బలికి
అడితప్పవైతివి యాదవరాజ!

యాడ మరుచునో యని యెదురు
చూచుచున్నాను...
యీక్షణంబున వాస్తివి యిలనాథ
ఘనుడ!
మాయన్న పల్లికొండ మరిది
అయితన్న
తమ్ముడు పుత్తన్న ధనము
కొండవారు
ముమ్మయ్య పోచయ్య ముద్దు
బాలలను
తమ వదిన యరణప్ప తల్లి
కొమరక్క
నలినాక్షి మాయత్త నర్రావుల నూక
చెల్లెండ్లు వదినెలు క్షేమాన వున్నారు?''
''పట్నములో వున్న ప్రజలు
మనవారు
అందరు క్షేమ"మని అవులన్న జెప్పె.
ఆదివారమునాడు అమావాస్యనాడు
వారు దొడ్డిగుడుప వచ్చేరు మరిది.
అవులమంద పరిణామము అతి
వేగిరమున
వినిపించు రాఘవః యిక్కడివార్త?"
అవులమంద పరిణామము అంతయు
చెప్పెను
చెప్పెను పద్మనాయుడు శ్రవణా
నందముగను
వారు జలకములాడి సుద్ది వస్త్రముల గట్టి
పాయక అందరు అన్నము భోంచేసి
మంచి గంధము నలడి మల్లెలపాన్పున
ఆరాత్రి నిద్రించిరి అటు తెల్లవారె.

## కాటమరాజు ఆలమందతో ఆరవెల్లికి పయనమగుట

వల్లవులరాజు యిరువంకలనుండి
తిరుమందులెల్ల కొలువుదీర్చి వుండిరి
అర్థవీడు చేరె రాజు ఆ మరునాడు
అర్థవీడు గంగకు ఆప్రొద్దు బోనాలు
పోలురాజు పట్నమని పొసగంగ నపుడు
పోలురాజు కాణయాచి యని కీర్తించి
పొగిడి
చెలరేగి కంభాన చేరిరందరును
సత్యముగల నరసింహాలకు
సమారాధన సేయించి
వల్లవులు తిరుమందులు వరుసతో కదిలిరి
మంగలకుంటకు మరునాడు వచ్చిరి
రంగైన యెలుకొండ రాయుని చూచి
శ్రీవైష్ణవుల పిలిచి తిల్లకలు యెత్తించె
స్వామికి సమారాధన చేయించె రాజు
చేరెను వాగెమడుగు శీఘ్రంబుగాను
ఆరవెల్లి మిట్టల అవులన్న నిలచె
ఆరవెల్లిన గుడార్లు అతివేగ యెత్తించె
సకల దిగ్విజయుండు సార్వభౌముండు
నయముతో యెత్తించె నామగిరి గుడారు

పర(గ)దళముల వైరు
పద్మరాఘవుడు
సిరిగలిగి యెత్తించె చిలుకల గుడారు
రాజు తమ్ముడు యర్రయ్య రాఘవుని
సరస
తేజమున యెత్తించె దివ్వమౌ
గుడారు
చలము విక్రమశాలి సార్వభౌముండు
చెలువమౌ గుడారు చల్లవారి
యర్రయ్య
యేరువరాజు గోకుళము నడుమ
పేరాళముగను
ఆరవల్లిన యెత్తించె గుడార్లు
ఆవుల నడుమ
భూములు తిరిగిన ఆవులకు భూతబలి
బెట్టవలెనని

తన మరిది రాఘవునితో తలపోత చేసె
తల్లిని పల్లికొండను తమ్ముడై తన్నను
వల్లవుల తిరుమందుల వరుస యాదవుల
కావట కలకూళ్ళ గంప జాతరలు
భావింప రమ్మని పంపె కాలరిని
కాలరి మారెన్న కదిలివచ్చె వేగ
ఆలాగు పల్లికొండ అయితన్న అమ్మకు
"ఆరవెల్లిన మందలు ఆవులన్న నిలచె
ఆరవెల్లి దొడ్డికుడుపు ఆవులన్న
రమ్మనెను"
కలిత సంతోష విక్రాంతులై పొంగి
అలివేణి చాటించె ఆరవెల్లి దొడ్డికుడుపు
పేరుపేరు చాటించి పిలువుమని చెప్పె
పనిబడి చాటించె ప్రజలెల్ల వినగ

## సిరిదేవి యాదవ కాంతలతో కలిసి ఆరవెల్లి దొడ్డికుడుపున కేతెంచుట

పట్నాన కలయట్టి బాంధవు
లందరును
ఆరువేల వల్లవులు యేడువేల
తిరుమందులు
ఆరవెల్లికి బోనాలు అయత్త పరచి
వీరు వారనకుండ యింటింట బోనాలు
పారు గొల్ల బోనాలు పట్టించుకోని

తీర్థము నడిచినట్లు తిరుమందులు కదిలేరు
అర్థిమందారులు ఆ వల్లవులు కదిలేరు
కొమరగిరి సిరిదేవి గోపకాంతలును
కడువేగ రథమెక్కి కదిలె కొమరక్క
రథము బండియెక్కె రమణి సిరిదేవి
బుద్ధిమంతులు పురజనులంత కదిలిరి
వర క్షత్రియ శూద్ర వైశ్యులు కదిలేరు

వరుసతో పద్దెనిమిది వర్ణములవారు
కుంకుమ బండ్లు కూతుళ్ళు యెక్కిరి
శంఖుదార వారు జనపతులు కదిలేరు
కాంతలు మొదలైన కాటమన్న
నల గంగ
సంతోషమున కదిలేరు సకల
యాదవులు
కూతుళ్ళు పల్లకీలు కోడండ్లు
అందలాలు
అందముగ ఎక్కిరి సుందరీమణులు
ఆవులన్న వీరగంగ అలివేణి కరి
యావులనాగ
ఆవేళ అందలాలు అతివేగ యెక్కిరి
భట్టావుల సూర ముమ్మయ్య
చినమల్లి
దండిగా అందలాలు తగువేడ్క
యెక్కిరి
పాలకీలు నడిపించె పణతి అగుమంచి
అలవేణి పాలకీ నరస వారి
అందలాలు కదిలె
అగుమంచి వీరగంగ అతివె
లందరును
మక్కువతో కదిలేరు మానినీ
మణులు
వింతగా అరవెల్లికి వేడుక తోన
పంతమున బోనాలు పారుగొర్ల
కదుపులు

కొల్లారు బండ్లూను కొందరు యెక్కిరి
చల్లని మామిళ్ళ సరసకు వచ్చిరి
పల్లికొండ వల్లవులు పైనమై వచ్చిరి
వల్లవులు తిరుమందులు వైనవైనాన
బోనాలు ముందర పుణ్యకాంతలు వెనుక
అటువెనుక అయితన్న ఆ పల్లికొండ
పాపమేడ వొరుసుక పాలకీలు కదిలె
నిపుణుతముగ పొంగెను నెలత తాజాది
వేకుళపడి పాపమ్మ వెలవెల బోయ
భేరీ మృదంగములు పెద్ద ఢమామీలు
బూరకొమ్ములు చాల ఘోరు కొలువంగ
ఆరూఢి మ్రోవంగ ఆ రాజు కదిలె
కరియావుల రాజు ఘనుడు వల్లభన్న
సురరాజు ముమ్మయ్య శూరుడు
పోచయ్య
పరగంగ వేడుక*ల బాగుగా యెక్కిరి
వల్లవులు తిరుమందులు వరుస
యాదవులు
పల్లికొండ వుభయ పార్శ్వముల కదిలిరి
పల్లకి లందలాలు బారు లేర్పడిరి
మల్లెల వాగును మరివేగ దాటి
నూటొక్క కొమాళ్ళు నెర మంత్రి
వరులు
నాటక సాలలు నడిపించిరపుడు
గుడిపాడు దాటి కూడ పారిరంత
పడిగెలు గొడుగులు పట్టించుకొని
బడుగుల రాజు తమ బలగము చూచి

* ఢడికళ

వేడుక విలసిల్ల యెదురుగా వచ్చి
పల్లికొండను జూచి భయభక్తితోను
అల్లంతట దండములు అర్పించె రాజు
పల్లికొండ అంతట పల్లకీ దిగెను
వల్లవుల కాటమరాజును వాంఛ
నెత్తుకొనెను
తండ్రితోడ బుట్టిన అత్తకు దండంబు
బెట్టెను
తమ తల్లి సిరిదేవికి తగు వేడ్కతో
మ్రొక్కె
అన్నల దమ్ముల అతిగారవించె
తమ్ములందరు రాజుకు దండంబు
బెట్టిరి

కమ్మక పాపను కానక చింతించె
పల్లికొండను ముందర బెట్టుక
బాంధవులు తాము
గుడారు లోపలికి గొబ్బున వొచ్చిరి
పట్టు తివాశీలు పరిపించి రపుడు
పట్టభద్రులు చుట్టు పల్లికొండ నడుమ
కాల పేష్య మడిగెను కాటభూపాలు
యిల బుద్ధిమంతుల దీవించి పల్లికొండ
"చిత్రభాను సంవత్సర చైత్రదశమి
శనివారమునాడు
ఆ రాత్రివేగిన ఆవులలో పబ్బము"

## దొడ్డికుడుపు వేడుకలు

ఆ రాత్రి వైభవము అపుడు గావించి
పర్వతపు యెదుళ్ళ పందిటి కింద
సరసమై వన్నెలు సమకూర్చిరంత
పంచవన్నెల ముగ్గుపలకల వేసి
పంచమ వాయిద్యములు బలువడి
మ్రోవంగ
కంభము కాకర్ల కల(ప)దెప్పించి
సంభవ బియ్యము పోలు చాలుగా
బోసి
పాలవెల్లి శృంగారించిరి పందిళ్ళకింద
ఫల పుష్పజాతులు పందిళ్ళు గట్టి
గంగనురుగులు చక్కెరాలు
గజనిమ్మపండ్లు

శృంగారముగాను చెరుకుల గోలలును
గురుపోతు జల్లులు కుసుమ పువ్వులును
ఆరిట్టి నిమ్మకాయలు ఆ పనసపండ్లు
బోనాలకు వీరగంధము బూసి
ధన కనక వస్తువులు ధర్మ దేవతకు
బెట్టిరి
బసువ దేవుని దెచ్చి ప్రార్థన చేసిరి
పరగంగ భూమిపై పవళించెనపుడు
అంతట బసువన్నకు హారతులు బాడి
భూతబలి గావించి భూమి శక్తులకు
తుష్టి గావించెను శ్రిష్టిలోపలను
వరికూటి కుంభాలు వటా వృక్షముల
పొడువు

కొర్రకూటి కుంభాలు గోపురముల
పొడువు
కూడును దీపములు గుళ్ళ పొడువునను
కడవల పానకం కల కూర వంటకం
పూర్ణితము గావలెనని వానర
భూతాలకు
నంజుడు కుంభాలు నల్ల
కొండలవలెను
అప్పించె భూతాలకు అర్పితమాయ
"వొప్పిరి భూతమృగములు వో
రాజ ! వినుమ
జంగిలి దైవములలో యెంగిలికి
వొప్ప
గంగను యాదవులకు శివగంగను తాను
తమ్ముడు పోతురాజు అమ్మ భవాని
కడనుండి వూరికే కాబట్ట"దనుచు
దక్షణ పారుగొర్ల దామెన యాటలు
నరికిరి
దక్షణంగా రక్తము తర్లి యేరులై పారె
దామెన యాటల తరుచుగా నరికిరి
ధీమంతుడు వేయించె దిబ్బెల పొడుగు
పొర్లెను నెత్తురు పోయె దక్షణము
మర్లవారి గంగ మనసందు వొచ్చి
అలివేణి సిరిదేవి అక్క కొమరక్క
కాలహేష్య మడుగ కదిలి వొచ్చిరపుడు

## యాదవకాంతలు బసవన్నను పూజించుట

అడ్డ తెరల చాటున అతివె లందరును
పడ్డలావుల చూచి బసువన్నను
వేడిరి
"పశుపతివాహన ! పార్వతి
ప్రియుడ !
పశుపతి మందను ప్రబలితివి నీవు
వసుధ జనులెల్లరు వందనము
జేసేరు
రసికుడ బసువన్న ! రక్షించు నీవు
జయ మంగళము నీకు జగదీశ్వరుండ!
కరకంఠు వాహనమై ఘనముగా
మందలో
కరమర్థి పుట్టిన ఘనుడవు నీవు
పరగంగ మమ్మేలు పంపాద్రిదేవ !
సరసమౌ బసువన్న స్వామివి నీవు
బసువ పురాణమున బాగుగ వున్న
సచరాచరంబు సరగంగ నీవు
పచరింప పంపాద్రి బాగుగ మాపాల
సుచిరముగ వున్నట్టి శృంగార మూర్తి !
నీలకంఠునికిని నిజ వాహనంబైన
సలలిత సత్కీర్తి పరగంగ నిలచి
కాలుదువ్వి రంకె కణేలున వెయ్య
నీ యెదుట నిల్వను నెవ్వరికి తరము ?
షరగంగ మందలో భక్తితో బుద్ధి

సరసముగ జగతిలో సరగంగ నిష్ఠ
పరగంగ మాపాల భక్తి వున్నట్టి
వారుసతో నివ్వాళి వోస్వామి నీకు !"
కొమరగిరి సిరిదేవి కోడండ్లు అగుమంచి
మమతతో బసువన్నకు మంగళ
హారతులు ఇచ్చిరి

## సిరిదేవి వీరుల ఆయుధములను పూజింపగా అపశకున మగుట

పొలతి వీరగంధము పోలుగా బోసి
అలివేణి తెమ్మనె మూడు
ఆయుధంబులును
కాటమరాజు చేతిఘంటల కుంతళము
పాటించి రాఘవుడు పట్టిన విల్లు
వీరన్న చేతిధి పిడుగుల కత్తి
ఆరూఢి ఆ కత్తి అర్చించి నిలిపె
మొగతన విక్రమ మాధవు కుంతళము
ఘంటల కుంతళము యేడు ఘనముగ
మ్రోగంగ
వింటికి కోపంబు విరసము బూని
విల్లు వెక్కబెట్టిన విధమున నపుడు
అల్లె కోపుయెక్కి ఆర్భాటము లాయ
పట్టుకత్తి శేషువు పడగెత్తినట్లు
పడిగె మ్రోతలు మ్రోగ ఫణిజిహ్వవలెను
సిరిదేవి కొమరక్క చిన్నబోయిరంత
యరణప్ప అగుమంచి యేణాక్షి వీరగంగ
గడగడ వణికెను కాంత సిరిదేవి
కొడుకు కాటమరాజును జూచి
గొబ్బున బలికె:
"కొడుకా! నలనన్న! వో కుల
దీపఘనుడ!
కడువేగ దక్షిణాది కయ్యంబు గలుగు
పుడమిలో దక్షిణాది పోవద్దు కొడుక!
కణగిరి మలలకు కవులావులమేపు"

## పోచయ్య కాటమరాజుతో పంతములాడుట

అంతట మరివొచ్చి ఆవులన్న బలికె:
"వింతగా ముమ్మయ్య! వినుము
పోచయ్య!
ముమ్మయ్య ధేన్వల ముందుగా
బిలువు!
కమ్మక కుంభాలకు కదిలెను ధేన్వలు
పురుష వరేణ్యుండు పోచయ్యను
పిలువమనిరి
కరమర్థ పిలిచిన కదిలి రావాయ
తిరుమలధుల ధేన్వలు దీకొని నిలిచె

రణముకు యేగుదామని రాకుండె
ధేన్వలు
ముమ్మయ్య ధేన్వలు ముందుగా వొచ్చె
వేడుక పోచయ్య ధేన్వలు యేగవాయ
నపుడు
ఆడబిడ్డ కొమరుండు అడంగి
రేకులవాడు
ఆడిన మాటకు ఆడకట్టు గట్టె

"మామా కాటమరాజ ! మాట
వినవయ్య !
కూటికి మీధేన్వలు కుంటాల కాశించె
పోటుకని మా ధేన్వలు పోక నిలిచినవి
పతి వీరకంకణం పగతులమీద
భూతేశ వినవయ్య భూపతి నలనన్న!
అప్పుడు నా ధేన్వలు ఆవులన్న వినుమ
కుప్పలుగా బొడుచ గురుతు నామాట"

## వీరగంగ తన భర్తయగు కాటమరాజును చూడబోవగా బసవన్న అడ్డువచ్చుట

అప్పుడు అగుమంచితో ఆవులన్న
వీరగంగ
"సంతోషమున వినవమ్మ సఖియ
వకమాట
నెలమితో వకమాట వినవమ్మ
మీయన్న నీలవర్ణుండు
కళలు చక్కనివాడు కాంతి
చంద్రుండు
సురరాజు భోగము సొంపైనవాడు
హరిమూర్తి కీర్తితో అమరినవాడు
చూపు చక్కని రాజును చూతును
అక్కన్న!"
చూతునని అడ్డతెర సుదతి తానెత్తి
అడు చూట బోయిన ఆడ
హరమూర్తి

బసువన్న తటకున అడ్డము తా వచ్చి
నిలచె
వచ్చిన బసువన్నను వామాక్షి చూచి
"అసమాన ఘనుడ! వో అవుతార
మూర్తి!
అడ్డముగ నిలుచుంటి అక్క
వీరగంగకు"
యేతట్టు చూచినా యెడము లేకుండ
అడ్డముగ నిలుచున్న దొడ్డ దుఃఖాన
చెడ్డకోపముతో గంగ శపియింపసాగె:
"అయ్యయ్యో బసువన్న
ఆత్మమందు నేను
యెన్నో వరాలకు విభు జూతుననుచు
కన్నుల పండుగాగా నమ్మియుంటి

హసమాన ఘనుడు నీవు అత్య
గట్టుకొంటివి
దోషము అంటీని తొలగవే బసువన్న
పతులకు సతులకు యెడబాపినవారికి
అత్యంత పాపమని అనుకోంగ
యెరుగవ?
సత్యమంతుడవు బసువన్న! చాటు
దియ్యవయ్యా!

సతి పతులనుచు బ్రహ్మ వ్రాశగాక
కండ్లచూపు లేవాయ గవిరీశ! యెన్నటికి"
యెన్ని విధముల వేడిన యిట్లట్లు కదలక
యున్నంత యాగంగ యోగి కోపమున్
కన్నుల వుదుకము కవగొని కురియంగ
చిన్నబోయి గంగ శిరసెత్తి చూచి
దీకొని బసువన్నను తిట్టంగ సాగె:

## వీరగంగ బసవన్నను శపించుట

"పాకశాసనుడని భక్తితో కొలిచితిమి
పాపపు బసువన్న పాలేట నిన్ను
కోపాన గోరకుల కుమ్మదురు నిన్ను
పతులకు సతుల కెడ బాపిన దోషము
తుపాకి వేట్ల చాత నీమేతు తునియలై
పోను
కొప్పుకొండ నున్న కోరలపులి నిన్ను
తప్పక పట్టేని తథ్యమీ మాట!"
అని యిట్లు దూరి తాను అలమట
పడెను
ఆవులన్న రాఘవునితో అప్పుడి
ట్లనియె:
"దోయని బసువన్నను తోలినవారు

యవ్వరు రాఘవా యెరిగింపు" మనిన
ఆమాటకు రాఘవుండాడెను మాట
"మాయక్క వీరగంగ" యని
పలికె నాయుడు
"సమర నిశ్శంకుడ! చక్కని మరిది!
అతివె మాటలు కాబోలు అంబులై తాకె
సంతతముగ పరమటి సముద్రాన
దోయని తోలిన దోషంబు బాయ
పరుమటి సముద్రాన పాయకనేను
బసువన్న పాదము భక్తితో గడిగి
దశకంతు మిత్రులు ధనకోట నిలచి
ధనకోట వస్తువలు తగువేగ దెత్తు
ధనకోట స్నానంబు తప్పక సేతు"

## విందు కుడుపులు

అని రాఘవునికి చెప్పు అటు సమ
యాన

వణితెను కాంచి వల్లవులకు తిరుమం
ధులకు

యనయంగ అన్నము వేర్పాటుగాను
పరమాన్నము నెయ్యి బహుపిండి
వంటలు
కాయకూరలు మంచికలుపు నేతులును
కాటమరాజు కంపటీలందరికి
కోటి గోపాల్కులు కోటి యగ్ని
ఫలము
పల్లికొండ సరుస పట్టభద్రుడు నల
నన్న
కాటమరాజు సరుస కరియావులరాజు
కరియావులరాజు ఘనుని యా సరుస
అరివీర భట్టావులరాజు అయితన్న
యిద్దరు
పల్లికొండ వలపట పద్మరాఘవుడు
అల్లి రాఘవుని సరుస అవుబాషి
యఱ్ఱయ్య
పౌసగ ఆతని సరుస పుత్తమరాజు
అతివేగ చట్టివారి యఱ్ఱయ్య సరుస
కోటి గోపాల్కులు గోపాలవరులు

నూటొక్క కొమాళ్ళు నూరు బంతులు
సాగి
అరిటాకు నైతెలు అందరికి వేసి
పరువడి జలుకము పరుగ చిలికించి
పరమాన్నము హేముపళ్ళెమున దెచ్చి
పరపూర్తి రాజాన్నము బంతుల
వొడ్డించి
కజ్జాయము పిండివంటలు కడియపుటట్లు
అర్జప్రతాపంబు అరిటిపండ్లూను
వడపప్పు కూరలు వడియాల పులుసు
చాల రసావళ్ళు చక్కెర తేనె
అచ్చ ఆవుల నెయ్యి అమృతము
మొదులు
యెచ్చుగా వొడ్డించ అనియేక రుచులు
అన్నము భోంచేసి అన్నదమ్ములును
పన్నీట చెై గడిగి బాగాలు అంది
అన్నలు దమ్ములు ఆత్మవర్గంబు
వుండగా సిందేవి వొకమాట చెప్పె

## కష్ట సుఖములను కలసి అనుభవించుడని సిరిదేవి కొడుకులకు హితబోధ చేయుట

"వినవోయి కాటమా! వీరహంకార!
అన్నదమ్ముల కొమాళ్ళు అందరు
మీరు
ఆవులమందలో అరిటిపండు దొరికిన

దొనకొండ లోపల దొండపండు దొరికిన
తగ అన్నదమ్ములు సరిగాను
భోంచెయ్యుడి"
చెప్పిన తల్లికి చెయ్యెత్తి మ్రొక్కి

అప్పుడు తల్లితో ఆడె నొకమాట
"ఆడినమాట తప్పకు అమ్మ సిరిదేవి!
నీవు జెప్పినట్లు నిజముగా మేము
అలాగె భోంచేసేము అమ్మరో మేము
మరువవొద్దు యీమాట మనసులో వుంచు
తప్పదు యీమాట తల్లి సిరిదేవి''
అనిచెప్పి అమ్మకు అస్తముల్ మొగిచి
పల్లికొండ కాటమరాజు పద్మరాఘవుడు
వల్లభన్న కరియావుల రాజు వరుస నైతన్న
యర్రయ్య చట్టివారి యర్రయ్య ముమ్మయ్య
గుడారులోపల కొలువుదీర్చివుండిరి.
కామరక్క సిరిదేవి గోత్రాల పెద్దలు
చక్కని గోపకాంతులు సఖియలు కొలువుండిరి
బంధుజన చింతామణిపట్టభద్రులందరూ
అందరు వొచ్చిరి అమ్మకొలువుకును
పల్లికొండకు సాష్టాంగము చేశ పశుపతిరాజు
తల్లి కామారునికి తర్లుమని శలవిచ్చె
పాకనాటి దేశము పదమనె తల్లి
"కాట భూపాల! యో కాంతి చంద్రుండ!
మగతన పక్రమార్క! మాట వినవయ్య!
పాకనాటికి బోపలె పశువులకు మేపులు గలిగిని
పాకనాడు బోయిన ఫలమేమి లేదు
వైశాఖ మాసానకు వరుషాలు గురిసీని
ఆరునెలలదాక అర్ధంకి పొదిలిని
పరువతం మలల పచ్చికసువు గలిగీని
అయితన్న యేలు భూమి ఆవులన్న యేలుమ
అయితన్నను పంపుతూ ఆవులవెంట
ధనముకొండ మేలుకీడు తగ అవుల మంద
పాళ్ళుబంచుకొని పరగ భోంచెయ్యేడి
అయిదుగురు వక్కతల్లికి అన్నదమ్ములుగార!
అయిదుగురు కొమాళ్ళార! వో అన్నలార!
యరగడ్డపాటి కురుక్షేత్రము వమ్మదు మనకు
యరగడ్డ చెరుకూరు యేగి మేపె మీ తండ్రి
ముక్కంటి పోలురాజు మునుపు పోట్లాడిరి
ముక్కంటి పుత్రులు ముగ్గురు వున్నారు
జలోధీరుండు గుణోధీరుండు మనోధీరుండు
మనోధీరుండనే మండలాపతికి
వారు పుత్రులు వీరు వరుస సిద్ధిరాజులు
పూరియు నీళ్ళకు పుల్లలకు భూమి
యిచ్చిన పగ యీదు యెర సిద్ధిరాజు
వచ్చును కార్యము వలదయ కొమర!''
''కార్యంబు నాకేల వో కన్నతల్లి!
కార్యంబు వల్లను శవులావుల మేపుడు

వలసిన పుల్లరి వప్పించి వారికి
ఆవుల కదుపుల మేపుదు అమ్మ
సిరిదేవి"
"నామాట మీరితివి నాకన్న
కొమార !
ప్రేమ నే బెంచిన పిన్నలు గారు
కాటమేశ్వరుడవు కావు కరకంతుడవు
గాని
కోటివేలు చేసు కొడుక నీ బుద్ధి
పట్టభద్రుని సంగడము పట్ట
భద్రుండు
పట్టిన ప్రెగ్గ్న పంత మీదేర్చు
రఘుపతి నీవు లక్షుమన్న
యర్రయ్య
ఖగపతి నీవు కాపాడు నీ తమ్ముని
చట్టివారి యర్రయ్య సకల
యాదవులు
కలిగిన సంగడము కట్టడ నీకు
ఆ లక్ష యాదవులు ఆడగల
కంపటము
యిలాపతి తిరుమందులు యిల్లద నీకు
ప్రేమ నే బెంచిన బీరన్న వున్నాడు
ఆ మాట చెప్పెద ఆత్మందు వుంచు
పద్మ రాఘవుని విల్లు పట్టిన కుంతళము
కొదుమ సింహము బీరన్న కొంగవాలు
కత్తి
ముప్పిరి గొనె ఆయుధాలు మూడు
పోలు నడుమ
ముప్పిరి గొని శేషవు మ్రోతల చాత
పట్టు గత్తి కాదు ఫణిరాజు కాని
పట్టభద్రుడు తమ్ముని పంపకు పనులకు
బాటపరువులకు కొంచెపు కార్యములకు
నాయుడు బీరన్న నమ్మిన బంటు
నిను మొయ్య కార్యము నే ధరించినాను
ఘనమైన యేనుగ గజాలమీదికి పంపు
పట్టభద్రుని తమ్ముని పదివేలకైన
పట్టభద్ర : దాచుమి పట్టుచీరె
వజ్రమువలెను
యేరువరాజు పగవారు యెదిరించు వేళ
రహుతుల మొన మీద అంపుమ
బీరన్నను"

## సిరిదేవి కాటమరాజును దీవించుట

"అందరికి పీద్య మిచ్చి అమ్మ
సిరిదేవి
కందువ దీవించవే వో కన్నతల్లి !
తల్లివి నీవు ధర్మదేవతవు
తల్లి దీవెన ఆచంద్ర తారార్కమై
యుండు"
"సురరాజు భోగంబు సురపతి బోలి
కరిరాజు గలిగిన ఘనకీర్తి గలిగి

పరమ పావనుడైన భగీరథుని పోలి
పరగిన శ్రీరామభద్రుని పోలి
కాళింగు మర్దించి కంసు రక్కసులు
యిల వధియించిన బాల కృష్ణుని బోలి
ముగురు మూర్తుల కాదిమూలమై యుండు
ముగురు మూర్తుల కరుణ ముద మొప్ప గలుగు
అమ్మదీవెనలు ఆచంద్రతార్కా మయ్యాని
కమ్మిక సాయమై కాపాడ వలెను''

## యాదవకాంతలు తిరిగి ధనకొండకు వచ్చుట

తల్లికి పల్లికొండకు కాటమరాజు దండంబు బెట్టె
కల్లరి రిపురాజు ఘనుడు యర్రయ్య
తల్లికి అత్తకు ధరణీశుకు విన్నవించె
వల్లవ కులపతి వైనాన నపుడు
కరియావుల రాజును ఘనుడు భట్టావుల రాజును
కరుణతో నలనన్న కమిగిట జేర్చె
అయితన్నకు ముమ్మన్నకు ఆవులన్న యపుడు
వయినాన విడియములు వారికి ఇచ్చె
మేనత్తకు దండమెట్ట మెలత దీవించె
అనువుగా యరణప్పకు అగుమంచికి చెప్పి
కోడండ్ల అందరిని గొబ్బున దీవించి
నడలి పుత్తమరాజు నాచకూళ్ళ నాయుడు
పట్టభద్రునికి దండ ప్రణామంబు చేసి
పుత్తమరాజు ఆ సత్యవ్రతుండు
పుత్తమాంగన పాప వున్నదని చెప్పె
పల్లికొండ ముందర పద్మిణీకాంతలు నడిచిరి
వల్లవ కాంతలు వచ్చిరి ధనముకొండకు

## కాటమరాజు పాకనాటికి పయనమగుట

*వ్రిష సంవత్సర వెలయ కార్తీక
పసమించు శుక్ల పంచమినాడు
నయమైన గుడార్లు నంది డెక్కెలు
ముసి దాటి గోకుళము మునగపాట నిలిచె
పొసగ కాటమరాజు పొదిలెను నిలచె
నమ్మగల కంపటము నాలక్ష గోపాల్కులు
నిమ్మలాదుని సేవించి నిలచి ప్రార్థించి
''కైలాస గిరివాస! ఘన తపోద్ధార!

---

*వృష

యేనుగ చర్మంబు యిల పచ్చడంబు
ఘనము గావించిన కల్యాణమూర్తి
బెబ్బులి చర్మంబు పెంపొంద నికు
అబ్బురముగ దోవతి అతివేగ చేసి
నిబ్బరమైనట్టి నీలకంఠుండ''
సద్భక్తితో వేడి జనపతిరాజు
''చంద్రశేఖరుండ! జడల శేఖరుండ!
పొందగ నన్ను బ్రోవు పుణ్యచరిత్ర!''
ప్రణుతించి వేడియు ప్రార్థన చేసి
ఘనముగ సేవించి కానుకలిచ్చి
సంగడావులు జనపతి సకలయాదవులు
మరిది రాఘవుండు మందలావులును
మద్రిపూడి నూకలాంబను
మాధవుడు సేవించి
అద్దంకిపల్లె చేరి అప్రొద్దు నిలచి
అద్దంకిపల్లె కొండల ఆవుల మేపి
యెద్దుల యర్రయ్య యదువంశ ఘనులు
ప్రొద్దున కదిలించె బొమ్మిరెడ్డి పల్లెను
కనిగిరి తిప్పల కవులావులు నిలచి
కొన్నిధేన్వులు కోపలేట నిలచె

## బసవన్నను పులి పట్టుట

కోరలపులి అపుడు గోవుల నడుమ
అప్పుడు బసువన్నను హాగ్రుడై
చూచె
కోపమున కాం..................
చెలువుడౌ బసువన్నను చారలపులి
చూచె
నీలకంఠుడు బసువన్న నెరికోప
మూన
కాలుదువ్వి పులిని చూచి ఝల్లున
రంకెవైచె
రాహు సూర్యునిమీద రాగడిల్లినట్లు
సాహసంబున బసువన్నను సారల
పులి బట్టె
కరి మకరంబులు కదిసి పోరినట్లు
కరి శ్రీహరివేడి కలసి వేడినట్లు
రాజు రాఘవుని జూచి రయమున బలికె:
''అజుడైన మందను అరికట్ట లేడు
సాటిగల బసువన్న సవెరంకె వైచె
పోటు రంకెలకు భూమి భోరుకొలు
వంగ
కోపలేట ఘాతగా కూతలు అయ్యె''

## పద్మరాఘవుడు పులితో నిరాయుధుడై పోరి వధించుట

యేపున కదిలి వచ్చె యెలమి
రాఘవుడు
పులియును బసువన్న పోరాటము చూచి
కాలాగ్ని రుద్రుడై ఘనరాజు మరిది:



''వింట వేసినైన వీరశూరులు మెచ్చరు
కఠారని వేసినైన కాటమరాజు మెచ్చును''
మెండుగా కేతువ చంద్రుని మ్రింగిన రీతి
రెండు దాలువలు బట్టి రేఖ మొయ్యకుండ
రొమ్మున కాలు వేసి రోకట గ్రుమ్మినట్లు
చెనికి నెత్తురు గ్రమ్మి చీరె కాలువలు.
పద్మనాయుని వెనుక బసువన్న వొచ్చె
పద్మరాఘవుండు పరాక్రమశాల
నిమ్మళించి బసువన్న నిలిచి అంతటను
కోపుస నార్చిరి గోపాల వరులు
మద్దిమానుయెక్కిన పెద్ద కోతులును
వొద్దికతో చెట్లు పరుసతో దిగెను
రాఘవుండు రాజాయ రాజు తా వొచ్చి
రాఘవున్న తావుకు రయమున వొచ్చి
పులియు రాఘవుండు పొదనీడన వుండంగ
''పులిని చంపితివి రాఘవ! భుజశక్తి మెరసి
కరి మకరంబులు కదిసి పోరంగ
కరి రాజును విడిపించిన ఘనుడవె రాఘవ!
పశువుల నడుమను పులి బసువన్నను బట్టెను
విశదంబుగా బట్టి విడిపించితీవి''

## కాటమరాజు పాలేటి వద్ద నిలుచుట

కంద విడియమిచ్చి కంపటీలు తాను
అందముగ పాలేట ఆవులన్ని నిలిచె
శ్రీశ్రీశ్రీ శ్రీరాములూ నీవే కలవు.



# గంగ - కాటమరాజు తరకవాదము
## ('గంగ తర్కము' లేక 'పాలేటి కథ')

### పాలేటి ఒడ్డున కాటమరాజు ఆలమంద నిలుచుట

శ్రీ రాజాధిరాజు రాజు కాటమరాజు
దక్షిణాదికి ఆవుల తర్లించుకోని
బలువైన సంపదలు పాలేట నిలచె
ఆరు నూరు గుత్తికవ్వము
యాదవులు కొందరు
తరమునాటి గోకులము వచ్చి
తాళ్ళూరు మిట్టల దిగెను
బొల్లావు యెద్దులు భోగావతి నర్రలు
వచ్చి
బొమ్మిరెడ్డిపల్లి మిట్టల వారి
బోదావులు దిగెను
జలతారు గుడార్లు జగజంపు
గొడుగులు
చల్ల వారు యేగురు సాహస ఘనులు
సకలాంబర భూషిత సంపన్నులై
వచ్చి
చాకిరేల మిట్ట వారి సలుగుటావులు
దిగెను
కొమరొప్ప రణభేరి గోకులము
గొబ్బున వచ్చి
కోపులేటిరేవున బసుపన్న గొబ్బున
నిలచె
ఆరువేల గోపాలకులు అందెలు
యెద్దులు

ఆలవలపాటి రేవున వారి అందలాలు
దిగెను
మూడువేల లేగలు ఆవులు
ముద్దుమోము లేగలు
ముస్తీదులై వచ్చి మందపాటి రేవున
ముచ్చావులు[1] దిగెను
పర్ల వారి ఆవులు మట్టిపెయ్య
మొదలుగాను
లింగాల కొండకు యెదురుగా
నిలచెను యెద్దులు
మారుట రుద్రుండు బీరన్న మంచి
గోసంగులు
చెలువుండు చెన్నయ్య తేజంబు మించి
మంగొలపాటి రేవున వారి మందలు
దిగెను
గొల్లలు కంపటీలు గొడుగులు
పడిగెలు గొనుచువచ్చి
కోటపాటి రేవున వారి కొట్టడీలు దిగెను
మిగిలిన నర్రావులు మీరిన యెద్దులు
తిరుమందులవారి ధేనువలు దివ్యదృష్టి
ఎరిగి
యేరుదాట నివ్వదని గంగయెద్దులు
తలపోసెను

---

1. 'ముచ్చటావులు' అని పాఠాంతరము

ఆంధ్ర కొంఢ్ర మేకగాపు వారి
ఆవులు సించెను
పద్మనాయుడు ఆవులన్న భరతుడు
యెర్రయ్య[2]

గంగను పరాభరిశింతామని అని
పలికి రందరును:

## గంగ కాటమరాజును అడ్డగించుట

ధర ప్రసిద్ధుడు కాటమరాజు
దక్షిణాది భూములకు
కొలువుకు పోనివ్వనని గంగ
కోపంబుతోను
యేటి సాల్పున ముస్తీదులు యెత్తిన
గుడార్లు
ఆవులు యెద్దులు యాదవులనందరిని
పాలేట ఆవులను పరుగులు
పారింతునని
గంగ తా పయనమై గ్రక్కున వచ్చి
సురులు మెచ్చిన పషిణిపుట్టము
చిలుకల రపికె (దొడిగి)
వీరసేన కొప్పు వీపున జడలు
ఆడుచు రాగాను అందెల పాదమున
చెంపల వీరగంధము చెవుల
బవిరెలును
కమ్మలు కుంటెనలు కంఠమున తీగె
సరస గుత్తిపూసలు గురుగింజ
దండలు
తీర్చిన భూషణములు తిలకంబు
నొసట
హస్తమున పషిణీ కంకణము
అమిరిన సొమ్ములు

ఆయుధములు చేతుల అమరంగబట్టి
పాలేరు కోపుశేరు పచ్చగడ్డలు నెరమోసి
యెగవుబికె వుదకము యెద్దులకు
దాటరాదాయ
కాలువలకు యగదట్టి కవులావులకు
దాటరాదాయ
పాలేరు వుతకము కొండలకు
యెగబారెను
పన్నెండు రేవుల శక్తుల గంగ
పదిలముగ నుంచి
భాగీరథి గుంటికి ప్రార్థించి వచ్చి
కూర్మంబు భేదిల్ల గంగ గుంటిపై కెక్కి
కూతలు వేసెను వోంకారములు చేసెను
ఆవులు బెదిరెను అట్టిట్టు చెదిరె
భాగీరథి పలుకులకు బలువైన శక్తులు
బలవంతముగా బట్టిరి పాలేటివెంటను
పేరుగల భూతములు పెద్ద బొబ్బలు
పెట్టుచు
తలలు విరబోసుక ఆవుల తరమంగ
సాగెను
యేకజడల గంగ యేటినడుమున నుండి
ఆవుల కదలకుండా అరికట్టెనంత

2. 'పద్మనాయుడు అంగజుడు పరగ యర్రయ్య' పాఠాంతరము

నిర్బంధముచేసెను గంగ నిలిపెను
మందలను
నీరజనేత్రితో రాజు నిలచి తా బలికెను

## కాటమరాజు గంగకు భుక్తిపెట్టననుట

"వాలాయముగ వుత్తరాదిన
వరుషములు లేక
ఆవుల మేపులకొరకు అంగణరో!
మేము
పచ్చికసవు పాకనాట పశువులకు
కద్దనుచు
చేకొని గొరీలు చెప్పిరి మాతోను
ఆమాట మీదగాను ఆవులు మేపున్ను
గడి దాటిపోగాను కాటిపాప వలెను
కన్నులు ద్రిప్పేవు గంతులు వేసేవు
ఆటవారి పడుచువలె ఆడేవు సారికె
కొండ సెలలె కాని గొప్పనదులు
గావు
యీపాటి నదులకు విచారము లేదు
ఆరూఢిగా నా యావులు వక్క
జంగని దాటిని
సలుగుపెద్దులకు జంగాలకు చాలదు
చౌకళించి దాటను
పయ్యావులు వురిమి నిను బాటలుగా
ద్రొక్కేని

పాతేరు నీ కింత పరుగు లేమిటికి?
తెలియక ఆవుల ముందర తెరచాటు
ప్రెతిమె వలెను
పరువులు బారంగ నిన్ను పరామరి
శింపవలెను
మందలు మగ్రిపూడి తర్లి పాకేట
కొలేరకము మేరగాను గోకులము
దిగెను
పారంగ నిన్ను మేము పరామరిశించ
వస్తిమి
రద్దిశాయక నీపేరు రవణి మాతోను
చెప్పవే మాకును తెలిసి వుండేను
యవ్వరి బాలవు నీవు యేమిటికి
వున్నావు?
యవ్వరు నిన్ను గొలిచిరి యెరిగింపు
మాతోను
రేపటి మజిలీకి తర్లవలె మేము
మిన్నేరు చాయను తర్లవే కడకు
ఆశకు తిరిగితివైన అంగణరో నీకు
కించిత్తు భుక్తి పెట్టవనెను కాటమరాజు

## గంగ తనకు మ్రొక్కి పూజించుమనుట

కాటమరాజు కొలపనంటే గంగ
కవకవ నవ్వె
ఆరూఢిగా కదసి ఆడె నొక మాట

"యేమోయి నలనన్న ! యెరుగవు నా మహిమ
ఆవులు యెద్దులు యాదవులు నీవు
పాకనాటి దేశముకు పాలేరు దాటి
గడచి పొయ్యేనని వున్నావ కాటమ రాజ ?
యదుకులాధీశ్వర! యేటి కే బుద్ధి ?
నాతోటి మచ్చరము న్యాయమా నీకు ?
గొంటుతనము బొయ్యేది గౌరగాదు నీకు
ఘట్టిగా పూజించవోయి కవులావుల వెంటను
కాపాడుక వచ్చేను ఘడి దాటనిచ్చేను
భుక్తి పెట్టక పొయ్యేద నంటివి భూనాథ ! నిన్ను
కొండలకు వురికింతు గోపాలకుల నెల్ల
దూడల ఆవుల తూలాడ చేతును
చేపట్టి పూజించవోయి చెలగి పాలేట
అర్థించి దక్షిణాదికి నీ యావుల యెంటను
పాయక వచ్చేను పశుపతి రాజ !
భాగీరథి మాటలకు పశుపతి రాజు
కిసిసి యా గంగతో కేరుచు పలికె
"పలు'గొంటు మాటలు ప్రగ్యాలాడేవు
కలకంఠిరో భుక్తి కావలసిన దానవైతే
అరవెల్లి కుంభాలకు అరుదెంచు వేగ
నీవంటి శక్తులకు నిఖిలంబులోను
పప్పును కూరలు పాయసాన్నములు
కుప్పతెప్పలుగా బెట్టి వచ్చినాము కోమలిరో ! పోవె
అగ్గడ వేతెంచి ఆరగించవలెగాక
కోపలేటను నిలచి కొలవమంటేను
సారెకు భుక్తి పెట్టను శక్తిరో పోవె"

## గంగ కాటమరాజును దక్షిణాదికి పోనివ్వననుట

పెద్ద భూపతి సుతుని జూచి గంగ పెళపెళ నార్చి
ఆదిశక్తి కదసి అప్పుడిట్లనియె :
"యదువంశము రాజ ! యెమ్మె నీ కేల ?
చేరి పూజించవోయి చెలగి పాలేట
సద్దు శాయక పోతివైన సరసుడ సలనన్న !
ఆపద పుట్టింతు నీ ఆవులకు నెల్ల
కరుగదు నీ మనసు కాటమరాజ !
కొసరక నీ ఆవుల నేను కోపలేట ఘుంతు
సంగతిగా నాతోటి చలము నీకు వద్దు
బుద్ధిమంతుడవైతే పూజించు నన్ను
అడగ వలసిన వస్తువలు నా చేత అడిగి పుచ్చుకోవలెగాక
కంటు చేసుకుంటివైన కాటమరాజు
సరసముగ దక్షిణాదికి తర్లి పోనివ్వ"

## కాటమరాజు గంగను తిరిగి పొమ్మనుట

బల్లిదుడు కాటమరాజు గంగతో
పరగ నిట్లనియె :
''కత్తి బట్టుక చేత కనకశూలంబు
బిత్తరి పోవె నీ బింకాలు మాని
పుల్లయెద్దు మట్టియెద్దు పురహరుడు
బసవన్న
కల్లరి కోడెలు గంగమైలావులు
కలకంఠిరో కానవు గర్వించినావు
దేవతులు నామందకు జడదారయెద్దులు
కుర్రలు నర్రలు గుజ్జారి తరుపులు
వాసిగల కన్నెకలు వారి నర్రావులు
వీరన్న వరమున బిరుదు గోసంగులు
అరిదాసుడు చెన్నయ్య అచ్యుతుని
బంటు
ద్రిష్టింప తరముఁగాదు దిగ్గజముల
వంటివారు
పద్మనాయుడు యర్రయ్య బలిమి
గలవారు
వామాక్షిరో యెరుగవా వారిని గెలువ
ధీమసమున యంతటి ధీరులున్నారు?
అరుపరు[1] యాదవులు అంబుధి
మంద
బాల పాయము నీరూపు పడుచవు
నీవు
పోగునూళ్ళమారి ! పోగుల దుండి !
పసపూత చెంపల పల్లజడలు
దూలంగ
జగడము నీకు చెల్లదు జరగవే మళ్ళి"

## గంగ ఆలమందపై సేసలు చల్లగా ఆవులు అల్లకల్లోలమగుట

భాషించి కాటమరాజును పాలేరు
దాటకుండ
నేర్పుతో వొచ్చి గంగరేవుల అరికట్టి
పచ్చని పీరసేస పశువులపై జల్లె
గద్దించి యెద్దుల గడిదాట దరిమెను
ఆర్భాటములకు మందలు హల్లి
కల్లోలమాయెను
కుదరక ఆవులు గుంపులు గూడెను
అరిమొన గట్టుక అర్లుయెత్తి చూచెను
మందనడుమను నిలిచి మరియు
నిట్లనియె
'నా మహిమ గంటివా నలనన్న నీవు?
యే రీతి నున్నవో యెద్దులావులును ?
ఆ రీతి నిన్ను జుట్టేది అనుమానము
గాదు
గొప్ప కొంచె మెరుగవు గోకులాధీశ!

1. 'అపార' పాఠాంతరము

కావరపు మాటలు కల్లలాడేవు
అబద్ధ మాడేది అదియెంత మాత్రము
నిబద్ధిగా పూజించవోయి నీకు నిష్ఠ
జూపేను'
అసుర సంహారిని జూచి రాజు
అప్పున నవ్వి
భానుతేజమూర్తితో పలికె నొకమాట
"యెరుకవారి పడుచవో
యలనాగ నీవు ?
బుట్ట నెత్తిన బెట్టుక బూటకము
జూపేవు
ఆర్భాటము శాయకు మందలో
ఆవులు ద్రొక్కేని
కత్తి ఝుళిపించేవు కన్నులు ద్రిప్పేవు
కరకంఠుడు నా మందలో ఘనుడు
బసవన్న
ప్రత్యక్షమై వున్నాడు పదరక నాతోను
యేటిపెంటను పరువులు యేటికి నీకు?
సాటిగా నాతోటి చలము నీకు వద్దు
బట్టావులు ద్రొక్కేని భాగీరథి
పోవమ్మ[4]
కుందనపు బొమ్మవలె కులకేవు సారెకు
పాలేట నిలచి నీవు బాధశించేవు
సెలగోల సింహాలు చేపట్టరు నిన్ను
భూమండలిలో పోవె భుక్తి నీకు
పెట్టను"

## గంగ తన మహిమలు చెప్పుట

భూనాథు మాటలకు గంగ భోరున
పలికె
"వినవోయి కాటరాజు! వివరంబుగాను
సందడని పొయ్యేటి శక్తినిగాను
చెన్ను మీరగ పూజలు నీచేత
చేయించుకొందు
వాద కాట్లాటలు వద్దోయి నాతోను
బింకాలు మిక్కిలి నీ బిగువు లెల్ల గంటి
బసువన్న సాటిగా పలికితివి నాతోను
ఆ మాట యెరుగుదును ఆవులన్న నేను
మరుగుదెల్పి చెప్పేది మాటవాసి గాదు
గుట్టున వుండవోయి గుణవిశాలుండ!
మూడు లోకములు నేను ముక్కంటి
నేను
వనయంత్రములు[5] నేను వాక్కున నేను
జప సంధ్యలును నేను జగములు నేను
తీర్థనిధులు నేను దిశలెల్ల నేను
ఆకాశమందు నేను అమరులు నేను
యిన్ని రూపులు తనవి యీశ్వరుడు
యెరుగును
అవుతారాల కన్న యెచ్చు యాదవ
రాజ!
కోరి పూజలు చాయవోయి
కానసాగనిత్తును"

---

4, 'పారబో వేగ' పాఠాంతరము 5. 'వననేత్రముల'

## కాటమరాజు ఆడశక్తికి మ్రొక్కననుట

గంగాడు మాటలకు కల్యాణమహీపతి
నిలచి యా శక్తితో నిమ్మళాన బలికె
"మాయమారి మాటలేల మగువరో
నీకు ?
మునుపటి వార్తలు మూలమైన
మాటలు
ఆడితివి నాతోను అంగనరో నీవు
వల్లవుల వారి చేతి పూజలు వప్పినా
నంటివి
సంతోషమాయను సఖియరో మాకు
మళ్ళవే దొనకొండకు మందవెళ్ళి నీవు
పల్లెకొండ పెద్దలు పట్నాన వున్నారు
నందుల సిరిదేవి నాతి అగుమంచి
పొందుగా పూజలు పొలతు లందరును
కొలిచేరు మ్రొక్కేరు గొర్రెల గోసేరు
ఆడశక్తి పూజలు అరమర లేక
అందుకోవలెగాక ఆడవారి చేత
ఆవుల మంద పూజలు అరవవు నీకు
యాదవులు కోపించేరు ఆవులు
ద్రొక్కేని
తియ్యె బెల్లి మాటలు తిరిగి పోవమ్మ!
అక్కజముగా నీకు హస్తములెత్తి
మ్రొక్కను"
రాజు మ్రొక్కనన్నప్పుడు మొల్ల
సుగంధి
తిమురుచు కాటమరాజుతో గంగ
తిరుగ నిట్లనియె
"నాకేటికి మ్రొక్కవు నరనాథ నీవు?
మ్రొక్కితే బ్రతికేవు మోసములేదు
యల్లప్పుడు బస్వన్నకు యాల
మ్రొక్కుచున్నావు?
బస్వన్న యవ్వరు ? పశువులెల్ల
యవ్వరు ?
కంట చుట్టు యవరు? కరకంఠుని
శిరసందు యవరు ?
యీ జగమెల్ల యవరు ?
జనులెల్ల యవరు ?
పూరి నీళ్లు యవరు? భూదేవి యవరు?
వురుము మెరుపు యవరు ?
వుదకమెల్ల యవరు:
ఆయుధమందు యవరు ?
ఆత్మలో యవరు ?
పాల సముద్ర మందెవరు?
అతని పాదమందు యవరు ?
సలువు తెలుపు యవరు ?
లంకయందు యవరు ?
యే బాట జూచినా యెడల సందులేదు
వుడదలవాని పుక్కిట వుందు నేనెపుడు
కుడి భుజమందు[6] చూసుకోరాజ !
కూర్మము మోసియున్నాను

---

6. 'భాగమందు' పాఠ.

యెడమ భాగమందు[7] చూసుకోరాజ !
యేకమైయున్నాను
ముందు పారజూడుకో రాజ !
మూడు లోకములు నేను
యెనక మళ్ళి చూడు రాజ !
యేకమై వున్నాను
యే బాట వున్నాది ?
యే సందు వున్నాది ?
యెవ్వరికి మ్రొక్కిన యెరుగవు గంక
అన్ని రూపుల వుందును
హరిహరుల వద్దను
సాధకపు మాటలు[8] చల్లని గుణాన
ఆవులన్న పూజించవోయి
అడుగు తర్లనిత్తును''
చలపట్టి గంగతో రాజు సయ్యన పలికె
"నాతోన యెదిరేవు రంకె లేసేవు
బిరమున వచ్చేవు పేరెములు బారేవు
పదిరేవు వదిలేవు పాతర లాడేవు
మెదిలేవు కదిలేవు మెడలు ద్రిప్పేవు
వూగేవు వూచేవు వురిమేవు గంగ
అక్కడిక్కడ జూచేవు దవడ
లాడించేవు
తక్కేవు చొక్కేవు తలజడలు
ద్రిప్పేవు
సారెకు వేపేవు చలపట్టి వచ్చేవు
మీరేవు కేరేవు మిన్నంటి వచ్చేవు
చేరేవు మీరేవు చెట్లెక్క బొయ్యేవు
పొంచేవు మించేవు పొమ్మన్న బోక
తరువులను తరిమేవు తప్పక చూచేవు
దేవరకైతే యీ బుద్ధి దేశాన లేదు
లఘువున వచ్చేవు లంచమడిగేవు
యెరిస్తివో జడిస్తివో యెళ్ళు నామంద
దొమ్మరిదాని వలె దొరకాని ధరమీద
పాడేవు ఆడేవు పల్లటి లేసేవు
పల్లదా లాడేవు పండ్లు గొరికేవు
యేగిరాలాడేవు యెడ్లు ద్రొక్కేని
యెన్ని బోర్పెములు బోయినా
నీ కేమి కద్దమ్మ ?
కోరి పూజలు శాయను గోపులము
వెళ్ళుమ!''

## గంగ కాటమరాజుకు ఆర్ల పెంట కోణమును జ్ఞప్తిచేయుట

కాంతమునితో[9] గంగ కదసి
వాదించెను
"ఆవుఅన్న నా తోటి హాంకార
మేల నీకు ?
మరి స్తివో తొల్లిటి మాటపట్టు నీవు ?
నీవు యెరుగుదువో యెరుగవో
యెరిగింతు నీకు

7. 'భుజమందు' పాఠ 8. 'సాధకములు మాని' పాఠ.
9. 'కాంత సంహారి' పాఠ

కల్యాణమందున కనుచిన్న
బాలుడవై యుండి
యెదక వొస్తివి రణము
యేడేండ్లనాడె
కల్లి నడుమ గంగరేగుల బయట
ఆర్లపెంట రణమందు
అల్లిమాని వద్దను
సాహసుడు మీ తండ్రి
సమిసి యుండగాను
కానక మీ తండ్రిని ఆ కల్లిమధ్యమున
రెయ్యున్ని పగలుగా మీ తండ్రిని
రెణమంచు వెదకి
నెలవులు గానక వృక్షమునీడను
గూర్చుండి
పలువరింపుచు నీవు దేవతల
ప్రార్థన శాయంగ
ఆ గగన మధ్యమున నుండి కల్లికి
దిగి వస్తిని
నిలిస్తిని నీ యెదుట నీవేమంటివి రాజ ?
మరి స్త్రీపో? యీమాట నీమనసున
లేదొ ?
పెద్దరాజును జూపమంటివి పెట్టే
నంటివి భుక్తి
కల్లలాడితివి రాజ! యేపాటి గణుతి
కెక్కేవు?
నాటిమాటలు నాటికి చెల్లెనో నీనాలుక
పొడుగాయెనో
చెడ్డతనము వచ్చెనని శంకింపకున్నావు
ఆపాటి వాడ వయితే యాదవరాజ !
యేది నీ మహిమ యెద్దులను తర్లించు
నాయాగ్న చాతను నత్రావులెల్ల
మేత నీళ్ళు లేక మెడవిరచి యున్నవి
కోడెలు అర్తువంచి పూరి కొరకంగ లేవు
లేగలు పాలులేక లేశమాత్రమును
తర్లలేక యున్నవి వాటి తల్లుల దగ్గరకు
మేను వాడి పశువులకు మెళ్ల మిదసెను
వద్దు పూజించవోయి వల్లవుల రాజ!
కాపాడుక వచ్చెను కలకాల మందు"

## యరగడ్డపాటి పోట్లాటలో గంగకు తృప్తి కలిగింతునని కాటమరాజనుట

మదన వల్లభుడు[10] గంగతో మరియు
నిట్లనియె
"మంచిమాటలాడితివి మగువరో నీవు
ఆర్లపెంట రణాన నేను అన్న
మాటలను
తప్పుదునటె నేను తరుణి యిటు
వినుము ;
యేటిమీద ఆరునెలల నాటికి యరగడ్డ
పాటను
శత్రువుల నెల్లను చెలగి చెండాడి

10. 'మందవల్లభుడు' పాఠాంతరము

భూతళంబున నీవంటి భూతాల కెల్ల
యిక యెనకటి ముచ్చటలు యేల
చెప్పెదవు?
వల్లమ్మ గొలిచె నంటివి వస్తువలు
యిస్తానంటివి
యలమంచి తావంటివి యెరుగుదురు
పెద్దలంటివి
పూని యీమాట నీబుద్ధిలో నుంచు
ఆ రీతి పంపాద్రి అయ్యలనాడు
దేశము విడచి యీ దేవతాభ క్తిని
అరుదెంచ దలచిరి అయిదుగురు
నాడు
పంపాద్రిలో పాళ్ళు పంచేటి కొరకు
దివాణములో వస్తువలు దివ్య
భూషణములు
మంద నడుమను వుంచిరి మంచి
వస్తువలెల్ల
దొడ్లనడుమ పల్లికొండ దొరసినట్లు
గాను
అయిదు వాకిళ్ళుదీసి ఆవుల పంచిరి
అందరికి అన్నిపాళ్ల సరిపోవగాను
అధిక మయిన పాలు వొకటి ఆవుల
మంద నడుమను
ఆవులు యేనూరు అర్థమొక కొంత
బంగారు జలపోత పళిణి పూజల పెట్టి
మందనడుమ నుంచేను మరి యవ్వరికి
పొత్తులు పోక
అందుక విచారించుక అయిదుగురు
రాజులు
ఆడబిడ్డను బిలచి అళ్మము యిచ్చి నారు
కొమరక్క-తావచ్చి గొబ్బున నిలచి
అన్ని వస్తువలు విడచి మాయత్త
కొమరక్క-
ధనముపెట్టె యెత్తుక దాచుకొన్నాది
కొలిచేను కొమరక్క గోరతి నెలను
ఆడబిడ్డకు అల్లెమిచ్చినామని అతివెరో
మేము
తిరిగి ఆశించరాదు దివ్య పురుషులు
మెచ్చరు
కోరిమా పెద్దలు కొమరక్క-కు
యిచ్చినామనిరి
యలనాగ మాతోను చెప్పి వున్నారు
పూజలు యే తావున పుచ్చుకున్నావు
ఆ తావుకే పోయి అరగించవలె గాక
నీళ్ళ నడుమ నిలచి నీరజనేత్రి!
గొప్ప మాటలాడకే కొలువను నిన్ను"

## గంగ కాటమరాజుకు అంబరీషుని సాటువ చెప్పుట

వల్లవుల రాజుతో గంగ వయ్యన
బలికె:
"వోయి కాటమరాజ! వనధి
గాంభీర్య!
మూలెకె మాటాడితివి ముమ్మాటికి నన్ను
వినిపింతు యీమాట వృత్తాంత మెల్ల
తిరమందులు కొలిచేరు తిరిగి
పొమ్మంటివి

కొమరక్కకు అశ్వమిచ్చినామని
కొలువ నంటివి నాతోను
యే రీతి కొలువక యెట్లు పొయ్యేవు?
ఆ సంద నీకు తెలపేను అవులన్న!
వినుమ
ఆవులు జగత్తందు లేక అమృతము
లేక
కొండ బెళము నందు గోవులు
వున్ననాడు
ఆ నాటికి హరిహరులు ప్రార్థించి
ఆనతిచ్చిరి నాకు
ఆవలకు కర్తలు యాదవులు
మునుపు
వారిచాత పూజలు వలసినట్లుగాను
యిచ్చేమని నమ్మించిరి యిలమీద
దేవతలు
అంభోజి బెళమున అనేక యేండ్లు
వుంటిని శాపంబు పూర్తితమాయ
శాపంబు చెల్లెను జగతికి దిగివస్తిని
ఆవులకు దిక్కుగలిగె అంబరీషులు[11]
పుట్టిరి
కామధేనువలు లేక కలియుగ మందు
జగతి నడువదని దేవతలు
తలపోసిరి
హరియ రాజులు ముగ్గురు [12]
అరుదెంచి బెళముకు

అచ్చోటన నిలచి అంబరీషుని [13]
బిలచిరి
ఆవులకు రాజుగమ్మని అభయ స్త
మిచ్చిరి
మునులతో బలికిరి ముగ్గురు దేవతులు
తమ నిజరూపులు మందలో నిల్పెద
మనిరి
దేవతులు మందలో పుట్టిరి జగపతి
గంపింప
శిసుడు బసువన్న శ్రీహరి బొల్లావు
కమలజగర్భుడు పుల్లెద్దు కన్నెకలు
తరువులు
గంగమైలావులు ఘనతతరూపు
సురులు దేవతులు యెద్దులు సుందరీ
మణులు
దేవతులు యెద్దులు దేవేంద్ర
మొదలుగాను
యీరీతి బుట్టించిరి యీశ్వరులు నాడు
భాగీరథమ్మను ప్రార్థించి నన్ను
తెరువు యిచ్చిన బెళానకు ధేన్వుల
కళ వచ్చెను
పాషాణమై వున్న ఆవులకు ప్రాణాలు
వచ్చెను
అప్పుడు సంతోషించి అంబరీషుని
బిలిచి [14]
అప్పుడు నా చేతికి అప్పగించిరి నాడు

---

11. 'అంబుధులు' పాఠాంతరము
12. 'హరి హరాదులు ముగ్గురు'
13. 'అంబురుడు' పాఠాంతరము
14. 'అంబురుని బిలిచి'

గంగ నా మారని శ్రీకంఠుడు
చెప్పెను
ఋషికి రాచపట్నము రుద్రుండు
గట్టెను
అడ్డబొట్టు యీబూది అరుడు[15]
ధరియించెను.
తిరుమణికాపు జేసి శ్రీవిష్ణుగోత్రాన
స్తిరమందులని పేరు పెట్టిరి వేగ
పశుపతి సింహాసనానకు ప్రధాన
పట్టణము గాను
విజయాంభోజునికి గట్టెను విష్ణు
దేవుండు
అతని వంశమువారు హరి
దాసులైరి
వీర అంభోజుకు శివపూజకు
భక్తుడాయెను
శైవులు వల్లవులు, చెన్నుని దాసులు
స్తిరమందులు[16]
హరి కట్టడి చేసిరి హరి హరాదులు
నాడు
వల్లమ్మ కోడండ్లు సతితె లైదుగురికి
పొత్తుబోక యుండంగ పొలతి
తానపుడు
వల్లమ్మ కొమార్తె పక్కతె కనుక
ముగ్దు కూతురి చాత పక్క ముద్ద
బెట్టించెను
నీలకంఠుడివి నీవు నిజరాజి తాను

యిందుకు బేదము లేదు యినవోయి
రాజ !
సరనాథ ! భక్తి పెట్టవోయి నాకు
ఘనుడివి గాను !''
పరుగున సవ్వొచ్చి రాజు పల్లవ
నేత్రితో
పల్లవనేత్రితో పలికె నొక మాట :
''గాయక మేటికే గంగరో నీకు ?
వుయములు వురిమేవు వుదకము
బుట్టించేవు
రాగతసమున పచ్చేవు రాతిపై నెక్కి
రాతిపై నెక్కేవు రంకెలు వేసేవు
అర్చేవు కూర్చేవు అవులు ద్రొక్కిని[17]
నీ మహిమ జూపితివి నీరజనేత్రి !
నా మహిమ జూడుమా నగ్రావులెల్ల
కోపాన వున్నవి కోడెలు సహగాను
యర్రయ్య సెలవు లేక యెద్దులు
నిన్ను
యేపునక వున్నాని యెప్ప నాముందు
సాధుపసు వున్నావి తరుపులు నీవు
పూగికే పాలేట వుదక మెల్లాప
అడుసుగా ద్రొక్కేని అది యెంత
మాత్రము
పెల్లురికి పాలేరు పెద వొర్రుగాను
హరషము కురిసెను వాగులు యేరు
లాయ
నీ మనసున వుంచకే గంగరో! నీవు

15. హరుడు
16. 'తిరమందులు' పాఠభేదము
17. 'జెదిరేని' పాఠభేదము

కామధేనువులు త్రొక్కేని గంగరో !
చూడు
వాడుగో యర్రయ్య వచ్చేని చూడు
వీరుగో గోపాలుకులు యిటు
చూడవమ్మ
పంతము నీకు చెల్లదు పాలేరు విడచి
తొలగవే కడకు త్రొక్కేని
యెద్దులు[18]
ఆవులు యేటికి అరుదెంచెనైన
నీళ్ళనడుమ మెదలకుండా నిన్ను
మట్టు బెట్టేని
పదరకు వెళ్ళవురుకు పాలేరు దాటి''
నలనన్న మాటలకు నవ్వేను గంగ :
''ఆడితివి మంచిమాట ఆవులన్న
వినుమ
యవ్వరు కొలిచిరి యెరిగించు మంటివి
చెప్పేను యీ మాట జననాథ
యినుమ[19]
తొల్లి నీపెద్దలు దొడ్డగా నన్ను
తుమ్మపూడి యలమంచి త్రుళ్ళెముగా
వుండంగ
ఆవుల వల్లమ్మ కొలిచెను యాదవ
కాంత
వెలగి వారిచేతి పూజలు చెల్లిన వెనుక
వల్లమ్మ కోడండ్లు వనిత లైదుగురు
సీతమ్మ, పెద్దమ్మ, సిరిగల కాంతలు
యరనూక, నలనూక, నందుల సిరిదేవి
పట్టి పూజలు గొంటిని పంపాద్రి కోను
ముందు కొలిచిన వారికి ముదమొప్ప
నేను
అమితమైన వస్తువులు యిస్తిని అడిగి
నట్లుగాను
పశువుల మేపులకు పాలేరు దాటి
పరిణాన బోవుచున్నావు పాకనాటి
దేశమునకు
నరనాథ పూజించవోయి! నాకన్న
ఘనుతవు
కోడెలు అమ్మకానికి కొనసాగి రావు
పుల్లరికి కాసైతె పుట్టించలేవు
వెంబడి[20] వచ్చేను యేరు దాట నిచ్చేను
కొదవలేని రొక్కం కోట్ల
పరియంతము
నరనాథ ! కూడబెట్టేను నమ్మ
నామాట

## గంగ కాటమరాజుకు వసుదేవుని సాటువ చెప్పుట

యవ్వరి బాలవని యాల అడిగెతివి? యెరుగవా నా గురుతు యేమోయిదాజ?

---

18. 'త్రొక్కేని ఎద్దులు తొలగవే కడకు' అనిన గణభంగము లేదు.
19. వినుమ
20. 'ఎంబడి' అన్నచో యతిభంగము లేదు

ముందు నందుని యింట ముద్దుల
పట్టివై
వుండంగ యెరుగవా వుర్వీశ నన్ను?
అందుకు ఆనమాలు చెప్పేను
యాదవరాజ
వక కార్యము కొరకు వసర జన్మించి
వుంటిని రేపల్లె లో వుర్వి గంపింప
మామను చంపుట కొరకు
మాయవేషమున వచ్చి
పుట్టవా మధురలో పుండరీ
కాంతుండవై
అతని మహిమకు వెరచి అంత
పరాక్రమము లేక
పారిపోయి వొచ్చిన వారి ప్రెగ్గె
లేపాటి ?
మామకు వెరచిన మాట నీమనసున
లేదా?
యెరిగినందుకు యాల
యదుకులాధీశ !
పల్లదాలు పలికేవు పాలేటి వొడ్డున
తల్లిదండ్రిని వొప్పగించి తర్లితివి
పట్నంబు[21]
ధరలోను రేపల్లెలో దాగేనని వొస్తివి
యేరులు వుప్పొంగె యగవుబ్బె
యమున
ఆకాశము మ్రోసైను అవని ఘూర్ణిల్లె
సురులు వెరగందిరి చుక్కలరాజు
జడిసెను
అంధాకార మాయెను అవనీశ! నాడు
వసుదేవుడు వెరగంది వాక్కున
నన్ను
యేమని ప్రార్థించినది యెరుగవా
రాజ?
కన్నులు తెరువని బాలుని కడతేర్చు
మనెను [22]
ఆనాటికి వసుదేవుడు అనేక విధముల
తలచి మ్రొక్కడా నాకు ధరణీశ !
తనకు
యెమ్మెగా నీవు నాతో యెదిరించినావు
అనాడు మ్రొక్కినందుకు యాదవ
రాజ!
విలసితముగ తెనువు యిస్తిని నాడు
న్యాయముగ క్రిష్ణమ్మను నా మరుగున
దాస్తిని
ప్రాణాలు రక్షించుకుంటివి
పగవారిని గెలిస్తివి
అందున నాగురుతు యరగరు
యాదవులు మీరు
యదు వంశమును నేను అనేక వేల
యేండ్లు
కాపాడుక వస్తిని కడతేరిస్తిని నేను
పిల్లకాలువలు యెంతని బింకమాడేవు

---

21. 'పురిటిల్లు' పాఠాంతరము
22. రక్షించుమనెను (దరిచేర్చు)

కాల్వలే నదులుగా జేతు గంగ నాపేవు
రానిపోని మాటలకు రచ్చకెక్కేవు
భూనాథ! పూజించవోయి నీకు
బుద్ధేలలేదు?"
కరకంఠు రాణితో రాజు గ్రక్కున
బలికె.
"ఆడ వేల్పువు నీకింత అసురతన
మేల?
లేని మాటలు పుట్టించేవు నెళవులు
యెతికేవు
కోపంబు చేసేవు కోడెం తరిమేవు
కేకలు వేసేవు గద్దించ వచ్చేవు
గుంటిమీద యెక్కేవు గుద్దె రజేసేవు
చేతులు జాచేవు చేరి వొచ్చేవు
కలకల నవ్వేవు కల్లలాడేవు
బిరబిర వచ్చేవు బిగువు చూపేవు
వాదులు చేసేవు వలదు పోవమ్మ
వాగులెంబడి వున్నావు వంటరిగ నీవు
పేలేవు పెరిగేవు పెక్కులాడేవు
జంకేవు బొంకేవు జగడ మాడేవు
సారెసారెకు తిరిగేవు సంపట్టి వచ్చేవు
మరుగులు దెలిపేవు మద్దు లెక్కేవు
కొంటె చేతలేగాని కోమలిరో నీకు
స్థిర బుద్ధి లేదాయ దేవతవు కావు
యీసారి[28] నను జూడు విధమెల్ల నిన్ను
ఖండింతు యాదవుల చాత నిన్ను
కదలకుండాను
ఆశించక యిప్పుడు నా ఆవుల
మంద విడచి
పోవమ్మ నీకింత ప్రొద్దేల జోదు!"

## గంగ ఆవులను గగ్గోలు పరచుట

అచ్చటి నిలచి గంగ ఆ రాజును
జూడంగ
కోపించి ఆదరించి కోపాన అరచి
వురిమిన ఆవుల వురికించి తలిమె
కొమ్ములు వంచుక ధేన్వలు కొట్టి
మిట్టాడెను
మెరుపులు బుట్టెను మేఘములు
గ్రమ్మెను
ప్రళయ వాయువులు విసిరి పట్టెన
వర్షములు
సారెకు నదులెల్ల పశువులకు మోపాయ
పోచేర్లి పాలేరు పొర్లి పారసాగెను
పరవలు ముంచెను వాగులు నిండెను
కనుకెత్తి పాలేరు కానుగలు ముంచెను
గుంటి మీద వుదకము కొండల
పొడుగున
పొంగిపార వెల్లి బుట్టి పొర్లి పారసాగెను
ఆవు లేగరు గానక అరచంగసాగెను
శంఖిని ఘందంత చల్లాచెదరమాయె
మందలు ముంచెను మద్దులెక్కి పూచెను

28. 'ఈ తూరి' పాఠ భేదము

కోడెలు చీదరగొట్టి కొమ్ములు వంచెను
చిల్లరై పోయెను పశువులు చెల్లెక్కి-
వురికెను
మందలు వుద్ధరించెను మందలావులు
తరిమెను
యాతలాయెను ధేన్వులకు నీరు వెల్లి
విరిసెను
అరినిక్షులాయెను యెద్దులకు ఆకాశం
వురిమెను
మోరలెత్తి చూచి మొద్దుపారి నిలిచెను
నలనన్న యెదుట నధిక కోపమున
అపరూపమున గంగ అప్పుడిట్లనియె:
"యేమోయి రాజ ! నీమంద చూడు
యెద్దులు చూడు
ఆవులేగను చూడు ఆరవంగ లేక
తెప్పలై నీళ్ళపైన తేలాడుచున్నవి
ఆపద పాలేట నీ ఆవులకు బుట్టెను
కరగదా నీ మనుసు కాటమరాజ !
యాతూరి ననుజూడు యిదమెల్ల
నిన్ను
ఆవుల యెద్దుల యాదవుల మిమ్ము
మంతును పాలేట మువ్మాటికి నేను
మారుమాటాడకు మాధవ నలదన్న!
గొబ్బున పూజించవోయి రాజ !
"కోరిన వస్తువులు యిచ్చేన్ను"
సోమవంశమున రాజు సోద్యంబు
గాను
ఆతూధిగా నిలచి అప్పుడిట్లనియె :

"భద్రాణి ! వినవమ్మ పాలేద నీవు
గట్టిగా పూజలు కావలసినదాన వైతేను
బుద్ధిమంతునితోను పోరు నీకేల ?
శ్రీవిష్ణు బొల్లావు దిగ్గజము లెద్దులు
హరిహరాదులు మంద అలివిగాదు నీకు
గిరి కూతురు పెండ్లి గినిసి యాడిన
యట్లు
బసవవాహనుడు వాడుబో బసవ
న్నను చూడు
ఋషులు తపస్వులు రుద్ర గణాదులు
పురహర ప్రముఖులు భూపతి మందన
సలుగుటెద్దులై జన్మించె సంగతిగా
నప్పుడు
అష్టదిక్పాలకులు కావిలి యాదవుల
మందకు
దిమ్మరి ! వగలమారి ! దిష్టించి చూడు
యక్కడ నీలవేణివో
యెమ్మెకత్తెవో కాని
సోలేవు పేలేవు సొమ్ములు దూలంగ
గాంభీర్యము నీకు లేదు గద్దించ వచ్చేవు
గుట్టున పోవమ్మ కొలవను నిన్ను!"
యెద్దులు పాలేటికి యేతెంచి రాగాను
గరిమితో దొనకొండ గంగమ్మ యప్పుడు
మొగధీరుని కాటమరాజును
మోసపుత్తు ననుచు
రాజుయెదటికి శత్తుల రమ్మని పిలిచెను
పంపులు పుట్టెను పాలేటి వెంట !

## గంగ శక్తి దేవతలను రప్పించుట

"అంగనరో రావమ్మ ఆరవెల్లి గంగ!
మందలావుల వురికించు మ్రరిపూడి దనుక
చక్కని వేగుచుక్క ! సఖియ రావమ్మ !
సలుగుటావుల వురికించు సాకిరేల గంగ !
కోరిన వరములు కొంగు బంగారమై
కోడెలావుల వురికించు కొమలేటి గంగ !
పరుగున రావమ్మ బట్టుపల్లె గంగ !
పయ్యావుల పోకుండ పదిలముగ వుండు
నాకు తోడు రావమ్మ నంద్యాల యల్లమ్మ !
నడియేటికి వురికించు నర్రావుల నెల్ల
మావురమ్మ ! మారెమ్మ ! మాంకాళి దేవి !
కమ్మక రారమ్మ ! ఆవుల గడి దాటకుండ
ముద్దుచెల్లెల రావె ముత్యాలదేవి !
స్తిరమందలవారి ధేనువలు తిరిగి పోకుండ
చిన్నారి పొన్నారి చిట్టేలి గంగ !
రాజు ఆవుల వురికించు రామతీర్థము వరకు
మొలుఛమ్మ ! పోచమ్మ ! మహమ్మాయి! మీరు
మంగోలుపాడికి ఆవుల మళ్ళించ రమ్మ !
కొల్లాపురి రావె కోపలేటి గంగ !
కోడెలు ఆవుల వురికించు గోపాలకుల నెల్ల
కామాక్షి రావమ్మ కావేటి గంగ!
యెద్దుల తర్లిపోకుండ యేటికి తరుముడి''
తన తమ్ముని పోతురాజును దాయంగ బిలిచి
అక్కలకు తమ్ముని అరుమించి పిలచెను
''కోడిపుంజుల తోటి కోలాటకాడ !
మేకపోతుల తోటి మేలాటకాడ !
గంగలకు తమ్ముడ ! గావు పోతన్న !
పొంగుబారి యెద్దులను పోకుండ నిలుపు"
అందరికి సెలవిచ్చి గంగ అర్భాటము చేసెను
కూడిరి శక్తులు గుంపులు గుంపులుగ
పేరెములు బారుచు ఆవులముందర వేట్లాడ[24] సాగిరి
అర్భాటములు చేసి గంగ గుంటిపై కెక్కెను
దిక్కులు చీకట్లు గప్పి దిగ్గజములు వణికెను

---

౨౪. 'పేట్లాడ' పాఠాంతరము

శూలంబు జళిపించ సురులు
యరగందిరి[25]
పోలేక యెద్దులన్ని పోటురంకెలు
వేసెను
నాలుకలు చాచుకొని న్రరావులెల్ల
కడుపులుబ్బి పడెను కళదప్పి యంత

గోపాలకులు ఝడిసిరి కొల్లాయ మంద
ఆవుల యెద్దుల యాదవుల జూచి
పక్కన నవ్వెను భాగీరథి గంగ
అక్కజముగ గంగ ఆరుభటము చూచి
కాటమరాజు
మంద గోపాలకుల జూచి మరివేగ బలికె:

## కాటమరాజు శక్తులను ధిక్కరించి ఆలమందను ఏరుదాటించుట

"జడదారు మండలి! జట్టి బోయిన
గోపన్న![26]
పరువునబోయి శక్తుల పట్టితెండి
మీరు!
ముత్యబోయిన పాపన్న! ముంగర
రంగయ్య!
ఆవుల తరుమకుండ అరికట్టుడా
మీరు!
శంకుదార మల్లయ్య! చెవుల
నారయ్య!
జడలు తూలాడేటి శక్తులబట్టి
కానుగుల గట్టండి గట్టిగా మీరు!
కొండగొడుగు ఎంగట! గోవుదార
లక్షుమయ్య!
ముందల ఆవుల తోలుడీ షుస్తీదులై
మీరు
యరణణ్ణ యెద్దుల యేర దాటతోలుడి

యర్రయ్య! చట్టివారి యరణణ్ణ! మీరు
పెద్దిబోయిన రామన్న! చల్లవారి
యర్రయ్య
సలుగుటావుల తోలుడి సాక్షి తప్పకుండ
తప్పక ఆగుండు తలకోలలు వేయుడు
పట్టిగ కదలచేసి పశువుల తోలుడి"
అని యిట్లు సెలవిచ్చి యాదవుల బంపె
పొందుగా ప్రార్థించిరి బొల్లావు
బసవన్నను
ఆ వేళ అవతారమూర్తులై
అకలంకముగ వచ్చి
ఆవులన్న ముందర అటువేగ నిలచి
బసువన్న రంకె వేసె పశువులెల్ల లేవ
బొల్లావుసు చుట్టుకొని ధేన్వులు
పోదెములు త్రొక్కుచు
సలుగు ఎద్దులకు కళవచ్చి చౌకళించి
దాటెను

25. వెరగందిరి
26. 'జడదారు గోపన్న జట్టిబోయిన మండలి' పాఠాంతరము

కోడెలు తరువులు గోపాళవర్గము
యేరుదాటిన యెద్దులు యేకరంతు
లాయెను
ఆవల రవధూళి ఆకాశము గప్పెను.

ఘూర్ణిల్లెను భూదేవి కొండలు ధ్వను
లెత్తెను[27]
లింగాలకొండ వీరులు నిలచి చూచేరు

## గంగ మట్టిపెయ్యను గుంటి క్రింద దాచుట

సురులు వెరగందిరి చొక్కెను గంగ
మళ్ళవాయను పశువులు గంగకు మరి
వశము గాదాయె
తిరుగ వక బుద్ధి తెలసెను
త్రిపుర సంహారికి
అల నీలవేణికి అసురసంహారికి
పరుగులు బారంగ గంగకు
పైచెమటలు పుట్టెను
యెద్దుల రవధూళి యేకజడల గంగకు
కప్పెను నిండార కావురి రీతి
రాల్చుచు నిప్పులు రాతిపై ధుమికి
ఆవల నడుమ మట్టిపెయ్యను
అరుంధతి రీతి
పొదులుచు పోగాను గంగ పోడెమున
త్రొక్కుచు
నీళ్ళనడుమ లంకించుకొని నిలిపెను
గుంటికింద
తరువును గుంటికింద దాసి వేగంబె
ధారుణి కక్కటిల్లంగ తాండవమాడె
పంకజనాభుడు కాటమరాజు పాలేరు
దాటెను

కోడెలు యెద్దులు గోపాళవర్గము
సిరమ్మలాన గోకులము వచ్చి
లింగాలకొండవద్ద నిలచెను
ముందల గోకులము మురువైన యెద్దులు
మాలకొండ మేరగాను వారి
మందలు దిగెను
నీలకంఠుడు బసవన్న లింగముద్ర
ఎద్దులు
పోలురాజుకొండ యెక్కి పోటు
రంకెలు వేసెను
గంగరేగులు చుట్టుక గంగ
మైలావులు
శిలలు చూచి యెద్దులు తిరిగి
ముమ్మారు
బాలు బాలున అరచెను పశువులు
దిగి వచ్చెను
సల్లా పిన్నయ్య సకలభోగమున వచ్చి
సాగల కొండపాటి మేరగా వారి
సంపదలు దిగెను
పాలేటికి దక్షిణము భాగంబు నందు
పాటికి దక్షిణము భాగంబు నందు

27. 'డొణలిచ్చెను'

కొండకు తూర్పున భాగంబు నందు
యేపెల చెలికెలో యెల్ల గుడార్లు
యెల్ల గుడార్లు యెత్తించె హేమాద్రి
రాజు
హస్తమానము అయ్యేను అవుల
మందలు నిలచెను
గోపాలచంద్రుండు కొలువుగుడారు
లోను
కొలువు దీర్చి వుండంగ గోపాళ
వర్గము
పెద్దమంద కంపటీలు పేరు గల
యాదవులు
క్షేమంబు కాటమరాజుతో చెప్పవచ్చి
నారు

## కాటమరాజు మట్టిపెయ్యను వెదకించుట

"రఘురామ చంద్రుండ! రాజ
కాటమరాజ!
మట్టిపెయ్యను వెదకితిమి మన
మందలో లేదు
పాలేరు వెదకితిమి మన పశువుల
మంద చూస్తిమి
అపరూపమై వున్నది అవుల
మందలోను"
నరనాథుతో చెప్పి నవ్వె ఆ రాజు
గంగమహిమ దెలిసి ఘనుడు
కాటమరాజు
గోపాలకుల పిలిచి గొబ్బున పలికెను
"యే జాడన వున్నదో యేగంబె మీరు
జాడలు కట్టుడీ తరుపును వెదుకుడీ"
అని చెప్పి ఆ రాజు హాచ్చెర్యమంది
భావింప ధనుముకొండ పల్లజడల గంగ
ఆవును గుంటికింద అమరంగ నుంచి
గుండెక్కి ఆ గంగ గుణ్ణాన ధుమికి
వాలవాలా యని వాలలాడి వచ్చెను
గుంటికింద తరుపును కూర్మితో నిలిపి
వాలాయముగ బుజ్జగించి వచ్చెను గంగ
నిజరూపు గైకొని నీరజనేత్రి పలికెను:

## గంగ కాటమరాజుకు మల్లికాదేవి సాటువ చెప్పుట

"మల్లికాదేవి తొల్లి మహాభక్తురాలు
నీవు చంద్రగుప్త పర్వతమందు
స్వెలగి వేలిన నాడు[28]
మగువ నీ మందను మాయధేనువై
పుట్టెను

28. చెలగి ఏలిననాథు

అరవై వేలేండ్లు పూజించి[29]
శంభునికి అమరత[30]మార
గించెను
పాలారగించి శివుడు పర్వతముల
యందు
కైలాసము యిచ్చెను కపిలావు
వరములు
ముందల కలియుగమందు
కామధేన్వరో! నీవు
యదువంశమున వొలురాజు
యెలమితో బుట్టును
వలు రాజు కులసతి వారణాసి కన్నె
వారణాసి కన్నెకు వరము లిచ్చి
వున్నావు
ఆమె గర్భమునందు ఆవుల వొలు
రాజుకు
పోలురాజు పుట్టెను
కామధేనువులై కరకంఠుని కృపను
ఆవుల మందలో పుట్టెను యాదవుడై
అపుడు

అతనికి సాయముగాను అందరు అపుడు
మందలో వున్నాము మాయవేషమున
నీలకంఠుడు బసవన్న లింగముద్ర
యెద్దులు
ప్రమథగణాదులు పశువుల మందలోను
సలుగు టెద్దులై జన్మించె సంగతిగా
నపుడు
వారి సతులు ఆవల వరుసతో పుట్టిరి
యేకాంగులు కోడెఌ తన రూపు
గంగమైలావులు
యెద్దుల యీ రీతి బుట్టించెను
యీశ్వరుకు నాడు
పూజ చేసి పోతివైన భూనాథ నీకు
మంచిది
నన్ను కొలవక పోతివైన గోకులము
రాజును
పెన్న యీ సందున పెట్టింతు" ననుచు
ఆ రూపు మన్నించి ఆవురూపు దాల్చి[31]
తరుపును గుంటికింద తగ నొప్ప గించి
ప్రళయకాలమూర్తి వుండె పాలేట నంత

## పోలురాజు గంగను ప్రార్థించుట

ఆరాత్రి[32] పోలురాజు అమృత
భోగలింగము
ఆవులన్నతో గంగ అలిగి వుండ
గాను

లింగాలకొండ నుండి నిజలింగమూర్తి
తర్లి వొచ్చి జొన్నవిని సన్ను తిన[33]
నిలచి

29. 'పూదించి' 30. అమృత
31. 'చేసి' 32. 'ఆవుల' 33. సన్నిధిని

ప్రార్థనజేసెను పోలురాజు
భాగీరథి గంగను:
"శరణె భయంకరి! శరణె శంకరి!
శరణె పరంజ్యోతి! శరణె భవాని
శరణె గవిరీశ్వరి! శరణె జటాజూటి!
శరణె జొన్నవి గంగ! శరణె
పల్లవపాణి!
శరణె పల్లవపాణి! శరణె పరం
జ్యోతి!
ఆవుల మందలు నీవమ్మ! అలుక
నీకేటికి?
ప్రాణమే నీసొమ్ము భక్తి
వుంచవమ్మ!
కోపంబు శాయకు గోపాల్కులమీద
అమ్మా! నీ బాలలు యాదవులు మీ
వారము
యదువంశమున నీవు అనేకవేల
వేండ్లు[34]
కోరి పూజలు గొంటివి గోకుళము
వెంటను
కాటమరాజు కొలువడని కపటంబు
వుంచకు
బాలలు యెరుగరు నిన్ను పట్టి
పూజలు శాయను
తరమునాటి వేల్పువు దయ
వుంచవమ్మ
మందలు అరికట్టకు నీ మనసున
వుంచకు
కార్యము ముందల వున్నది గంగరో!
యెరుగవా?.
తరుణి గంగవు ధలామేళకు
యాదవుల రాజును
తెప్పించేను మీసేవకుల రక్షించ
వమ్మ!"

## గంగను కొలువుమని పోలురాజు కాటుమరాజుకు కలలో చెప్పుట

అని యిట్లు గంగను అటు
శాంతపరచి
మరి వెనుక పోలురాజు మందలోకి
వచ్చి
శ్రీ మహాదేవుండు శివలింగమూర్తి
తనయుడు కాటమరాజు తగు
వేడ్కతోను
నిర్మలాన గుడారులో నిద్రించగాను
మారుట శంభునివలె రాజు
మతియందు చెప్పెను

34. ఏండ్లు

"కాంతిగల చంద్రుడా! కాటమారాజ!
గంగ మన మందలకు[35] కలిగినా
యేల్పు
గంగను కొలువక పోరాదు కాదనరాదు
పూదించి దక్షిణాదికి భూనాథ!
పోతివైన
తలచిన కార్యము పీడేర్చు
తరమునాటి వేల్పు
పోలురాజు నాపేరు పొందుగా
వినుమ!
ఆదిశక్తితో కంటు ఆవులన్నా!
నీకు వద్దు

మన పెద్దలు తొల్లిగంగను కొలిచిరి
పెంపాయను మంద గంగను
కొలువక పోరాదు
మందయాన గంగను కొలువుడీ.
పూజితమయ్యాని[36]"
లీలగా పోలురాజు నిష్ఠలు చూపెను
మళ్ళెను లింగాలకొండకు మరి
వుదయమాయ
అంతట పల్లవుల కాటమరాజు
నిద్రవయినాన లేచి
పద్మనాయుని పిలిచి పలికె
నొక మాట:

## కాటమరాజు గంగకు కొలువు చేయించుట

"ఆవుల మేపులకొరకు దక్షిణాదికి
అరుదెంచి పోగాను
కలహము పాలేట కల్పించె గంగ
మట్టిపెయ్య లేదాయ మందలు
తర్లవాయ
కలలోను పోలురాజు గంగను
కొలువమనెను
కనవాలు యిచ్చెను అయ్య అరిగెను
లింగాలకొండకు
అయ్య చెప్పిన మాట అదిగడవ
రాదు[37]."

వనర యాదవుల నందరిని వక్క
ప్రొద్దులతోను
రమ్మని పిలిపించి రాజు తా లేచెను
ఆడెను జలకములు అరుద్ర[38]
వస్త్రములు గట్టెను
రణభేరి వేయించి రాజు తా తర్లెను
పాల కావిళ్ళు ముందర పదివేలు
కదిలెను
గోనెల బియ్యములు కొట్టిడీలు కదిలెను
యాభైవేల యాదవులు యలమితో
వచ్చిరి

35. 'మన వంశముకు' పాఠాంతరము
36. 'పూజితమయ్యేని' పాఠ. 37. 'అడుగు దాటరాదు' పాఠ. 38. ఆర్ద్ర

ముందర బసవన్న లింగముద్ర
యెద్దులు
గోపాలుకులు కదలిరి గొడుగుల
నీడన
పద్మనాయుడు ఆవులన్న భరుతుడు
యర్రయ్య
వీరన్న చన్నయ్య బిరుదు
గోసంగులు
చట్టివారి యర్రయ్య సాహస
ఘనులు
గంగను వేడను కదిలి రందరును
ముందల రెణఖేరి ముక్కమ్మ
కుంతలము
నరగలు వీరణాలు
నాగసౌరములును
బూరగలు కొమ్ములు భూమి
గంపింప
ఆరూఢిగా బ్రమోగ యాదవులు
కదిలిరి
నరనాథు కదిలెను నడిచె ధమామీలు
పాలేటికి ఆవులన్న భాగీరథిని వేడెను
ఆనందభరితుడై అరుదెంచె నచ్చేటికి
వాలురాజు మనసంతో మునివానర
సంభ్రమము జూచి
మాయకుంగ మట్టిపెయ్యను దాచి
గుంటికింద
భావింప ధనకొండ పల్లజడల గంగ
వాలాయమునగ గుండెక్కె యెదురుగా
నప్పుడు

గాంభీర్యముగ గంగ కనక పుట్టము
గట్టెను
గుత్తముగ దొడిగెను కుసుమ పువ్వుల
రవికె
మగటమున కిరీటము మంచి భూష
ణాలు
అమరంగ ధరియించి హస్తమున
బట్టెను
ముంజాత కంకణము ముదువైన
చక్రము
వక చాత శంఖు వనరంగ బట్టి
ఆయుధము వకచాత అంబు వకచాత
శూలము వక చాత సురటి వక చాత
కత్తి వక చాత గద వక చాత
వినపకోల వక చాత పీటె వక చాత
అసుర పునికెల పేర్లు అమరిన
సింగాణి
పసిణి అంబులు పట్టె నొక చాత
గదా ఆయుధము గంగకు
కనకశూలంబు
ఆరూఢిగా బట్టెను అఖిలోక మాత
అమరగా గుంటిపై ఆనందమాడుచు
వుండెను యాదవులు రాగ పున్నంత
మెరసి
చక్కన మొకమున సన్నపు
సిరినవ్వు
పసిడి పుత్తడికొమ్మ పగడపు కొమ్మ
లింగాలకొండకు యెదురుగా
నిలచెను గంగ

చల్లని వేళను సరుసుడు నలనన్న
బాగీరితి సరసను పశుపతి నిలచెను
కంపటీలను[39] బిలచి గ్రక్కున
బలికెను:
"హస్తమానముగాక తలికె
యాదవులార మీరు
పొంగళ్లు పొంగించుడీ పొందుగా
మీరు"
అని చెప్పి ఆవులన్న ఆదిశక్తి
గంగకు
సంపూర్తిగా పూజలు సకల
యాదవులు
చేకొని యెదిరించిన జాన్నవికి
యిపుడు
పాలతో గుంటిపై జలకంపు లార్చి
నీళ్ళతడి యొత్తి నిండు వొన్నెల
చీర గట్టిరి
వాలుజడల గంగకు కంఠమాల
సొమ్ములు
వురువున ధరియించిరి వురువైన
సొమ్ములు
మల్లెలు విరజాజులు మంచి గేదంగులు
పువ్వుల దండలు భుజకీర్తులు
ధరియించిరి
ఆభరణములు ధరియించి ఆవులన్న
నిలచెను:
ఆరగింపులు గంగకు అర్పించివేగ
సాంబ్రాణి ధూపములు సాలుగ
వేయించిరి

## కాటమరాజు పద్మనాయుడు గంగను ప్రార్థించుట

నిండు వేడుకతోను నీరజ నేత్రి
పద్మనాయుడు ఆవులన్న సద్భక్తితో
నిలచి
ఆరూఢిగా ప్రార్థించిరి ఆదిశక్తి
గంగను:
"హర హర శాంభవి! ఆదిలక్ష్మి
గంగ!
త్రిపుర పురములు నీవు దిగ్గజ
ములు నీవు
మాల్యవంతములు నీవు మహాపర్వత
ములు నీవు
ప్రళయ వాయువులు నీవు
పరంజోతివి నీవు
పరంజోతివి నీవు పరమేశ్వరివి
నీవు
మూడు కన్నులవాని సతివట ముజ్జగ
ములు నీవట

39. 'కంటతీలను'

జంట కంటను నీవట [40] సకలంబు
నీవట
మింట కంటను నీవట మిగుల
వేల్పువు నీవట
కల్పవృక్షము నీవట కామధేనువు
నీవట
సాగరములు నీవట సంజీవు నీవట
కాశీపురము నీవట ఖడ్గంబు నీవట
సురగణములు వేంచేయ సురకీర్తులు
మెచ్చ
మునుల ప్రార్థన నుండి మూడులోక
ముల నుండి
పాపసంహారివి పాలేటనుండి
పూజలు మా చాత పుచ్చుకోవలసి
దిట్టముగ మందలో నిష్ఠలు చూపితివి
హర హర శాంభవి! ఆవుల రక్షించు
మట్టె పెయ్యను మా కిచ్చి
మన్నించవే గంగ
అర్ధపూజలు యిప్పటికి అమరెను
నీకు
యేకపూజలు ముందర యేనుగ
మెదడులు
పరిపూర్తిగా గంగ పెట్టింతు నీకు
తిమిరేటి రాజుల శిరస్సులు గొట్టి
దొరకొని నీకు తోరణాలు గట్టిస్తును
గుర్రాల బారుల నరికి గుట్టలు
వేయిస్తును
అమితముగ గావింతును ఆరగింపులు
నీకు
ఆవుల పోలురాజు పగలు మాకు
అనుకూలమయితేను.
నరపతి శిరస్సులు గొట్టి రాసుల
పోయిస్తును"
అని యిట్లు గంగను అతిశాంతపరచి
ఆవులన్న పద్మనాయుడు అతిశాంత
పరచి
నిలచి ప్రార్థన శాయుగాను నీరజనేత్రి
ఆవులన్నతో వీరగంగ అప్పు
డిట్లనియె
సంతోషమున పొంగి ఆడె నొక మాట:

## కాటమరాజుకు గంగ పంచలింగాల వృత్తాంతమును తెలుపుట

"పశుపతి: నలవన్న! పాలేట నన్ను
కొలువక మునిగి సలమున బోతిరి
మీరు ముందెరుగలేక
పూజలు అందేను భూలోకమందు
రాజ! వినుకాటమరాజ! నన్నెరుగవు
గాక!

40. 'ఛంటవంటను నీవట'

కర్తను పాలేట్కి కావని మీరు
తావులు జేసుక తరాతరమందు
లోకస్థులై మీరు అయిదుగురు
యరగడ్డపాటను
పూని తపస్వులై హరిహరుల
మెప్పించి
నెలవుగా వుండంగ నేర్పున వచ్చి
చండప్రచండాలు శంకరులు వారు
చెరుకూరు యేలుచుండిరి జపతప
ముల చాత
వారిలో వారికి వైరంబు పుట్టి
మహా విద్ధము చేసి మడిసి
రచ్చటను
దివ్యఋషి దివాకరఋషి దీర్ఘఋషి
మహేశ్వరఋషి
మీరు భక్తులు గనుక శివుడు
ప్రత్యక్షమై
వారితో పలికె నొకమాట యిటు
వినుడి
కైలాసము యిప్పుడు మీకు లేదు
యేదో తరమున యదువంశమున
పుట్టి
అందరు కర్తలై మీరు అంబరుషులై
పుట్టి
ఆత్మ సంతానము కలిగెనని సకల
భోగములతోను
కరకంఠ భక్తుడు కలియుగానకు
శంభుడై నీమీద హరివిష్ణు లీలను

హరివిష్ణు లీలను అల్లుడున్నాను
యతీశ్వరులతోను యరగడ్డ పాటను
హరుడు నమ్మించినందుకు అంకసరి
పుట్టిని
అంకసరి పుట్టిని హరి కృప వలన
కలియుగమందున కామధేనువులు
కలసి
అఘోర యుద్ధముచేసి ఆవులతో
ప్రాణాలు
వొప్పగించకగాని అందరికి ముక్తి
లేదు
అని యిట్లు నమ్మించి హరిహరుల
నాడు
అడిగనుక పాలేట ఆనాటి పెద్దలు
తమకు మోక్షము లేదనిరి
శివుని అడిగి పుచ్చుకొన్న ఆదిశక్తిని
నేను
పట్టి పూజలు గొందు పశుపతి నీచేత
యేష్యమెరిగి పుచ్చుకొందు
యెరుగవుగాక
కాటమరాజ! యీ స్థళముగాచితి
నేను
పాలేరు ధనముకొండ యరగడ్డపాడు
అయిదుగురు పెద్దలు అందరిని నేను
తెచ్చివుంచి నేను వెలసి ముందెరిగి
ప్రాణాలు అయిదుగురు
పంచలింగాలకుగాను
వున్నారు కాటమరాజ! వుర్విలో వెలసి

పలుకరు యిప్పుడు పశుపతి! వినుమ
పాకనాటి దేశమున నీవు పశువులు
మేపుక
తిరిగి భూమెల్ల స్త్రిరపతులు[41]
సేవించి
మగిడి పాలేటను మందలావులు
నిలచినపుడు
దొనకొండ రాజులు దొరలు

పల్లికొండను
అరుషించి మీరంత అన్నదమ్ములును
పల్లికొండ రాకగాని పలుకరు
లింగాలు
చండప్రచండాలుగా శంకరుని
వంశమున
పుట్టినారు అమరలింగాలు
మునిమనుమలవారు

## గంగ కాటమరాజుకు సెలవిచ్చుట

పగవారు దక్షిణాదిన పట్టజాలక
వున్నారు
ఆ భూమిలోకి పోయి అరుదెంచి మీరు

ఆవుల మేపుక పోలురాజు పగలు
సాధించి
క్షేమాన రమ్మని" సెలవిచ్చెను గంగ

## కాటమరాజు గంగకు చెయ్యెత్తి మ్రొక్కుట

అవులన్న పద్మనాయునికి ఆదిలక్ష్మి
గంగ
పట్టుమా వీరశాస పైపూత గంధము
చెలగి రాజులకు యిచ్చెను చెయ్యెత్తి
మ్రొక్కిరి
వేయిన్నూరు కోట్లు యాదవులకు
యేకజడల గంగ

అందరిని దీవించి అక్షింతలిచ్చెను
అమరంగ యాదవులు గంగకు
అస్త్రములెత్తి మ్రొక్కిరి
ఆదిలక్ష్మి గంగకు పూజలు చేయుచు
నుండిరి యాదవులందరు
శ్రీ మంగళం...



41. తిరుపతులు

# కాటమరాజు దక్షణాది ఆవులమేపు

## ('ఆవుల మేపులు-దక్షిణ కాండం' లేక 'జన్నివాడ కథ')

### కాటమరాజు తాను సాధించిన పగలను బంధువర్గమునకు తెలుపుట

శ్రీరాము వంశమున సిరిసంపదలు
గలిగి
(వారి) మందలోపల గలరు మంచి
సజ్జనులు
ద్వారావతి మొగరాజు (తన)తమ్ములు
తాను
అర్చి భూముల నెల్ల ఆవులు మేపిరి
అయోధ్య మొగరాజు అన్ని
దేశములు
గో(వు) గణములకు మేత కొదవ
లేకుండ
ఆమెత చేయించి(నాడు) యాదవ
రాజు
తన గోకులములోనున్న తగిన
బంధువుల(ను)
పొందుగ బిలిపించి పొసగ
నిట్లనియె—
అసమాన ధీరుడైన ఆవులన్నకు
మరది
ప్రభగల వేట్కతో పద్మనాయని
బిలచి

శశి భాస్కరుని వంటి చిన్నతమ్ముని
బిలచి
యెలమితో (రమ్మని) పెయ్యల
వెర్రయ్య బిలచి
కరి (వీర) వైరులకు గనుడు కరి
యావుల రాజు
తమ్ముడా రమ్మని సకనన్న బిలచి
జలాచంద్రుని బట్టి చట్టలు చీరిన
అట్టి భీముని నెలవు ఆవుకుల మరది
పట్టవారి యర్రయ్యను (రాజు) దగ్గ
రకు పిలచి
బల్లిదురు వేగరు బహు విక్రమ
పరులు
కల్లలాడని సత్యగణుపు నిల్పనగ
చల్లహారిని రాజు లాస్మితో పిలచి
పంటవైరుల తుస్మి తలలు కంద్రించి
మీరిన మారాజు మేటి తమ్ముడనంగ
బీరినాయుని అత్యంత ప్రేమతో
బిలచి
మంద గోపాలకుని మరియు
మన్నించి

కంపటీలను పిలి(పిం)చి కవుగిటికి
చేర్చి
యాకర్ణ ముష్టులను వేట్కతో బిలచి
పెద్దలను బిలిపించె (రాజు)
పెద్దరికమూన
మనవి చెప్ప దొరకొనెను మాధవుడు
ఆవులన్న
'ముందు మన పెద్దలు మూడు
లోకములు
కదనిల్పె వలురాజు గనుడు
మన తాత
అతని కొమాళ్లు యెంచితే అతి బల
దేవులు
పంచమ యేదాంతులు బల్లిదు రేగురును
మించిన దేశాధిపతులు మెచ్చి
కొనియాడి

అంచితంబుగ కవులావులు
పంచుకొని పాళ్లు
అంచితంబుగ పుణులై అటు
చెల్లినారు
వారిని చంపిన వారిని (తా జెప్పెద)
వినుడి
ముత్తాత పగవాణ్ణి మొత్తివేసితిని
తమ తాత పగవాణ్ణి సంహరించితిని
సింహాద్రి (రాజు) పగవాణ్ణి చీలి
వేసితిని
పెద్దిరాజు పగవాణ్ణి పెరికి వేసితిని
యరనూక (రాజు) పగవాణ్ణి
యేపణగించితిని
నలనూక (రాజు) పగవాణ్ణి నరకి
వేసితిని

## కాటమరాజు సిద్ధిరాజుపై పోలురాజుపగను తీర్చుకొన గోరుట

పోలురాజు పగవచ్చె (తమ్ములార!)
పోరాదు మనము
వాదు (దగ్గరకు) వచ్చెను సిద్ధిరాజుల
వారికి మనకు
పొందులు చేసికొని పోరాదు మనము
అమ్మ (సిరిదేవి) వద్దనంగ
(పాకనాడు) ఆవుల మనము
ఆగరులమై వస్తిమి వారి భూములకు

వారి భూములకు వచ్చివలసినట్లుగను
పుల్లరి ధన మొప్పి పెన్న లోపలను
కల్లలాడకుండ (దేవగణంబులు)
సాక్షులున్నారు.
యల్లదేశములు మన కథలు
యెన్నికెక్కవలెను
పాల లోపల(మన) సత్యము పాటి
వుండవలెను

వొప్పు తప్పులు లేకుంటే(గాని)
వుచితంబు గాదు
తగువు గెలిస్తేగాని ధర్మంబు గాదు
పత్రాలు చించక (కాని) భావ్యంబు
గాదు
సిద్ధిరాజూ మనము సత్యమున వుంటె
(వారికి) వడబడ్డ (పుల్లరి) ధనమెల్ల
వప్పించవలెను
వరహాలు వక రాశి వంచించక పోసి
మాడలు వక రాశి మంచివ్వగాను
యడగర్ల చేతను యెంచించవలెను
సిద్ధిరాజును పిలచి (మనము) చెయ్యి
పుచ్చుకొని
'మా(వద్ద) పుల్లరిధనము మీకు
చెల్లిస్తిమి
నీరును పుట్టిన పూరెల్లకు నీవు మా
కిస్తిప
సీరున పుట్టిన వాడవు నీవు సాగాను[1]
నిన్ను కొనుక్కుంటిమి నీవు మా
సొమ్ము
నిన్ను నీరు చేయక నిలువ మిచ్చోటి'
(అని) పగదెల్పి కర్యంబు
(ముందు) బలిమి చేతాను(గని)
అందాక మేపుడి (మన) ఆవుల చేత
(నెల్లూరి రాకకు) కందుము తో
మేపరయ్య (మన)
కవులావుల చాత
పశువులు (వచ్చె) వచ్చేనని భూమి
పారిపోవలెను
యేటిమీద ఆరునెల్లు యడ చేసి
భూమి (వచ్చినారు)
యడ చేసిన షరతు యాడాది
వెళ్ళెను
కడచేసి పోదాము (యీ భూమి)
కవులావులు మేపుడి
చెలగి యీ భూమిని చేలు సాగాను
మెయ్యనియ్యండన్న (గోపాలకులు)
మేలాయెనని వచ్చిరి

## యాదవులు నెల్లూరి భూములలో తమ కవులావులను మేపుట

యగవిడిచిరి కవులావులు
యారాళముగను[2]
నెల్లూరు పడమట గన్నవరమయ్య
పంజుము నాగవారము పరగ
నున్నది
యేపులి యలగ్గిరు యరగుడిపాడు

1. సహాగాను 2. హేరాళముగను

మరినాడు రేమాడు మరి మల్లెపాడు
యీపుల భీమవరం యెలిముద్దపాడు
కోటి గుంపులపల్లి కోటేలపల్లి
రాక్షగుళ్ళపాడు రావుల కొల్లు
గంటి కోటపాడు కంపమడుగుల
పాడు
పడమట వెలుగొండ పంచలింగాల
కొండ
కరివెద్దు యేకురవ కంభమ్ము
స్తనియ
ఆదూరు పంద్రేల అన్నిబోయినిపల్లి
(మీరగను)

యగవిడిచిరి కవులావులు యారా
శముగను
ఆ రాజుముంద నావులు పరవడి మేసె
పెన్నవెంట గోకులము పేరుసాగి
నడచెను
విరివిగా ఆ పెన్న విడిమేల నుండి
జన్నెవాడదాకా జమిడి గుడారులు
యెత్తించెను రాజు యే కొదువ లేక
మించిన పడిగల మీగడాంబరములు[3]
అంచితమ్ముగాను గుడారులు
అమరంగ యెత్తించెను

## కాటమరాజు తనవారికి భూరిదానము లిచ్చుట

పడిగలు గొడుగులు పంచమారూధి
మురదులు గొలువంగ మన్నీలు
దొరలు
పెన్నలో స్నానమాడి ప్రేమలు గూడి
బాలలాడిరి గోపాలురు ఆలమ్ములు
గూడి
స్నానములాడి చాలించి దౌళ[4]
వస్త్రములు గట్టిరి
తిరుమణి తిరుమార్జము తిరుమందులు
ధరియించిరి
యీభూతి వల్లవులు యేట్కాతో
ధరియించిరి

సూర్యప్రభానులు సొంపుతో జేసిరి
బ్రాహ్మలకు దానమిచ్చిరి (తన)
ప్రధానులు తాను
శాస్త్రగంధము అక్షంతలు సొంపుతో
అలది
భూరి దానంబులు పొసగంగ జేసి
మంచి గంధంబు మరుదులకు పూసి
కస్తూరి తమ్ములకు కలయంగ పూసి
వస్తువులు దెప్పించి వారికిప్పించి
లక్షలకు దేదిన పక్షల కడియాలు
సక్కని తన రాచ తమ్ములకు నిచ్చి

3. మేఘడంబరములు 4. ధవళ

చెక్కిన (నవ)రత్నాల చావంపు
కడియాలు
మక్కువతో తిరుమందుల మరుదులకు
నిచ్చెను
తీరైన కిరీటకములు తిరుమందుల
వారి కిప్పించెను
మాణిక్యాల కిరీటకములు మర్లవారి
కిచ్చెను
చెంకుసు[5] చక్రాల కిరీటకములు
చల్లవారి కిచ్చెను

## కామరాజు జన్నివాడ గుంటి నెక్కుట

యెల్ల రాజుల కీర్తి యెక్కువగాను
గొల్లరాజులకీర్తి గోత్రకుల
పావనుడు
చల్లనివేళను జన్నెవాడ గుంటికి
చేరంగ వచ్చెను కులశేఖరుడు తాను
ఆ గుంటికి రాజు అనశ్వరించి మొక్కి
'యీ గుంటితో సాటి యేచాటికైన
పాటింప జగతిలో పరగంగ గలదే?'
అనుచు దగ్గరకువచ్చి ఆశీర్వదించి
మొక్కి
నిచ్చెండ్లు గావించి నిడిగంటి గుంటికి
ఆపైన మేగడాంబరములు గుడార్లు
యెత్తించెను
(మెరసి ఆమీదను) పడిగలు
గొడిగలు పట్టుబెక్కెములు
దట్టముగ విరిమేల పట్టు గుడార్లు
మండలాలు యెగసి మదనవల్లభుడు
గుంటు దిరుగ వారు గుడార్లు
యెత్తించెను
నిచ్చెళ్ళు జేర్పించిరి నిడిగంటి గుంటికి
బ్రాహ్మలు దీవింప భట్లు పొగడంగ
నిడిగంటి గుంటెక్కెను నిర్మల
చరిత్రుడు
ఆపైన గోపాల్కులు పట్టు సాలక
నెక్కిరి
వుత్తములు కొందరు 'గోవుగో'యనిరి
చెలగి పల్లవులంత 'శివశివా' యనిరి
కొందరు గోపాల్కులు 'గోయింద
(గోయింద)' యనిరి

## కాటమరాజు పద్మనాయునితో చదరంగమాడ దలచుట

గుంటెక్కిన సలసన్న కూర్మితోడుతను
పద్మనాయుని బిలిచి ప్రార్థించి పలికె:
"యినవయ్య చెప్పేను యిప్పర్ల
నాయుడ!

[5] శంఖములు

యింటి అర్జున చరిత్ర! యిను
రామచంద్ర!
యిప్పర్ల పోతునేడు గర్భరత్నకార!
మందలో ప్రధాని! మరిది
పద్మరాఘవ!
యినుము గంధర్వ గనుడ!(యినమ)
విన్నవించెదను
(యీ)జన్నెవాడ గుంటిమీద
సద్రాంగము[6] అడవలె (మనము)
యెల్లరాజులు ఆడే చద్రాంగము
యీడుగాదు మనకు
బారెడు బాసికాలు చేత పట్టవలదు
మనోగ్నాన మేర్పరచి (మన)
మందను తర్లించి
అట్టి యెద్దులపేరు యేనుగులబారు
కూడి యావులపేరు గుర్రాలబారు
చెలగి గోపాలకులు చిత్రకారులును
పెదబిళ్ల యాకరులు పెద్దసేదార్లు
ముష్టిగల కంపటీలు ముంగలబారు''
(అని) సద్రాంగ బలమును జయ
మేర్పరచిరి
పసిడి బాసిబాలు పట్టుకొని చేత
యిట్లాగనె నలనన్న యివరంబుగాను
''విను పద్మరాఘవ: వీరు వారనక
వోడు గెల్పులుండవలెను (మనము)
ఆడినందులకు
కేడువచ్చిన యటులాకు మనము
కోరుకోరాదు
యెందుకు సద్రాంగము
యెల పుచ్చరాదు
శశి రామచంద్రుండు చెలగి
వుండన్నాళ్లు
(తన) పశువులు కాస్తిమి
ప్రఖ్యాతిగాను
అనుమాన మేటికి అరగడియలోను
బ్రాహ్మణ్ణి అడిగినగాని శద్రాంగము
ఆడరాదు నాయుడా''
అనిన గోపాలకు లప్పుడేపోయి
నెల్లూరి పడమట ఆ దినమంతయు
తిరిగి
[అ] కాటమరాజుకు కరములెత్తి
మ్రొక్కిరి
'' యెందు వెతికిన బ్రాహ్మణుండు
మందుమార్గ మాయెను''

## పద్మనాయుడు కాటమరాజు శౌర్యమును ప్రశంసించుట

అని విన్నవించగ ఆ పద్మరాఘవుడు
అళ్లున తా నవ్వి అపుడిట్లగనియె:
"కడల చుక్కల రాజ! (వో)
కాటమరాజ!

6. చదరంగము

యీపాటి పనికి బ్రాహ్మణుని యేటికి
అడిగితివి?
(అక్కడ) తనకోటలోపలికి దట్టించి
యురికి
పాతాళ భూమికి పరుగున పోయి
పోయి దేవతలందరిని పొగడమని
మెప్పించి
ఆయిదు వస్తువులు మూడు
బిరుదులు
పట్టించి వస్తివోయి పశుపతి రాజ!
మషావతారమున (వస్తివోయి)
మనద వల్లభుడ!
పొడమెగసి వస్తివి (వో)
భూపాలకుండ!
అటిమంటి నాడు నీ కనుమానము
లేదు
యీపాటి పనికి బ్రాహ్మణు నేటికి
అడిగితివి?
పూర్ణ నరనాథ
వరుడ!
క్రవర్తులనైన
ప్రభువులనైన
ధరణి
లోపలను
భద్ర రాముడవు
నీవు
లు జరగిన
ఘనుడవు (నీవు)

చెప్పితివి యీమాట వొప్పరాదు
తనకు
గొప్ప దుర్గమ్ములు కొట్టి సాధించి
జాత్ర నాడు సాధించి జయమేసు
కొంటివి
(చక్ర) కూటముల దేవరాజుల
కొట్టి సాధించి
భూచక్రాల బిరుదులు పొందుగా
నీవు
పుచ్చుకొని వస్తివోయి భూపాల
కుండ!
కొంకణ దేశమును కొట్టి సాధించి
వకిణి కీలుకొమ్ము వసుధపై
చెల్లిస్తివి
పరకీర్తి ఘనుడవు అరవకట్టు
రాజ్యమున
ఆవుల మేపించిన ఆనాడు సాగాను
బ్రాహ్మణ్ణి పిలిపించి బలమడుగుదా
మన్న రాజువు గావు
యీభైయారు దేశములు యెద్దు లావులు
మేపించిన నాడు సాగాను
బ్రాహ్మణ్ణి పిలిపించి బలమడుగు
దామన్న రాజువు గావు
యీభైయారు రాజ్యములు యేసు
వంటి వంటె-
అంగ, వంగ, కళింగ, కాశ్మీర,
కాంభోజి,

కామరూప, సవిర, సౌరాష్ట్ర,
మహారాష్ట్ర,
మగధ, మాళవ, నేపాల, కేరళ,
చోళ, పంబెళ్ళ. గౌళ, మళియాళ,
సింహనందన, ద్రవిళ, కర్నాట,
కరాట,
కూరాట, అహనాట, నాట, రయ్యాట,
పులింద, కుళింద, విదర్భ, విధేయ,
బమిళిక, బర్బర, కేయక, కొసరక,
కుంతల. కొరత, శూర సేవ, వంగ,
తెంకణ, కొంకణ, మత్స్య, భద్ర,
సైంధవ,
వాచ్య, హరిసిత. గుజ్జరి, యౌవన,
జాలవిందు, సప్పరసిందు, ఔబ్య,
జన్మ,
విశేష, మాళాహళ, నేపాళ, మాగధ,
పాంచాల, చోళ, మృత్య. పుళింగ,
శూర సేన, వంగ, బర్భాట,
గాంధారి,
కాశ్మీర, కూరిసెల, బంగళ, గుజ్జరి,
సల్వ, సింధు, కొంకణ, వంగ,
సివంగి, వంగ, లలాట

అననొప్పు యాభయ్యిఆరు
రాజ్యములు
ఆవుల మేపించిన ఆనాడు సాగాను
బ్రాహ్మణ్ణి పిలిపించి బలమడుగుదా
మన్న రాజువు కావు
నీరు మంటల కోన, నిప్పుల కోన,
పాముల కోన, తేళ్ళ కోన, విషపు కోన
కారుచిచ్చు కోన, చీకటి కోన, వస
నాభి కోన,
మాతంగి పర్వతం మహాశక్తుల
కోనలోను
ఆవుల మేపించిన ఆనాడు సాగాను
బ్రాహ్మణ్ణి పిలిపించి బలమడుగుదా
మన్న రాజువు కావు
యీపాటి పనికి బ్రాహ్మణ్ణి యేమిటి
కడిగితివి ?
యీ అక్కర కొరకు బ్రాహ్మండు
యెక్కడా లేడు
నీమాట వృథగాదు నిజమౌటగాని
నీమనోగ్నానమున వక అవుసర
కార్యము పుట్టక పోరాదు
జన్నివాడ గుంటిమీదను సద్రాంగము
జయములేదు రాజ!''

## పల్లికొండ పెరుమాళ్ళు బ్రాహ్మణవేషమున కాటమరాజు వద్దకు వచ్చుట

అనిన కాటమరాజు అపుడిట్లగనియె

"కీడుగానియ్యి మేలుగానియ్యి

ప్రతిగ్న సద్రాంగం పట్టియాడ
వలెను"
అనంగానే పెన్న పాంచము†నున్న
పల్లెకొండ పెరుమాళ్ళు
బలం చెప్పుతానని బ్రాహ్మడై వచ్చెను
తన మతిలోను సంతోషించి తల
పోయ దొడగెను :
యల్ల దేశముల (ఆవులు) మేపించి
(నాడు) యాదవరాజు
చెల్లంబో ! నెల్లూరికి చేరంగవచ్చెను
జన్నెవాడ గుంటిమీద చద్రాంగము
ఆడుచున్నాడు
ఆడిన సద్రాంగము అనుమాన
మాయెను
(వారి) పశువులమీద (సూర్య)
గ్రహణం పట్టనున్నాది
(ముంగల కోయ) బోయలనుండి
పోరు పుట్టనున్నాది''
ఆ కాటమరాజు అడిగెనుగనుక
సత్యంబు తమకని పల్లికొండ
పెరుమాళ్ళు
బలము చెపుతానని (తానే వక)
బ్రాహ్మడై వచ్చెను
ధారుణీశ్వరు కడకు భోరున (పల్లె
కొండ వున్న దేవళంబు) వెడలెను

కాషాయవస్త్రాలు కనకకమండలాలు
పక్షిణివన్నె నుదుట పట్టెపర్ధనము
దండాపు కోలకు తగిన కైవళ్ళు
మెండైన జపమాలిక మెరుగు జంజెంబు
గొబ్బున వకచాత గొడుగొప్ప బట్టి
దర్భవుంగరములు తగ వ్రేళ్ళ బెట్టి
అక్షంత పుటికలు అరచేత బట్టి
చెంగావి వలిపంబు చంక పుస్తకము
అవుధరించుకోని అటువలెనే (పల్లె
కొండ పెరుమాళ్ళు) వెడలి
బలము చెపుతానని (వక)బ్రాహ్మడై
వచ్చెను
దారణేశ్వరు[7]డు కడకు
దబ్బున వచ్చెను
'శుభమస్తు' అని వచ్చి శుభ
ముహూర్తమున
రాజువున్న గోకులము సౌరబడి
వచ్చెను
గోవులు గోపాల్కులు గొబ్బున
చూచిరి
పశువులు కంపటీలు భావించి చూచిరి
గొల్లిండ్ల (దాను) గూర్చుండి కుల
పావనుండు
కాటమరాజు(వున్న)కడకు ఘనుడు
రాంగాను

---

† ప్రాంతము > ప్రాంత్సము > పాంచము 7. ధారుణేశ్వరు

## కాటమరాజు బ్రాహ్మణుని పూజించి బలము చూడుమని కోరుట

బ్రాహ్మణుడు వచ్చెనని భటులు
చెప్పంగ
ఆమాటవిని (కాటమ)రాజు ఆనంద
మున బొందెను
గొప్పన సద్రాంగము గుండు దిగ
వురికి
బ్రాహ్మణునికి యెదురుగా భక్తితో
బోయి
కన్నంత మున్సుమొక్కి గనత
తోడుత తెచ్చి
స్నానంబు చేయించి (సన్నద) సద
రాంగముపైన
కూర్చుండబెట్టెను కులపావనుండు
(అత్తరు)[8] పన్నీరుతో బ్రాహ్మణుని
పాదములు గడిగి
తనపైన జల్లుకొనెను ధారుణీశ్వరుడు
చల్వగంధ పుష్పములు చందనము
అలదెను

చెలువొప్ప నమస్కారంబు చేసి
యిట్లగనియె :
"యెచ్చోటనుండి నీవు యేతెంచి
నావు ? వో బ్రాహ్మణయ్య !
యేమి మీ దివ్యనామంబు యెరింగించ
వయ్య !
యిచ్చోట కేతెంచిన యేమి కార్యంబు
(తమ) వల్లవులు తిరుమందులకు
పయనమైనాను
(గాచ్చార)[9] బలము చూడవయ్యా
వో బ్రాహ్మణోత్తముండ !"
అని ఆనతివ్వగాను యాదవులజూచి
తీరుగా అందరిని దీవించి పలికె
బంధుజన గోపాల పరివారంబు దాను
గ్రంద మచ్చుంతలు[10] కడుకొని
దెచ్చెను

## బ్రాహ్మణుడు యాదవవంశ క్రమమును వివరించుట

దీవించిబ్రాహ్మణుడు దివిజులుపొంగ
"(వో)యాదవ గాంభీర్య ! అఖిల
వినోద !

మంథార ధారుండ ! గంధర్వఘనుడ
(వినుమ)

---

8. అత్తరు 9. గ్రహచార 10. గంధమచ్చింతలు

మీ యాదవవంశపు చాలు
అవుతారము వినుడి :
ముందు మీజన్మంబు మూలమట్టుగను
కందువతో చెప్పేను(మీ) కథ యెల్ల
వినుడి
మంథాద్రి (గిరి సముద్రము) తర
వంగ మరి గోవు పుట్టె
గోవుల యెంటనే(గో)వుల రక్షకుండు
(పుట్టెను)
గోవుల రక్షకుండు కొనితెచ్చిన
అమృతము
హరిహర దేవాదిదేవతలకు పంచి
పెట్టించెను
ఆ యుగం పొడిమారి ఆదియం
దుండెను
గోవుల రక్షకునికి జయంత్రుడు యని
వక కొమారుడు జన్మించెను
ఆ కొమారునికి అగసనందనుండు
అని వక కొమారుడు జన్మించెను
అగసనందన కొమారుడు సింహ
నందనుండు
సింహనందను కొమారుడు అగస
నందనుడు
అగసనందను కొమారుడు
ఆదినారాయణుండు
ఆదినారాయణుని కొమారుడు
బ్రహ్మ

బ్రహ్మ కొమారుండు [11]బృంగు
మహాముని
బృంగు మహాముని కొమారుండు
అమృతుండు
అమృతుని కొమారుండు ఆది విశ్వ
బ్రహ్మ
ఆది విశ్వబ్రహ్మ కొమారుండు
సూర్యుడు
సూర్యుని కొమారుడు చెనేశ్వరుడు
చెనేశ్వరుని కొమారుడు నయ
నేంద్రుండు
నయనేంద్రుని కొమారుడు కాల
శంకరుండు
కాలశంకరుని కొమారుడు
త్రీశంకరుండు[12]
త్రీశంకరుని కొమారుడు
హరిచ్చంద్రుండు
హరిచ్చంద్రుని కొమారుండు
లోహితాస్యుండు
లోహితాస్యుని కొమారుడు
దుందుబానుండు[13]
దుందుబానుని కొమారుడు
యవనాశ్వుండు
యవనాశ్వుని కొమారుండు
మహందాత[14]
మహందాత కొమారుండు
కృతాసంధనుండు[15]

---

11. భృగు 12. త్రిశంకుడు 13. ధుంధుమారుడు 14. మాంధాత
15. కృతసంధుడు

కృతాసంధనుని కొమారుండు
దాత్వసందనుండు
దాత్వసందనుని కొమారుండు
కకస్తుండు[16]
కకస్తుని కొమారుండు కల్మష
బాంధవుండు[17]
కల్మషబాంధవుని కొమారుండు
అమిత సత్వుండు
అమిత సత్వుని కొమారుండు
అంబరీషుండు
అంబరీషుని కొమారుండు సోముండు
సోముని కొమారుండు డిల్లీబు[18]
డిల్లీబుని కొమారుడు బగిరాజు
బగిరాజుని కొమారుడు రఘు
రఘువు కొమారుడు భాస్కరుడు
భాస్కరుని కొమారుడు అగ్ని
వరుండు[19]
అగ్నివరుని కొమారుడు శీగ్రగతుండు
శీగ్రగతుని కొమారుండు బసాసు
బసాసుని కొమారుడు మగిలి
మగిలి కొమారుడు పులివారి
పులివారి కొమారుడు ధీరుడు
ధీరుని కొమారుడు యక్షధీరుడు
యక్షధీరుని కొమారుండు కుక్షి
కుక్షి కొమారుండు వినకుక్షి[20]
వినకుక్షి కొమారుండు విస్సట
విస్సట కొమారుండు హరి
హరి కొమారుండు హర్జుడు[21]
హర్జుని కొమారుండు దశరథుడు
దశరథుని కొమారుండు
శ్రీరాఘవుండు
శ్రీరాఘవుని కొమారులు కుశలవులు.
కుశలవుల కొమారుండు
కుంచ గోపాలకుండు
కుంచగోపాలకుని కొమారుండు
సర్వేశ్వరుండు
సర్వేశ్వరుని కొమారుండు
కేశగోపాలకుండు
కేశగోపాలకుని కొమారుండు
ఆనంద గోపాలకుండు
ఆనంద గోపాలకుని కొమారుండు
వసుదేవుడు
వసుదేవుని కొమారుండు
శ్రీకృష్ణుండు
శ్రీకృష్ణుని కొమారుండు మన్మథుడు
మన్మథుని కొమారుండు
ఇంద్రదేవుండు
ఇంద్రదేవుని కొమారుండు ఆనంద
సేనుండు
ఆనందసేన్నుని కొమారుండు
అంభోదు
అంభోదు కొమారుండు ఘట్టంబోధి
ఘట్టంబోధి కొమారుండు వీరంబోధి

---

16. కకుత్థ్సుడు 17. కల్మాషపాదుడు
18. దిలీపుడు 19. అగ్నివర్ణుడు 20. వికుక్షి 21. అజుడు

వీరంబోధి కొమారుండు
విజయంబోధి
విజయంబోధి కొమారుండు
రాయంబోధి
రాయంబోధి కొమారుండు
చంచుంబోధి
చంచుంబోధి కొమారుండు జలంబోధి
జలంబోధి కొమారుండు కనకంబోధి
కనకంబోధి కొమారుండు
యయ్యాద్రి[22]
యయ్యాద్రి కొమారుండు కవులావుల
గంగురాజు
కవులావుల గంగురాజు కొమారుండు
ఆవుల భూపతి
ఆవుల భూపతి కొమారుండు ఆవుల
అమృతయ్య
ఆవుల అమృతయ్య కొమారుండు
ఆవుల వలురాజు
వలురాజు కొమారులు అయిదుగురు,
వారు యెవరంటే-
సింహాద్రిరాజు, పెద్దిరాజు,
యరనూకరాజు, నలనూకరాజు,
పోలురాజు,
యయ్యాద్రి పెండ్లైన కొన్నాళ్ళకు

తెరెయాట [23] వెళ్లెను రాజు
తేజంబుగాను
అసురుసురు మని దప్పిక జిక్కి
ఆ కాట నిలచి
విషసర్పంబును రాజు వెనుకంట
వచ్చి
అక్కడ శుక్రాచార్యులు అతికూర్మి
బిడ్డ దేవయాని
రాక్షసేశ్వరుని కొమార్తె రమణి
శర్మిష్ఠ
కారణమున యయ్యాద్రి కైకొనె
నిద్దరిని
వారి యిద్దరికి యదు తుర్వసు
ద్రుహ్యు
అను పూరు లనువారు అయిదుగు
కొమాళ్లు
యదు వంశమున పుట్టిన యాదవులు
మీరు
పురహరుడు వంశమున
పుణ్యాత్ములు మీరు
వారిలోని వారే వల్లవులు
తిరుమందులు
వైనవైనాన సూర్యవంశము మీది

## బ్రాహ్మణుడు కాటమరాజు పూర్వజన్మ వృత్తాంతమును చెప్పుట

కృతాయుగమాయెను త్రేతాయుగ
మాయెను

ద్వాపర యుగమునాటి ధర్మాత్ములు
మీరు

22. యయాతి 23. తెరవేట

ఆదిమూర్తులై జన్మించి యాదవుల
యిండ్ల
యిలవెల్ల సరదోలు యిప్పటిప్పటికి
గోవురూపమై జన్మించె
గోయిందమూర్తి
సురులు గోపాల్కులై సొగసుగా
పుట్టిరి
సురకాంతలు గోపికా సుందరులై
పుట్టిరి
విష్ణుతో జన్మించి (గోపాల) వీరులై
తిరిగిరి
ద్వాపరము నాటి బిరుదులు
దక్కించు కొనిరి
నందుని కుమారుడవై నారాయణ
మూర్తి!
దూడల గాస్తివి తోణికి కొన్నాళ్ళు
హరుడవై జన్మించి అయిదవనాడు
భూపాలకుండవై (పుట్టివి)
గోపెమ్మ యింటను
ఆ గోపెమ్మ గర్భమున కూర్మి
పుత్రుడవై
యేశోద పెంచుకొన్న వాసుదేవుడవై
(వస్తివయ్య)
చెలికాడవై పుడితివి చిన్నవరులాకు
వడుగు జంజెంబు వేసిరి గార్గాది
విప్రులు
పైడి వుత్తరీయం వెండి వుత్ర
జంధెంబు

కనుక మీపాలను గలిగి వుండేను
(నాడు) దేవేంద్ర లోకము తెగి
కొల్లలాడిన
కందర్పజనకుడు మీమంద నావై పుట్టె
సామాంత రాగోల జమిలి
టెక్కెములు
శ్రీమంతు దివ్వంగ (మీకు) సేమాలు
గలిగె
ముందురొమ్ము పోట్లు నాడి
ముమ్మరముగాను
కురుక్షేత్రమున మీరు పోరిగిననాడు
మెచ్చి శ్రీమన్నారాయణుండు
మిమ్ము వైకుంఠాని కుంచెను
ముందు రుక్మిణి పెండ్లి కందువతో
నాడ
శిశుపాల దంతవక్త్రుల శిరసులు
నరికి
పౌండ్రక వాసుదేవుల పట్టి సాధించి
యిలయెల్ల సరదోలు యిప్పటిప్పటికి
గట్టిగా బిరుదులు గైకొంటి వనియు
(యీ) కలియుగ ప్రాంతమున
కాట భూపాల!
పెద్దమ్మ దేవులకు పెద్దిరాజునకు
కల్యాణ సోమప్ప ఘన వరముచేత
కొమరుడవై పుట్టితివి కోర్కె
తోడుతను

## బ్రాహ్మణుడు జన్నివాడ గుంటి చరిత్ర చెప్పుట

యెక్కితివి నీవు గనగ యీ నడిగంటి
గుంటు
వాకరైతె బస్మమై వొరుగుదు
లిచ్చోట
నిడిగండి గుంటి అవుట నిజము
చెప్పెదను
పాండ్రగంటి గుంటి అగుట ఒలము
చెప్పెదను
జన్నెవాడ గుంటి అవుట జయము
చెప్పెదను
రాముని కులసతిని (సీతను)
రామణబ్రహ్మ
చెరం గొంపోయి లంకలో
వుంచిననాడు
డెబ్బదిరెండు వేలు (సిరిశానలు)
దండు గూర్చుకొని
వనచరోత్తములెల్ల వారాధి గట్టంగ
వనచరులు కొండలు వడి తెచ్చు వేళ
అనుమంతుడు పర్వతము అందుకొని
రాంగను
(అప్పుడే) వారాధి కట్టబడిన వార్త
విన్నాడు
అనుమంతుడు పర్వతము అపనిపై
విడిచెను.
విడిచిన పర్వతము వేళ్లపొడుగున
పెకిగి(యుండెను)

చదరమైవున్నది (నీ అంటి రాజులకు)
స్రదాంగమాడ
నిగిడివేసిన పర్వతము నిడికల్లు
అవును
పారవేసిన పర్వతము పాండ్ర
కల్లవును
జార విడచిన పర్వతము జన్నెవాడ
గుంటు
యీ గుంట చంద్రాంగమాడి తొల్లి
గంధర్వులు వోడినారు
వారుయవరంటే—
బట్టి విక్రమార్కులాడి గిట్టి
పోయినారు
విధియాడి మహంధాత విధిచేతనే
వాడెను
దేవతలు యీ గుంట స్రదాంగమాడి
స్వర్గము కోల్పోయి సతమతమయిరి
కార్తవీర్యుండు యీ గుంట స్రెదాంగ
మాడి
కరములు గోల్పోయినాడు పరశు
రాముని చేత
ఆర్గురు చక్రవర్తులు పదహార్గురు
రాజులు
యీ గుంట స్రదాంగమాడి హతా
హతమై పోయినారు

అటుగాని మీరు సద్రాంగమాడ బోవు
చున్నారు
వోడు గెల్పు కానరాకున్నది వో రాజ
మీకు

## కాటమరాజునకు నెల్లూరి సిద్ధిరాజుతో ఏడుతరాల పగలు గలవని బ్రాహ్మణుడు చెప్పుట

నాటనున్నదయ్యా నెల్లూరి రాజులకు
మీకు
యేడు దరాల పగలు మీ యెదమున
వున్నవి
పన్నెండు దరముల పాతబోయిన
పగలు
పాతబోయిన పగలు మీ పాల కలిగి
వున్నాయి
(ఆ) పగలు ముంగల వుండంగ
బలిమిగై కొంటివి
(ముందర కోయ) గోయలనుండి
(యూరికి) పోరు పుట్టచున్నాది
యురవైయొక్క దినము
యింముందు నాటికి
పశువుల మీద (సూర్యా) గ్రాణము
పట్టనున్నాది
పట్టినా గ్రాణము పగటి వింతగాను
పల్లవులకు తిరుపుండాలకు యీా
గొల్లలకునెల్ల
కల్లగాదు తగిలేని గ్రాణ కీడింత

పశువుల యేమర్లకుండుడీ పగటి
వింతగాను
వుండుడి (మంద) యేమరక (మీరు)
వుచితంబుగాను
యెల్లుండి వుదయాన్నుండి యద
మందు మీరు
ఆదవుంచుడి దయ వో యాదవు
లారా !
ముందు ఈశ్వరనామ సంవత్సరము
నుండి
సీరుసబుట్టిన పూరి సీవుగైకొంటివి
అడిగినంత పుల్లరి (కనవు) అతనికి
నొడబడితివి
అతడే సత్యాన వుంటేను నీవు
సత్యాన వుంటేను
అతనికి వడబడ్డ పుల్లరిత పమ్మెు నీవు
గైకొంటివి
సిద్దిరాజు మనసు సంతోషపరవి
అటువెనక పోయి పగలు వున్నవని
బట్టుచేత లెక్కలు పెట్టించు రాజ

ఆ వాదు మీమీద వుండేను అది మీకు
స్వర్గంబు లేదు
ప్రాణమే అవుసెచ్చి తంబు[24] మానమే
ఆచంద్రతారార్కమవును
ప్రాణము శరీరాన బుట్టినది మానము
మాటన బుట్టినది
(అటుగనుక) మాట దప్పరాదు
మహిపతులకెల్ల
యిటువంటి (మీ) కార్యము యీడేర
కున్నది
యరగడ్డపాటి మీద యామారకుండ
పదిలమై వుండరయ్య బడుగుల రాజ !
పోయి వచ్చెదనయ్య
పుండరీకాక్షుండ !
దయవుంచు మామీద ధర్మాత్మకుండ
దేవబ్రాహ్మణులాము మా దీవెన
బొందుమీ''
అనిన కాటమరాజు అతి వేడ్కతోను
తన రెండు బుజములు తలదాయ
జేరిగి
ఆనందమును బొంది వేగంబె బల్కె:
"శుభమస్తు ! జయమస్తు ! దీర్ఘాయు
వస్తు !
ఆనందమున దీవించి అక్షంతలు వేసి
మందవెళ్ళుచు బ్రాహ్మణుడు
మాయమైపోయె
అందరు చూడంగ అక్కడ
అదృశ్యమై పోయెను

అందుకు యాదవులు అపుడిట్లగనిరి :
బ్రహ్మో ! విష్ణో ! యితడు
పరమేశ్వరుండో !
కాని చిల్లరదైవము కాబోడు యితడు
మానవజన్మములు జెప్ప మరి
మహాత్ముండు గలడ ?
వంశవార్తలు జేసి వుంచుకొన
లేమైతిమి"
అడిన యాదవుల జూచి కాటమరాజు
అపుడిట్లగనియె :
"యితడు యెవరనుకున్నారో వో
యాదవులార !
యితడే నెల్లూరు పల్లెకొండ పెరు
మాళ్ళు సుమ్మీ !
మనకు పంచాంగ బలము చెప్ప
వొచ్చినాడు
మనకు పంచాంగబలము చెప్ప
వొచ్చినప్పుడే
మన బాలరాజులు అవ్వన సూకడ
సుమ్మీ వో పద్మనాయుడా !''
ఆమాట విని పద్మనాయుడు అపు
డిట్లగనియె :
''యెల్ల రాజులతోటి పొందవును
మనకు
తనతోటి సంగడమట తమకు యీ
యనకు
నెత్తురుకూటి పొందు నెలనైన మరిది!"

24. అనిశ్చితము

## ఆలమందలను స్వేచ్ఛగా మేపుడని కాటమరాజు యాదవులకు అనుమతి నిచ్చుట

అనిన కాటమరాజు అపుడిట్లగనియె
"యితడు ఆడిన మాటలు అన్నియు
నిజము
కల్లకాదు అన్నియు కానున్న పనులు
వల్లవులు తిరుసుందులు వారు వీరనక
యెల్లినేటి తనక యెడబాయ కుండుడీ
యెడబాయకుండుడీ వో యాదవు
లార !
కడు వేట్కతో మీరు కలిసి
వుండరోయి
యిక పుల్లరి వారిసొమ్ము భూములు
మన సొమ్ము
పశువులు యెగవిడిచి మేపుడీ
భయమేమి లేకను
యెడ్లను యెగవిడిచి మేపుడీ
యేమి గావచ్చెను :
కవులావు లెగవిడిచి మేపుడీ
కాదన యవరికి కారణము లేదు"
అనిన మాధవుని మాటలాకు
మందనావులు ఎగవిడిచినారు

కుదురు ఆరామడ కదులు
పన్నెండామడ
కదలిన వోయి కామధేనువులు
కామధేనువులు కాంబోధి మేసెను
చల్లవారి గోగణములోను చవిడి
గుడార్లు
గుడార్లనీడను కొలువుతీర్చి
కూర్చుండిరంత
పుల్లెద్దు బొల్లావు మట్టెద్దు బసవన్న
గట్టిగ గుడార్లనీడ కదలక వుండెను
వుండిన వేడుకతోను వుర్వీశ్వరుండు
చెలగి పద్మరాగముసతోను కాటమరాజు
చదరంగమాడ సాగె
వెయ్యేవేలక చద్రాంగము వేసి
యాడసాగె
పదిలక్షలకు చద్రాంగము పట్టి
యాడసాగె

## కాటమరాజు గోగణములు పాకనాటిలోని వరిచేలను వనములను ధ్వంసము చేయుట

పశుపతిరాజు గోకులములోను
పరువాడి పాకనాటి
పరియనక వంత అనక వారి
కవులావులు

మాధవుని కవిలావులు మదుగోరి
మేసెను
యెండితూము చెరువెనక
యెల్లడములు మేసెను
పైడితూము చెరువెనక పాలంకి
మేసెను
రాగితూము చెరువెనుక రాజనములు
మేసెను
కంచుతూము చెరువెనుక కాంభోధి
మేసెను
భూపాలుక్కని కవిలావులు భూములు
గప్పుకొనెను
భూతలించి అంబోతులు గోదేవుల
మెచ్చెను
గొడ్డుటావులు మేసె అడ్డుహర్గను
లేక
పాలు గురుస్తున్న వరి మేసెను
పండువరి మేసెను
పద్మరాఘవుని కవిలావులు పరునడి
మేసెను
చాకిచెర్ల ఇరిమేల చల్లవారి కవి
లావులు
వచ్చి పేనయట్టి వరి భస్మంబుచేసెను
పంటలు లువలు త్రొక్కెను బట్ట
బయలుగాను
పొట్టికసువులు మేసె మట్టు
పల్లాడెను

జొన్న పునాచులు మేసె జన్నెవాడ
ఫలము
కనుచూపు యిరుమేల కాలి
ధూళాయెను
వుసిరికల చెరువులు గొప్పగ వారి
వుక్కుటావులు మేసెను
మొక్కళ్లపు యెద్దులు వరి
మక్కువారగ మేసెను
బీరనాయని కవులావులు పెంట్రాలు
నిండెను
మొగళ్లచెరువు గప్పుకొని బోడావులు
చెన్నయావులు
కదబడి రారుట్లు విరుగగ మేసె
కనిగిరి చెరువులు కాంభోధి
కారుజొన్న కదబడి మేసె
కంబల చెరువులోను వారి
ఆహారములు మేసె
పొంగుటూరు యిరుమేల బోడావులు
మేసెను
అగ్రహారములు యిరుమేల అగర
మహావులు
వుగ్రకోపముతోన వుల్లబడి మేసెను
జాల బొల్లావులు సంగటావులును
నేల యానినరీతి నెల్లూరి యిరుమేల
తెల్లబొల్లావులు వక దేము దెరుగును
యెర్ర మహావులు యెన్నూరు గోట్లు
ముష్టి కవులావులు మున్నూరు కోట్లు

యల్ల కవులావులు వెయ్యిన్నూరు
కోట్లు
పెదవెల్ల కవులావులు పదిన్నూరు
కోట్లు
బాలాజి కవులావులు పట్టుసాలక
భూమి
యలమ కవులావులు యెల్లివిరిసి
భూమి
పంటరెడ్డి కవులావులు పట్టుసాలక
భూమి
అర్భితపు కవులావులు అన్నియు
గూడి
నిర్భితపు కవులావులు ఆయిన
నికళంబులలోను
గోవు గణంబు లక్కడ కడగుర్తు
లేదు
శృంగారపు తోటలు చీకాకుపరచె
మక్షరంబున వనములు మట్టు
మల్లాడి
పక్షిణిమ్మ పనస పిప్పిలి నిమ్మ
పాటిని మగుళ
గణతార సంతోష కార్మి వనములు
మలియించు కర్పూర మహా
తురంగములు

చెల్లించి కురువంగ జంబీసతరువులు
తాళిత వింతాళ నారికేళవనము
పుష్పసొగసున వొప్పపూరి పుష్ప
బహుళ పరిమెళ వినుత
కదలె మంద రావులు కడుపులుమేసె
చెల్లించె త్రుళ్లుచు వడిగెల్చుచూను
చెల్లించి దాటుచు చెలగె వృక్షములు
రాశి ఖణేలున రంకెలు వేయుచు
యెస సిద్ధ టప్పుసూను వషఫలములు
మెరసి
గోవులు చెల్లింపుకొనుచు కడువార
వచ్చి
అంభారములు మేసి కేవులు జేరి
ఫికసించి
ఆత్మ అనుచుపై ఋతను మోపు
పెంచటల్లు చూను
పెల్లుగా బిగువారజేసె జల్లున నిల్పక
జల్లు నిల్పక ప్రక్క చెల్లించెపాలు
చుముకులై వేడ్కతో జొరిచ్చు
విచ్చగాను
నెమరువెట్టుచు వృక్షములకింద జేరి
ఆవులు వుండినట్టే వుండి అటు
చెల్లింపుకొనుచు

## వడ్ల జాతులు :

ఆ నెల్లూరి చెరువు వెనకాల
కాటమరాజు

మేసిన వరిసేలు యెషమంటి వంటే-
కస్తూరి నిగనాలు, గౌజుగౌరిలూను

రాజనాలు, రవిగుత్తులూను
రెక్కలు రెక్కార సంగులూను
దినసరులు, ముత్యపుసరులు
గజదంతాలు, మొగటకందలు
యర్రమచ్చలు, గోధుమలు
దొమ్మర కేతువులు, కప్రవసంగులు
కళింగ పూవులు, యర్ర వొడ్లూను
గుమ్మడి గుత్తులు, కొమ్మగౌరులును
కాంబోడి వంకెలు, రామగిరివంకెలు
పులి పీసాలు, సాటిలూను,
అత్మసరులూను, త్రివెంగళి మెచ్చులు
తెల్ల మారావులు, యర్ర మారావులు
యలిక మోరలూను, విప్రరావులూను
కళింగ వొడ్లూను, పొన్నలూను,
గొంతెలూను, మునిపళ్లు,
రాణి రాత్షమోక్షలు, రామద్వార కలును
కాటికాడి కన్యలు, యాగబండ్లును
పున్నమి వెన్నెలలూను, వింటి సింగళ్లూను
మార్తపుగుటకలు, పడుగు ఆకులు
మొలకలు, గగ్గాజాలలూను,
పచ్చగన్నేరువడ్లు, ఫలాతులూను,
తదియ రోజనాలు, ముత్యపుచారలు
కవిపురియాలు, విమరామలు
వంకిట్లు మొదలుగల రాజని రాగుమ్మళ్లు
మంచి జిలకరవడ్లు పట్టివడ్లూను
పొట్టు మోకలవడ్లు తోకకరణీలు

కాటిక టెక్కాలు వీగిబండలు
జాడీ రాత్షసూలు, పున్నమివెన్నెలలు
వింటి సింగళ్లు, రాణి ఖర్జూరము,
రామాయణ కరంబ చెక్కిళ్లు
గజపతి గుళ్లు గదప గన్నేర్లు
శ్రీరామువంకెలు, సీతభోగులూను
గుర్రపు తోకలు, గుజ్జుమొలకలును
రాజనపువడ్లు, రామతలంబ్రాలు
తేజముతో ముత్యాల అరుదైన వడ్లు
శాంభవీవడ్లును, సన్నవడ్లూను
కాంబోది వడ్లును, కన్నెపు గుత్తులును
యెనుగామోదములు. యెలవంగిపు వడ్లు,
పిచ్చిరికూనిరాలు, బిరుదులు, నల్లవడ్లు,
అత్షము గనెపలు, అతికె సన్నవడ్లు
అచ్చరువుకరాలై, యెలమిన ఆంసలు
యతపువ్వువంకెలు, వికివల్లు వడ్లు
సితకోరలై జిగులు సన్నాలు
వాసిగాలిసయట్టె వరింపు వడ్లూను
జావిళ్లు వరులు, బంగారుతీగెలు
సందిగాల వొడ్లు, సంబంది వొడ్లు
మోదురుతోటి మేలైన మొదలైన వొడ్లు
కరిణి పిషిని శూల కాకిరెక్కవొడ్లు-
యిటువంటి వొడ్లు మేపించినాడు ఆ కాటమరాజు

అటువంటి వొడ్లు మేసి అవుల మందలన్ని
పెల్లుగా పొదుగులు బిగువారగ జేసి
జెల్లున నిల్పక చెల్లించె పాలు

## పంట పొలములు ధ్వంసము కాగా నెల్లూరి కాపులు సిద్ధిరాజునకు కొండెములు చెప్పబోవుట

అటువలె గతకొన్ని మెయ్యంగను
ఆ సీమ కాపులందరు జూసి అసూరు వుసూరుమనిరి
పసిబిడ్డ బాలలు ప్రణాలింప దొడగిరి
పల్లవాది నల్లసిద్ధిరాజు భూమి
ప్రజలు అల్లడ తల్లడ బడిరి
అల్లాకుల్లారమైరి నెల్లూరి ప్రజలంత
అసూరు వుసూరుమనిరి ఆ సీమ కాపులు
యెన్నడు యీ పాపము యెరుగరు వారు
యెక్కడనుండి వచ్చెనోగాని యీ గొల్లరాజు
వీడి యావులు పోటుబోను మాకు ఆగరువు లాయెను
చెరువులు చేలన్నిమాకు యెరువులు జేసెను
యెరువులు జేసెను మాకు యీ గొల్ల రాజు
మురుగుమోసమాయె మనరాజు బుద్ధి శాత
వద్దసలేమైతిమి మనమంతా అతని వద్దనే యుంటిమి

కద్దా యిటువంటి కర్మమెక్కడనైనా
భూమిలో రాజులంతా పుల్లరికిత్తురు గాని
నీరున బుట్టిన పూ?
ఆ ఖర్మడిచ్చిన కవుళ్లు కాలవేసి భూమిని
పాడుజేసి పోదామనిరి పాకనాటి ప్రజలు
వేకమున పోదామనిరి యీ భూమి కాకిపాడు జేసి
ఆ మాటకు అన్నిదిక్కుల చౌదరులు అందరు గుమిగూడి
పశువులు జూడ చెప్పుదామని వక్క పరుగున కదిలిరి
వుద్దగిరి భీమనేడు, వుదయగిరి భీమ నేడు
సిద్దపట్ల తిమ్మనేడు, శృంగారపు మల్లిరెడ్డి

బొజ్జలు చెమటగాను ధోవతులు
వూడగా
సిక పీడి తలపాగలు జీరాడగాను
వెర్రి అనుకుంటూ మొర్రో
యనుకుంటూ
మొర్రోయనుకుంటూ మూకలు
గూడుకొని
పరుగున కొండెము చెప్ప బారలు
చాపుకుంటూ
చొప్ప కట్టలవలె చేతులు విరుచు
కుంటూ
పొట్టచెరువులు మాదిరెడ్డి కదసి
కొట్లాడుకొనుచు

యర్రగుంట మాదిరెడ్డి మళ్ళ
యదురాడుకొనుచు
కోమల జమదంకి కాపులు అందరు
కదిలిరి
కూడికి యెలమలు రెడ్లు గుమిగూడి
కొనిరి
కొండెములు సిద్ధిరాజు కొలువులో
నిలిచిరి
చెయి చాచమని వేగ చెప్ప
దొరకొనిరి

## సిద్ధిరాజులవారి కొలువుకూటు వర్ణనము

ఆవేళ సిద్ధిరాజులవారి కొలువు
యే విధముగా నుండెను-
శ్రీ విక్రమార్క సింహాసనాపురము
అన నొప్పు నెల్లూర అతివేట్కతోను
పాలింప ఖానుండు బాహుబలుండు
పల్లవాదిత్యుండు పటుసాహసఘనుడు
బలిమి చెలిమియుగల బసవశంకరుడు
కాలరుద్రుండు భూకాంతుండు
యితడు
పత్ర వీర మరగజ ఖానుతేజుండు
విరసించిన రాజులకు శిరసు
ద్రుంపతడు

మురిసేటి రాజులకు ముక్కు
కొయ్య యితడు
కరికన్నులు చింతామణి కలయట్టి
రాజు
చేతుల పరశువేణి చెన్నందగల
రాజు
పరగ సత్యము యేర్పాటు గలవాడు
కలలోన బొంకని కరుణా
సముద్రుండు
పాటిదప్పని యట్టి పరమపుణ్యుండు
అసహాయ శూరుండు
అతిభయంకరుడు

వెరపు మరపూలేని వి క్రమశాలి
కోటి లక్షల దుర్గములు కొల్లలాడిన ఘనుడు
దట్టించిన రిపులకు దనుజ వల్లభుండు
మన్నీలకు జనులకు మదన వల్లభుడు
పుడమి గలిగినయట్టి నలసిద్ధి రాజు
కోర్కెతోడుత యిలాగునే కొలువు గూర్చుండగాను
వింజామరంబులు వెలియ వకలక్ష
పసిడి బద్దలవారు పరగ వెయ్యున్నారు
యెండి బద్దలవారు వెయ్యున్నారుకోట్లు
గరిమి తోడుతను కలిమిగల్గిన వేడ్కతోను
అలిపంబు వక కొత్త అడపంబు బట్టి
కుటిల కుంతల వక్ష్యకుంచయు గలవాడు
శుందారమణి అగుసు నట్టిగాను
గనుపట్టి సింహాల గద్దెపై నారగి
పెనుకొని దాకాల పెనమలగరించి
కన్నుల కిరీటమున రాజు గరిమతో బెట్టి
వజ్రాల పతకంబు నారాజు వల నొప్పవేసి
కర్పూర మిశిత గంధ మాత్రలు
పన్నీరు పొదియించి బాగుగా నలది
విద్యామంతులు కైవారం చేయంగాను
తెరుగొప్ప భూలోక దేవేంద్రుని కొలువు
అని చెప్పబడెను అటువంటి కొలువు

## కాపులు సిద్ధిరాజుతో గొల్లరాజు ఆగడములు చెప్పుట

కొలువుకూటములో రాజు కూర్చుండ గాను
చెయిసాచి మనవిగా కాపులు చెప్ప దొడగిరి
"యెన్నడు యీ పాపము యెరుగము రాజ !
నిర్మూలమాయెను నెల్లూరు రాజ్యము
గొల్లరాజుకు భూమి కొల్లలుగా యిస్తివి
మాదలకు ఆశపడి మమ్మమ్మ కొంటివి
చిత్త నెయ్యకు ఆశపడి నీవు యేలే సీమమ్ము కొంటివి
రాశి వరహాలు యెంచుకొనేవేగాని మోసపోతివి రాజ !
పుల్లరికి ఆశపడి వోరాజ ! భూమమ్మ కొంటివి

యే సీమ రాజులయినా యెరుగుదును
గాని
యీ సీమ రాజ్యమంతా నిర్మూల
మాయెను
గ్రాస బెట్టి గొల్లరాజును కర్మాన
బొందితివి
పుడమిలో రాజులంతా పుల్లరికిస్తురు
గాని
నీరున బుట్టిన పూరెల్ల రివ్వ సీతమా
నీకు?
నీరున బుట్టినాడవు నీవు సాగాను

నిప్పు కొనుక్కున్నామంటే నీవేమి
చేయగలవు రాజా?
నుడుగులోనే వకమాట కడుగాన
వైతివి
కీడు రానున్నది తెలియదు నీకు
కానవు గొల్లరాజును వక కడకు
గెంటించు మనెను
నీమాట కొరకు నిలచితిమిగాని
కాకుంటె వక భూమికి కడు జూర
బోదుము''

## సిద్ధిరాజు కాపులను ఓదార్చి ధనమిచ్చుట

ఆ మాటకు సిద్ధిరాజు అనుమానం
పడెను
తన వద్ద చౌదర్లను దగ్గరకు బిలచి
గణతార సంతోష కల్మితుండై[25]
పలికె:
"గొల్ల రాజుకు కౌలు కొల్లగా
యిస్తిని
యిచ్చిన యీ కౌలు యిక తప్పరాదు
మాట దప్పితే రాజుకు మతిదప్పె
ననేరు
వాటంపు సభలోను వప్పుకాదనేను
నూటికి వెయ్యిన్నూటికి నుడిగి
బొంకరాదు

పాటించిన అవుసు భస్మమై పోవును
వినుడు పలికేను వీరు వారనక
పండదు పాకనాడు పారదు పెన్న
యీ యేటికి యెండిపోయిందనుకోండి
వో కాపులార!
మీదటికి మీకు మాన్యములిచ్చేను గాని
యేటి యెంట మాన్యాలు
యిచ్చేను గాని
మన్నేటి యెంట మాన్యపొలాలు
యిచ్చేను గాని
యిత్తులు కూలి కొలిచి యెగ విడిచి
మీకిస్తును

25. ఘనతర సంతోష కలితుడై

కోరి కయిళ్ళు బాయకుండుడి కోటేలు
పండిన
కొలతూమున కొలవక త్రావాస్తు
కొటారిని పెట్టక
కంప కోట కట్టించి ఘనమేరపరచి
యిదిమాట దప్పను వీరుల కంపను
కొటారికి అడ్డుబెట్టి కొట్టు తిట్టు
లేకుండ
యిప్పుడే సెలవిస్తిని యికనేమి
అనుకోకండి
అబ్బరాములు కాని గాదులు అందు
కోండి మీరు
యవరు మొర పెట్టినా యరగమనండి
దండి నేను యుండంగ దనమేమి
లెక్క?
గొల్లరాజు యేడు పిడికిల దనము
యిస్తానన్నాడు
పెన్న పాలేరు అడ్డము గట్టు చాలును
మనకు
కోరి కవుళ్లు యిచ్చేనుగాని మీ
కొండాలు మానుడీ
యిప్పుడు అడివి కవులావులు గాసే
గొల్లరాజు మాట నిలిపినాడు
మనము మాట దప్పితే మార్గంబు
గాదు

సత్యంబు తప్పరాదు దేవతలు
సాక్షులున్నారు
మచ్చరములు చాయరాదు కర్మము
అట్లే విచ్చేదనుము
మన కోటకు పెట్టముగాని అబ్బురము
కాను గాదులు
అబ్బురము కాను గాదులు అవరగా
నిచ్చేను"
యిచ్చిన గై కొందరు యెల్ల చౌదరులు
వచ్చిరి సిద్ధిరాజును యెచ్చకము
లాడిరి
తమలోనే తాము సంతోష పడిరి
"సిద్ధిరాజు యెందు బోతేనేమి? అతని
సీమ యెందు బోతేనేమి?
గొల్లరాజు యెందు బోతేనేమి; అతని
గోవులెందు బోతేనేమి?
యేటి పంట యేటిని పోవునుగాని
మన యింటికి రాదు
పశువుల జాడ జెప్పవస్తేను మన
కింత పదార్థము గల్గెను
ఆవుల జాడ చెప్పవస్తేను మనకింత
అర్థము గలిగెను
ధనమందుకొని కాపులు రాజు దగ్గిర
గూర్చుండిరి

## మరికొందరు కాపులు 'గొల్లరాజును పొడిచి మందలను కొల్లలాడింతు'మనుట

మరి వెనుక కొందరు కాపులు
ఘుండుచూ వచ్చిరి
మండలాధీశ్వరుండు మంది మేళము
తోను

సానవరులై[26] వచ్చి సయ్యన
నిట్లనిరి
"లజ్జమానిన చౌదరులారా? వోరాజ!
మీదగ్గర లంచమందుకోని
యితరులవై వచ్చి యీడనున్నార?"
అని ముఖము సూడక నాడిరి
మునుపటి వారిసి
వారుగాక మళ్ళీ పదహారుగురు
చౌదర్లు వచ్చిరి
వారు యెటువంటి వారంటేను—
ధనమివ్వ నేరరు పుచ్చుకోనేరరు
అటువంటి చౌదర్లు వారు
సావిడి కొండికాడు జలదంకిరెడ్డి
సందుపీగివచ్చి సలాము చేసెను
నగిరి కొండిగాడు నందివాడ
పోతినాడు
నామనవిగావచ్చి నామనవి వినమనెను
జూతకానికి పెద్దవాడు బొమ్మనరెడ్డి
యింట్లో యేడుయీగలు యెత్తుబడి
చచ్చు యెనగంటి సింగన్న
వొట్టి వొట్టిగాని బాసిగాడు వొట్టి
మాటలుకాని
కనుగిల్పి సైగజేసి కనుగంటి
నాయుడు
సంగ్రామానికి బాసిగాడు చాగిచెర్ల
బొమ్మనీడు
యీ నెల్లూరికాపులు గట్టబడేరు
అనంగ

పన్ను అంటె పడి చచ్చును
పందుముల పెద్దినీడు
యింతవాటి వారు అంతాగూడి
యెంత కెత్తుకొనిరి?
"గొల్లరాజును పొడిచి మంద కొల్ల
లాడించి
ఆతడు యిచ్చేధనము మేము యిచ్చే"
మనిరి
మడివేసిన కాపులు ముంగర
విడుగడలు
"తానైన గొల్లరాజును ముందుగా
జంపితేను
చిల్లరగోపాల్కుల సీమెల్లదోలి
తోలి తెచ్చినవారి గోకులము మీదొడ్డి
గట్టగలము
కొల్లలాడి వారి పదార్థము దెచ్చి
మీ కొటార్ని బెట్టగలము
నీమాట గలిగితే చాలు నిమిష
మాత్రమున
మసిబూసి గొల్లరాజును మరకటించ
గలము
నీ కొలువులో వకమాట
కావాలంటేను
కోయబోయలను రప్పించి మంద
కొల్లలాడించి
బందిపోట్లు బడి మంద బజ్జిజుచేసి
కోటలోపెడుదుము వోరాజ! నీమాట
గలిగితేను"

---

26. చనవరులై

## సిద్ధిరాజు కోపించి కొండెగాంభ్రను కొలువునుండి గెంటింపుడని ఆజ్ఞాపించుట

అ మాటకు సిద్ధిరాజు ఆగ్రగుడై
మండెను!
గొల్లరాజును పొడవమన్న మాటవిని
సిద్ధిరాజు పొలపొల పొక్కెను
చంపమన్న మాటవిని సిద్ధిరాజు తల
వంచుకొనెను
'పాపసిద్ధిరాజా! యిది పాపంబు'
అనెను
'కొండెకు సిద్ధిరాజ! కుమార
సిద్ధిరాజ!
వీళ్ళను మన కొలువులో వెళ్ళ
దోలించ'మనెను
'సావిడి కొండిగాంద్రను తన
సముఖాన వద్దు' అనెను
'మాటవెనుక మాట మలిపుట్టకుండ
బందిగాన వేయించి మరి పదిలము
చేయించ'మనెను
పాతప్పులు యివ్వమని బరతాలు
పెట్టిరి

## ఓరుగంటి బాసన్న సిద్ధిరాజుతో యాదవుల ప్రతాపమును చెప్పుట

ఆ వేళ వోరుగంటి ప్రతాపరుద్రుండు
పంపిన పరిచారకులును
తన మేనల్లుళ్లను యుగాక్షణము
ఆపి రమ్మంటే
అపర్యాసు కాపు బాషన్న ఆ రాజుల
సన్నిధిని పరగకూర్చుండెను
ఆ కాపు మాటలను బాసన్న
అలించి వినెను
చదురు దిగ్గున లెగిచి ఆ పరీషు కాపు
బాసన్న
కాపుల యెదుటనిలిచి యేమను
చున్నాడు?
"వో రాజ! మునుకోలలు దీసికొని
మీరు మూకలై పోయి
గొల్లగోపాల్కులచేత పెట్లుబడి
రాను కట్టడి వున్నది
అది తుదిమొదలు వెరగానితోడనే
మీరు వో సిద్ధిరాజ!
యీ కాపుల మాటల విని
గొల్లరాజును పగజేసికొనకుము

అతడు అవుతార పురుషుండు ఆవుల
నలనన్న
వొక్క రెణములో జంపిరి
వోరుగంటి ప్రతాపరుద్రుణ్ణి
వొచ్చిన వొప్పుకై సీలాన్ని
అయితమరాజు మరిది
పురిమెట్ల చెన్న కేశవుపేరిట వాడు
పుత్తమరాజు
అశ్వాన్ని స్వాధీనముచేసెను
అసుమాన విక్రముండు
యిక మట్టి సూతమని
యీరప్రతాపుండు
వుక్కుటలగుల గద్దె వొనరంగ
బన్నించినాడు
సన్నపలిషంబు సీరలు ఆమీద
పరపించినాడు
జాజులు పరపించి జననాథుండయి
తమ రాజును
పలిపించి యాదవుల్ని పిలిపించి
మోదంబుతోను
పిలపించి మోదంబుతోను
వుక్కుటలుగుల గద్దెమీద వొనర
కూర్చుండ మనెను
అందు కయితమరాజు అనుమానపడక
తనపాల శంభుణ్ణి తగ భక్తితో దలచి
'శివ శివా! మహదేవ! శంకర!
సర్వేశ్వర!
ఒహుదూర పరమాత్మ!
భక్తమందార!
నందివాహన! సకళ ఆనంద
భూతేశ్వర!
విందు చేరకె మాకు యీ వరమిమ్మ'
అనుచు ప్రార్థన చేసి ఆ శంభునికి
మొక్కి
చవుకళించి కూర్చున్నాడు చక్కని
రాజు
పుడమెగసి కూర్చున్నాడు భూపాల
కుండు
కత్తులు నాటవలెనని కట్నాలు
తెప్పించి
వుక్కుకబాయి తొడిగించె భోజ
రాజుకును
అవి కట్టువర్గముల్లై వుండెను కాంత
చంద్రునికి
యిందు[27] భోంచేయవలెనని
అయితమరాజును వక
విడుదుకు పంపిరి
పన్నెండు పిండి వంటలు
పాలకడియములు
దివ్యాన్నములు తెప్పలుగా వొడ్డించిరి
రారా! వోరి కాపు బాసన్న! నీవు
యాభై యొర్యారు దేశములు
చెల్లించి తెచ్చిన కాలకోటి విషము

---

27. విందు

కూరల్లో సంధించిపెట్టి గొల్లరాజును
చంపమంటేను
మునుపు ఆ యాదవులకు విషము
నేనే పెడితినయ్యా వో నలసిద్దిరాజు!
నీ పాదంబు లాన
అన్నము వొడ్డించినాక ఆయుధ
ఘనులకు
జుర్రు జుర్రున భోంచేసి గర్రు
గర్రున తేపిరి

ఆ విషము విరిగి అమృతమై
యుండెను ఆ యాదవులకు
అందుకు ప్రతాపరుద్రుండును మహా
సంతోషించి యిట్లగని పలికె:
'వోయీ గొల్లరాజు! యిప్పటి
వారిలోకి
నీవు భక్తుడవైతివి ఆ నీలకంఠునికి
మెచ్చితినోయి' అని గొల్లరాజుకు
యిచ్చెను పచ్చల పల్లకి''

## సిద్ధిరాజు కొండెగాండ్రను బంధించుట

ఆ ప్రతాపరుద్రుని మాట రాజు
మనసుకు దెచ్చుకొని
గొల్లరాజును పొడవమన్న మాటవిని
సిద్దిరాజు పొలపొల పొక్కెను
చంపమన్న మాటవిని సిద్దిరాజు
తలవంచుకొనెను
'పాప సిద్దిరాజు! యిది మహా
పాపంబు' అనెను
'కొండికి సిద్దిరాజు! వోయి కుమార
సిద్దిరాజు!
వీళ్ళను మనకొల్వు వెళ్ళ దోలించ'
మనెను

'సావిడి కొండి గాళ్ళను మన
సముఖాన వద్ద'నెను
'ఆ మాట వెనుకమాట మరి
పుట్టకుండ
బందిగాన వేయించి వీళ్ళని పదిలము
చేయించ' మనెను
పాతప్పులు గొనమని బారతాళ్ళు
బెట్టిరి
బందిగాన వేయించిరి బందిగములో
కాపులు పలవరించేరు

## కొందరు కాపులు పట్టపురాణి త్రిభువనదేవితో మొరపెట్టుకొంద మనుట

''మనమొర్రు మొక్కదాయె
మనమాట చక్కదాయెను
పేదసాదలు బ్రతికేది మనము
గతిలేదు మనమాట కడతేపదాయె

మంచిమాటలాడిన వారికి మంచి
మాటలె దొరికెను
పషువులు గల గొల్లరాజుమీద
మనము పాపము దలిస్తేను
ఆ పషువుల హత్య మనకు తగిలిన
దని వారు
మన కొరకై మహామనిమిక
జెప్పితేని
మనమాట వినక వున్నాడు ఆ
మదనవల్లభుండు
చెప్పిన మాట సిద్దిరాజు చెవినిబెట్ట
కున్నాడు''
కొందరు చౌదర్లు సొదబెట్టుకొందా
మన్నారు
కొందరు విషం బుచ్చుకుందామన్నారు
అందులో కొందరు కాపులు అందుకే
మనిరి?
''పట్టపుదేవికి బోయి మొరబెట్టు
కుందా మనిరి
యీజాయగా నగరము యేలేటి పెద్ద
దేవరాయల కుమార్తె త్రిభువనదేవి
దివ్య రత్నాంగి దిక్కు అని మనకు

ఆ త్రిభువనదేవిగాని మన బాధలు
యీడేర్చ గలదు
అందులో కొందరు కాపులు అందుకే
మనిరి?
అంత మార్గమున రాజును యేకాంత
మునను
సాయితపు పయాము శాస్త్రమునాను
సూత్రమెక్కించి
మాధవుని మరి పిలిపించి మాటాడత
బరచి
నిటలాక్షు గోష్టలంపు మూట
కట కటా కాపులార! యిట్టి కటికి
నాయము
చేయగా దగున మీ వెర్రి బుద్ధిగాక
మరి మరి బందిగములు
మా గర్భంబు లందు
దయవుంచు కాపులను దగ్గరకు బిలచి
మన్నాను భయమాని మరిపించ
గలదు
పదరయ్య పోదాము మనకు బాధలు
లేవు''

## మరికొందరు కాపులు చిన్నరాణి కుందమాదేవితో కొండెములు చెప్ప నిశ్చయించుకొనుట.

అందులో కొందరు కాపులు
అందుకేమనిరి?

''యిప్పుడు త్రిభువన దేవిమాట
యేమి పారకున్నది

యిప్పుడు ఆ దేవులమాట వాసరించ నాడు
యిప్పుడు త్రిభువన లోకానలేని దివ్యరత్నాంగి
కుందను పెండ్లాడినాడు కందర్ప ఘనుడు
పడవీటి పట్నంయేలేటి విదర్భ రాజుకుమార్తె
బావరాజు చెల్లెలు బంగారు బొమ్మ
ఆ కుందను పెండ్లాడిన నాటినుంచి
పట్టపుదేవిచేతి అన్నానికి రాజు
మందై పోయినాడు విందుకు రమన్నా రాడు
ఆమెతో విచారానికి రమ్మన్నా రాడు
భయమెంతయు లేక పట్నపుదేవులను
అంటరాదని కుంద అనపెట్టినాది
పట్టాభిషేకరుండు పగటి భోగంబులాను
యేవేళ కుందతో యెడబాయ కున్నాడు
ఆ కుందకు చెప్పితే మనమాట కందువపడేను"

## కాపులు తమ బందిగాలు మాన్పుమని కుందమాదేవితో మొరపెట్టుకొనుట

అని ముక్కాళ కాళకు ముప్పేయేసి వరాలు లంచంబులిచ్చి
వెడలి కుందమాదేవి మేడకు పోయిరి
"వో కుందమా దేవులా ! మీ కుమాళ్ళమమ్మా!
దయవుంచి మామీద తప్పు పాలించవమ్మా !
పుల్లరికి వొప్పి నీ యిబుడు భూమమ్మినాడు
మన్ననతో వుంటిమి నీ మాన్యపూళ్ళలోను
యెన్నడు యీ పాపము యెరుగము తల్లి !
తొల్లిటివలె కాదమ్మ నీ యిబుడు మంచి దోసకారి ఆయెను
కడితేరి బ్రతుకేది కానరాదమ్మ
యేటిమీద ఆరు నెలలాయెను
యెడచేసి నీ యిబుడు
భూమి పశువుల కెగవిడిచినాడు బాయమా తల్లి!
యాదవరాజు యేడు పిడికెల ధనము యిస్తేను
యీ పెన్న పాలేరు అడ్డముగట్టు చాలునని
నీరున బుట్టిన పూరెల్లి యివ్వ సీతమా తమకు?

నీరున బుట్టినవారు నీవు నీ యిబుడు
సాగాను
నీ పసుపు కుంకాని కిచ్చిన పందుమ
నాగవారము
వారి పశువులు పాడుగా మేసె
నో యమ్మ!
నీ కోమల జలదంకి కొంగు బంగారం
నీ తలగడ కట్నాలకిచ్చిన
జన్నెవాడ పొలము
వారి పశువులు వో యమ్మ పాడుగా
మేసె

కుందగిరి పట్నాలు కుంద పొలాలు
గొల్లరాజువారి గోవులచేత
కొల్లలుగా మేపించినాడు
కుదార్తముగా దలచి
యెంత యర సిద్దిరాజు యెన్ని
జెప్పినగాని
సత్యము దప్పనంటున్నాడు దేవతలు
సాక్షులున్నారనుచు
మా బందిగాలు మాన్పవో యమ్మ!
యెందైన పారిపోయేముగాని"

## కుందమాదేవి గొల్లరాజు ఆలమందలను పొడిపింతునని కాపులకు అభయమిచ్చుట

ఆ మాటకు కుందమాక్క అధిక
కోపమూని
మన్నించ మాను కొదువ
మాత్కానినట్లు
కొండలు డీకొన్నట్లు వురుషులు
వడినార్చినట్లు
వురుషు లు వడినార్చినట్లు మెరుపుల
చందమూన
కోసాములు వేగరంగ కాంతళములు
యివవంగ
కట్టుకొని అడవినా కోపమూన
యిబుః మీద పెళ్ళున మెటికలు
యిరిచెను
మాటలై మండుచు కుంద
కంటకమునాను

"యినరయ్య కాపులారా!
వెర్రులైతిరి మీరు
ముందెరిగితేను గొల్లరాజును
యీ సందుకే రానీయను
వుబుసుపోక సిద్ధిరాజును యెవరో
యిసగొల్పినారు
పసువులు దొరికెన కొంకే తన
ప్రాణమమ్మినాడు
యిక నన్నైనా అమ్మగలవాడే
యీ భూమియందు రాజులు
పుణ్యంబు గలదు
నమ్మించి గొల్లరాజును నడుకల్లితో
పొడిపింతును
కల్లలేసి గొల్లరాజును కొల్లలాడింతు

యక్కడ సత్యంబు? యక్కడ
దేవతలు?
సత్యము తప్పనని సిద్ధిరాజు
అంటూవుండగాను
తన అన్న పడవీటి ఖావరాజు దగ్గిర
లెక్కలేని కోయ బోయీలున్నారు.
వారి ఆవులు వేయింతును
అడ్డమార్గములేక

గొరకలు వేయింతు వారి
గొడ్డుటావులను
సురకలు దగిలింతు వారి చూలి
పడ్డావులను
కోడెలు వేయింతు వారి కాళ్ళు
విరగాను
వీడు వాడు వస్తేను గొల్లరాజును
వకనాడు బోవునుగాని"

## కుందమాదేవి తన అన్న పడవీటి ఖావరాజును రప్పించుట

అని కాపులందరిని అక్కడే వుంచి
ఆ కుందమాక్క
తన అన్న పడవీటి ధావరాజుకు
పంపె నొక జాబు
జాబు పంపినప్పుడు వస్తూవున్నాడు
అన్న ఖావరాజు
పందిదప్పులు మనుగోతులు
పట్టించుకొని
తేనె తెల్లని బెల్లం తేటపన్నీరు
కావిళ్ళ చక్కరాయలు
కజ్జాయములు
పట్టు చీరెలు రవికెలు పసిడి
కడియములు
బంగారు గాజులు మంచి బంగారు
సరములు
అక్కచీరెలు గొంచు అలర
భోగములు

మక్కువతో మేడెక్కి
వచ్చిరన్నలును
అన్నలు వచ్చిరని ఆ కుందమాదేవి
విందుగావించెను నింది నిదానమును
మరచి
షడ్రశోభితమైన అన్నము
సౌఖ్యముగా గూర్చి
పేరిన నేతులు బెల్లపచ్చులను
పన్నెండు పిండివంటలు
పాలకూడియములు
ఓవ్యాన్నములు తెప్పలుగా
వడ్డించెను
పాయసాన్నములు మంచి పంచ
భోజనములు
కజ్జాయములు భోంచేసి గర్రు
గర్రున తేపిరి
తీర్చి వారు మంచి తేట పడకాలు

వర్చించి యెంగిళ్లు కూచ్చుండిరంత
కలకలా నవ్వుచూ అన్నలకు
కట్నాలుదెచ్చె
అన్నలకు యిచ్చెను ఆ కుందమాదేవి
అందరు వినగాను ఆడె నొకమాట

## కుందమాదేవి తాను విషము పుచ్చు కొందుననిఅన్నలను బెదిరించుట

"భావరాజ వో యన్న ! ప్రతి
రామచంద్ర
గోయింద గోపాల గుణ విశాలుండ !
చిన్న తమ్ముడ వో యన్న !
చెన్నకేశవన్న !
మీ అయిదుగురి తోడబుట్టి వోయన్న
తాను అడవిపాలు దాగి
వామనవి వింటేను నమ్మిన దాన
నవుదును
కాకుంటె వకమాట కడమాట జెప్పి
లేకుంటె మందుబుచ్చుకొని
మణుగుదును యీ మేడలోను
యీ రాజ్యభోగము లేమిటికి తమకు?
విషము పుచ్చుకొని ప్రాణము
విడుతునో యన్న !"
ఆ మాటకు భావరాజు అనుమాన
పడెను
అయిదుగురు అన్నదమ్ములు అసూరు
వుసూరు మనిరి

## పడవీటి భావరాజు చెల్లెలిని బుజ్జగించి కోరికను తెలుపుమనుట

"వోయక్క ! వో పాప ! వో
చిన్నదాన !
వో ముద్దు వో బాల ! వో గిరువాణి!
విషము దాగి వేసార నీకేలనమ్మ ?
మేమిందరము కలిగియుంటిమి వో
యిందీవరాక్షి !
కుమల నీకేల వో కుందమాదేవి ?
నిన్ను దూషించినయట్టి దోష
కర్మునిబట్టి
తెగవేసి అగ్నె సేతు అక్కరో ?
వినుమ
యెక్కడ లేనిమాట లేమిటి కాడితివి?
పసిడి చాయలవంటి బంగారు నీమేను
కుసుమ చాయలు విడిచి కుముల
నీకేల ?

శేషజమువంటి చెరుగు నీమేను
నీవాసి దిగ విడిచి చివదల నీకేల :
మగువరో నీబుద్ధి మాసువుదుగాక
తెగువతో నీ విభుణ్ణి దిగ విడనేల
కామిణి అవుతారము కవీంద్ర
భోగము
యలనాగ నీ యిభుణ్ణి యడబాయ
దగున ?
తెగువతో నీ యిభునిపైన చిచ్చురికి
తేను
మెచ్చును పరమేశ్వరుండు యిచ్చును
వరములు నీకు
ఆ వరముకు యీపరము కావరము
చేయిదగునా ?
నీకు గర్వంబు యాల ? సర్వంబు
యెరిగి చెల్లెల చావగోరెదావు
వుర్రి పెట్టుకున్నా జీవుడు వెర్రిపేడై
దిరుగును
నూతబడి చచ్చిన జీవుడు భూతమై
తిరుగును
విషం పుచ్చుకున్న జీవుడు పిశాచి
అగును
గాసబడి చావనేలనే వో మఱియ
భద్రాక్షి ?
అహల్యాదేవి తొల్లి ఆరడ బొందేను
యేగుదు తోను యెన్నంగబడకు

చక్కని తారతో సరియన వచ్చు
నిన్ను
అవుతార దాక్షిణ బొందనాను నీకు
అపకీర్తి లేదు
మండోదరితో సాటి మరి యనవచ్చు
నిన్ను
ఆరాము సేనలతోను ఆరడి బొందిన
ఆరాము సీతతోను సరియన వచ్చును
నీవు మక్కువ పడనేల మదిరాయ
తాక్షి ?
యెక్కువ పనులకెల్ల మేముండగాను
దక్కుటేని దానివలె చివకనీకేల ?
బిడ్డలు లేనట్టి గొడ్రాలవై తివి
అడ్డమాడకు విభుని కర్థాయునౌను
నీ యిబుని కొకమాట యిన్నవించ
వమ్మ !
నీ యిభుని యేకాంత మొకరికి
యినిపించతాదు
స్త్రీలలో కెల్ల నీవొక శ్రీరత్న
మగుదువు
పురుషులలోకెల్ల నీ యిబుడు వక
పురుషోత్తముండగును
మొగవారికి సరిపోయిన మగువలు
గలిగితేను
ఆ మగువలు నోచిన నోములు మంచి
వనబడును

సిద్దిరాజుకు తగును నీకు సిద్దిరాజుకు
తగును
సరిలేరు మీకు జెప్ప జగతి లోపలాను
తలపొయ్య నీకేల తగిన వల్లభునికి
కలుగుట భాగములు వక మళియాయ
భద్రాక్షి !
నీ మేను స్త్రీలకు నీచతురంబు లాకు
వసుధ కస్తూరి కాంతిగల రాజు
వరులట మెరుగంగ
పద్మిణి కమ్మని చాయ బంహారుటద్ద
ముల వంటి మేను
బ్రహ్మ వ్రాసిన వ్రాలు ఫలముండ
గాను
కలహాము సేసుకునేది కలదచే బుద్ధి
నీవద్ద యెల్ల చెప్పుమా వినివుందుము
గాని''

## గొల్ల రాజు ఆవులను వేయించుమని కుందమాదేవి అన్నను కోరుట

ఆమాటకు కుందమాదేవి ఆడెను
వక మాట:
''యెంతపనిలేదు వోయన్న వొట్టి
పసలేనిమాట
యెక్కడనుండి వచ్చెనోకాని యీ
గొల్లరాజు
చెరువులు చేలు విరివిగా చెరిచెను యీ
గొల్లరాజు
మరుగు మోసమాయెను మన రాజు
బుద్ధి
కలదా యిటువంటి కర్మమెక్కడనైన
మనభూమి పరిబుచ్చి చెరచెను
కవులిచ్చినాడు సిద్దిరాజు కాళిధూళి
ఆయెను
మనభూమి వారి కవులావులచేత
మేపించినాడు
సత్యము తప్పనని సిద్దిరాజు తాను
అంటూవున్నాడు
మీరు మాన్యము యిచ్చిన యెనిమిది
వూళ్లలోను కాళిధూళి ఆయెను
నామాన్యవూళ్లు మట్టి పాలాయెను
కుందగిరి పట్నాలు కుంద పొలాలు
కుదార్థము దలచి గొల్లరాజు వారి
గోవులచేతను మేపించెను
వారి ఆవులు వేయించుడు వోయన్న
అడ్డమార్గములేక
గొరకలు వేయించు దోయన్న వారి
గొడ్డుటావులను

చురకలు తగిలించుడు వారి చూడి పడ్డలాకు
వారి కోడెలు వేయించుడి కాళ్లు విరగగాను"

## పాపకార్యము తలపెట్టిన చెల్లెలిని ఖావరాజు దూషించుట

ఆమాటకు ఖావరాజు ఆగ్రుడై మండెను:
"విడువడ వస్తేను గొల్లరాజు వక కడకు బోవునుగాని
యక్కడ గొల్లరాజు? చెల్లెలా! యక్కడ తలపోస్తివి?
యక్కడ నీబుద్ధి? యక్కడ నీవెర్రి?
యంతపనిజేస్తివే అని వుంటిమిగాని
సిద్ధిరాజుల వారిల వెరికి[28]లేక మంద చిందు చెయ్యమంటివి
పట్నపు రాజెరుకలేక తమ ప్రాణాలు కొనజూస్తివే వో పాప కర్మురాల!
విందుకని వస్తేను మాకు మందు బెట్టితివి
ముందెరిగితేను మేమీ సందుకేరాము
కాదమ్మ నీవంటి గణితలెవ్వరైన
తొల్లి వాదు జేసినవారు జగతిలో గలరా?
చేత పట్టంగనే లంక చెడుననిరి తొల్లి
అటువలె మాయింట అగ్గివై పుడితివి
తమ పడవీటి యంతయు పొడుగ దలిస్తివే వో పాపకర్మురాల!
అట్లే సముద్రము తరువంగ ఆ అంభోధిలోను
కాలకోటి విషము[29]పుట్టినట్లే కలిగితివి మాయింట
తార పుట్టంగనే ఆ తారమెల్లగా అనెను
రేణుక పుట్టంగనే పౌనిమిలోను
బగరాముపై సుపుత్రుని చేతను
క్షత్రియ కులమెల్లాను నిక్షితంబై పోయెను
భూపతిరాజు పుత్రిక ద్రౌపదిదేవి
పాండురాజు కులమెల్ల భస్మంబు జేసె
అటువలెనే ఆరవెల్లి వీరనాయకు రాలివై పుట్టి
కార్యంపూడి రాజులందరినీ కళ్లిలో[30] జంపి
మాచెర్ల కారెంపూడి మట్టిపాలు జేసె

---

28. ఎరుక 29. కాలకూట విషము 30. కల్లి.

నీమాటలు యికమాను నీతంబుగాదు
పట్నాలు నీకేల? తమ ప్రాణాలు
పోనేల?
వూళ్లు నేకేల? ధనము నీకేల?
గొల్లరాజుతో పగయాల చెల్లెలా?
నీ పొట్టకావరముగాక!
పల్లవాది సిద్ధిరాజును ప్రాణములు
గొనజూస్తివే వో పాపకర్మురాలా!

చెల్లెలని వస్తేను మాకు చేటు దలస్తివి
అప్పవని వస్తేను మాకు అపకీర్తి
దలస్తివి అన్నెకారిదాన!"
అని వేసారి చెల్లెలుమీద అలిగె
ఖావరాజు
అని దూషించి ఖావరాజు మేడదిగి
వచ్చెను

## కుందమాదేవి అలక

అప్పుడు అన్న చెప్పక పోయాడని
ఆ కుందమాదేవి అడిలెను
శోకమూన
ముప్పిరగు శోకమూన మనితి
చింతింపుచూను
తప్పేమి యరగని పుత్తడిబొమ్మ
ధరమీద వొరిగెను ధవళ మరి కుంద
యడలి కరములు అస్తకంకణములు
మెరియంగ
కడలేని శోకంబు కాంత శోకింపగాను
కుచములుపైని కన్నీరు కురియంగ
నిట్లనియె:
"యే తల్లి యే తండ్రి యీ మేడమీద
యే యన్న యే తమ్ముడు యెవ్వరిని
యెరుగను

తమ తండ్రి సుతుడనెడి తమ
బ్రతుకేల?
తన పుట్టిల్లు పాడగుట
పొడవీటి పట్నము అంతా
బూడిదపాలు జేతును
పల్లవాది సిద్ధిరాజు ప్రాణాలు గూర్చి
గొల్లరాజును గెలిపింతు"నని
కుందమాదేవి
ఆనబెట్టినాది విడిచి కదసి
వుత్తమాస్త్రీ
తనమేడలోవున్న రత్నభూషణములు
తెచ్చి ధరణిపై వేసె
మైల చీరాగట్టి మరి వేగమూన
కోటలో కుందమాదేవి కూలంగ
బడెను

## గొల్లరాజు మందలను పొడిచి వత్తుమని కోయబోయలు కుందమా దేవిని ఓదార్చుట

అడలంగ కోయబోయిలందరు వినిరి
అపుడిట్లగనిరి:
కుంద శోకం మాన్పకుంటే దోషంబు
తమ కనిరి
భావరాజు యరగకుండా వక్క
పరుగున వచ్చిరి:
"అక్కరో! నీకింత అడల నేమిటికి?
పషువులు వేయించమని భావరాజుతో
సలజెప్పితివి
యే కాంతమున మాకు యెరిగించ
వైతివి
గోపిన చెపితేను వారి గోవుల
వేతుము
సిద్ధిరాజు యెరుక లేక సీమవారి
యెరుక లేక
భావరాజుల వారి యెరుక లేక
పసువుల వేయగలము
యద్దను వేసేది తమకు యంత
మాత్రంబు?
గొడ్లను దోలేది మా కులమై
యున్నది
అడ్డమార్గములేక వారి ఆవుల వేతుము
అక్కరో! వినుము
సిద్దిరాజుకు వెరచి వుంటిమి గాని
గొల్లరాజును పొడిచి మంద కొల్లలాడ
గలము
నీ సెలవు గలిగితేని నిమిష
మాత్రమున
వారి ఆవుల వేతుము అక్కరో!
వినుము"

## కుందమాదేవి కోయబోయలకు ధైర్యము చెప్పి ఏడువారాల సొమ్ము లిచ్చి పంపుట

ఆ మాటలకు కుందమాదేవి అప్పున
నవ్వి ఆడెనొకమాట:
"నా కన్న ఘనులార! నాయన్నలార?
నా కంటె చిన్నవారు నా తమ్ములార!
సిద్దిరాజుకు మీరు వెరవ నేమిటికి?
సిద్ధిరాజు నా మాటకి అతిగా
షాద్దలేడు
సిద్దిరాజు మాపైతే సంకబెట్ట గలము
సిద్దిరాజు మాట తన చిటికెనేలు
మాత్రమున
సిద్దిరాజు నామాట అతిక పడలేడు
తాను కూటాలలోను కూలంగ
పడితేను

కూలంగ బడితేను రాజు కొలువుకు
బోడు
తాను అలిగి వుండన్నాళ్లు అన్నము
ఆరగించడు
తన ఆకలి దీర్చకాని రాజుకు
అతివేడుక లేదు
నా కన్న ఘనురాలు పట్టపు దేవులు
విజయనగరము యేలేటి పెద్దదేవ
రాయలు కుమార్తె
త్రిభువనదేవి దివ్యరత్నాంగి
ఆ పట్టపు దేవులు మేడకు సాగాను
ముదమొప్ప తన చెలువులో కాకాని
దాని ముంజల ద్రొక్కడు
మనసు వినమతితో మాట్లాడ
వెరచును
యెంత పనైనా తానే యీడేర్చగలను
మీకు మనవిగ జెప్పేను
మాయన్నలార!
వారి యావుల వెయ్యవలె
అడ్డమార్గము లేకుండ
గొరకలు వేయుడి వారి గొడ్డు
టావులను
సురకలు తగిలించుడి వారి చూడి
పడ్డలాను

కోడెలు వెయ్యండి కొదవ లేకుండ
ఆ మాట మీకు మనవిగ జెప్పేను
మా యన్నలార!
వారి మనుసులు వేయకుడి మనకు
మార్గంబు గాదు
వారి సలుగు పెడ్డను వేసి నూసి
మసిజూడకుంత జరుగుడ
వక కడకు
ఆ మీదట పనులు తానె వీడేర్చగలను
మీకు మనవిగ జెప్పేను మాయన్న
లార!''
అని రత్నభూషణములు యేడు
వారాల సొమ్ములు
ఆ బోయీలకు యిచ్చెను
ఆవులు వేయమని వారిచేత అభయ
హస్తంబొందెను.
పెట్టిలో బాణాలు పేరైన సొమ్ములు
బరువులు గట్టుకొని వారంత వక్క
పరుగున వచ్చిరి
భావరాజు యెరుగకుండ వక్క
పరుగున వచ్చిరి
పరుగున వచ్చిరి బలములో కలసిరి.

## గొల్లరాజు పశువులకు హాని కలుగరాదని సిద్ధిరాజు భావరాజును హెచ్చరించుట

బలములు గూర్చుకొని పడవీటికి
పోగాను

అయిదుగురు సిద్దిరాజులు
అన్నదమ్ములూను

మెల్లంగ చెరువుకు సారివెళ్ళి మగడి
వస్తూవున్నారు
గ్రక్కున యదురాయె భావరాజుకు
ఆ గాళ కోపలాను
అంతట భావరాజు రాంగాను సిద్ధిరాజు
అనుమాన పడెను
'ముస్తీదు కోయ బోయిలకు నీవు
భావరాజు! నీ వైన యెందు
బోతివయ్యా?'
ఆ మాటకు భావరాజు అపుడిట్లగనియె:
'వినవయ్య సిద్ధిరాజువారు:
విన్నవించెదను
పసిడింతబోదు పందియేటలాను
యెదపొద్దునే పోదు యేదియేటలాను
గ్రక్కుననేబోదు కవుఁజు
యేటలాను'
అనుట విని విద్ధిరాజు అనుమాన
పడెను
"వోయి భావరాజూ! గొల్లరాజు
పశువులు మన సీమలో
వున్నన్నాళ్లూ
యాటలు మాను భావరాజ! మనకు
వేడుకలేదు
యిందులో యవ్వరైనా సత్యంబు
దప్పితేను
నిర్మూలమై పోవును దేవతలు
సాక్షులున్నారు
మనము తిరుగబడరాదు వారి మన
సందు మేరయున్నది
యేటిమీద ఆరునెలలు యెడసేసినారు
యెడసేసిన చెరియ యేడాది వెళ్లెను
యిక నాలుగైదునెల్లు మాత్రమే
వున్నది
పొదకూర కొయ్యరాదు భావరాజు!
బోనొగ్గరాదు
వాగును జాలారి భావరాజు
వలవెయ్యరాదు
పెయ్యకాలినిం గనుక ఆవగింజంత
పేడు విరిగితే
పెట్టము పుల్లరి తనమన్నారు వో
భావరాజ!
ఆవుకాలినిం గనుక ఆవగింజంత
పేడు విరిగితే
అంపినాము చిద్దు అన్నారు సుమ్మి
వో భావరాజ!
వారి మందలోను చుట్టుకొనబోతేను
పట్టు చీలి విచ్చేనని
వొప్పినాము సుమ్మి వో భావరాజ!
వారి మందలో గొడ్డలి బోతేను
బంగారపు గొడ్డళ్ల
యిచ్చేమని వొప్పినాము వో
భావరాజ!
చోరులు కోయబోయలను పదిలము
చేయించమని
బ్రాహ్మణుని పాదములు
ముట్టించినారు
వారి పశువులు మన సీమలో
వుండన్నాళ్లు బాసతప్పరాదు
కుందతో కవీంద్రభోగము కడుకొనె
చేయమనిగాని

కడ యా రాయభారములకెల్ల నే వొక
    కర్తవు సుమ్మి వో భావరాజు!''
ఆ మాటలకు భావరాజు అపుడిట్ల
    గనియె:
''నీ పాదములు ఆన; యీమాటలు
    మానితినయ్యా
నీకు మాటరానేల?
ఆ మాటవిని మించి భావరాజుని
    అంపి వేగంబె
పంపినప్పుడు భావరాజు పయనమై
    కదిలె

కుందపంపిన యట్టి కోయబోయ
    లూను
వారి కవులావులు చూసి కటకట
    మనిరి
'రాజనాలు మేసేటి దోసమిటు
    చూడుడ'
అనతిగల చెరువుకట్ట కాల్వలలోకి
    దిగి వచ్చిరపుడు
భావరాజును చెయ్యిబుచ్చుకొని
    చెప్పిరి వొకమాట

## ఆవులను వేయుటకై బోయలు భావరాజు సెలవు కోరుట

''యేలినవారికి యేకాంత మొక్కటి
తప్పక ఆపని చాయంగరాదు
చెప్పి చేసిన పనులకు శంకేమిలేదు
తమకు కుందమాక్కచేతి
    యన్నముకు దాతమాయె
అక్కచేతి కట్నాలు ఆ రోశ్యముగా
    అందితిమి మేము
అల్లంత ప్రొద్దువేళకు వారి అవులు
    వేసెయ్యమని
అబయ అస్తమిస్తిమి వో భావరాజ!
ఆవులను వెయ్యకుండేను అసూరు
    వుసూరు మనును వో భావరాజ!
ప్రాణాలు విడుచును వో భావరాజ!

యిటువినవయ్యా గొల్లరాజును యేమి
    సూసేవుగాని వో భావరాజ!
చెల్లెలును చూడఏలెను వో భావరాజ!
అక్క చేతికట్నాలు ఆరూశముగా
    అందినాము మేము
పదునైదు యెడ్లను బాణాలువేసి
'కాని వారివలెను వక కడకు బోదాము
మాపిటిపొద్దుకు అవుకు వేట్లుపడి
    మందకు జేరుతేను
పశువుల యేట్లుచూసి గొల్లరాజు
    పారిపోయేను
గౌరకల యేట్లుచూసి గొల్లరాజు
    వకకడకు బోయ్యేనుగాని

గంట వొంటి రక్తంబు జూచి
గొల్లరాజు వకకదకు బోయేనుగాని
కాకుంటె వో భావరాజ! యడభూమి
కరువును బొందేను
సెలవియ్యవయ్య వో భావరాజ!
శ్రీఘ్రతంబె మాకు''

## భావరాజు బోయలను మందలించుట

ఆమాటకు భావరాజు ఆగ్రుడై
మండెను.
"మండి యలమైన యెంత
మాటలాడితిరిగాక
యక్కడ కుందమాక్క యక్కడ
తలపోసె
ఆ కుంద ప్రాణాలు విడిచిపోతేను
సిద్దిరాజుకు అతి భారములేదు
ప్రాణమెవ్వాబ్బ రాగాతంబు
ప్రాణమే అవునిచ్చత మన్నారు
మానమే ఆచంద్ర తారార్క
మన్నారు
ప్రాణ మే శరీరాన బుట్టింది
మాన మే శరీరాన బుట్టింది
మాట శరీరాన బుట్టింది
ఆటు గనుక మాట దప్పరాదు
మహిపతులకెల్ల
మాట నిలిపితే కూరకు సిద్దిరాజుకు
తాను యెటు జేసినాడు
కాటమరాజు యెడ్లను వెయ్య యెవరికి
కారణములేదు
శ్రీరామ కవులావుల చిందుచేయరాదు
దేవత కవులావుల తెగువ చేయరాదు
యలమల కవులావుల వెయ్య
యెవరికి కారణంబు లేదు
యద్దులావుల బాస వారి యెఱ్ఱయ్యకు
దెలుసు
యెఱ్ఱయ్య బాస యద్దులకు దెలుసు
వారి చెలవు[81] లేదయ్యగాని మనల్ని
యిప్పుదే చంపగలవు
రాజు పాదమా నంటేను యెద్దుల ఆన
తప్పరాదు
కాకుంటెగోవులు మృత్యపాతకమున
గోల చుట్టుకొనేను''
అనిన భావరాజు అందర్ని
పయనంబు మాన్పి
పడపీటి పట్నానికి పదమనె నంత
మాట మరిపించి యాటకాళ్ళపుడు
మరిపించి ఆ మాట పాడువడి జేసి
పట్నాన భావరాజును మరిపించినారు.

81. సెలవు

## కుందమాదేవి తన పెంపుడు చిలుకచే కాటమరాజు ఆలమందలను బెదరగొట్టించుట

ఆవేళ కుందమాక్క ఆమేడలోను
బంగారు స్తంభాల పందిరిలోను
ఆ సతకంకణాలచాత అందుకొనెను
చిలకను
చక్కెర పంచదార జవ్వాది మేపి
"అబ్బ సమ్రదాయమందు
అమ్మనిటావు
వోడవర్తకులు చిలుకని వెయ్య నే
దెచ్చను
రాజుకు నాకు కనగాల నారిపేరే
కాంతరోనిన్ను
పెంచుకొనమని చెప్పిరి
పెద్దలందరును
నువ్వే తన కొమారుడవు నీవే
రామన్నవు
గొల్లరాజు అటుభూమి గొబ్బున
బోయి
కాకి పలుక్కలు పల్కి కల్లున కుయ్యి
కాకి పలుకులకు ధేనువులు కల్లున
బెదరును
గువ్వ పలుకులు రాము పగులుట్టుగ
గుయ్యిమా
గువ్వపలుకులకు ధేనువులు
గుబగుబా బెదురును
చిలక పలుకులు బలికి చికాకుగా
జేయుమా!

చిలక పలుకులకు ధేనువులు
చికాకులగును
పరిభాష యెద్దుల పంతాన బిలచి
పెన్నదాటదోలి ప్రేమతో
రమ్మనెను
అని వేగ యెగవేసె మేడలో యలనాగ
యపుడు
యెగసె రామచిలుక యేడు
యోజనాల పొడుగున
వారి ధేన్వాల కడకు వయ్యన బోయి
శ్రీగంగరమైన వనముల నీడలోను
చెలగి యా కవులావులు మెరువడి
యుండగాను
అగ్రమ మధ్యమందు ఆ చిలుక నిలచి
కాకి పలుకులు ఆ చిలుక కల్లుగా
గూసెను
కాకి పలుకులకు ధేన్వలు కల్లుగా
బెదిరెను
గువ్వ పలుకులు చిలుక గుబ్బటీలు
గూసెను
గువ్వ పలుకులకు ధేన్వాలు గుబగుబ
బెదిరెను
సిలక పలుకులు బల్కి చీకాకుగా
గూసెను
సిలక పల్కులకు ధేనువలు చీకాకు
లయ్యెను

అల్లారు కొల్లారు మాయెను
ఆగుబ్బుగా బెదిరెను
బసవన్న బొల్లియావు పసువులకు
ధీరలు
సాటిగల బసవన్న సరిరాము జేసెను

కులగిరులు అదిరెను గుమ్ము గుమ్మ
మనెను
పదివేల పిడుగులు ఆవుల మంద
మీద పడ్డ చందమాయెను

## కాటమరాజు ఆనతిపై పద్మనాయుడు చిలుకను బాణముతో కొట్టుట

కాటమరాజు పద్మనాయడు కలిసి
కూర్చుండి
జన్నివాడ గుంటిమీద చద్రంగ
మాడంగను
ఆడి ఆడి చద్రాంగము ఆ రాజు
ఆట సాలించి
"నాయుడా! నాయుడా! నా చిన్న
మరిది!
పలవాయి బాణాలు మన పశువుల
మీద
యారముగ పగవారు యే తెంచినారు
కాబోలు
పసువుల మీద యేమొ బారంబు
లాయెను"
పదివేల చద్రాంగము పంతాన నిలిపి
వెయ్యి లక్షలకు చద్రాంగము వేసి
అటు నిలిపి

జన్నెవాడ పర్వతము సరుగున
దిగిరి
అందలాలు యెక్కి అందరు వారు
చంద్రకి పీటెలు చేపట్టి కత్తులవారు
కదలి శంభుని కనకనందుల వారు
ఆరువేల వల్లవులు యేడువేల మన్నె
తిరమందులు
పన్నెండువేల వీర పర్యారము[32]
కదిలెను
బరిసెలు డమామీలు పెద్ద
బూరలును
రుంజలు కైవళ్ల రూటికొమ్ములును
యినవంబులుగ కంచు వీరమద్దిళ్లు
అచ్చట కదలిరి ఆ యాదవవీరులు
పరుగున ఆ తావు వదలి పయనమై
వచ్చిరి

---

32. వీరపరివారము

రాజు రాఘవుడు రాంగ పగవారు
పంపిన చిలుక
రాజుల యెదుటను రావివృక్షం
మీదను వ్రాలెను
పరిభాష యెద్దుల పంతంబున బిలిచెను
రవలెత్తి కూసెను రాజుల యెదుట
ఆ చిల్కపల్కులకు రాజు ఆశ్చర్య
పడెను
"నాయుడా! నాయుడా! నా చిన్న
మరిది!
యెండి అనుసుల పల్లకి యెలపతి
రాఘవ।
వేళ్ళ వుంగరాలు వెలపతి మరిది!
నాదిళ్ళలో పైడివారింట
నాతిపెళ్లి కొడక।
నగిరి కంటద్వారం నాయుడా। మరిది।
దీనికి ధనముకొండకు విప్పర్ల
పోతినీడు
గర్భరత్నమై బుట్టిన ఘనకీర్తి మరిది!
నెత్తురుకూటి సంగడా! మా నెలమైన
మరిది।
కులము యెలమదొరవు చెలగిన
గొల్లవు
పారాయి సంగడమా! మరిది
పద్మనాయుడ!
యాభై యారు దేశములు
యద్దులావులు మేపితిగాని

యీ చిలుకపలుకులు నేను యెన్నడు
యినలేదు రాఘవా!"
ఆ మాటకు పద్మరాఘవుడూ ఆడె
నొక మాట।
"చెలువొందె గద్దె ఆవుల చెన్నస్వామి
లింగమా।
వల్లవులు వో భావ! వకమాట
వినుము
పోరుకు మనమీన చిలుకను పంపింది
వినుమ
పాపాత్మురాలు పణితి కుందమాదేవి
చదువు చెప్పించింది చిలుకకు
వినుమ
రాత్రి నాలుగు జాములు చిలుక
రామాయణము చదువును
పగలు నాలుగు జాములు చిలుక
భారతంబు చదువును"
ఆ మాటకు ఆవులన్న అపుడిట్లనియె:
"పగవారి చిలుకకైతె బాణమే యు
వలెను"
గజివిల్లు అనేబాణము గ్రక్కున
అందుకొనెను
విల్లు యెక్కుబెట్టి వెసగంగ
దొడిగెను
ఆ మాటకు ఆవులన్న
అనుమానపడెను
"నాయుడా! నాయుడా। నా చిన్న
మరిది।

రాయాకు పక్షన[33]రామచిలుక
పచ్చన
రాయికొమ్మ తెలుపు రామచిలుక
పాదములు తెలుపు
రాయి యిగురు యరుపు రామచిలుక
ముక్కున యరుపు
రాయాకున బుట్టింది రామచిలుక వేగ
చిలుకను దప్పిన బాణము
చిగురాకుకు నాటితే
కాశీలో బ్రాహ్మణుని చంపిన
పాపాన బోదుము''
ఆ మాటకు పద్మనాయుడు
అపుడిట్లనియె:
''పరమేశ్వరుండు మెచ్చి యిచ్చిన
పంచపన్నె బాణాలు
వృధియ కాలమందు[34] బాణాలు
వెయ్యనే పోయి
సప్త సముద్రాలయందు స్నానంబు
లాడి
పగరాజుల మీద రాయబారంబులాడి
తిరిగి మాపిటివేళకు బాణాలు
పొదులకు
మళ్లి తిరిగి వచ్చును మరియు
బాణాలు
ఆ పాపాత్మురాలు పణితి కుందమదేవి
ఆనమాలు పెట్టి బాణాలు నెల్లూరి
పట్నాన అంపునేకదా!

ఆ మాటలకు ఆవులన్న ఆగ్రహుడై
మండెను
బెజవాడ పెట్లుకాడ పెయ్యల
వెర్రయ్య
బారులు నెల్లూరి పట్నానకు దర్లి
గముళ్లు తొలగవేయించి చిలుకను
వేసిన బాణము
యేడుగట యేనుగలమీద యరగడ్డ
పాటికి
తిరిగి తెప్పింతును రాఘవా! తేజంబు
మీర''
ముదమొప్ప ఆ రాజు మూడు
సెలవులిచ్చెను
విల్లు యెక్కువ పెట్టగ వెసగంగ
దొడగెను
బాణము తియ్యుమని పిలుచుచుండెను
ఆనమాలు పెట్టిన తావున
నిలుపుమని
అనివేలు చిలుకను వెయ్యివేలుగాను
వేసిన బాణము చిలుక యెదమందు
బెట్టుకొని
ఆకాశం పొడుగునా ఆ పక్షి లెగిచె
నెత్తురు చారంగ ధరణికి వొరిగి
పలకంగసాగెను
''దక్షిణ దేశంబు మాది
పరగంగ నెల్లూరి పట్నమ్ము మాది
అన్నలార! నన్నుజంపి మీరు

33. రావియాకు పచ్చన
34. ఉదయకాలమందు

యెన్నాళ్ల బ్ర*కేరు వో
యాదవులార!
మూడునెల్లు పద్దెనిమిది దినముల
నాటికి
మీరంతా యరగడ్డపాటిని వొరగ
నున్నారు''
అని పగలు సాటింపుచు ఆ
రామచిలుక
పరగంగ నెల్లూరి పట్నానికి బోయెను
పగవారి సిలుక పారిపోయిన వెనుక
మగిడి జన్నెవాడ గుంటికి మళ్లి
వేతెంచిరి
కాటమరాజు పద్మనాయుడు కలిసి
కూర్చుండి
జన్నెవాడ గుంటిమీద చద్రంగమాడు
చుండిరి.

## దెబ్బతినిన చిలుకను చూచి కుందమాదేవి దుఃఖించుట

ఆవేళ కుందమాదేవి ఆమేడలోను
పగడంపు తరికోళ్ల పట్టెమంచంబు
పట్టె మంచం మీద పరువైన జువ్వ్వ
పరువైన జువ్వమీద మల్లెల పాన్పు
మల్లెల పాన్పుమీద మదిరాక్షి తాను
నిద్ర సుఖించుచుండె నీరజగంధి
బాణము యెంట రక్తంబుధారలు
కుందమాదేవి కురుల మీద కురియం
గసాగె
సన్నవాన కురిసి నట్లుగా వుంటెను
తుళ్లిపడి కుందమాదేవి దిగ్గున లెగచి
పక్షిని పట్టిన హస్తములు పచ్చి రక్త
మాయెను
యపము రక్తము తుదిసి వెతపోవు
చూను

పాట :
''పాలుదాగే ప్రాయమునాడు
రామాచిలుకా,
పసిడి గోరుపెట్టి సాదుకొంటినే
రామాచిలుకా!
యెన్నదినే ప్రాయమునాడు
రామాచిలుకా,
యెండిగోరుపెట్టి సాదుకొంటినే
రామాచిలుకా!
శ్రీగంగ వనములో సిగురు మామిడి
కింద రామాచిలుకా
కొమ్మల కిందను గోవులు మేసిన
రామాచిలుకా!
రాజు రాఘవా పద్మనాయుడు
రామాచిలుకా,

జన్నెవాడ గుంటిమీద
చంద్రదంగమాడ రామాచిలుకా!
గొల్ల బిడ్డా యెంత కోపాదారోగాని
రామాచిలుకా,
పక్షి నేసినా పాపకర్ముడు
రామాచిలుకా!

పద్మనాయుడు గాజు వింటను
రామాచిలుకా,
పన్నుగా నిన్ను కోరి పెడితినే
రామాచిలుకా!''
అని బాణము తియ్యంగనే చిలుక
ప్రాణము విడిచెను
అగ్నిదానము చేసెను అ నీలవేణి

## కుందమాదేవి బోయలకు రహస్యముగా జాబులంపుట

కడలేని దుఃఖమున కరకర జాబులు
కర కర జాబులు కరిచించి వ్రాసెను
కడమ పావురాల మెడల
కమ్మలుగట్టి
"భావరాజుకు యెరుక లేకుండ
పట్నానికి మీరు

పట్నానికి మీరు పరుగున వెళ్ళి
మరుగున వీ కమ్మలు మరివేగ
యివ్వరమ్మ''
పట్నాన భావరాజును మరిపించినారు
సందజాముకాడ వారి ఆవులను
వెయ్య జరిగిరి కొందరు

## బోయలు మాటుగా కాటమరాజు ఆలమందను చేరుట

మునిమాపు పొద్దువేళ వారు
ముత్యాలాడిరి
సరిపొద్దువేళను జాడలు చెప్పుకొనిరి
యేకువ తెల్లవారంగ యెదలిరి
బోయీలు
భావరాజును యెరగకుండ
కోయబోయీలందరును
యెరవక వారి యెడ్లను వెయ్యను
కదలిరి
వారు యెవరెవరంటే-

పరగసా అబ్బినీడు, పట్టల పిన్ను
జోతుల సోమనీడు, అతనికి మరిది
అతనికి మరిది అగ్గి మైసినీడు,
దబ్బినీడు, అబ్బినీడు, దబ్బి సరివి
నీడు,
మీసుగా మళ్ళినీడు, మీసాల తిరుమళి,
కనకపు మళ్లినీడు, గట్టికొప్పు
మూతినీడు,
తొమ్మిదివేలమంది తొడబడె మూకలు

తీగల చెరువుగట్టు కాల్వలోకి దిగారు
విల్లు
రిక్కలు యీలలు పెట్టుచును
రొట్టము ముసురుకొనుచు
వక్కసి వడదోళ్లపాట బల్లెములు
వేపిమాకుల వెండలుగొని వారి
యెడ్లను జూసిరి
కణికిమాకుల యెత్తనుగొని వారి
కవులావులు జూసిరి
జిల్లేళ్ల యెడ్లగొని దిగసిరి విల్లు
తంగేళ్ల అండగొని తలవిళ్లు జూసిరి
దోకల అంబులు దొడగి తొడలు
సరసుకొని

అనుమునుగా దను వియ్యక
అనుమానపడిరి
చిరిగల ఆవులు సింహాల పొడుగున
వాక్కొక్క యెద్దు యేనుగుల
పొడవు
యీ ఆవుల గాసే గోపాలకులు
మహాధికులనంగ బోదురు
వారు యెక్కడ వున్నారో
అనుకుమయితేగాని
వారి ఆవులు వెయ్యరాదనిరి
చూపుల చొప్పున్న బోయనుబోయి
చూసిరమ్మనిరి
మాటుగావుండి చూస్తవున్నాడు వారి
మార్గంబులెల్ల

## గోపాలకులు ఆవుల ఆదమరచి పెన్నలో ఈదులాడుచుండుట

ఆవేళ గోపాల్కులు ఆవులు మరచి
పెన్నలో గోపాల్కులు పేరుబంతు
లాడుచున్నారు
అల్ల పల్లికొండ పెరుమాళ్లు
బ్రాహ్మణుడై వచ్చి
బలము చెప్పిన నాటి దివసం చేరికై
వచ్చె
హెచ్చరికంబుగా పెన్నలోను
యీదులాడుచు[౩౫] వారు

పట్టపగలు సూర్యగ్రహణ పట్టింది
గనుక
గ్రహణస్థితి ఆడుగువారు గంతులు
వేయువారు
రావుచేతను సూర్యుడు నాడే
కట్టుబడెను
నాడే వారి గోవు గణములకు
ప్రాణమ్మీది కొచ్చెను
ఆవేళ గోపాలకులు ఆవుల మరచి

౩౫. ఈదులాడు

పెన్నలో గోపాలకులు పేరుబంతు
లాడుచున్నారు
అంటు ముళ్లు వేసి అలంకుపడువారు
అద్దే పట్టుబడ్డాయని అంటె
కూయుచూను
బిళ్లలాడు వారు పిల్లి
డిప్పలాడుచూను
గద్దెరి బొద్దెరి గట్టాడుకొనుచు
గండాభేరుండా లాడువారు
కావరంబుచను
పసువులు యేమల్లిరి పడుచులు
ఆటలాను
వుబ్బుచుపోక గోపాలకులు యిసిక
లోపలను
సుద్దులు జెప్పమని సోరాదిగ
గూర్చుండబెట్టిరి

గొబ్బలా బొండంగ వుబ్బి సింహాలు
పుట్టినగాని
వుర్విపైబడి పొర్లాడంగ యెర్లు మా
అతికమాయెనని
వురదాళ్లు తీసికొని వోరుగా
కొట్టుకొనేటివారు
తొల్లిటి శాపంబు తగిలిన కాదను
తొల్లి దూర్వాస మహాముని శాపంబు
దగిలి
యమునలో గోపాలకులకు
యాదవులకు ఆవులకు సాగాను
ప్రాణహాని ఆయెను వాగీర్తి
. సాక్షిగాను
ఆవులను మరచివుండిరి యాదవులు
అపుడు

## బోయలు ఆలమందలను వేయుట

అనిన సూపుల సొప్పన్న బోయ
పోయి చెప్పినాడు బోయీలకు
చెప్పిన బోయీలు సైగలు చేసికొనిరి
తమకు యిదేసందు ఆయనని
కుదేళ్లకొండ యిరుమేల వారె
గోవులను ఆరికట్టిరి
నపరాత గురుగుంటన ముడి
బట్టుకొని

యెగరేసి చెలువారు యెద్దులావులను
తేనెరేపిన కితిని తెగువతోడుతను
వలపట యెద్దులు వలల బడదోసిరి
చెదురుకొని ఆవులు చిచ్చుతు
బారినట్లు
అర్లు పెత్తి చూచుచు వారి చెలువు
లేకుండగాను
బోయగాలికి ఆవులు పోగులై నిలచె

కాత్రీణి[26]కవులావులు యేక
రెణమాయెను
పల్లెకొండ ఆవులకు బాణాలు
నాటెను
తామరనాటి యెడ్లకు తాకెను బాణాలు
మందనుండి ఆవులు మరివేట్లు పడెను
గొదగొని వేసేరు వారి గొడ్డుటావులను
కొట్టి యిలపడవేసిరి లోదులుం
భంగూల
చంద్రగిరి బాణాలు యెడ్లకు
చెక్కిళ్లనాటెను
శిరసు వాలము గానుండి సిరిపాదము
దాక
యెతికి నువ్వుగింజవేయు
యెడములేకుండ
అలలంబోసాల అంపకోలలు నాటెను
బాలుబాలున అరిచె వసిలేగలెల్ల
పరుగులు బారంగ చురకలు
తగిలించిరి
చురకలు తగిలించిరి వారి చూడి
పడ్డలకు
కోడెలవేసిరి కాళ్ళు విరగంగ
శ్రీరామ కవులావులు చిందుచిందుగా
వేసిరి
వేల్పుల కవులావులు వేసిరి
బోయీలు
సురభిధేనువలు సూలుకుట్టి వేసిరి
సన్న్యాసిధేన్వలను చల్లుగా వేసిరి

వుత్తమాసురభులను వులుకుట్టు వేసిరి
చుక్కపెయ్యీ లరువంగ
చూడియావుల వేసిరి
చూడియావు లరువంగ
చుక్కపెయ్యల వేసిరి
పాడియావులు అరువంగ పక్కలేగల
వేసిరి
పక్కలేగలు అరువంగ పాడియావుల
వేసిరి
కరవులు వనరంగ కడికాళ్లన
బొడిచిరి
బడి వచ్చేటివారి వుక్కుటావులను
బొడిచిరి
పొర్లబడి వచ్చేటివారి బోడావుల
బొడిచిరి
పొగరు వయసు వచ్చేయెడ్లు
పోటుకెదురెక్కి
అంబోయని యెద్దు రంకెలకు
ఆంబోదులు కదిసి
అట్టేపూని పొడువుతామని వచ్చి
పొంకముగ నిలచి
"ఆవులనలన్న సెలవులేక మన
మంది పొడవరాదు
బసవన్న సెలవులేక మనము పట్టి
పొడవరాదు
కాత్రీణి సెలవులేక మనము వారిని
కదిసి పొడవరాదు

26. కాత్రేని

యర్రన్న సెలవు లేక మనము
యవ్వరిని పొడవరాదు
యెన్నడు యరనారి నాయన్న
యెడబాడ లేదు
నేడు సూర్యగ్రహణము కానంగ
వచ్చెను
యిచ్చోట యేట్లు బడ కారణ ముండని
కాబోలు మాకు
మాయచేత చిక్కితిమి మనము యీ
బోయీలచేత''
అని యరవక జడవక యరిచించి
పారిపోక

మనోగ్రహణమున యెద్దు మాత్కొని
నిలచెను
యెనక తీసిపోక బోయీలు వాడి
యంబులు దొడగిరి
యేపెరిగి వేసేరు వారి యెద్దు
లావులాను
వుద్దబసి బాణాలు గట్టిగా వేసిరి
మానవతి యంబులు ముక్కుగోళ్లు
గొట్టివేసిరి
యెండి చుప్పి బాణాలు యెదముల
గొట్టిరి
బోల అంబులు నెత్తిపుసుకున
గొట్టివేసిరి

## గాయపడిన ఆవుల రక్తము వరదలై పారుట

సింగిణి బాణాలు యెద్లకు చిత్తవర్ష
మాయె
టొన యింటి కోలలు యెద్లకు సోన
వానాయెను
తొండమతి యంబులు యెద్లకు
తొడలు దూశిపారెను
యిక వింటి యమ్ములు యెద్లకు
యీపులకు దగిలెను
గాజు దారసాలు గంగడోలుల దూసి
పారెను
గన్నెర్లకు ఆలుగులు యెద్లకు గల్లుగ
దూసి పారెను

కుప్పికోలలు యెద్లకు కుతికిదింపు
లాయెను
చంద్రవంకి బాణాలు యెద్లకు
చెక్కిళ్ళు నాటెను
చిరువాలము నిండి సిరిపాదములదాక
యెతికిన నువ్వుగింజ వెయ్య యెదమ
లేకుంత
వొళ్లెల్ల బాణాలు వొత్తుగనాటెను
యెద్లకు రూపులు దప్పి యెదురాస
మాయెను
ముంగల యెద్లకు దగిలి వెనక
ఆవులకు దూసుకొని పారెను

యెద్దురూపుదప్పి యేదురూప
మాయెను
వోఛిమోన బాణాలు యెడ్లకు వొత్తుగ
నాటెను
పొదిలోన బాణాలు వేసిరి
బోయి నాయకూలు
సూర్య కట్టలును జముదాళపులు
బోయముప్పిళ్ల
జారె జారిళ్ల నావరలు దూసుకొని
వుంపవడిగావచ్చి యెడ్లను వురువులుగా
బొడిచిరి
కణించివచ్చే యెడ్లను కముట్ల నరికిరి
చేరివచ్చే యెడ్లను కెక్కిళ్ళు నరికిరి
యెటుగాం గురకాలు వాటు బల్లాలు
బొడచిరి
యేనుగుల యెడ్లకు యేట్లు పోట్లు
అయెను
ఆరునూరు ఆవులకు అంబుగాయాలు
నాటెను
కాటమరాజు ఆవులకు గాయాలు
నాటెను
ఆరు నూరు అనుమంతు యెడ్లకు
యేట్లు పడెను
యాభై నూరు లింగముద్ర యెడ్లు
యేట్లు పడెను
పన్నెండు లక్షల బసవముద్ర యెడ్లు
యేట్లు పడెను

పౌన్నమాడ బొల్యావులు పొడిచిరి
బోయిలు
పోట్లు యెంట రక్తంబు పొట పొట
కురియంగ
కారేటి రక్తంబు కాలవలై పారంగను
కురిసేటి రక్తంబు కుంభ
ధోరణమై[87] పారంగను
యెడ్లను గొట్టిన రక్తంబు యేరుపాలై
పారంగను
కాలుపల వెంట రక్తంబు కాలువలై
పారంగను
బోరున వానకురిసినట్లాయెను
రక్తము పెన్న వెళ్ళివిరిసి పారాయె
నాటు
ఆ కనిగిరి చెరువులోకి రక్తంబు
కాలవలై పారెను
పల్లెకొండ పేరిటి అరణపు ధేనువులు
వేట్లు పడెను
యేసిరి బోయిలు యెరగంద రపుడు
గ్రేణ[88] దివసవమౌట కానరు బోయిలు
ఆకాశం యరడాలు కప్పుటున్నాది
సూర్యుడికను సుతుడుగ మీరు
పసువులు వచ్చిన పాకములు ముంగ
గాను
పసుగులు సుక్కలు పొడిసినను
పాపంబు తెసుకనిరి

86. కుంభద్రోణమై 87. గ్రహణ

సెలవులేక కవులావులు మనచేత
చల్లవేట్ల పడెను
ఆవులు వొడిచేమంటేను తమ
అందరిని చంపగలవు
యెద్లను పొడిచేమంటేను మనము
యేమి చేయగలము
యేక జాడ రాకున్నది వక వంకకు
జరుగుదామనిరి

దాను గోవులు సంపించే తగ
పాపకర్మురాలు
యాలాలు వలెనూ వేలలు బెట్టు
కొనుచు
వారివారి సావిగివులు వడి
సెప్పుగొనుచు
బొగ్గుమల సావులు బట్టుకొని
బోయీలు తిరిగిరి
దుగ్గానులై పోయి దేశాలు దూరిరి

## గాయపడిన ఆవులు ఎద్దులు జన్నివాడ గుంటి చుట్టును చేరుట

సాగవారి బోయ పారిపోయిన వెనుక
ఆవులు యెద్లను రణమేలు కొనెను
గోవులు ముచ్చులు గొబ్బున
దెలంచిరి
అంపకోలలతోను వెద్లుకొట్టు
ముదడుచూను
బాణాలతో యెద్లు ఆవులు బాలు
బాలున అరచును
పేగులు జీరాడంగ పెంటకు
మళ్ళిరాను
మార్చిట పొద్దుకు ఆవులు యేట్లుబడి
మందపెంటకు జేరెను
పెన్నలో యేట్టుబడి పెయ్యలు
తెగసెను

చెల్లంబు జన్నివాడ గుంటుకి చేరి
రంతటాను
వెదలేని బాణాలు వెద్లకు వేట్లు
పోట్లాయెనని
జాడకొరకు రక్తము జన్నెవాడకు
అరెను
పేగులు జీరాడగావచ్చి ఆవులు
యెద్లును
పెనుగొని జన్నెవాడ గుంటికి
పొర్లబడి య్రరయ్యేకు అర్లు జాస్తుం
డేను
గొళ్ళిల్లతో దొరబడి గొటరించ
సాగెను

# గాయపడిన ఆలమందను చూచి కాటమరాజాదులు అడలుట

ఆడి ఆడి చంద్రాంగ మారాజు అటు
సాలించెను
గుప్పునా చంద్రాంగము గుండె దిగ
వురికీ
గట్లయెంట రక్తంబు పొందుగా
తొడసి
అవులు యెద్లు యేట్లు పోట్లు జూసి
గోపాల్కులు అడల దొడకొనిరి
యెదము రక్తంబు దుడిసి
వెతపడుతారు
పద్మనాయుని బిలిచి పలికెను రాజు
"యీనాడు యినవోయి నా
సిన్నమరిది!
మన యద్దులావులు యేమయ్యెనో
యవరు గల్గిరి
యద్దులను జూసి నా యయారవున
జొచ్చినాను యదురూపమై వచ్చినాను
మోదుగులు బూసి బూరుగుల మీద
వ్రాలినట్లుండెను
బూరుగులు బూసి మోదుగుల మీద
వొరిగి నట్లాయెను
నెత్తురు మడుగుల నేలను పగిలిన రీతి
కోసారక వేట్లు పడెను గోవులిచ్చోట

ఆవులు యేట్లుపడెను అవస్థగ
వచ్చెను
యాభైయారు దేశాలు ధేనువులు
మేపితిమిగాని
యీ కీడు తమకు యెదుట యన్నడు
లేదు
చెవులేక యెద్లు వారికి చెల్ల యేట్లు
పడెను"
అని అడల దొరకొనెను
ఆ యావులన్న
భీకర విజయుండు బీరినాయుండు
అంశరుడై వచ్చి అన్నకు మ్రొక్కి
చిన్నబోయిన వాడవు చెంచన్న
మనెను
కన్నులు సోక విచ్చిణి కమ్ముసు
విడలిరి
కొమ్మున యీడు వచ్చి గోవులను
జూసి
యన్నడు రాని దుఃఖముల
యెలుగెత్తి అడలేరు
ఆరువేల గోపాల్కులు అందరు
వచ్చిరి
ఆవులను జూసి యన్నడురాని
దుఃఖాన యెలుగెత్తి అడలేరు

## గోసంగులు, యర్రయ్య కోపించి నెల్లూరును ముట్టడింతుమనుట

కత్తిమొన గోసంగులు కారుచిచ్చువలె
వచ్చిరి
ఆంక్ష గోపాల్కులు అందరు వచ్చిరి
యిట్లని పలికిరి వీర తేజంబుతోను:
"గొప్పదుర్గములని
కొదవుచేయకుము రాజ!
దుర్గములు బొడిపించి దలిచెంచి
వత్తుము ఆవుల నలనన్న
ఆలనాడు అనుమన్న లంకకాల్చి
భస్మంబు చేసినయట్లు
పట్నము కాలవేసి పాడుజేసి
వొత్తుము అన్నా ఆవులన్న!
నల్లమేడ స్తంభాలు నడిమికి
వేయింతుమంటే అన్నా
ఆవులన్న !
రాణివాసము అంతా లగ్గము పట్టింతు
మంటే అన్నా ఆలవున్న"!
అనిరి గోపాల్కులు ఆ రాజుతోను
పెనుపు కోపమున పెయ్యాల
వెర్రయ్య

కారుచిచ్చువలె వచ్చి అన్నకు
మ్రొక్కి:
"సితాల్మి యికమాను ధర్మశేఖరుండ
నీ కోపంబు లేదయ్య గుణవిశాలుండ
కణిగి మన ఆవులను వెయ్య యవరికి
కారణము లేదు
యర్లను వేయించినవాడు పంతకు
నలసిద్దిరాజుగాని
మనమది మరివొక కరువుపగ
చేయలేదు
కోయ బోయీలచేత పొడిపించగా
కాచిగల గేలాలు పుచ్చుకొని చిత్ర
రౌతులూను
తరిమి నెల్లూరు పట్నము దాడియాడు
వత్తుమంటే ఆవులన్న
యెద్దులు వేయించిన యేగురు
సిద్దిరాజులను బట్టి
బద్దెగొర్రెలుగా నరికింతు మన
బాగీరథి గంగకు వో అన్నా!
ఆవులన్న!"

## ఆవులన్న యర్రయ్యను శాంతపరచుట

అనిన ఆవులన్న అపుడిట్లగనియె:

"నా సహదేవుని వంటి సక్కని
తమ్ముడ! వినుమ

శోకము లేదు మనకిలసుతులా
విసుడి
వచ్చిన వెడ్లను ధరణిపై నుంచి
కచ్చికి పోయేది వుచితంబుగాదు
యేట్లుబడి ఆవులు యెడ్లు
పొర్లాడగాను
మతముకు పొయ్యేది మర్యాదగాదు,
సిద్దిరాజు మరిది పడమటి ఖావరాజు
పర్యాయమ దాను మన్నిలా
పండుగగా పంపమన్నాడు
తీసుడు పువ్వులకు వచ్చి అతడు
తిరిగిపోయినాడు
అతని యెరుకలేక బోయీలు మా
యెడ్లను వేసినారు
యడ్లను వెయ్యటము సిద్దిరాజు
యెరుగునో - యరగడో గాని
సిద్దిరాజు షనసు కల్లలాడరాదు
మీకు మహా మనవిగ జెప్పేను
మా యన్నలోర!
అమిణిలో రావణుని బాణము తగిలి
లక్ష్మణ అన్నాయని మూర్చిల్లి
పోయెను
తల్లి శోక తాగ వుంతు తమ్ముని
కొరకు

హనుమంతుని పర్వతము పంపి
సంజీవితెచ్చి
సంజీవితెచ్చి తమ్ముని కలుసుకొని
తర్లిమి రావణాబ్రహ్మ తలలు
ఖండించిరి
అది యెరికి కలిగి వున్నది అందరికి
మీకు
దేవసాక్షులు మెప్పించి వారి
అప్పనము చెల్లు అనిపించి
సిద్దిరాజును సొంతముగా తప్పినాడు
అని
దేవతలు సాక్షులు పలికించి అటు
వెనక
చెల్లుగాను గుప్పమని సెలవిత్తు మీకు
మీ మనసార పగదీర మరిసాల
కుంటేను
యతకి యీ భూమి యంతయు
యాటాడుదువ్వగాని
సేనలు హింసలవలె ఆ ఘోర
పడుతూవున్నావి
అని మనవిగ జెప్పి తమ్మునికి
కోపములు మాన్పెను

## యాదవులు ఆలమందకు తగిలిన బాణములు తీసి భద్రపరచుట

పట్టుగల్లు దెప్పించి యడ్లవంటి
బాణాల్లు
పాలించి తీస్తవున్నారు పరగ
యాదవులు

చిల్లాల అంబోది సేరి చెల్లంబో
శివుడా
గొరకల అంబులు దీసె యెద్దు
అగోరంబు పడంగాను
కడుపులో చిక్కిన బాణాలు వారు
పాలించి తీశారు పట్టుగొల్లుల చేత
బల్లెపుటలుగులు బలిమిగా పట్టి
తీశారు
కొత్తలు విరిగిన బాణాలు పట్టి
తీశారు
చట్టువారి యర్రయ్య పట్టి తీసేను
పాడియావుల వెంట బాణాలు
తియ్యంగ
పద్మనాయుడు బాణాలు పట్టి
తీయంగ
అవులు యెద్దు బాలుబాలున అరచి
ప్రాణాలువిడిచెను
జోరున రక్తంబు జొలజొట
కురియంగను

కారేటి రక్తంబు కాలవలై
పారంగను
పింజలాల వంటి రక్తంబు
పిక్కటిల్ల సాగెను
గజగండమైయున్న గాయాలు జూసి
బంగారు బిందెలతో రాజు పన్నీరు
దెప్పించి
అభయ మంత్రించి రాజు ఆ
మంద మీద చల్లించినాడు
యేడు లక్షల యద్దుకు యేట్లు పోట్లు
మూసుకొనెను
ఆరు లక్షల ఆవులకు అంబుల
గాయాలు మానెను
కాటమరాజు అవులకు గాయాలు
కప్పుకొనెను
యద్దని వేసిన యేడుపెట్ల బాణాలు
అవులు వేసిన అరుపెట్ల బాణాలు
అమరంగ పెట్టిలోపల పెట్టి
లక్కముద్రలు జూచ్చి రాజు
నగరున వుంచిరి.

## చనిపోయిన అవులను ఎద్దులను చూచి కాటమరాజు శోకించుట

"మూడుభూములు బాయ మూడెద్దు
చెల్లినను
యేడు లక్షలు బాయను అవు
వొక్కటి చెల్లినను

తిరుమల తిరుమందలు నట్టి
అమ్మపాల వచ్చిన
ఆ మాలక్ష్మి అనేటి అవు వొక్కటే
చెల్లితేను

తల్లిని బోలిన ధర్మధేనువులు
చెల్లెను
అగుమంచి ఆడబిడ్డను ఆవు
వొక్కటి చెల్లించినను
పాపనూకను బోలిన పసిలేగలు
లేచెను
నందులవంటి యెద్లు నాడి కంకళ్ల
చెల్లినను
శక్తిరన్నపేరిట బస్వలింగముద్ర
యెద్లు యేట్లుపడెను నాయుడా!
పల్లెకొండపేరిట అరణపుధేన్వలు
యేట్లు పడేను నాయుడా!
ముమ్మయ్యను పోచయ్యను బోలిన
ముద్దులేగలు చెల్లెను
చిత్రభాను సంవత్సరం చేరికాయ
నాయుడా!
కాలాంతము చేరికాయెను
కవులావులకు

తమకు అంతట సల్లవారికి సాగించి
సావిజి పాగబొమ్మ
నీవు పోయిన పీనుగులను నమ్మ
వచ్చును''
పొమ్మన్నాక తలికే యెక్కువ
ప్రొద్దుజాడలకు యెదతిలె నాతడు
మారిపోయి బోయల యిడుమాట్లు
జూసి
పసువులు వచ్చిన జాడనే బోయి
పరుగున మళ్ళివచ్చి
చెప్పెను కాటమరాజుకు చేతులు
మొక్కి:
"అన్నరో! వోయన్న! అన్న
ఆవులన్న!
మన ఆవులు యెద్లను వేసిన
బోయీలు
బొగ్గుమాలలో వున్నారు పోయి
చూశాను''

## గాయపడిన పశువులు పగ తీర్చుకొనుటకే బ్రతికి యున్నవని కాటమరాజు చెప్పుట

అనిన కాటమరాజు అపుడిట్ల గనియె:
''యిరవై యొక్క దినము నాటికిగాని
అది జగడము ముడిచిరాదు
ఆ యావులు దప్పిగాయములు దగిలి
ఇరిగిన వారికి యెద్లు జీవాలు
విడువక

నెల్లూరు రాజుల మీద పగదించు
కొరకు ప్రాణాలు విడువక
యరగడ్డపాటి యెదురు బాదులమీద
పగతీర్చుమని యెద్లు పంతమున
వుండెను''

యడ్లను గొట్టి గాయకుల॥పతి
యీబూది ప్రసాదం మేసితే
గాయాలు కాసినాయి రీతి కట్టబడె
నపుడు

వాటిలో యిరవైయొక్క ఆవులు
పదిహేను యెద్దు ప్రాణములు
విడిచెను

## చనిపోయిన ఆవులను ఎద్దులను యాదవులు కైలాసము పంపుట

ప్రాణములు విడిచిన ఆవులును
యెద్దును
కావండ్లమీద బెట్టుకొని
పంచమా వాయిద్యములు వాయించు
కొనుచు
శ్రీరాము కవులావులు యడ్లను
శృంగారించుకొనిరి
సిరువులు వుప్పొంగుచూను
తిరుమందులు పల్లవులు తిరుగువారు
కొనుచు
చెలగి పల్లవులెల్ల శివశివాయనిరి
కొందరు గోపాల్కులు 'గోయింద
గోయింద' యనిరి
వృత్తములు కొందరు వుగ్గోవుగ్గో
అనిరి
తండువాపరి పంపులైరి
దాసాన దాసుళ్లు ఆడుతు పాడుతు
ఆపెన్న వొడ్డుకు వారు అందరు
వచ్చిరి

సమాధులు దీయించిరి జంగాలను
బిలిపించిరి
శీలామంతులు యెలు తిరుగువారు
కొనుచు
పంచగంటలు మ్రోవంగ
పరమేశ్వరుం డాలకింప
దేవగంటలు మ్రోవంగ
దేముడాలకింపగాను
దిగిపోయి గొబ్బిలలో దించిరి
యడ్లను ఆవులను
మారేడు పత్రి మంత్రి హరిపత్రి
నేరేడు పత్రి యీనె మగకాయలు
పూజలు పాంచాలి సాది విచ్చి పై
కొలుసు బోసిరి
గనమైన సాదులకు గచ్చువిల్లు[౩౯]
సేయించిరి.
శివలింగ యడ్లకు దేవపూజలు జేసిరి
సత్యముగల సురభులకు చెయ్యెత్తి
మ్రొక్కిరి

౩౯. గచ్చు ఇల్లు

దిగివచ్చి పెన్నలోను తీర్థంబులాడిరి
తిరుమందుల వారి యెదు చెల్లినందు
లకు
పల్లికొండ యెదురేవున స్తానంబు
లాడిరి
వల్లపులవారి అవుల చెల్లించినందులకు
సంగపు యెదురేవున స్తానంబులాడిరి
తడి పట్టు చీరెలు ధరణిపై విడిచిరి
దివ్య వస్త్రములు గట్టిరి తెరుగొప్ప
గాను
గోత్రాల వారెల్ల గుడార్లు కొచ్చిరి
పంచరాత్రి నాటికి సమాధులు
పాలంచిరి[40]

లింగమార్తను జేసిరి జంగాల
కన్నము వోసించిరి
దాసోగ మాడించిరి సర్వేశ్వరుని
కొలువులోను
పొదివెలు దివ్యరథములు పట్టు
కొనుచు
పల్లికొండ గుడినాథుని పంపటనిలచి
అత్తుల కింద యదగిరినాథునికి
యాకాంతులు వొప్పించిరి
గంట వాయించిరి యడ్లను కవిలేశం[41]
బంపిరి

## చనిపోయిన పశువులు రంకెలు వేయగా కాటమరాజు వానికి అభయమిచ్చుట

అంభోయని యగచె ఆరు
యోజనములు
ఆ మీదట హరిహరా దేవేంద్ర
దేవతలు
పగిడి రథములు పట్టించిరంత
అంత్ర రథములు యెక్కక
ఆకాశమున ధేనువలు
కాలుదువ్వి ఖణేలున రంకెవేసెను
పుష్పరథములు యెక్కక
భూపాలున్ని యెద బాయలేక

ధేనువులు పలవరింపసాగెను
రంకె నాదులు విని రాజశేఖరుండు
యిట్లగనియె :
ఆకాశమున ధేనువుల ఆర్బాటము
లాయెను
పద్మనాయని బిలచి పలికెను రాజు :
"ఆకాశమున రంకెలు అదియేమి
నాయుడా ?"
అనిన మాటలకు పద్మరామవుండు
అపుడిట్లగనియె :

---

40, పాలు పంచిరి 41. కైలాసం

"యినుము కాటభూపాల! యిన్న
వించెదాను
యెద్దుల సావిగ్నెలు[42] తమ్ముడు
యర్రయ్యకు దెలుసు
యర్రయ్య సావిగ్నె యెద్దులకు
దెలుసు"
అనిన మాటలకు యర్రయ్యను ఆ రాజు
బిలచి
"హరిహర దేవేంద్ర దేవతల పేరిట
తమ్ముడ! యర్రయ్య వినుము
కాలంబు యెపుగుదువు మరి హేష్య
కాలంబు యెరుగుదువు
సాధ్యే వాతాంబు యెరుగుదువు
తమ్ముడా! చాల శాస్త్రంబు
లెరుగుదువు
నిన్ను నేను యన్నదు అడుగలేదు
అడిగితిని తమ్ముడా! అంత్యకాలముకు
తరమెరిగి చెప్పవోయి తమ్ముడు
యర్రయ్య నీవు
ఆ మాటకు యర్రయ్య అన్నకు
మొక్కి యిట్లగసియె;
"చిత్రభాను సంవత్సరము మనకు
చేరికయ్యెనయ్య
యిక ముంగర చరబహుళ అమాస
మొదలుకొని
మూడునెల్ల పద్దెనిమిడి దినములనాటికి
యరగడ్డ పాడున వోయన్న! వొరగ
నున్నాము
అమితము వొరగవలె యెడ్లు
యడబాసి సోతువున్నామని
నిన్ను పాయలేకి యెడ్లు పలవరించే
నన్న
అభయమిచ్చి పంపవే అన్నరో! నీవు"
ఆ మాటకు కాటమరాజు ఆవులకు
యడ్లకు
ఆవులకు యడ్లకు అభయ హస్త
మిచ్చెను
"వో చక్కని తమ్ములారా! వో
సహోదరులారా!
మీరు వైకుంఠము వెళ్ళిన మూడునెలల
పద్దెనిమిది రోజులకు
యరగడ్డపాటున తమరు యేట్లుపడి
మువ్వతమైతేను
గ్రక్కున మిమ్మును కలియవస్తాము"
అని మనవిగ చెప్పి పంపేను ఆ
యావులన్న

## కాటమరాజు గొల్లెనలు ఎత్తించి కొలువు దీరుట

మగిడి జన్నెవార కూను మళ్ళి
వేతెంచిరి,
భూచక్రాల గొడుగులకింద భూపాల
కుండు

---

42. సంజ్ఞలు

కొలువై కూర్చుండెను కులభూష
ణుండు
జన్నెవాడ గుంటను కాపేషణలు
వ్రాయించినారు
ఆవులను యడ్లను ఆ గుంటను
మలిపించెను
నందులగా మలిపించెను సూత్రం
బుగాను
నరవలన్నిటిని లక్షవరాలు ధనము
ఆ గుంటను నిక్షేపము అప్పుడు జేసిరి
సిద్ధిరాజుకు విధము సిద్ధించదాయెను
సత్యము దప్పక విధానము దశఱజ
నిక్కడ
అని నిక్షేపము చేసిన అమరనాడు
జన్నెవాడ గొల్లిళ్ల ఆక్షణము తీయించి
పల్లెకొండ ప్రయెదురేవున బారుల
వర్తించెను
యెత్తించిన గొల్లిళ్లు యే కొదువ
లేకుండ
పట్టు గొల్లిళ్ళ పసిడి కొండలాలి
యర్ర గొల్లిళ్లకు యెర్రిడి కుండలాలి
కాగి గొల్లిళ్ళకు కంచు కుండలాలి

నీరు గొల్లిళ్ళకు రావి కుండలాలి
యిలవేలి యట్టె యెల్ల గొల్లిళ్ళు
దాతనైనా సకల దూదిపట్టు గొల్లిళ్ళు
చిలకవన్నె గొల్లిళ్ల చిత్తరువు గొల్లిళ్ల
వ్రాసిన చిత్తారు వన్నెగొల్లిళ్ళు
నామగిరి గొల్లిళ్ళు నవనందుల గొల్లిళ్ల
తెలివైన రతచెల్లి తీగ గొల్లిళ్ల
తామర పూవన్నె దాతు గొల్లిళ్ల
పొలుపు మీరగ సూర్యాపుటము
గొల్లిళ్ల
కొమరప్ప చందిర కావి గొల్లిళ్ల
సాయాలు కుదేరిన పక్షపట్టు గొల్లిళ్ల
ఆ గొల్లిళ్ల మీదను గరుడ
పడిగలును
కంఠీరవం పడిగ ను
హనుమంతుడు పడిగలును
ఆలవాటములు వివిధమున గొల్లిళ్ళు
బారులుగా వేయించెను భాను
కులజుండు
భూచక్రాల మండపము క్రింద
భూనాయకుండు
కొలువై కూర్చుండెను కులశేఖరుండు

## సిద్ధిరాజును తోడి తెమ్మని కాటమరాజు కంపటీలను పంపుట

పెన్నలోకి తోడితేరోయి వక్క
పరుగునపోయి
వెడలిరి కంపటీలు వేడుకతోను

కీడురాను ముట్ట మామున్నెడు
యేకాల తిమ్మనీడు

పెదవెళ్ళి అమ్మినీడు కవుటావుల
కమ్మిచెంచు
అందలాలు యెక్కి వారు అందరు
కదలిరి
పల్లకీలు యెక్కి పరుగున కదలిరి
ఆవేళ సిద్ధిరాజు అన్నదమ్ములును
యల్లగొడుగుల నీడల
యింజామరములు విసరంగ
కాలితే నవరత్నములు కాంతులు
మెరియంగ
ఛత్ర చామరములు చేరిపట్టంగను
చతురంగ బలములతోను సిద్ధిరాజు
సారివెళ్ళినాడు
ఆవేళ గొల్లరాజు అదుగో
వచ్చేనంటేను
యెదురుగా సిద్ధిరాజ వేతించినవేళ
"మన్నించు సిద్ధిరాజ! మా మనవి
వినుమ
చెప్పుదు మాటలు వింటే వో సిద్ధిరాజు
మా చెతురు దెవసము దగ్గరకు
వచ్చెను
మాశమగుమము తిరిగిపోవలెను
పెన్నదేవునికి పెసాదానము పట్టుకొని
మాపిన్న పెద్దలు మీరు పెసాదానము
పట్టుకొని
యన్నార పుల్లరి ధనముమీరు
యెస్నుకోవలెను
నిజపులు దెలిపించి నిష్టలు చూపి

యిష్టమైన పదార్థము మీరుయెన్నుకో
వలెను
యాభై యారు కనకరాసులును
గరుడా స్తంభములు పోగాను
వరాహాలు అంట్యముగ రాసులు
పోంచి మాడలు యిచ్చి పొడుగున
రత్నములు
యెంచి మీరు అయిదుగురు అన్న
దమ్ములును
సహోదరులకు ప్రధానులకు యిచ్చి
మీరు అడిగిన
కవిళ్లో లెక్కలుగాన యాభై యారు
దేశాలు గెలిచి
తెచ్చిన వస్త్రములు నేటితో మహారాజు
పాలుచేసినాడు
అందులకు మహారాజు
అతి వేడుకతోను
తడవు చేయక రావయ్యా యే దినాన
తప్పకుండగను
గుడి దిరిగి పాటికి పీ రాసకార్యములు
పాత్రాడముగ రావయ్యా బాసలకు
నిలువ వలెను
మడిగిపోయి మేము మామందలాకు
తరమునాటి పెద్దలు తమ్ములు నీవు
వైనమై రావయ్యా వో పల్లవాది
సిద్ధిరాజ"

## సిద్ధిరాజు గొల్లరాజును చూచుటకై బయలుదేర బోవుట

ఆ మాటకు సిద్ధిరాజు ఆనందమును
పొందెను
పదివేల విధముల పార్ధనము చేసి
''సూ స్తిరటయ్య చక్కని
తమ్ముల్లార! గాంభీర్యులార!
దండినాయకులార !
ధర్మ వ్రతులార !
క్షత్రియోత్తములార! సరినిగ్గులార!
నాదు రాజ్యంబు యిచ్చిననోయి
నా సహచరులార!
సర్వశాస్త్ర ప్రధానులార!
సరినిగ్గులార !
వినుత విక్రములార !
వింటిరా మీరు ?
కడనుండి కడదాక గొల్లరాజుతో
పొందు కాదంటిరి మీరు
మనకన్నా సత్యము కలవాడు
గదరోయి అమరవల్లభుండు
పసుపుల మెప్పించిన మాత్రాన
తన ప్రాణమిచ్చెనన్న
యిక్కడ పసువులు వచ్చినంతలోన
అతనికి ప్రాణము
యివ్వాని యెచ్చుఅనినను అతనిని
జూదము యీ క్షణంబు నను''
పైనమై రమ్మని చాటించెరాజు

సర్వసేనలు తమ్ములు దాము చదురు
దిగ్గున లేచిరి
ము స్తీదులై రి తాము
అంతఃపురంబులోను అరిగిరివారు
అంతలో కుందమాదేవులు తన
యిబునికి యెదురుగా వచ్చెను
పాదములు విచ్చి దష్టితో నివ్వాళి
తీసుక పోయెను
జలక మొవ్వగ నాడి ధవళవస్త్రంబు
తిలకంబు కస్తూరి దిద్దిరి నొదట [43]
కడువేట్కతో నపుడు కమ్మని
రుచులు
అన్నము టోంచేసి అవనీశ్వరుండు
దివ్యగంధము పూసి దివ్యాంబురాలు
కట్టెను
దివ్యభూషణములు పెట్టి
దివ్యమాణిక్యములు
దివ్యకిరీటకములు దరియించిరి
రవి కుంటములు నిండు
రత్నారములును [44]
పునర వినోదముగాను
కన్నముల సరిది
తెలివైన రావణము తత్త్వాలు పాకట్టు
బెట్టిరి

43. మరుట 44. రత్నహారములును

గండ్రాపెండెములు కారవొప్పి
రాయిచ్చిరి
కరముల దండ కడియములు
మెరియంగను
నవరత్నగచితమైన వజ్రాల
వుంగరాలు
శ్రీ గంగరాముగా సిద్ధిరాజు తగుట
కబాయిలు
సిరులు వుప్పొంగ దొడిగి దగదగా
మణి పసిడి
దగదగామణిపసిడి తగుటపము గాను
గుబగుబ మనగాను ముఖమున
బుఖాయి పూసి
పదివేళ్లకూపది పసిడి వుంగరాలు
కదసె భావుల భుజకీర్తులు మెరియం
గను

నవరత్నమైన బిరుదములు అన్నియు
బెట్టి
తానమూర్తి గణమైన తనరద్రోహ
మెరుగ
చిరమించి బంగారు చెరుగుల శాలి
కారములు లింగవార గట్టించె రాజు
అటువలె సిద్ధిరాజు అతివేట్కతోను
కాటమరాజు ముందుకు కదలి వచ్చెను
అదప మాదవుని బిలిచి రాజు అపుడిట్ల
గనియె:
"రావోయి అదప మాదవన్న !
గొల్లరాజుకు మంకు గొబ్బున పోవలెను
కందువతో గొల్లరాజుకు కట్నాలు
దేవోయి
మంచి సొమ్ములు గొంచు ముందరకు
బోవలెను"

## గొల్లరాజును చూడ బోవలదని కుందమాదేవి భర్తను వారించుట

అనిన కట్నాలు పట్టించుకొని కదలి
పోవంగను
కుందమాక్క యెదురొమ్ము గొప్పు
గుప్పు మనెను
తన మనసున కుందమాదేవి వూరు
కున్నాది
అంతలోనే కుందమాదేవి అపుడిట్ల
గనియె :

"పువ్వులు వేయించిన దానను నేను
వేసినవారు బోయలు
యెట్లాగునైనాను గొల్లరాజుతో మాట
వచ్చింది కాబోలు
అని కోటలు యెల్లకుండ రాజును
మాట మరిపింతును
మాట మరిపించకుండేను గొల్లరాజు
మక్కుటించ గలడు"

అరి విషముచేత కుందాన యిబునికి
అడమె త్తించెను
"గొల్లరాజు మందకుబోయిది మనకు
మార్గంబుగాదు
మండలాలు యేలేరాజులు వారి మంద
చూడరాదు
దొడ్డరాజులు మీరు వారి దొడ్డి
చూడరాదు
పసువులు కాసే గొల్లరాజులు
మీ పౌరుషము యెరుగరు
మోసము రానున్నది గొల్లముక్క
వారు
నుట మూ ర్తమున దనకు యెడబాసి
కడకుబోరాదు
బిడ్డలు లేనట్టి నేను గొ త్రాలునై తిని
కేదారి గౌరంబు నోము బట్టినాను
పంతమున గౌరమ్మ పలమి స్త
నన్నాది
యెల్లి నేడు తనను యెడబాసి కడకు
బోరాదు
కడు వేడుకతో యీ రాత్రి మనము
కలసివుండవలెను"
అని చెయ్యిబట్టి తియ్యబోయెను
జననాథదేవి

"పట్టకే నను నీవు భావ్యంబు గాదు
చతురు భుజుండై న సొమ్ములు
సింగారించుకొని
పరవశితుడై చూడబోవుచున్నాను
వారి మందలో మందలు యెరుగ
మార్గంబు లెరుగ
వారి ధేనువులు దేవత కవులావులు
వారి పసువులే బ్రహ్మ రుద్రులూను
వారి మందకు బోయివచ్చి నీ మాట
వినేను గాని"
అని చెయ్యి విడిపించుక అతి
శీఘ్రముగను
పైనమై కదలెను పల్లవ సిద్దిరాజు
ఆ పైనము మాన్ప వలెనని
కుందమాదేవి కణ కణ అడిలె
అడిలి నప్పుడు రాజు అనుమాన
పడెను
"పడుచు బుద్ధివి గాంగ పలవ
రించెదవు
పోకుండ జేస్తి వే పొలతిరో నీవు
అష్టభోగములు గలిగి అలాగ
నేమిటికి?"

## తాను దుస్స్వప్నము కంటినని కుందమాదేవి భర్తతో చెప్పుట

ఆ మాట విని కుందమాదేవి ఆడె
నొకమాట

"కలగంటి ప్రాణేశ కలగంటి నయ్య
కల విని నామాట కాదనకయ్య

యీ కన్న కలలు పెద్దలకు జెప్పి
కాకున్న పనులైతె అక్కడకు కదలి
పోవయ్యా
తిక్కనామంత్రి నిక్కడికి పిలి
పించరయ్యా
ద్రోఘు నరసింహ బట్లును తెప్పించ
రయ్యా
అరతలు సోమయ్యకు మీరు
యెరిగించ రయ్యా
బిక్క తిమ్మబట్లును యిక్కడికి
పిలిపించరయ్యా
గూని తిమ్మబట్లును గొబ్బున
పిలువుడీ''
పిలిచిరి పెద్దలను ప్రేమతోడుతను
వచ్చిరి పెద్దలు వవ్వరి చొచ్చిరి
కూర్చుండ బెట్టిరి కూరిమితోను
కుందమాదేవిని చూచి కూర్మితో
బలికిరి
"వో కుందమాదేవులూ! నీవు
కలగన్న విధమెల్ల
కలగన్న విధమెల్ల గ్రక్కున
జెప్పవమ్మ
పయనమై వున్నాడు రాజు పంప
వలెను మనము
నీవు కలగన్న విధమెల్ల గ్రక్కున
జెప్పుమమ్మ
శివశాస్త్ర పురాణములు మేము చెప్ప
గలము

వేదశాస్త్ర పురాణములు మేము
చెప్పంగగలము
మనోగ్నానపు కలలు మేము మరి
చెప్పంగగలము''
తత్తరపడకుండ తబ్బిబ్బులాడక
మాయదారి కలలు కుందమరి చెప్ప
సాగెను
"యాభై యారుదేశాల రాజుల వార్తలు
తనకు
యెరుక లేదాయెను యెక్కడ
రాజులు
యెక్కడకు బోయరేమి తనకు
యేమిటి కార్యము?
బరిణలో అమరిన ఆభరణములు అన్ని
మందసమున అమిరిన వర్తంబు
భూషణములు వలెను
మరుగున ననెను "పకరి మాటలు
తనకేలనయ్యా?
యేసీమ గొల్లరాజు మన సీమకొచ్చె
దర్మకవుళ్లకానిచ్చె మనరాజు భూమి
అరవకట్టు రాజ్యాన వారి ఆవులు
మేపుకోంగాను
అరవ కోయబోయలు వారికి
తక్షణాదం బట్టి
తక్షణాదంబట్టి గొల్లరాజును చంప
దలచి నారట
వారి రాజ్యములో గొల్లరాజును
చంపుదామని

చంపుదామని వారు చెవులాడక
పోయిరట
అర్వభూపతి విని ఆగ్రహుడై వణికె
వారిని జంపరాదు మన రాజ్యములోన
మారురాజ్యము పోయి మరచి
వుందైన గాక
అరవ చిక్కకోయి కోయిబోయీలు
పగ
అది యెందుకు పోరాదు గనక
కడకు బోయినాక వారి కవులావులు
మనసీమ జాడ రాకుండ జంపి
జరుగుదామని గాని
యిప్పుడు కాదనక నా మాట వినక
వుండరయ్యా
మరి వెనుక గొల్లరాజు
మన సీమకొచ్చి
జన్నెవాడ గుంటిమీద సద్రాంగ
మాడంగను
వారి అరివాణ బోయీలు ఆకుడజాలు
వచ్చి
ఆ గొల్లరాజు ఆదమరచి వుండగాను
యడ్లను ఐడవేసి యాగరణము చేసి
వారి పసువుల బాణాలువేసి
ప్రాణాలుగూల్చి
మనసివాజడవేసి మన సీమకూను
జాడలు లేకుండగాను జరుగ కలగంటి
నయ్యా
సోజనముందు తాను యెడ్లను వేసి
గొల్లరాజు

యెడ్లను వేసి గొల్లరాజు యెత కుడువని
కలగంటినయ్యా
కలవరపడి గొల్లరాజు యవరిని
కానంగ లేక
నన్ను అడగాలని కలగంటి నయ్యా
వో సిద్దిరాజా!
నిజముగ తాను మిమ్ములను అడగాలని
కలగంటినయ్యా వో మదన వల్లభుడ!
అడిగిన గొల్లరాజుకు నీవు అర్థము
చెప్పి
వెరపించవయ్యా నివ్వాడ కల
గంటినయ్యా!
కాలముకు కీడు యెట్లు తానున్నదో
వచ్చువారికి''
అప్పుడు విప్రులు ఆ రాజుతో
ఆనతిచ్చిరి;
''విను సిద్దిరాజా! కుందమా దేవులు
చెప్పిన మాటలు
యియన్నీ నిజమే నీవు సత్యము
పయిగా నున్నావు
గొల్లరాజుకు కైనికి పెనుగులాడు
చున్నావు
యిక్కడ మీవారు అవుట యెరుగము
గాని
వారుపసువుల బాణాలువేసి ప్రాణాలు
గూల్చి
గోవులను వేసి తిరు గాడువ లేకుండ
వారి పాడియావులు వేసి పారిపోతా
నిజము

నీమీద దయగలిగి యిందీవరాక్షి
కుంద కలగా మంటే ప్రాణము కడ
ముట్టెగాక
వాడి బంపిన మాటలకు మెరుపునమై
పోతే
యెంత కామేమున యేకారణము
జంపుమరు
యాదవ నలుగు యీనైన గొల్ల
రాజును
గుణము తెలియకగాని మీరు పోరాదు

పెద్దలన్న దమ్ముల పంపవలె నని
కట్నాలు పెట్టి మీకు యిష్టమైనట్లు"
ఆ మాటకు సిద్దిరాజు ఆనందమును
బొందెను;
కుందమను మన్నించి తొడలపై
కూర్చుండ బెట్టుకొని
కడలేని వేడ్కతో కొంత నిట్లనెను.
"నీవంటి సత్యభామ అష్ట దిగ్గాల
గలదా"

## సిద్ధిరాజు తనకు మారుగా పరివారమును పంపుట

పట్నము సాటించెను ప్రజలు వినగాను
వారి పశువుల మందకు బోను
పెద్దలను పిలిపించెను.
కోమట్లు బలిజీలు గొల్బున
పొమ్మనెను
బలిజీలు దెసయ బంపె నందరిని
వారితో తిక్కన్న మంత్రి గ్రక్కున
కదిలె
వారితో నెల్లూరి ప్రజలందరు కదలిరి
పెన్న లోపలికి బలిమిడి పిన్న
పెద్దలును
ప్రియము తోడుతను పెన్నలోనికి
వచ్చిరి
సత్యము పలికించి వస్తిమని
పనివారిని పంపిరి
గొల్లరాజు కడకు అంపిన పెద్దలును

పంపిన పనివారు వొక్క పరుగున
పోయి
"వోయి యాదవ గాంభీర్య! యదు
వంశ తిలక!
మా నెల్లూరి పిన్నపెద్దలు అన్న
దమ్ములును
పంపితే వస్తిమయ్య వో పశుపతి
రాజా!"
అనిన కాటమరాజు ఆవార్తలు విని
ప్రభగల వేట్కతోను పద్మరాఘవుని
బిలిచి
"అడగవయ్య రాఘవ ఆవార్త పని
వారిని"
అఖిల రాఘవుండు అపుడిట్లగనియె
పట్నము వారితోను ఆ పద్మ
రాఘవుండు:

"అయిదుగురు సిద్దిరాజులు అన్న
దమ్ములు
వొక్క పరుగున వస్తేను మాపట్టపు
రాజు కదిలి వచ్చెను
రాకుంటే మా కంపటేలు అక్కడికి
కదిలి వచ్చేరు
మీరు యవరు వచ్చినారో యెరిగించ"
మనిన
అమాటకు పనివారు అపుడిట్ల గనిరి:
"పల్లవాది రాజులు రాలేమ వోపద్మ
రాఘవుండ!
వారి పిన్న పెద్దలు విద్వాంసులు
వచ్చి నారయ్య
యినకులాధీశ్వరా! యినవయ్య
మనవి"
ఆ మాటకు కాటమరాజు అంపె
కంపటీలను
పంపెను రాజుకడకు పరగ వేడుకను
పంపిన కంపటీలు వక్క పరుగున
బోయి
పెన్నలో నిలచిరి పిన్న పెద్దలముందు

## సత్యమును పలికించుడని యాదవులు సిద్ధిరాజు పరివారమును సవాలుచేయుట

యడ్లను వేసినావి యేకుపెట్లు[45]
బాణాలు
ఆవులు వేసినావి ఆరుపెట్లు బాణాలు
ధనము పెట్టెలనే దేవళ్ళ సన్నిధిని
నిలిపిరి
"మీ సత్యము పలికించి ధనము స్వారి
పుచ్చుకొనమనిరి
వరహాలు వకరాశి వంచివ్వగ మీరు
మాడలు వకరాశి మంచివ్వగాను
యెడగళ్ల చేతను యెన్నించుకోమనిరి
మీరు మేమును దేవళ్ళకేమొ
పరదక్షిణము తిరిగి
మీరు సత్యము దప్పినను మేము
సత్యము దప్పినాను
పారేటి పెన్న పడమటికి
కై దట్టవలెను
తూర్పు ముఖముందు దేముడు
పడమటికి వుండవలెను
గుడిమీద నందులు గుబ్బటిలవలెను
రాతినందులు యిపుడు రంకె
వేయవలెను
యంపలూరి కాలభైరవుడు
యేక బొబ్బపెట్టవలెను

45. ఏడుపెట్టెలు

యిరుగులు పోలేరమ్మ 'యెరుగుదు
యెరుగుదు' అనవలెను
నీలకంఠదేవుడు నిజము నిజమని
పలకవలెను
అన్ని దేవస్థలాలు 'అవును అవు'నని
పలకవలెను
మేము యీవరము గొల్లరాజులకు
సత్యము దప్పినాము గామని
పెట్టెలో బాణాలు కట్లు విడిపించి
కట్టుకోమనిరి''

## కుందమాదేవి పెంపుడు కొడుకు పిన్నయ్య సత్య ప్రమాణము చేసి చచ్చుట

ఆ మాటకు పిన్నయ్య అపుడిట్ల
గనియె
సిద్దిరాజులవారి వంశము సత్యము
దప్పినాముగామని
కుందమక్క పెంచుకున్న
పెంపుడుకొడుకు
పిన్నగారి పిన్నయ్య పెన్నలో
మునిగి
దోసెడు వుదకాలు దోసిట
పుచ్చుకొని
యేడు మంటపములు యెదలి
తిరిగి వచ్చెను
మేము గొల్లరాజులమీద సత్యము
దప్పినాముగామని
పలికెను పిన్నయ్య పతి సాక్షిగాను
పలికినప్పుడే పిన్నయ్యకు ప్రాణాలు
బోయెను
ముక్కునోట పిన్నయ్య రక్తంబు
గ్రక్కెను
గిరిగిరా దిరిగిపడి మూర్ఛబోయెను
పిన్నగారి పిన్నయ్య పడ్డప్పుడే
వోడితిమి అనుకొనిరి
పల్లెకొండ దేముడు పడమట మొక
మాయెను
గుడిమీద సందులు గుబ్బతిలసాగె
రాతిసందులన్ని రంకెలువేసె
యిరుగులు పోలేరమ్మ యెరుగుదు
యెరుగుదును అనెను
యంపలూరి కాలభైరవుడు యేక
బొబ్బ పెట్టెను
నీలకంఠ దేవుడు నిజము నిజమని
పలికెను
అన్ని దేవస్థలాలు అవును అవునని
పలికెను
అంతట గొల్లరాజులు గెలిచితిమి
అనుకొనిరి
క్రొవ్వ క్రొవ్వాన అర్చిరి కోపంబు
తోను

## తిక్కన మంత్రి పిన్నయ్యను తిరిగి బ్రతికించుట

అందుకు తిక్కనా మంత్రి ఆగ్రహుడై
మండెను
"వోరి గొల్లరాజులార! మీకు
వైరంబుయేల?
యెటువలె గెలచితిరి? మీకు యెలిమిగ
వచ్చెను?
యీ దేవళ్ళకు యెక్కడ సత్యము?
మీకు యెక్కడ సత్యంబు''?
పెన్నలో వుదకంబు దోసెడు దెచ్చి
పిన్నగారి పిన్నయ్యమీద ప్రీతితోజల్లి
''యీ పెన్నదేముడా! యితడు నీ
పేరిటవాడు
యితడు మా కుంద పెంచుకున్న
పెంపుడు కొడుకు
యితనికి పడిపోను యేమి కారణము
లేదు
యీ పనికి రాను తగ''దని
ప్రసాదము సాలిల్లెకు
మూర్ఛలు దెలిసి పిన్నగారి
పిన్నయ్య
దిగ్గున లేచెను అంతట తిక్కనమంత్రి
యాదవులజూచి మంత్రి యే మను
చున్నాడు?
''వలపక్ష దేవుళ్ళ పోకిళ్లు
యెరుగుదుము మేము
యీ దేవుళ్ళ సాక్షులు మాకు నిజము
గా''దనెను

## ఆవులను వేసిన బాణములను యాదవులు తిక్కన మంత్రికి చూపుట

అందుకు కంపటీలు ఆగ్రహులై
కణిగిరి
దేవతలు సాక్షులు గాకుంటే ధనము
కట్టు కోమనిరి
అందుకు పిన్న పెద్దలూను అందరు
లెగిచి
పెట్టెలో బాణాలు కట్టుగావిడచి
గ్రక్కున జూసిరి పశువుల్ల వేసిన
బాణాలు
వారి పిన్న పెద్దలుజూసి పడిమూర్ఛ
పోయిరి
పడి మూర్ఛపోయిరి బల్లిటల్లులోను
గ్రక్కున జూసిరి గోరబాణాలు
యేమనిరపుడు?
పింజలవంటి రక్తంబు పిక్కటిల్ల
గాను
అంప కోలలవెంట రక్తంబు జదజడా
ఖరియంగ

నెత్తురు యేరులై నెరిబారంగను
దబ్బరికండ్ల రక్తంబు దప్పెను
యెక్కడి బాణాలు యివి మాకు
యేమి కారణము?
ఆ మాటకు యాదవులు అనుచు
వచ్చిరి
'యివి మీరు పశువులను వేసిన బాణాలు'
అనిరి
'యివి పడవీటి భావరాజు పందియేట్లు!'
అనిరి
'యివి మీ బొగ్గుమల బోయీలు
వుక్కుటల్లులు' అనిరి
'యివి మీ కనిగిరి బోయీల
గొరకలు అంబులు' అనిరి

## దేవతలు యాదవుల యెడ పక్షపాతులైయున్నారని తిక్కనమంత్రి నిందించుట

ఆ మాటకు తిక్కన మంత్రి
అపుడిట్లగనియె
ఆ సిద్దయ్య బీమునేడు శ్రీగంబె బలికె
పల్కుచేవాసిగల ప్రధాని
పల్కెనావేళ
'యీ బాణాలు మావంటేను
భయంబుగాదు గాని
అప్పుడు దొంగలు అవునానబడును
యీ దేవళ్ళకి యేమి సత్యంబు?
మీకేమి సత్యము?
చెలగి నెల్లూరి సీమను
భయంబుగాదు గాని
మీరు కవులు బుచ్చుకొని
మీకవులావులు మేపిననాటి నుండి
మాకు దేవస్థలాలమీద పరామరిక
లేదాయెను
తంత్రీలు చేస్తెడి శావలు దప్పెను
వోయి భోగము చేసేటి వరసలు
దప్పెను
సీరున బుట్టిన పూరికి మీరు తిరణము
గట్టుకొని
ముట్టడి వేసినట్టే వుండంగాను
దేవస్థలాలమీద ముస్తీదు దప్పినను
ముక్కబియ్యమైనను మూడు
జాములకు లేదాయెను
మీ పశువులు మంద వుండంగాను
తమ పర్యారము రావెరుతురు
తింతలుగ వస్తేను దేశాల ప్రజలు
గుపితెను
మీకు కూడా నీ వన్నముగనుక
మేము దేవళ్ళకు తిగబుట్టు
అయినాము
అవరగ మీ అవుపాలు పొయ్యంగాను

యవరు గంగనేమని మేము యెగ్గ
చాయమైతిమి
యాళ్ళైయూరు దేశాల దేవళ్ళు పేరులు
బెట్టుకొని
ఆవులు పితికి యెల్లగాల పీనుగులు
పిలువంగను
పాలుతాగుతా దేవళ్లు మామీద పక్ష
మాడినావి
పర్వాతాల మల్లప్ప మీ యింట
భక్తిరన్నె పుట్టినాడు గనుక
యీ పెన్న పల్లికొండ పెరుమాళ్లు
మీయింటను
అరిగురువై జన్మించినాడు గనుక
కడమ దేవళ్ళు కవులావులై పుట్టినారు
గనుక

అట గనుక దేవళ్ళకు యేమి
సత్యంబు? మీకేమి సత్యము?
ఆ మాటవిని గొల్లరాజు కంపటీలు
గొాదకొని వచ్చిరి
"వోయీ తిక్కన మంత్రి! నీవు
యదుశాస్త్రము గనుక
ఘనుడవని తమరిని యెగ్గు చాయరాకు
యే దైవము తొల్లిటి దేవతలు
యవరికైనాను
పాపము చేసినవారికి భక్తినైనా
వుండును
కల్లచేసిన వారికి కననైన వుండును
తప్పకుండా చెప్పుకుంటివైన
మీ తావులు జేర్చ" మనిరి

## శివభక్తుల శాస్త్రములు చెప్పి తిక్కనమంత్రి యాదవులను నిరుత్తరులను చేయుట

ఆ మాటలకు తిక్కనమంత్రి అప్పున
నవ్వె
చెలగి తొల్లిటి శాస్త్రము చెప్ప
దొడంగెను
"పరమేశ్వరుండౌట యరగక
పాండువారి అర్జునుండు
వెనువెంటనే తగిలి ముందిల్లు
చొచ్చుకొని
పడవేసి మీద పరగ వొందుగా
[దొక్క

బతిమాలెను పరగ విడిచి పెట్టెను
అటువంటి అర్జునుడు అప్పుడిట్లగను
మెచ్చి
పంచపాదములిచ్చె పరమేశ్వరుండు
కాళశ్రీ పీశ్వరుణ్ణి వో కన్న
బోయివాడు
చెప్పుకాల నాట పూని తప్పున దన్నె
పుక్కిటా వుదకంబు పైనింద వూసి
కరకుట్లు దినిపించి కల్లు దాగించె

అటువంటి బోయవానిని అప్పుడే
మెచ్చి
ప్రమథుడిగా జేసె భక్తితోడుతను
అందకా బోనెలయి పొదిలోపలాను
నిమ్మపు భక్తురాలు రోసేలంబిచ్చు
కోని
రేవులు వాగులు నెత్తిని మొత్తెను
కొట్టినా నిమ్మపుభక్తి గొబ్బునా
మెచ్చి
పొదిలెడు వరాలుకై సంతోషమిచ్చె
యీ దేవళ్ళకు యక్కడ సత్యము
వినుడి
తొల్లి ఆ కాట కోటేశ్వరుండూను
వసక ది స్థిరమునాను మేక పెంటిక
లింగము జేసి
కొడుకు యక్కంటియ్య అనువాడు
సపెదేడు మందల పాలుదెచ్చి
యిన్నిపాలు యింటికి పోయ సియ్యక
తాగుమని పొయ్యంగను
యిసిక లోపలికి పోంగోను యక్కడి
దేముండు
ఆకలిగొన్నవాడని పోయుండగాను
అంతట వింటికాడ నుండి కంటి
బోయిందు
వెలుపలి కోపమున పెడకాల
దన్నెను
ఆ మేక పెంటి నయ్యపుడు తన్నిన
కోపమున

తమ తండ్రి తలనరికి ధరణిపై
వైచెను
అంతట మేకపెంటికతోను
మెరసెను దేముడు
తన్నుదు నసివాడు తన కేల అనక
తండ్రి ప్రాణము లిస్తాను కొడుకును
దగ్గిరికి రావోడును
అంతట దవ్వనేమిటి అయ్యా! మీ
అయితమరాజు
వోరుగంటికి పోయి నీలకంతుని
జూచి
నిజభక్తి పేరిట ప్రతాపరుద్రుడై
పుట్టెను
అటువంటి ప్రతాపదుని అప్పుడే
వోడించి
మిమ్మను గెలపించాడు
పాపపు శంభులింగము కని పుట్టి
నావట
యడచేసి యిటువంటి దేవుళ్లు మిమ్ముల
కలసిరి
నాడు నరసాక్షులు కూడదని మీరు
దేవుళ్ల గుణములు యెరిగి దేవ
సాక్షులు కోరినారు
ఆ దేవుళ్లు మిమ్ము ఆని కాలిచ్చినను
వారు సత్యము దప్పిన వారు కారు
ఆ దేవళ్లు మిమ్మునే కూడిని మీరేమి
కారణము

మీరేమి కారణము మేమడిగి
పోదాము"
ఆ మాటవిని కంపటీలు అనుమానం
పడిరి
మారుమాటాడక మళ్ళి చూచు చూను
జాడ బోయిన వారు చంది వెరుక
లేక

పెదిమలు దడుపుచు పెంపిళ్ల
మొవ్వుచూను
కడు చిన్నబోయి భీతిల్లి నానా
దిక్కులు చూచుచుండిరి
తిక్కనమంత్రి శాస్త్రమూన చిక్కు
బరిద్దరూను
యేమాట తెలియమున యనమక
వుండిరి

## గోసంగి వీరులు బోయల తలలు నరికితెచ్చి సత్యము పలికించుట

అంతట దొంగల జాడాలు బోయిన
చొప్పల్లు వొచ్చిరి
చొప్పల్లు వొచ్చిరి చూపులు వారు
చెప్పిరి ఆవేళ
పది యెనిమిది దినము లాయెను
చూవుల జాడాలు బోయిన వారు
యడ్లను జాడ బోయీలు యదబాసి
రాంగాను
జాడ బట్టుకొని పోంగాను కొండ చెల
లున్నారు
అని పశువుల వేసిన బోయీల జాడ
కాళ్లు జూసి
జాడకాళ్ళు జూసి యేలపదాలు బాడు
చున్నారు;

**ఏలపదము:-**

"నిన్నో మొన్నో యెరుగ జూసి
జన్నెవాడి యెడ్లనేసిరి- వో
నాయుడన్న!
మేము కండ్ల గానకుండ బోయిరి
వొళ్లేర్పగాను వారు
ఆవులు యెడ్లుకు గొరకలు వేసిరి-
వో నలనన్న
ఆవులు యెడ్లుకు గొరకలు వేసిరి
మళ్లి మళ్లీ సూసుకుంటాను- వో
నాయుడన్న
కల్లరపూడి చెరువు దాటిరి
నల్లా నల్లని ఫాళ్లు
ఎఱ్రా యెఱ్రని వాళ్ళు
జాలి విళ్ల చక్కనివాళ్లు
కొల్లలుగా వారి ఆవులు యెడ్లను
వేసిరి- వో నాయుడన్న
పళ్లమే పళ్లమే పోయీరి

గొల్ల రాజుల ఆవుల యెడ్ల
చాల మేపిరి బోయీలెల్లను
మగిడి కొండా చెరువు దాటిరి-
వో నాయుడన్న
గొప్పయెడ్లా భూమిగూలేరు- వో
నాయుడన్న
విండ్లవచ్చి గుండ్లు వెక్కరించిరి॥''
అని పసువులు వేసిన బోయీల
జూసి
యీల పాటలు పాడంగాను
నంజుళ్ళు కరకుట్లు నల్లని కాళ్లు
మది దప్పి సుందరాంగి మత్తిబట్టి
వొకరి కాళ్ళు వకరు వొనర బెట్టుకొని
నీళ్ల[46]పొదరిళ్ళలో నిద్రబోవంగాను
అదిరిపాటుగ దొంగలను ఆగుబ్బుగా
బొడిసిరి
బీరన్నతమ్ములు బిరుదైన మగలు
చెన్నయ్య తమ్ములు చిత్రమన్నీలు
సూరి కటార్లు బుచ్చుకొని చెండు
బొందుగా బొడిచిరి
చికాకుగా నరకిరి చెక్కిళ్ళు
ముక్కులు
చెక్కిళ్లు ముక్కులు చెవులు
బావులును[47]
పిక్కలు పిరుదులు యేళ్ళను
కరములు
కాళ్ళును పాదములు నరములు
శిరములు
నరములు శిరములు నలినలి నలికిరి
యిచ్చగా బొడిచిరి యిలమీద
గూల్చిరి
చీకాకుగా బొడిచిరి చిందు బెందుగాను
సక్కసక్కగా నరికిరి సంహారంబు
గాను
దొంగలు ప్రతిమాలంగాను కొందరు
పారిపోవంగాను
తమకములు దప్పి తగిలి దొంగలను
ఘాతుకులు పొయ్యాక కనిగించిరి
సరువులలోను గొందులలో దాగిన
కొందరిని గూల్చిరి
కల్లుగాను గాడించిన యట్లు కల్లుగా
జంపిరి
డా సేటి రిపులను యెన్నుదగిలి
నరికిరి
కుంభిని పైబడ గూల్చిరి కొందరిని
పొడిచిరి కొండ చాల్పుల బాటను
కొందరిని
కొందరిని పొడిచిరి కొందరిని
దూషించిరి
పొలియక దొంగల బొడ్డులు కోసిరి
అయిదుగురి పెద్దదొంగల విరిచి
కట్టుకొని
అయిదు పచ్చితలకాయలు నరకుకొని
వక్కపరుగున వచ్చిరి పెన్నలోపలికి
వొచ్చిరి పగటింతగాను పెద్దమాట
రంతులు

46. నీడలు    47. బాహువులును

పెదబొబ్బల పిల్ల పెద్ద రంతులకు
సిద్దిరాజు వారిమూక పొగడంగను
పచ్చి తలకాయలు అటువచ్చి
పలుకమని పిలచిరి
దేవతల సత్యాన రాతినందులు
ఖణేలున రంకెలు వేసినాను
చచ్చిన శిరసులు ధరణిపై వేసె
రంతటను
ఆవలించే శిరసులు 'అవుదువు
అవుదువు' అనెను
ప్రాణములతోడి అయిదుగురు
దొంగలు బ్రతిమి లాడంగ

అప్పుడు తిక్కనమంత్రి చేతికి
అడుగమని చెప్పిరి
అడిగిన చెప్పిరి ఆ దొంగవారు
"అన్నంబుపెట్టి ఆ పాపకర్మురాలు
అవులు వేయ్యమంటేను మేము
అచ్చ[48]గట్టు కొన్నాము
యేడు వారాల సొమ్ములిచ్చి యెడ్లను
వెయ్య మంటేను
మేము యేసితిమయ్య యిక యేమన్న
చెయ్యండి"

## సిద్ధిరాజు బలములు పారిపోవుట

అందుకు తిక్కన మంత్రి అటు
చిన్నబోయె
ఆ మాటలువిని సిద్దిరాజుల బలము
వెరచి పారిపోయిరి
ఆ మందివారు తమకు ఆపద వచ్చెనని
వురికిరి వక కొందరు
కొందరు గొల్లరాజు గెలిచె నన్నప్పుడే
తమురుకొని కోట సున్నారు
అందలాలు పడదుమికి సందొలగు
వారు
పల్లకీలు దిగ వురికి పారిపోయేవారు
తిక్కన మంత్రి పట్టుబడెను తమకు
దిక్కులేదాయెను

'సిద్దమాయలరుచి చిక్కసోమయ్య
బలమంతు చెన్నుండు పట్టుబడెనయ్య
యెట్లు వస్తిమయ్య యీ చెడుగా నక'
అని పారిపోవంగాను అభయ స్త
మిచ్చేరు
యాదవులు అందరిని మన్నించి
అభయ స్త మిచ్చేరు
నమ్మించి మరల రమ్మని
'పారిపోగరోయి
పర్యాములార! పారిపోగరోయి
భయమేల మీకు బట్టు బ్రాహ్మణుండు
ఆర్తి ఆడబిడ్డ యణుబులు మారు

48. హత్య

ఒక్కసామి గనక' అని అభయ స్త మిచ్చినను
ఆ మాటవిని సిద్దిరాజుల వారి
ప్రతాని ప్రజలు మగిడి వచ్చిరి
గొల్లరాజుల వారికి చేయెత్తి మ్రొక్కిరి
ఆనంద మందిరి గొల్లరాజులు

## చెల్లెలి మాటలువిని ఖావరాజు గోహత్య చేయించెనని ప్రజలు సిద్దిరాజుతో చెప్పుట

గొల్లలు గెలి స్తిరసి గొబ్బున మెచ్చిరి
సిద్దిరాజు వోడెనని సీగ్రంబె బల్కిరి
కలతేలు చాస్త్రులు గొబ్బున దీవించిరి
పెన్నలో స్తానంబులు సల్పిరి అప్పించుకోని
గొల్లరాజులు గెలిచినారని గొబ్బున బోయి
పోయి సిద్దిరాజుల గూడి పొగులుచు చెప్పిరి
అమ్మా అక్కా అని ప్రజలు అసురుసురు మనిరి
"వో సిద్దిరాజ! మీ కుందనూదేవులు యెంతపని చేసెనయ్యా!
పాపంబు దలచి గోహత్య పడిగట్టు కొనెను
పడవీటి బోయీలచేత వారి పశువులు వేయించినాది
పశువులు వేయించంగాను మన బాసలు తప్పె
గొల్లరాజుకు పగాయె మనము
చెల్లెలు మాటవిని బావరాజు చెడుబుద్ది తలచె
వారి పశువులు వెయ్యంగాను మన ప్రాణాలు దప్పెను
నేరములు వచ్చెను మన నెలవులు దప్పెను
అపకిర్తి వచ్చెను ఆవుల వెయ్యంగను
అల్లకల్లోల మాయెను నెల్లూరు అగుబ్బుగా జేసెను"

## సిద్దిరాజు ఖావరాజును బోయలను బంధించుట

ఆ మాటవిని సిద్దిరాజు ఆగ్రగుడై మండెను
ఆ మాటవిని కౌమార సిద్దిరాజు ఆగ్రగుడై కణిగె

పడవీటి మీదబడి బావరాజు నప్పుడు
పట్టి తెప్పించి బందిగాను [49] వేయించెను
పడవీటి పట్నాన వుండే బోయీలను దెప్పించి
బోయీలను దెప్పించి కోటలో వేయించెను
గొల్లరాజుకు తరతరములు
యెరుగుదునని సారె సారెకు యెడతాకి చిక్కల్ల
భీమనేడు గాదియంత వట్టి చేసిన వాడు
భీమనేడు చెయ్యంగ మన భూములు పోయెను
లక్ష వరహాలు వారిచేత లంచమందుకోని
పలుమారు ఆ పాతకి తమ భూములు బయలు చేయించెను
మందలోకి వారి మన మాటలు జాబులు అంపుచున్నాడు
కమ గుడపదట్టి వారిలోని పోయి కలికున్నాడు
కొట్టి భీమనెన్ని [50] కోటలో వెయ్య మనిరి
పట్టి బలిమిని పదిలము చెయ్యమనిరి
గూడెమంతె బోయాల వలసలు దీసి
మన కోటలోకి రమ్మనిరి చాటించెను రాజు
యేలిన పల్లెలు పేటలు విడిచి
కోటలోకి రమ్మనిరి గజబిమీలు విడిపించి
నెల్లూరి కాపరపు పట్నాలు విడిచి
బల్మిగుదములు పదిలము చేయించెను
తుర్యముగా పదిలమని చెప్పె
తనర పదికోట్లు బటులతోను
వుత్తర గోత్రము యొక్క వుర్వీశ్వరుండు
గగనమున ఆటుదాయ తమ్ముల్లూను
సిద్దిరాజు తలపోత చేసెను-

## నెల్లూరును ముట్టడింతుమని గొల్లరాజులు సిద్ధిరాజుకు జాబులంపుట

అంతట గొల్లరాజుల జాబులు అప్పుడె వచ్చెను:
'అంతట లెక్కలు సాధించుకోని అవ్వాని మన్నీలు
యెద్దుకు యెడిసికోని ఆవులు అరసికోని
మూడునెల్ల పద్దెనిమిది దినముల నాటికి ముట్టడి వెయ్యకపోము'

49. బందిఖానా 50. భీమనేనిని

అని జాబులు తెచ్చి గుమ్మముకాడ
చెలికందించి పోయిరి
అవి సందించుకొని సిద్దిరాజు

తమ్ములు దళవాయులు దండి నాయ
కులతోను
విషరాముచు చేసి

## యాదవుల శక్తిని తలచుకొని సిద్ధిరాజు భయపడుట

గొల్లరాజుకు పుల్లరి కొదవగ
యిస్తిమి
యిచ్చిన గొల్లరాజు యిరువులు
చేసికొనెను
నీరున పుట్టిన పూరెల్ల యిస్తేను
నిలపంగను ఆడదాని మాటలువిని
బావరాజు అంతనె పలికి అపకీర్తి
దెచ్చెను
యింత కర్మము వచ్చెను దినమందు
యెరుగమైతిమి
మునుపు అడిగినంత ధనము యిచ్చే
మంటేను
ఆశపాతమున మోసము వచ్చేది
ముందెరుగమైతిమి
యేడాదిలోనె వారి పాని [51]
యీడేరెనని వింటిమి
అడిగితిమైన దేవతలు సాక్షులు
పలికినారు
మనకు తెగువ చేయరాదు
కాలి వెలుసిచ్చిన వెనుక తిరిగి
కయ్యానికి పోరాడు

చేసిన తన చేతను చిక్కడు
గొల్లరాజు
చక్కని అయితమరాజు యితనికి
తమ్ముడు గలడు
యేరు వారమునాను కొండలు
యేలిన రాజు
తమ వోరుగంటి పటాప పుత్రుని [52]
వోడించినాడు
గనుడు కాలాకోటి విషము
అమృతము ఆరగించినాడు
అతని అంత సినగబాబులు వారి
పద్మనాయుడుకు పోరుకు పోరాదు
యరచిన పనిగా వేగిరంబు
చేయరాదు
పుల్లరి గొనమంటేను గోపాల్కులు
కొలదిగాదు
మారొక్కన గలరు మా యన్నలార
మనమాట నిలిపికొనగా వారమైతిమైన
కోటలు పల్లెలు కొల్లలాడ వలెను
జన్నెవాడ దాక వారి యెడ్లను
చెల్లినందులకు

---

51. కాలు ('పాణి' కన్నడము)  52. ప్రతాపరుద్రుని.

సరిపోను మన నెల్లూరి బైట
పనిచారకులు కొందరు చిందు
బిందు గావలెను
మరియు దేవతలు మెప్పించి వారు
మగడి పోయిన వెనుక
మనము పుల్లరి యివ్వమనిన
మార్గాని పోంగాను
బలములతో కూడి వారు తరిమి
లాడంగాను
బజ్జిజ్జు చేసి ఆ పశుపతి రాజు
అడుగంగ పుల్లరి యియ్యకుంటేను
సెలవిస్తు మరి యెనుక
సంహరింతురు గాని
అమితతో వుండరోయి నా
తమ్ములార మీరు
మందబోయీలు అంటేను మనకేమి
భయను
మన సత్యము కొరకే మాట
నిలుపవలెను
బాణ పరాక్రమశాలి వారి
పుత్తమరాజు
యెంత మచ్చేడు గనుడు
పాండవ భీమునియంత బలిమి
కలవాడు
చట్టవారి యర్రయ్య
వారి బీరినాయుండు చాలు బింకంబు
లణచ

వారి బొల్లావు చాలు పొంకంబు
లొనర్చ
వారి యెడ్లే చాలు యెన్నిగల
పొడువగను
గుఱ్ఱాలు పొడువ వారి గోసంగులు
చాలుదురు
కోటానుకోట్లను చంపను వారి
గోసంగులు చాలుదురు
కాలిదళముల పొడువను వారి
కంపటీలు చాలుదురు
కోట పోట్లాట కొదువగాకుండ
నామాట నిలుపగలిగితిరైన నా
యన్నలార
నా మనవి వినరోయి నా
తమ్ములార
యెట్లైన జన్నెవాడ కాతను వారి
యెడ్లు చెల్లించుటలకు
గట్టిగా నెల్లూరి మీదను ముట్టడి
వెయ్యకపోరు
నెల్లూరి విరియేలు[53] నేల గతము
చెయ్యకపోరు
పోరినకారితి గోపాలుకులు
పోనీయరాదు
నామాట వినరోయి నా తమ్ములార
అటు కోటలు వెళ్ళకవుండుదా
యేమాట వినక

---

53 ఇరుమేల

కోటబోయిగాని, కొమ్మలోయిగాని
నామాట లేకను కోటలు వెళ్ళకుండిరీ
మీరు''
అనుచు తమ్ములకు రాజు మనవిగ
జెప్పేను
కొలువు యీడు గొలిపి గొబ్బునా
లెగచి
పనివారిని బిలచి పలికెను రాజు
గొల్లరాజు ఆవుల మీదను
గోపాల్కుల మీదను
అంపకోలలు వేసి అని సేస్తిరైన
అడ్డముగ నరికింతునని సాటించెను
రాజు

## మేడయెక్కుచుండగా సిద్ధిరాజుకు గోహత్య గోరు చుట్టుకొనుట

గముళ్ల వేయించి కదలె మేడలకు
అడప మాధవుండు దాను మేడ
లెక్కుతాను
అడప మాధవుని బిలిచి రాజు
అపుడిట్ల గనియె
'తనసాటి రాజులలోను తలవంపు
జేసెను
దాని సూరకత్తుల మహా విషము బట్టి
కంద్రలు చేసి నోటికి అందింతు'నని
గిటగిటా పండ్లు గీటుచు రాజు
అని విచారము చేసి ఆ రాజు
అపుడు
మేడలెక్కుతుండంగ మెట్టు జారె
కాలు
గోరు విరిగి బొట బొట కురియంగ
రక్తము
'యేమి అడప మాదవన్న!
యెన్నడు యరగను
నేడు గోరు విరిగిన తనకు
యెదరొమ్ము గుప్పుమనె తనకు'
అనిన మాటలకు మాదవుండు
అప్పుడిట్ల గనియె:
"మొదలని ఆడదానికి అర్థము
చెప్పకున్నారు
స్త్రీల మాటలు విన్న పురుషులకు
యెంతైన కీడుసుమ్మి రాజ!
స్త్రీ మాటవిని నరేంద్రుడు శిశుహత్య
పొందడా?
స్త్రీ మాటవిని రావణుండు శిరసులు
గోల్పోయినాడు
ఆడదానిమాట మీదైన నీమాట
కిందాయెను
మద్ది కులమున నీమాట దప్పించెను
చయ్యన బాధలు పెట్టి చంపి స్త్రీవైన
స్త్రీ హత్య గోహత్య సిద్ధించి నపుడె

పశువులను వేసిన పాపము హత్య
చుట్టుకొనెను
గోహత్య సుట్టుకొనెను మీకు కొదవల
కొచ్చినను
పాపకర్మలకు జోడే పాపమయ్యె
మనకు
మీ అమ్మను జూస్తేనుగాని దేహము
గుబులు అణగదురాజ!
నీ తల్లిని జూస్తేనుగాని నీయెదము
గుబులు అణగదు రాజ!"

## సిద్ధిరాజు తన తల్లి గుణమతిదేవి నగరుకు వెళ్ళుట

"అవురా అడప మాదవన్న! దాన్ని
పన్నెండ్లు యేండ్ల నుండి పాయక
వుంటిని
తన అమ్మను జూస్తేనుగాని తన
యదము చల్లారదు"
అని దిగందిగన మేడలకు దిగి వచ్చె
నపుడు
తాను అమ్మ మేడలకు వచ్చెను ఆ
సిద్దిరాజు
తల్లి గుణమతిదేవి తడువులకు
వచ్చెను
తన కుమారుడు అనుచు అగ్ర[54]
పాద్యంబు లిచ్చి
ఆ గుణమతిదేవి అప్పుడు పలికె;
పలికిన తల్లిని భక్తితో బిలచి
ధరణి సాగిలబడి మ్రొక్కి దండంబు
బెట్టి
తడయక మ్రొక్కిన తల్లి తన
కొమారుని అక్కునజేర్చి
దివ్య మాణిక్యాల ద్రిష్టి దీయించి
పలికెను
కుమారుని మొగమున కోపంబు జూసి
"వో కన్న కొడుక! వో గారాబాల
పట్టి!
వో నిధికుమార! మరకత గాంభీర్య!
పన్నిద్దరు సూర్యులు ప్రకాశించే మణి!
వున్నతమైన కాంతి లేకున్నది
మొగము
చిన్నబోయి వున్నావు సిద్ధంబు గాను
తూర్పు పడమర వుత్తరము
దక్షిణమున
పందెము వాడి వచ్చేవో పట్నము వాడి
వచ్చేవో
దగ్గము ఆడి వచ్చేవో చెప్పవోయి
కొడుక
కుంపను తెచ్చిన నాటినుండి నాచేతి
అన్నానికి మందైపోతివి
నీకు వచ్చిన కొదవలు చెప్పవోయి
వో కన్న కొమార!"
అనిన మాటలకు సిద్దిరాజు అపుడిట్ల
గనియె;

---

54. అవలి

"అంతపని అయితేను యిందాక
వత్తునా!
తల్లిమాట విననైతిని తనకు
నిజమాయె
నీవు వొద్దు అనగా తెచ్చిన కుందమా
దేవులు
కుందమాదేవులు మంది మేళమును
తన అన్న పడపీటి భావరాజు చేత
వారి పశువులు వేయించెను

సిద్దిరాజు బాసతప్పినాడని దేవతలు
సాక్షిపలికినారు
అటువంటి గొల్లరాజు నెల్లూరు
ముట్టడి చేయకపోడు"
ఆ మాటవిని గుణవతి దేవి అప్పున
పలికె;

## కుందమాదేవిని విడిచి త్రిభువనదేవిని ఏలుకొనుమని తల్లి కుమారునికి చెప్పుట

"మాట యిననైతివి నా తనయ నీవు
యెన్ని జెప్పిన వినక యింతపని
జేస్తివి
భ్రష్టుదాన్ని దెచ్చి ప్రతతము
జేసితివి
యీ వేళ దొంగలచేత పొడిపించి
నట్లాయెను
అదృష్టము కదలేని పాపలు కట్టి
తమ వింటను౬౬
పశువులు వేయించ మనిన పాపంబు
గలదా?
ఆవులు వేయించ మనిన అత్య తమ
వింటను
గోవులు వేయిచమనిన గోహత్య
గోరు చుట్టుకొనెను

తన కోడలు ధర్మ పతివ్రత
ధర్మము దేవతలు అడిలె
త్రిభువనదేవి దివ్యమాణిక్యము
ప్రాణము మీద వచ్చినా యింతపని
చేసునా?
అటు తేరకత్తె గాంగ యింత తెగువ
జేసును గాక
యీ పట్నవు దేవులైతే యింతపని
చాయంగ గలదా?
కుల భార్యను విడిచిన కులకర్ముడవు
నీవు
పణితిని బొడిచిన పాపిష్టుడవు నీవు
యీ వేళ కాంత మేడకు రాక యెడబాసి
వుంటివే

---

౬౬. తమ యింటను

యెడబాసి వుంటివే యింత కాలము దాక
కరిస్త్రి కారణ సుబాసి
భోజసుమంత్రి అయిన శూర భక్ష సేకమ్మ
వారి కులముద్ధరించ యీ వింతిని[56]
విడిచిన దోషము
కుందను తగిలిన కీడు కొడుకా!
యికనైన
నీ యాకాంతము నీవు యాకాంతము గాను
యిడువకుండ వోయి కొమార!
యేడుకతోను''
అను మాటలకు కొమారుండు ఆ తల్లికి
మ్రొక్కెను.

## త్రిభువనదేవి సౌందర్య వర్ణన

కనకమేడ యెక్కి పోంగాను కఘు వేట్కతోను
కడమేడలోను బంగారు ప్రతిమ
వలెను పద్మిని గంధి
మందసమున ఆమిరిన నవరత్న
భూషణముల వలెను
మారుని సతికిని మరి సరిపోను
శృంగార నవరత్న భూషణము
వలెను
పద్మరేకుల బోలు పసనించు కన్నులు
తుమ్మెద రెక్కలబోలు తూగిన
కురులు
నెలవంక చంద్రునిబోలు నీటైన
నుదురు
కుంకుమ ముత్యాల పాపిడి బొట్టు
మిసిమిగా కన్నుల కాటుక తేరు
వచ్చిన వంగిన కామాక్షి బోలును
తిన్నని తిరుమణి తిలకంపుబొట్టు
కలికి ముక్కున ముంగర అమరుచు
నుండెను
పలువరుస పెదములు పగడంపుతీగెలు
మృదువైన చెక్కిళ్లు ముత్యాల
బావిరాలు
కమ్మలు చెవలపువ్వులు కర్ణములు
నిండును
రవికంఠముత్యాలు రత్నహారములు
మంగళసూత్రము రంగైన తీగ
ముంగల బరువున మోయంగలేక
కుచముల నడుమను యేలాడు
నవరత్నహారములు

56. ఇంతిన్ని

కరములు మృదువైన కంకణంబులు
మెరియ
పాటులైన పిరుదులు బాగైన తొడలు
కోమలి పిక్కలకు కుదురైన
పాదములు
అమరికగా జేయ అతివె శృంగారము
బంగారు కళలతో పద్మిని గంధి
తామర పూవువాసన తరుణిపై
గంధము
యలనాగ వగతీరు యెక్కువ గంధి
కలికి కోకిల గీర్వాణికి వున్నంత కేళి
తన బక్తి వేడ్కి కన్నులపండువ
గాంగ
గౌరవించిన పణితి తననగుర
పదవంగు
దాదుల దగ్గరబిలచి పణితి
విట్లగనియె

## త్రిభువనదేవి పోలేరమ్మను పూజించి వరములను బడయుట

"యనమందుగురు దాదులు రాజుల
వద్ద
సేవక ధర్మమ్ము సేస్తూ వుందరమ్మ
కడమ దాదులు నేను కడువేట్క
తోను
యిరుగుల పోలేరమ్మకు బోనాలు
వొప్పించి
గాంభీర్యమునను మొక్కప్పగించి
వచ్చేదాకను "పణితి తావచ్చినను
బోనెలు గుచ్చ
గవిరమ్మ గుడి దగ్గరకు వచ్చినను
కడుభక్తితోను
బోనాలు మాన్పించి ఆ త్రిభువనదేవి
అందరు వినంగాను ఆడె నొకమాట
"యెన్నడు కుందని యెడబాసినాడె?
నాయిభుని మొకము జూస్తేను చాలు
కడమ పనులకు నిన్ను వల్లన్మమ
నిన్నే నమ్మినాను నీకుమ్రొక్కినాను
మ్రొక్కు వొప్పుకోవమ్మ ముక్కంటి
రాణి
కుందతోను అలిగి కందువవాడి
తన యిబుడు నన్నెరిగి వచ్చినాడు
వచ్చిన మోహము జూస్తిని యీ
మొక్కు వొప్పుకోవమ్మ!
అని గంద్రకత్తితోను శిరసు గరేలున
వుత్తరించెను
వుత్తరించిన శిరసు వురువడి లెగిచెను
యెగసిన శిరసు జూచి యేకానపోయి
దుర్గమును పదిలాన తానందుకొనెను
తన భయభక్తితోడు తీరుగా శిరసు
అతికించి
తీరుగా అతికించి తన దివ్యానదీవించి

యదము గుప్పున నదిరి అదళించి
పలికె
"వంచమ్మ నీవయను కావరము
కాక
వాసి యెరుగక మోసవుచ్చితివి నన్ను
యేసీమ మగని తలయైన మొక్కు
యీడ్చేర్చెననెను
అప్పగింతురుగాక శిరము
వుత్తరించెను
వుచితముగ నీకు ముందు నాతోను
మాట ముదలకించ వైతివి
గ్రక్కున తరిగివెయ్య వొప్పుగా నీకు
నీవు నోములాంటి వుంటివె
నలినాయతాక్షి
నిన్ను నోమనిత్తునటవె నెలతిరో
నేను
యిల రూపంబు విడచి పాపంబు
వచ్చెగద
పణితించ తమకు పట్నపుదేవుల
రట్టు చేస్తివి నీవు
ఆ పట్నపు రాజులు వింటేను తమకు
బాదలు వచ్చును
గుట్టుతో నీవిభుని కూడికిని పోయి
ముందు యీ పట్నాన మొక్కు
వచ్చినవారు
మొక్కువచ్చినవారు ముదములై
వున్నారు

నీవు అయిన మేలు నిష్ఠలు జూసితిమి
యే పోలిమినిన రాగ నిక్కము
పల్కుము"
తనరూపు రేఖలు తనసక్కదనము
మూర్తించి తన కత్తి తనయింపు
తన సొంపు
సకల యీ సొమ్ములు సర్వంబు దెచ్చి
ఆ త్రిభువనదేవి అమరంగనపుడు
జోగి వలెశృంగారించి సొమ్ము
లన్నియును
కారిన రక్తంబు కస్తూరిజేసి
చిక్కని రక్తంబు శ్రీగంధము చేసి
పచ్చకళల చక్కదనము పద్మాక్షి
యపుడు
కలకల నవ్వుతా కమిగిట జొచ్చె
వరమిచ్చి దీవించెను వనితను
చెయ్యిబట్టి
హస్తములు కానుకొని అమరంగనుంచి
"అమ్మ! జీవాలు లేని బొందిమీద
నీ అస్త్రాలు వాలితే
ప్రాణము వచ్చేటి వరము పణితి
నీకిస్తి నమ్మ!
వో ముదిత నీకిస్తినే" నని చెక్కిలి
నొక్కి
అక్కున జేర్చి వరమిచ్చి దీవించె
వణిత చెయ్యిబట్టి భక్తితో కడకు
వోర్చిల్లెను

ఆలో త్రిభువనదేవి అంతఃపురము నకు అరిగెను
తన యిబునితో గూడి తరళాక్షి వుండెను.

## యాదవులు నెల్లూరి కోటను ముట్టడించి ధ్వంసము చేయుట

అంతట గొల్లరాజు ఆవులు యెద్లు
కోటపై నడిచెను కోటానుకోట్లు
కోటపైకి వచ్చెను మాట మాత్రమున
నెల్లూరి యిరుమేల నేల యీనిన రీతి
వల్లవులు తిరుమందులు వారి కవులావులు
చల్లవారి కవులావులు సలుగు టెద్లూను
మేడముగా వచ్చివుండే పాడి యావులును
కోడెలు కదుపులు కోటానుకోట్లు
కోట యిరుమేలను గొడ్డుటావులును
గాటముగ యిరుబయల గాసి వుండినను
సలుగు టెద్దులు మంచి సంగటావులును
ముంగల బారులై మొన లేరుపడెను
యనక ముందల గదిలెను యీక బారుగను.
పోక వనములు నరికించి దూడలకు పోగులు వేయించిరి
నిమ్మలు నరికించి నీడలు వేయించిరి
పనస పొన్నలు నరికించి పార వేయించిరి
మరియు కర్జూర వనములు నరికించి దొడ్లు వేయించిరి
నాగమల్లి తోటలు నరికించి కలయ ద్రొక్కించిరి
వుల్లి మిరియము పసుపు వుల్లాసముగ ద్రొక్కించిరి
మరి యీ చిలగడము కంద మట్టుమల్లాడి
దోస పచ్చ తోటలు దోచమని విడిచిరి
నడిమి నరికించిరి నారికడియములు[57]
ఆరుట్లు[58] నరికించిరి అడ్డమార్గము లేక
మరి శృంగారపు తోటలు చిచ్చు వేయించిరి
మత్షరంబున వనములు మట్ట మల్లాడిరి
ఫలములు కాసేటి బలువైన మాకులును

57. నారికేళములు 58. అరటులు

నిమిషమాత్రాన నరికించి
నీడలేయించిరి.
యెడలేని నిమ్మలు యేరు పనసలును
పువ్వు దీగలు దెచ్చి పొదరిళ్ల
జేసిరి
కావులు గలిపించిరి దుర్బళము గాను
వనమెల్లను గాడ్చి వనపాలకుల గొట్టి
తరువులు నరికించి బృందావనము
లూను
పురములు గాల్చిరి అంభోధుల గల్చిరి
ఆ వనము యీ వనము అనకుండా
ఆకుతోటలు ద్రొక్కించిరి
చెండు బెండు లాడిరి శృంగార
వనములు

ఆడేటి గానుగల అడ్డు పెట్టించిరి
పౌనకలు బెల్లాలు పెయ్యలకు
మేపిరి
గొబ్బిళ్ల పౌనకలు గోవులకు
యెగవిడిచిరి
అంతట కాపులు 'శరణు శరణ'నిరి
'కావు కావు' అనిరి కాపులు తెరువుకు
కాపులు తెరువుకు బోకుమని
కవులిచ్చి రాజు
గుండెలు మెదలును గుబ్బదిల్లంగను
అంతట కొన్నూళ్ళు అల్లకొల్లార
మాయెను.

## పాకనాటిని ధ్వంసముచేసి కాటమరాజు యఱ్ఱగడ్డ పాడులో గుడారము లెత్తించుట

పల్లెపట్లాలెల్ల పాడుగ జేసిరి
వాగర్తి మేరగాను వలసలు దీసిరి
బొగ్గుమలలు బట్టిరి బోయీలు
విడచిరి
చిల్లరి ప్రజలంతా చెడి పారిపోయిరి
ఆపద వచ్చెనని ప్రజలు అడవుల
బట్టిరి
పాకనాడంతాను పాడై పోయెను
శిరమున పెరమున చిచ్చు వేయించెను
గెంట్లు రాగూల్చి అంటే యెలనాడు

బలిగెను
బయలు పల్లెలు బొగ్గము పాడాయెను
మాలి కొండలు యేలేటి మన్నీల
బొమ్మినీడు
నిన్ననే విడిచెను నెదబాసైన
యేపేల, యరగుఱ్ఱు, యరగుడిపాడు
మరుమూడు, రేమాడు, మన్నూ
విడిచినను
తొలినాడు పాడాయెను
ధారమన్నివారు

అంతట గొల్లరాజు గుడార్లు ఆ క్షణము యర్రగడ్డ పాడున యెత్తించెను రాజు తీయించి

(శ్రీరాములు. పరీధావి నామ సంవత్సరములో మార్గశిర బహుళ దశమి ఆదివారం నాటికి జన్నివాడ కథ సంపూర్ణము. వ్రాసినవాడు గుజ్జర్లపూడి కోటయ్య కొమారుడు పెంటయ్య వ్రాసిన పుస్తకం.)



# భట్టు రాయబారము

## (కల్లి రాయబారము)

### నల్లసిద్ధిరాజుభట్టు కాటమరాజును దీవించుట:-

**సీసమాలిక :**

"బ్రహ్మయువుర నీకు బహు
కుటుంబాధార!
రమ్యతో యాదవ రాజచంద్ర!
శుభమస్తురా నీకు సమర
నిశ్శంక! సా
హస విక్రమా! అసహాయ శూర!
ఐశ్వర్యమస్తు నీ కమరావతీ పురీ
సింహాసనానేక స్థిరము వెలయ
కల్యాణ మస్తురా (నీకు) కార్తిక
మందార!
పారిజాతో వ్రుభయ పావనుండ!

గృహమస్తురా నీకు గోపాల
చూడామణీ!
బాహుబల సోమతరు పరశురామ!
కుసల మస్తురా నీకు కుసుమబాణుని
తేజ
వసుమతి యాదవ వంశ(కుల)
తిలక!
జయమస్తురా నీకు జననాథ!
మరియును
కరుణింపు యాదవ గాంభీర్య
ఘనుడ!"

### కాటమరాజుభట్టు కౌమార బంగారము సిద్ధిరాజుభట్టును కులగోత్రములు అడుగుట:-

**ద్విపద :**

పశుపతి నటువలె ప్రస్తుతి శాయంగ
రసికుండు పశుపతి రాజుల భట్టు
కౌమార బంగార మనేటి భట్టు
గొబ్బున వచ్చి

క్రమమొప్ప నతని కన్నెదుట నిలచి
నమస్కారము చేసి నీతిమార్గమున
అమర చండేశ్వరునితో
అప్పుడిట్లయె:

---

1. శోభిల్ల

"దండమయా నీకు దైవగురుమూర్తి
నిండు వేడుకతోడ నిలచి
మా మందలో
అన్ని మార్గముల మహారాజును
అవిశ్వర్యము గదిలింపగా
విన్నప్పుడే మాకు చెన్నుదీపింప
నిను జూడ గలిగెను మేము మహా
కృతార్థుల మైతిమి
కన్నుల పండుగాయ కరుణ సోబెల్లి[1]
దీవించి చదివేవు తావెక్కడిదినీకు
కేవలము నీ మహిమ కెళింపరాదు
భూసురులో భట్లో భూతేజనంబులో
యే సీమ మన కులము ? యేమట్లు
మీరు ?

తూర్పు పడమర తుధ పూర్వ
మెక్కడ?
తెరగొప్ప మీ రాజు దేశంబు పేరు
పరగంగ నీ వున్న పట్టణం పేరు
మనుజేశు పేరేమి? మంత్రి పేరేమి?
గానకొని నీ రాజు గోత్రంబు పేరు
కృతి నీవు గొలిచిన దేవుని పేరు
అన్నదమ్ముల పేరు అతిప్రేమతోను
కన్నతండ్రి పేరు ఘనత నీపేరు
తప్పక మాతోను తాత్పర్య మొసగి
చెప్పుమా! భట్టు వేవేగ చెవుల
పండవగాను"

## సిద్ధిరాజుభట్టు రాజశృంగావళి తన వృత్తాంతము తెలుపుట

అడిగిన మాటకు అవనీశ్వరుని భట్టు
పలికెను వకమాట బంగారముతోను:
"ధాయణి మేరగా దక్షిణాట భూమి
ధీరుత పాకనాడు దేశంబునందు
పన్నుగా తరుజడల ప్రబలి యున్నట్టి
బాలాది గంగకు సరివచ్చు పెన్న

వ. ఆనది కా సమీపంబున-

**సీసమాలిక :**

భూలోక సారమై పొగడంగ నెల్లూరు
శ్రీ వీర విక్రమ సింహ్మపురము
ఆ పట్టణంబున అమరంగ తూర్పున
మాకంద చందన మహిత వనంబు

1. శోభిల్లు

ఆ నగరంబున కడు దక్షిణంబు
చెలువార వేమార సెట్టి బావి
ఆపురి పడమట అంభోజ రాజిచే
ప్రాకటంబైన తటాక మమరు
ముప్పారు నవ్వీటి వుత్తరపు దిక్కున
మున్నేరు కెదరైన పెన్నదనరు
ఆ రాజధానికి మహారాజ మార్గంబు
గంధర్వ సింధూర బంధురంబు
ఆ పుటభేదన మందున్న పణతులు
రత్నంబు బొమ్మలు రమణమెరయ

తే గీ. సకల విద్యల ప్రవీణత చెల్వుమిగిలి
.........
వీరభటులకు నెలపైన విభవమనగ
వినుతి కెక్కిన నెల్లూరి విభవ మహిమ[2]

**మంజరీ ద్విపద**

గజ శృంగములకు కట్టు మట్టు
కురకరపట్నాలకు గుండెదిగులు
కరపట్నాలకు కన్నతల్లి
కుంభినిమీద శంభుని గుడి సాక్షి
అంభోజ నెల్లూరు ఆ తావు మాది
తొల్లి ధరణికోట అమరలింగానకు
బ్రాహ్మల కన్యకు జన్మించినవాడు
మూడు కన్నులవాడు ముక్కంటి
యీశ్వరు
ముక్కంటి కొమారుడు జనోధీరుడు
జనోధీరుని కుమారుడు మనోధీరుడు
మనోధీరుడి కుమారుడు
మన్మసిద్ధిరాజు
కొండొక సిద్దిరాజు గండగోపాల
సిద్ధిరాజు
కస్తూరి సిద్ధిరాజు కొమారసిద్ధిరాజు
తల్లియేగురు సిద్ధిరాజు దళవాయి
భీమన
భారద్వాజా గోత్రుండు పట్టభద్రుండు

2. ఈ పద్యమే యించుక మార్పుతో చాటు పద్యమణి మంజరి ప్రథమ భాగమున నున్నది. చూ.పుట 30.

వరవితరణ గుణ వంశ వర్ధనుండు
నవరసాలంకార నవ మన్మథుండు
శివకీర్తిగలరాజు నల సిద్ధిరాజు
భానుజుతేండు సార్వభౌముండు
జగమేలు శానాధిపతి సిద్ధిరాజు
ధరమీద షోడశమహాదాన వినోద
శుభకీర్తిగల రాజు నలసిద్ధిరాజు
వాసికెక్కిన సూర్యుని వంశమున
జనించె
శేషుడనదగు నల సిద్ధిరాజు
మంత్రులు గొల్వ భూసురులు
గొనియాడ
సిద్ధిరాజనంగ లోక ప్రసిద్ధి రాజు
దక్షిణ సముద్రము దరిమేరగా
యేలు
తూర్పు సముద్రము తుదిమేరగా
యేలు

బలువైన ఘనుడు భారద్వాజగోత్ర
కులుండు
అతనికి ప్రధాని అతిసత్యవాది
పృథివిలో చింకర్ల భీమనేడొకడు
మనుజేశు నల సిద్ధిమంత్రి అయినట్టి
కరుణాకటాక్ష గాంభీర్య సమర్థుండు
స్థిరకీర్తిగల వంశ తిక్కన్న పొగడ
రాజభూషణుడు రసికుడు
మా తండ్రి
గాయకుడు నా పేరు రాజ్యశృంగావళి
మీరిన కవులకు మేదిని నమస్క
రించి
భారతి సుతుడనగ పరగ సహోద
రుండు
భువిలోను వుభయ పూజ్యుండ నేను
బహుమాన్య వర్యుండు నాపేరు
భట్టుదేవరను''

## కొమార బంగారము రాజశృంగావళిని వచ్చిన పనియేమని ప్రశ్నించుట

''భట్టయ్యగారు! భళా! లెస్సాయె
గాను
భట్టుదేవర వైతె భాగ్యంబు సిద్ధించె
యాచిగ లక్షణాన యేతెంచి
మా రాజును
అనుసరించితి వైన అవనిలోపలను
దానధర్మాత్ముడు యితడు ధర
గుణశాలి

యితడి వేడిన యిచ్చు అష్టభోగములు
అన్నదానము కొరకు ఆశించ వస్తిరా
పతగంగ పెట్టించు పాయసాన్నములు
వస్త్రదానము కొరకు ఆశించి వస్తిరా
ప్రస్తుతించి యిచ్చు పట్టు వస్త్రములు
భూషణము లేదని పొగడగ వస్తిరా
రసికు దెన్నగ యిచ్చు రత్నాంబ
రములు

కనకంబు లేదని ఘనునిపుతు
గంటివా
యిప్పుడే యిప్పించు యెన్ని
వొలసినను
పరిమళ ద్రవ్యాళకు ప్రస్తుతించి
వస్తివా
గురుతుగా యిప్పించు పునుగు
జవ్వాజి
గ్రాసము లేదని ఘను వొడగంటివే
రాశిగా బోయించు రాజనములు
యేరు సాగదున్న వచ్చి యెడ్లనడిగితివే

కోర్కెతో యిప్పించు కోడె
యెద్దులును
గోదానమిచ్చిన కొంపోదు నంటివే
లేదనక యిప్పించు లేగ లావులును
భూదాన మిచ్చిన పుచ్చుకునే నంటివే
అడిగిన యిచ్చు మా అయితమరాజు
యేమి నీమనసున యేమి కోరినను
కామితార్థము లిచ్చు కాటమరాజు
దాసి యేశ్యలు రెండు తప్పక విడిచి
అంతైన ఆశపడి యేమి అడిగెదవు
అడుగుమా రాయశృంగావళి భట్లు!''

## రాయశృంగావళి పుల్లరి అడుగుట

''బ్రహ్మవాయువు[3] కావలె బతుగుల
రాజ!
ధర్మంబు గలయట్టి ధర్మాత్ములు
మీరు
వొగడ వచ్చినయట్టి భూసురులకు
బొట్లకు
యడపక మీరన్ని వస్తువులు
యియ్యగలవారు
సకలగుణాధార! సర్వజ్ఞ యవరు
వొక పనికి వచ్చిన వొకటి అడుగ
రాదు
యేమి నిత్యమని యెరిగించు మంటివా
ఆ వార్త సీతోడ అనతి విచ్చెదను
ఆవులమేపుకై అంపిన వడంబడి

వివర మంతయు మీరు విన్నారో
వినరో
ఆలనాడు మీ యాదవులు అందరూ
గూడి
నెల్లూరి లోపలికి నేర్పున వచ్చి
అందలాలలో గూర్చి అగ్రువంచుకొని
యేక చక్రంబుగా యేలినయట్టి
సిద్ధిరాజనగ లోక ప్రసిద్ధిగల రాజుతో
అపుడు మీ యాదవులు అడిగి
రొక మాట
'అమరావతీ భూమిని యాదవుల
మేము
అమరావతీ భూమి ఆ కరువాయ

౩. బ్రహ్మాయువు

పశువులు పదమూడు లక్షలు గల
వారలు
కొమర తొమ్మిది కోటి గోవులు
గలవు
యేమి అడిగిన పుల్లరి యిచ్చేము
మేము'
అని పలుమారు ప్రియములు పలుకు
కొంచు
భీమినేనికి చాల ప్రియోక్తులు చెప్పిన
అప్పుడు మా భీమినేడు మారాజుకు
తగ యుక్తి జెప్పె
పూరికి నీళ్ళకు పుల్లరె వడంబడి
మాడలు కోడెలు మంచి యావులు
వెయ్యి
యాడాది నాటికి యిచ్చేము మేమని
సమ్మతముగా రాగి శాసనాలు
వ్రాయించి
యిచ్చిన వచ్చిరి మునుపు మీ
యాదవు లెల్ల
ఆడిన మితి తప్పె అంపిన రాడాయ
అందుకు మాసిద్ధిరాజు కోపగించి
కోర్కెతో బెట్టు కొలువు కూర్చుండి
వీరభటుల పరివారమును వేగంబె
పిలిచి
తాకీదు చేసి పుల్లరి ఘనముగా
తెమ్మన్న

అందుకల మారాజు యోలిని యొక
జెప్పి
వీరభటులను పంప విహితంబుగాను
వారిమీది పుల్లరి వచ్చేన యేమి?
గొల్లమీది పుల్లరి గోవుమీది బచ్చలి
మెల్లనే బోయి మందలించి
వచ్చేనని వస్తిమి వసుధేశతిలక!
మాడలేమన్నా వూడకున్నాయో
కోడలేమైనా చన్నుగుడుస్తున్నావో
చనువు చాలకుండా లేదో తరిచుట్టు
కొన్నారో
వారిలో వారికి వైరంబు పుట్టెనో
వఖరి మాట వకరు వనగూడ
కున్నారో
కారణంబేమిగా కలిగియున్నదియో
విదితంబుగా నెరిగి వివరింతునంటి
గుట్టుమార్గమున నీ గుణమెల్ల గంటి
రట్టుశాయక ధనము రాబట్టు తెలసి
యాదవులమీదను అలుగ నేమిటికి?
నే బోయి యా వార్త యేప్పన
చెప్పి
మరువార్త కొంచు మగుడి పోవస్తిని
యిందు నిమిత్యమై నిను చూస్తినిరా!
ఔ భట్టనొదు తేగము యియ్యమని
రాను
యాచిక లక్షణమున యేతెంచి వచ్చి

అనుసరించవచ్చిన అర్థిని కాసు
పుల్లరి ధనముకు పూనివచ్చినయట్టి
పల్లవాది రాజుల భట్టును నేను''

## కొమార బంగారము యాదవుల సత్యసంధతను నిరూపించి పుల్లరి నిచ్చుటకు నిరాకరించుట

''వో వెర్రి! వో జీవ! వో వెర్రిభట్ట!
యీ వెర్రిబుద్ధులు యెక్కడ బుట్టె
యిచ్చినమాత్రము ధనము యితని
చాత
పుచ్చుక వెచ్చానికి అందుకు
వెళ్ళవైతివి భట్ట!
వొకటి అడుగమంటే వకటి
అడుగబొయ్యేవు
వులవ లెత్తుమంటే వూళ్ళడగ
బొయ్యేవు
అలువడి తలపోసి అంటే చందాన
దాన మడుగమంటే దగ్గరవచ్చి
భూనాధుని యెదుట పుల్లరి
అడిగితివి
యిట్టి వెర్రిబుద్ధి యేమనగలను?
పుట్టిననాటి నీ తలపుర్రె గుణమెల్ల
నీ రాజు యెట్లంపె? నీవెట్ల వస్తివి?
యీ రాచకార్యము నాకేల ననక
కొలూరి సిద్ధన్న కదులుమన్నపుడె
యేను మరగ రాత్రి వెన్నెలబైట
వేషాలసెట్టి నూత వన్నెలబైట
పుడమి సంకీర్తిగల పుణ్యుని యెరవు
నాటికి పాకనాటికి నడుమ పాలేరు
కదుమ నుండి
నలనన్న పుడమి రాజుల వలనే
పూరికి నీళ్ళకు పుల్లరి మాట్లాడి
మీరు అడిగినంత ధనము వొప్పెను
మా రాజు
కొలుపత్రాలును పెన్నలో బెట్టి
సభవారు మీ సిద్ధిరాజు సంతోషమంద
బాస తప్పి మీ సిద్ధిరాజు పశుల
వేయించి
ఆస నిప్పుడు ధనము అడుగు
నట్లంపె
అప్పనము అడిగినంత ధనము
వప్పె మా రాజు
చిరుమన యేలువాడు చిక్కర్ల
భీమినేడు
మరి తిక్కన మంత్రి మన్నీల
బొమ్మినేడు
బచ్చుల కోమట్లు బలిజల వారు
వచ్చిరి పెన్నలో వసుధీశు కొలువుకు
పుల్లరి పత్రాలు పుచ్చుకొని వచ్చిన
కమ్మ చెన్నమనీడు అతడు దా తెచ్చె

మన్నీల బొమ్మినేడు మంత్రితిక్కన
పెగడ
పిన్నలు పెద్దలు భీమినేడుండ
మీ రాజు కౌలువిచ్చె
మే మందుకొంటిమ
మీ రాజు సత్యంబు నిలుప లేదాయ
పాటి దప్పినవారు పాకనాటి దొరలు
పాటి తప్పిన మాట పట్టంగరాదు
పాపాత్ముడు సిద్ధిరాజు పలికి
నందులకు
కోపించి భీమినేడు గొబ్బున లేచి
'యెట్టి మా సత్యంబు? యేమిట
దప్పితిమి?
వట్టిమాటల దూర వలదుగాక!
మీకును మాకును మేదినియందు
సంగమా దేవుడు సాక్షి యున్నాడు
అతడు యెరుగని కల్ల యేమి చేస్తి?
మంచు
సేతాము బాసలు సయ్యాన లె'మ్మనెను
పిన్నలు పెద్దలు ప్రేమతో వారు
పెన్నలో పల్లికొండ పెరుమాళ్ళు
సాక్షి
గయ్యాళి శాతల కదసి ముందుగాను
సయ్యాన వచ్చెను బాసకు చింకర్ల
భీమినేడు
చంగాయి వస్త్రంబు జలము తడి సీరు
సంగమా దేవుని సముద్రిష్టి నిలిచి
పెరుమాళ్ళ ప్రసాదము పెన్నలో
వైచె

శిలలు పలుక రాదాయ చిన్న బోయ
భీమినేడు
కొలువులున్న కంపటీలు గొబ్బున
లేచి
తీర్థ ప్రసాదాలు తెరగొప్ప
అందు కొని
ప్రార్థించి పెన్నలో పడవైచినపుడె
యేడు గడియలు పెన్నలో పడవైచి
యెదురొకయ దట్టె
గుడిమీది నందులు కూడి నట్లాయ
గుడ్లూరి నీలకంఠయ్య గుడి దిరిగి
యెడ్ల వేసిన వారి మీదను శిలలు
వరిగినట్లాయ
యిద్దరు చూడంగ యెరుకలసాని
సిద్ధిరాజు మీద నరిగిరి కొట్టసాగె
సభవారు చూడంగ సంగమేశ్వరుడు
గర్భ గృహములు మూతలు మూసి
అంతట శారదనే బ్రాహ్మడు వచ్చి
రాగి శాసనాలు చదివె............
యెక్కడి తగవోయి యర సిద్ధిరాజ!
మోసపోతిమని పెద్దలు
మొఖ మద్దగించి
సన్నుతి పెద్దలు చప్పట్లు కొట్టి
సభ సత్యసంధులు ఝల్లున లేచిరి
పెద్దలు నెల్లూరికి పెనుత్రోవ పట్టిరి
పాలితోపాలి వోడితిసుని పరివారము
చిన్నబోయెనాడె సిగ్గుబడె మీ నల
సిద్ధిరాజు
నాటి మాట మనసునందేమి లేక

చెల్లిన కపులు మొన్నోయి గొల్ల
రావోయి అంటేను రహితీర్థ మనేటి
మూడు యెద్దులు చెల్లె మూడు
భూములు శాయ
ఆవు పకటి చెల్లెను అప్పుడు పెద్దలు
పుల్లరి ధనము చెల్లెననిరి
ఆవు చెల్లిన ధనము అది లెక్కజేసి
ఆర్నూరు జేసుననిరి
యెద్దులు వేసిన పసినంబులు యెంత
చేసునంటే
యిన్నూరు చేసుననిరి
అన్నూటికి యిన్నూరు వెరసి
వేయగను
నన్నూరు యిచ్చేమనెను మీసిద్ధిరాజు

వచ్చిన యెద్దుకు నా రాజు సగము
పైకము యేమి?
పట్టనని వద్దని మా నలనన్న వచ్చె
పాలేటికి
నాటి మాట మనసునందేమి లేక
యేటికిని నిన్నంపె యెరసిద్ధిరాజు
అంపితేనేమి మీరు అర్థి వాగుగాక
నీతి యెరుగక రాయభారము
నీవెట్లు వస్తివి?
వచ్చితివని నీవు వచ్చిన తప్పేమి
వచ్చి ధర్మముతప్ప పరుసగాను
నీవు పాషాణములు పలికించి
పాలి గెలిచినావు
పుల్లరేడివి? తిరిగి మల్లిపో బోట్లు!"

## దేవతలు యాదవ పక్షపాతము వహించిరని రాయశృంగావళి ఆరోపించుట

"వుత్తర కాశి గొట్లురాజు వుత్తముడు
నలనన్న
సత్యవాక్యానికి సాటిలేదనక
తట వట మాటలు తక్కిడిమార్గాన
ఆవులోడిన మాటలు ఆడబోయ్యేవు
అల్లనాడాడినట్టులు నేడాడవైతివి
తగులూది పందెము తగులజడ్డట్టు
పట మాట పక తప్పు నా రాజు
పడబడె గాక
అది యెటుపటె నంటివే

బొడ్డుగల కోడెబుట్టి నా భూపాలుడు
యిచ్చె నంటిరి
నీరున పుట్టిన పూరెల్ల నాడితె నేయు
మా వాసి తప్పుట మందలావులచేత
తోట ఫలములు అన్నితొక్కించి
మేపితిరి
వనములు సుగ్గాడి వరిచేలు మేపితిరి
కోటలు గాలించి కొల్లజేసితిరి
నిండిన పాకనాడు నిర్మూలముచేసి
చేసి

పండిన పరిచేలు పాలు జొచ్చితిరి
కడిచేరి పుణ్యాన కానికె కోడలు
అడగ పస్తేమున్ను అదలించి
వైచితిరి
యాడ పుల్లరి నెయ్యి యక్కడి
కోడెలు
మాటలాడక తిరిగి మళ్లి పొమ్మనుచు
కొరగాని శాతలు నుడుగునా తప్పు
పూరిపేళ్లు దక్కాతే పుల్లరి దక్కేన
తటపటలు జేసి వేసండ్ల సాక్షిగా గోత్రి
అవని పుట్టిన పూరి అంశము మేపి
రాతరంటు శాతల పచ్చి పెన్నలోను
బాసలు చేసి శిలలు పలికిస్తిరి
మీరు బాసలు చేసేది పాషాణాలు
పలికించేది యీ సందు వుపాయము
యరగడు
ఆ సిద్ధిరాజు అది యెట్లువలె నంటివా
తొల్లి రఘుపతి సుగ్రీవుకు
అభయ స్త మిచ్చినట్లు
బ్రహ్మ యిపుడు భాగీరథి గంగ
ఆలాగు మీకును అభయ మిచ్చినాది
చల్లవారి యింటను చతుర ముఖాల
బ్రహ్మ
పుల్లయెద్దై పుట్టె భూలోక మెరుగ
క్షీరాబ్ధి శయనుండు చలగి మీ
మందలో
అరూధి బొల్లావు ఆయి పుట్టినాది
ప్రమదలు చూడంగ పర్వతాల
మల్లప్ప
చదవల బసవన్నై జనించినాడు
కడమ దేవతులెల్ల కవులావులై పుట్టి
గంగ యిలవేలపై కాపాడుచున్నాది
నీరు గంగా మహిమ నిజరూపు గనుక
పారకుండా నిలిపె పెన్న వుదకాలు
పమిడిపాల శిలలు పలికిస్తు మనుచు
పుల్లరి యియ్యక పొయ్యేది విహిత
ధర్మమె నిత్యంబు
(ధరను న్యాయమబె)
వుపకారమే మరిచేసు వునికము గాను
పిన్నకరువున పెద్దకరువున చాల
చంబావిస్తి మనుచు సామెత వకటి
నిజమని జనులు కొందరును
నీరు జుంటి తేనైతే పూరి కర్పూర
మైతే
మహాత్మ మైళాంబము నీ మంద
మీదికి వచ్చె
అటువంటి వేళ మిమ్ము ఆదరించు
కొన్నది
అదివకటి విచారించు యాదవరాజు!
సిరి కినిసివ వచ్చేనా, మంచితనమున
వచ్చేని
కినిసి మా సిద్ధిరాజు కీడు దలచినగాని
పాశము చొచ్చినా పట్టి సాధించు
అంత వారి తోను ఆర్భాటుచేసి
గంతులు చల్లవు కాటమరాజ!
బుద్ధి మాని వెర్రి బుద్ధులు పోక
పెద్దరికాలు మాని పెట్టుమా పుల్లరి"

# సిద్ధిరాజు యాదవుల ఆవులను బోయలచే వేయించెనని కొమార బంగారము ఆక్షేపించుట

"యిను రాయశృంగార
వివరంబుగాను
మునుపు మీరు మూర్ఖపుతనము
ముందర చెరుకులు మోపులు గట్టి
యీ ప్రధాని భీమినేని పంపి మీ
రాజు
యితకారి మాటలాడి రప్పించి
మాయ వాదము చేసి మంచివాని వలె
దాయకులు సిద్ధిరాజు నేమంబు బలికె
తానేలు నెల్లూరు పట్నంబు లోపల
పూని సత్యవాక్యం పుట్టించెను
కవులు
యీశీమ కరుణము తిక్కన మంత్రి
వ్రాసిన పత్రాలు వైనాన వినుమ
కడగి యీ విషభవ కార్తీక శుద్ధ
పంచమీ గురువారము నాడు
పసిబాస తెలిపిన పరమపుణ్యుండు
చెలువొందు కాంపటములు
చెన్నమనాయనికి
యిదేలు సిద్దిరాజు యేలిన కవులు
యెన్నాళ్లు మీకవులావులు యే భూమి
మేసిన
అన్నాళ్లు మాసీమ అగ్నిలేకుండ
యెచ్చోట వర్షం హెచ్చుగా కురిసిన
అచ్చోటనెల్లమీ ఆవుల మేపుడి
కంచ బీడు చెరికె అరికట్టి
తెమ్మనకుండ
కంచి విజయనగరము గట్టి మీ
సందు
సిర్న పుట్టిన పూరి శలవంటి మీకు
గూడె మాడెలకు గోవులు బోయిన
నేడాడిన మాటలు నాటికి రావంటివి
వకటి గనక బోయిన యీ మీ
సొమ్ము
వకటి పదహారుగా యిచ్చెదనంటివి
యీ పత్రానికి మొదలు
పరమేశ్వరుని కొమారుడు
వినాయకుడి సాక్షిగాను......
పల్లికొండ పెరుమాళ్ళు పారేటి పెన్న
నెల్లూరి ఇరుగులసాని నెరసాక్షి
మనకు మూలస్థానలింగము
మొదమొప్పు
వైకుంఠ కంచి వరదప్ప సాక్షి
భూమి ఆకాశవాణి బొంకని సాక్షి
పృధివిలో చెరచు వోటలేశ్వరము
సాక్షి
పర్వతాల మల్లప్పతి సాక్షి
మనకు
వినుకొండ వీరభద్రుంను వినయమున
సాక్షి

అనుచు తనవ్రాలుబెట్టి ఆకులలో
వ్రాసి
నమ్మ బాసలుచేసి నయములు
బలికి
కమ్మ చెన్నమనాయుడికి కమ్మ
వ్రాయించె
మము బంపె పూర్వకాలంబు నాడు
తమ్ములు సిద్ధిరాజు ధర్మంబు దప్పె
నందవాడ చెరువుకు మాయావులు
నీళ్ళకురాగాను
మందావు వేయించె మనమ సిద్దిరాజు
కవులు యిచ్చి తప్పిన ఖలచిత్తు
మోము
కనుగొన దోషంబు కలలోననైన
మాట నిజమైన మానవేశులకు
మాటాడి తప్పితే మానంబు తప్పుట
వుడుముకు రెండు వుండు నాలుకలు
కవులు యియ్య వక నాల్కె కవులు
యిచ్చి తప్ప
వాలాయము మీ సిద్ధిరాజుకు
వ్రాసినటులైన
యిషు నిన్ను పంపుట యేమి
కారణము?
బొంకు నాలుక చెరచుట వాయి
దప్పుడు
రెండేండ్లకు యేట్లుపోట్లుగా వేసి
నాడు చేసిన శాత నాటితోనే సరి
తోడత నెల్లూరికి తోడక రావద్దనుచు

పడమటి సముద్రాలు దాయ
పశువులు గదిలె
దక్షిణపు సముద్రం దరిమేరగాను
పెన్న వెంట యీ నెల్లూరికి పేరు
సాగి కదిలె
పన్నుగా లక్ష్మిదేవి పున్నమపరువడి
దినాలు
ఆరువర గండసిద్ధిరాజు యుద్ధాలు
శ్రింగారమున నాయకుల పంపె
బొగ్గిట వెంట
కల్గిరి చెరువెనక[4] కానకలు నీడ[5]
నీలవర్ణుని మంద నిలిచివుండగా
జూచి
పంచగిరి అమ్ములవాడు పశవీటి
భావరాజు
వచ్చి ఆవులచూచి మచ్చరంబున
కొక బెదుర్లుపెట్టి కొవ్వున నార్చె
పోకుండ మందలావుల
పొడిపించినాడు
పొడిచిరి యెద్లు బోయనాయకులు
పొద్దుబోయి పాలేలకు పొర్లిపోతాను
యేపెలు అండగొని యెద్దుల వేసిరి
కానుగలండగొని కవులావుల వేసిరి
పోట్లు దాకిన యెద్లు పడి పొల్లాడ
గడగిరి కోలలు గజ నారసములు
ఘనమైన యెద్దులకు కందనములు
నాటి
శ్రీరామ బాణాలు శిరసులు గాడి

4. చెరువు వెనుక  5. కానుగుల నీడ

గుమ్మడి గింజ అలుగులు కుతికె
దింపాయ
పరువాతి అలుగులు పక్కలు గాడి
దౌనవింటి అంబులు సోనలాయ నయ
యెద్దు రూపము దప్పి
యేదురూప మాయ
యెద్దు వొళ్ళు జూచితే యఱ్ఱహేమ
వర్ణ మాయ
వర్ణము లేని యెద్లు వరణమును బడసె
మూడు భూములు శెయ్యి మూడ్ను
యెద్దులు శెల్లె
అన్యమేలే తీర్థమనేటి ఆవు వఖటి చెల్లె
కావరంబున పూని ఘనుడు సిద్ధిరాజు
గోహత్య పాతకానకు యెరుపక
మునుపు
కామధేనువను చంపె
కార్తవీర్యుండు
యెట్టితీరై పోయె యెరుగవా భట్టు?
అట పొట్టి శిరసులు అన్నితావుల
పడగొట్టడా తొల్లి గండగొడ్డట
భార్గవ రాముడు?
ఆరీతి మిమ్ముల అందరిని బట్టి
పోరిలో వఖరినైనా పోనియ్యక చంపి
బద్దిగొర్ల సేయింతుము భాగీరథీ
గంగకు
అయిన తడవాయ గాక అఖిల
లోకముల
దైవకట్టడి మీ సిద్ధిరాజుకు
దగ్గర వచ్చి
వదరక పలుమారు వసుధీశు యెదుట
కదలి రమ్మను మీ మీ కలవారినెల్ల"

## రాయశృంగావళి సిద్ధిరాజుల యుద్ధ పరాక్రమమును ప్రశంసించుట

అనిన రాయశృంగావళి
కనుగొని అతనితో కమ్మటి పలికె:
"వోయి మాకు ముందట వోడక నీవు
శాయ బాకీతనము శాయ బొయ్యేవు
గయ్యాలి చాతల గడిచెర మాధనం
యియ్య బ్లైశమాలి యెల్లాడుతావు?
మరపు వోస్తారి మత్తి
సాయ నాయకులు
యెరుగక యేసిరి యెద్లను మూటి
వేసిన యెద్దులకు యేకాల పడితూరి
చాల పశువులు గలచోట
చచ్చేవెన్ని లేవు

పల్లవ నలసిద్ధి పట్ట భద్రునికి
పుల్లరి వడబడి భూమికిరాగ
వృత్తరలో చిత్త వక్కొక్కచోట
యెత్తుబడి మీ ఆవులు యెన్ని ధావవు
యిలలో
అందులో యివి కొన్ని అనుకోను
తగును
అంటువంటి తెగువ నీయందున లేదు
తెడ్డడిగినప్పుదే కొయ్యడిగినట్టు
వదిగి ఆ సామెతై వచ్చె మీ వద్ద
తగిలి పెట్టుమనంగ తగవే స్త్రీమందురు
తగవు లోపల బొంక తావచ్చె మీకు
అయిన పశువులు యెన్ని? అరయ
ధనమెంత?
మీ మందెమేలమున మిక్కిలిగాగ
గొంకక పట్టిన కోటలో జొచ్చి
వంకదారులకాడ వారి జేరినట్లు
పుట్టిన సీమతో పూరెల్ల మేసి
పెరిగిన యెద్దుల పెద్ద కోడెలను
అరయంగ యేకు వేలు
అంపుమనంగ
పల్లవ-నలసిద్ధి పట్ట భద్రునికి
తోలి అంపినాడు...............
అందులోపల మంచి అరుదైన వాని
ముందుగా పుచ్చుకో మూటికి మూడు

గుర్రపు పిల్లలకును లేగటావు
నర్రావులను దోలె నాడందులోనె
అందులోపల మంచి ఆవులుగాను
వొప్పుగా పుచ్చుకో వకటికి రెండు
కాక మాతోడను కక్కసాలాడి
మా కవులు వెయ్యి మాడెలు కోడెలు
పుడమీశు కీయక పొయ్యెద మంటేను
కడగెలిచి మిమ్ము కదలి పోనీదు
వుసురుతో మా ధనము వొడ్డించి పిదప
యసగంగ రాజ్యానికి యేగుడీ మీరు
పరవుపకారిని పగయేటి కనుచు
తెరగెల్ల మీతోను తెలుపుచున్నాను
కాసేపు మనసు దిలాస చేసుకొని
ఆలోచనను జేసి ఆపైన రండి
ఘనముగా పోరాడగలవారు కారు
గజములు అశ్వాలు కల లొటిపిటలు
భూకంపటం బెల్ల పూని యేతెంచి
పెళ పెళ ఆర్చిన పెదవులు
తడవుచు
అడవుల కురికేరు యాదవులంత
కోట్ల పరియంతంబు కూడిన వేళ
పోట్లాట కుడుముల వేట్లాట కాదు
గద్దరి చేతల గద్దించ రాకు
పెద్దరికాలు మాని పెట్టు పుల్లరిని"

## కొమార బంగారము యాదవవీరుల పరాక్రమమును పొగడుట

"విను రాయశృంగార!
ఖివరవంతుడని
పనిబూని వస్తివి పసిపుల్లరికిని

అనువు చదువులు చెప్ప అన్ని
వివరముల
ఘనుడ నంటివి యీాడ గర్వించి
యిప్పుడు
యేతావు చదివేవు? యేతావు చెప్పేవు
వసపోసినట్టుల వదరేవు గాక
వకొ్కక్క విధమున వరసి
చూచినను
చక్కగా వకమాట జవాబు లేదు
యవ్వరని చూచితివి యాదవవరుల?
వివరించి చెప్పేను వినవోయి భట్ట!
ద్వాపర మేలేటి ధర్మ సేనుండు
ఆపద బాంధవుడు ఆ పల్లికొండ
పల్లికొండ యాదవుల బ్రహ్మాది
ముఖుడు
భీమ బలసేనుండు బిరుదు వీరుండు
సార బలశాలి ఆ చట్టువారి
యర్రయ్య
అమిత పరాక్రముడు అర్జునుండు
జనియించె
రేచర్ల గోత్రుండు రణశూరు డతడు
పద్మనాయడు భోగభాగ్యాల పంట
సకల విద్యాకళా సత్కీర్తి ఘనుడు
నకులుండు నాచకూర్మనాయుండు
చూడ
సహదేవు డాతడు సాత్విక గుణుడు
భూదాన సేనుండు పుత్తమరాజు
యేవురు పాండవులే యాదవులును
వేడుక యరగడ్డపాడు కురుభూమి

వీరు యి తిరుమందులు వినుత
సాహసులు
అనుచు త్రేతంబున అవని యాద
వులు
రామచంద్రుని వార్త రసికత వినుచు
చతుర్వేదముల కై సాగరంబులను
వెదకి సోమకుని జంపి వక
రూపమునను
చక్కగా రాక్షసుని చంపి కొమ్మునను
పుర్వితా నిలిపెను వక రూపమునను
కనక కశ్యపునిదే కడుపు వ్రయ్యలుగ
వనర నఖముల జీరె వక రూపమునను
అల వామనుండై అడుగులు గొల్చి
బలిచక్రవర్తిని పరిచె నొక్కటను
వాడక క్షత్రియులు వైనాన నరికి
గండ్రగొడ్డంటను కార్తవీర్యుణ్ణి
వొండొండె ద్రుంచెను వక రూపమును
జగమేలు ఆ రామచంద్రుడై పుట్టి
వాగి రావణుని జంపె వొక
రూపమునను
ఆ రీతి మిము జంప అఖిల లోకము
లెరుగ .
మా రాజు జనియించె మరి సాహసమున
సీతాపతియైన శ్రీరామచంద్రుండు
యీాతడే ధరమీద యెంచి చూచినను
యితనికి సహోదరుండు యిన
వంశకులతిలకు
ఆదిశేషుడె లక్ష్మణుడు అతడు
యరనన్న

దశరథ రాజేంద్ర తనయుడు
భరతుడు
అసమాన ఘనుండు అయితమరాజు
సుమిత్రా మహాదేవికి సుతుడు
శత్రుఘ్నుండు
రమణతో కరియావుల రాజశేఖరుడు
భరతుండేలిన అయోధ్యపట్టణము
దొనకొండ
వరుసతో శృంగార వనము పూదోట
అంబెట్ల పెద్దమల అరుట్లకోన
పశువులున్న కోన పరుణసాల
అరుదుగా అలయించు
ఆ మాయమృగము
ఘనముగ మీ భూమి పశువుల మేపు
చరుకూరి జగడమే సీతామహాదేవి
చర గొంపోయిన రావణుడె
మీ సిద్ధిరాజు
కవులెల్ల వెదకంగ కానలో జూడ
చెప్పిన అంపుదురె శీలావంతులు
గడినుండు పాలేరు గంభీర వార్ధి
పుడమి ఆ రావణు పురము యేమి
పురము?
భూనాథు క్షేమము పుల్లరిమాట
జానకి ముద్రిక చప్పినవెల్ల
యిచ్చిన పత్రాలె ఖల రాము ముద్ర
వచ్చిన కంపటి వాయుసుతుండు
పచ్చరెక్కల చిలుక...లంకయిండ్లు
పక్షి నేసిన బాణమే పవనజు వాలు
పదిలమౌ నెల్లూరు పట్టణము లంక
తుద రావణుడు సిద్ధిత్రుంగ
యరగడ్డ
ఆ రాత్రి చంపుదుము అందర మిమ్ము
వదరక పలుమారు వసుధేశు నెదుట
కదలి రమ్మను భట్ట !
మీ కలవారినెల్ల''

## రాయశృంగాక్షళి యాదవవీరులను కించపరచుట

''వినవోయి యాదవ వీరుల భట్ట!
పనుపడ మీవారి పౌరుషంబెల్ల
మించి మా ముందర మితిమేర లేక
యెంచేవు సారెకు యెక్కువగాను
అడవుల తిరిగేటి యాదవ వరులకు
యక్కడి సాహసంబు?
యాధ పౌరుషము?
గుర్రంబు పొడగంటె
గుట్ట కురుకుదురు
వెర్రిగొల్లల బిరుదు వెయివేల గతులు
కలవి లేనివి కొన్ని కల్పించి ఆడ
యాదవ వంశంబు యిలగూల్చు
వరకు
పుబ్బించి పురికించి వారుల పడగొట్ట

దబ్బర బుద్ధులు తప్పవుగాక
యిట్టి అనేకులు నీమందలోను
చేటు దెచ్చుకొనేది క్షేమంబుగాదు
యాడ బుట్టినవార్ని ఆడ చల్లార్చి
.... .... వారు భట్టున గాక
యగ్రదోలినప్పుడు యెగసి
యా మిడత
అగ్గిలోపల బడి అట మడియుగాక
అటువంటి చందంబు యాదవులెల్ల
గట్టిగా నీ బుద్ధిగై కొని వినుము
నీచుబుద్ధులు మాని నీతులు చెప్పి
చచ్చేరు యాదవులు సత్యమీమాట
వారు చావగ నీకు వచ్చునా కొంత
వారు లెస్సగ నుంటే వచ్చును గాక
తన్నేలు రాజుకు తప్పొప్పు లేక
మంచి బుద్ధులు చెప్పి మగుడింప
వలయు
యేకులతో బాకులు యెంత చేసినను
నాటనోపునా అవి నలియును గాక
పచ్చిపాలను ద్రాగి పశువుల గాచి
మచ్చరింతురు వారు
మదమచ్చరమున
పేదవాని కోపము పెదవుల తీట
చేతగానిది యేమి చేయంగ గలదు
పూని దీపము చూచి పూనకము లెల్ల
మలుప వచ్చి అదియందు
మలగునా యెట్లు
కోపించు నీ మంద గోపాలులెల్ల
ధావక ఘోధురే సమరంబులోన

కదసంబు కేగిన కాటిగుర్రాలు
చదరక జగడంబు చేయంగ గలవె?
పెరుగు పాలును త్రాగి పెద్దబాకులను
కాష్ఠ్ల మోయంగ కడలేక పెరిగి
బొర్రలు పెంచుక బోగుపలె నుండు
నర మానిసులెల్ల ననిసేయ గలరె?
యంత గాత్రంబైన యెద్దులపౌజు
దంతిఘటతోడ వుద్ధతి పోరగలదె?
నరావుల కదుపు నాణ్యం బెయైన
గుర్రపు పౌజుతో కూడంగ గలవె?
యాదవ సైనికులు యెందరేగాని
నెల్లూరి సాహసుల నెదిరించ గలరె?
పొదవుగాగను చెప్పి పొగడేవు సారె
యేమిటికి పొదవులు
యెంచి చూచినను
బూరుగు తానెంత పొడుగు
పెరిగినను
చందనముతో నది సరితూగ గలదె?
యలమి జీలుగు చెట్టు అదెంత
లావైన
అల మేడకంబాల నాచంగ గలదె?
పాములు బారలు పదినూరులైన
విష్ణువాహనముతో వివదించగలవె?
యలమి దూదికొండలు యెంత
ఘనమైన
అనలంబు వకయంత అణపంగ
గలవె?
మదియించి యున్నట్టి
మత్తేభములును

పొదలి సింహము కూడి పోరంగ
గలవె?
ఆరుదైన నీమంద ఆవులెంత్తైన
పరికింప బెబ్బులి పట్టంగ గలవె?
వద్దనుండేటి వారల బలిమికి
కబ్బి చెప్పుకునేవు ఘనత మీరంగ
పూరక యుండంగ పులుసు
పోదేమొ
వారిని పొగడుదుగాక వద్దన నేల?"

## కౌమార బంగారము యాదవులను పురాణ వీరులతో పోల్చి చెప్పుట

"వో రాయశృంగార! పనరంగ
వినుము
సాహస ఘనుడితడు సార్వ
భౌముంతుం
మనసున వాక్కున మరి చాతలందు
అని చేయ యితనికి అమలచి త్రంబు
యేడేండ్లకుసు సాము చేసేటినాడు
వేట్కతో రణమున వెచకబోవంగ
కడువేట్క బాంధవుల కలసేటి
యపుడు
గడినుండి శత్రువుల కదిసేటియపుడు
కడుసాహసుండగు కాటభూపతికి
పుడమిలో యితనికి వడినొక్క
దృఢమె?
మంచి గంధము చాల మైనలదు
నపుడు
మించి అని రక్తంబు ముంచిన
యపుడు
యెంచి పూబంతుల వేసేటి
యపుడు
కూడి అంబుల వాన కురిసేటి
యపుడు
పంచబాణుని బోలు బడుగులరాజు
యెంచి చూచిన యితనికి
యిదియొక్క దృఢమె?
బసువశంకర బిరుదు పట్టమెక్క
టప్పుడు
పశువుల క్రేపులపై వచ్చునపుడు
దుర్మార్గుడవు గనుక దూషించితీవు
రాయబారులై తేను రాజ సముఖాన
వసుధపై దండెత్తి వచ్చేటి యప్పుడు
కుసువ బాణుండగు గోపాలకునకు
వసుధతో యితనికి వడినొక్క
దృఢమె?
శ్రీరామ చరితంబు చెవుల
విన్నపుడు
విమతుల ఆర్భాటములు వెసవిన్న
యపుడు
తమ్ముల గనుగొని తగ మరియు
నపుడు

సమరంబులో రిపుల చంపేటి
యపుడు
అమిత సత్యవ్రతుడు యాదవ
రాజుకు
యితని కెంచగ యిప్పుడు యిది
యొక్క దృఢమే?
యితనికి సాటిగా యిప్పటి రాజు
ప్రతి యెంచరాదు యే పగతురనైన
కృతయుగ త్రేతాయుగ ద్వాపరములు
యితని యెంచగవచ్చు యెవ్వరికైన
కార్తవీర్యుని బట్టి గర్వంబు నడచు
పరశురాముని తోను పరికింపగాను
సరిగ కీర్తింపనౌ సుకీర్తిపరుడు
రావణ కుంభకర్ణాదుల గొన్న
రామచంద్రుని సాటి రణములో
యితడు
కురురాజ బలముల కూల్చిన యట్టి
అల కిరీటికి సాటియగు చూడ నితడు
కలగక మధురలో కంసు పొరిగొన్న
బలభద్రరాముని ప్రతిబోలు నితడు
నాటి నృపులను గాని సాటిగా నిటను
నేటి వారలనెంచ నేరంబ యగును"

## యాదవుల నమ్మకద్రోహమును రాయశృంగావళి అధిక్షేపించుట

"రావోయి యాదవ రాజుల భట్టి!
కారుణ్యముల బల్కు కర్తవు గావు
మీరేమి చేతురు? మిమ్మాడదగదు
వనములోపల జొచ్చి వడి మ్రాకులెల్ల
చెట్లెల్ల గొడ్డండ్ల చెలరేగి కొట్ట
అట్టి కట్టడి దొంగ అందులో నొకడు
వారిలోపల జొచ్చి వడి మ్రాకులెల్ల
జక్కగా నరికిన చందంబునాయె
చిలకట్టు నేరములు చింకర్ల భీమినేడు
యీలాగు చేయుట యెరుగడు రాజు
మీరు వచ్చినరాక మీరున్న వునికి
అది చూచి మా రాజు అడుగంగ తగదు
గడ్డి నీళ్ళను లేక కారియలాడు
గొడ్ల భూమికి తోలుకొని వచ్చునాడు
మన్నిల బొమ్మినేడు మందావుల
జూచి
మన్నె మాకులతోను మళ్ళి తోలించ
కనుగొని యాదవ కంపిటీలు వచ్చి
మన్నిల బొమ్మినేనికి మనవిగా జెప్పి
గోవు గ్రాసము నొప్ప కొదలేని
పుణ్యం
గోవుల రక్షించుకోండి యీవేళ
అడిగినంత ధనము అంపేము మేము
అవుల నొకయేడు ఆదరించు మనె
సకల వస్తులు మీకు సమకూర్ప
గలము
వకయేడు మీభూమిని వుండ
నిమ్మనియు

అని యిట్లు పత్రము అప్పుడే వ్రాసి
పల్లవరాజుకు పంపిన జూచి
యక్కడి గొల్లరాజు ?యెరుగము
మనము
యేమి అవసరమాయ ? యెరిగి
రమ్మనిన
అతడొచ్చి మీచేత అంది కిట్నములు
కవులీయ నీమంద కంపటీల తోడ
మా రాజు కొలువులో మరి వేగ నిలిచె
అపుడు యాదవులు మాట్లాడ నేరకను
బూడిద కప్పు నిప్పుకైవడిని
త్రొక్కిన కరువని శేషుని రీతి
చివికి పోయిన కొండచిలువ చందాన
వెడమాట లాడంగ వెర్రులు వీరు
అడిగినంత ధనము అంపేము మేము
అనినంత దయ దలచి అప్పుడవనీశు
చేత నొక్క కవులు చీటి నిప్పించె
మాసీమ నుండంగ మాంచి మాటలును
ఆమీద ప్రళయంబు లాయ మీపనులు
పేరేమొ లొటిపిటల్ పెదవులు
మృదువు
కోరింత పొదలెల్ల గోరి నట్లాయ
తేనెను మా భీమినేనికి యిచ్చి
యీనేల వకయింత లేకుండ మేపి
పాలేటి గడిచేరి బలిమిని మాటలు
ఆడంగ జనులు మిమ్మవు నందురో ?యి
చానక పసులకు సంజీవియిస్తే

మురగకుండగ బొమ్మ మురిపే
దటంచు
రక్షించువారిని రమ్మని పిలచి
భక్షింప జూచిన పనిలేదు యింత
కరువుబడి వచ్చిన కాలమైతేను
కాకినెపముల యెన్నగా దగు మీకు
కేలింత లాడంగ గెలుతురే మీరు?
చెల్లు కాలము మీకు చేరువయాయె
యెక్కడ పోయెదరో యింక
రాజునకు
చిక్కితిరి మీమీద శివుదయ తప్పె
యన్నడు నారదుడు యేతెంచి మీకు
పంచాంగమును జూచి ఫల
మెప్పినాడో
అప్పుడే నీపని యంతయు దీరె
మితి అరమాసము మీద నున్నాది
చిక్కడు దివసాలు చిక్కి
యుండగను
యెక్కుడు చాతల యెంతైన జెల్లు
అరమాస మది మీకు అధికమై
యుండ
పసులకు మీకును పాలేటిలోను
కూలునని చెప్పిన గురుతు నామాట
వర మిచ్చి నతడైన వధియించు మిమ్ము
యేమిటికి చచ్చేరు ? యేగశాక కదరో
యిట్టి దుర్భ్రమ మీకు వలవదీవేళ
చచ్చిన ధనమీక స్వర్గంబు లేదు

యిచ్చిన కలుగును యింద్రలోకంబు
అలనాడు పంపెద మన్నట్టి ధనము
వడబడి నంతయు వనగూర్చి మీరు
మనవిగా చెప్పికొని మరిమీద దక్కి-
నేడు మా వల్లను నేరమున్నాది
అని విన్నపము చేసి
అభయ మడిగినను
కరుణ తోడుత మిమ్ము కాచు
మా రాజు
శరణని వచ్చిన మరణము చేయడు
శరణాగత బిరుదు జరపినవాడు
మితియు మేరయులేని మిక్కిలి
ధనము
మీరు గడించినట్లు మీరు చెప్పితిరి
మీరు గడించిన మితిమేర ధనము
ఆపద కొకవేళ అడ్డు పడనీక
దాచంగ ఆ ధనము దక్కునా మీకు?
ధనకాంక్షబడి భూమి దాతురు
కొందరు
అది గానకయ మిమ్ము
అడుగంగ రాదు

నగను పుల్లరియిచ్చి సమ్మత పరచి
పరిణాన వుండుడీ ప్రజలతోపెద్దు
ఆడితే తప్పని అధిక నేర్పరులు
పలికితే బొంకని పరమపుణ్యులును
పసి పట్టభద్రులు బ్రహ్మని కొప్పి
యనగ బొంకిన పాపము
యేమిట బాయు?
స్థిరకీర్తిగల మంత్రి తిక్కన
ప్రగడకు
ఆరువేల వరాలు అప్పడిత్తుమని
వొడబడు మిమ్మును వకరైనగాని
బాధింపగా వొడబడితిరో నాడు?
కార్య కక్కుర్తిన కరణాని కప్పుడు
వొడబడి లేదనుట వొగి తెస్సగాదు
విప్రద్రోహముకన్న
విషమైన మేలు
చప్పగా వినవొకో శాస్త్రంబునందు
బ్రాహ్మని సొమ్మును బ్రాహ్మని కిచ్చి
.... ... ... ... ...
సామెత చెప్పుదురు సమైన యిచ్చి
నామాట విని పొంది నమ్మి సద్గతికి''

## కాటమరాజు ఛప్పన్న దేశములను జయించిన మహా వీరుడని కొమార బంగారము చెప్పుట:

''విను రాయ శృంగార
వివరంబుగాను
ఘనమైన రాజు మా కాటమరాజు
వుత్తర కాంభోజ వుర్వీశులెల్ల
తత్తరించగ బట్టి తలలను ద్రుంచి
కొంకణ దేశాలు కొట్టి సాధించి
వంకిణి కిల్కొమ్మ వరుస చెల్లించె
కాళింగ భూమిని కొలావుల మేపి

వెలయంగ సత్కీర్తి వెలసినవాడు
ద్రావిడ దేశాది ధరణీశ్వరుల ద్రుంచి
క్రొవ్వు లంచంబుగా కుడిపిన వాడు
మాగధ మాళవ మతిమీర కాౘముడై
మగసింహ బిరుదాంక
మాన్యుడై నాడు
ఘూర్జర నేపాళ కువలయేశ్వరుల
చెల్లగా గుదియచే చెల్లించినాడు
సింధు కాశ్మీరాది క్షితిపాలకులను
గమనించి వారిచే కవులందినాడు
పరగ పుళింద భూపతుల నిర్జించి
హేలతో రణభేరి వేయించినాడు
కుకుర కొంకణ భూమి గోవుల మేపి
సకలాభిరాముడై చతురత మెరసి
సుధేష్ణ చాళుక్య చోడ భూపులను
యెదురించు వైరుల యిల అణచినాడు
అంగ వంగ భూమి అవుల మేసి
భంగ ప్రతాపుని పడజంపినాడు
పాండ్య సౌవీరాది పతుల నుగ్గాడి
చాణూర మల్లుల చంపినవాడు
పాంచాల భూమెల్ల పశువుల మేపి
యంచ కీర్తులచేత హెచ్చినవాడు
వుభయ విదర్భ విరోధుల నణచి
భుజ పరాక్రమముచే పొలు
పొందినాడు
కోసల కిరాత కుంతలంబులను
వాసిగా మూకల వధియించినాడు

సౌరాష్ట్ర వీరాట సౌర దుర్గముల
నవకోటి బిరుదంబు నడిపినవాడు
మరాట లాటముల మందావుల మేపి
నెర సాహసంబుగ నిలిపిన వాడు
శూరసేన క్షితి పాలకుల గొట్టి
బిరుదు పెండెరము కాల బెట్టినవాడు
మచ్చ కురుభూముల మందావుల
మేపి
చెలగుచు వారితో చెలిమందినాడు
మలయాళ గాంధార మహ
రాష్ట్రములను
చెలరేగి బిరుదులు చెలగించినాడు
బాహ్లిక గాంధార బహు భూము
లందు
బహు బలశాలియై ప్రబలిన వాడు
కర్ణాట తుళుభూమి ఘనతతో మేపి
దుర్జయ రాజుల దునిమిన వాడు
కాశ్మీరపడులను కన్నడుల నొర్చి
భాను తేజుండై పరగిన వాడు
కాష్మీర భూమిని కౌలావుల మేపి
నవనాథ సిద్ధుల నయము గన్నాడు
కర్ణాట ద్రావిడ గహన భూములను
కోపరాలుండంగ కూలార్చినాడు
యవ్వరు కదియించి యవరు
కినిసినను
యవరు ఆ రాజుతో యెదిరి నిలిచినను
వాని పోనీయక వసుధపై కూల

పోర నావులచేత పొడిపించి వాడు
వడసార మీరాజు వధియింతు ననుచు
కంకణంబులు చాత కట్టుకున్నాడు
నిలుచుట ముందర నీతియు కాదు
వెలసిన సాహస విక్రమఘనుడు
పూని మీ నెల్లూరి పురవరులనెల్ల
వెనుదగిలి మారాజు వెంటనున్నాడు
పదలక పలుమారు వదరేవు చాల
కదలి రమ్మనుమీ మీ కలవారినెల్ల''

## రాయశృంగావళి, కొమారబంగారము మాటలను అతిశయోక్తు లనుట

''అవునోయి యాదవ అవనీశు భట్టు!
కవితకు పోషణము కలదు మీవల్ల
యేనుగు వక కొంత యెదిరి పొడిచినను
యీవలావల దూరి యేగ నేర్పరివి
కా సొకటీయక కల్లలు నాటి
యీగి కర్ణుండని యెంచ నేర్పరివి
అప్పులతో ఆట లాడేటి నాడి
అతడు కుబేరు డంచనగ నేర్పరివి
గంధంబు కస్తూరి అందనివాని
చందనంబే యని చెప్ప నేర్పరివి
తంగేడు పూవొకటి తల నిడనివాని
వాసవ భోగని వదర నేర్పరివి
పందె మొక్కటిగాని పట్టనివాని
ఆసహాయ శూరుడంచనగ నేర్పరివి
యన్నడు సుఖమనుట యెరుగని వాని
తేవతాసఖుడని తెలుప నేర్పరివి
శ్రీలతో చెలిమిని చేయనివాని
అం[illegible]డని అనగ నేర్పరివి
పలుకు రూపెరుగని పనికి మాలిన వాని
వాల్మీకుడని గొప్ప పలుక నేర్పరివి
బ్రహ్మయువని వచ్చి పాడని వాని
తుంబురుతో తులచూప నేర్పరివి
యింత లేకుంటేను నీ మందలోను
యాదవులందరు అవుననుట యెట్లు?
యవరి ముందర నీవు యెంచ బొయ్యేవు
బూరె గంపల కాడ పొర్లుదండాలు
వడి మొక్కగా నిన్ను వద్దనరాదు
అయిన నిటువలె [illegible]ప్పుడాడెడి [illegible]
పుత్తరమీయక వొగి నుండరా[illegible]
పిమ్మట దలపోయ వెరితనమ[illegible]
నెరసాహసాత్ములై నేడు [illegible]
మ[illegible]
సారెకు చెప్పుట జంకు పుట్టుట[illegible]

వుప్పెన కదులునే వుడుత
చప్పుడుకు ?
సరిసేయ యివి గూబ జంకులు
గాక
యవ్వడు సరసుడు ? యవ్వడు
సుకృతుడు ?
యెవ్వడో యీ మహిని వెరవక
చెప్పు ?
చల్ల పిన్నయ్యను సాహసుం డనెదవు
తొల్లి అతడు యవ్వరితో పోరి గెలిచె?
ఆతని తమ్ములు అతి శూరులంటివి
అట్టి క్రితం బెవరితో అని చేసి
గెలిచిరి ?
వారివద్ద జాంబలివాడ సంతతి భట్ట !
పరికింపగా జమిడి పంబను వాడు
పోటు బంటని చాల పొగిడితివి నీవు
సాటిగా యవ్వరి చంపినాడతడు ?
బొల్లావు నెక్కువగ పొగడి చెప్పేవు
బొల్లావు మును పేడ పోరిలో గెలిచె
మసిలినేని పుత్రుడు మన్నీడు
బీరినాయడు
అసహాయ శూరుడని అతని
జెప్పితివి
పుట్టిన అయిదోనాడు పొలిసె
తలిదండ్రి
నాడె గైకొని పెంచె నందుల సిరిదేవి
తల్లి చన్నులపాలు తనివార
గుడిచెనా?
తల్లి దండ్రులవద్ద తగ పెరిగి నాడో

పోతపాల ద్రాగె పొట్ట బట్టినదో
అతడెవ్వరి తోను అని సేయగలడు?
బోడావుల చెన్నయ్యను పొగిడితివి చాల
యాడ పొడిచి గెలిచె ? యెక్కడ
చంపె?
చెప్పట్ట కత్తులు చెంపశిఖలే కాని
చెప్ప నేటికి అతని చాత నేమౌను ?
యరనన్న ఘనుని మహ యెక్కువగ
చెప్పేవు
సరిసేయ యే రాజు సాటికి వచ్చు?
పారెడి ఆవుల పట్టనేగాని
చేరి జగడ మొకింత చేయగాలేడు!
చట్టు వారెర్రయ్య సాహసుడంటివి
మొదలు చట్టుగల్లు మొనలపై
నిలుచునా!
నాచకూళ్ళ నాయని నాయము
చెప్పేవు
కొంచెపు బండ్ల నెంచ కొదవయు గాదు
అతిపరాక్రముడని అయితమ్మ రాజు
సారెకు మాతోను చదివేవు ప్రజ్ఞ
అతడు సాహసి యైతె అట చెరుకూర
పోలురాజు నొసటి పోటును దాకి
మర్రికి తలకడగ మందలో జెల్లె
తండ్రిపగ తీర్పక తానెందు పోయె?
యెక్కువ సంపదల యలమంచి
పోయి
నాడు రావెరచిన వాడు నేడు రావెరచు
పుత్తమరాజును పూని చెప్పేవు
యెత్తు సొగటాలాట యెరుగని వాడు

తన కడ గెలిచితే దగ్గరవచ్చు
అనువు గాకుంటేను అటు మళ్ళి పోవు
బుద్ధి పోవిడి దుష్ట బుద్ధులు దలచి
అనిలోన బడి చావ అతనికి నేల?
పోచమ్మ ముమ్మయ్య పొగడితిందాక
వే చూపు మెక్కడ వెలసి రనిలోన?
పలుమారు లాతని బలము చెప్పేవు
లోట చేత్తామని లోకంబునెరుగు
కరియావులన్నను ఖడ్గస్థ దండువు
వోరుగంటి జగడాన వొకనాడు పిలిచె
వోరుగంటి మూక నొకనాడు గదిమె
శారికకు దెలువను శాస్త్రమున్నాదె?
పెద్దరికములు జెప్పి ప్రేలేవు గాక
తరచు పదరక ధనము సరగున పంపు''

## కొమారబంగారము యాదవవీరుల పరాక్రమమును పేరుపేరున ప్రశంసించుట

''రాజుతో పలుమారు రావోయి యెదుట
రాజుల చెప్పేను రాయశృంగార!
యే రాజు సాహసుడు యే రాజు ఘనుడు?
యే రాజు పుణ్యాత్ముడు? యెరిగింప వోయి!
క్రొవ్వారగా బలిసి కొలువు గూర్చుండి
జగజంపు మాటచే చాటి పల్కెదవు
సొరిది సమ్మతముగ సోమరుల నెల్ల
యేల చెప్పెదవీడ యెక్కువ చేసి?
మతిమాలి సుజనుడని మరిమరి పొగిడేవు
మనుమసిద్ధిరాజు మరియెన్న రగదు
దశరథ రాముండు తన పౌరుషమున
వరుసతో మీపురి వద్దనునిలిచి
ముయ్యేడు దినములు ముట్టడి వేసె
అతడు చేసిన చాత అది నాటలేదా?
ఘనముగా నలసిద్ధి ఘనుడన్న మాటె
అ స్వస్తుండు అతడని చెప్పనేల?
దండు గూడిన యపుడె తలచూప వెరచు
యరసిద్ధిరాజును యెన్నకు భట్టు!
యెక్కడ పొడిచెను? యెక్కడ గెలిచె?
కదిసిన చీకోతు గాంభీర్యమేను
నలసిద్ధిరాజును తలపకు భట్టు!
యెడమచేయి కుడిచేయి యెరుగని వాని
కొని యాక పొగడుచు కొండ చెసెదవు

పాపసిద్ధిరాజు ప్రజ్ఞ చెప్పకుము
జగడ మింతెరుగడు సాహసి కాడు
నీతిమంతు డటంచు నీవు చెప్పితివి
యేరీతి యెరుగని యేకాంత మతడు
పిక్కతో చేసిన పీకైన పాయ
కొమర సిద్ధిరాజు గుణమైనవాడు
పలికితి సభలోను పలుమారునీవు
కల్లలాడితి భట్ట కావరంబునను
రాయబారానకు రాజని వస్తివి
పోరు పొందెరుగవు బుద్ధేమి లేదు
తిక్క యెత్తెనొ లేక దెస తప్పినావా
బలువైన భూతము పట్టెనో నీకు
పైత్య మెక్కెనొ లేక భ్రమను
గొన్నావా
యెప్పుడు చాదస్త మేమైన కద్దొ
పాడి గాని మాట పలికేవు గాక
వొప్పిన మాటయు వొకటైన లేదు
బ్రహ్మ రాక్షసి నిన్ను పట్టెనో లేక
తడబడ నేటికి దగ దొట్టినావా
రాజశృంగావళి రమణతో నీవు
తగవు వివేకము తప్పి తిరిగేవు
యేల యీలాగున ప్రేలేవు భట్ట!
ప్రజ్ఞలు యిచ్చట పని సేయరావు
కడుక్రొవ్వి మాతోను కచ్చకు రాకు
చెడ కారణము మీకు చేరిక యాయె
మునుపును మీరును మూర్ఖులని చాల
మమ్ము నడుగ వారి మనముల నడప
మరి మేము కోటపై నెరయ దండెత్తి
లావులు మెరయించి లగ్గల కెక్కి
పట్టణంబును కొల్ల బెట్టేటివాడు
నీ రాజు రాలేదొ నీవపుడు లేవొ
బలిమి చెడిపోతిరో పరిజనము లేదొ
పోయి బంట్లును దండు పోయి
రాలేక
సిద్ధిరాజుకు మొదలు సిగ్గింత లేదొ
కోరి చేతుల కూర కోయ బోయితివొ
మదిఖించిరోచూడ మది దప్పి
వారొ
వరుసతోను నగళ్ళవారు దోచంగ
పొంచులు నున్నారొ ప్రొద్దులు గూక
చెలగి మీపట్నంబు చెరకూరు సేయ
పగ నిర్వహించని బ్రతుకది యేల?
కటకటా క్రిందు మీదు కానవు గాక
కుటిల బుద్ధులు మీకు కొరగావు భట్ట!
వడముడిగా జొచ్చె వాంతి వెళ్ళంగ
మరియును వినవోయి మా మందలోను
మిన్ను చెడబడ నురిమి మీద
వచ్చినను
అరచేత ఆచేటి అధిక లున్నారు
సిద్ధుడాతడు పరస్త్రీ వర్జితుండు
వితరణ కర్ణుండు విఖ్యాతి పరుడు
మతిమంతు లెంచగల మంచి సజ్జనుడు
పుణ్యాత్ముడగు పెద్ది భూపాల
సుతుడు
కాంతి చంద్రుండు మా కాటమరాజు
యెరగవా వో భట్ట? ఋజు వక్క
మాట

యెరుక మరపు లేదు వెన్ను పగ
వారికి
యెన్నండు చూపండు యెన్ని
చూచినను
చేతప్పు వాతప్పు చెదరని గుండె
పిరికి కండయు లేని బిరుదు
రాహుతుడు
కాటమరాజుతో కలియుగములోను
యవ్వడు రణభూమిని యెదిరించ
గలడు।
డాకతో మారాజు టముకు సేయంగ
దక్షిణదేశంబు తల్లడంబందె
పాకనాడు చెదరె పలినాడు వణకె
గౌడదేశంబెల్ల కళవళమందె
ములికి నాడంతయు వులికిపడె నాడు
కాకినాడంతయు కాకిపారాయె
కంచి భయంబందె కటకము ఊడిసె
గుత్తి రాజులకెల్ల గుండె దిగులాయె
చంద్రగిరి రాజులకు చింత ఘనమాయ
ఆదోనిరాజులకు మోదంబు దప్పె
పెనుకొండ రాజు పెద్దరికము ఉడిగె
కాటమరాజుపేరు చెప్పినప్పుడె
కడపలో [illegible] గజగజ వణకె
[illegible] చెప్పినకోట్ల [illegible]
[illegible] ఘోరున గప్పు
[illegible] పుడె
[illegible]
[illegible] విన్నపుడె
[illegible]

యాదవరాజును యెంచిన చోట
యెంత వానినైన యేపణగించు
బలము చెప్పేదు భట్ట నిలిచి
మా యెదుట
యెద్దులే చాలు మీ యేనుగుల చంప
సలుగుటెద్దులు మిమ్ము సమయింప
జాలు
బొల్లావు మీరాజు పౌరిగొనజాలు
దిక్కులు చూచేరు దెసదప్పినారొ
పలికిన మాటకు ప్రతి పల్కలేవు
వున్మాదమేమైన వున్నదో యేమొ
దిమ్ము తలకెక్కెనో దెస దప్పినావొ
కటకటా! పుల్లరికా నీదు రాక?
యరుకగల రాజు మా అయితమరాజు
అర్థి కల్పకము మా అయితమరాజు
కొట్టి పగవారిని గుట్టలు పెట్టు
అజి ను త్తముడు మా అయితమరాజు
అయితమ రాజుకు అతికూర్మి మరది
పుణ్యవైభవశాలి పుత్తమరాజు
పున్నమ చంద్రుండు పుత్తమరాజు
భుజ పరాక్రమశాలి పుత్తమరాజు
కొప్పుకొండ భూమి కొదవలేకుండ
కడు సాహసంబున గవనిలో కొచ్చి
బికరంబుగ బట్టి బెబ్బులి గొట్టి
బబ్బరించగ గవని బయటకు దెచ్చి
కొంకుల గాలాల గుప్పించి పట్టి
పీరన్న కంబాన విరిచి కట్టించె
అట్టి సాహసుడు మా అయితమరాజు
భూసురాశీర్వాద పుణ్యాత్ముడగును

పుత్తమరాజు తా నుక్కు కంబమును
వైనాన తన్నెను వగి నొక్కనాడు
కక్కసపు వైరుల కడుపులు చించి
చనగిన పగవారి చర్మము వొలుచు
గబ్బి విరోధుల కండలు చెండి
చెండాడి రాజుల చెలరేగి పొడుచు
రట్టడి పగవారి రణమున ద్రుంచు
బట్టైన పగవారి బలము నుగ్గాడు
కుచ్చితపు రాజుల గుండెలు పొడుచు
సిద్ధిరాజుల బలము చీకాకు పరచు
పుత్తమరాజొకడు పోరిలో సిద్ధి
భూవరు దళమంత పోరిగొన జాలు
యరనన్న పౌరుషము యిటు విను
భట్టు!
రాజు తమ్ముడును విరాజుల దిగులు
కలనైన శంకను గననట్టివాడు
పదివేలకైనను పదరనివాడు
లక్ష్యపెట్టడు నూరు లక్షలనైన
వొరసిన రాజుల వొక్కలాగునను
దుర్మార్గులను బట్టి తృటిలోన
ద్రుంచు
సమరంబు చేసేటి సమయంబునందు
ఒడిన మాటను ఆడని రాజు
నిర్మూలముగ జేసి నెల్లూరునంత
రమ్మన్న వచ్చును రాయశృంగార!
వెస నొక్కమాటను వినవోయి భట్టు!
కడగొట్టు తమ్ముడు కాటభూపతికి
ముమ్మయ్య యనువాడు
మొనసినవేళ
కెరళి మూకలనెల్ల కిటకిటపరచు
వెన్నిచ్చు సేనల వెనకంజవేసి
సమరంబులోపల చంపేనుగాక
విడుచునా వూరక వీరుండు రాజు
భట్టునని వచ్చేవు బంధుల పిలిచి
పారిపొయ్యేవారు భట్టు ననదగునె?
భట్టావుల వల్లభన్న పౌరుషము
వినుమ
యేనుగు ఘటములు హేరాళముగను
యెత్తి వచ్చినగాని యెల్ల యేనుగుల
సింహంబు కైవడి చీకాకు పరచు
మరలి సంగరవీథి అరుల సాధించి
అవలీలగా పొడుచు ఆ రాజ
ఘనుడు
అతనికంటెను ఘనుడు అతి
విక్రమమున
కలిగి వెలసిన వాడు కరియావులన్న
వాలి సుగ్రీవుల బాహువిక్రమము
కలిగి వెలసిన వాడు కరియావులన్న
గజరాజుకంటెను భుజపరాక్రమము
కలిగి వెలసిన వాడు కరియావులన్న
చక్కనివారిలో చక్కనివాడు
బిరుదుల గన్నాడు పేరెక్కినాడు
తోరంపు రత్నంపు తొడవులవాడు
మీరిన వైరుల ధీరత మెరయ
వనరంగ యాదవ వంశంబు నందు
కలియుగ భీముడు కరియావులన్న
రట్టడి తనమేల రాయశృంగార!
గట్టిగా యిటువిను గర్వంబుమాని

యేల శంకిలః వీరులు యెదిరిన గాని
కాలాంతకుండగు కాటమరాజు
దమర త్రిశూలంబు తగ మూడు కండ్లు
కల దేవుడెంచ మా కాటమరాజు
తగ శంఖ చక్రముల్ ధరియించినట్టి
కరివరదు డెంచ మా కాటమరాజు
వర్ణింప యాదవ వంశంబు నందు
కర్ణుడౌ యీవిని కాటమరాజు
అర్జునుకై వడి అరివీర వరుల
గర్జించి గెలుచు మా కాటమరాజు
కండె తుండెంబులు గాణేయు ననిలో
గద్దించు రిపుల మా కాటమరాజు
పాండునందనులతో ప్రీతి యనవచ్చు
రణశూరుడైనట్టి రాజశేఖరుడు
వినుతి కెక్కిన బాహు విక్రమోన్నతుడు
తనరు షోడశమహాదాన వినోది
వినయ భాసురుడు వివేక సంయుతుడు
అతుల ప్రతాపి మహా ధైర్యశాలి
దురిత దూరుండు బుధ తోషితేంద్రుండు
శాస్త్రపాత్రుడు సర్వశాస్త్ర కోవిదుడు

నిఖిల సమర్థుండు నీతిపాలకుడు
కాంతి చంద్రుండు మా కాటమరాజు
పొట్ట కావరమున పొదలి యిచ్చోట
భట్టనంచును వచ్చి పలికేవుగాక
వొకని కిరీటంబు వొక పౌరుషముగ
వొకని మా ముందర వొక కొండ చేసి
పూని చదివెద వీవ పొద్దేమి పోదః
అందెల బండివలె ఆరడికి సైచి
నిందలు పల్కను నీతియా నీకుః
టక్కులు నిక్కులు టక్కరి మాటలు
ఆడకు మూర్ఖతను అటు చాటుకొనకు
హరికి ఆదరువై అవనిలోపలను
గురుతుగా వెలసిన గొల్లలు మీరు
పాడుకొని సంపదలు ప్రఖ్యాతిగాను
యదువంశమౌటను యరగవా భట్టః
యవ్వని ముంగల నీ ప్రజ్ఞతెల్ల
దవ్వుగా నలసిద్ధిదవు దెలిపెదవు
పేరు సిద్ధిరాజు పెద్దరికమేగాని
యేకాంగి జగడము యెక్కడ చేసెః
పొడిచేటి మావద్ద పొగడకు భట్టః
బంటుతనముల నీవ పచరించబోకు

## రాయశృంగావళి యాదవులను గేలి చేయుట

"వినవోయిః యాషఢవీరుల భట్ట
జనసమ్మతంబుగా చెప్పెదబుద్ధి

సారెకు మాతోను సామ్యము లేల?
సామంత దేవుడని సరగ బెదిరింతు
బేతాళ దగుగాక భీతేమి మాకు?
గట్టిగా నీబుద్ధి గ్రైకొని వినుము
నదియర్ర మంటిపై నడచెనో యేమొ
యర్ర పొర్లాడదా యర్రమంటిలోను?
సాముచేసిన వారు జగడంబు చేస్తె
యీమహి జనులెల్ల యేడ బ్రతుకుదురు
అలనాడు సాము సేయగ యాలదవుతో
కొలువనున్నట్లు కాదు కయ్యంబు
బలమి పీనుగులై రిపులు సమసినపుడు
కలహమాడినయట్లు కాదు కయ్యంబు
అన్నదమ్ముల రాజ్యము అది క్రుంగ ద్రొక్కి
ఘనత నెక్కినయట్లు కాదు కయ్యంబు
తలపొలములో బెదరి నిలబడ్డ గోవు
కలవిలుచుకున్నట్లు కాదు కయ్యంబు
అవుల కాపరివి అటు పాలు నీళ్ల
కలిపి త్రాగినయట్లు కాదు కయ్యంబు
మురుగి పాలును జున్ను మద్దలు మెసవి
గర్రున త్రేపుట కాదు కయ్యంబు
చేసిన వెన్నల సెగపొంత కాచి
కాసున కమ్ముట కాదు కయ్యంబు
గోవు లావుల పాలకుండల నించి
కావళ్ల మోయుట కాదు కయ్యంబు
పశువుల తోడ్కొని పోయి భూములను
కసవు మేపినయట్లు కాదు కయ్యంబు
బాస పత్రాలిచ్చి పండిన చేలు
గాసిపుచ్చినయట్లు కాదు కయ్యంబు
అడవుల కొండల అవుల మేపి
గడిసేరి యున్నట్లు కాదు కయ్యంబు
సిద్ధిరాజుల భూమి చెలరేగి మేపి
గద్దించి పడునట్లు కాదు కయ్యంబు
చెలగి మాటలె కాని చేతనేమౌను?
మాధవుడు నలనన్న మాసాటి కాదు
మా రాజు జగడాన మీరు చాలుదురే?
మనసున వారిధుల్ మరి దాటవచ్చు
గనుకొని కాలువ కడు దాటరాదు
మాటలే పోట్లైతె మదగజము చంప
యీచెలు కత్తులు యేల గడింప?
పొడువు పొడువుమన్న మాటె పోట్లైతె. తాకితే
కడనుండి సేయరా కయ్యమెంత్తైన
చావడికిని రాక సమరసం బగునే?
వివర మించుకలేక వెర్రివై నావు
రచ్చలేటికి నీవు రాజు నేరిచితే
యిచ్చవచ్చిన ధనము యిత్తురు నీకు
పొర్లింపు మాటల పొర్లబొయ్యేవు
కుచుచ బుద్ధులు నీకు కూడునే రాజ!
చుట్ట చుట్టుక యెంత సుడిగిన పాము

పుట్టి జొచ్చేటప్పుడు
పొడుగారవలదే? యరనన్న మీవద్ద యడబాయ దివిని
దూతాన మీరెంత దురుసు లాడివను నరిగాలు నానించి నప్పటికి గాని
నేర్పుతో బల్కుడీ నెల్లూరి ధనము వొప్పింపంగ తలపరు మీరు
నృపులతో యింత చేసినగాక యెటువలె
గొల్లమంద బుద్ధులు కూడ నుందురో!
వికృడను పుల్లరీయక మీరు పొగులు
గుట్టుతో మా ధనము చుండెదరో!
గురి తీర్చుకుంటె పంతాలుమాని మా పైక మిచ్చెదరో!"

చట్ట నెత్తింతు... సర్వదా చూడు

## కొమారబంగారము రాయశృంగావళిని దూరుట

"మేలుభళా! భట్టు! మెచ్చవలె నిన్ను యేవూరు సాహసంబు? యేవూరు
గాలి జముదాడివలె కరము వదిరేవు రాజు?
యింక నీ బుద్ధుల యేల చెప్పేవు? చేటాసి మాటలు చక్కనేర్చితివి
టొంకులే వుగ్గుగా పోసింది తల్లి యాచకులకు పరియాచకుడగుచు
వంకర దండాలు వడవడ మాటలు చూస్తిమి నీయందు సుకృతము లేదు
మాకు కానగవచ్చు మరియేల చెప్ప ఆసాదిగాని వలె అప్పటప్పటికి
అదిగోను పులి అంటె అదిగోను తోక మూస్తు తెరచుచు వత్తువు మురిపెమే
కానవచ్చే నంటి కడు నేర్పుతోను లేక
సిద్ధిరాజెచ్చట? సేనలు యాడ? బ్రహ్మపురివాడలో తమ్మిదొరసాని
వచ్చె యాశ్వరు దండు వచ్చెదు యెమ్మెలు యెత్తులు యిచ్చోట
నంటివి చెల్లవు
వూరకే పొగులుచు వూగులాడేవు యే తావుమాటలు ఆ తావునందె
అవనిలో యేలాగు అగ్ని రాజెడును? చాతకాని వాదాలు సైచవు మాకు
వెర్రివిగాని వివేకంబు లేదు వదుము కూతల నిట్లు వదరకు
సారెకు సిద్ధిరాజు సాహసుడనుచు మనుచు
ఆరూఢి జెప్పేవు యాదవుల యెదుట చదువు చెప్పిన గురువు చాటడా నీకు

వుపదేశ గురుడైన వాగి చెప్పలేదా?
చెప్పక యుండంగ చెడు గుణము
మీకు
తప్పించగాలేరు ధరనెంతవారు
సజ్జనులకు బుద్ధి సరిజేయవచ్చు
మూర్ఖుల దెలుపను ముక్కంటి
వశమా?
వదరుబోతులు యెంతవారి వద్దనైన
ప్రాప్తంబు లెరుగక పడుదురు భువిని
భూసురాశీర్వాద పుణ్యులౌవారి
దూషించువారును దుర్గతి పడుదురు
భయమెరిగి నీతులు పలుకంగ
వలయు
పట్టభద్రుండైన పశుపతి యెదుట
మొట్టి గోడిగవలె మిట్టి పడియేవు
రాయబారము మాడ రాదాదు భట్టు!
నీతి మాటొకటైన నేర్చుకోవద్దా?
కాకర కాయలు కడుపెద్ద కాగ
చేదు యెక్కువౌనట్లు చెలగె నీగుణము
గాదకొని రోషాలు కొప్పరించుకొని
ఆదలంచ వచ్చేవు అంత కంతకును
దురుసు మాటలవేమి? దుర్భాష లేమి?
చలిచీమ గరిచిందో? జన్ని బుట్టిందో?
వులికి పడుచున్నావు వాక్కొక్క
వేళ
దొర్ల సరసనుండి దొరసితినందు
బర్ల కాపరి కావు భట్టువుగాని
వెర్రెత్తినట్టుల వెక్కిరించేవు
తర్లిపో నీనెత్తి దయ్యము గొట్ట

వుల్లరేడది భట్టి? కల్లలాడితివి
పల్లవ నలసిద్ధి పంపెను నిన్ను
సద్గుణుండని చాల సభవార లెంచి
చదువుల శారదను చాలినావెందు
చదువ నేమగు? సెలవి సత్యంబు
లేదు
అంధుని బోలినట్లైతివి నీవు
మంచివాడ వనంగ మహిపతియొద్ద
కొంచెపు బుద్ధులు కొరగావు భట్ట
ప్రల్లద మాడేవు పుల్లరి యనుచు
చెల్లదు నీ ప్రజ్ఞ చాలించు మికను
నెల్లూర నుండంగ నీతి గాదనుచు
పల్లవ నలసిద్ధి పగగల్గి పంపె
అంపిన వస్తివి అస్తవ్యస్తుడవు
కాక కంపటులు మీ కైరగాండ్లనక
పసుల పాతరలోకి వస్తివిగాక
పసువులు ద్రొక్కని పారిపో భట్ట
పయ్యావు తొర్లించి పడ ద్రొక్క
పొయ్యిని
చయ్యన నొక దిక్కు జరుగుమా
భట్టు!
సిద్ధిరాజునకును బుద్ధేమి లేదు
వద్దని చెప్ప మీ వద్ద ధృతిలేదు
పెద్దవాడవె కాని బుద్ధింత లేదో?
కూతలు పంతాలు నిక్కులు నిన్ను
గబ్బి పసనేరిస్తివి
అర్థుడవు గావంచు ఆవంత గూడ
చేపట్ట డెన్నడు సిద్ధిరాజు నీమాట

యీశ్వర పుత్రుడని యెంతురు
జనులు
కాసుకు కొరగావు గై కోరు నిన్ను
పూజమానుండవై రాజువద్ద వుండ
బాధ్యుండ వనగావు అబాధ్యుడవె గాని
యీడ ఆడని దిక్కులింతియే కాని
యన్నడు యింతేసి యెరుగము
మునుపు
యరసిద్ధి దళములు హేరాళమనుచు
వెరపింప వచ్చేవు వేసాల భట్ట
మందలించగ నేల ముందుగా నిన్ను?
నూర్లు ఆ పై పది నూర్లు లక్షలును
తర్లి రమ్మనకుంటె తలి దండ్రులాన!
యెందరు వచ్చిన యేమి చేసేరు
మండలాధీశుని మాధవుని బలములు
అమిత విక్రమ శాలులు అత్యంత
బలులు
సమరమన్నప్పుడే సంతోష మగును
కొల్లకాంద్ర మూక కోటానకోట్లు
పల్లవల రాజుల బలము లెంచెదము
కాయకున్న పెద్ద కమికెమన్నాడు
దగ్గరికి పోవంగ ధైర్యంబు లేదు
దూరాన బెట్టిన తురాయుల దండు
అలకోల పెట్లకు ఆగదన్నట్లు
ఆశవచ్చిస వారు చేసేర రణము
పోటు మాటుల నెన్నో పోనేర్చు
కొంటివి
వారిధి జూములు వర్షించినట్లు
హేరాళముగ వచ్చి యేమి చేసేరు?
అగ్నితాకు నిమిత్తము ఆడలి
రణభూమి
అగ్నితగులబడి అడవంతగాలు
అంతటి వారు మా యాదవుల నగ
సంతతి రాజుల సమయింప గలరు
యదువంశ తిలకులు యాదవ
పుణ్యులు
అదరు గుండెలులేని అసహాయ
వరులు
బెదరించ వచ్చేవు బెబ్బులి వలెను
తిమరక నెల్లూరు తిరిగిపో భట్టు!"

## రాయశృంగావళి సిద్ధిరాజులను పాండవులతో పోల్చుట

"ధనమది యంతమాత్రము
గొల్లరాజు!
తగవు దప్పితి గాక ధనముకై నీవు
ధనముకై మీతాతలు
ఛావభోదురుగాక
అట్టంట యేమంట యాదవరాజు!
మంచితనంబున మా భూమికి వచ్చి
పశువులు మేపితిరి ప్రఖ్యాతిగాను
గోగణము మేపితిరి కొదవలేకుండ
అందుకు సహియించె నల సిద్ధిరాజు

అదియైన దలపవు యాదవరాజ!
అన్యాయ మగునీది యాదప రాజ !
సత్యముగల సిద్ధిజన పాలుమీద
స్వామి ద్రోహము తోడ సజిగితివి
గాక
యిక్కడ అక్కడ యవరు చూచెదరు
యీశ్వరుండును నీకు యిచ్చెనో లేక
ధర్మ మింతయు లేదు తగదు మీ
బుద్ధి
ప్రల్లదమాడంగ పౌరుషం బగునె?
పాండు భూవరు సుతులు
పరగ నందరును
ధర్మజుకంటెను తగ బుద్ధిశాలి
నలసిద్ధిరాజును నమ్మజాలుదుము
నకుల నందనుకంటె ప్రకట
విక్రముడు

కొమర సిద్ధిరాజును గృహస్థు
డందురు
సహదేవుకంటెను శాస్త్రజ్ఞుడనుచు
పాప సిద్ధిరాజును ప్రజ కొనియాడు
అయిన ఆ పాండవులు అయిదుగురి
కంటె
పాటి సేయగవచ్చు ప్రభువు
సిద్ధిరాజు
ఆ రాజుతో సాటి లేరు యెక్కడను
బయిసి మాలును నీకు బాగులేద్దింక
మా రాజు చేజిక్కి మరియును తిరిగి
యెక్కడికి పోగలడా యీ
గొల్లిరాజు?
పగచెడి మందల పారెదుగాక
చలము శాయక ధనము
చెల్లించురాజ!''

## ఎఱ్ఱయ్య నెల్లూరును ముట్టడించుటను, పద్మరాఘవుడు కుందమాదేవి చిలుకను కొట్టుటను కొమారబంగారము జ్ఞప్తి చేయుట

''పాలితో పాలిగెల్చి ప్రజల
మెప్పించి
మలిదేవి వెంటను మందావులుండ
కడు పట్టభద్రుడు కాటమరాజు
కొలువు తీర్చియు
దాను కూర్చుండగాను
అంతట యేమని యఱ్ఱయ్య పలికె

అన్నరో! వో యావులన్న! ఆలింపు
లేక లేకను గల్గె లోకరక్షణము
పాలిలో పాలిగెల్చి ప్రజల మెప్పించి
అరుదెంచినావు మహానందమనగ
రమ్ము తమ్ముండ! యఱ్ఱయ్య!
అనిపిలిచి
అవుల ప్రవేయించి నందుకు నేడు

మన్నెదుర్గాలను మరి పొడిపించు
ఆవుల మేయుంచినందుకు అరువై
ఆరు కరపట్నాలు అటు పొడిపించు
ఆవుల వేయించి నందుకు ముందు
పసుల వేసిన వాని వల్లద మడపు
ముమ్మారు సెలవిచ్చె తమ్ము
దె్రయ్యకు
వేలి వుంగరము ఆనవాలుగా యిచ్చె
ఆనవాలందుకొని యర్రయ్య అంత
రథసప్తమీ తిధి రవికి పొంగళ్లు
పెట్టించ వలెనని పెన్న వెంబడిని
పచ్చాకు పందిళ్లు పంపించె నతడు
పాలతో పొంగళ్ళు చాల చేయించి
సూర్యునికి చెల్లించి
సూర్యోదయమున
జమిలి మందకు నడుమ
జయభేరి వేసి
సమనేడు కోటుల సంకె ధేనువలు
మిడుతల దండుగా మీరి ఆమందలు
అన్ని నెల్లూరిపై మిన్నంది కదలె
నేల పల్లెలు బెదరి నెల్లూరు బట్టె
వలురాజు మనుమని వార్త విన్నంత
వాగర్రు మేరగా వలనలు దీరె
పెద్దిరాజు కొమారుని పేరు
విన్నపుడె
పెన్నబడి రాజులు వెన్నిచ్చి చనిరి
అరిగెలును మేసె అగిసె గోరాడె
పండు తొగెలు మేసె పనస కోరాడె
నిత్య వెయి పుట్టేటి నిమ్మ గోరాడె
పరువుగల సంపెగలు
పరగంగ మేసె
ప్రొద్దు వెయి పుట్టేటి పొగడిత గాంచు
బొడ్డు పల్లెలు మేసె బోడావు లిలను
నల్లమల తోటలు నర్రావులు మేశ
బుల్లిని అల్లము పురుల మేపించి
కోసేటి రాజనము కొయ్యకరికట్టి
వేసేటి కుప్పలు వేయకరికట్టి
యెండువరి త్రొక్కించి పండువరి
మేపి
వేమాల బావిలో వేసీళ్ల చేది
నలసిద్ధి చూడగావలెనని రాజు
కూర్చు తమ్ముడు తెలిగుడారు నెత్తి
కోరుడు మేపియు కోటపై రాగ
కుందమాదేవుల కూరిమి చిలక
వోడబేరి పంపిన వొప్పుల కుప్ప
వడపప్పు బెల్లము వరుసగా మేపి
పంజరంబున చిల్క పదిలము సేయు
బంగారు గొలుసులు పరగ [illegible]యించి
చిలుకను పంపెను వెలికి కుందమ్మ
చిలుక పలుకులకును చిత్తా[illegible] మంది
వేలుపు ధేనువులు విసవిసలా డె
పసిభాష తెలిసిన పరమ ష ఖ్యుండు
యీ రాజు చెలికాడు యీ
రాజు మరిది
పద్మనాయడుచూచి పరగ వి[illegible]ందె
నాయడు వింటికి నారి యెక్కించె

పిడిపట్టు ముత్యాలు పదివేలు సేయు
యెకుపట్టు ముత్యాలు
యేడువేలు సేయు
తలగడ ముత్యాలు ధగ ధగ మనుచు
సూర్యుని ఆ వింట చూచినట్లుంటు
చంద్రుడు ఆ వింట జ్వలియించు
చుంటు
ౖమానువిల్లు గాదు మరి భూతవిల్లు
పోలురాజు బాణము పొదివెళ్ళదీసి
వాలాడి బాణము వంకలు దీర్చి
తన తమ్ముడును చౌదంతి యేనుగుల
జగ జంతు క్రోల్పులి పామంత
గొల్ల
చట్టువారెర్రయ్య సరగున బిలిచి
రావోయి తమ్ముడా!
రమ్ము యర్రయ్యా!
పందెకు వచ్చిన పక్షులై తేను
యింతకు వచ్చేన యెటొ
పారిపోవు
పోర వచ్చిన చిల్క పోక నిలిచింది
శృంగార వనములో చిగురుమామిడిసి
చిలుక వ్రాలినది కూర్చిన యట్టి
చిలుక
వెయ్యే పంతముగాదు
వెలయంగ మనకు
కోటి గోపకులచే కొవ్వున నార్చి
చెప్పట్లు కొట్టించి చిలుక తోలించు
అస మహా సంతోష మాయెనని పలికె

చలమకులమున బంటు చట్టువారి
యర్రయ్య
చిగురు మామిడిమీద చిలుక
దోలించె
యెగుర దోలిన చిల్కను యేసె
రాఘవుడు
చిలుక బాణము తాకి సిద్ధిరాజు
నగర
వ్రాలె కంబాన ఆ బాణముతోద
బాణము తీయించె పట్టపుదేవి
చిలుకయు మూర్ఛిల్లె ఆపువరి కట్ట
వెంబడి చిలుకను వెస పారవేసి
బాణము తన నగర భద్రంబు చేసే
వింటికోల రాక కాని విడిదికి రాను
పొదికోల రాక కాని బోంచేయరాను
తూరుపు తెల్లవారె తార పొడువంగ
పడమట పొద్దుగూకె బ్రహ్మదు
తెరుగ
పైడిగుబ్బల గొడుగు
పద్మరాఘవుడు
పారటిగె గదలి వచ్చి నిలచెను
చక్కగా దూరాన సర్వేవల్లి
గవనివద్ద
చల్లవారి గోసంగి చమిడినాయని
బొమ్మ
తూరుపు కొత్తకాన తూగుటుయ్యాల
ఆరువేల పిడికత్తులు అనుమనాయని
చెన్ను

పిలిచెను వారి రాచకొమాళ్లు
పావురాలు దోలేటి వయ్యాళి బైట
దేవపూజ గుడార్లు ధేనువు నిలిచె
పెనుగొండ గవనిపద్ద పెరుసాల బైట
పెయ్యల యరనన్న యెద్దులు నిలిచె
కోటసంధున చవుదంతి
కొమ్ము టేనుగుల
జగజంతు క్రోల్పులి సామంతగొల్ల
చట్టువారె్రయ్య సలుగుటెద్దులు
నిలిచె
బాసిగాలు యెద్దులకు బంతులుగట్టె
హళిగురు మంత్రాల ఆవులెద్దులకు
సంగడావుల సంకె సంకల్పమునను
వేలాది యెద్దుల మేలుకొలిపించి
అందెల యెద్దులు అవుగుళాల్ దాట
పెండేల యెద్దులు పేరెములు వార
పొగరుమై సంకెడ్లు పోటు రంకెలు
వేయ
యెద్దులకు యరనన్న యేకాంతమాడె
ముందరావుల ధూళి ముత్యాలమేడ
నడిమి ఆవులధూళి నల్లమేడలను
కోడెల రవధూళి కోటయెల్లక్రమ్మె
రాహిని వాస్వాదాంక లగ్గడీవులుగా
పొడిపించె
కొప్పెర పానకాలు గోపకులచేత
కొల్లలాడించె నల్లులకు బెల్లాలు
జసువయెద్దుల మేపి పరగ ఆమీద
కొలువు దీరిచి రాజు కూర్చుండు
నట్టి

రంతగు ఆ చెల్వరాయి నరికించి
పంతమాడి వచ్చిన పన్నిద్దరు రెడ్లను
పట్టి పట్టుకోకలు చుట్టలు చుట్టి
మందలోకి ఆ రాయి మరి
తెచ్చినాడు
గోలెలు తొలిపించి పాలు పోయిస్తే
గముకులు పొడిపించి తముకు
సేయింప
కానాలి గంగరాజు గడిలోన లేడొ?
పల్లెల పట్నాల పరిజనము లేదొ?
(నగర) సద్యోగమై నరపతులు
లేరొ?
సాకిన గుర్రాలు సైన్యాన లేవొ?
సైన్యాన నవకోటి క్షత్రియులు
లేరొ?
న్యాయశీలుడు రాజు నాడు నెల్లూర
లేడొ? నెల్లూరను లేవైతివో నీవు?
నాడె జగడము సేయక నయములు
పల్కక
యెందు పోయితివోయి వెర్రిభట్టు!
వుప్పరిగ పైనెక్కివున్న మీ దేవి
శరణోయి! శరణు! నీ చెల్లెలిమాట
పరగ కల్యాణము పాపన్న మారు
అన్నల చెల్లెలు అగుమంచి మారు
పందుమల యరణప్ప పైడివారి
తల్లిమారు
ఆడవారు చెప్పేది అపకీర్తి మీకు
ఆరునెలలాయె మా యర సిద్ధిరాజు
వెలికొండ చాలుగా వేటాడబోయె

నెల్లూరి పట్నాన నలసిద్ధి లేడు
కోవూరి మిట్టలకు కోటలై రాకు
మందలో బాణము మళ్ళసంపింతు
అని వేడె శరణంబు అందరు చూడ
శరణాగత బిరుదు చెల్లించు మనెను
రాజు తమ్ముడు యర్రయ్య
అంతటను
అరయమంటే కాచి యాదవ బిరుదు
తన ఆలమందను తర్లించుకొనెను
గజనిమ్మ తోటలు ఘనమైన మేడలు
అన్న మాటకునై విరుగ ద్రొక్కించి
కోవూరి మిట్టలను కోరిక నిలిచె
పళ్ళెము నిండను మాడలు పోసి
పట్టుకోకను పొదిగి పట్టపేనుగుపై
వీటిలో మొయ్యేడు వీథులేగించి
మందలో బాణము మళ్ళసంపించె
వింటి కోల వచ్చెనని విడిదికి వచ్చె
పొది కోల వచ్చెనని భోంచేయ వచ్చె
వారి పళ్ళెరమున వారి మాడలను
వారు పంపినయట్టి పట్టు చీరయును
వారి పట్టపు దేన్గు పరగ నెల్లూరికి
పసుపు కుంకమలకై పద్మరాఘవుడు
పరగంగ దేవికి పంపంగ లేదొ
వదరకు పలుమారు వసుధేశు నెదుట
కదలి రమ్మనుమీ మీ కలవారి నెల్లి!"

## రాయశృంగావళి గొల్లల వెంగలితనమును పరిహసించుట

"వోయి బంగుడుభట్టు! వానరంగ
వినుమ
యింత గర్వంబేల యీ మందలోను?
అప్పుసొమ్ము డిగితే అదిరదిరి పడెదవు
పొగురు డీకొల్పుచు పోరేటిమీద
వడి రంకె వేసిన వార్త నిజమాయ
రూపంబు గలిగితే కోపంబువచ్చు
కోపంబు బ్రహ్మత్య కొనితెచ్చు నట్లు
మీ సీమ కరువైన మా సీమ కొచ్చు
నాడెందు బోయెను నపుడు కోపంబు
యెందు బోయెను కోపము యాదవ
రాజు!
మేతనీళ్ళసు లేక మేనులు డస్సి
పాలేమి లేకుంటె పశువుల తోలుక
వచ్చి మా భూమిలో వదిగి
యుండియును
నలిని ధర్మాత్ముండు నలసిద్ధిరాజు
నెల మూడు వర్షాలు నెల్లూర గురియు
మీరు వచ్చిన మొదలు మేపులు గలిగి
పచ్చి పూరిని దిని పశువులు బలియు
ఆ పాలు త్రాగి మీరు ఆడనేవచ్చు
అమిత సత్యవ్రతుడు ఆ సిద్ధిరాజు
తిమిరి పలుమారు నిందించేరు సారె
రామరామా! అనని రంగెంతురోయి

పాపంబు యెన్నటికి పాపుకోగలరు?
కాశికి పోయిన కడ తొలిగి పోదు
ధరణికి నెంతయు తాలిమికద్దొ
అంత తాలిమి కద్దు అవనీశ్వరునకు
యీవికి కర్ణుండు వితరణశాలి
సత్యహరిశ్చంద్రు సరిసేయవచ్చు
ఆడిన తప్పడు అవనీశ్వరుండు
వకపాటి రాజైతె వోపిక గలదు
మేలైన కోరుదల మేపితినంటివి
నీరబుట్టిన పూరి కోరనిచ్చితిమి
గడ్డి భవిష్యానకు ఘనుడు సిద్ధిరాజు
యాల కనిపించుకొను యెరుగరు
మీరు
చిలుక జంపితిమని చెప్పేరు ప్రజ్ఞ
చిలుక జంపను రామ చిలుకెంతగద్దు?
వోడపేరుల చాత వొప్పైన చిలుక
తెమ్మంటె దీవుల తెత్తురొక లక్ష
చిలుక మాత్రమునకు సిద్ధి
భూపాలుడు
అలుక చేసునటోయి! యాదవరాజు!
నిండిన చెరువుల నెరయ త్రవ్వితిమి
పండిన చేలెల్ల పరిచేస్తి మంటిరి
యెంతైన కష్టపడి వేయిస్తెగాక
మొగలిగున్న చెరువు మొగ్గలెట్టగను
అది పౌరుషంబని అనుకొనదగదు
శృంగార వనములు చేకొని నరకి
రంగైన పూదోట రాచ అవులను
మేపితి మంటిరి.........
ప్రోదిచేసి వనములు పోషించవలెను
చీడపురుగులు చేలు చెరిచెయ్యంగ
బయటి తోటలనన్ని వరిజేస్తి మ టిరి
కోటలో మేలైన తోటలు లేవ?
రసవర్గములు పండు టాకులు లేవ?
కోపించి చలువరా కొట్టి నరికించి
గోలెలు దొలిపించి గోక్షీరములను
పోయించి అందుల పోషిస్తి మంటిరి
మతిభ్రష్టు గొల్లలకు మరి బుద్ధిలేదు
కొంచుపోయి యాదవుల
కూర్చుండరాద?
అడవుల యందును తిప్ప లేకుంటె
పరగ దొనకొండను వప్పంగరాద?
అది జూచి హర్షించు అయితమరాజు
మేలు మేలని చాల మెచ్చును
మిమ్ము
తెలియకపోయ మీ తెలివెంచనేల?
వెను కచింతించుట వెర్రిపనిగాని
రాయి కావలెనని రాజు నడిగినను
దాని మీరిన రాయి దయసేయు
మనుసు
మీరు చేసిన చాత మీకు తగుగాక
వెర్రి గొల్లలు మీరు యేమిచేసినను
మనసున నుంచడు మా రాజ
ఘనుడు
అట్టి సాత్వికునిపై అలుకతో మీరు
కొంచము అట్టిట్టంటిరి కొలువు
లోపలను
చల్లని నీళ్ళను సముద్రాము దాక
మెల్లనే పారును మితిమేర లేక

తిన్నంగ వున్నంగ తిమిరేరు గాక
పులులతో స్నేహంబు పొసగ
భుజగముల
పొందు చేసిన వారు పోదురు కొద్ది
వోట్రించి పలికెదవు వక
గొప్పగాను
గోంద్ర కప్పకు నోరు గొప్పది లేద?
దెబ్బల యెలుగువలె బొబ్బరించెదవు
దబ్బర కాదు మా ధనమును యిపుడు
గొల్లవంకరబుద్ధి గొబ్బున మాని
చెల్లించుమీ రాజ! చెడిపోక మీరు''

## కాటమరాజు కోపించి, సిద్ధిరాజుభట్టును శిక్షింప నెంచుట

ఆ మాటలను విని అధిక కోపమున
గమకించి కాటమ కాంతి చంద్రుడు
కన్నులెఱ్ఱగజేసి కనుయెదుటనున్న
తన మరిది పంకను తప్పక చూచి—
"నాయడ! వినవోయి!
నా చిన్నమరిది!
వెలలేని సంగడీడ! వెలమ
నాయండ!
పాయరాని సంగడిడ!
పద్మనాయండ!
కులమున వెలమ! నా చెలిమిని గొల్ల!
చెలికాండ్ల చిత్తమ! చెరగున పైడి!
గట్టిగా యీ భట్టు కడుక్రొవ్వి
యెదుట
మాట మాటకు చుల్క మాటాడుగాని
గొల్ల గొల్లని యంత క్రొవ్వియున్నాడో
వ్రేలగట్టి అమ్ముల వేయించ వలద?
చూచేటి నయనాల సూదులు గ్రుచ్చి
తిత్తి వలిపించియు తిమురులు అణచి
మందలో మ్రోయించి మన రణభేరి
గుభులు గుభులున గుండె
ఘూర్ణిల్లగాను
వాయింగ వలదటో
పద్మనాయుండ!"

## దూత అవధ్యుడని పద్మనాయుడు కాటమరాజును వారించుట

ఆ మాటలకు భట్టు అతి భీతి పొంది
గడ గడ వణకుచు కడు వేగమునను
పద్మనాయని వెనుక భట్టు తా నిలిచె
కోపంబు గల రాజు కోపంబు తొలగ
పద్మనాయడు మంచి వాడౌట చేత
కాటమరాజుతో గక్రున ననియె!
"కాంతి చంద్రుండ! వో కాటమరాజ!
నిజలోక పుత్రుడ! నీలవర్ణుండ!

వంచన గల యట్టి వసుధేశగండ!
పెంపున వినవయ్య పెద్దిరాజు
కొమర!
భట్టన బ్రాహ్మణ ప్రవరుడనంగ
వుభయ దళాలకు వుర్విలింగాలు
భట్టును బ్రాహ్మని కొట్టినవారు
తిట్టిన వారును ధృతినెందు లేరు

ఆదిగాక వకరాజు అంపెను గనుక
పగరాజు మాటలు పలుకక తగదు[6]
మన భట్టు పోయిన మనమన్నమాట
పగరాజు వద్దను పలుకక తగదు
వారికి కట్నాలు వలనుగా యిచ్చి
వారి భూమికి భట్టును వసుధేశ పంపు''

## కొమార బంగారము గొల్లల గొప్పతనమును కీర్తించుట

అనియాడు మాటకు యాదవభట్టు
గొనకొన్న పులివలె కొలువులోపలను
పలికె పల్లవరాజు భట్టుతో నతడు—
"మాటమాటకు గొల్ల గొల్లదని చెప్పు
ముదముగా యీభూమి మోసెను
గొల్ల
తరికొండ లాగంగ త్రాడాయెగొల్ల
సాగరము రెక్కల చల్లెను గొల్ల
వేడుక క్షేపల్లె చెలదుల గూడి
కొల్లలాడిన వాడు గొల్లతడు కాడ?
కన్నులు తెరువని చిన్నబాలుండై
కోపించి శకటంబు కూల్చెను గొల్ల
ముద్దుల బాలుడై మూర్ఖవ నెలను
దానవి చనుబాలు త్రాగెను గొల్ల
యాడాది కుర్రడై యిల తృణావర్తు
మెడబట్టుకొని వాని మృతిచేసె గొల్ల
తల్లి వెన్నలకునై తను రోలగట్ట
కొమరుడై మద్దులు కూలంగయీడ్చె

ముద్దు గోపాలుడు మూరితి గొల్ల
వత్సుని జంపిన వాడును గొల్ల
శబలుడై ఖరదైత్యు చంపెను గొల్ల
యితడు సామాన్యుడే యెంచిచూడంగ
బ్రహ్మదేవుడు గొల్ల పశుపతి గొల్ల
బ్రహ్మసుకన్న శ్రీపతియును గొల్ల
పావనరుద్రుడు యేర్పాటైన గొల్ల
దేవేంద్రుడును గొల్ల దివిజులు గొల్ల
భావింప రుద్రుండు పరగంగ గొల్ల
మా కులమున బుట్టె మదనగురుండు
మా కులంబున పుట్టె మరియు
సూర్యుండు
మా కులంబున బుట్టె మరియు
చంద్రుండు
మా కులంబున బుట్టె మౌని గణంబు
మా కులంబున బుట్టె మరియెవ్వ-వేది?
అవునోయి భట్టు! నీవాడు కోతగును
గొప్ప మాటల నెంత కొప్పరించేవు

6. తగదు—తప్పదు.

భట్టు నంచుసువచ్చి బైసిపోవుటకు
కాటమేశ్వరు నిట్లు కారులాడితివి
దేవేంద్రు డెక్కిన దివ్యరథంబు
భావజ హర వరభక్తుండు యెక్క
పరులకు వెన్నీని బాహు బలుండు
పరకాంత తల్లిగా భావించినాడు
యిటువంటి రాజు కనుయెదుటను
నిలచి
తాటోటు మాటలు తప్ప బలికితివి
సుగ్రాన నుంటివో చూడునామంద
వుగ్రసింహము కోరలు వూచంగ
తరమె?
బెబ్బులి మీసాల పెనగాడ నలవె?
వరసి రాజును చెనక వకరాజు వశమే?
మరసి రాజును చెనక మన్నీల
కగునె?
పారిపోవగ చంపు పోర బొమ్మగట్టు
పేరుగల దొరలకు పేటులెత్తించు
జారి పోయినవారి చంపు నిశ్చయము
తత్తరించకు భట్ట! తడబడకు సభను
మిత్రాన కంపటీలు మీర యెద్దులును
కాటమ ప్రభువెంట కదలి రాగాను
శత్రు రాజులు చెదరి చెలకట్టరైతి
మాధవుడు మీభూమి మగుడి
వచ్చినను
మన్నె రాజులకెల్ల మదములు దీయు
మేవకుడ! వో భట్ట! మెరవ బొమ్మేవు
వూళ్ళు పుడ్డాటెను వునయగిరి బెవరె
సావిళ్ల సందనాగె చంద్రగిరి బెవరె

త్రోవ చూచుకొనియు తొలిగేది లెన్స
గ్రహియించవో భట్ట! ఘనుని
మందకును
మేడలు చూస్తివి మాడలాసకును
కోడలు ద్రొక్కని గోకులం బెల్ల
అలసవైతివి భట్ట! ఆస్థానమునను
పొసగించు నుడిలేదు బొంకేది తరుచు
వస్త్రాగు పిట్టవలె వదరేవు చాల
పోక పోకత్తెనో పొదిలేవా గాక
తిక్కయెత్తెనొ లేక దెస తప్పినావొ
ప్రత్తి గింజల వలె పండ్లు తెరచెదవు
నూతిలో కప్పవలె కాతరించేవు
ఆ రాజు భట్టుగా అర్హుడవు కావు
పూజారివై పూళ్ళ పొట్టబోసికొను
తల్లి పోగొట్టగా తంబళి కాన
గేలి మాటల చాత గెల్తురటోయి!
కూడు లేదంటివా కులకాయకమున
కారదవుల కేగి కట్టెలు గొట్టి
కాసు కమ్మక నీవు కడుపు పోసు
కొను
భట్టవా భారంవు భట్టవు గావు
భట్టవా నీవు యెంభట్టవు గాని
యుద్ధము శాయక వసగము ధనము
సిద్ధిరాజును రమ్మను శ్రీఘ్రంబు నీవు
యేసీమ రాజులకు,.....
తాలిమి దివ్యాయుధముల పోట్లాడ
మా రాజు కాటమ క్ష్మాపాలు డిపుడు
ఆవుల కొమ్ముల ఆయుధాలు చేసి
యేనుగునకు యెద్దు అశ్వానికావు

తరుపుకు తట్టువ బంటుకు బంటు
రాజుకు రాజు కాలారికి కంపటీడు
మీ సిద్ధిరాజుకు మా యెద్దుకాలి
బొమ్మ
రణము కాయగ యెత్తి రాగ
మారాజు
తల్లి రాని రాజుకు తరుపు
పొలిబొమ్మ
చెల్లిరాని రాజుకు చెడికాలి బొమ్మ
కదిలి రాని రాజుకు మా గండుకాలి
బొమ్మ
రాకుంటె దిగుపంతము రమ్మను వేగ
వేగమె సిద్ధిరాజును వెదలి
రమ్మనుము
పట్టు కోకల జుట్టి పలుపుగా పెనచి
నాకు పెనచుటగాదు మీ కల్లి యందు
తగ సిద్ధిరాజులకు దామెన పలుపు"

## కాటమరాజు సిద్ధిరాజుభట్టుకు కట్నములిచ్చి అంపుట

అని భట్టుతో చెప్పిఅందరు చూడ
వినయాన కట్నాలు వేగ తెప్పించి
పంపించె పశుపతి ప్రజలెల్ల మెచ్చ
అంపించె సంతోష మధికంబు గాగ
వచ్చెను నెల్లూరు వడి మీర భట్టు

## ఫలశ్రుతి

యిచ్చెను శంభుండు యిహపర
సుఖము
యిది విన్న వ్రాసిన యిష్ట
భోగములు
సదయుడై యిచ్చును సర్వేశ్వరుండు
కాటభూపాలుని కథ యవ్వరైన
వాటంబుగా విన్న వసుదేశ్వరులకు
రాయబారంబని రంజిల్లు జగతి
ఆయు రారోగ్య భాగ్యంబులు గలిగి
పూజ్యమై యీకథ పూర్ణమై
యుందు
శ్రీ మంగళ మహా......

# కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ

## సిద్ధిరాజు పంపిన భట్టురాయబారము విఫలమగుట

అంత నా భూపతి యాదవులు కొలువ
సంతసంబున సభాస్థలి నుండగాను
నలు వెంద నెల్లూరి నలసిద్ధిరాజు
చెలిమితో బంపిన చెలగి ఆ వేళ
రాయభూషణ సుతుడు రాజుల భట్టు
రాయభారము వచ్చి రంజిల్లివేట్క
పశువుల మందలో ప్రబలుచున్నట్టి
పశుపతి పొడగాంచి ప్రస్తుతించియును
అసమాన ధీరుడై అప్పుడిట్లనియె
"వసుధాధిపతికి వడబడినట్టి ధనము
యిచ్చి యివ్వక నీవు యిటువలె
నుంట
మంచి కార్యము కాదు మా మహారాజు
పుల్లరి ధనముకై పొసగ నన్నంపె
పల్లవాధీశ్వరు పైకంబు యిచ్చి
పోవుట వుచితంటు భూపాల?"
అనగ
"అవుర మిక్కిలి క్రొవ్వితివి యదట
నిలచి
గద్దించి పలికిన గర్వంబదంతు
యుద్ధంబు శాయక వసగను ధనము
సిద్ధిరాజును వేగ చలగి రమ్మనుము
బుద్ధిగలిగియు భట్ట; పోపొ"మ్మ
టంచు
పట్టుకోకను వక్క పలుపుగా మెలిచి
భట్టుకు మెడజుట్టి పరగ భూపాలుడు
అనియె నా భట్టుతో అందరు వినగ
"నిను జేయుటనుగాదు నీన్నేలు
రాజులు
యేవురి మెడలను యింపొందు కట్టి
తావున యిట్టులే దామెన యనుచు
తెలిసియుండగ నీకు తెలియ
జెప్పితిమి
తలకకు"మని భట్టును దగ్గరకు
పిలిచి
ఘనవస్త్ర భూషణ కలితుగా జేసి,
"యినకులాధీశ్వరులు యేవురిని
యిపుడె
పైనమై రమ్మను బలముల గూడి"
అని భట్టు బొమ్మన్న యాదవరాజు
ఘనమైన యట్టి గోగణముల మంద
తనరుచు నున్నట్టి తావును గడచె
నెడనెడ వణకుచు నెల్లూరి త్రోవ
కడు వేగమున భట్టు కదలిన వెనుక

## కోటపాటి నుండి తాటికమ్మను తెమ్మని కాటమరాజు చట్టువారి యెఱ్ఱయ్యను నియోగించుట

అంత కాటమరాజు ఆ మరునాడు
మంతనంబున తన మరది కిట్టనియె:

"పరగండ భైరవ! పద్మలాఘవుడ
నరనాథుడై నట్టి నలసిద్ధరాజు
పూజితుడగు రాయభూషణసుతుని
పేజీబుగా నంపె యీ మందలోకి
ఖట్టు వచ్చినయపుడె పగ నిశ్చయంబు
ఘట్టిగా తెలివిడిగా మదిదెలిసె
అన్నదమ్ములు మనము
అందరొకలైతె
పన్నుగా పగవారు పై కాయలేరు
కమ్మలో యీ వార్త గట్టిగా వ్రాసి
తమ్ము డైతమరాజుకు దండు
రమ్మనుచు
అమ్మ వున్నపట్నానకు అంపవలె
కమ్మలు
సమ్మతంబుగా మంచి సౌరని ఆకు
కొనగల మోవాకు కుదురు చక్కనిది
కనుగొన మందలో కమ్మ దొరక''
దన
అందుకేమని నవ్వి ఆ రాఘవుండు
మందర ధీరుతో మరియు నిట్లనియె
''కొనగల మోవాకు కోటపోటియ్యను
వనరగ నున్నది పుర్వి నెన్నగను''
అన నగుచు మరదితో అవనీశుడనియె
''తాటివృక్షంబని ధర నెన్నుటంతె
తాటి వృక్షముకాదు దనుజులతోట
కుదురు పొడుగునుజూడ కొండలైయె
తోచు
అది మతంగుల కొండ అగును
ఛో మరిది!
రాజాధిరాజులు రాపోని తావు
గాజుకొండకు అసుర కావలున్నదియు
కొప్పుకొండను పెద్ద కోర పందొకటి
యెప్పుడా తరువున యామరక
యుండు
గచ్చయు కోరింద కలియ
బలిసినను
అచ్చుగా తరువున అల్లియున్నదియు
మొగబంటు లెవ్వారు మోవాకు తేను
తెగువ యీ మందలో
ధీరులగువారు?''
అనిన భూనాథున కనియె రాఘవుడు
''భీమబలుండను బిరుదు పొగిడించు
సామజంబుల వైరి చట్టువారెర్రు
వున్నత సత్త్వుండు వగి శూరు''
దనుచు
పన్నుగా బలుకుచు పద్మరాఘవుడు
అప్పుడు తిలకించె యఱ్ఱయ్య వంక
అప్పుడు చూచిన అతివేగమునను
భీకర శక్తితో పృథివీశు నెదుర
ముకుళిత హస్తుడై ముందర నిలిచి
''కాట భూపాల! వో కాంతి
చంద్రుండ!
మాట మాటకు అతి మాత్ర
పౌరుషము
యేమని చెప్పెదము? యెంత
మాత్రంబు?
భూమిలో అదియొక్క భూరి చెప్పితివి
ఘన ఘంటలో గల మగవీరు లెన్న

ఘన శౌర్యములు గల కదన
సాహసులు
వకరి కంటెను వకరు
వుత్తమోత్తములు
ప్రకటింపనేల నీ బలముల గూర్చి?
మొనజేసి నన్నంపు మోవాకు దెత్తు"
అనగ యా నలనన్న అల సహోదరుని
భూషించి యా వేళ భూపాలు డపుడు
ఖాషా చమత్కారి పద్మరాఘవుడు
కర్పూర గంధము కస్తూరి అగురు

పుష్పాడి గందవాడి పునుగుజవ్వాజి
తెప్పించి యిచ్చిన తెరగొప్పనంది
అప్పుడు రాఘవుం డనియె తమ్మునికి
'సాహస విక్రమశాలి! యర్రయ్య!
బాహుబలంబున పైనమై వేగ
పనివడి యా కోటపాటికి నీవు
వనరంగ పోయి యా వక తాటికమ్మ
అనురక్తి తెమ్ము నీ' వనిన
యర్రయ్య

## ఎఱ్ఱయ్య తాటికమ్మ కొరకు కోటపాటికి బయలుదేరుట

ఘనవేగమున విడిది కడకేగి
యపుడు
అనువైన కొత్త చల్లాణము తొడిగి
కనకాంబరము గట్టి తలను గొజ్జంగి
పూల దండలు జార బూన్చి తలపాగ
తెలివైన వనమాల తిరుమణి
నొసలికి
అణిముత్యాలను అమరు శలగోల

వేణువాద్యము తగ యడమ
భుజమునకు
గండ్ర గొడ్డలి పూని కరమున బాకు
కుండలంబులు కర్ణకోటి కింపెసగ
సందిట తాయెతులు సరికొత్త
మెరయ
విలసిల్లు గోడిగలు వెంటనే తేర
కొలువగా యెఱ్ఱయ్య కోటపాటికిని

## తాటి వృక్షమును కాచుచున్న రాక్షసిని, పందిని, గండు చీమను ఎఱ్ఱయ్య జయించుట

రాగ అచ్చట వక రాక్షసి చూచి
తేజమై జనులెల్ల దిగులు కొనంగ
కొండ గాసెడి గాజుకొండ
దానవియు

మెండుగా వచ్చియు మిడిగుడ్లు కొలిపి
కన్నుల నెర్రయ్య గద్దించి దైత్య
పండ్లు గిటుచు రాజు భయపడ
బొబ్బ

రింపుచు రాగాను యఱ్ఱయ్య అపుడు
రప్పెర్లు కొట్టేటి రాకాసిని చూచి
భీకర శక్తితో పృథివి యల్లాడ
ఆకొన్న పులివలె ఆగ్రహంబెసగ
గొడ్డలి త్రిప్పుచు కొట్టగా అదలి
వడ్డు కూలిన క్రియ వసుధ మూర్ఛిల్లి
తెప్పిల్లి రాకసి దేహంబు స్రుక్కి
తెప్పు తెప్పునబడి తిరిగి చూచుచును
వడి వడి నా తరువు వదలి
కొండలను
పడిపోయె అంతట పంది
వక్కటియు
పొదలోన నుండి ఆ భూమీశు
గనుచు
మదియించి కోరలు మాటి మాటికిని
వదకొని చరియించి వడి గీటు
కొనుచు
యెదురు దాకినయంత
యఱ్ఱయ్య దాని
రెండు కొమ్ముల బట్టి దండి
రోషమున
మెండుగా మోచేత మోకాట మెదిపి
పెరికిన నా పంది పృథ్విపై వరిగి
సొమ్మసిల్లియు కొంత సేపటి దాక
దిమ్ముపట్టగ నుండి తెలిసి
దిక్కులను
కురుచ బారిన గోవ కోడె చందాన
చూచి చోద్యమైన చొప్పున అనుచు
కొమ్ముల వేగడ కోరి యా పంది
దవ్వల నైనయగ దండి వేగమున
పోయిన పిమ్మట భుజగంబు లెల్ల
దాయగా వచ్చిన తరిమిన పుట్ట
దిక్కుల గానక తిరిగి వేసారి
యక్కడ చంపునో యీ రాజటంచు
కారాకు క్రిందుండె గండు
చీమయును
హేరాళముగ వెడలి అర్ధంబు నడువ
అచ్చట ఆ చీమ నరికాల రాచి
గ్రచ్చ కోరిందయు కడకు పోనొత్తి
నిగ నిగ నామంబు నిలువున దోప
తరువున నుండి అంతట నిట్టులనియె

## ఎఱ్ఱయ్య కొమ్మకు మారుగా తాటివృక్షమునే పెకలించుకొని వెనుదిరుగుట

"పరగ కాటమరాజు పద్మరాఘవుడు
పరువున వక్క తాటిపత్రమ్ము తెమ్ము
అని నన్ను బంపినా రంతియే కాని
అసురశక్తితో బోయి అంతట నన్ను
ముదురు లేతయు చూచి మోవాకు
వకటి
సదయుడు మా బావ చప్పకపాయ

యిది యది యని యెట్టు లెరుగుదు
నేను
వుదురు బిడుకున వచ్చి పోవగా
నేల ?
చప్పని పని యొకటి చెట్టాకు వకటి
వప్పుగా గొంపోవ వలవదు నేను
వ్రాలాకు కమ్మలు వారికే తెలియు
యీలాగు చింతింపనేల నా కనుచు
పెంపైన యాతాడి పెకలించి నేను
కొంపోదు మా బావ కొలువులో
కంత''
అని నిశ్చయము చేసి ఆరాజఘనుడు
వనరగ వుంగరంబుల చేత తరువు

వూచి మాచియును మ్రానొక కొంత
సేపు
అచ్యుత వరభక్తుడు అత్రేయ
గోత్రుడు
అలనాడు రామ కార్యార్థమై పోయి
తెలివొప్పు సంజీవి తెచ్చిన వాయు
నందను తన మది నపుడు ప్రార్థించి
అందున్న పక్షులు అట్టిట్టు చెదర
కుదురైన యామ్రాను కూకటి వేళ్ళ
పదపడి పెకలించి పటు శౌర్య
మహిమ
చక్క బోవగ మళ్ళి సాహసంబునను

## కోటపాటి రాజు ఎఱ్ఱయ్యను అడ్డగించి పరాభూతుడగుట

పెక్కు బలములు వచ్చి
భీకరాకృతిని
కొని పోవు చున్నంత కోటపాడేలు
మనుజ నాయకుడును మన్నీల గూడి
యెదిరించి 'నీవు యెందేగుదు ?
నిలువు !
యేది నీ యూరు? నీ వెవ్వర?' వనిన
తాడిని చేబూని తరిమి యఱ్ఱయ్య
దూడ లావుల దొడ్డి తోలిన యట్లు
కోటపాడేలేటి కుంభినీశ్వరుని
కోటలో చొరద్రోలి కోట తలుపులును

వేసిన పిమ్మట యఱ్ఱయ్య పలికె:
"పశుపతి నలనన్న పద్మరాఘవుని
యెఱుక లేకను తలుపు లెవరు దీసి
నను
ధరణిలో తోకకు తగిన బందెయును
తియ్యక విడువము తెలిసుండు
డనుచు
వెయ్యేసి విధముల విన జెప్పితింతె''
అనుచు వేగమె తాడి నటు గొంచు
వచ్చె.

## తాటివృక్షమును పెకలించి తెచ్చిన ఎఱ్ఱయ్యను కాటమరాజాదులు ప్రశంసించుట

అనువొందు నలనన్న ఆప్తవర్గంబు
కొలువుగా కూర్చున్న కొలువు
లోపలను
పొలుపుగా కూర్చున్న బుధ
జనోత్తములు
భటులు గాయకులును బహుమన్నె
వారు
పటు ప్రవీణులు వీరభటులు
గోపకులు
చౌషష్టి విద్యల జనపాలు రంత
"అవుర! యీ క్రియ నెన్న అజునకు
వశమె?"
అనుచు భూసురకోటి ఆశీర్వదింప
వినయంబు తోడుత యర్రయ్య
అపుడు
కొనగల సురమాను గొబ్బున దెచ్చి
ధనకొండకును జాబు దనర వ్రాసేది
గానకాని యీరాజు కొలువతో
నిలువ
అందుకు నలనన్న అతి సంతసిల్లి
మందర ధీరుండు మరిది కిట్లనియె:
"ఆత్రేయ గోత్రుండు అసహాయ
శూరుడు
యీ చట్టివారెర్రు యంత ధీరుండు!
తాటాకు దెమ్మన్న తటుకున బోయి
తాటివృక్షము దెచ్చి తగనిల్పె నిచట
అతులిత భుజశక్తి అతి పరాక్రముడు
యితనికి సాటిగా నెంచగా వినవె
ధరమున్న అంజనీతనయుని వకని
పరగంగ ఆ సింహబలుని వక్కరుని
యిరవుగా భూప్రజలు యెన్నుదు
రెపుడు
సరిశాయ వారిలో సమమైన శక్తి
పరికింప నాల్గవ భాగంబు కలదు"
అని చాల హర్షించి అవనీశ్వరుండు
ఘనమైన కస్తూరి గంధంబు పూసి
కప్పుర విడియంబు ఘనతతో నిచ్చి
అప్పుడు వ్రాలాకు కనువైన కమ్మ
కత్రించి ఆ వెన్క 'కడువేగ తాడి
చిత్రవేగంబున చెలువొప్ప మునుపు
యక్కడ నుండే అ తావునందు
మక్కువ నీ తరువు మరినిల్పి
రమ్మ!'
అని వేగమున నంప ఆ యరనన్న
మునుపు దెచ్చిన తావు ముదముతో
చేరి
పాదులో నా తరువు పదిలమై యుంచి
మరలి గ్రక్కునవచ్చె మది సంతసిల్లి
సరస నలనన్నకు సముఖాన నిలిచె.

## కాటమరాజు అయితమ రాజాదులను యుద్ధమునకు సాయము రమ్మని లేఖలు వ్రాయించుట

పెద్దిభూపాలుని ప్రియ తనూజుండు
వద్దిక రాఘవుండు వనర మెల్పునను
తలకొని ధనకొండ ధరణీశ్వరులకు
చెలగుచు లేఖలు చెప్పివ్రాయింప
భాసుర కీర్తి ప్రధానశేఖరుడు
లేఖలు వ్రాయను లియించి చదువు
ప్రాకట ఛప్పన్న భాషాధికారి
కాట భూపాలుని కరుణ తోడుతను
మేటియై ప్రభవొందు
మితభాషణుండు
కందర్ప సాటిగాగల రామచంద్రు
చెలగుచు పిలిచి ఆ జనపాలు డనియె:
"చెప్పెదవిను రామచంద్ర!
వివరంబు
ప్రమదమున మా బావ పల్లికొండకును
కొమరక్క సిరిదేవి కోర్కెయిద్దరికి
చెలువొప్ప మన యోగ క్షేమంబు
వ్రాయు
చెరుకూర అలనాడు చెల్లిన రాజు
తెలియ జెప్పిన వార్త తేటగాయిపుడు
తలపులో బారంగ తగ నొప్ప
వ్రాయు
కరుణతో అంతట కరియావులన్న
వరుసతో ఆవెన్క భట్టావులన్న
అంత అయితమరాజు అవనీశ్వరునకు
పుత్తమరాజుకు పొందుగానీవు
వేయి భంగుల గొప్ప విన్నపముగాను
మా యోగక్షేమంబు మరి వేగ వ్రాయు
అటమీద యీకయ్య మయ్యేటి వార్త
వివరంబు
తటుకున వ్రాయుమీ దండు
రమ్మనుచు
పసుల మేపిన వార్త పసుల
జంపినది
పసుల జంపిన యట్టి పాపాత్ము
వార్త
మదిలోన పగవారు మడియింప గోరి
యెదిరించి యిచ్చోట కదిసిన వార్త
పదివేల విధముల బాగుగ వ్రాయు
కదలి రాగలిగిన కలియ వచ్చేది"
అని రామచంద్రునకు అవనీశు చెప్పె
వినయాన లేఖలు వివరంబుగాను
పల్లికొండకు నపుడు ప్రత్యేక
మొకటి
తల్లిసిరిదేవికి తాల్మితో వకటి
బాలరాజులు వుండు పట్నాని
కొకటి
వాలాయముగ వ్రాసి వైనాన జూచి
తప్పొప్పు లేకుండ ధరణిపుడు
వినగ
అప్పుడు లేఖల నన్నియు జదివె
విని చాల వేట్కను వేగంబె రాజు

వనధి గంభీరుండు వంశ వర్ధనుడు
తన వ్రాలు చేసిన తగు లేఖలన్ని
ఘనముగా జలతైను కడు
చంద్రికలును

వరుసతో జేసియు వైనాన బట్టి
వురు వైన తన చేతి వుంగరంబునను
లక్క ముద్రల జేసి గ్రక్కున
నపుడు

## కాటమరాజు కాలారిచే కమ్మలను దొనకొండకు పంపించుట

శబురున నా రాజు కాలారి బిలిచి
కాలారి చేతికి కమ్మలందించి
'వైళంబె కమ్మలు వైనాన గొంచు
బాలరాజులు వున్న పట్టణము పోయి
బాలరాజులకును పల్లికొండకును
వ్రాలు కమ్మల నిచ్చి పరల వేగమున
చదివించుకొని దండు సన్నాహ
ములను
యదుకులాధీశుల యిటకు
రమ్మనుము'
అని చెప్పి కాలారి నపుడు బోధించి
అనియేక వివరాల అతనితో దెలిపి
అమరంగ చద్దిమూటంత గట్టించి
కొమరొప్ప నా దనకొండ కంపించె
అంతట కాలారి ఆ కమ్మ గొంచు
అతివేట్క ధనకొండ కంత నేతేర
ముదమొప్ప నడుదారి మునిసి గాంచి
యందు

వుదకము చేరువ వనరగా నిలిచి
మునిలోన గావించి ముఖమార్జనంబు
పొసగ తిరుమణి చాది బొట్టు
ధరియించి
పలు తెరగుల సూర్యప్రార్థనము చేసి
ముదమొప్ప ఆ చద్దిమూట యు విడిచి
సదయుడై కడుపార చద్ది భోంచేసి
జలముల చేతుల చయ్యన కడిగి
చలగుచు సవరించి జతనాన లేచి
తడవు శాయక అందు తరలి వేగంబె
పడమట అరజాము
పరియంత మునకు
ధనకొండ పట్నంబు
తాత్పర్యమునకు
ఘన వేగమున జేరి కాలారి సూడ

## దొనకొండ పురవర్ణనము

ఆవేళ ధనకొండ అతి సంభ్రమ
మున
దేవేంద్ర భోగమై తెలివి దీపింప
అలర వాద్యములును అంగళ్ళవెంట

చలగుచు ఘోషించు శంఖ కాహళులు
ఘుమ ఘుమ వాసించు కుంద జవ్వాజి
కమనీయ మగు మంచి కస్తూరి అగురు
యే దిక్కుచూచిన యెల్ల భాగ్యములు
శోధించి చూడనే చోద్యమై యొప్పు
జాజి మించిన మంచి జాతి సెంపెంగ
భావింప మొల్లల పరిమళంబులును
ఆ బావులను జూడ అమృతోదకములు
మెలికల సోపానములు మించి యుండు
యే గరిడిలో వారి నెలమి గై కానిన
వకరి మించినవారు వకరు శూరులును
యే కవీశ్వరునితో యెదిరి భాషింప
ఆ కాళిదాసాదు లనవచ్చు కవులు
యే గృహంబున జూడ హెచ్చుకళ గలిగి
బాగైన చిత్తరువు ప్రభవింపు చుండు
యే సావిడిని కొలువెవరు కూర్చున్న
భూసురాశీర్వాద పుణ్యవర్తనులు
ఆ సభాపతియైన అయితమరాజు
వాసవు నట పోలి వసుధ నింపొంది
మేడలు మిద్దెలు మేలు చవికెలును
వాడలు శృంగార వనములతోడ
వప్పైన ధనకొండ పూరి ముందరను

చప్పు చోద్యంబైన చాలు రావులును
అచ్చట గలిగిన అటకు చేరువను
రచ్చగా కూర్చుండి రాజు తమ్ముడును-
అమ్మనుజాధీశు అల్లుడై శట్టి...
ముమ్మయ్య-పోచయ్య ముద్దు బాలురును
కొమరొప్ప జగజంపు గొడుగులనీడ
ఆమరంగ బొంగరా లాడుచు నుండ
మందలో కాలారి మారన్న రాగ
ముందుగా సిరిబాల ముమ్మయ్య చూచి
'అన్న కాటమరాజు అంపిన భటుని
కన్నుల పొడగన గలిగెను నేడు
యే వార్త తెచ్చెనో యెలమి వేడుకల
ఆ వార్త నాయసను అడుగుద'మనుచు
బాలలు యిద్దరు పరుగున బోయి
కాలారి నప్పుడు కౌగలించుకొని
పేవేగ కర్పూర విడియంబునిచ్చి
ఆవుల పరిణామ మడిగె ముమ్మయ్య
"వినవయ్య కాలారి! వినర మారన్న!
గొనకొన మావారి గోగణంబులకు
ఆరూఢి క్షేమమా? అన్న! కాలారి!
పేరుకెక్కిన పెద్ద పృథివీశ సుతుడు
నలనన్న, ఆ పద్మనాయు, దెర్రయ్య
చెలగుచు నున్నారె క్షేమాన వారు?
చేదంతి యేనుగు చట్టువారెర్రు
అవిరళ స్ఫూర్తిచే ఆనందముగను

బొల్లావు వినుమన్న బొ...ద
కూకులను
చల్లి వారేవురు సాహసోన్నతులు
అందగల కంపటము యాదవులు
లక్ష
మండలాధిపులైన మున్నె మూకలును
మందలావులు పెక్కు మపలు
కోడెలును
యెద్దులు ఆ వలుగు పెనుము
లాదిగను
పరిణాన నున్నారె భవహరు కృపను?
వీరస్వయము లక్ష బిరుదు
గోపంగులు
అందరు సేమమే? అన్న కాలారి!''
అని రాచ ముమ్మయు అడుగు
మాటలను
వినియు మారన్నంత విన్నపము
నేసె;
"అన్నరో! ముమ్మయ్యా! అల్లుడ!
ముద్దు!
యెన్నగా పోచయ్యా! వినరయ్య మీరు
ఆలమందలనుండి అరుదెంచు వరకు
ఆవులెద్దులు యాదవాళి యఱ్ఱయ్య
ఆవులన్నయ్య నాయందు క్షేమంబు
మెండైన ఛనకొండ మేదినీపతికి
గడినుండి ఫలనన్న కమ్మలంపించె
కడమ వార్తలును యీ కమ్మలో
గలవు''
అని యిట్లు మారన్న ఆ కాలురకును
వినిపింప సూర్యుండు వేగంబె
గ్రుంకె
ఆవేళ కాలారి ఆత్మలోపలను-
'యీవేళ యీ జాబు లిచ్చితినేని
అయితన్న బందుగులు అయిన
వారెల్ల
వైనాన జూచి యీ వ్రాలు కమ్మలను
ఆపద పడియెదరు అది నిశ్చయంబు
యీ పాప కర్మంబదియేల
నా'కనుచు
మదిలోన తను తానె మార్గంబు
తెలిసి
'వుదయంబు గానిచ్చి పుర్వీశ
నకును
గాదకొని కొంపోయి కొలువు
కేతెంచి
సదయుడై యున్న
ఆ జనపాలునకును
చదివించు కొమ్మన సమయంబు గాని
యీ సంజ చీకటి నియ్యబో'దనుచు
భాసురంబుగ నున్న బాలు రవ్వేళ
అమ్మకు సిరిదేవి కాబాలు రపుడు
సమ్మతంబుగ జెప్ప సరగ సిరిదేవి
యెమ్మె మీరగ క్షేమమెన్న
'కాలారి!
సదమలాచారుండు జనపాలవరుడు
అధిక సాహసుడగు నలనన్న మంత్రి
పద్మరాఘవుడును పయ్యె లెఱ్ఱయ్య
మంద నావులు మన్నీలు భటులు

సాధు పోషకుడగు చట్టువారెవ్రరు
పరిణామమేః' యన పలికె కాలారి:
'సురభులతో జను సుజనపాలునకు
క్షేమమే' అనినను సిరిదేవి అపుడు
ప్రేమతో దాసుల పిలిచి చెంబులను
జలముల తెప్పించి సరగ నిప్పింప
చెలగుచు స్నానము చేసి కాలారి
వచ్చి కూర్చున్న ఆ వనితల చేత
పంచ భక్ష్యంబులు పచ్చళ్ళు పెరుగు
భోంచేసి కాలారి పొగడుచు లేచి
సిరిదేవి సెలవడిగి చెప్పిన విడిదికి
అరిగె నంతట కమలాప్తుడు గ్రుంక.
అంతట అయితమరాజు అప్పుడు
కొలువు
అంతయు జాలించి అంతఃపురముకు
సంతోషమున వచ్చి స్నానంబు చేసి
కృత్తివాసుని పూజ బత్తి గావించి
దివ్యగంధంబును తెరగొప్ప నలచి
దివ్య మాల్యంబుల తెరగొప్ప దాల్చి
తెరగొప్ప భోంచేసి దివ్య తేజమున
చేరి యిరుగడలును సేవక వృత్తు
లొనరింపుచును చెలులొక కొంత
నడవ
జననాథు డైతన్న చెలులు కొల్వగను
మేలిమి బంగారు మేడలో కరిగి
చాల వేడుకతోడ శయ్య్య పవళించి
సరస సాహిత్య ప్రసంగ సంగీత
పరులు పురాణముల్ వక
కొంత పొద్దు
ఆ రీతి గడపిన అటు నిద్ర చెంది
తారల చంద్రుడు ధవళమై కాయ
నాలుగో జామాయ నటుమక్క
పొడువ
తెలివిగా పశ్చిమాద్రిని శశాంకుండు
గ్రుంకిన కోకములు గుబులుగా కూయ
ఆ కమలాప్తుండు అంత తూర్పునను
గట్టుపై నెక్కియు కాంతి తా జూపె
ఆ వేళ పట్టణంబందు పెల్లుగను
పటహ మృదంగాది బహుశ్రుతుల్
చెలగ
నిటలాక్ష భక్తుండు నిజమానసుండు
అటమున్నె మేల్కాంచి
అయితమరాజు
ఘటితమై మెరయ కల నావి నొంది
మరి వేగముగ ముఖ మార్జనము చేసి
పరగ దివ్యవిభూతి ఫాలమున దాల్చి
శంభుని బూజించి జననాథు డంత
గాంభీర్యమున కొల్వు గద్దె కేతెంచి
కూర్చిన ముత్యాల కొల్వుచావడిని
కూర్చున నా రాజు కొల్వులోపలను
అన్నలు తమ్ములు ఆప్తవర్గంబు
మన్నీలు దొరలును మంత్రులు
భటులు
పల్లికొండయు సరస భట్టావులన్న
పుత్తమ రాజును వుత్తమ ఘనుడు
కల్లరి రిపువైరి కరియావులన్న
సత్య సంధులు రాజు సముఖాన
నిల్వ

భట్లు పొగడంగ బ్రాహ్మలును పాడేటి ఆటల పాటలవారి
దీవింప కనుచు పురాణముల్
జట్లును తమలోన సాధనలు చాయ వినుచున్న యంత

## కాలారి కమ్మలను అయితమరాజునకు సమర్పించుట

ఆవేళ కాలారి అప్పుడు వచ్చి
వేవేగముగ భూమివిభు కొలువు
జొచ్చి
పల్లటి వేసి ఆ పలికొండకు
మ్రొక్కి
అల్లటి వేసియు అయితన్నకు
మ్రొక్కి
కడియాల చేతుల కమ్మలందియ్య
వడికముగా ఆ రాజు వుత్తరాలంది
రాచకరణంబగు రామచంద్రుడును
లేచి యా రాజుచే లేఖ లందుకొని
చంద్రికలో ఆకు చయ్యన దీసి
అందులోపలి వైనమంతయు దెలిసి
మండలాధీశుడు మరివేగ నిపుడు
దండు రమ్మను వార్త తా విన్న
వించక
మనసులోపల నుంచి మంత్రి
శేఖరుడు
ఘనవేగమున కమ్మ గట్టిగా చుట్టి
మానవేశ్వరునితో మంత్రి
యిట్లనియె:
"మనుజేశ! వినునేడు మందలో
నుండి
భానుతేజుం డిటకు పంపినలేఖ
సహజవ్రాతయుగాదు సన్న
చిన్నెలును
యీ జాబు తెలియదు యదుకులా
ధీశ!
అనిన అయితమ రాజు అప్పుడిట్ల
నియె:
"వినవోయి మంత్రి! యీ విశ్వంబు
లోన
ఛప్పన్న భాషల శేషాహి వనుచు
వప్పుగా పొగుడుదురు పన్నెవాసిగను
నీవెట్టి వ్రాతైన నిమిష మాత్రమున
వివరించి చదువను వెలయ
వ్రాయంగ
దిక్కుల కరణాలు దిన దినంబునను
మక్కువగా నెన్నమంత్రిరో! వినుమ
నీకు తెలియదటన్న నెగులొందు
మదిని
చేకొని యీకమ్మ చదివేటి మంత్రి
నీవె దెల్పు"మటన్న నెరమంత్రి
మదిని

## సిరిగిరమ్మ మాత్రమే కమ్మలను చదువగలదని అయితమరాజుమంత్రి చెప్పుట

భావించి పలికె: "భూపాల చంద్రుండ
నేనెంత వాడను యీ యుర్విలోన
ఘనులెక్కువగు వారుకలరు నాకన్న
పరమేష్ఠి సతియైన భారతీదేవి
కోరితమును జేసి కూరిమి చేత
వారిజ పువుబోడి వారిజనేత్రి
వారిజగర్భుని వరమున గన్న
నీ ముద్దు కూతురు నీలాలవేణి
ప్రేమతో గొల్చియు ప్రియమార పార్శి
తెలుగు అరవంబును (తుళువ మరాఠి)
చెలగి కన్నడమును చదివె నాగరము
నరనాథ! మీ పుత్రి నలినాయతాక్షి
తెరగొప్ప ఛప్పన్న దేశీయ భాషలు
అక్కమలాక్షికి అంత తెలివిడియు
మక్కువ మీర మా మనవి చేకొనియు
అక్కడికి యీకమ్మ లంపక కాని
తక్కిన వారికి తగదు తెలియంగ"
అని విన్నపము భాయ అంగీకరించి
ఘన వేగ యా రాజు గద్దెపై లేచి
ఆట పాటలనన్ని అపుడు ఆలించి
సాటువ కెక్కిన సభవారి నంపి
బంధు సహోదరులు పల్లికొండయును
అందరు నగరికి అప్పు డేతెంచి
మరివేగ శారదా మండపంబునను
ఆరూఢి వరుసతో అపుడు గూర్చున్న
అప్పుడు కూటాల కడ్డ తెరగట్టి
కప్పుర గంధుల కడు వేట్క బిలిచి-
"కొమ్మలారా! మీరు గొబ్బున పోయి
అమ్మ నూకాంబికకు అటువిన్న వించి
సిరిదేవి కొమరక్క సిరిభోగ లింగ
సరసన అగుమంచి చట్టు మారమ్మ
పందముల యారణప్ప పైడివారి తల్లి
అందరిని తోడుకొని అతివేగ రారె!"
అని వారి లోపలికి నంపి అయితన్న
తన అప్పు లందరు తన చుట్టు కొలువ
గంగరేగులు మంచి ఖర్జూరములును
బంగారు పళ్యాల బాగొప్ప నుంచి
పంపిన లేఖలు ఫలముల నడుమ
పప్పగా నుంచియు వారితో ననియె;

# అయితమరాజు కమ్మల శుభాశుభములను గూర్చి ప్రశ్న చూచుట

"వినరయ్య సభవారః విస్తరంబు
గాను
జననాథు డంపిన జయలేఖ లిపుడు
సకలంబు నావలి సందేహ మెడల
వక ప్రశ్న చూతము వనరంగ
మనము
పరమ పుణ్యం డిటకు పంపు లేఖలను
సిరిదేవి కడకిపుడు శీఘ్ర మంపినను
నా చిన్న కూతురు నారి సిరిగిరియు
చూచి తన మదిలోన చోద్యంబునంది
ఫలముల ఖర్జూర ఫలమందె నేని
చెలువంద మన పనులు జయము
కాగలవు
పొలతి జయలేఖలు పుచ్చుకొన్నంత
కలహంబు పాలేట కలుగట నిజము"
అని నిశ్చయింపంగ అంతనా చెలులు
అణు వృత్తాంతమ్మున బోయి అంతః
పురమ్మున
కొమరగిరి సిరిదేవి కోడండ్రతోను
కలసి మెలసియున్న కాంతల విలువ
కనక పూబోడుల కైవడి తోను
చనుదెంచి అడ్డతెర చాటున నిలువ
కుసుమ కోమలు లెల్ల గొబ్బున
వచ్చి
పసిడి పీఠములెల్ల పరగ దెప్పించి
ఘనవేగముగ దైవ గద్దెల మీద
పొసగ కూర్చుండిరి పొలతు
లందరును
అంచల గద్దెపై అక్క కొమరక్క
సముముగా అదండ చట్టి మారెమ్మ
చెలులు సిరిదేవియు శృంగారముగను
అలివేణి తొడలపై ఆ సిరిగిరమ్మ
పగడాల గద్దెపై పందుములు
యరణప్ప
తగనొప్ప పైడివారి తల్లియు సరస
కొమరక్క కోడండ్రు కొమ్మ
లందరును
అమరంగ కూర్చుండి అక్క
కోడండ్రు
సిరిదేవి కోడండ్రు చిత్తరువుల వలె
వరుసతో గూర్చున్న వైనాన సరిస
నెలత లందరు గూడి నెమ్మితో
గొలువ
ఫలములు లేఖలు పంప నచ్చటికి
వడిమీర సిరిదేవి తొడలపై నుండి
అచ్చట సిరిగిరి అవి చూచి తాను
పళ్లెములో నున్న ఫలముల విడిచి
వేగంబె జయలేఖ వెలది యందుకొనె
అందిన వార్తల అటు పెద్దలకును
చందనగంధులు చెప్పి రంతటను

చెప్పగా వినినారు శకున ఫలంబు
అప్పుడు రఘుపతిని అడిగిరందరును
అడిగిన వివరంబు అంతలో దెలిసి
కడువేగ రఘుపతి కలవారి కనియె

## శకునఫలితము యుద్ధమని పల్లికొండ ఏష్యము చెప్పుట

"జనులార! వినుడు యీ శకున
ఫలంబు
అనికి సిద్ధమగుదురు యాదవులెల్ల
వలురాజుసుతు కంటె వలురాజు
కంటె
యిలలోన యీ జగడ మెక్కువ
గలదు
గాంభీర్యలక్ష్మి! వో కాంతాలలామ!
అంబుజనేత్రి!వో అలినీలవేణి!
అయితన్నపట్టి! వో అల సిరిగిరమ్మ
వయినాన జయలేఖ వరుస
వినిపించు"
అని పల్క రఘుపతి నందరు
పొగడ
జననాథు డంపిన జయలేఖలపుడు
అందరు పెద్దలు అయితమరాజు
ముద్దుకూతురు జూచి ముదము ననిరి
"అమ్మరో సిరిగిరి! అమ్మ
వినవమ్మ!
శెమ్మది చదువంగా నేర్చితివమ్మ!
పాక దేశమునుండి పశుపతిరాజు
భూనాథుడే తనకు పుత్తెంచినట్టి
జయలేఖ లిపుడు నీ చేయిబట్టినట్టి
దయచేసి మాకిపుడు ధరణీశపుత్రి
వినిపింపు జయలేఖ వివరంబుగాను"
అనిన చంద్రిక దీసి ఆ సిరిగిరమ్మ
పెనుత్రవేలు వ్రాలాకు బెట్టి అప్పుడును
ఛప్పన్న భాషల శేషాహిమూర్తి
అంపిన జయలేఖ అందరు వినగ-

## కాటమరాజు పల్లికొండకు వ్రాసిన జయలేఖను సిరిగిరమ్మ చదువుట

"స్వస్తి సమస్త విజయగుణాధార!
హస్తి పైడి బిరుద! అబ్ధి గంభీర!
భువన జనారాధ్య! భోగ దేవేంద్ర!
రవితేజ! సర్వజ్ఞ! రక్షకుండైన
బావ రఘుపతికిని పరగ మీ మరిది
నలనన్న దండప్రణామంబు చేసి
చెలగి విన్నపములు క్షేమసుందరము
యీ యెడ అభిలాష యే యెడల
మాకు

పాయని మోహవిభ్రాంతియ
యపుడు
అనియేక మార్గముల ఆత్మ మీ వదన
వనజములుగన వాంఛ యున్నదియు
యాదవరాజ్య మేలించి యాడేర్ప
ఆదిమూర్తివి నీవ అవనిలోపలను
అనువొంద గత హెచ్చ్యమంత యెరుగు
దువు

అనరక్తితో మంద కరుదేర వలయు
అలనాడు మీతోడ అయ్య పోలరాజు
చిలుకలమ్రరికడ చెప్పినవార్త
చిత్తాన నుండెనా శీఘ్రముగ వచ్చి
నిత్తెముగ యరగడ్డ నిలువుడీ మీరు
పాటను నిలువుడిమీరు మీరు అటు
కానక
విన్నపమంతయు యిది" యనుచు

## కాటమరాజు సిరిదేవికి వ్రాసిన జయలేఖను సిరిగిరమ్మ చదువుట

అటు వెనక వకలేఖ అప్పుడు
చదివె-
"శ్రీపార్వతీదేవి సీత భగవతియు
శ్రీపాపనాశని శ్రితలోక గంగ
అరుదైన యట్టి యా అన్నపూర్ణయును
సరినొప్ప భారతసావిత్రి సతియు
పరమ పతివ్రతా పద్మినులైన
వారి సమానమై వైభవమొందు
అక్కకు బావకు అమ్మకు మొదలు
చక్కగా నలనన్న సాష్టాంగముగను
మొక్కి పంపిన వివరము వనరంగ
వినుడి
అక్కడ నుండి మీ ఆనతి చాత
కార్తీక మాసాన కదలి వచ్చితిని
వార్తగా దేశములు వనర దిరిగితిని
భారతి కృప చాత పరిణాన మేము
సురభులతో యెడ్లు సుఖమేపులందు

దండు గడిపిన వాని తనయు
డై తన్న
అందగల కంపటీలందరు మాకు
చేతులో చెయివేసి చెప్పి యొప్పితివి
యే తావునను మీకు యేమి గల్గినను
ఆ తావు ఫలము మీరందరు గూడి
అంచిత పుత్ర మిత్రాదులతోను
పంచుక భోంచాయ పద్ధతి యిదియు
అని యిట్లు దీవించి అప్పుడంపితివి
అనియేక విధముల అప్పుడు
బోధించి
తల పాకనాటికి అంపితి మమ్ము
తల్లిరో! అ మాట తనలోన నిలచె
మనములోపల మిగుల నున్నాది
అమ్మరో! నీమది నెమ్మదినుంచి
అంత విన్నప" మని అటనుంచి
అపుడు

## కాటమరాజు అయితమరాజాదులకు వ్రాసిన లేఖను సిరిగిరమ్మ చదువుట

అంతట పక లేఖ అందుకొని
చదివెః
''స్వస్తి శ్రీమత్సు గుణ సంపన్ను
లైన
సుస్థిరముగ ధర్మ, సుగుణపయోధి!
బంధు శిరోరత్న! బాహుబల రామః
మందర నగధర! మానుషయోధః
శాస్త్ర వాక్య ప్రతిష్ఠాపనాచార్యః
శ్రీకాంత పరిపాద సేవాధురీణ!
నాక సుత ప్రౌఢి నాయకులైన
చేకొని శుభముల జయరాములైన
కరి ఘటముల వైరి! కరియావులన్నః
పరశక్తి భట్టావుల వల్లభన్నకును
పొసగ అయితమ రాజు పుత్తమ
రాజుకు
పశుపతి నలనన్న పంపిన లేఖ
మాఘ త్రయోదశి ఆదివారముకు
బాగుగానున్నాము బలముల తోడ
లక్ష కంపటమును రాఘవుడు
మేము
దక్షిణ దేశాన తరలి ధేనువుల
పరగంగ నాసేతు బంధనము
కరిగి
మరల వచ్చియును మా మందలనెల్ల
జన్నవాడను నిల్పి చలగి వేడుకం
మన్ననచే మది మరచి యుండినను
పడవీటి కాదరాజు పాపాత్ము
డగుచు
పొడిపించె యెద్దుల బోయల చాత
మూడు భూములు చేయు అవును
చెల్లె
దొరకొని చంపెను దుర్మార్గుడయ్యె.
పశుల వేసిన యట్టి పాపాత్మ
తలలు
వసుధ గూల్చిన కాని వచ్చుట లేదు
తరమైన పగయాడ దాగెనో
యనుచు
వెరవున భూములు వెదకుచు రాగ
యేడు తరముల పగ యరగడ్డపాట
యీాడైన జగడము యింపుగా
గలిగె
పుల్లరి వదంబడి భూమి మేపితిమి
పల్లవ రాజుతో పగయు యేర్పడెను
శ్రీదేవి పతియైన శ్రీహరి కృపను
వాదించి వసులెల్ల వనగూడె మనకు
అలిగి పోవగ విందు అయిన
చందమున
కలిగె నాకును యిపుడు కయ్యంబు
శాయ
గ్రక్కున మన శక్తి కలిగిన
యిపుడే

వక్కాణై యీపనులు యీడేర్ప
వలయు
అటు గాక మీయంత ఆత్మవర్గములు
నిటలాక్షు కృప చాత నిందరు
గలిగి
పగ నిర్వహించేటి పశువులు గలిగి
హిమసేతు మేరగా యీ జగము
పొగడ
విమతుల నిర్జించి విఖ్యాతి మించు
అంత శక్తియు మాకు అత్మతో
గలదు
యింత వార్తయు మీకు యెరిగింప
వలయు
అలనాడు సిరిదేవి ఆడు వాక్యములు
కలిమి కొరకు గాను కమ్మలంపితిని
ఆలాగె మీమది హర్షంబు పుట్టి
వాలాకు విన్నంత వచ్చి యిత్తి మీరు
దండ్లు కూర్చుకొని మీ దళములు
మీరు
పెండ్లి చందము వలె ప్రేమతో
రండి
సోమేశ్వరుని శుభ శోభనములైన
ప్రేమతో బసవన్న పెండ్లి మన
యింట
యిల సిద్ధిరాజింట పెంచితి పూబంతి
వెలయంగ బసవనకు వేడగ వలయు
మాఘ బహుళంబున మంచి లగ్నంబు
బాగుగా గలదని బ్రాహ్మలన్నారు
శివరాత్రి దినమున స్థిర లగ్నమందు
ప్రవిమల యెదురు కోలు
ప్రఖ్యాతిగాను
సకల వాద్యంబుల సన్నాహమలర
సకల పార్థివు లెల్ల సన్నుతింపగను
యెంతో వేడుక పెండ్లి కేతేరవలెను
అంత బంధువులు మీ రరుదేర
వలయు
తాత వక్కాడు మన తండ్రులు
వేరు
తాత తండ్రుల పగలు దరికొనివచ్చె
వచ్చి కలియుడి మీరు
వాలాయముగను
నిశ్చల చిత్తాన నిటకు వచ్చేది
కాక మీ మనసులో కపట మందినను
యీ కమ్మలను జూచి
యీ క్షణంబునను
యెక్కువ కాపురాలు యెసరెడి
ప్రజలు
తక్కిన దూతలు దళముల నెల్ల
తల్లించుకొని కృష్ణ దాటుడి మీరు
పుల్లి గడ్డ యలమంచి నుండుడా
వెన్క
విదియ తదియలకైన వేవేగ
యిటకు
కదలి వచ్చియు నీవు కలని
శోధించి
చన్నవారిని జూచి సమరంబు లోన
వున్నవారిని జూచి వొాగి రణము
గుడిపి

పోరాడి రణములో పొలిసిన యట్టి
వారి కాంతలనెల్ల వైకుంఠ మనుపు
అంతలో సేనకు అన్న భక్తిరన్న
అంతట రణముకు అరుదెంచె నేని
సాయుజ్య పదవికి సౌపాన పదవి
శాయంగ గలవాడు జగతి లోపలను
అటు మీద పనులకు
హరిగురువు లడుగు

తటుకున పీలైతె తరలి వచ్చేది
యిది కార్యమని మీకు యింత
వ్రాసితిమి
యిది మదినుంచేది వివర
మంతయున్న"

## యుద్ధలేఖలను వినిన సిరిదేవి శోకమున మూర్ఛిల్లుట

అని లేఖ చదివిన అంత సిరిదేవి
విని చాల మదిలోన విభ్రాంతి
బొంది
తన సుతుడు అయితన దండు
బోయినను
తన మది నెటువలె ధైర్యంబు
నిలుచు?
మొగము వెల వెల బారి మోమును
వంచి
సోగ కన్నుల నీళ్ళు జొట జొట
కురియ
అదరుచు ఆ దేహమంతయు వడక

పదములు భూకాంతపైని నిల్వకను
చేతుల పిసుకుచు చెల్లబో యనుచు
ఆ తన్వి శోకాబ్ధి అవనిపై కొరగి
వనజాక్షి కన్నీరు వసుధపై గురియ
మిగిణిమందై కడు మూర్ఛయు
నొంది
అప్పుడు సిరిదేవి అవనిపై వరిగి
తెప్పరిల్లకున్న సిరిదేవిని జూచి
అన్నల చెల్లెలు అగుమంచి వచ్చి
కన్నీరు తుడిచియు కడు లేవదీసి
మెరుగు పట్టుశాలు మెడనిండ కప్పి
వురమున చేర్చుకొని వృవిధ యిట్లనియె

## అగుమంచి తన తల్లియగు సిరిదేవి పక్షపాతమును ఆక్షేపించుట

'కట కటా! వోయమ్మ! కడు
దైన్యపడుచు

యిటు వలె మూర్ఛపో నేటికి నీకు?
పరగ దక్షిణముకు పంపి నీ కిపుడు

పరికింప నలనన్న పగవాడు నాయ
యేరాలి కొడుకును వేరుగ చూచి
మారు భూమికి పంప మన సెట్లు
నిలిచె?
నీకన్న కొడుకైతె నీవు అంపుదువ?
ఆ కాటభూపాలు నంపితివి గాక
పక్షపాతివి గాక పశుపతిని నీవు
దక్షిణాదికి పంప ధర్మమా నీకు?
ధరణిపై వానికి తల్లి యుంటేను
ఘోరాఢ రిపులపై పొమ్మనునె తల్లి?
కట్టని చీరెలు కావు వో యమ్మ!
కన్నకడు పేమియు కాదమ్మ నీది
యేటి మాటలు నీదె వేరుబంధమును
పాటించి నీ సుతుల పాటి లేదమ్మ
యెంత కపటివిగాక యెన్న నీసుతుల
సంతోషమున బంప చాలవైతివిని
పగపాటు దలపోసి పాకనాటికిని
సగమైన బలమును సాయమంపకను
అలనాడె నలనన్న నంపితివమ్మ
తెలిసె నీ కపటంబు తేటగా నంత
యతని పొమ్మనగానె యిటు మూర్చ
వచ్చె
అతని పొమ్మన పోరు ఆడెనె తల్లి?
దశకంఠుడాది ఆ దైత్యుల నెదరి
వసుధపై గూల్చెడు వైభవం బెసగ
అంత శ్రీరాముండు ఆ నలనన్న
పంతగించి యా రిపుల పరిమార్చ
నిజము
అలనాటి పరిమాట్ల అరవెల్లి కథ

పలికిన మాటకు పంపెను గాక
అసహాయుడే యమ్మ ఆవులన్నయును
పసుల చాతనె తన పగ గెల్వగలడు
భూనాథు డయితన్న పోకున్న గాని
కానున్న పనులెల్ల కాకపోవిపుడు
చెలిమితో దీవించి జయము గమ్మ
నుచు
అలివేణి నీ సుతుల అంపవే తల్లి!
వలదు నిష్ఠూరంబు వలదె వోయమ్మ!
నీకు మూర్ఛయు పోను యేటికి
యిపుడు"
అని దూరబలికిన అంత సిరిదేవి
తన మూర్ఛ తెలివొంది తనలోనె
తాను
అంతంత పెదవులు అటు తడుపు
కొనుచు
చింతించి సిరిదేవి శివుని తా దూరె
"వో పార్వతీనాథ! వో భక్తవర్య!
ఆ పగభూమిలో ఆవులకు మేపు
కద్దని చెప్పి యా కాటభూపాలు
సిద్ధిరాజున్నట్టి సీమ కంపితివి
వీరికి వారికి సరిపోరు పెట్టి
యేరీతి దాగితివి యేమందు నిన్ను
పట్టభద్రుడు దండు పైనమైనాడు
యెట్టు కట్టడి చేస్తివీశ్వరా!"
యనుచు
మగువలు దానును మందిరంబునను
పొగులుచు అడలుచు పొలతియున్నంత

## జయలేఖలు విని సంతసించిన అయితమరాజు యుద్ధ సన్నద్ధుడగుట

అంత అయితమరాజు ఆ వల్లభన్న
కాంతి సమానుండు కరియావులన్న
జయలేఖ విని వారు సంతోషమంది
'దయమీర బంధుసోదరులును దాను
ద్వాపరమేలిన ధర్మరాజైన
ఆ పల్లికొండల అనుమతితోను
వుభయ పార్శ్వాలను వుండి తమ పనులు
అభిమతి నొనరించు ఆప్తుల' మనియె
'అన్న కాటమరాజు అంపిన లేఖ
విన్నప్పుడును నుండ విహితంబు గాదు
దక్షిణ భాగాన దండు గుడార్లను
యీ క్షణంబున బోయి యింతె చూ' డనిన
ధరణీశు శలవున తద్దయు నందె
లగురీతి పయనమై దక్షిణముగను
డేరాల నెత్తిరి తెరగొప్ప వారు
ధారుణీశ్వరునితో తగ విన్నవించి
పలువగ నేజా తుపాకులవారిని
అనువైన యా ఛత్రి సాయుధము వారి
ఘనమైన యా భద్ర గజములవారి
తోడైన గుర్రాల దొరమన్నె వారి
దండు పైనంబని తగ జాటిరంత
వలను మీరగ దళవాయుల కనియె:
'కులకులందు ఘాను కొచ్చర్ల కోట
తురిమెర్ల కాకర్ల తొండమనేడు
అరయంగ చెన్నూరు ఆరణి జేర్చి
అర్ధవీడు దొనకొండ అల రెండు యెరువులు
అద్దంకి వినుకొండ అమ్మన్న బ్రోలు
అరుదైన మూకల అటుపిల్వనంపి
భీకరంబుగ రణభేరి వేయించు
నయముగ ఆ సభానాయకుల నిల్పి
అమిత వైభవముల అయితమరాజు
తమతల్లి నగరికి తద్దయు వచ్చి
తల్లిని వూరార్చి తానంత వేగ
జలకమొప్పగ నాడి శంభుని నపుడు
చెలువొంద పూజించి శ్రీఘంటె వేచి
పొలుపొంద భోజన శాలలో కరిగి
అన్నలు తమ్ములు అపుడు భోంచేసి
పన్నీరు గంధంబు పైనిండ నలది
అడపవారెల్లరు ఆకు చుట్టియ్య
కడువేగ మొగసాల కడ కేగుదెంచి
కొలువు మొగసాలలో కొమరు మిగులంగ
కులబాంధవులు రెండు కొలువ కరణాలు
పరగంగ రఘుపతి పుత్తమరాజు
ధరబలాధికుడైన అయితమరాజు
కల్లరిపులకు వైరి కరియావులన్న
వల్లభన్నాదిగా వరుస కూర్చుండి
సకల శాస్త్రపురాణ సంపన్నులైన
సకల విద్యలవారి సరగ రప్పించి

ఆ రాత్రి జాగరమటు చేసినట్టు
భారత పురాణములు బాగ వివరించి
సభను సత్కవులెల్ల సన్నుతులు
సేయ
విభవాన దేవేంద్రు విధమున బోలి
వీర శూరత్వమును వివరించి చూడ
ఆ రూఢి విక్రమార్కుని బోలి
తనకత్తి దిక్కుల ధరణి వేయంగ
ఘన దానమునను ఆ కర్ణునిబోలి
వుత్తమోత్తమ కళల వొగి చంద్రు
పోలి
సత్యభాషల హరిశ్చంద్రు బోలి
యీ రీతి కొలువుండి
యిలతలాధిపుడు
దారుణీ సురులకు తన యాచకులకు
గాన విద్యాప్రౌఢ కవి తార్కికులకు
దానంబు లిచ్చుచు తగ వేడ్కనుండె
ధరణి చీకటి వాసె తగ చుక్క
పొడిచె
నెరిగొండపై నపుడు నిలిచె
సూర్యుండు
ఆ సమయంబున అష్టదిక్కులను
వాసి మీరగ కదలివచ్చెను దళము
అచ్చుగా గావించి ఆయితమ రాజు
వీర పరివారము విందారగించి
వారికి విజయముల్ వరుసతో నిచ్చె
సొమ్ములు కట్నాలు సొన్న టంకాలు
గమ్మున వాసించు కట్టు వస్త్రాలు
జల్లులు సఫతాలు జమిలిపెక్కెములు
వల్లవ కులపతి వరుసతో నిచ్చె
భేరీమృదంగముల్ పెక్కు
వాద్యములు
ఆరూఢి మ్రోయంగ అవనీశ్వరుండు
నావంటి పెద్దను మల్లినోకాని
వేవేగ పిలిపించి వేడ్క నిట్లనియె:
''గొప్ప తేజీలను గోరాజములును
జల్లులు సమకట్లు చాల సవరించి
వల్లన గట్టు'' మని పల్కెనం
తటను:
రాజు శెలవందియు రావలన బోయి
వాజుల కన్నిటికి వైన వైనాన
వాగెలు బంగారు వన్నె సమకట్లు
బాగైన కట్టాడి బన్న సరములును
పికిలి తలాటాలు బిరుదు జల్లులును
నకలంక బంగారు నాదు టందెలును
బాలార్క బిళ్ళల పగడ నేవడాలు
పాలసంకుల పేర్లు పసపు రుమాళ్ళు
తరమైన బంగారు టంగీ బిగించి
పరిగె పట్టెనములు పైని సవరించి
సిగె జందు జీరాలు సింగిణి విళ్ళు
తగగ బొమిడికములు తగ ధరియించి
వుత్తమ రాజు పువ్వుల నీలనికి
కత్తుల కళ్ళెంబు కంచు పక్కెరము
ముత్యాల ముఖ మరుగు మూడు
ముఖములది
వింతగా రిపులపై విజయంబు నొందె
కొంత్తైన చాళున గొలుసు
బిరుగడల

పంతగించిన క్రియ పట్టుక రాగ
అయితన్న యెక్కేటి అపరూప
రాయనికి
రావిరేకలు మణి రత్నభాషికము
లావణ్య ఖనియైన లాలుసరి జల్లి
అసుర ముఖముల అందె హనుమంత
బిరుదు
పసిమించు యద్రి గోపాలహను
బిరుదు
వేగంబె ధరియించి వేడుకతోను
వరభక్తి భట్టావుల వల్లె భన్న
యెక్కు
తురగంబునకు నొక తొండ
పల్లము వైచి
సరిబోర రత్నాల సరి ఫెన వైచి
అరివేగ అల్లు దాడెన్న యెక్కేటి
వున్నత హయముకు వొనర వేగంబె

పులితోలు పల్లంబు పొందు
వాగెయును
పసడి తలాటంబు పట్టువైరి అందె
పసిమించు పువ్వుల పేరులు వేసి
కరియాపులన్నెక్కు గండ కత్తెరకు
బిరుదైన మువ్వల పిగిలి జల్లులును
తక్కిన గుర్రాల తగ నఫంజోళ
ఫక్కెక్క తేజీల్ల శల్లన కట్టించి
మావంటి కడుమర్లు మరివేగ వచ్చి
అవనీశ్వరుని తోడ అంత వినిపించె
అప్పుడు అయితన్న హయ శిక్షకునకు
కప్పుర గంధంబు కడువేడ్క నిచ్చె
బంధు సోదరు జూచి పలికె
అయితన్న:
"అందరము పైనమై అతివేగ ధరించి
యించు జాగేలయ్య? యిది పందు"
గనుచు

## మేడబెట్టిన పాపనూకను తోడి తెమ్మని అయితన్న బాలరాజులను నియోగించుట

నందుల నూకాంబ నగరు కేతెంచి
అప్పుడు అయితన్న అతివేగమునను
పప్పుగా ముమ్మయ్య అల్లుని జూచి
కప్పుర గంధుల కడువేడ్క బలిచి
అప్పుడే అందలము అతివేగ బట్టి
"బాలల వెంబడి పైనమై పోయి
అల మేడలో నున్న అతిషె పాపన్న

మనసు లోపలి చింత మాన్పి
మీరంత
ఘనవేగమున నిటకు గ్రక్కున
రండి"
అని వారి బంపిన అలాగె పోయి
నిబ్బరంబుగ మేడ నిచ్చెన చేర్చి
గొబ్బున మేడకు కోర్కెతో నెక్క

చేడెలు పోచయ్య చిన్నముమ్మయ్య
మేడ అంతరువుకు మేకొని యెక్కి
ఆ పాప గనుగొని అని రిట్టు లంత:
"వో పరమ పావని! వక విన్నపంబు
కరియావుల రాజు ఘనుడు
అయితన్న
హేరాళముగ దండు వెడలుచు
మిమ్మ
కన్నుల చూచి పోగల వారయనుచు
మన్నెరాజయితన్న మిము
మేడదించి
తమ సముఖానకు తరలి రమ్మనెను"

## పాపనూక మేడ దిగిరా నిరాకరించుట

అనెడు అన్నల మాట కతివశోకమున
కన్నులనీర్నించి కాంత యిట్లనియె:
"వో చేడెలార! మీ కుచితమా యిట్లు?
అవనీశ్వరుడు మిమ్మ అంపె
యేలాగు?
మాతల్లి సిరిదేవి మరి వేగ మునుపు
అయితన్న మొదలైన ఆ
సహోదరులు
కన్నుల పండువుగా జూచుచుండు
యెన్నడు రఘుపతి మన్ననతోను
కడమేడ నుంచియు కన్నతల్లియును
కడసాగి యిటు పిల్వ కారణంబేమి?
నను మేడనుంచియు నాతి సిరిదేవి
కనుగొన దోషంబు కలలోననైన
అంత్య కాలము వచ్చె యాదవుల
కిపుడు
యంతైన గాని యీ మేడ దిగననుచు
అన్నదమ్ములకును అతి వేగ మీరు
విన్నపంబును జేయుడిది బుద్ధి"
అనిన
వారందరును మేడ వైళంబె డిగ్గి
ధారుణీశ్వరునితో తగ జెప్పి
రపుడు:
"అన్నరో! పాపకు అనియేకములుగ
విన్నప మొనరింప వినక యా పాప
అన్నల పెద్దల నా సిరిదేవి
దూరుచు మిము చాల దూరె
మీ చెల్లెలు"
అని విన్నపము సేయ
అయితమరాజు
తన మది చింతించి తల్లిని దూరి
వారిధి గంభీర వంశ వర్ధనుడు
ధరణీశుడై తన్న తా పైనమయ్యె
చీనాంబ రంబులు చెలు వొందగట్టి
చక్కని ముత్యాల చౌకట్లు పెట్టి
కెంపుల వుంగరాల కేల కడియములు
సొంపైన ముత్యాల జోడు హారములు
కడు పెద్ద ధరియించి గండ
పెండెములు
నడుమున వడ్డాణము నేమమునను

మ స్తకమున వ్రజ మకుటంబు బెట్టి
కస్తూరి గంధంబు కరమొప్ప నలది
చన్న రిపులకు వైరి జమిళియు గట్టి
పున్నమ చంద్రుడై పొంకంబు
మెరసి
అన్నలు తమ్ములు ఆత్మ బంధువులు
మన్ననతో బావమరుదు లాదిగను
ఆ రీతి భూషణాల లలవడ దాల్చి
ఆరూఢిగా వచ్చి అయితమరాజు
యిరుగడలను గొల్వ
యిలతలాధపుడు

తల్లి సముఖానకు తా తరలి వచ్చె
వల్లవ కులజుడు వచ్చుట జూచి
కొమరక్క సిరిదేవి కొలువుండె నంత
అమిత విక్రమశాలి అయితమరాజు
వుల్లంబులో భక్తి వుల్లసిల్లంగ
తల్లికి అత్తకు దండంబు బెట్టి
"వో యక్క! వో యమ్మ!
హొనరంగ మీరు
దయమీర వర రిపు దళములపైని
వీర శూరత మాకు విఖ్యాతి గలుగ
ధీరతతో మమ్మ దీవించు తల్లి!''

## రణమున కేగనున్న అయితమరాజును తల్లి సిరిదేవి దీవించుట

అను పుత్రు వాక్యముల కంత
సిరిదేవి
మనమున భీ తిల్లి మరియు
నిట్లనియె:
''వో యాదవాంభోధి!
వో పూర్ణచంద్ర!
దయమీర వో ధర్మ ధర్మవర్తనుడ!
యెన్నొ నోములు నోచి యే నిన్ను
గంటి
అన్నరో నే నిన్ను అంపుదున దండు?
తొల్లి శాప ఫలంబు తోడయ్యెనేమొ
వలని సాహసములు వద్దన్న వినరు
అలనాడు వద్దంటె ఆ మాట వినక
నలనన్న తా బోయె నట దక్షిణాది

పర భూములకు పోయి పశువుల మేపి
కెరలి వారలతోడ కయ్య మేమిటికి?
అందిన కార్య మేలాగైన జేయక
యిందరి కీలాగు లేఖ లంపించి
అంపిన జయలేఖ లంది మీకిపుడు
వప్పగా పైనమై యున్నట్టివారి
అంపక పోరాదు ఆత్మజులార?
అంపితే ఆట మీకు అయిన కొదవేమి?
కదలిన శకునాన ఘన పుణ్యలార!
కదనంబులో రిపుల కల్లగా జంపి
అరిపు బలముల కపజయం బొసగి
విరివిగా మీ బలము విజయంబు
నొంది

పశుహత్య జేసిన పాపాత్మ తలలు
వసుధపై ఖండించి వైభవంబునను
యిల జనుల్ పొగడంగ యెంతో
వేడుకను
తలపూవు వాడక తరలి''రమ్మనిన
అను వాక్యములు విని అయితమ
రాజు
మనవిగా తల్లికి మ్రొక్కియునిట్లనియె
"తల్లిరో! మామీది దయచాత నీవు
పల్లవరాజుల బలములు విడిచి
తల్లి మము దీవించ దగునటో యమ్మ!
యల్లలోకములోన యన్నగా తల్లి
యిరు బ్రహ్మర్షులమిత్ర యొక్కాకై వడిని
పరగంగ దయయుంచు ప్రఖ్యాతిగాను
దూషింప వలదమ్మ! దుర్జనులనైన
భూషింపవలె దగ పుత్రులవలెను
సత్యంబు నిలిపిన సమకూరు శుభము
నిత్యమా దేహంబు నీటిపై బుగ్గ
సత్యంబు నిలిపిన సకల పుణ్యములు
సత్యంబు నిలిపితే సాటెవరెక్క
సత్యమే జయమని చాటు వేదములు
సత్యసంధుని బోలి చరియించువారు
సత్యలోకానను సన్నుతించెదరు
సత్య వ్రతమూ బోల సాటి లేదెంచు
అటు గనుక వారిపై అతిభక్తి నిలిపి
తటుకున యిటు మాకు తగ శాసేలిడక
పాలేటి జగదమో పాలి గాకుండ
పాలిపంతంబు లేర్పరచి పోరాడ
వీర కథ లోకమున విరివి కమ్మనుచు
ఆరూఢి దీవించి అంపవే తల్లి!
అని యిట్టు లైతన్న ఆడుమాటలకు
విని వేట్క సిరిదేవి వేవేగమునను
తన సుతుల శిరముల తగ
సేసలిడియు
వనజాక్షి దీవించి వైళంబె యపుడు:
"నా యన్న; నా పుత్ర! నా వంశతిలక!
యియ్యెడ దీవన లిటు వినరయ్య
ధర దేశములు ద్రుంచి ధాత్రి బాలించు
దశరథరాముని దయ మీకు గలుగు
విమలశౌర్యుడు కార్తవీర్యుని జంపు
జమదగ్ని రాముని శౌర్యంబు గలుగు
యెలమీద స్వాదుల యేపణచినట్టి
బలభద్ర రాముని ప్రఖ్యాతి కలుగు
విరటు ధేనువులెల్ల విడిపించినట్టి
కిరీటికి గలయంత కీర్తియు గలుగు
పగతురకు వెన్నీక బాహుబలమునను
పగతుర యరగడ్డపాట పొడవగను
అసురేంద్రు పొగడంగ ఆ రాజు మీరు
సమరంబులో నొక్క సమయాన
బోరి
కలియుగ మెన్నాళ్ళు కడతేరు
దనుక
నిలుపుడీ మీకీర్తి నిఖిలంబులోన''
అనుచు దీవెన లొసగ అందరు
నపుడు
మనసు సమ్మదముగా మరియుండి
రంత

## అయితమరాజు ధనకొండ పరిపాలనను తన చెల్లెలు అగుమంచికి అప్పగించుట

అంత అయితమరాజు అగుమంచి జూచి
యెంతొ సంభ్రమముతో యిట్లని పలికె:
"అన్నల చెల్లెలా! అగుమంచి వినవా
అన్నమందకు మేము అరుగంగ వలయు
యిది మొదలు శివరాత్రి యిటవచ్చు దాక
పదిలముగ దొనకొండ పాలించు నీవు
పంట యేరువరెడ్ల పద్మనాయకుల
వంటరిగానున్న సకొ్ూక్క బలము
పటుబలంబున జనుల పాలించు నీవు
కట కట యిదిగో యీ కాపు కరణముల
వెలయ బాలించుమీ విశ్వాస పరుల
కలలోననైన బొంకని సత్యవ్రతుల
ముద్దు బాలకులను ముమ్మయ్య పోచయ్య
యిద్దరి నిట పుత్తు యిక తోడుగాను
దొంతేటి నుండి మన దొరమన్నెవారి
మంతెన మూకతో మరల నంపెదను
దిన దిన వార్తలు దినచరులచాత
అనువంద పంపెద అక్కరో! నీకు
పాలేటి వార్తలు పావురాలచాత
వైశంబె లేఖలు వ్రాసి యంపుమను
నేటినుండి శివరాత్రి నెలమాన మెరిగి
మన కేతెంతుడు మఠము జంగాలు
వడయుల కన్నంబు వడి తృప్తిగాను
తడయక అంపించు తగు వేడ్కతోను

## అయితమరాజు ముమ్మయ్య-పోచయ్యలను బుజ్జగించి రాణివాస రక్షణకు నియమించుట

అని యిట్లు అయితన్న అచట బాలురకు
ననియేక విధముల నచ్చన బుచ్చి
"సిరిబాల ముమ్మయ్య! సింహ విక్రముడ!
కరివరదు నిజదాస కల్లందులపోచ
అగ్నిదేవ కుల వరప్రసాదకులు మీరన్న!
విఘ్నంబు కాయక వినుడొక్క మాట
అవులన్నియు లేఖ అంపినందులకు
పోవలెనటు మేము పోకున్న తప్పు
అవులమందకు అతి వేగ పోయి

ఆవులన్నను గాంచి అభిభక్తితోడ
పాలలోచను డైన పసులన్న గాంచి
యిలలోని వింతల యింపుగా దెలిసి
పసుల మందల వార్త బాగుగా దెలసి
దశమి తిథి వచ్చు నంతట వత్తు
మిటకు
ఆవులన్న అనుమతిని అంపించు
కొనియు
వేవేగ క్రోల్పుల వెల్లకొండల
చాల్పులను
తెరగొప్ప వేటాడి ధీరత మెరసి
కరి సింహ శార్దూల శరభముల్
మరియు
చిలుకలు పావురాలు చెలగు డేగలును
తెలివగు సారంగములు
జక్కవములు
రాచ గోర్వంకలు ఆరామ ధూములను
కాచిన ఫలములు కర్పూరములును
పరగంగ భట్టుచే పట్టించు కొనియు
మరలి వచ్చెదమయ్య మహ
వేగముగను
యిచ్చోట మీరిద్దరు యెసక
మెసగంగ
అచ్చుగా బొంగరాలాడుడీ బాల
రాజీ వాసమునకు రణశూరులయ్య
పోడిమి ధనకొండ పురిను౦డు
డయ్యా!''
అని యిట్టు లయితన్న ఆలర
బాలురకు
అనియేక విధముల హర్షంబెసంగ
అక్కిరెడ్డి మొదమామ అనువుగ
బిలిచి
మక్కువ మీర నా మహిపాలు
డనియె:
''వినుడి సాహసులార! వివరంబు
గాను
ధన ధాన్యముల మీద ధనకొండ
మీద
కెరలి కుటుంబము గృహముల మీద
సరవి హెచ్చరికతో పరగుడి మీరు''
కయి జీతగాండ్రను కడువేగ పిలిచి
అయితన్న వారితో అప్పుడిట్లనియె;
''సాహసఘనులార! సజ్జనులార!
బాహుబలంబున ప్రఖ్యాతి గలిగి
పదిలాన వుండుడీ పట్నంబులోన
యిదె నిల్వు డెచ్చరిక యిదె పోదు''
మనియు

## అయితమరాజాదులు దండుతో ఎఱ్ఱగడ్డపాటికి పయనమగుట

అందలంబులు పైడి అల పల్లకులతో
దండుపైనము లయ్యె తగ వేట్క
నడచు

మన్నీలు దొరలును మంత్రి వర్గంబు
సన్నాహములతోడ చయ్యన కదలి
రారాజు ననుమతి అటుసున్నగానె
కోరిన వస్తువులు కొదువలేకుండ
చక్కెర కట్నాలు సన్నబియ్యములు
బుక్కాలు గందవొడి పునుగు
జవ్వాజి
పోకలు కంట్లాలు పొన్నుటాకులును
చేకొని యొకకొంత చేరువగ నడువ
పట్టు తివాసీలు పరజాలు కొన్ని
దిట్టముగ ముందర ధీరత నడవ
పట్టెమంచాలును పరుపులు దిండ్లు
పిట్టెల చీరలు పెద్ద ఆదపములు
గొట్టిడి యెద్దులు గొబ్బున నడువ
ముట్టడి సేయంగ ముందుగా గదలె
గొప్పైన గూడార్లు గోడ సరాదులు
వొప్పుగా యెత్తిన యెద్దులు నడచె
అటు ముందుగా జండ అది గొని
కదిలె
అటు వెనుక శానలు అంతయు
కదిలె
విలుమూక యీటెలు
వెస తుపాకులును
వెలు గొందగా నూరు వెల్లి
ఛత్రములు
గంభీర వాద్యములు గాలి
టెక్కెములు
శంభుని పల్లకి సరసనే కదలె

నందివాహను సరస
నతిసొంపుతోను
పందుముల రఘుపతి పల్లకి కదలె
పరగంగ పల్లికొండ పల్లకి కదలె
కరియావులన్న గండకత్తెర నడచె
ఆ వెనుక పల్లకి అయితమరాజు
వే వేగముగ నెక్కి విజయంబు
శాయ
అరుదుగా గదలెను ఆ సరస నపుడు
నాచకూళ్ళ నాయడు నేతివారి
ముద్దయ్య
ఆ చెంత గదిలిరి అశ్వాల నెక్కి
ఆరువైన ఆ సరస అందలం బెక్కి
వర సెట్టి భట్టావుల వల్లభన్న కదలె
పుత్రమురాజును పొంది యేతెంచె
అవిరళంబుగ మేఘమతి అనుతేజి
అవనీశ్వరుని సుతుడు అల్లుదాడెన్న
మెండుగా తేజిపై మెరవడి గదలె
కొండు వారి కొండయ్య గోవుల
గంగయ్య
మెండైన మూకతో మెరసి చనుదేర
నూరిన కేడెములు నేజాంతోటి
నెరితెగ కదలెను నేతి ముద్దయ్య
కొలువు గడలు మంచి గొప్ప
బంతులును
గొలవారి నాగినేడు గొబ్బున గదిలె
వెండి కుప్పె కటార్లు
వింజామరములు

దండిగా పిన్నయ్య తాకదలె నంత
జగజంపు గొడుగులు జమిలి
పెక్కెముులు
పగడంపు ఛాయల పటువైన నగలు
తందరను భేరీ మృదంగములు
మ్రోయ
సందడింపుచు రాజ సన్నాహములును
సరదార్లు తోటట్లు సయ్యన గదలె
ఆ రాజు యిరుగడల అను వొంద
భట్టులు
చేరి కైవారముల్ చేయుచు రాగ
వరుసతో బ్రాహ్మణ వరులు దీవింప
విరివైన ధనకొండ వీథు లూరేగ
బాలరాజులు పోవు పయనంబు
తెలిసి
చెలియ లందరు వేగ సేసలు
గొనుచు
విలసిల్లు శృంగార వీథి కేతెంచి
చెలియలు దీవించి సేసలు వైవ
భూతలా ధీశ్వరు పొడగని పొగడి
ఆ తరుణులు కుంకు మటు చల్లిరంత
తగ నొప్ప అయితమధరణీశు చూచి
మగువలు గందవొడి మరి చల్లి
రపుడు
జనునాథులను చూచి చెలగి యావేళ
ఘన [illegible]సంలము దెచ్చి కాంతలు
చల్లిరి
ఆం[illegible] నా మూకలు అతి భీకరమున
ప[illegible]బు [illegible]చు పరి పరి గతుల

గంగ వారుపు గమిడి గడిమన్నెవారు
పొంగుచు కదలిరి బోకు కలగంగ
విండ్ల చెరువు గమిడి విడిమూక
కొంత
మెండుగా కదలిరి మెరసి
యాడుచును
అచ్చాళి మూకతో అశ్వాల నెక్కి
కొచ్చర్ల గమిడిని గొయ్యిన గదలె
గుడిపాటి గమిడిని గుర్రాల వెక్కి
వడివడిగా దండు వచ్చె నాక్షణమె
పొట్టపాటి గవని బొందియల బార్లు
కట్టుగా కదిలిరి కడు మోదమునను
హనుమంత గవనిని అయితమ రాజు
తనతోడ మూకల తరలించి కదలె
పాడి గొర్లను విడిచి పడ పొడిపించి
యిల పిక్కటిల అశ్వదళను కెల్ల
శ్రీరామ మాడలు చేతుల కొలది
యిర వంద నిచ్చుచు యేతెంచుచున్న
కొల్లకాం[illegible]దరు కూడి ముందరసు
మల్లెల వాగును మని వాగు చూప
ఆ సమయంబున అయి[illegible]మ రాజు
యెసగంగ దొడ్డతన మేలు మన్నీల
దనకొండకును వారి తగమల్లి అంపి
యినకులాధీశుండు వేగంబె కదిలి
పొదిలి నిమ్మనాధుని [illegible]తేతెంచి
పొరిలె నిమ్మనాధుని పొ[illegible]ంచివారు
అంచగిరి పల్లెకు అయిత[illegible] వెడలి
అంద్రగిరి భీమేశు నపుడ[illegible] సేవించి

## అయితమరాజు దండు పాళేటు నిలచుట

తలకొని వక లక్ష దళముల తోడ
బాల రాజయితన్న పాళేట నిలిచె
నిలచె గుఱ్ఱపు దండు నిలచె
నేనుగులు
నిలచె దళములు పెక్కు నిలచె
రఘుపతియు
గండ భేరుంచని గర్బ హనుమంత
జెండాలు వేసనెత్తి చాటించి రచట
సూర్యుడంతట గ్రుంకె చుక్కలు
పొడిచె
ధరణిపై యాదవధవు కీర్తి పొగడు
విధమున చంద్రుండు వుదయించె
తూర్పు
అది చూడమనినట్లు నడచెను మింట
అంత అయితమ రాజు ఆల సఖులు
తాను
సంతోషమున నున్న సరదార్లు
పొగడ
బిరుదైన వాద్యములు
పిల్లగ్రోవులును
భేరులు శంఖములు పెద్ద బూరుగలు
పంచవాద్యంబులు బలువిడిమ్రోయ
పంచాయి దివిటీల బారుల గాంచి
యొచ్చ రింపుచు దండు
యేగుచు వారు

అచ్చటచ్చటనిల్పి అటు లెచ్చరింప
పాళేట నీ రీతి ప్రఖ్యాతిగాను
వలనొప్ప రఘుపతి వసుధేశుడుండె
ఆవేళ నలనన్న ఆ రాఘవుండు
దేవేంద్రు జనుదెంచు
దివ్య తమకమున
సమముగా గూర్చుండి సందడాలించి
కొమర భంగరుభట్టు గొబ్బున బలిచె
"యిటు విన వో భట్ట! యీ
ప్రొద్దదేమొ
పటునాదములు చాల పాళేటి వెంట
పెనుమోత మ్రోగెను భేరి నాదములు
యిను డస్తమించెను యీ సంధ్యవేళ
మన దళంబులో లేక మరివకరి
దళమొ
సరగ మనపై వచ్చు శత్రులోకాక
యెవరైన మిత్రులో యేమిటో తెలిసి
వేవేగ రావలె వినుమొక్క మాట
పోరుకు తొడిబట పోరాదు మనము
దూరంబు తెలియక దొరకొనరాదు
నీవేగి యీవార్త నేర్పున దెలిసి
వేలేగ ర"మ్మన్న వేట్కనా భట్టు

## కాటమరాజుభట్టు వచ్చి అయితమరాజు దండును ప్రశ్నించుట

పరువున బోయి యా బలముల జూచి
ధీరుడై యా భట్టు తెరగొప్పపలికె
"వో వీర పరివార! వొనరంగ వినుడు
యీ వసుధేశ్వరుం డెవ్వడు? యిటకు
సాహసంబున వచ్చు చందంబుదేమి?
సాహసంబున మందసరస కొచ్చితిరి
రణవిజయుండు మా రాజు నలన్న
కణగి శత్రులనెల్ల కల్లుగా జంపు
బలువైన రాజ్యాలు పరిపించి యిపుడు
బలువుగా యరగడ్డ పాటను నిలచె
భటులు ముప్పదివేలు బహు కాల్బలములు
నిటలాక్షుతోనైన నెదిరింప గలరు
దాచక చెప్పడీ దళములోవార!
తోచి యుండగవలె దొడ్డ కార్యంబు
ధాతకైనను మంద దాచంగ రాదు
పోతుటీగైనను పొలియంగ రాదు
చూపుల వెరుమాన చూడంగ రాదు
భూపతులకు మంద పొడగట్ట రాదు
యిదిప్రొద్దు ఋదివేళ యీ పటాటోపము
యిది వచ్చి నిలుచుట యేమి కార్యంబు?
మీది గోత్రముపేరు మీ తండ్రిపేరు
పదపడి మీరేలు పట్టణము పేరు
అదియంత వినిపంపు దతివేగ మీరు
గొదకొని మీరేల కూడినారిటను?
బంధుగులో మీరు? పగవారో మాకు?
చందం బదేమిటో చాటింపరయ్య

## ఆయితమరాజుభట్టు తమ వృత్తాంతమును దెలుపుట

అనిన అంతట భట్టు ఆ భట్టుతోడ
యినకులాధిపుడున్న విడిపట్టుకేగె
అడిగిన యర్థంబు లంత తెలుపుటకు
వినయాన భట్టుతో వివరంబు పలికె
''కామరబంగారమా! కామర వినవయ్య!
అమిత విక్రమశాలి యాదవరాజు
వళధాజు ఘనుమడు వార్తమన్నీడు
పోలురాజు కొమారుడు భోగ దేవేంద్రుడు
బాలరాజై తన్న పట్టభద్రునకు
అల పల్లికొండకు అదిపెద్దలకు
ధనకొండ యేలేటి ధరణీశ్వరులకు
అన్నదమ్ములకును ఆత్మవర్గముకు
జయలేఖలను గొంచు చెలగి కాలారి
వైనాన ధనకొండవచ్చి లేఖలను

నన్ను కాటమరాజు అంపించె ననుచు
వున్నతంబుగ జెప్ప వొయ్యన లేచి
అన్న అంపిన కమ్మనంది శిరసునను
కన్నుల కద్దుక కడువేగ జూచి
వైనాన వల్లవుల్ విన చదివించి
పైనమై వచ్చితి బలములతోను
అత్రేయ గోత్రులు అమృతవల్లవులు
ధాత్రి వెలసిన యట్టి ధర్మవర్తనులు
యసగంగ విభవ దేవేంద్ర సము
లగుచు
వసుధ మించినయట్టి వంశవర్ధ
నులు
పల్లికొండ రఘుపతి భట్టావులన్న
వల్లవకులజులు వంశవర్ధనులు
భుజ బలాధిపుడైన పుత్తమరాజు
గజవైరి భీకరుడు కరియావులన్న
నాచకూళ్ళ నాయుడు నేతి ముద్దయ్య
రాచ బలములు కొంత రౌతు అల్లు
దాడెన్న

మెరసిన యొకలక్ష మెండు
రాహుతులు
పరగిన మూకతో బసవదేవునికి
పెండ్లని వినిమేము ప్రేమతోడుతను
తమ్ముడు అయితన్న తగవచ్చె
ననుచు
తెగువ చెప్పినమాట తెచ్చి మదిలోన
పగవారు గారనుమి బాంధవులనుమి
అన్న నలనన్నకు అయితన్న చాల
మన్ననలు చెప్పెనని మరి
విన్నవించు''
అని భట్టుకును చాల హర్షంబు పుట్ట
ఘన భూషణంబులు కడువేగ నిచ్చి
అంపిన ఆభట్టు అతిసంభ్రమమున
యింపొందగా వచ్చి వృత్తాంత
మంత
నలనన్నకును దెల్ప నాత్మలో మెచ్చి
పల్లికొండను జూడ పైనమైనంత

## కాటమరాజు వచ్చి పల్లికొండ అయితమరాజాదులను సంభావించుట

మందర ధీరుండు మహాసత్వ ధనుడు
పద్మ రాఘవుడును పైనమైవచ్చె
యరనన్న చట్టువారి యర్రన్న
మొదలు
పరివార మొక కొంత బలిసి
కొల్వగను

సరదార్లు వకకొంత జతనమై నడువ
అందలం బెక్కెను ఆవులన్నయును
అందమౌ పల్లకిని అల రాఘవుండు
హేమ పల్లకిపైని యర్రయ్య యెక్క
అమితమౌ బంగారు అందలము
పైని

చుట్టు వారె్రరయ్య సయ్యనయెక్కి
దిట్టమౌ కాగు దివిటీలు వెయ్యి
పట్టించిరప్పుడు ప్రభలి శంఖములు
దిట్టమై వూదుచు ఢద్ధిమిధ్వనుల
బూరలు దారలు వూని గౌరులును
ఆరూఢి మ్రోవంగ అవనీశ్వరుండు
వచ్చుట గనుగొని వారికెదురుగను
యచ్చెరికె అయితన్న యాదవులు
గొల్వ
తమ్ముల పుట్టేటి తగవచ్చె నంత
తమ్ముల గనుగొని తమ అందలములు
పల్లకీలను తగ్గి బావ రఘుపతికి
నలనన్న మనసులో నటు మ్రొక్కె
నంత
కన్నుల దీవించె ఘనుడు రఘుపతియు
వినయంబుననను రాగ వీరశేఖరుడు
దండంబు బెట్టినను తరిని యర్రయ్య
దండంబు బెట్టెను చుట్టువారె్రరు
అందరిని దీవించి ఆ పల్లికొండ
అందరు పొగడగా అపుడు నలనన్న
కమిగిట జేర్చుక ఘనుడు
రఘుపతియు
నగుచు మెల్లన నలనన్న కిట్లనియె:
''పసుపతి! నలనన్న! పట్టాభిషేక
వసుధలో యాదవంశ కుల తిలక!
మునకొని మీ తాత ముత్తాతలందు
యనయంగ మీ తండ్రులేప్పురు
మునుపు
అగణిత నిర్వహించిరి కాని,,,
పగవారి నిటువలె పాలించలేదు.
ఛప్పన్న దేశాల ధేనువులమేపి
వాకొన్న కన్న దేశానవున్న శత్రువుల
వుక్కణగించితిమి వుర్విలోపలను
మానవేశ్వర! అపుడు మనుజ
లోకమున
పనిబూని వెలసిన పరమేశ్వరుడవు
యనయంగ నూటయిరువది యేండ్ల
మీరు
యిల తాత తండ్రి పగలీదేర్చినావు
యీనాట నినుబోల యింత
సాహసుడు లేడు
కలియుగంబున నీదు కథనిలుచు
నంత''
అని చాల భూషించి అక్కున జేర్చి
మనసున సంతోషమున నొప్పుచుండె
ఆ సమయంబున అయితమరాజు
యసగ తమ్ములు సుతులు
యదుకులాపతులు
భావలు మరుదులు బంధువులతోటి
ఆ వీర శూరులు అందరు వచ్చి
పసుపతి నలనన్న పాదపద్మములు
పొసగ మ్రొక్కిన వారి పొగడి
దీవించి
అయితన్న గనుగొని అవులన్నియును
దయమీర గొనియాడి తమ్ముల
నపుడు
కర పల్లవములచే కడు లేవదీసి

వురువార నెత్తికొని వుర్విపై దించి
అనుజుల తమ్ముల ఆత్మబంధువుల
కొనియాడి నలనన్న గొబ్బున పలికె
"పోలురాజు కుమార! భోగదేవేంద్ర!
బాలరాజైనట్టి పట్టభద్రుండ!
అందరు వస్తిరి అలరిన వేట్క
ముందు నా తమ్ముడు ముమ్మయ్య యేడి
యేడి నా అల్లుడు? యేడి పోచయ్య
కడు వేగ మీ వెంట కదలి రాలేదు?
కాశాత్ర పోయిన కడు పుణ్యఘనుడు
వాసిగా మిము గలసి వారు రారైరి
కానిమ్ము దైవసంకల్ప మెట్టిదియొ!"
అను వాక్యములకును అయితమరాజు
వినుమని నలనన్నతో యిట్లని పలికె:
"అరయంగ శివగురువు అన్నభక్తి రన్న
పరిణాన గయయందు ప్రఖ్యాతినుండు
యిప్పటిమము గలియ యిటకురాలేదు
యప్పటికి వచ్చునో యెరుగంగరాదు
ముమ్మయ్య పోచయ్య ముద్దుబాలకుల
అమ్మ వున్నట్టి యా ధనకొండలోను
సమ్మతముగా కొంత కానలగూర్చి
నెమ్మది వక కొన్ని నేర్పులు దెలిపి
పదిలమని ధనకొండ పట్నాన వుంచి
కదలిన స్తిమి మేము కాటభూపాల!"
అని విన్నపము శాయ అయితన్న నవుడు
అని యేక విధముల అపుడు గొనియాడి
తన మరిది రాఘవు తనుజేరి కొలువ
దొరకొని హరిగురువు తోడుగా నడువ
నరనాథుడయితన్న నలనన్నతోడ
తన ఆత్మబంధువులను తగిన పెద్ద లను
మరలి వారందరూ మాటలాడుచును
అరుదుగా అరువది ఆరుకంబాల
చెలువొందపట్టు జముకాళ పరచి
అంత పువ్వులపాన్పు అటు పరచి పైని
పందుముల రఘుపతిని పరగంగ నునిచి
అందరు నలనన్న ఆప లీవలను
పొందుగా గూర్చుండి పొద్దు చూచుచును
కద్దు లేదనకుండ గల కానలెల్ల
ఆరాత్రి పెండ్లి యాలోచన రీతి
రఘుపతి నలనన్న రాచకార్యములు
పగసాటి పంతములు భాషించుచుండె

శ్రీరామార్పణమస్తు
శ్రీరాములు నీవే గలవు

# వేడుక బొంగరాల కథ
## (ఆలుగుల పోలు)

### అవతారిక

శ్రీపార్వతీనాధు చిత్తమువ దలచి
గోపాలకృష్ణుని కోరి నుతియించి
బ్రహ్మదేవుని వేడి భాగీరథికిమ్రొక్కి
సింహయానకు మ్రొక్కి చెలగి
గణపతికి
సాష్టాంగ మొనరించి సరగున
మ్రొక్కి
అష్టాదశ వర్ణాల[1] అయ్యల గొనియాడి
ఆది మహాకవులకు హస్తములు
మొగిచి
చెప్పనేర్చినవారి సేవకుడ నేను
పృథివిలో ముమ్మయ్య
పోచయ్య లిద్దరు
ధనకొంత లోపల తగ వేట్కతోను
పనిబడి కతసతి బాలలిద్దరును
బొంగరాలాడిన పూనిక వినుడి
సంగతి చెప్పెద శ్రవణానందముగ
యింపుగా సభవారు యిందరు మీరు
కంపింప యీ కథ ఘనులార వినుడి.

## ముమ్మయ్య పోచయ్యలు వేడుక బొంగరాలాడుట

ముమ్మయ్య పోచయ్య ముద్దు
బాలలును
అమ్మనగరు బొంగరాలు అందుకొని
వేగ
కనకసరి పచ్చల కంఠసరి బాలలు
అనుదినము బొంగరా లాడుచు నుండ
పధ్నాలుగు యేండ్లు పర్యంతము
దనుక
అరుదైన బొంగరాలు ఆడుచునుండిరి
చిత్రభాను సంవత్సర శివరాత్రి
దినము
శాస్త్రవంతులైన చిన్ని బాలలును
దేవేంద్ర వైభోగ ధీరులై వుండి
దేవతా బొంగరాలు దినదినము వారు
సంతోషచిత్తులై చతురత నాడ
అంత్యకాలము వారికి అయ్యేటి
తుదకు

---

1. 'అష్టాదశ విద్యల'

వేడ్కతో నాడిరి వెంకి ముఖికి బొంగరాలు
ఆడి చాలించిరి అవి ముద్దరించి
ఇచ్చిన బొంగరాలు పదివేలు చేయించి[2]

## ముమ్మయ్య పోచయ్యలు దేవతాబొంగరా లిమ్మని సిరిదేవి కొమరక్కలను కోరుడ

పోచయ్య ముమ్మయ్య పొంకంబు మెరసి
"పెద్దలనాటి బొంగరాలు పెట్టెల నున్నవి
యిద్దరము పలుకరించకగాని యివ్వదు తల్లి"
అని యిట్లు తలపోసి అమ్మనగరుకు వచ్చి
చనవున బాలలు తల్లి సముఖాన నిలచి
కామిత ఫలార్థులై కరములు మొగిచి
"పద్మలోచనలార! పద్మినులార!
విద్వాంసులైనట్టి వో వెలదులార!
యిన్నాళ్ళ దనుకను వేడుక బొంగరా లాడితిమి
పదిలముగ దాచినారు బంగారు బొంగరాలు
ముదమొప్ప అవి మాకు ముందర బెట్టించు
సిరిలక్ష్మి పార్వతి సరివచ్చు మీరు
వెలదిరో! యిప్పుడు హేమ బొంగరాలు
మారు మాటాడక మంచి వాక్యమున
తీరైన బొంగరాలు దీవించి యియ్యండి"

## అశుభములను తెచ్చేడి దేవతా బొంగరాలను ఆడవలదని సిరిదేవి కొమరక్కలు బాలురకు హితవు చెప్పుట

బాలల మాటలకు పణతు లిట్లనిరి:
"వాలాయముగ బాలలార! వచ్చి మీరిపుడు
దేవతా బొంగరాలు తెమ్మంటి రిపుడు
అవి మీకు వద్దురోయి అన్నలార వినుడి

2. 'పదిలము చేయించి'

అరుగురుకి చక్రవర్తుల పదహార్గురు
రాజులు
పరగంగ నాడిరి పనిబూని వారు
వరుసతో వారంత వర్ధిల్లరైరి
అంతలేసివారు సహ ఆ యుగమందు
కంటసమున కొందరు కలహమున
కొందరు
పోయినారను మాట భూమిలో
విందుము
జయముగాని బొంగరాలు క్షేమాన
వుండి
ఆడ మీకేటికి అన్నలార! వినుడి
పాయక ఆడిన ఫలమేమి మీకు
యప్పటివలె మీరు యేర్పాటుగాను
తప్పులు వొప్పులు తరువాత లేక
నేను చేయించిన బచ్చన బొంగరాలు
కోడికలార! మీరు బొంగరాల
బయట
ఆడుడి అన్నలార! అందముగ మీరు
దేవతా బొంగరాలు తెమ్మనవచ్చునా?
రామలక్ష్మణులు రమణతో నాడి
సీమెల్ల యెరుగంగ సీతను
గోల్పోయిరి
బలభద్ర కృష్ణులు పరగంగ నాడి
జగములో ద్వారక సమయదే నాడు
నాటి నుండి బొంగరాలు నేటి
దనుకాను

తరతరము బొంగరాలు తరవనే
వెరతు
వశముకాసి బొంగరాలు వద్దు
మీ''కనిన
సిరిదేవి కొమరక్క చెప్పిన
మాటలకు
వరుసతో బాలలకు వజ్రాలు నాటి
వీపున మొనలు వెళ్ళి నట్లాయె:
"సంపదల కాశించి శరీరములు
దాచుక
బతికేటి వారికి భయమదే తల్లి?
తతికాలము చేరుంవ సవత్సరము
తిరిగింది[4]
వోయమ్మ సిరిదేవి! వద్దనక నీవు
పసిడి బొంగరాలిచ్చి పంపవే తల్లి!
దేవతలాడినారు దివ్యబాణములవంటి
బంగారు ములుకుల బాగైన
బొంగరాలు
అవి తెచ్చి మాకిచ్చి అంపవే తల్లి!"
కంఠసరి బాలల కదలికలు చూచి:
"నేడైన బొంగరాలు నేనియ్య రాదు
అగుమంచి యిస్తేను అన్నిటికి లెస్స
సరియని బొంగరాలు సైదోడు ఇస్తె
అనుమాన ముండదు అన్నలార!
యెపుడు
ఘనవేగ బొంగరాలు గ్రక్కున దె''
మ్మనిన

3. 'అర్వూరు' 4. 'చేరికాలము దగ్గరకు వచ్చె సంవత్సర ఫలము

## అగుమంచి దేవతా బొంగరాలు తెచ్చి బాలురకిచ్చుట

సిరిదేవి మాటవిని శ్రీఘమే పోయి
హరిహరాదుల ప్రార్థించి అర్ఘ్యంబు
లిచ్చి
మందసము తలుపులు మరివేగ
దెరచి
దండైన బంగారు జలపోత బొంగ
రాలు
జాల వల్లికలోను జననాథు చెల్లెలు
అతివేగమున దీవించి అగుమంచి
యిచ్చె.
అలరంగ సన్నపట్టు చీరె పరిపించి
ఆమీద కనకము రాశి పోయించి
రాశిపై పెట్టుక రమణి తానపుడు
వేమారు అక్కస్తి వెలది తాదెచ్చి
శేషుని బోలిన జలపోత బొంగరాలు
అతివేగ దీవించి అగుమంచి యిచ్చె:
"ప్రతి వాదించక బాలలార! మీరు
వోడు గెల్పులు లేక వుర్విపై మీరు
ఆడుడి బొంగరాలు హరిహరుల బోలి
పుచ్చుకొండి బాలలార! పుత్తడి
బొంగరాలు"
హెచ్చుగా ముమ్మయ్య యలమి
పోచయ్య
అందిరి బొంగరాలు అగుమంచి చాత
కందువతో లింగముద్ర కలిగిన
బొంగరాలు
ముమ్మయ్య అందుకొని మ్రొక్కెను
వేగ
విష్ణుముద్ర బొంగరాలు వీర
శూరుండు
పచ్చందుల పోచయ్య పరగ తానందె
అక్షయంబుగ వాదు అతి వేట్కతోను
అందించిన బాలలు అమ్మనగరు
వెడలి
రంజిల్లు అయితమ రాజు
కొలువుండేటి
మద్దికాయల మేడ వద్దకు వచ్చిరి.

## బాలురు సంగడీలతో కలిసి పందెముల చవికెకు వెళ్లుట

పట్టయిన మేషాలకు పల్లాలు వైచి
పట్టు వాగెలు బట్టుక బాలలకు
దెచ్చిరి
గజ బిరుదు అనువాడు గ్రహరాజు
అనువాడు
వదలక బొటికలు పరగంగ నపుడు

ముద మొప్ప వేడుకల* మ స్తీదు
చేసిరి
వేడుకల నెక్కిరి యిద్దరు సంగడీలు
అందలాలు యెక్కిరి అతివేగమున
కొందరు
కొందరు సంగడీలు గుర్రాలు నెక్కిరి
కొదువలేని బొంగరాలు గొలుసుల
పేర్లు
కుంటు కొమ్మ వేడుకలకు సూర్య
పుటము వాగెలు
పట్టు కుచ్చుల మంచి బంగారు
పల్లాలు
ముత్యాల కుచ్చులు ముఖ
మరుగులాను
పుత్తడి తీరుట్లు పువ్వులమంచి
డాకాల పెండెము జగ్గుల మ స్తీదు
భీకరంబైనట్టి బిరుదు మేషముల
కొదువలేని బంగారు గొలుసుల పేర్లు
మట్టు సొమ్ముల బటువైన వేషములు
ధరియించి
బొటికలిద్దరు కడు వేడుకల వచ్చిరి
వేడుకలవంక జూచి చుట్టాలు
వేడ్కపడి అపుడు
అచ్చగా పల్లకీలో అలర వేడుకను
యెచ్చుగా ముమ్మయ్య యెక్కెనా
వేళ
పచ్చందుల పోచయ్య పల్లకీలోను
మచ్చికతో నెక్కి మరివేట్క కదిలె

ముత్యాల గొడుగుల నీడ ముమ్మయ్య
కదిలె
చిత్తజుడు పోచయ్య శీఘ్రమే
అపుడు
పట్టుగొలని సభ బాగొప్ప గదిలె
ముందుగా బొటికలు పొట్టేళ్ళ నెక్కి
అ దలాలు యెక్కి మరికొందరు
గదిలిరి
కొందరు సంగడీలు గోడిగల
నెక్కిరి
సూర్య సోమవీధులవెంట శూరులైన
బాలలు
పేరేల ద్రొక్కించు బిరుదు
మేషముల
తప్పెట్లు పిల్లగ్రోవుల దారలు
బూరలు
వుపాంగములచేత వూరు వెళ్ళిరాగ
అప్పుడు ఘోషించి అవని కంపింప
నెట్టన వాద్యములు నెరసి
మ్రోయంగ
పట్టణము వారెల్ల బ్రమసి చూడంగ
విష్ణుండు పోచయ్య యీశ్వరుడు
ముమ్మయ్య
వాలాయముగ బాలలు వచ్చిన
విధము
ముప్పై అయిదుగురు బాలలు
ముమ్మయ్యను గొలచిరాగ

---

* వేడుకలు = వడికలు

అప్పుడు ముప్పైయింటికి అల్లుని
గొలచిరాగ
యిద్దరువెంట అర వైపైగా
యిరుగడల రాగ
అరుదైన గచ్చుటరిగెలు పట్టంగ
బంగారు బొంగరాలు పట్టించుకోని
సంగడీలు దామ సయ్యన కదలిరి
బొడ్డుగంటలు పేరెములు బారుచూను
వేడుకల బోడికలు హెచ్చరికతోను
వడివడి బాలలు వచ్చిరి కదలి
హొలుపొందు వేడుకలు పోడిములు
దొలకంగ
బాలకులు బొంగరాల బయటికి
దెచ్చిరి
తెట్టెరావుల బయట దేవుని
గుళ్ళవద్ద
పుట్టమెగసి బాలలు పొట్టేళ్ళ దిగిరి

వాగెల కురుసాలెలు[5] వారందుకొనిరి
మేఘముల వెంట నీలమేఘముల
దెచ్చి[6]
మరివేగ సురపొన్నమానుల కట్టిరి
యిరుగడల సంగడీలు యెక్కిన
అందలాలు
అన్నరావుల బయట అందలాలు
దిగెను
ధన్యులకు బట్టిన జగజంపు
గొడుగులు
కొండరావుల క్రింద గొడుగులు
జేర్చిరి
పండిన పనసల క్రింద పల్లకీలు
చేర్చిరి
పందార చవికలో బాలలు సంగడీలు
అందరు కొలువుదీరి అతివేడ్క
నుండిరి

## బొంగరాలాట ప్రారంభము

అలరంగ బొంగరాలు
ఆడుదామనుచు
కొలువున్న బాలలు గొబ్బున లేచి
కాళలు బిగువార కట్టిరి వేగ
వాసిగా బొంగరాలు వారందుకొనిరి
కుశలవులు ఆడిరి కొంతకాలంబు
త్రేతాయుగమునాడు తెరగొప్పగాను

రాముడు లక్ష్మణుడు రమణతో
నాడిరి
ధరయెల్ల యెరుగగా ద్వాపర
యుగమందు
బలభద్ర కృష్ణులు పరగంగ నాడిరి
దూర్వాసు శాపమున డుల్లిరి
యాదవులు

5. కురుసోలలు 6. శేషువు బోలిన వేషములు దెచ్చి

పేరులు కలియుగమున పెంపొంద
వలెనని
బ్రహ్మ త్రిమూర్తులు పరగ
దీవించిరి
అంబోధి బిలమున అంబరీషుకు
గొల్ల
కుంభిని మీద రాళ్ళెల్ల గోవులై
పుట్టెను
అంభోధి వంశమున ఆయెపరీక్షిత్తు
పరీక్షిత్తు వంశాన బలువైన
బొంగరాలు
తరతరము నాటినుండి దాచిన
బొంగరాలు
దాచిన బొంగరాలు ధాత్రిపై నిలిపి
పోచయ్య ముమ్మయ్య బొంగరాలు
అడిరి

## సంగడీలను ఉద్దీలుగా సమకూర్చుట

పొంగుచు బాలలు బోడికల జూచి
సంగడీల వుద్దీల సమకూర్చిరపుడు:
"జెట్టి బోయినమల్లు! జడదార వెంకట
యిట్టె మీరిద్దరు వుద్ది గమ్మనెను
చిట్టెబోయిన కఠారి! సింహాద్రి
ఇక్కన!
ఘట్టిగా మీ రిద్దరు కడువేగ వుద్ది
శంఖుదారి చెన్ను! చవుల
నారాయణ!
పొంకముగ మీరిద్దరు బొంగరాల
వుద్ది
తరికోటి ధర్మన్న! తమకము
తాతన్న!
మరవక మీరిద్దరు మరివేగ వుద్ది
కరియావుల కనకన్న! గాలము
సత్తన్న
పరగ మీరిద్దరు పద్దుకు వుద్ది
మట్టెబోయిన పాపన్న! మట్టెయావుల
చెన్ను!
అందముగ మీరిద్దరు ఆడుడి వుద్ది"
అని పల్కి సంగడీలు ఆడిరి
బొంగరాలు
పోడిమితో బాలలు బొంగరాలాడంగ
వనముల నీడల వ్రాసిరి గ్రైరలు[7]

## పురస్త్రీలు బొంగరాలాటను వేడుకతో చూచుట

భామలు నీరుమోయ బావులు మూడు అగుమంచి కట్టించిన అగ్గణాల బావి

7. వచ్చిరి ప్రజలు

ముమ్మయ్య కట్టించిన ముత్యాలబావి
నిమ్మలు మారెళ్లు నేరేళ్ళు చుట్టు
సిరిదేవి కట్టించిన చెంగల్వబావి
ఆరువేళల బావికి అటు దక్షిణాన
కల్లోల కాంతలు గంగరావుల బయట
మల్లెలు జాజులు మారేళ్ళు పనసలు
గురుతైన శంభుని గుళ్ళు దాపునను
కూర్మితో బావుల కూడలి నడుమ
వృద్ధులు వకరొకరు వొనరంగ బట్టిరి
అరుదైన బొంగరాలు ఆడుచునుండిరి
బాలల ఆటలు వచ్చి ప్రజలు చూచేరు
పాలకావిళ్ళవారు బారుగట్టుకొని
సిరిబాల ముమ్మయ్యను చేరి చూచేరు
తిరుపతి పరుషపలెను తిరుగు బారుకొని
భోరున చూచేరు పోచయ్యను ముంచుకొని
మురుస్తూ చూచేరు ముమ్మయ్యను ముంచుకొని
కాంతలు మగువలు గంధర్వస్త్రీలు
సంతోషమున చూచేరు సభవారు నిండి

సంగడీల ఆటలు సభవారు చూడంగ
బొంగరాలాడేరు పోచయ్య ముమ్మయ్య
వకచేత బొంగరాలు వకచేత జాలెలు
డాచేత బొంగరము వలచేత జాలె
పుచ్చుకొని బొంగరాలు పృథివెల్ల ఎరుగ
పదివేల దీరింది పాలమాని బొంగరము
పాలమాని బొంగరానికి పగిడిది ములికి
యేనూటికి దీరింది యేదెమాని బొంగరము
యేగెమాని బొంగరానికి యెండిది ములికి
పట్టునూలు దాపిన బలువైన బొంగరాలు
చుట్టిరి జాలెలు చోద్యంబుగాను
సిరిబాలలు ముమ్మయ్య చిన్ని పోచయ్య
వేడుక బొంగరాలు వకవిడుత నాడిరి

## పందెము కట్టుమని పోచయ్య ముమ్మయ్యను సవాలు చేయుట

ఆడి చాలించియు అపుడు పోచయ్య వల్లవుల ముమ్మయ్యతో వక మాట పలికె

"కల్లరిపులకు వైరి కంఠసరి
ముత్యమా!
అమర విభునికి జోడు మాయమ్మ
సైదోడు
నా మీద ప్రేమగల నా మేనమామ!
అలరు పుత్తడిబొమ్మ! అమృతంపు
గుమ్మ!
వలసి పగడపుకొమ్మ !
సిరిభామవమ్మ!
విన్నపముచేసేను వినవె వోమామ!
యిన్నాళ్ళ దనుకను వేడుక
బొంగరాలు
ఆకితిమి యింతదనుక అవునని
మెచ్చంగ
వోడు గెల్పులులేక వుల్లాసమునకు
వడిగల వో మామ! వాది
ప్రతివాదించి
ఆడవలె బొంగరాలు అవనెల్ల నెరుగ
వోడుగెల్పులు రెండు కనవచ్చు
గాకిపుడు
వాటముగ పందెమిపుడు వప్పుకో
మామా!"

## పందెము వలదని ముమ్మయ్యకు పోచయ్య హితవు చెప్పుట

పోచయ్యమాటలకు పోలురాజు
సుతుడు:
"రచ్చరావుల చిలుక! రఘువంశ
తిలక!
కొమనాల సింహమ! గుణవిశాలంబ!
సమర బలభీమ! సర్వజ్ఞ వినుమ!
చిటినూక పట్టి చెలగి జగజెట్టి
గట్టిగ యేనుగును బట్టి కరముల గొట్టి
హరివంశమున బుట్టిన అగుమంచి
పట్టి!
రవితేజఘనుడ! రాజులకు అల్లుడ!
భావజు సమానుడ! బలభద్ర బలుడ!
వనర అమృతపు తేట!
వన్నెల మూట
ధరణి కనకపు కోట! ధర్మజుని
మాట!
పోర రిపులకు వైరి! పోచయ్య
వినుమ!
పరగ వాదింతాము పందెమది వినుమ
వనర యిద్దరిసందు వోడుగెల్పు
అయితేను
అనుమానము కలదు అల్లుడ!
పోచయ్య!
నీవు గనుక వోడితే నేరంబు తనది

తాను గనుక వోడితే తల వంపు నీది
వోపు పందెము వద్దు వద్దికతో మనకు
ఆటలకు బొంగరాలు ఆడుదాము
వినుమ
దేవతలు ఆడి తొల్లి దేశములు
విడిచిరి
కౌరవులు పాండవులు ఆడి కాపురాలు
విడిచిరి
తాతలు ఆడిరి ధనములు వోడిరి
బలరామ కృష్ణులు పరగంగ నాడ
జలములో ద్వారక సమిశను నాడు
రాముడు మరిసెట్టి రమణతో నాడి
జమదగ్ని గోల్పోయెను చీకటి
కోనలోను
రామ లక్ష్మణులును రమణతో నాడి
సీమెల్ల యెరుగంగ సీతను గోల్పోయిరి
కుశలవులు తమరాడి ఘోరాజిలోను
యసగంగ తండ్రి మీద
యెదిరించినారు
వోడు గెల్పులులేక వూరికేమనమ
ఆడుదాము బొంగరాలు అల్లుడ!
పోచయ్య!''

## పందెము ఒద్దుమని పోచయ్య ముమ్మయ్యను బలవంతము చేయుట

మరివేగ పోచయ్య మామ మాటలు
విని
అరయంగ వకమాట ఆనతి యిచ్చెను!
పందెము వప్పుకొమ్మని పలికె
పోచయ్య
కందువతో ముమ్మయ్య కలకల
నవ్వె;
"యంత చెప్పినగాని యెరుగవు నీవు
పందెము కావలెనని పదిరేవు సారె
యేమి పందెమడిగిన యిస్తును నేను
ధీమంతుడ! కోపంబు తెచ్చుకోవద్దు''
మామాడు మాటలకు మరి చిన్ని
పోచయ్య
పంతముతొ పోచయ్య పలికె నావేళ
''యంత మాటాడితివి
యదుకులాధీశ!
పోరు వచ్చిన వెనుక తల్లి పుట్టింటి
పేరు చెప్పుకుంటేను బిరుదు దక్కేనా?
వెనుకకు తియ్యనేటికి వినవే
వో మామ!
కనకము వక పందెము కవులావులు
వక పందెము
మెడనున్న సొమ్ములకు మేటి
పందెంబు
వీటితోనె వోడుగెల్పులు వినవె
వో మామ!
అడుగు దర్లక వొద్దు"మనెను
పోచయ్య

అల్లుడు మాటలకు అప్పుడు
ముమ్మయ్య
వొప్పుగా పోచయ్యతో వొనర
ఇట్లనియె:
''అక్క కుమారుడవు ఆడితివిగాక
తక్కిన వాడైతె తలవంచ గలన?
వక్క పందెము నీవు వొప్పితివి
యిపుడు
రెండో పందెము లేదనరాదు
మూడో పందెమున కంటు మొనసి
ఆడితేను''
ముమ్మయ్య మాటలకు మరిజెప్పె
పోచయ్య;
''మామరో వో మామ! సిరిబాల
ముమ్మయ్య!
నీ మెడను వుండేటి పచ్చల కంఠ
మాల
లక్షలకు దీరినది పచ్చల కంఠమాల
వనమాల కంఠమాల వక్కసరిచేసి
భూనాథ! బొంగరాలు పూని
ఆడుదము''
అని యిట్ల పోచయ్య అడిగినందులకు
అనిన అల్లుని జూచి ఆ గుడ్డై బలికె;

## ముమ్మయ్య తన పచ్చల కంఠమాల విలువను చెప్పుట

కడువేగ కోపాన్ని కన్నుల
దొరయంగ
బడబాగ్నిరీతిని పలికె ముమ్మయ్య;
''కట కటా! నక్షత్రాల
కంఠమాలకును
కొయ్యబూసలు సాటి కోరితివి నీవు
వొయ్యన నిట్లాడ వాకెట్లు దోచె
చెల్లెలు కొడుకువు కాంగ చెప్పితివి
గాక
చెల్లున యిటువంటి చిన్నమాటలును?
రావణ బ్రహ్మను రణములో బట్టి
కావరం బణచిన యీ కంఠసరిమాల
తాటకిని మర్దించి ధనస్సును విరిచిన
ఘనమైన [illegible]జాల యీ కంఠసరియు
ధనకోటి స్థానంబు తగనాడి తెచ్చి
వనరంగ రత్నాల వజ్ర
కంఠమాలకును
వజ్రంగి చేసిన వనమాల పేరు
దుడ్డు చేయుని దెట్లు తోచె పోచయ్య
అమ్మ వున్న ధనకొండ అంగళ్ళ వెంట
అమ్ముదురు కాసుకొకటి ఆ
తులసిపేర్లు
కుబేరు చింతవద్ద కొండ వాగులను
సైలెస్సుగా బెరిగి చాల వున్నావి
కూలి వాండ్లుబోయి కోసి రంపాల
వెలబెట్టి అమ్ముదురు రాగికాసులకు

వాసికెక్కినయట్టి వజ్రాల
సొమ్ములకు
దాసరిపూసలు సరిశాయ తగునె?
గంద్రతనంబులు గ్రక్కున మాని
వుండుమా పోచయ్య!
వుండుమచ్చోట"

బాలుడు ముమ్మయ్య ఆడు వాక్య
ములు
కల్లందుల పోచయ్యకు కత్తులైనాటె
ఘనమైన యీటెలు నాటినట్లాయె
గురిజెసి బల్లాల గుమ్మినట్లాయె
ధారుణి మిన్నును తారసిలినట్లాయె
సమర నిశ్శంకుండు సరగ నిట్లనియె:

## పోచయ్య తన తులసి వనమాల మహిమను పొగడుట

"తోచని మాటాడెదవు
దొరనంట నీవు
యాచకులు పెట్టుదురు యిటువంటి
సొమ్ము
లెక్కదీరిన సొమ్ము నీవు పెట్టలేవు
లెక్కదీరని సొమ్ము నే పెట్టిచాను
మేనమామవు గనుక మించి వకమాట
అడితివి గనుకను అవును కాదనక
తడవు బట్టిన ముమ్మయ్య! తాళితి
గాక
సాక్షాది దేవుండు సకల జీవుండు
వంచనము లేనట్టి యీ వనమాల పేరు
ముగ్గురు త్రిమూర్తులకు మూల
స్తంభమైన
జగమెల్ల రక్షించు చెన్నుని వనమాల
పుట్టింప గిట్టింప భువనంబు లెరుగ
యిట్టి వనమాలకు యీ దేడగలదు?
యేనూరుకోట్ల భూమండలం బెల్ల
యనభై నాల్గు లక్షల జీవులనెల్ల

కాపాడు వనమాల కడతేర్చునెపుడు
శాపము కోపము శాంతగుణములును
వోపికతో రక్షించు యీ వనమాల
పేరు
దాపులు మాపులు నీ ధాస్యవస్తువులు
కృపతోను వనమాల గురుమోక్ష
మిచ్చు
వనమాల కొంచనము వున్నదా మామ?
కానక ఆడుచుంటివి ఘనుడ
ముమ్మయ్య!
నీసొమ్ము మహిమీద నిక్షేపముచేస్తె
పాషాణమై యుండు బాల ముమ్మయ్య!
వో మామ ముమ్మయ్య! వకవార్త
వినుము
సామెత జెప్పెను జగమెల్ల ఎరుగ
మీ తాతలు యేడుతరాల వారు
ఆయిదుగురు మీతండ్రులు పోట్లుబడి
హతముగా జెల్లిరి

వారికి మోక్షముగల్గె ఈ వనమాల కలిగిన రావు కలుగ తెలిపెను మామ
నుండి నీ బలువైన కంఠమాల ధరియించిన
ఏడుతరాల వారికి ఇహపరములు రావు
త్రోవ చెప్పుమా ముమ్మన్న! సరిపోను తనకు

## వలురాజునకు తులసితీర్థము పోయుట

తమవారినుండి మీ తాత తండ్రులకు
అమర పురికి త్రోవ అలనాడు కలిగె
కొంకు గాదామాట బొల్లావు
పాదమాన
వావిళ్ళ గుట్టల వంగల బయట
కాపుల కరణాల వెనక వేసుకొని
కలభూత గంగురాజుమీద కదిసి
యుద్ధంబు
చేసెను ఘనుడు మీతాత వలురాజు
కాలము కురుదలించ గంగదయ
తప్పె
వురుస్తలాలు [8] మీతాతకు గాయాలు
నాటి

వక్షమున పోట్లునాటి వరిగె మీ తాత
అచ్చోట మా తాత తరిముత్త జోయ
దుండగాను
మీ తాతకు తులశితీర్థంబు యిస్తేను
యిహపరములకు త్రో వగలిగె
విబుధనాధుడు మెచ్చె
సురలోక పుణ్యము చూడలిగేను
అచ్చోట నా వనమాల వశీకరము
ఆయ
నీ కంఠమాల యేమి వశీకరము
మామ?

## సింహాద్రి రాజునకు తులసితీర్థము పోయుట

ఇంకను వకమాట వినవె ముమ్మయ్య
శ్రీ కూర్మము మీద మీ పెదతండ్రి
సింహాద్రిరాజు
శ్రీ వైష్ణవుల కొరకు సింధుభళ్ళాని
రాజులమీద

యిడిబడి యుద్ధము చేసి (వీరుడై
చెలగి)
గట్టిగ యెదురొమ్మున గాయాలునాటి
సింధుభళ్లాని రాజుల శిరసులు నరికి

8. ఉరస్థలాన

చంద్రాయుధములు నాటి చెల్లె
మీతండ్రి
ఆచోట మా భూనాథ శంకరుండు
వుండగాను

మీ తండ్రికి తులశితీర్థములు పోసెనో
మామః

## పెద్దిరాజునకు తులసితీర్థము పోయుట

మావి మీద మీ తండ్రి పెద్దిరాజు
మారాచ పగలకు మరిదండు కదిలి
యేడేడు కుంభిళ్లుయేక తెగటార్చి
కడ కుంభిణి మీద కదసి పోరాడి
బహువాకి పోట్లు పెద్దిరాజుకు
జూంతికె తొలువులాయ
యిమ్మగా రొమ్మనయాటెలు నాటి
లక్షవెయ్యి జాంబుల రాజుల
సంహరించి
వన్నెగల పలుగురాళ్ళ వరిగె మీ
తండ్రి
ఆర్లపెంట రణమునందు అల్లిమాను
వద్దను

హతముగా చెల్లెను మీ తండ్రి
పెద్దిరాజు
అచ్చోట మా తాత దామసాని
పోతినేడు
దామసాని పోతినేడు దండిగల
శూరు డుండగాను
తులశితీర్థములు యిచ్చెను మీ
తండ్రికి
ఆచోట నా వనమాల వశికరమాయె
నీ కంఠమాల యేమి వశికరము
మామః

## యరనూక రాజునకు తులసితీర్థము పోయుట

యరుకుల పగలకు యరనూక రాజు
యేనుగనాథు కొండకు యేతెంచి
పోయి
యఱ్ఱ భూపతితోను యెదిరించి పోరి
యెదురొమ్ము గాయాలు యేకముగ
నాటి

యేనుగుకొండ తావాయెను యర
నూక రాజుకు
ఆచోట పులిమద్దుల రాఘవుండు
పుణ్యుడుండంగ
తులశితీర్థము యిచ్చె మీ తండ్రికి

ఆచోట నా వనమాల వశికరము ఆయె
నీ కంఠమాల యేమి వశికరము మామ?

## నలనూక రాజునకు తులసి తీర్థము పోయుట

నున్న బెజవాడను మీతండ్రి నల నూకరాజు
కంచుకు కాలు దువ్వి కదసి పోరాడి
నంది కేశవరాజు చేతి నరుకులు తగిలి
నడికల్లున చెల్లె మీ తండ్రి నలనూక రాజు
ఆచోట మావద్ద సూరినేడు వుండంగ
తులశితీర్థము యిచ్చె మీ తండ్రికి

## పోలురాజునకు తులసితీర్థము పోయుట

ఆవుల పోలురాజు అతి విక్రమశాలి
శ్రీరంగనాథుని చిత్తమున సేవించి
సీమ భూములకు మళ్లిరాగాను
చెరుకూరికి పడమర చిలకల మఱ్ఱి
చిలకల మఱ్ఱి దగ్గర ఆవుల మంద వుండంగ
జంగాలు వచ్చి మీ తండ్రి మరుగున జొచ్చిరి
మరుగున జొచ్చిన జంగాల్ల మాటేణ ఐట్టియ్యక
శ్రీశైలమునకు ఐంపెను మీ అయ్య పోలురాజు
జంగాల కొరకు మంచువంటి బోయదండు
మంచు వంటి బోయదండు మంద మీదికి నడిచె
మంద మీదికి వచ్చిన బాణములు మఱ్ఱిమీదపడెను
వృక్షము తిరుగు వోకర వీర క్షేత్ర మాయె
కాయలు రాలినట్లు కంపటీలు రాలిరి
ఆకులు రాలినట్లు యాదవులు చెల్లిరి
మఱ్ఱి క్రింద రక్తము మడుగులు గట్టెను
అప్పుడు పల్లికొండ రఘుపతికి
ముప్పైమూడు కోట్లు ముప్పెర్లు నాటి
అరవయ్యారు గాయములు అతి భీకర మాయె
పట్టలేను ప్రాణంబు నిలుపలేను బొంది
గంటలో కైలాసము అంపవే మామ!

అని యిట్లు అడిగినందులకు అపుడు
పోలురాజు
విభూతి మంత్రించి పల్లికొండ
గాయాల వైచెను
పల్లికొండ గాయాలు సోణలాయె
నక్కడ
అక్కడ పోలు రాజుకు అతి భార
మాయె

నొసలు పోట్లు వాకి మీ తండ్రి
వొరిగి వుండగాను
మా తండ్రి తులశితీర్థము యిచ్చె
మీ తండ్రికి
అచ్చట నా వనమాల వశికర
మాయె
నీ వనమాల యేమి వశికర మాయె
మామ?

## కల్లందుల పోలినేనికి తులసితీర్థము పోయుట

యికనొక మాట వినవె వో మామ!
కల్లందుల పోలినేడు రాళ్ళదిద్ది
భైరవుని కురువ దగ్గిర
జాల ధీరుల జంపి శానల నరికి
గట్టిగా యెదురొమ్ము గాయాలు నాటి
చిత్త వొత్తుగా నరుకులు
తగిలిననాడు
అప్పుడు మా తల్లి చిట్టినూక
గుండానికి
సాగుమానము కావలెనని
సయ్యాన లేచి
పయనమై అప్పుడు పరుగున రాగ
యేడు నెలలు బాలనై వుంటిని నేను
వల్లవుల కాంతలు తిరుమంధుల
కాంతలు

శీఘ్రముగ వచ్చిరి చిట్టినూక కడకు
చిట్టినూక కొల్లు సిరిదామర కొల్లు
పొచయ్యను పెంచుకొనేము అని
వచ్చిరి
అప్పుడు అగుమంచి అతి
త్వరగ వచ్చె
వచ్చిన అగుమంచి చేతికి వయ్యన
చిట్టినూక
అందముగ నిమ్మపండు
అగ్నిదేమునికి యిచ్చిన చందాన
యిచ్చెను అగుమంచి చేతికి
వయ్యాన చిట్టినూక
మండలాపతి తోడ మడిసె
గుండమున

## యఱ్రగడ్డపాడులో బాలరాజులకు తులసి తీర్థము ఆవశ్యక మనుట

యిక నొకమాట ముమ్మయ్య
యఱ్రగడ్డపాటికి
బాలరాజు లందరు పైనమై
పోయినారు
కాలము వారికి నిండి గాయాలు
పడితేను
యిల యల్ల వెరుగంగ యుద్ధములు*
చేసి
వాలాయముగ బ్రంహ్మవ్రాత
చెరిగితేను
యెదురొమ్ము గాయములు
యీపలావల వెదలితేను

ముద మొప్పగా తులశి తీర్థము
ముందుతీయవలెను
వల్లవులకు తిరుమందులకు
వైకుంఠము లేదు
వుల్లసము లాడగ మామ
వుచితంబుగాదు
పందెము సరిపోతె పరగంగ నివుడు
సందేహము పడక జాలెలు
చుట్టు మామ!
పొసగంగ సరిపోను బొంగరాలాట"

## బాలురు పందెపు బొంగరము లాడుట

అనిన అల్లునిజూచి అతి సంతసించి
పచ్చల కంఠమాల పరగ వనమాల
సరిపందెము చేసి జాలెలు చుట్టిరి
పరగంగ నప్పుడు పలికె ముమ్మయ్య
"ఆవులు ధనములు అక్కప్పకు
మేము
భావింప సరిసొమ్ము పాలిచ్చినాము
వనరంగ వాటికి వప్పను పందెము
వనమాల కంఠమాలకు
వప్పె పందెంబు"

బిరబిర శికాశాలు[౧] బిగువారజుట్టిరి
ఆటలకు బొంగరాలు ఆడంగ సాగిరి
ముందుగా పన్ని వొడ్డి ముమ్మయ్య
వైచె
వెనక బిన్నివొడ్డి వెసె పోచయ్య
పుచ్చుకొనె బొంగరము పుడమెగశి
ముమ్మయ్య
వెచ్చగా కుంభిణి వొడ్డి వేశ నావేశ
వోడు గెల్పులు లేక వక విధత
నాడిరి

---

*విద్ధములు-యుద్ధములు ౧. 'శిఖకాసెలు' (—తలపాగలు) కావచ్చును

వడివడిగ నాడంగ వచ్చె కోపంబు
తగవేట్కి బొంగరాలు జాలెలు
జుట్టిరి
యగశి కావున నార్చి యాదవ
కులపతి
యవ్వరు జూచిన యరుగరాకుండ
రివ్వున బొంగరం నిలచి తానేశ

అబ్బురంబుగ ప్రజలు అందంద
జూడ
మబ్బు పొదుగున వెగశి మాయ
బొంగరం
సభవారికి కానరాకుండ ఝరిన
వెగసె

## ముమ్మయ్య వేసిన బొంగరము కోమటి అచ్చమ్మ కాలిలో దిగబడగా ఆమె మూర్ఛిల్లుట

వెగసిన బొంగరం యవ్వరు
యరుగకుండ
దిగదిగ బొంగరం తురుతున వచ్చి
అంత సభవారిలో ఆశ్చర్యముగాను
అంత్యకాలము వారికి ఆయ్యేటి
తుదకు
బాట దప్పి అడవిలో పడ్డ
చందమున
చేటుకు బొంగరం చేడె కాలు నాటె
గరీన మీగాలు గాడి యా
బొంగరము
అరికాలు గట్టెను అవనిపై నారిగె

అదరిపాటున బొంగరము అతివకాలు
నాటె
దద్దటిలి యా కాంత తబ్బిబ్బులాయె
కత్తివలె బొంగరం గాడి పదనాట
నెత్తి సీళ్ళకడవ నెలత తానపుడు
భుజమున బట్టెను పూబోణి యపుడు
ముత్యాల మల్లిసెట్టి ముద్దుకుమార్తె
వుత్తమ పతివ్రత వారిగె ధరమీద
వజ్రాల మల్లిసెట్టి వాసిగల కోడలు
సజ్జనోత్తమురాలు సొమ్మసిలిబోయె,
ఆ కాంత మూర్ఛిల్ల అందరు జూచి
కోక పై గప్పిరి కూడి రిరుగడల

## ముమ్మయ్య అచ్చమ్మకు ఉపచారములు చేయుట

అప్పుడు ముమ్మయ్య హరహర
ఘనుచు

కర్పూరం దెప్పించి కర్ణముల
పూరించి

కారున బట్టించి కడ నొవ్వకుండ
పెరికె బొంగరము పిరికి వారకుండ
గ్రక్కున దీయించి క్రమ్మర నతడు
పుక్కిట తాంబూలము పొత్తిగా వైచి
పట్టుచీర దెప్పించి పట్టలు చేసి
గట్టిగా గాయము కట్టించె నపుడు
గాయము గట్టినపుడే యా కాంత
తా వేగ
దేహము వనట మాని తెప్పరిలి చూచి

## అచ్చమ్మ ముమ్మయ్యను దూరుట

అదలుచు ఆ కాంత అసురుసురు
మనుచు
ఝడిసి తోచినయట్లు తా దూరసాగె
"అయ్యయ్యో! ముమ్మయ్యా!
స్త్రీహత్య గట్టుకుంటివి
వయ్యన జనులెల్ల వోర్వలేని
మాటలు
ఆడికెలకు లోనైతి అన్న ముమ్మన్న!
తోడబుట్టుకలని తా జూడ వస్తిని
నేరము నావల్ల నిందమోపేరు
కూర్మితో పెద్దసెట్టి కూతురను నేను
కోటికి పడగెత్తెనవారి కోడలను నేను
తనసాటి వారిలో తలవంపుగాను
చేస్తిరి బాలలార! చెల్లింటో మీరు
చేకొన రత్తవారు, జనుల నోరు
ముయ్య
మూకుడు గద్దదే ముమ్మయ్య
వినుమ?
పక్షపాతము చేసి పాపము
కట్టుకుంటిరి
మచ్చితతో బుట్టిల్లు మరిచేరనిచ్చేర?
కటకటా హెచ్చుగా కన్నుల
వుదకాలు
పొటపొట కురియంగ పూబోణి తాను
బదలిక బోలుచు పాప మెర్పుగకాను
మూడు ప్రాణాలు గొంటివి
ముమ్మన్న నీవు
బలిమి గలిగితె నీవు బ్రతుకవలె
గాని
నెలమితో వినయంబు నేడెరుగవైతివి
అయిశ్వర్యము చాత అత్య
గట్టుకుంటిరి
అందలాలు పల్లకీలు అణిగేది
యెరుగరా?
హెచ్చుగా మీయన్నల కొచ్చిన
త్రోవలు మీకు యన్నడు వచ్చిని?
తన వుసురు మీకు యన్నడు
తగిలీని?"
అని కోమటివారి అచ్చమ్మ
కోపించి పలికె.
ఆ మాటలు బాలలకు అలుగులై నాటె

భామాడు మాటలు బాలలకు బాకు లై
నాటె
సిరిబాల ముమ్మయ్య చిన్న పోచయ్య
గురిచేసి బల్లెలు గుమ్మినట్లాయ
కల్లందుల పోచయ్యకు కడు
వేగమునను
కల్లిలో పగవారు కుమ్మినట్లాయ
వల్లవుల ముమ్మయ్యకు వజ్రాలు నాటి
బల్లెలు ప్రక్కల పరిమినట్లాయ
బాలలు కోమటి భామను జూచి

## ముమ్మయ్య తన అన్నల వార్తలు చెప్పుమని అచ్చమ్మను కోరుట

చాల చక్కని యింతి సఖియ
మెరుగుల దొంతి!
మరుని పట్టపుదంతి! మల్లెపూబంతి!
మరువంపు పూబొమ్మ మగువ
పుత్తడిబొమ్మ!
అమిత నవ్వుల కొమ్మ!
యలనాగవమ్మ
అలివేణి యరణప్ప ఆగుమంచి
మారు
పైడివారి తల్లి మా పాపన్న మారు
దయగలిగి యీ మాట దైవగతి
వినుమ
యిపుడు ఆడిన మాటలు
యేర్పాటుగాను
దయగల్గి చెప్పవే వో కొమ్మ! చెల్లెలు
మారు
మొనసి కోమటి మాటకు మోసంబు
లేదు
కనకాంబరములు కట్నాలు సొమ్ములు
ధనకొండ నున్నాళ్ళు తోబుట్టుకవని
సారెలు నడిపేము సైదోడ! నీకు
నేరము లేకుండ నేడు వో యక్క!
వనరుగ మీవారికి వప్పజెప్పేము
ప్రాణముగల పర్యంతము దనుక
పోడిమిగ పుట్టింటికి పోకుండ నీకు
సంతతముగా నీకు సారెలు నడిపేము
నాతి నీ వాడినవి నవ్వుల మాటలు
గావు
బొంగరము నాడబట్టి పుట్టుపూర్వాలు
ముందర వచ్చేటి మోసంబు తెలసి
ఆడితి వో యక్క! నీవాడిన మాటలు
కొమరప్ప సిరిదేవి కొల్వులోపలను
ఆ మాటలు వారితో అనతియవలెను
నలినాక్షి చెప్పవే నాతోను నీవు
యలనాగ నీప్రాణము యటువంటి
దమ్మ?
అమరంగ జెప్పవే అక్కరో నీవు."
అనిన ముమ్మయ్యతో ఆ కాంత బలికె;

"మేదిని కుమ్మరి మేటి జేసిన కడవ
కాదనక వినుమ నాగర్భమందొక్క
ప్రాణి
నాదొక్క ప్రాణి నా యన్నలార!
మూడు ప్రాణాలు కొంటిరి మమ్మన్న
వినుమ"
"అక్క నీమాటలు అనుకూలవమ్మ
చక్కగా మా యనుజులు చనిన
యా వార్త
చక్కగ చెప్పవే సఖియరో నీవు
ధనముకొండ రాజులు తల్లిన వార్త
దాచక చెప్పవే సైదోడ! నీవు
కొసరక యా వార్త గొల్లున
జెప్పుమి"

## అన్నల వార్తలు సిరిదేవికి తెలియునని అచ్చమ్మ చెప్పుట

బాలల మాటలకు పణతి యిట్లనియె;
"కలియుగమున ధనముకొండ
కడువేడ్కతోను
యేలిన వార్తలు యెరుగుదుముగాని
ముప్పైనేల కోటలు మూడుదుర్గాలు
యిప్పుడు స్థిరమై యేలింది
యెరుగుదుముగాని
యలమంచి పంప్రాది యిడిచి
యెలుపలకొచ్చి
పాలించి ధనముకొండ పట్టణము
లేలింది
యిటువంటి వార్తలు తా నెరుగుగాని
కంతసరి బాలలార! కడమ వార్త
నెరుగ
ముమ్మయ్య బొంగరము ములికి
నాటినందులకు
దిమ్మ బట్టి మిమ్ము తిట్టితిని గాక
మీ అన్నలు పోయిన వార్త మీ అమ్మ
సిరిదేవి నడుగు
మీ మేనత్త కొమరగిరిని మీ
రడుగుడు పోయి
అమరంగ జెప్పిని అన్నలార! మీకు
క్రమమున వున్నట్లె కన్నిపల్లి జెప్పిని
అన్నల చెల్లెలు అగుమంచి నడుగుడీ
వున్నట్లు జెప్పిని మీకు వుచితంబు గాను
కోపము మాటలు గురిశాయ రాదు
ఆపద మాటలవి నిజము గావు
పరవారి మాటలు పాటింపరాదు
పోరోరి బాలులార! పోరాదు నొప్పి
యెడపక పురిలోకి నే నెటువలె పోదు!
కడువేగ బంపరోయి కంతమాల
బాలలార!"

## బాలురు అచ్చమ్మను ఆమె అత్తవారింట దించుట

యింపైన మాటలు వెలది*జెప్పినను
కంపటీలెక్కేటి కనకదండ పాలకి
బెట్టిబోయిన మల్లను శలవడిగి
యప్పుడు
అట్టి పాలకి దెప్పించి ఆ పాలకిలోన
అతివను గూర్చుండనుంచి
అతివేగమునను
పరగ బెస్తల దాత బట్టించుకోని
సురిటీలు విసరంగ శూరులైన బాలలు
తర్లి వారొచ్చిరి ధనముకొండలోకి
పెద్దలైన కోమటిపెద్దల బిలిపించి
వద్దికతో బాలలు వడంఁడజెప్పిరి
యిద్దరికి తశిరీబులు యిచ్చిరి వేగ
''కద్దు వక నేరంబు కాయుడు మీరు
చేదప్పి బొంగరము చేరుదెగి వచ్చి
అతివకాలు నాచెనని అనుమాన
పడక
అనుమానపడవద్దు అయ్యలార! మీరు
నేరము తనవల్ల నిందకు మీరు
వరునతో పెనుకొండ పురహరులు
మీరు
మరివేగ నేరములు మన్నించు''
మనిన
ప్రియముగ వొప్పించ పెద్దలిట్లనిరి:
"అయ్యలార! యంతటి వారలకైన
అటుల తమిని
వాతప్పు చేతప్పు వచ్చును వినుడి
యిది యంత పని మీరు వేంచేయు''
మనిన
అత్తవారింటికి అతివెను వప్పగించి
అతివేగమున బాలలు తమ అమ్మ
సముఖమైరి

## సిరిదేవి కొలువు దీరుట

కూటాల నడుమను కురువేళ్ళ
చవికెలో
పాటించి సిరిదేవి ఖామలు దాము
పొంతి తా రత్నాలప్రోలు బోయించి
తెలివైన శీతాళ దిబ్బెంబు నిలిపి
కొమర బంగారపు కుప్ప బోయించి
కొమరక్క సిరిదేవి కొల్వు
గూర్చుండి
వియ్యాలు సిరిదేవి యిరుగడల
నుండిరి
కైట వాకిట పందుముల యరణప్ప

* 'యలది' అని జానపదుల ఉచ్చారణ

అగుమంచి మొదలైన అరుధాంగ లక్షణులు
సఖి సల యాదవస్త్రీలు సముఖాన నుండిరి

## బాలురు అన్నల వార్తలు చెప్పుమని సిరిదేవిని నిర్బంధించుట

పరుగున వచ్చిన బాలలు పొట్టేళ్ళ దిగిరి
దరవాజ లటు జొచ్చి తల్లి సముఖాన నిలచిరి
సిరిదేవి కొమరక్కకు శీఘ్రమే మ్రొక్కిరి
కొమరక్క సిరిదేవి గొబ్బున దీవించి
గుప్పున బాలలను కూర్చుండ మనెను
నిబ్బరముగ బాలలు నిలచి యిట్లనిరి
"కొమరక్క వో యక్క! కృప సుందులనూక!
సామజగంధులార! శ్రీకాంతలార!
భామినీమణులార! వో పణతులార!
వొప్పైన పల్లవుల వో వెలదులార!
మచ్చికతో వదిన మరదండ్లు మీరు
అలర వేకువచుక్క అక్క కొమరక్క
అలరంగ భూదేవి అమ్మ సిరిదేవి!
పన్నుగా వినరమ్మ పరాకు కాయక
విన్నపము జేసేము వినరమ్మ మీరు
బొంగరములు మీ చాత పుచ్చుకొని మేము
అంగనామణులు! మేము ఆడంగ బోతిమి
పాటించి బొంగరాలు పట్టి ఆడంగ
వేటుదప్పి బొంగరము వెలదికాలు నాటె
నాటిన కోపాన నాతి యిట్లనియె
'మీ అన్నలు కొచ్చిన త్రోవ మీకెన్నడొచ్చీని?'
వో యమ్మ! యిట్లని వుల్లాసమాడె
ఆ వార్త జెపుమంటె ఆమెళ్ళిపోయె
నీవెంత లేదనక మేము అడిగిన మాట
అన్న పోయినవార్త ఆన తీయవమ్మ
కన్నతల్లివి నీవు కల్లలాడవని మేము
అడుగంగ వచ్చినాము అమ్మ సిరిదేవి
కడువేగ జెప్పవే వో కన్నతల్లి!"

## సిరిదేవి బాలురను మభ్యపెట్టజూచుట

మామ్మయ్య పోచయ్య ముచ్చట్లువిని అమ్మయు కొమరగిరి అప్ప యిట్లనిరి:

"వివేక మెరుగని వో వెర్రి
బాలులార!
యవరెందు బోయిరేమి? యేమిటికి
మీకు?
ఆ వార్తలు మీకేల? ఆటల తమిని
భూవల్లభులు రాజులు పూజితులై
వుండంగ
యేమి యాటలాడేరు యిద్దరు మీరు
శ్రీమంతులైనట్టి చిన్న బాలులార!
బొంగరాలాటలని పుట్టిన వార్తలేగాని
సంగతిగా మీ యాటల తా
చూడవలెను
తనయుల అటలు తల్లి చూచి మెచ్చి
తేను
ఘన వేగ శౌర్యంబు కానవచ్చిని
ఆడుడు బొంగరాలు అన్నలార!
మీరు"
అని యిట్లు సిరిదేవి ఆడుమాటలకు
క్రమమెరిగి బాలలు కిలకల నవ్వి:
"యేమి మాటలాడేవు యెరుగని
దాని వలెను
వాటముగ అన్నల వార్తలు జెప్పితే
యెరగి వుందేము తల్లి యాం
దాచేవు?
గురుతుగా చెప్పవే కృప నందుల
నూక!"

"యరువక[10] ధనముకొండ యాదవు
లేలుచున్నారు
పరిణాన వున్న బాలలార! మీరు
విష*వాకులు గోరేరు యెర్రి
బాలలార
యెక్కు దెక్కుడి వారు హెచ్చరిక
తోను
గ్రక్కున వేటలాడ కదలి పోయి
నారు
దేవస్థలాలు కొందరు త్రిపురాంతముల
కొందరు
భావజ గురుడైన పల్లెకొండ రఘుపతి
మారకాపురి చన్నరాయునికి మహా
సంభ్రమము గాను
కావలు చేయించ పోయినాడు
శనివారము నాడు
పరగంగ యాదవుల పట్టభద్రుంతు
పర్వతపు మలల వెంట పంది
వేటలకు
పుర్వీశ్వరుండు తిరిగి వచ్చి
యిరుగుల సాని
కుర్వ వద్ద నాటక సాల లాడించు
చున్నాడు
మాటవాసి కలిగిన మన్నెసింహంబు
ఘడియలో భట్టావుల ఘనుడు
వల్లభుండు

10. వెరువక * 'యిష' అని జానపదుల ఉచ్చారణ

త్రిపురాంతక దేవుని తీర్థంబుతోను
కృపతోన జంగమార్చన చేయించి
కల్లూరి ఖామన్నకు గరుడశావ
చేయించి
వల్లవ కులజుండు వచ్చుచున్నాడు
త్రైలోక్య మాధవుడు ధన్యుడై తన్న
కై జీతపు దొరలు కలిగిన బాంధవులు
వెలికొండ సాల్పున వేటలాడ బోయి
నారు
బలుపైన మృగముల పందుల
యేనుగుల
గొలుసుల బట్టించు కొచ్చు చున్నారు
అని వాలాయముగ జాబులు వ్రాసి
అంపించినారు
కొమరమ్మ పుత్తమరాజు కొందరు
దొరలు
అమరంగ వూరిమెట్ల హరికి వేవేగ
తేరు తిరునాళ్ళ చేయించ పోయినారు
వూరిమెట్ల చన్నరాయునికి పుత్తమ
రాజు
పేరిట వాడని పెండ్లిచేయించి
వస్తూవున్నామని జాబులు వ్రాయించి
అంపించినారు
సుస్థిరముగ ధనకొండ సోమవంశ
మంత
వరుసతో నేట రేపట వచ్చేరు
బాలులార!
తిరుమందుల వల్లవులు తేజమై
వున్నారు
చల్లావారి బొల్లియావు చట్టివారి
యఱ్ఱయ్య
పెయ్యల యరణన్న పద్మరాఘవుడు
వైనాన బీరన్న వారి గోసంగులు
బసవన్నయెద్దులు బలువైన ఆవులు
పశువుల దక్షణాదిన పరిణాన
మేపుక [illegible]
పాలేరు దాటితిమని పట్టభద్రుండు
అటు వార్తలన్ని వ్రాసి కాటమరాజు
తనపేరట కమ్మల అంపించినాడు
వాటముగ కాలారి వచ్చెను మొన్న
వస్తువులు యక్కడెక్కడ నుండి
వచ్చేది యరుగరా?
వస్తువులు ధనకొండకు రాగ
చూడరా?
బాలులార! అంతేసి పసులేమి రావు
జాలెలు జుట్టిరి సముఖాన మీరు
ఆడుడు బొంగరాలు అన్నలార!
యిపుడు''

## తమ్ము దీవించి పాలేటికి పంపుమని బాలురు సిరిదేవికి ఆనలు పెట్టుట

అమ్మాను సిరిదేవి ఆనతిచ్చినను
కడువేగ ముమ్మయ్య కల్లందుల పోచయ్య

అమరంగ వకమాట అడిరపుడూను;
"తల్లిరో! యీ మాట దాచితివి నీవు
కల్లలాడితివి నీవు వో కన్నతల్లి!
అందరికి అన్నిపనులు అమ్మరో నీవు
వందనపు మాటలు వో తల్లి సిరిదేవి;
నీలాటి రేవుల నీళ్ళకడవల వారు
వాలాయముగ ధనకొండ వారు
వీరనక
వాలాయముగ పోయిన వార్తలైన
వింటిమి
అన్న మందనుండి అతివేగమునను
కాలారి మాయన్న కమ్మలు దెస్తేను
కమ్మలు చదివించి తల్లి కడు
మూర్ఛబోయా
సొమ్మసిల బోతె చూచె అగుమంచి
భ్రమ నీకు తెలియదచె తల్లి సిరిదేవి!
యేమన్న నార్తలు మేము
యెరుగమచె తల్లి?
వో యమ్మ తల్లి! అన్నల వార్త
లన్నియును
అతి వేడ్కతో మిమ్ము అడిగితిమి
గాక
దేవాధిదేవుండు తొల్లి జీవములు
గట్టి
భావింప రథములు పంపిరి వేగ
జాగాజాగాల సంభ్రమ మాయెనని
ఆగతి వ్రాయించి పంపినారే తల్లి!
బ్రహ్మ త్రిమూర్తులు బాటలు
నరికించి

శ్రీ కూర్మము కల్యాణము జాబులు
యేనుగనాథు కొండకు పంపినారు
బెజవాడ వద్దను పర్తులు పెట్టి
కాపురము చెరుకూరికి కదలివచ్చిన
వార్తలు
జాబులు వస్తేను చదివించుకొంటిమి
యీ భూమి రాజ్యము యిన్నాళ్లదాక
యేలితిమి
చాలు యెల్లెను తల్లి సరసంబుగాదు
అలసించరాదు అంపవే తల్లి!
అంత్యము వచ్చింది అంత
నీ వెరుగవ?
చింతింప పనిలేదు శివుని దూషింప
రాదు
శమ తోరము కట్టి దీవించి మమ్ము
అమరంగ పాలేటికి అంపవే తల్లి!
పంపితివైన నీకు ప్రగ్నె
దక్కునమ్మ
అంపకుంటివైన అపకీర్తి నీది
బసవన్న పాదమాన పంపకుంటివైన
యనగంగ త్రిమూర్తులు యెదురు
చూచేరు
అన్నల పాదమాన అంపకుంటివైన"
మన్నని తమ్ముని మాటలు విని
కర్పూర గంధులు కడు చిన్నబోయి
వప్పుగా వకమాట వనరంగ బలికిరి:

## ఆయుధములు చూపి సిరిదేవి బాలురను భయపెట్టి జూచుట

"యటునలె జెప్పిన యరుగరు
బాలలు
మాటలతో నిలుపలేము మనసులు
యరుగుదాని
ధీరత యిద్దరి దిట్టతనము చూతాము
సురియలు తెమ్మని సిరిదేవి బలికె
సురియలు జూడక కాని స్రుక్కరు
బాలలు
అలుగులు చూడక కాని అణగరు
బాలలు
బాలలు భయపడి కాని పైనాలు
మానరు"
అట కలిపోలు బోసి ఆయుధాలు
దెప్పించి
పటుతరముగ నిలిపిరి పరుజులు
కిందుగాను
ఆయుధాలు చూచి బాలలు
హాగ్రులై నిలచిరి
భైరవుని రీతిగ ఆర్భాటంబు చేసి
సురియలు చూచుచు బాలలు
శూరులై నిలచిరి
వెరువక బాలలు వీరభద్రుని రీతి
పెడబొబ్బ లార్చిరి పృథివి
గంపింప
బడబాగ్ని రీతిని పలికి యిట్లనిరి:

## అలుగులు పోలు చూచి బాలురు వీరాలాపము లాడుట

"అమ్మరో సిరిదేవి! ఆయుధాలు దెచ్చి
నిమ్మళాన నీవు నిలిపినావె తల్లి
నవ్వులకు నిలిపితి నాతల్లి! నీవు
ఆ వార్తలకు చెప్పక అడుగు
తర్లనీయము
కన్న మందెమేళమున కానీవుగాక
యన్నంగ లోకాన యెదురెవ్వరు
తమకు
నారసములై తేను నదురదే తల్లి!
చేరి పగతుల నుగ్గు సేయవటె తల్లి?
సురియలు చూపి మమ్ము
స్రుక్కనాడ వస్తివా?
కఠిన రొమ్మున కాటించు కుందుము
అలుగుల జూపి మమ్ము అదిలించ
వస్తివా?

తొలగక మొనలపై దూకుదుమా
తల్లి?
వుల్లసములాడకే తల్లి వుచితంబు గాదు
కల్లరి రిపులను గండించగలము
చేడెలాడిన మాటలు చెవుల
విన్ననుండి
కడుపులో బాణాలు కళ పెళ మనెను
తిరుగుచున్నవి మీకు తెలియదుగాక
పూరికారాడిన వార్తలు వింటేను
అప్పటినుండి తమకు అలుగులు నాటి
గుప్పున గుండెలు గ్రుచ్చినట్లాయె
ఆడవారాడిన అడికెలకు తల్లి!
దండిగ శరీరములు తాకినట్లాయె
యీ ఆయుధములు జూచి
యిట్లు బెదిరితేను
ఆలములో వైరుల హతము సేతుమె
తల్లి!
యడపక వార్తలు యట్లు ఆడితివి?
గడినుండి పెద్దిరాజు కమ్మలంపించెను
యన్నాళ్ళు పట్నమేల యడము లేదు
తల్లి!
పన్నుగా అయితన్న మూడు
గడియలు పట్నంబు యేలి
ప్రాణబంధువులతో పాలేరు తల్లి
ప్రాణంబునకు వెరచి పంతంబు
విడచి
ప్రాపు చేసుక యిట్లాడ పరగంగ
దాగితేను
అపకీర్తి వచ్చును అన్నలు వింటేను

యిఖనైన పోకుంటె యిహ
పరములకు త్రోవ
లేకపొయ్యాని తమకు లేమరో!
వినుమ
క్రమమెరిగి కాశిబోయిన కంతమాల
గురువు
రహస్యము చెప్పిరమ్మని
పోయినాడు
హేష్యము కాశిలో యెరిగించ
కుంటేను
యేలేశ్వరుడు మమ్ము యన్నటికి
నమ్మడు
సదాశివుడు మాకు సాయుజ్య
మివ్వడు.
దూరము తెలిసిమమ్ము దీవించి నీవు
అరయంగ పాలేటికి అంపవే తల్లి!
చెరకూర పోలురాజు చెల్లిననాడు
అరువేల వల్లవులు ఆరుషేల తిరు
మందులు
పన్నెండువేల యిండ్ల బాంధవులు నెల్ల
పిన్నల చేపట్టి పెంచుమని తండ్రి
అప్పగించి పల్లెకొండకు అయ్య
పోలురాజు
అప్పగించిన పూట అందరిని
తోడుకొని
పోయినాడు హరిగుతు పూట
వప్పగించి
యిప్పుడు మేము కదిలివెళ్ళక కాని

వొప్పుడు తమ తండ్రి వో యమ్మ! వినుమ
వేవేగ పంపవే యరగడ్డపాటికి
పూట వప్పగించిన వెనుక పోయి కాశీలోకి
కంతమాల భక్తినన్నను గ్రక్కున నడిగి
తోడితే బోవలె త్వరితముగ మేము
యదములేదు దెవసాలు యిద్దరము పోయి
పలుకరించకకాని భక్తుడు రాడు
అమరంగ మమ్ముల అంపనట్లయిన
పోకమానము మేము పొలతి సిరిదేవి
చేకొని పంపకుంటే శ్రీహరి పాదమాన!
యిట్లె మమ్ము పంపకుంటె యీశ్వరుని ఆన!
దిట్టముగ పంపకుంటె దేవేంద్ర లోకాలు
పట్టి కొల్లలాడేము మాప్రగ్నె చూచేవా?
వినమమ్మ సిరిదేవి యింద్రాదిసురుల
ధనకొండలోపలికి తోడుకవస్తుమా?
మున్నుపు పోయినవారి పోట్లాట మ్ముందుగాక తలికె
వెనక పోయినవారు పీటిలోన డీకొని
పుక్కుటలుగ్గులమీద వొరగవలె తల్లి
అక్కడివారి కయ్యముద్ధక తాలికె

వొడ్డిన పంజులమీద వొరగవలె తల్లి
దండిగా చల్లవారు తొలునాడు మరునాడు
అడ్డావుకట్టను అవులపోట్లాట
మరునాడు బీరన్న మంగవాలిపాటను
అరయంగ యుద్ధము అయిదోనాడు తమకు
అవులకు యెద్దులకు ఆరోనాడు జగడము
వేవేగ రాజు రాఘవునికి యేడోనాడు జగడము
ముందుగా యుద్ధము ముద మొప్పచేసి
కనక గొలుసుల కట్టించుకొని వస్తుము
యిద్దరికి మోసంబు యిహపరములకు త్రోవ
కందువతొ తమ్ముని కలపవలె తల్లి!
అమ్మరో! దీవించి అంపనట్లైన
కొమ్మరో! బండారంత కొల్లలాడుదు మా తల్లి!
అతివేగమున నీవు అంపకుంటి వైన
శీతాళదిబ్బెము సిందుజేతము తల్లి!
పలుమారు నీతోను పట్టి ఆడేది తగదు
అయుగుబు పోలంత హతము సేతుమా తల్లి?

ముదముతో వకమాట ముదమొప్ప
వినుము
మేదిని కొల్లగాను మేలుకొల్పి
వత్తుము
పోవలె పాలేటికి ప్రొద్దున్నె తల్లి!
దీవించి పంపవే ధీరత తల్లి!
విడెమిచ్చి తిరుమందులకు పీరశాలువ
లిచ్చి
కడువేగ పంపవే వోకన్న తల్లి!

మారుమాటడితివైన మామీదయాన!
సిరిదేవి చెరుకూరి శిలలు పాదమాన!
పల్లెకొండ పాదమాన!
పంపకుంటివైన
బొల్లేపుపాదమాన! పోవలె తమరు
అక్కన్నతోటి అంప కుంటివైన.''
దిక్కరించి బాలలు డీకొని పలికితేను
యన్నగల కొమరక్క వెలది సిరిదేవి
చిన్నబోయి యిద్దరు శిరసులు వంచిరి

## బాలురను యుద్ధమునకు పంపుమని అగుమంచి తల్లికి చెప్పుట

అప్పుడు అగుమంచి అన్నల చెల్లెలు
వొప్పుగ తల్లితో వనరంగ బలికె
''కొమరక్క వోయక్క! కృప
నందుల నూక!
శ్రమలు మీకేటికి వోభామలార?
దక్షణాది భూమి ధనముకొండ
నుండి
అక్షయముగ రాజు అవుల
మేపబోయెను
కాటమరాజు మీద యింత కరుణ
లేదాయ
భట్టావులరాజు పరగ యర్రయ్య
కరియావులరాజు మీద యింత కరుణ
లేదాయ
పగవారిగ జూచి పంపితివి తల్లి!

అయితన్నను పాలేటికి అంపేటి
యపుడు
ధైర్యమువిడచి నోట తడిలేక
వుంటివి
వకరిని వకచూపు వకరిని వకచూపు
వలపక్షము చూస్తివి వప్పదు తల్లి
నీకు యిటువలె జూడ విహితంబు
గాదు
కొమాళ్ళ మీదనెల్ల కృప నందుల
నూక!
సమముగా జూడకుంటె జనులు
యేన్నెరు
ముమ్మయ్య పోచయ్య అంటె
మోహంబు పుట్టె
సమ్మతము గాదదే సఖియ వోతల్లి!

కయ్యము వచ్చిన వెళ్ళకన్నతల్లివి
నీవు
వయ్యెనె వేరు కాయవద్దు వోయమ్మ!
బాలుల దీవించి పంపకుంటి వైన
మేలు దక్కదు నీకు మేదినిలోన
మాటలు కథలై మరినిల్చుగాని
దిటము దెచ్చుక బాలల దీవించి
పంపు"

## బాలురను యుద్ధమునకు పంపజాలక సిరిదేవి దుఃఖించుట

కూతురి మాటలువిని కృప నందుల
నూక
కాంతి మూర్తులు దప్పె కాంతకు
నపుడు
కడుపులో భీతిపుట్టి కడు భయము
నొంది
వాలు కన్నుల వెంట వచ్చు కన్నీరు
కలవరపడుచును కాంత సిరిదేవి
తాగన్న కూతురిని తప్పక జూచి;
"అక్కన్న! వుపకారము అడవైతివి
నీవు
యెక్కులు దెలిపేవు యేమి పగ
యుండెనే?
తోడబుట్టి తోడు దయతోడు
యందురు
పిడుగులై మాటలు పెంపు జేసేవు
కన్నతల్లి నేను కడుచిన్ని బాలల
పన్నిన యీటెల మీదికి పంపుదునె
యెట్లు?
చూసిచూసి పగవారి సురియల
మీదికి
పసి బాలుల యెట్లు పంపుదునె నేను?
ఆటపాయపు బాలల అగుమంచి
వినవె
పోట్లాటకు నేనెట్లు పొమ్మందు నేను?
బాలల దీవించి పగవారి మీదికి
యేలాగు అంపుదునె వెలది అగు
మంచి?
భోగాన బెరిగిన భుజబల భీముల
పగవారి యీటెల పాలెట్లు జేతు?
గర్వాన బెరిగిన కంఠసరి బాలల
యేరీతి బంపుదు యేమనివారి
మీదికి?
చెల్లంబో అక్కన్న! మన్నె
సింహముల
బల్లెల మీదికి పంపుదునే యెట్లు?
యాకాదశ రుద్రుల యమునివారి
మీదికి
అగుమంచి యేరీతి అంపుదు నేను?
పదరె బాలుల వసుల పాతరిలోకి
కాదనక నేనెట్లు కలని కంపుదును?
పనస పండ్ల సూకవిసిచి
భక్తి నయ్యను గంటిని
గొనకొని పాలేట కూలేది యెరుగ!

అరిటిపండ్ల సూరవిడిచి అయితన్నను
గంటి
ఆరయంగ పాలేట అణిగేది యెరుగ।
ముత్యాల చూరవిడిచి ముప్మయ్యను
గంటి
కత్తుల పాతాల కానలేనైతి!
సూర్యకాంత నోము నోమి శూరుల
గంటి
మురివేము పాలేట మునిగేది యెరుగ।
చందకాంత నోములు నోమి చంద్రుని
గంటి
చంద్రులు పాలేట సమిసేది యెరుగ।
దేవకాంత నోములు నోమి దేవతుల
గంటి
ఆవలన్న పగతోటి అక్కన్న ।
యెరుగ
ఆరవెల్లి వద్ద ఆడిన మాటలు
నేరములు వచ్చేది నేనెరుగనైతి
బాగుగా ధనము పంచిపెట్టే నంటి
గాక
పగపాలు పెట్టుమంటినా బాపురే
దైవమా!
పంపాద్రి యలమంచి పరిబాన
బ్రతుకంగ
తప్పదెచ్చె పల్లెకొండ తానేమి సేతు?
రామకుల గోత్రానికి రమణి యో
కూతుర!
యముడాయ పల్లెకొండ యేమి
సేయుదును?

సోమ వంశమంత శోధించి పాలేట
యముడు దివ్యబెట్టి యెదికేది
యెరుగ!
పాయక ధనకొండ
పట్నమంతయును
కాయలు కొట్టిన మానొట కానలేనైతి
తల్లి దండ్రులు లేని తనయుల
దోడుకొని
తల్లి మన బాలల తావుంచదాయ।
సంతులేని బాలల తా తోడుకొనిపోయి
సంతుగల అయితన్నను
తా వుంచదాయ।
భద్రదేభముల వంటి బాలుల
పంపకుంచేను
నిద్రవచ్చునంటె నేడు వో యక్క ।
పాండవ అర్జున్నునివంటి బాలల
బంపకుంచేను
గుండె కూడు బట్టునటె కూతుర!
తమకు
ధనకొండ పండిన ధాన్యాదులెల్ల
గోనెల బట్టుక పాలేటికి కొంచు
పోవుట యెరుగ।
హరిహర బ్రహ్మాదు లందరును గూడి
కోరుపాలు చేసేది కూతుర! యెరుగ।
ధనముకొండ ఫలము దక్షణాన
పాలేట
ఫనివడి యమునివారు పంచేది
యెరుగ।
కోమటి అచ్చమ్మ కోపపు మాటలు

ధీమంతులకు యీదెబ్బె తగిలేది
యెరుగ!
అత్తింటి కోడండ్లు ఆడిన మాటలు
పౌత్రపు నేజాల పోట్లాయ గదవె!
అమ్మయింటి బిడ్డలు ఆడిన మాటలు
అమ్మరో! బాలలకు అంబులాయ
గదవె!
అచ్చటాడిన మాటలు అగుమంచి
వినవె
పోచయ్యకు బల్లెముల పోట్లాయె
గదవె
ముత్తాల మల్లిసెట్టి ముద్దు కూతురు
మాటలు
వుత్తమ క్షత్రియులకు వుక్కు
టలుగులాయ
వజ్రాల యెల్లిసెట్టి వారి కోడలు
మాటలు
రొజ్జలో జముజాలి పోట్లాయ గదవె!
యలమంచి ఆకు తీగె యెరువు
కల్లైనని వుంటిని
చెలరేగి పూకొమ్మలు చిదిమేది
యెరుగ
మొదళ్లు పడెను మోసులు యిగురు
పెట్టెను
విధిదప్పి మోసులు విరిగేది యెరుగ!

కొయ్యకాలు యిగురుపెట్టి కొంచాన
పండి
అయ్యయ్యో! యెరువై అతినిష్ఠ
నుండంగ
పండిపైరంత పాలేటి వెంట
దట్టించి పగవారు తరిగేది యెరుగ!
కటకటా! బాలల కల్లి కంపితేను
తాటాకు మంటగదే తన మది
వో యక్కా!
ముమ్మయ్య పోచయ్యను మునికల్లి
కంపలేను
కుమ్మరావము చిచ్చుగదే కూతుర!
తనకు
తెగవచేసి బాలల దీవించినంటినా
మొగలిమాను సోడుగదె ముదితరో!
తనకు
పగవారి మీదికి బాలల పంపమంటివి
తగునటే అక్కా! నీకు దయ లేదు
గాక”
దయతోడ సిరిదేవి దద్దరిల్లి పలికెను
భయము దెలుపసాగి పణతి
అగుమంచి
సిరిదేవిని బిలిపించి సామెతలుగాను
చేరి అక్క బుద్ధులు చెప్పంగ సాగె

## అగుమంచి తల్లికి ధైర్యము చెప్పుట

“తల్లిరో! నీ కొక్క ధర్మంబు
చెప్పేను
తొల్లిటి వారికన్న దొడ్డదే నీవు?

రామలక్ష్మణు లిద్దరు లంకపైకి
రాగ
కౌసల్య దీవించి కానలకు పంపదా?
భూలోక మెరుగంగ పుత్రుల దీవించి
అలనాడు కుశలవుల అంపదా సీత ?
పూర్ణితముగ దీవించి వనర యశోద
అర్జుని మీదికి కృష్ణుని
అంపదా నాడు ?
హనుమంతు దీవించి అంజనీదేవి
పనివడి పంపదా పాతాళ లంకకు ?
పరశరాముని దీవించి పరగ
కార్తవీర్యుల మీదికి

ఆరూఢి రేణుక అంపదా తల్లి ?
కవురవుల మీదికి ఘన పాండవుల
కుంతి
ఆ వెలది దీవించి అంపదా నాడు ?
ఆరుగురు పదహారుగురు సహాయమై
పోయిరి
వారికంటె దొడ్డ వారటే మీరు ?
బాలల దీవించి పంపవే తల్లి !
నేల మిన్నుగలంత కాలము నిలచిని
మాటలు
గ్రక్కున దీవించి కన్నతల్లి
పంపవే ?"

## సిరిదేవి బాలురను దీవించుట

అగుమంచి మాట విని అమ్మ
కొమరక్క,
ఆయుధాలు విడిమేలు[11] ఆవేళ
దెచ్చి
సయ్యన దీవించిరి చక్కని బాలల :
"ఆచంద్ర తారార్కమై అవని
లోపలను
పోచయ్య! మమ్మయ్య! పురహరుల
బోలి
వర్ధిల్లు మమ్మయ్య! వాసుదేవుని
కరుణ
మర్దించి పగతుల మట్టి మల్లాడి
వాయునందనుల బోలి వర్ధిల్లు నీవు!

పోయిరా కల్లందుల పోచయ్య! నీవు
రామ లక్ష్మణుల బోలి రారయ్య మీరు
భైరవుని పగిదిని బలముల గెలిచి
జయమొంది రారోయి చిన్న
బాలలార!
సూర్యుని చంద్రుని సురతాను బోలి
మలివేగ ధనముకొండ మగిడి
రారోయి
పైకొని వచ్చిన పగతుల నుగ్గాడి
జెయించి రారోయి సిరిబాల
మమ్మయ్య!
తరిమె పగతుల బట్టి తలలు ఖండించి
భోమన తిరిగి రావోయి మమ్మయ్య!

11. విద్యములు > విడెములు > విడిమేలు

అవులన్నను జూచి అయితన్నను
జూచి
పల్లెకొండను జూచి బాలరాజుల జూచి
చల్లవారేగుర సాహసుల జూచి
బొల్లేవును జూచి బసవన్నను జూచి
అదరక బెదరక అన్నలార! మీరు
గాదకాని బీరన్నను గోసంగుల జూచి
బలరామ కృష్ణుల పార్థివుల బోలి
బాలలార! నేరించి పరిజాన రారోయి!
బలువు కార్యమైతె భావమరుదులు
బంధువర్గంబు
తాలు కాలు మెలుసుక కార్యంబు
సేయుర!
వాలాయముగ కాశిబోయిన వల్లవుల
కర్తినయ్యను
వార్తలు వేవేగ వయినాన అడగి
ముహూర్తములు పన్నుక మోదంబు
తోడ
యిలలోని బాలలార! యిష్టుదుని
బోలి
తలపువ్వ వారక తలికె
ధనముకొండకు రాండి!
మేలు వార్తలు కొంచుక మేటి
ధనముకొండకు
రాజపూజితులార! రారయ్య మీరు!"
తేజముగ దీవించి తెరుగొప్పగాను
అమ్మను కామరక్క ఆయుధాలు
విద్యములు
ముందర కామరక్క ముదముతో
నిచ్చె
సిరిదేవి పోచయ్యకు శ్రీప్రమే
యిచ్చె
సురియలు బుచ్చుక బాలలు
శూరులై యపుడు
అత్తకు సాష్టాంగము అగుమంచికి
మ్రొక్కిరి
ముత్తవ్వకు సాష్టాంగము మ్రొక్కె
పోచయ్య
బాలలకు వేవేగ పళ్లెలతోను
పొలుపుగా అన్నము బోంచెయ్య
బెట్టెను

## ముమ్మయ్య పోచయ్యలు పాలేటికి ప్రయాణమగుట

బాలలు బోంచేసి పైనంబులేరి
యలమితో సంగడీలు యేర్పడి రంత
కోడికలు బోంచేసి పొద్దేళ్ళ నెక్కిరి
గొడుగులు పడిగెలు కొల్వు
బెక్కెములు
అనోవేగమున అరిగెలు బట్టి

ఘనవేగ వచ్చిరి బాలల్లు కలకల
నగుచు
ఆశ్వీదింపగా[12] అలర పురోహితులు
వాసిగల బాలలు వచ్చిరి వేగ
భజంత్రీలు రుంజలు జహా
వాద్యములు
తేజముగ మ్రోవంగ ధీరులై బాలలు
అదత్రీల చాతను అంపించుకోని
పోడిమితో బాలలు పొట్టేళ్ళ నెక్కిరి
సంగడి లెక్కిరి సరుగున తేజీల
గంగవరపు గవిడిని కదలిరి బాలలు
బటులున్ను శెట్టీలు పరివారము
దొరలు
పెట్లు తుపాకీలు పెద్ద బాణములు
జల్లులు యీటెలు ఖగజంపు
గొడుగులు
బల్లేలు నేజాలు బాకు జము జాలములు
ముమ్మయ్య కైజీతము మూడువేల
మూక
కమ్మగ యిరుగడల కదలి రా వేగ
పొందుగా మూడువేలు పోచయ్య
కైజీతము
ముందర మూడు మొనలు ముస్తీదు
కదలె

## శకునములు

బాలలు పాలేటికి పైనమై పోగాను
పాలగరుడులు రెండు
పరవ కట్టగాను
యడమ నుండి కుడికి యేతెంచె
నపుడు
కుడినుండి యడమకు గుర్రిమిడి
అడెను
అది జూచి ముమ్మయ్య అల్లుని
పిల్లచి
"భావింప కల్లందు బాల పోచయ్య
యిలలోన యీశకునమెటువలె
నున్నది?
తెలుపుమా అల్లుడ! తెలువంద
నిపుడు"
"వలనొప్ప వినవయ్య వో మామ!
నీవు
పాలగరుడులు రెండు పర్వ
కట్టినందుకు
అరుష్మించి అప్పుడు..... *
(అసంపూర్ణము)

12. ఆశీర్వదింపగా

*'అలుగులపోలు' 'ముమ్మయ్య—పోచయ్య బొంగరాలు' అను పేర్లతో మరి రెండు అసమగ్ర అసంపూర్ణ ప్రత్యంతరములు లభించుచున్నవి. అవి అనుబంధము నందీయబడినవి.

# యర్రగడ్డపాటి పోట్లాట

## అవతారిక

శ్రీ జామ్మ వీర[1]గంగ చిత్తమున దలచి
రాజితంబుగ విఘ్న రాజునకు మ్రొక్కి
కమలాక్షుని నాయకంబుగా గొల్చి
కమలాక్షియగు ధవళకాంత గొనియాడి
కమలేశు కీర్తించి కమలాప్తు దలచి
కరిచర్మ ధరుడైన ఘనుని ప్రార్థించి
సౌష్టి విద్యల సరసుల నుతించి
కవివరేణ్యులకు నమస్కారంబు జేసి
హరిపాద సేవకు డతిభక్తి పరుడు
యదు వంశ కులజుడు వేడుకపరుడు
గురుతైన కొమనాల గోత్రాబ్ధి చంద్రుడు
యనయంగ గంగుల యల్లయ్య కూర్మి
తనయుడు సర్వన తగు సహోదరుడు
పినయల్ల యనువాడు ప్రియముతో జనులు
వలనొప్ప శ్రీనాథు వచన పద్ధతిని
చెప్పెను యదుశాస్త్ర చెరిత మంతయును
వినుపింతు యాదవవీరుల చెరిత
యీ కథ యాదవవీర పోట్లాట
ఆ కథ వృత్తాంత మది యెట్టిదనిన-

## మొదటి కాండము

### *తిక్కనామాత్యుని కథ లేక చల్లవారి జగడము

### కాటమరాజు యరగడ్డపాటిలో కొలువుదీరి యుండుట

శ్రీ కర్మమైనట్టి శ్రీవిష్ణు లోకమువ్వ
ఆ కాటమరాజును ఘనత పుణ్యుండు

---

1. శ్రీ జాహ్నవి

అమిత విక్రమశాలి యాదవరాజు
కుముద బాంధవుండు గోవుల
పోషకుండు
వసుధ పెద్దిరాజు వరనందనుండు
పగకునై పశువుల పాకనాట మేపి
పుల్లరి యివ్వక పొగలుచు వచ్చి
వెలయ వైరంబున్న యరగడ్డపాట
పల్లవాది రాజుతో పగదీర్తు ననుచు
'గుంటను రణవీరగంగ గరుడు
యుగములకు
వీరగంగ ముందర రణవీరులమై
మేము
పరగ పోట్లాడుదు యిక్కడ పగ
సంహరింతు'
అనుచు తన మదియందు ఆత్మలో
దలచి
పరినిచారకుల బిలచి పలికెను రాజు:
'పాలేరు గడిచేసి పరగ
దక్షిణమందు
మా తండ్రి పోలురాజుకు మరియు
నెదురుగాను
తమరుండే తావుకు తమక మేర్పరచి
రణవిధి తమచుట్టు బహు
రమ్యముగాను
గుడార్లు యెత్తించ' మని గొబ్బున
జెప్పె
యేపైన గుడార్లు మెండుగా
నెత్తించ మనుచు
అనుచు కాటమరాజు ఆనతి యిచ్చి

పరిచారకులు అపుడు పనిపడి వేగ
తరుచుగా గుడార్లు తగ నొప్పయెత్తి
తగు నొప్ప యా వీర తమక
మేర్పరచి
పయిన చిత్తరువు గుడారు
పరగంగ యెత్తిరి
ఆ ముందరను యెత్తిరి ముత్యాల
గుడార్లు
నలుగడల యెత్తిరి నవరత్నాల
గుడార్లు
పచ్చవన్నె గుడార్లు పరగంగ
యెత్తిరి
నలుభైనాలుగు స్తంభాల
నామతీర్థపు గుడారు
కొలువు గుడార్లు గొబ్బున యెత్తిరి
గూడార్లు రత్నాల గూడార్లు ముత్తె
గూడార్లు వెలిపట్టు గూడార్లు చాల
యెండలకు యెత్తించ యల్లపట్టు
గుడారు
మైనపుబిడ్డు గుడార్లు వానలకు మరి
చాలా యెత్తిరి
పచ్చపట్టు గుడార్లు చల్వపందిట
గుడార్లు
యడలేక యెత్తించిరి యఱ్ఱపట్టు
గుడార్లు
సందు సందున ముత్యాల చలవ
గుడార్లు
తరచుగా నెత్తిరి ధరమీద నంత

గుడారు గుడారుకు పసిడి కుండ
నెత్తించిరి
ఘన శరభ శార్దూల గండ
భేరుండములు
శర బిరుదులన్నియు కడువేడ్క
యెత్తిరి
నఃనన్న చూచి యా నట సంతసిల్లి
తన మరిది పద్మనాయుడు తాను
తగు వేట్కతోను
నలభై నాలుగు స్తంభాల గుడారులలో
కొలువై నవ్వుచు రాజు
వల నొప్పు పంచమా వాద్యములతోను

## నెల్లూరు నుండి భట్టు రాయబారము వచ్చుట

వెలకొని వుణ్ణంగ నెల్లూరి నుంచి
రసికుండ్లు అనభట్టు రాయబారిగను
సిద్ధిరాజు పంపిన భట్టు శ్రీఘ్రమే
వచ్చి
కాటమరాజు యెత్తించిన గుడార్లు
కనుగొని చూచి
ఆశ్చర్యమందుచు ఆ భట్టు వచ్చి
కనుగొని రాజుకు కనుయెదుట
నిలిచి
ఆర్భాటములు చేసె భట్టు ఆమర్శంగ
చదివె:
'కాటమరాజా! బ్రహ్మయ్యవు కావలె
నీకు!
బడుగుల రాజువు బహు కీర్తి
ప్రతాప!
ఘనరిపుల సంహార! వో కాటమరాజ!
సోమ వంశాధిరాజ! వక్క
చోద్యంబు వినుము-
పడంబడిన పుల్లరి యియ్యక
వచ్చింది నీకు
అపకీర్తి వచ్చెను యికను
అడుగైన తర్లక
నిలు పుల్లరి యిప్పించు నిటు అటు
చూడక'

## కాటమరాజు వైముఖ్యము

ఆ మాటవిని రాజు ఆగ్రుడై మండి
కౌమాళ్ళ బంగారమనే భట్టును
గొబ్బున బిలిచి
'వాడు పుల్లరను మాటకు వనరుగా
చెప్పి

కడు వేగమున వాని కదలి
పొమ్మనుము'
విని యాదవుల భట్టు వివర
మేర్పడను
భట్టు భట్టు కథ సంభాషించి
రపుడు-
'రాయబారము చాలు రసికుడ!
వినుము
కడు పుల్లరి అంటేను కాసు వక
టెయ్యము
యీ మాట మీ రాజుకు వివరించి
చెప్పు
అందుకు మీ రాజు అతి
వుగ్రుడాయెనా
దండెత్తి మీ రాజును తర్లి
రమ్మనుము
కాళ మా పెద్దల కడు యుద్ధ
మహిమ
చెప్పంగ మీ రాజు చెవి సోకివుంటె
యిప్పుడు కదనమంటె యిటకు
రావెరచు
తరుచు మాటలు మాని దాగుండు
మనుడి'
ఆమాట వీని యా రాయశృంగావళి
మగుడి వేగమున
యాదవుల ముందును
రాయభార మాడి
అంత చింతాక్రాంతుడై రాయబట్టు

రాయభారము చెడె రాయన్నవంత
కొంతంత నెత్తిపై కొని వూరికేగె
కలియుగ కర్ణుండు కాటమరాజు
భట్టు తిరిగిన చూచి పక్కున నవ్వి
వెలయు పద్మనాయునితో విచారించి-
'నాయుడ! వినవోయి: నా చిన్న
మరిది
పాయరాని సంగడీడః
పద్మరాఘవుడః
ధర్మ యుద్ధమునకు తగ దొరుకునో
యనుచు
కారణ యుద్ధము కలిగితే మనకు
కైలాసమనుచు
మనకిట్లు సంతోషమై వుండగాను
తొల్లి మన పెద్దల పగలు దొరకొని
వచ్చె
పల్లవాది రాజుల పాలేటి వద్ద
పట్టి పోట్లాడవలె మా తండ్రి
ప్రతిజ్ఞ యీడేరు
ఆముకొని సిద్ధిరాజు అంపిన భట్టు
పగలు చాటుచు పోయ పగ నిజము
అయ
రాయభారం బోయి వారి రాజులకు
చెప్పి
యెప్పుడు వత్తురో యెరుగంగ రాదు
కట్టాయత్తు పడవలె మరిదిః
కడు వేగ మనము'

## కాటమరాజు యుద్ధమునకు సిద్ధమగుట

అని ధనముకొండనున్న
అయితమరాజుకు
పల్లెకొండకు జాబు వక్కా పరుగున
వ్రాసి
ఈలారి చేతికి జాబు గ్రక్కున
యిచ్చి
త్వరితమున రమ్మనుచు తీవ్రముగ
బంప
పద్మనాయునితో రాజు బల్కె నా
క్షణమె
'వరుసతో ధనకొండ రాజులు
వచ్చేటి వరకు
బొల్లావు మట్టావులకు పొసగ
చల్లవారికి
పగ చేరువాయెను పైనము
గమ్మనుచు
మరి యెరుక చేయించు మరిదిరో!
నీవు'
'మంచి'దని నాయుడు మరి
సంతసిల్లి
వెలయ పద్మనాయుడు యర్రయ్యను
బిలిచి
'పశుబాస తెలిసిన భావజ్ఞమూర్తి!
పగ యెరిగించు పోయి పశువులకు
నీవు'
అని చెప్పి నాయుడు ఆ చల్లవారికి
వెరుక చేయించెను వేవేగమునను
ఆవేళ సూర్యుండు హస్తాద్రి కరిగె
ఆప్రొద్దు యాదవులు అందము గాను
పరవాన్నములు మెలుమె బంతి
భోంచేసి
మరి నిద్రపోయిరి మందపాలకులు
భల్లున తెల్లవారె భానుడుదయించె
అప్పుడు పల్లికొండ అయితమరాజు
బాలలు భట్టావులు రాజు పరగ
యర్రయ్య
సకల సంభ్రమముతో యుద్ధమునకు
చనుదెంచి వచ్చిరి.
నాచకూళ్ళ నాయుడు, నేతివారి
ముద్దయ్య
కార్యమునకు సంతోష కలితులై
వచ్చిరి.
గడి పగలకు వైరు కరియావుల రాజు
పంచలింగాల కొండవద్ద నెల్లూరి
పగలు నిర్జింప
చాల వేడుక నొంది సరగ యేతెంచె.
బిరుదు కత్తి మన్నీడు యా బీరినేడు
'పగతుల కరులను పట్టి వధింతును'
అని వేడుక నొందుచు అతివేగ
వచ్చె.
దొనకొండ నున్నట్టి దుర్గాధిపతులు
వచ్చిరి అందరు వసుధ కంపింప

పల్లెకొండ వచ్చి గంగను ప్రార్థన
చేసె:
'పృథివి ఆకాశము భువనము
లేనినాడు
యేక జలంబు నీవై గంగ! వెలుగుచు
నుంటివి
అండాండంబులు నీవు
బ్రహ్మాండంబులు నీవు
అండముల బుట్టిన ముగ్గిరికి ఆదరువు
నీవు
తగ సూర్య చంద్రులకు దారివి నీవు
అతలంతములు నడప అంబవు నీవు
మింట మంటను నీవు మిగులు
వేల్పువు నీవు
అన్ని విధాలైన ఆయువు నీవు
యేక స్వరూపివై యేలుకో నీవు
మదములు వుడిగింప మాతవు నీవు
జగములు వెలిగింప జగదేవి నీవు
అలరు అకార ఆకారము లన్నియు
నీవు
శ్రీపురుష కారిణివి నీవు సిద్ధిజనములు
నీవు
వోంకారుడవు నీవు, యుగ మహా
కాళివి నీవు
శరణన్న వారిని చేపట్టు నీవు
ఘనులు ప్రార్ధన సేయు గంగవు
నీవు
అమర వల్లవులు కొలుచు హాంకార
రూపి!

తిరుమందుల వారు గొలిచిన దివ్య
స్వరూపి:
మా కారణం చూడను మరియు
పాలేట
ఘనమైన గుంట వెలసిన గంగరో!
నీవు
వల్లవుల తిరుమందుల
వైకుంఠవాసుల జేయు
సహాయమై యుద్ధము చేయించు
సఖియరో! గంగ!'
పల్లెకొండ వేడంగ గంగ ప్రత్యక్ష
మాయె.
చెలగి దర్శన మీయ సేనలందరును
హస్తములు ముకుళించి ఆమె
సెలవంది
అప్పుడు వీరేశాలు హస్తమున
వుంచి
గంగతో సెలవంది లింగాలకొండ
కడకు యేతెంచె
గుడారు వెదలి కాటమరాజు గొబ్బున
వచ్చె
పల్లెకొండకు దండ ప్రణామంబు జేసి
పట్టపు రాజు అయితన్నను ప్రస్తుతి
జేసి
అందరుని కౌగలించుకొని అరిషించి
నపుడు
కోర్కెతో అందరు లింగాల కొండకు
నెక్కిరి
ఘనముగా గంగరేగు కడకు యేతెంచిరి

గంగరేగు క్రిందవున్న లింగాల
కన్నుల జూచి
మామయని హరిషించె మరియు
పల్లెకొండ
తగు లింగమైన తండ్రికి కామాళ్ళు
దండము పెట్టె
పల్లెకొండను కలిసి అందరును
ప్రదక్షణ మైరి
పంచాక్షరుండైన తమ మామను
ప్రార్థించె:
'శివా! శివా! శంకర! శరణు మహ
దేవ!
భక్తవరుల పాలి పరమేశ! యీశ!
తొల్లి చంద్రగుప్తుడు శివుని దొడ్డ
పూజలు
ప్రతిష్ఠ పర్యంతంచేసి పరమేశ్వరుని
కృపను
ఆవుల వలురాజు అదృష్ట వశమున
వల్లమ్మకు
పోలురాజువై పుట్టితివి పురహరుని
కృపను
అ రూపమున హరుని అటు పూజచేసి
తుదను జంగాలకై దురములో నీవు
పరిణాన జంగాల పర్వతం బంపి
చూడ చోద్యముగ చోడ దేశమును
చుట్టుకొనె సీమ
హరహరా యని తలచి అటు
పారజూచి
అరి శానాపు శాసల గూల్చి

ముప్పైమూడు పోట్లు నీకు ముందుగా
నాటె
అప్పుడు అరువై యారు పోట్లు నాకు
అతిభారమాయ
హరిపురికి సెలవిచ్చి మామ!
నన్నంపుమంటె
పల్లవుల వోమామ! వద్దని చెప్పితివి
తల్లిదండ్రులు లేని బాలలకు తగ
నీవుదిక్కు
పంచకాండముల చెల్లినవారి సుతుల
బాగుగా తెచ్చి
యింత లంతల బాలల యీడేర్చు
మంటివి
దొరకొని బాలల ధనముకొండ
యేలించుమంటివి
మళ్లివచ్చె చిత్రభాను సంవత్సరాన
శిశువుల మాకు
చిత్రభాను సంవత్సరాన యీ పగ
సిద్ధముగ వచ్చు
తనకు పంచలింగాల కొండ తావని
పలికితివి
గంగరేగుకింద లింగమై వుండునంటివి
మనుమ వోమామ!
నీమాట మీరక పెంచితి మామ!
మీ కృపచాత
అరలేక పెంచితి మామ! నాతో
హర్షించి పలుకు
డాసిరి పగవారు దగ్గరవచ్చె

బాలుల పూట వప్పుకొని పరుగంగ
మాకు
పగ దీర్చ సెలవిచ్చి పంపుమీ
మమ్ము!
పల్లికొండమాటలకు లింగాలు
పక పక నవ్వి
అవురా పోలురాజను లింగమూర్తి
ప్రత్యక్షమై పల్లెకొండను పరగంగ
మెచ్చి
పగ దీర్చమని సెలవు బాగుగా యిచ్చె
అందరికి సెలవిచ్చె ఆ లింగమూర్తి
ధీరులై సెలవంది కొండ దిగివచ్చి
రపుడు
వీర తముకము దగ్గెర వేగంబె నిలచి
పల్లెకొండ రాజుల పరగంగ పిలిచి
పట్టపురాజు అయితన్న తమకము
యెక్కి పయనమని చెప్పె
కరియావులరాజు ఘనుడు వల్లభన్న
నాచకూళ్ళ నాయుడు, నేతివారి
ముద్దయ్య
పోచయ్య, ముమ్మయ్య, పుత్తమ
రాజు
మొదలైన బలాఢ్యులు మోదము
తోడ

పదిలెముగ తాణాలు బాగుగా నిలిపె
అసమయమున వీరునేడు అతి
వేగముగ మ్రొక్కి
సెలవు దయసేయమని సన్నిధి
నిలచె
'మంగోలిపాటను మీ తాణాలు
మరియుండ' మనిరి
అయితమరాజు పల్లెకొండ అతిభక్తి
తోను
కాటమరాజు పద్మనాయుడు కడు
భక్తితోను
ఆదినారాయణుని ఆత్మలో దలచి
గంగ విలువేల్పును ఘనముగా దలచి
పరవీర తముకానికి ప్రదక్షిణముచేసి
ఆ వీర తమకముమీద అపుడు
కూర్చుండి
భీమ దుర్యోధనుల బిరుదు
ప్రతాపంబు వినుచు
రామాయణము వినుచు రమణ
వీరతమకంబు పైని
సొగటాలు ఆడుచు సొంపు
తోడుతను
పగకు యెదురుచూచుచు నట్లు
యుండగాను-

## సిద్ధిరాజు యుద్ధమునకు సిద్ధమగుట

అంతట నెల్లూరను ఆ సిద్ధిరాజు
పంతముగ వీర పరివారము గొలువ

నాయకులు తామును నాట్యశాలలోను
ఆ యవసరంబున అపుడు కూరుచుండి

పశువుల మందను భట్టు రాయబార
మాడి
మగుడి వచ్చిరాజు కొలువు భట్టు
మరివేగ నిలచి
ముకుళిత హస్తుడై రాజుకు మొర
చెప్పసాగె:
'సిద్ధిరాజ! నీవు పంపిన శీఘ్రమే
పోయి
పంచలింగాల కొండకు తూర్పున
పాలేటివద్ద
యేమి కొదువయులేక యాదవరాజు
వన్నె వన్నె గుడార్లు వాడ యేర్పడను
విరివిగా యెత్తించినాడు
విచిత్రముగను
బాగుగా నలభైనాలుగు స్తంభాల
గుడారుతో పగడసాలాడంగ
కనుగొని రాజును కడువేగ చదివి
పశువుల పుల్లరి యివ్వక పరుగున
వస్తివి
వచ్చిన ధనము యివ్వక వస్తివి
యిక్కడికి
శిలాక్షరము వంటిది సిద్ధిరాజు
ధనము
నేర్పుతో ముడుపులు కట్టిన
ధనమును నెల్లూరి కంపిన
అడుగు సాగనిత్తు నన్నను రాజు
వుగ్రుడై మండె
గొదకొని యాదవులు మహా
కోపమున లేచి

హాగ్రులై మండుచు అవనీశ!
నిన్ను
తూలనాడుచు యాదవులు దుడుకులు
ఆడిరి
పుల్లరి యిమ్మంటే పొడిపింతు మనిరి
మళ్ళీ నీవంటి భట్లువచ్చి మనిమి
చేసినాను
కాసు వకటియ్యము కాబట్టి యుంటె
యుద్ధముకు రమ్మను మీ రాజును
యిపుడె
నీవు అంత శక్తుడవు కాకపోతె శరణు
పడుమనుము
హుంకారములుచూపి ఆడిరి రాజ!'
విని సిద్ధిరాజు వివశుడై వ్రాలె
హాగ్రుడై మండుచు అట్టిట్టు చూచి
మన్నీల దొరలను మంత్రుల బిలచి-
'సాహసులార! వినుడు వోక్షత్రి
యులార!
భారత పురాణములు చదివేటి వో
ప్రాజ్ఞులార!
చదువరులార! వినుడి యీ యాద
వుల సాహసమెల్ల
మునుపు కౌరవులనాడె మూర్ఖులు
యనుచు
మనసు లోపల చాల మాత్సర్యముండె
భీమినాయుడు అనియేక ప్రియములు
చెప్పి
భూమిలో యాదవులు పుణ్యాత్మ
లనుచు

సత్యము తప్పని సరసులని చెప్పగా
కవులిచ్చి నిలిపితి కవులావులలెల్ల
భూమి నీళ్ళు బుట్టిన పూరెల్ల మేపి
అనేక దుష్ట పశువులు యంత
చేసినాను
తనువులో సత్యంబు తప్పక వుంటిమి
యిప్పుడు గొల్లలు విపరీతముగను
రాకున్న దిగు పంతము రంపమని
పండును
హాంకారములు చూపి ఆడిరి యిపుడు
పదును కల మాటలు పలికిన వెనుక
గొల్లరాజు మాత్రానకు గొబ్బునదండు
వెళ్ళకుంటే రాజు వెరచే ననియేరు'
సిద్ధన తిక్కనను శ్రీఘ్రమే పిలిచి
'వుదయగిరికి రేఖలు వ్రాయించు'
మనెను
'కోట్ల పరియంతరము దండు
గూడుదురు గాని
చీట్లు వ్రాయించి తిక్కన!
శ్రీరంగానికి అంపు
వాలాయముగ దండు వత్తురు గాని
కొలలు విరచిన బోయ గుట్టాల
కంపు
వేలు లక్షలు వచ్చు వివర మేర్పడు'
ననెను
అనిన తిక్కన మంత్రి అన్ని
దిక్కులకు

కడువేగమున బంపె కదిలి
రమ్మనుచు
అంపిన రేఖలకు అవని ఆకాశంబు
కంపింపగా దండు కదలి యేతెంచె
తిరుణామల తిప్పరాజు శ్రీకంఠ రాజు
యిరు పదివేలతో యేతెంచె నపుడు,
పెదవేగి చొక్క రాజు పెదవీరుద రాజు
మద గజములతోడ మరివేగ వచ్చె,
అర్లుకొండ అచ్చిరాజు ఆదివన్నె
మారాజు
తర్లెను మూడు వేల దళముల తోను,
గయ కొండ నేలెడు ఘనుడు గంగ
రాజు
పది వేల దళములతొ పరగ నేతెంచె,
వుర్లుకొండ సోమన్న వుదయాద్రి
ముమ్మయ్య
సాహసులై కదిలిరి సార్వ దళముల
తోను
ఆదుకొని దండెత్తె ఆముకొని వచ్చె
చన్నపట్టణము యేలు చంద్రశేఖరుడు
పరగ దేవముని వెంగయ్యతో
బలములు చాల
యనయంగ దండెత్తె యాదవుల
మీద
పట్టుకోట బసవరాజు పాపతిమ్మ
రాజు
కట్టుజల్లులు గడలు గుమిగూడి వచ్చె

రాకోట యేలు రాయ శృంగపతి
అతివుగ్ర కోపమున అతి వేగ వచ్చె
చోరమండలము యేలు సురియల
సోమన్న
సబదంతి మూకతో సరగ నేతెంచె
పరగ కాళహస్త్రి పాప తిమ్మరాజు
వెలుకంచి యేలేటి వెంగళపతి రాజు
జోళ్ళ గుఱ్ఱాలతో జోకతో వచ్చిరి
ప్రభగిరి పట్టణమేలు పద్మశేఖరుడు
రథసంబుతో దండు రాగిడిలగాను
నందికనమ నాగరాజు నాల్గు వేల
తోను
అందెల గడలచే అప్పు దేతెంచె
నార్నవనము యేలు నంగ భీతినేడు
వేడుకతో దండు వేగంబె వచ్చె
నందివాడ పోతినేడు నన్నూరు
మూకతోను
సందు గల్గెనని సరస నేతెంచె
పచ్చమల తిమ్మరాజు పెదవటి
బావరాజు
అశ్వాళి మూకతో అప్పు దేతెంచె
బలవంతు దగువాడు పట్టతో
పిన్నయ్య
విలుమూక పన్నెండు వేలతో వచ్చె
తొమ్మిదివేల విలుమూక జోతుల
సోమినేడు
సమ్మతముగా దండు సరిగ నేతెంచె

మన్నె మరిది యేలేటి మంచిగంధము
మాదిరాజు
యేకాంగి మూకతో యేతెంచె నపుడు
చోడమండలమేలు సురియలు
సోమన్న
మెండైన మూకతో మెరసి యేతెంచె
పశువుల మంద కంచె పది లక్ష
పది కోట్లు
మసలుచు కదిలిరి మరి వేగమునను
గొల్లమంద కంచెను కోటాను కోట్లు
అల్లూరి మూకలు అరుదెంచి వచ్చె
మాళము సౌరాష్ట్రి మగధ
భూపతులు
కాశ్మీర కర్నాటక కాంభోజ పతులు
బర్మర కేకయాది బహు మూక
లెల్ల
ద్రావిడ కొంకణి ధరణిపాలకులు
భావింపగా ఆంధ్ర భూపతులు
సింధూర కుంకురు శింశుపాలకులు
మొదలైన అందరు నెల్లూరి కేతెంచి
రపుడు
కరి ఘోటకంబులు కాల్బలంబులును
సర్వేపల్లి మెట్ట సర్వ దళాలు నిలచె
వేగుచో సంద్రము వెలివిరిసి నట్లు
బాగుగా నేతెంచు బహుళమై దండు
నిలచిరి వజీలు నిర్విచారమున

దళవాయువు లంపిరి తగువేట్కా
తోను
పుడమీశు కావార్త పోయి వినుపింప
కడువేగముస భద్రగజమున యెక్కి
అన్నలు దమ్ములు ఆప్త వర్గంబు
యన్నగల తేజీల యక్కి రిరుగడల
బాహు బలశేసుడై వీర పరివార
హితులు
కొలువంగ ముత్యాల గొడుగుల నీడ
బహువాద్య మేళముతో బలువిడి
మ్రోవ
మహిపాలు దేతెంచి మంత్రులు దాను
దూరాన రాగాను దుర్గాధిపతులు
తగు బారులు దీర్చిరి దళము
లందరును
భానుకుల యీశ్వరుడు బారుల వెంట
వెనుకగను నడిపించె వేడుక గాను
కరి తురంగంబులు ఘనవీర భటులు
విరివైన లొటపిటలు వెసరాగ
జూచి
వారి పటాటోపము శౌరి ము స్త్రీదు
వారి సన్నాహంబు వరుసతో జూచి
అప్పుడు సిద్ధిరాజు అతి సంతసిల్లి
బంధుజనులు తాను పట్నాన కరిగె.
యేరాజు పరివార మేర్పరపించి
వారికి భత్యాలు వలసినట్లిచ్చి
దొర మన్నె వారిని తోడి తెప్పించి

పరమాన్నములు మెలచి బంతి
బెట్టించి
దేశాధిపతులతో దినకర తేజుండు
భాషింపుచుండెను పట్టణంబు లోను.
అంతట భూపాలుడు ఆ మరునాడు
వంతు కెక్కిన మంత్రి వర్గముల
బిలిచి
చైత్ర[2] చామరములు చేరి పట్టంగ
మిత్రులు సుతులు సామంతులు దాను
చనుదెంచి కంతట శాలలో నిలిచి
దినముడి మ్రొక్కగ దేశాధిపతులు
పరివణాగతలు పట్టించ నపుడు
యెనభై యెనిమిది వేల యేకాంగి
వీరులు
వెలయ తొంభై వేల వృత్తమహా
అశ్వములు[3]
సెరిది యెనిమిదివేల చొక్కపు
నుల్వి పెలును
యిరవై యారు లక్షలు యీను
గోడిగలు
కరులు మూడువేలు గడలైదు
లక్షలును
పరగంగ లొటపిటలు పది అయిదు
వేలు
పసగల పచ్చల పాలకీలు నూరు
సరిగలు నొకలక్ష అందలాలు నూరు
వెసగంగ సూర్యపటము లేనూరు

2. ఛత్ర

వెరసి ముప్పైరెండువేల
వింజామరంబులును
డమాము లేనూరు డాలు లేనూరు
కొమరొప్ప జగజంపు
గొడుగులేనూరు
తుపాకీలు మూక తొమ్మిది లక్షలును
అరుదైన శూలాల బండ్లు ఆరునూరు
గడిమన్నె వారుగా సవార్లుగాక
నడిమి కొల్లకాండ్రు నాలుగు వేలు
బహువాద్య మేళాలు పరగ నేనూరు
మహిపాలుడిటు చూచి మరి సంతసిల్లి
అతులిత ప్రతాపశాలి ఆ సిద్ధిరాజు
తన హిత మంత్రుల దాయంగ బిలిచి
పరగ సహోదరుల నొప్పారంగ జూచి
హితమంత్రి సహోదరులతో యిట్లని
పలికె:
'కనుగొంటిరా మీరు ఘనవీరు
భటులః
యవ్వరిని కనుగొన్న యేకాంగి
వీరులును
యవ్వరి సాహసం బెన్న గోచరము

యింత పటాటోప మింత మస్తీబు
యింత పరాక్రమం బెంతవాడోపు
బ్రహ్మ లిఖితము యెటువలెనున్నదో
కాని
యిమ్మహిని వీరితో సాటివాడు
యాడలేడు
పంపిన మన వొక్కమొన బాగుగా
బోయి
చంపి వత్తురు యాదవుల నైతే
సమరంబునందు
మన వొక్కమొన చాలు మడియింప
వారిని
వారి మందలోన వాసుదేవుండు
ఆరూఢి బొల్లావు అయి పుట్టినాడు
పరగ కృష్ణ సహాయ మని యాదవులు
పదురుచున్నారు
అదిగాక వారికి అధికధైర్యంబు
పురణింప గవి వాత పులియున్న యట్లు
ఆరు దైన ఠాణాన ఆ చల్లవారు
సాహసుడుగాని వారితో సరిపోర లేదు
అని మది సిద్ధిరాజు అనుమానపడగ

## తనను రణమునకు పంపుమని ఖడ్గతిక్కన నలసిద్ధి నర్థించుట

అనిన తిక్కన మంత్రి అమిత
సంతోషముననః—

'పల్లవుల సిద్ధి! పట్టాభి షేఖర!
మదిని

చల్లవారని యెంచకుము నాకు
లేశమాత్రము గారు
చల్లవారును యాదవ శానలు యెంత?
మిగుల మన దళములు మితిలేక
యుందు
శరణనుచు నినుగొలుచు రాజులు
శానాపశానలు
అందలాల రాజులు యందరో గలరు
పౌరుషంబున వచ్చినారు పాలకీల
రాజులు చాల
కనుచూపు మేరన వున్నాది ఆ
కాలిదళము
పగ అంటే నెల్లూరు పొగలుచున్నాది
కార్యంబంటే యీ శానానశానలు
కలకల నవ్వుచున్నారు
భుజం భుజంబు వొరిస్తే నీకొలువున
బుక్కాయి రాలుచున్నాది
శిఖ శిఖ వొరిస్తే శ్రీ మల్లెలు
రాలుచున్నావి
కత్తి కత్తి వరిసిన వుక్కుపొడి
రాలుచున్నాది
యేతట్టు చూచినా మన దళము
మూడామడ అరలేక కుదురు
చెదిరితే ఆరామడ మన సేన లున్నావి
యీ దళములకు సాటి అని
యాదవుల తలచకు రాజ!
కులగిరి పర్వతాలు కోరి చెప్పినచోట
తెలియ పోలు పల్లె తిప్ప లేసాటి
యేరునిండి పారంగ వెంపలిచెట్లు

పారకుండాజేసి పట్టంగ గలవ?
యీ సర్వదళాలు యాద? చల్లవారు
యాద
వీర విశ్వరుండ! నేను వక్కడనే
పోయి
సంహరించి వత్తును సాహసముగాను
గంహరముగ రాజును గద్దించినట్లును
చల్లవారి నందరిని సమయించి వత్తు
చక్కగా నరుకుదు సమరంబులోను
పల్లవాది రాజ! పంపుము నన్ను'
అనిన భూనాథుండు అందు కేమనక
అట్టె వూరకవుండె; ఆ మరునాడు
వనర తిక్కనమంత్రి రాజుతో
వప్పుగా పలికె:
'ధరణీశ! అటు నన్ను నిన్న
దండంపమన్న
అమరంగ ఆ మాటకు
అని దెల్పవైతివి
యేమి నీ వుద్దేశము? యెరిగింపు'
మనగ
నవ్వి తిక్కన మంత్రితో రాజు
నప్పుడిట్లనియె-
'కరణాల దేవూరు? కయ్య
మేవూరు?
పరికింపను చదువను బాసలు
దెలుప
వ్రాయను వ్రాయింప వ్యవహారసరణి
లెక్కింప మీకు చెల్లినది, అంతెగాని
పగతుర నిర్జింప పనికాదు మీకు

నరుల కండలు రాల్చు
నలవాటు లేదు'
ఆ రాజు మాటలకు తిక్కన
అప్పుడిట్లనియె:
'కరణమని మాపాల కరుణ వుంటే
చాలు
బ్రాహ్మడని చూడకు యీ పట్టభాను
తెల్పుండ
యీ పనికి నన్నంపు యీడేర్చి వత్తు
ఘట్టిగా సెలవిచ్చి రాజ! నను
కార్యమునకు పంపు'
పైపైని అడుగంగ రాజు పరగ
సెలవిచ్చి
గంధము కస్తూరి ఘనముగా బూసి
తలుకుతో తాంబూలము తగగ
యిప్పించి
పోయిరమ్మని చాల పోషించి పంపె.

## ఖడ్గ తిక్కన రణమున కేగుట

పంపిన యాతను మహా
ప్రతాపంబుతోను
వుత్తమాశ్వాన్ని వానరంగ నెక్కి
కొలువంగ జగజంపు గొడుగుల నీడ
సలలితంబుగ వెల్ల చామరంబులను
మదగజంబులతోడ మహిమ దీపింప
ఖడ్గ తిక్కనమంత్రి కదలె తేజీల
గొదకొని చాగలకొండ కేతెంచె.
ఆవేళ చల్లవారు అత్యంతబలులు
దేవేంద్ర భోగులై ధీరులై వుండంగ
తన బలములు గడిచేసె పరగ
యీ మంత్రి
అప్పుడు తిక్కనమంత్రి అర్పుచు
కదిసె
కదిసిన యాదవులు ఖడ్గము
లందుకొని
చదరక నిలిచిరి సమరంబులోన
'గోవింద! గోవింద!' యనుచు
గోపాలవర్గంబు
వేవేగమున రాచవీరుల గదిసి
గాండివములతోడ కలిసి పోట్లాడ
గడలు గడలు చాల కదిసిరి బలము
వాణిజ గదాళములు వంకిణీలు
కొంత
కటార్లు నొకకొంత కత్తులును కొంత
అట్టహాసము చేసి రనియేక తడవు
చలముకొని యెండలో సమసిన రీతి
ఆకు లన్నియు ప డిన ఆ మంత్రి
మీద
వడి బేసి నురగాలి విసిరిన యపుడు
కారాకు డుల్లిన కైనడి తోను
మడిసెను తిక్కన మంత్రి బలమెల్ల,

యదు బలములకు చాల యేట్లు
పోట్లాయ
'వడి చేసి యుద్ధాన తిక్కన
వక్కడే యున్నాడు'
అని యాదవులు తలచి ఆలంబు
శాయకను
కదలక నిలిచిరి ఘనముగ నంత.
మరి తలచె తిక్కన మంత్రి
తనలోను–
'వద్దు వద్దనగ రాజు యిటకు వచ్చితో
నేను
చల్లవారు నిలిచిరి నా బలమెల్ల
సమెసె
నేనున్న ఫలమేమి? నిపుడు చల్ల
భూపతులు
యేనుగులపై దూకి యదువుల
సమయింతు'
అనుచు తన అశ్వాన్ని అటు
పీడుకొల్పె
కపటారి గజములపై కదిసి రాగాను,

## చల్ల పిన్నమనీడు ఖడ్గతిక్కనను చంపక విడుచుట

చల్ల పిన్నమ నాయుడు సార్వ
భౌముండు
అల్లంతటను నిలిచి అప్పుడిట్లనియె:
'పోరు నిల్పుము వోయి భూసు
రోత్తముడ!
సరిగాదు మాతోను సమరంబు శాయ
అగ్రజులు మీరు యాదవులము
మేము
వగ్రము మామీద వుంచగా రాదు
తరతరముల నుండి మా తాత
తండ్రులు తొల్లి
భట్టులను బ్రాహ్మణులను పరగ
వైష్ణవులను
వెట్టి చెరలు విడిపించి వెనుక వేసు
కొని
వెసగొని ప్రాణాలు యిచ్చినారు
కీర్తి ప్రబల వలె నెనుచు
పుడమిలో యాదవులు పుణ్యాత్ము
లనగ
కడసారి బ్రహ్మత్య కట్టుకోరాదు
ఆ మీదట నీవు అన్నియు
యెరుగుదువు
భూమీశుడెరుగని పోరు నీకేల?
యవ్వరు చూచేరు నీవు యుద్ధంబు
శాయగను?
దవ్వున వున్నాడు మీ ధారుణీశ్వరుడు
పోరు నీకేల? బుధపుంగవ!
పోవోయి!

ధారుణీశ్వరుడు సిద్ధిరాజును దండెత్తి
రమ్మనుము'
అని యిట్లు చల్ల పిన్నయ్య అటు
వేగ చెప్పె.

## ఖడ్గ తిక్కన విరుగు

అన విని తిక్కన అశ్వముపై నుండి
మనసులో వక నీతి మార్గంబు
దలచి—
'యతి ప్రాసనీతులు యెరగని కవి
యాలః
సుతి గూర్చి పాడని సొగసు పద
మేలః
పతి చూచి మెచ్చని బంటుతన
మేలః
యితరులు మెచ్చని యీటె సాధనము
యాలః
నే బోయి రాజుకు యిప్పుడు
చెప్పినను
బహు బలముతో రాజు పయనమై
వచ్చి
మునిదళముతో వచ్చి ముందుగా
బలసి
పగతుల చంపుదు పల్లవరాజు
చూడంగ
యీ చల్లవారిని నే త్రుంతు
సమరంబులోను'
అనుచు తిక్కన మంత్రి ఆత్మ దల
పోసి—
అని కాయ కప్పుదు అచ్చట బాసి
తన బలమంతయు ధాత్రి గోల్పోయి
చనియె నంతట గృహమునకు
చయ్యన నపుడు

## తండ్రి సిద్ధనమంత్రి ఖడ్గతిక్కనను దూరుట

అశ్వంబుపై దిగ్గి అలసట దీర్చి
అశ్వాలలో తేజి నపుడు కట్టించి
తనువు లోపలవున్న దాహంబు తీర్చి
గొనకొని శయ్యపై కూర్చుండగాను
సిద్ధనమంత్రి తా శ్రీఘ్రమే వచ్చి
సుద్దుల వార్తలు సుతుని తానడిగె
యేమి తోచక తండ్రితో యెదు
రాదకున్న
అప్పుడు తన పుత్రుండు యాదవులకు
(వోడి)
పారి వచ్చి నాడని పలికె నొక
మాట:

పలికెను వక మాట పెద్ద కాలము
నాడు
'కొడుకః మన వంశము పేరు
కలదంచు
సిద్ధన తిక్కన! సృష్టిలోపలను
పులికడుపున గొఱ్ఱెపుట్టిన చందమున
కలిగితి నాయింతి గర్భంబునందు
చదువున శాస్త్రిన సాహసమునందు
తిక్కనః నీ పాటు ధీరతలేరు అనగ
సాహసంబున క్షారిని సాధింతునని
పోయి
యింతగా వెన్నిచ్చి యిటువలె రాను
మొగతనంబున బుట్టి
మొగవాడ నమచు
పగతుకు వెన్నిచ్చిన ప్రాణంబు
యాల?
హరులకు[4] వోడి వచ్చి అవనిలో
మనుటకన్న
సరగ రణములోన సమయుట మేలు
పందవు పిరికివి గాని భావజ్ఞుడవు
కావు
యెందుకు యీ ప్రాణంబు? యాల
యీ బ్రతుకు?'
అనుచు సిద్ధనమంత్రి తనయుని
అటు తూలనాడె.

## పురజనులు ఖడ్గతిక్కనను అవహేళన చేయుట

ఘనమైన తిక్కనమంత్రి తానపుడు
తన మది అంతయు తలగక యుండె
అప్పుడు పురజనులు అందరు అతని
చప్పట్లు గొట్టుచు జాతలాడుచును
కేకలు వేయుచు గేలి బట్టించిరిః
'వివేక మెరుగని వెర్రి కిరణము
గాక
అవనీశ్వరా! నే బోయి అని
చేతుననియు
వూరకే చెప్పని వాక్కు పొద్దున్నట్లు
జగడానకు నీవు చనుదెంచి పోతివి
తాటాకులు మోసి తగ వ్రాయనేగాని
చెలగి యుద్ధము శాయ నీచాత
యేమౌను?
మెరువడి నిలచిన ష్మైలైన మొనలు
సరిశాయ అవి యజ్ఞశాలలు గావు!
హరులతో పోరుగాని అక్షింతలు గావు!
ప్రళయమైన తుపాకి వేట్లుగాని
ప్రయోగ మంత్రాలు గావు!

4. అరులకు

అట్టహాసములుగాని
సంధ్యానుష్ఠానములు గావు!
చనుదెంచు చక్రాలు చక్కిలాలు
గావు!
ఘనమైన బాణాలు గారెలు గావు!
అర్చిన కత్తులు అరిసెలు గావు!
పూని పొడిచే బల్లాలు పూర్ణ
కుడుములు కావు!
కుంతాల పోట్లు యిప్పుడు కూరయు
గాదు
కమ్మని పాశంబుతో సమముగాదు
కయ్యంబు!
వండిన పిండివంట బారిగొననే కాని
బంటుతనం బేవూరు? బ్రాహ్మ
దేవూరు?'
అనుచు పురజనులు అందరు అతని
అనేక విధంబుల ఆస్యంబు చేసిరి
యందరు యెన్ని అడిగినా తిక్కన
వెరువక వుండెను

## భార్య ఖడ్గతిక్కనను అవమానించుట

కావున మధ్యాహ్నకాలంబు అయ
పరగ తిక్కనభార్య పతివ్రత గనుక
పగతులకు వెన్నిచ్చి నావిభుడు
వక్కపరుగున వచ్చి
ఆయనః తన విభుడు అలసినాడనుచు
కడువేగ విభునికి కాగిన నీళ్ళు
బిందెలతో చన్నీళ్ళు బిర బిర దెచ్చి
పసిడి చెంబుల నీళ్ల పాకంబుచేసి
అక్కడ పట్టెమంచములు అడ్డంబు
బెట్టి
అద్దకేరు పసుపుముద్ద తమరంగ
మంచి
'కూర్చుండి స్నానంబు గొబ్బున సేయు'
అని చెప్పి వచ్చెను తమ అత్తదగ్గిరికి
'గొబ్బున స్నానంబుచేసి నీకూతురు
వస్తుంది
తీర్చి అడ్డబొట్టు స్థిరముగా బెట్టి
గంధము చెక్కిళ్ళను ఘనముగా
బూసి
పళ్ళెములో అన్నంబు బాగుగా బెట్టు'
అత్తతో మనవిగా అటువిన్నవించ
మామ సిద్ధనమంత్రి విని మరి సంతసిల్లి
తన సతికి కొన్ని బోధించి తగ
పీడుకొల్పె

## తల్లి ఖడ్గతిక్కనను పోటుమాటలాడుట

స్నానంబు చేసె కొమారుడు, తగ
సంధ్యవార్చి,
భోజనపు శాలకు వచ్చి పొందుగా
నిల్చె
ప్రీతితోడత తల్లి పీఠంబు వేయించి
అన్నంబు వడ్డించి అతిభక్తితోను
'ఆకొని వస్తివి కొమార! అరులకు
నోడి

భోంచేయ'మని సెలవు పొందుగా
యిచ్చె
పప్పుకూర అన్నము పరగ
భోంచేసెను
అమృతము వడ్డించె అ సమయ
మమునను
వేగ ఆవులపాలు విరుగంగ కాచి
అన్నములో బోశ ఆ విరుగుబాలు
కన్నన జూచి తిక్కనమంత్రి
తా బలికె:
'పణతిరో! నో తల్లి! యీ పాలు
విరిగినది యేమి''
యివి నాకు బోసిన విచిత్రమేమి?''
అన్న కొమరుని జూచి ఆ తల్లి
బలికె
'అరుణోదయపువేళ అది యెట్టిదో కాని
ఆవులు పెయ్యలు అటు మెయ్యబోయి
హరులతో పోరాడి అటుమీద నీవు
విరిగిన నినుజూచి విరిగెను పాలు'
అనిన కుమారుడు అప్పుడేమనక
తన ధృతియంతయు తప్పక నిల్పి

అప్పుడు బహులెస్స అన్నంబు
భోంచేసి
కర్పూర విడియము గ్రుక్కన
సేయుచును
పసగల జాజులు పరచిన పాన్పు
పైని
నీతిగల తిక్కన నిద్రభోనించి
కలలోను తిక్కన కత్తులతోను
కండె మొండెములుగా నరుకులుగనిలేచె
తెల్ల తెల్ల వారంగ తిక్కన
మేల్కాని
సంధ్యానుష్ఠానములు చయ్యన దీర్చి
గంధము కస్తూరి కడువేట్కనలది
నవరత్న భూషణాలు అలంకరించు
కొని
వేవేగ భోంచేసి విడెమందుకోని
ధాత్రిని యన్నంగ బుద్ధితలచె వేగంబె
తను తండ్రి సిద్ధనను తగ
పిలుచుకోని
అతులిత ప్రతాపశాలి అప్పు డిట్లనియె:

## ఖడ్గతిక్కన ప్రతినబూని కదనమున కురుకుట

'వో తండ్రీ! విసుపుకొనక విను
విన్నపంబు
నా యొక్క కీర్తియు నానంద
మొంద

యెదుబలముల మీదికి యేతెంచు
చున్నాను
వాతిని చంపి మళ్ళి వస్తినా
మేలాయ

పోరాడి వారి చాత పొలసితి నైన
నీవు అక్కడి కార్యవార్త నిజమని
తెలిసి
వేవేగ తన రణమును వెతకంగ
రమ్ము!
ఆముకొని పగవారని నేను హతము
కాయంగ
కనుగొని పగవారు నా ఖండలు
నరికినాను
పరగ యెముకలు వున్న పోరుదు
పగతుల ద్రుంతు
వకచోట వుండదు వనరగా బొందె
కదనంబులో బొందె నీవు
కానకుంటేను
ఆ దుర్గ ఘోరయుద్ధంబు నందు
అక్కడక్కడ ఖండలు
యెగిరి పడుచుండెనైనను
అవి తిక్కన ఖండలని తెలియంగ
చూడుము'
తగ చెప్పి తండ్రికి దణ్ణంబు పెట్టి
చత్ర బిరుదునుగల సరస్వతిని
నుతియించి
అప్పుడు తిక్కన అశ్వాన్ని యెక్కి
జనకునికి తగ జెప్పి శౌర్యంబుతోను
కదసి కొంత దళము కవగొని
నడువ
సరిగపేటు రుమాల జగజంపు
గొడుగులు

తిమురుచు రాగాను ధీరత మెరిసి
పురవడిగా తేజిపై వురుకుచు రాగ
ఆజిలో రాగాను యాదవులు జూచి
చల్ల పిన్నమనాయుడు సరగ
నిట్లనియె
ఘల్లున నవ్వి యా విప్రుని జూచి
'తన బలమంతయు ధాత్రి గోల్పోయి
మనుజేశ కొలువుకు వక్కడు
మిగిడి పోతేను
మానవాధీశ్వరుని మంత్రి వర్గంబు
పూని యితనికి రోషంబు
పుట్టించినారు
తగ బంధుజనుల దూషణము
తా నోర్వలేక
సరగ కొంత దళమును జతగూర్చు
కొనియు
బుద్ధిచాలని యట్టి భూసురుడు
మనతోను
యుద్ధంబు కాయను యేతెంచినాడు
సర్వదా బ్రాహ్మణుడు చావకపోదు
బ్రహ్మహత్య మనకును బాధింపకపోదు
అని చంపకున్న యితడు
చంపకపోడు
చంపకుండగ రాదు చావగా రాదు
యిందుకు గతియేమి యెరిగింపు'
మన్న..

## బ్రహ్మరుద్రయ్య పిన్నమనేని శంకబాపుట

బాగైన తన మంత్రి బ్రహ్మ
రుద్రయ్య
ధీమంతు డిట్లని తెగ విన్నవించె:
'ధీమంతుని తలచి చింతపడ నిపుడు
చలముకొని పోరాడ చనుదెంచు
నపుడు
కులవర్ణములు దెలుప కూడ దెవరికైన
అవనిలో రాఘవులు ఆ పణతి కొరకు
రావణేశ్వరుని ద్రుంచడా
రణవీథిలోను?
వైరుల యెక్కువనక వసుధపై
కూల్పవలెను
యెదిరించినపుడు యెవడైతే నేమి?
వధియింపవలెగాని వర్ణింప తగదు
భూసురుం డతడని పోరాడకున్న
నే జేతు అతనితో నేడు యుద్ధంబు
బ్రాహ్మడు అతడు శివబ్రాహ్మడ
నేను
బ్రాహ్మణునితో పోరాడ భావ్యంబు
మాకు
అతని చంపి తాను హతమైతినైన
యాదవ కులనాథ! యిటు
వినవయ్య!

గోదావరి నదులు కులగిరి యెన్నాళ్ళు
ఆదిత్య చంద్రులు అవని యెన్నాళ్ళు
కలియుగ మహత్యం యెన్నాళ్ళు
యాదవ పుణ్యకథలు
నిలుచునన్నాళ్ళు
మా పేరు అవనిలో మరివేగ నిలుపు'
'హరహరా' యని తలలింగమును
అచ్చోట నిలిపి
గంధ మక్షింతల ఘనపూజ జేసి
మారేడు పత్రియు మల్లెపువ్వులును
శిరమందు ధరియించి
శివలింగ[illegible]కు
వీరబోనము తనకు వేగ చెల్లించి
కానుకలు తమలంబు కడు
నొప్పగించి
మరి ధూప దీవములను మహాదేవునకును
'మేదినిలో మాకు యీ మేరులు
నిలుపు
సూర్యులు చంద్రులు సురులు
సాక్షిగను
మీరక నడిపించి సీటిలో మేరగా
నీవు'

## బ్రహ్మరుద్రయ్య-ఖడ్గ తిక్కన్నలు ద్వంద్వ యుద్ధములో మడియుట

అని విన్నవించి ఆ బ్రహ్మరుద్రుండు కడువేగమున వీరబాకగా గట్టి

వీభూతి ధరించి వెలయ రుద్రాక్షలు
ఆభరణాలు సొమ్ములు అలంకరించి
అతడు
మహలింగమును తన మనస్సునందు
జేర్చి
తా నాత్మపూజయు త్వరితముగ జేసి
ఆలింగనం జేసి అర్ఘ్యపాద్యాదు లిచ్చి
ఖరవాలము[1] చేపట్టె ఘనుడు
రుద్రయ్య
పరికింప నా వీరభద్రుని రీతి
వక కొంత యాదవులలో
వనరంగగొల్ల
ముఖనాయకుడై ముదముతో వేగ
వేవేగ రుద్రుండు వృషభంబు నెక్కె
అది యెరిగి తిక్కన అశ్వమును
దూకించె,
మరి యా బ్రహ్మరుద్రుండు
మార్కొని నిలిచి
తీవ్ర తీవ్రముగా తిక్కనమంత్రి
తిప్పె ఖడ్గంబు
ఖరవాలము ఝళిపించె బ్రహ్మ
రుద్రయ్య
తిక్కన అశ్వంబు తిమురుగా నడువ
త్రొక్కిరి చెట్లను
త్రొక్కింపుకొనుచు
తరిమి యా తిక్కన దళముల నరికె
సరగ తన తేజీని చబుకున గొట్టి
మొత్తమె మూకల మెరిసె సరుకంగ

పరగ బ్రహ్మరుద్రుడు బసవేశ్వరుని
తురంగమునకు మించ దూకించె
నపుడు
బారుల తెగటార్చి బాపురే యనుచు
బంటు బంటు కదసి బహు
యుద్ధమాయె
వాటంగ చూచియు వడి నరుకువారు
వుత్తమాశ్వాన్ని బ్రహ్మరుద్రునిపై
నురికించెనపుడు
యెద్దును దూకించె యేకాండముగాను
పృథివిపై యెగసెను పెంధూళి
యపుడు
కదనంబులో యిద్దరు కానరాకుండ
ధరణి ధూమ్రము గప్పె తరచుగా
నపుడు
యక్కడ చూచిన యాదవులు
యడలేక కదిసి
యక్కడెక్కడ రుద్రుడే
యెదిరించినట్లు
యక్కడ చూచిన యాజిలో నపుడు
తిక్కనమంత్రి జగడములాడి
తిరుసీపులాడి
అంకించు ఖడ్గము అందుకొని
యప్పుడు
వైరుల వొక్కొక్క వైనాన ద్రుంచి
అప్పుడు రణములో అట్టలు సిట్టలును
తలలు బాహులు తరస
మొ[illegible]లు

1. క[illegible]వాలము

కుప్పలై కుండలుగా గుండెలు రాలె
వనర తిక్కన మంత్రి దళమెల్ల
వరిగె
అప్పుడు తిక్కనకు గాయాలు
అవలీలగా నాయె
చూచి యాదవులు చోద్యపడుకొనుచు
'తిక్కన వక్కడై దిగువారి నాడు
పెక్కురొక్కని తోడ
పెనుగాడ రాదు
వక్కడు తిక్కనపై వలదు
యుద్ధంబు'
అని బ్రహ్మ రుద్రుండు
అటు దలపోసె
నిలిచిరి అంతట నీతిజ్ఞులగుచు
అప్పుడు తిక్కన మంత్రి అగ్ని
చండమున
కదిసిన కోపాగ్ని కన్నుల
దొరియంగ
అదిలించి తిక్కనమంత్రి
ఆయుధాన వైచె
ఘనమైన రుద్రునకు ఆ వాటు దప్పె
కోపించి కరవాలము ఝళిపించె
రుద్రుండు
విడిబడి రణమున యిద్దరు పోరి
తప్పించుకొని వారు ధరణిపై యెగిసి
లంఘించి వెనుకకు రాగడిల్లుచును
పరగంగ ఘూకుచు పరగ
పొడుచుచును
తాటించి నరకుచు తామసంబునను

పురవడిన వచ్చి పరువెడి సేసియును
కటపెట ఖలగురింగు ఘల్లుఘల్లు
మనుచు
యిరువురి వట్టి తాళములు శాయ
మెరుపులవలె మీరి మెరయుచు
పిడుగు
చరపులవలె గొప్ప సడిని వ్రేయుచును
యిరువురు పోరిరి దుర్వారు లగుచు
రణమున తిక్కన కండలు
రాలె నెల్లెడల
గొదకొని తిక్కన మహా
కోపముతోను
అదలించి రుద్రుణ్ణి ఆయుధాన వైచె
ఆయుధాన వైచిన ఆ
బ్రహ్మ రుద్రయ్య
వడలు సఖములు తెగి వుర్విపై
బడియె
పొరుగుచు రుద్రుండు వుగ్రంబుతోను
తతికొని యా మంత్రి తల
ద్రుంచివైచె
అతనిచే ఆయుధములు అత్తని
శస్త్రములు
ఆముకొని యాదవులు అదుకొని
రపుడు
తిక్కనను పరిమార్చి తన
పంతమూడ్చె
అపుడు బ్రహ్మరుద్రయ్య ఆటు
మూర్ఛబోయ

## బ్రహ్మరుద్రయ్య మృతికి పిన్నమనేడు దుఃఖించుట

చల్ల పిన్నమనాయునికి బ్రహ్మ
రుద్రుండు సమిసెనని చెప్పిరి
అనేక చింతించి అప్పుడు లేచి
తన సహోదరులైన తమ్ములు తాను
సాహసఘనుడు వరిగిన చందంబు
చూచి
తెగి వయ్యలై వున్న దేహంబు చూచి
సాహసధీరుడై చల్ల పిన్నమనాయు
డిట్లనియె
'కటకట బ్రహ్మరుద్రుండ! కట్టడి
నీకు
యటువలె బ్రాహ్మడా! యీశ్వరుని
మహిమ
యాదవులకు బ్రహ్మత్య యంటకుండ
చేసె
యితనిచే పోరితివి యిక్కడ
వొరిగితివి
పర వుపకారివి పావనమూర్తి!
పరగంగ తమ కొరకు ప్రాణాలు
యిస్తివి
యెన్నెన్ని జన్మాల యీ లోకమందు
యనయంగ నీ ఋణము యెటు
బాపగలము
మాతోడ నాడిన మాటల క్రమము
భూతలంబున నీకు పూజ లొనరించు
అరుదుగా విలువేల్పు[6] వని
కొలచినగాని
పరికింప నీ ఋణము బాపుకోలేము'
అనుచు పిన్నమనాయుడు అనుజులు
దాను
పరగ బ్రాహ్మణుని గుణములు
యెంచుచును
చింతించి అనేక విధముల దలచి
అంతయు సమాధి అతనికి
యేర్పరచి
మాఖ బహుళ అమావాస్య
మంగళ్వారము నాడు
వేగంబె అతనికి యేర్పరచె నపుడు
గోబిలములో బ్రహ్మరుద్రుని
గూర్చుండబెట్టి
విమలముగా శంఖములు వీరణాలు
మ్రోవ
నీలకంతుని సముఖాన నిక్షేపంబు
చేసె
వెనయంగ నందరు యిండ్లకు చనిరి.
సిరిగల తిక్కన చెల్లిన చిల్లరవారు
అంతయు నెల్లూరి కేతెంచి రపుడు
సిద్దన మంత్రి కొలువుకు శీఘ్రంబె
పోయి

6. ఇలవేల్పు

నిలిచి చెప్పిరి తిక్కన మంత్రి
నిష్ఠుర కార్యంబు
'యుద్ధంబులో కొందరు యాదవుల
త్రుంచె
కొదమ సింహ్వము లేళ్ళ గుమి
జొచ్చినట్లును
కణుకులుగా నరికి కల్లుగా జంపె
పరగ బ్రహ్మరుద్రునితో సరిపోరె
కసి మసంగుచు వుప్పుకల్లుగా చిదిమె
బ్రహ్మరుద్రునితోడ ప్రతి నిల్చి పోరె
వొండొరులను వారు ఖండించుకొనిరి
ధీర విహారులై తెగిరి యిద్దరును
తిక్కన రుద్రయ్య దివి కేగినారు'

## సిద్ధనమంత్రి రణభూమికేగి ఖడ్గతిక్కన కండలను ఏరి తెచ్చుట

ఆ మాట విని సిద్దనపుడు రణరంగ
భూమి
వేవేగ తన కొడుకు రణము వెతకను
వచ్చె
తన కొడుకు చేసిన ఘోర
యుద్ధంబు చూచి
అట చోద్యమనుచును అరచు
చిట్లనియె
'కొడుక ! నీ రణము
హరుడెంచవలెను
నరులు యెంచుట కొడుక!
న్యాయంబు కాదు
ఘనమార! తిక్కనమంత్రి !
గజకంఠీరవుండవు
వుండె యిన కులాధీశ్వరుండు యా
సిద్ధిరాజు
పేరు కల యా పుణ్య పెన్న
సాక్షిగను
కలువలరాజు భాస్కరుడు సాక్షిగను
కొనియాడ పగ త్రుంచితివి కొడుక
నీ రణము
వారిజగర్భుని వనిత సాక్షిగాను
నిలిపితివి నీ కీర్తి నిఖిలంబునందు
అనుచు వెతకెను చాల అబ్బురపు
కొడుకును
వెతకంగ కొడుకు రూపు యేకరూపు
లేక
ఆనవాలు తండ్రితో చెప్పినట్లుగా
మరియు
కడువేగ యుద్ధములో తన ఖండలు
అన్ని
యంతయు రణములో వెదజల్లినట్లు
జలధిలో మీనంబులు చలించునట్లు
యెగసి పడుచుండెను రక్తములో
యెఱ్ఱని ఖండలును
కనుగొని అది చూచి కన్నీరుబెట్టి

కావి ధోవతిని ఖండలు కడువేగ ఘొదివి
అనువుగ నెల్లూరి కప్పుడేతెంచె

## ఖడ్గతిక్కన సతి సాగుమానము చేయుట

పుణ్యశ్రీ తిక్కన పొందైన భార్య
తన విభుని తెచ్చెనని మామకు యెదురుగా వచ్చె
పాదార్చన చేసెను పదానికి తానపుడు
కావి ధోవతిలో వున్న విభుని కండలు చూచి
ఘల్లున నవ్వెను ఆ విప్రకాంత
'ఓ మామః వినవయ్య వొక విన్నపంబు
సత్య పురుషుల శ్రీల సమ్మతి వినుము
పతివ్రత పురుషుడి కన్న పరము ముందైతే
తగను తన ప్రాణేశుడు తను జేరుదనుక
యెదురు చూచుచునుండు ఆ పుణ్యకాంత
పురుషుడు ముందైన పుణ్యఫలముల మమత
పతి గూడి యద్దరు పరమునకు అచట
పుష్యఫలమని శ్రుతులు పొందుగా బలుకు
పతి నెడబాప నీకు పరగ దోషంబు
నా ప్రాణవిభునితో నన్నంప'మనిన
విని సిద్ధన మంత్రి విప్రవరుల బిలిపించి
యిది మంచి వేళయని వెరవేర్పడను
అప్పుడు సాగుమానము ఆయ నావేళ
పరిపరి విధముల రాజును పలికించి రపుడు
యంతయు జెప్పిరి యటనున్నవారు
'యినకులాధీశ్వరుండః పురి వల్లభుండ!
అనిలోన తిక్కన హతమాయ నయ్య!
ఆ అనఘుని భార్య అతి పుణ్యకాంత
సాగుమానము ఆయెను జననాథ!' అనిన

## నల సిద్ధిరాజు వీరపరివారముతో రణభూమి కేగుట

ఆ మాట విని సిద్ధిరాజు హాగ్రుడై లేచి
తామసింవక లేచి దండు కదులు మనుచు
చాటింపు సేయించి సకల భాషలను
కట్టాయిత్తు పరచె కడువేగ దళము
కనకము వేట్కతో కట్నాలు మాదలు యనేయంగ
పరివారములకు యిప్పించె రాజు
రాజు ఖంటు అనక రాజాధిరాజు
దారిద్రహతముగా ధనము లిప్పించె
అవని ఆకాశంబు అటు బట్టుకొనగ
భీకరముగా రణభేరి వేయించ
నపిరీలు బట్టిరి నాదు యడలేక
బూరగలు కొమ్ములు భూమి దద్దరిల
తప్పెట్లు తడెమెలు తరచు వాద్యములు
భేరినాదులకు తప్పెట్ల మోతలకు
దారుని పీశ్వరుని[7] దండు కదిలె ధర తల్లడిల్ల
చయ్యన కదిలిరి సరదార్లు మొదల
పరగ శృంగారించి క్షత్రగణములను
అలంటునకు ము స్తీదు అంతారి యె త్తించి
పైన యర్రపట్టు పతము లె త్తించి

యేనుగుల బారుతో యర సిద్ధిరాజు తా గదిలె
చిక్కంగ నొకబారు చొక్కపు గడలు
బంగారు తీగెల బాగైన కడలు
పెండెకట్ల దలు పెదజల్లి గడలు
ఘంటలు అందెలు కట్టిన గడలు
పదునైన యీటెలు పలక బాగుగా నేగయుచు
ము స్తీదు వేలుమూక వకమొన యేరుపరచి
ప్రళయుడై నడచెను పాప సిద్ధిరాజు
కటినంపు మూక విచ్చుకత్తులతోను
పేరుగల సరదార్లు బిరుదు మన్నీలు
ము స్తీదులై తుపాకి ముందర నడువ
వెలయ సంతోషమున వేడుక మీర
కస్తూరి సిద్ధిరాజు కదిలె వాక్షణమె
వన్నె లక్ష గుర్రాలు వనరేరుపరచి
ముచ్చబాద పల్లాలు ముష్టాలు అల్లాడ
కరాశింపుతు అశ్వాలపై గట్టిగాకట్టి
పల్లాలు బంటు చేసిన అశ్వాలతోను నడవంగ
తురంగముల కోటి ధూళి పెల్లెగయ
కుమార సిద్ధిరాజు ఘోటకము నెక్కె
బాకు జంజాళములు పరగ చేపట్టి

7. ధారుణీశ్వరుని

ఆవలీవల రాజు అండను రాగ
గడి మన్నె మూకలు వెనువెంట
కదిసి నడువంగ
సాహసులు మన్నీలు సరికొని రాగ
విచ్చు కత్తులవారు ముందర
వీమతులై నడువ
జల్లి గడలును చాల జమిలి
టెక్కెములు
వింజామరంబులు రాజు యిరుగడల
వేయ
బంగారు గొడుగులు రాజుకు
పట్టిరి వేగ
సురటలు పట్టిరి చూడ చోద్యముగ
ఘనుడు నలసిద్ధిరాజు గజముపై
నెక్కి
కార్యమునకు చనుదెంచె కడు
వుగ్రమునను
గండగోపాలరాజు కడు వేగమునను
చయ్యన ఘూలాలు బండ్లు తాను
సాగించ
ఆ విరోధుల దండు అచ్చోట
గదిలెను.
గోరు కత్తులు గొడ్డండ్లు గొబ్బున
దెచ్చి
కారడవి నరికించె ఘనుడు లోపలను.
బాటలు చేసిరి పరిచారకులును
ఆవల సిద్ధిరాజు అవలీలముగను
బారులు నడిపించె బాటల వెంట
కనుగొని చాగలకొండ శానలు
కన్నుల జూచి
డాకొని వచ్చెను దండి దళములును
చల్లవారితో సేన సరిపోర జేసి
దశమి గురువారమునాడు దండు
తగ నొప్ప నిలిచె
కనుగొని చల్లవారు కడు సంతసిల్లిరి

## చల్లపిన్నమనీడు తనవారిని హెచ్చరించుట

హల్లున నవ్వి చల్ల పిన్నయ్య అప్ప
డిట్లనియె
"కొమరొప్ప తిక్కన కొంత
దళమున్న
హతమాయనని రాజు అతిరోష పుట్టి
సర్వదళముతో గూడ రాజు
సరగనే తెంచె
అని పరికింపుచు అటు పారజూచి
హేరాళముగ దండుపై ప్రతి యేతెంచి
రాగ
పిన్నయ్య పిలిపించి బిరుదుకలవార్ని
తమ హిత బాంధవుల దాయంగ బిలిచి
'వినరోయి! చెప్పెద వీరభటులార!
సిద్ధిరాజుకు యింత శానలు లేవు
మరియేమి యెరుగని వెర్రి గొల్లల
మందలు

జగడానికని చెప్పిన యిందరు
చయ్యనరారు
వారిచై ముందుగా వనర వెళ్ళినవెనక
దాసి చంపక మీరు డాలు
కాచుగదరోయి
కటార్లు జంజాళములు కత్తులు
మరియు
వజ్రంపు మొనలుగల వంకిణీలున్ను
నేజాలు సురాలు నేర్పుతో బట్టి
బాకులు సురకత్తులు బూని బాపురే
యనుచు
భళి భళి యనుచు మీరు బాగుగా
నపుడు
ముస్తీదులై మీరు మొనసి
యెదురెక్కిన
అప్పుడు కొల్లదండు ఆశ్చర్యమంది
మొనసి కలువరమొంది మోరెత్తి
చూచి
వుదుట అడవులు బట్టవురికించి రండి
తొలికి చంపకుడి దోషంబు వచ్చు
మార్కొని నిలిచినవారిపై మరువకడి
చెయ్యి
చెండాడి చంపను శల'వని పలికె
గొల్లలు కంపటీలు గోసంగి బలము
తరచు మన్నీలెల్ల తలపడిరప్పుడు
ఆవేళ వేవేగ ఆయుధాలతోను
వడి శదసి నరికి వురికెనె పైనెగసి
సురియలతో పొడిచి శూరులై నిలచి
సరిగదసి వయ్యాల స్వాలేతెంచి

బాకుల పోట్లాడి బాపురే యనుచు
గొదకొని యాదవులతో పోరిరపుడు.
చలముకొని అంబులు ఝడి
గురియింప
గడలు గడలు చాల కదిసెను
బలము
పొడిచిన యీటెలు పొత్తములు విరిగి
వరుగుచు ధరమీద వాపోవువారు
కదలి యాదవులు కటార్ల నరికిన
వాటుకు రెండు తునియలై వసుధపై
వరుగువారు
కటార్లు పొడిచిన కడు నిలువలేక
ప్రాణమూర్ఛనొంది వరుగువారు;
చైచై తారసిలి చేరి నరుకులాడి
తందర నొందుచు ధర
కూలువారు
బరిసెలను బల్లేల దూకి పడబొడిచి
రణమున వరిగిరి వీరరౌతులును;
వురువడి బాణాలు వురమున వెడలి
కమ్ముచు రక్తము కాల్వలై పార
శరీరముల కుంతాలను చెల్లించి
పొడిచిన
హరియన ముక్తొట అని తలచువారు;
బటువుగా యాదవులకు వీవున
బరిసెలు వెళ్ళి
రామ రామాయని తలచి రణమధ్య
మున
చక్రాల కొందరి శిరస్సులను వేసిన

కంఠములు తెగి హర హరా యని
కడు దలచువారు
సురకత్తి పిడికత్తి సురియలతోను
సరి పోరి రిపులను సాహసులు
గూల్చిరి
ఘోర యుద్ధము చేసిరి గోసంగు
లపుడు
బాహు బలములతో పట్టి పోట్లాడ
గోసంగి బలములు కూలిన కొంత
చూసి
పిన్నమనాయుడు సోరిది నిట్లనియె
'సమిసె మన దళములు పగ బాన
వున్నాది'
కొందరు మన్నీలు అతిఘోర
యుద్ధంబు బాయంగ
భోరున యా చల్లభూపతి సుతులు
భక్తిగల పిన్నయ్య పగలకు వైరు
ఆ చల్ల గోవిందు హరికి సరివచ్చు
రఘురాముని తలచి భక్తిచేవారు
రాక్షసుల చంప
అంతవాడు ఆ చల్ల అనంతు గలడు.
సత్య హరిశ్చంద్రునికి సరి
యనవచ్చు
తర్వాత ఆ చల్లగనుడు కోనేరు
భీమునికి సరివచ్చు పృథ్వి లోపలను
అధిక పరాక్రమశాలి అచ్యుతుడు
గలడు
భరతుని అంతవాడు బాహుబల శాలి
చల్ల పుణ్యుండను సభలుండు
యతడు
పగతుల వధియింప పటు
క్రోధమూర్తి
అందరి తమ్ముడు ఆ వెంకటాద్రి
పంచ పాండవులకు చల్లవారు
ప్రతియన వచ్చు
అప్పుడు వారు యేడుగురు
అన్నదమ్ములును
వొప్పుగా దశమియు వొక్క
ప్రొద్దుండి
కోరిక యొప్పగా నాడి ధవళాలు గట్టి
నెలవంక తిరుమణి నేర్పుతో దీర్చి
వాయుదేవ పూజయు వరుసతో జేసి
పత్రియు పూజించి భక్తితో నిలిచి
'వో గిరి పాలకుడ! వో దేవదేవుడా!
వో పాప సంహార! వో పరమేశ!
సకల జీవులకును సంరక్షకుడవు
యెన్నడు మీ చింతయేను స్వామి!
మాకు
మా నిష్ఠ పరాక్రమము కని కైలాస
మిమ్ము'
అని వేడి మ్రొక్కిరి ఆ
క్షణంబునను!
దశమి వక ప్రొద్దు తగ నొప్పజేసి
ప్రియముతో తమ్ముల పిలిచె దగ్గరికి
'చక్కని తమ్ములార!
సాహసులార!

బుద్ధి తిరగక రణభూమిలో నిలచి
హెచ్చి పగతుల జంప యెత్తి
చనుడయ్యా
మరపు వెరుపు లేక మడిమె
తిరుగకను
పరులకు వెన్నులు యియ్యక పాటు
వోర్చునను
సూర్య సోమ వీథు లేర్పడ తమ్ము
తిరిగి పొడిచినను
నిలువుడీ సమరాన నీతి దప్పకను
వెరువకుడీ తమ్ములార! మనకు
వెరుపేమి లేదు
అలుగులు నాటినను హరిహరుల
తలచునంబు లేదు'
అని చెప్పి పిన్నయ్య ఆయుధమంది
కణకతో యెదురు రణమునకు
కట్టాయిత్తు పడిరి
వీరకాశలు కట్టిరి వీరగంధము
బెట్టిరి
రత్నాలు దాల్చిన రాకట్ల దరియించి
ముత్యాల హారములు మురియుచు
వేసి
చౌకట్లు కర్ణముల చయ్యన దొడిగి
దేదీప్యములు వెలుగు
దివ్యాంబరములు
ఆభరణాల సొమ్ములు
అలంకరించి రపుడు
కడు సూర్యకటార్లు మహాదేవా
యనుచు
జగడము శాయను చనుదెంచి వచ్చిరి
వారు వచ్చుట చూచి వసుధీశన్నకును
పిన్నయ్య తమ్ములు పేర్మితో రాగ
అంబారిపై నిలిచి సిద్ధిరాజు అటు
పారజూచి
ఆశ్చర్యము బొంది అపు డిట్లనియె:
'చక్రధనమునకు మన్మథు
సరియనవచ్చు
దండిశానలు యని మది దలచక
వీరు
అతి సాహసులు గాకుంటే
చనుదెంచబోరు
వీరభటులతో గూడ వివర
మేర్పడును'
కౌమార సిద్ధిరాజును గొబ్బున నంపె

## కొమార సిద్ధిరాజు రణమున నిహతుడగుట

ఆ కొమార సిద్ధిరాజు ఘోటకము
నెక్కి
సమరాంగణమునకు ఆ వేళ చయ్యన
కదిసె
కదిసిన యతనితో ఘనుడు
పిన్నమనాయుడు
కదిసిరి అప్పుడు హంకారులై తాము
ఫెళఫెళ నార్చుచు పృథ్వి కంపింప

ఆర్భాటములు చేసె ధరణి
అగుభగుల్ యనగ
ఝుడిసి పగతుల గుండెలు ఝల్లున
బగుల
శేషు వేజింహాలు[8] చెల్లించినట్లు[9]
ఆ సూర్యకాటార్లు అప్పటప్పటికి
ఝళిపించి మెరుపు చందమున
నుండ
పులులు పులులు కదిసి పోరు
చందమున
చలముకొని పోరాడి చల్ల పిన్నయ్య
బాహుబల వుగ్రుడై సర్వదళములు
భళిభళి యనగ
అర్చుచు కోపమున అంకించి కదిసి
ఆ కొమార సిద్ధిరాజు అశ్వాన్ని
బొడిచి
వసుధపై అశ్వము వరుగుట యెరిగి
కొమార సిద్ధిరాజు కోపించి దూకె
కదిసిరి అప్పుడు కడు వుగ్రముగను
ఆ పిన్నయ్య తమ్ములు అవని
కంపింప
అంతకంటె బలులు అతి
బలాధికులు
వారిని గొల్చిన వనర యాదవులు
యన్న తరముగాని వెలయు
సాహసులు
మార్కొని రణములో మరియు
సర్దార్లు

పేర్కొని యుద్ధంబు పెనగి
సేయుచును
డీకొని సేయుచు శిరములు
కరములును
కో యనుచు వేయుచు కో యని
అర్చుచును
కేకలు వేయుచును కెవలి
నరుకుచును
ఘాతలు జేయుచు కదిసి పొడిచినను
వరుగుచు రణమున వాలిరి కొంత
ఘోరయుద్ధము చేసిరి కుంభిణి మీద
ఆరీతి యుద్ధము సేయునట్టి
సమయమునను
చల్లవారి గోసంగి సమిడిగు బొమ్మ
మదము టేనుగుల నైనను
మట్టగలవాడు
చిల్లర మూకల శానల జంపి
హాగ్రుడై మండుచు అర్చుచు మిగుల
తన చేతి కత్తికి పగతుల చెరకు
చందమున
కుడిని యెడమను విసురుచు
కూర్చుచు రిపుల
శ్యాప నూరు మందెలుగ తెగబడ
నరుక
సమిసెను బొందెలు రణమునందు
లేకుండ
అప్పుడు పిన్నమనాయుడికి అతి
రోషపుట్టి

8. జిహ్వాలు 9. చలించునట్లు

అట్టహాసంబున ఆముకొని పోరి
ఆ కౌమార సిద్ధిరాజుపై అస్త్రము
యెత్తి
త్వరువేగ ఆ సూర్యకటారులను
తడయని కోపాగ్నిచే తల త్రుంచివైచె
కౌమార సిద్ధిరాజు కూలిన యపుడే
కన్నుల చూసెను కస్తూరి సిద్ధిరాజు
మరియును నలసిద్ధి మండలేశ్వరునికి

వినిపించినప్పుడే వితాకులైరి
మరి నిబ్బరించి నలసిద్ధి
మండలేశ్వరుడు
పనివడి కస్తూరి సిద్ధిరాజును పైనము
చేసి
'నీవు దళములు చాల నిప్పుడే పోయి
క్షణమున చల్లవార్ని సమయించి
ర'మ్మనెను

## కస్తూరి సిద్ధిరాజు కదనమున కురుకుట

ఆరుదైన బలముతోను ఆరు
అశ్వంబులక్కి
కస్తూరి సిద్ధిరాజు కదలి తావచ్చె
కదసిరి యుద్ధమునకు ఘనముఖ్యు
లంత
కార్ముఖంబున[10] కొంత కదిసి
నరకుచును

చైచై తారసిల్లి చెలరేగి పొడిచి
తాకియు నరుకంగ తలలూడనపుడు
శరముల కుంతలాల[11] చెల్లించి
పొడిచిన
హరియని తలచుచు అటు
వరుగువారు
చక్రాల కొందరి శిరములను వేసిన

## చల్ల పిన్నమనీడు, సోదరులు యుద్ధమున మడియుట

సత్యాత్ములైనట్టి యా చల్లవారికి
వలపట పారిశ్వాన[12] వంకిళ్ళనాదె
హరిని మరువక తలచిన ఆ
చల్లవారికి
దాపటి పారిశ్వాన డాబాకత్తి
నరుకులాయ

ధర్మాత్ములైనట్టి తగు చల్లవారికి
యెత్తివచ్చిన బాణాలు యదముల
నాటె
వొంచి విడిచిన బాణాలు వురువున
వెడలి
పిక్కల పక్కల బిగువు నందిళ్ళ

10. కార్ముకంబున 11. కుంతాల 12. పార్శ్వాన

వీపున మోపున యడలేక మొనసె
గాయాలు
అప్పుడు చల్లవారికి అతిభారమాయ
చాల పగతుల చంపి చెండాడి
కొంత పగ దళముల ఘోరాజిన
గూల్చి
తన మనస్సున హరిహరులను
తప్పక తలచి
శివకేశవులను దలచి శ్రీరాములను వేడి
హరిసుఖ్యులైనట్టి ఆ చల్లవారు
ధర మూర్ఛ గతులైరి తందర కుడిచి
ఘోర రూపంబున కుంభిణిపై వరిగి
వనర ఆ యేడుగురు వరిగి రచ్చోట
అంతట మృతమైరి ఆ చల్లవారు.



# రెండవ కాండము

## బోల్లావు జగడము

### నల్లసిద్ధిరాజు పోరునకు తలఖడుటు

ధరీణీశ్వరుడు దండు అంత కోల్పోయి
తమ్ముడు సిద్ధిరాజు యిక్కడ
ధర గూలె ననుచు
మదిని చింతింపుచు నలసిద్ధి మండ
లేశ్వరుడు
ఘన వుగ్ర కోపుడై గజమును
యెక్కి
కదులుమని సెలవిచ్చె ఘడియ
ఆలస్యము చాయక
కణ కణ వాయించిరి కంచు రణభేరి
నఫీరీలు బట్టిరి నాదు యెడ లేక
తుడుములు కొమ్ములు తుది మేర
లేకుండ
అన్నిటి నాదు చేసిరి అగుభగుల్
కొనగ
పట్టిరి రాజుకు పట్టు గొడుగులును
వింజామరంబులు విరివిగా వేయ
మొనకొని భట్లు పొగుడుచు ముందర
నడువ
కదలివచ్చెను రాజు కయ్యంబు శాయ
పరగ యాదవులను పంచలింగాల
కొండ
కనిచూవు మేరలో కని సిద్ధి రాజు

వచ్చి అర్మావు కట్టను వైళంబె
సిలచి
దిరిసెల రేగడి దిన్నెల బయల
కరియెద్దు కురువను గడిచేసి మొనలు
ఆదూరు పెంద్రేలు అన్నెబోయిన
పల్లె
యాదల భీమవరం విడిమట్టు చేసి
చీమపెంట... చీట మడుగుపాదు
ఆరుమూరు గుళ్ళు ఆవి మేర చేసి
నెల్లివాగు కూడలి నెరగడి చేసి
మారినీని పల్లె మంగోలి పాడు
దామిసెట్టి చెరువు దంతెల బయులు
కంపమడుగు పాడు గడిచేసి
మొనలు
గుజ్జర్ల వాగు యిరుమేల గుర్రపు
రౌతులును
ఆరీతి నిలిచెను అవనీశు దండు
రాచ బలములతోను నలసిద్ధి రాజు
తరుచైన మన దళము తప్పక
చూచి
'పరగ యాదవులు పారి పోకుండ
పడమట వెలుగోడను లోవరంప
పదిలాన వుండుడి

దిట్టముగను వుండు' మనుచ రాజు
దిగుమజిలి చేసె.
గొడుగులు పడిగెలు గుమ్మట
గుర్రాజు
పడిరాగ తేజీలు భద్ర గజములును
శూలాల బండ్లును సొరిది బాణాలు
హితులు సహోదరులు యిష్ట
బాంధవులు
ప్రధానులు వారి పరివార మంత
నరనాథు యిరుమేల నట సమయమున
విరివిగా బలములు వేగంబె నిలచె.

## నలసిద్ధిరాజు సేనలో అపశకునము లగుట

దండు నిలువున సర్వదళముల మీద
అప్పుడు వక్ర విధమున
అవుసఖిన[1] మాయె
మెండైన రాగాలు మెరసాద సాగె
చీతువులు మింటిపై చెలరేగి పలికె
అవుతల పైడికంటి అదిరిపడి లేచి
పాలపేరెము బారె పాములు నడకొట్టె
నేల నాడువచోట నిలచెను గవళి
అలంబులో చాల అవుసఖిన మాయె
అందుకు సిద్ధిరాజు ఆశ్చర్యపడెను
సంధ్య గోపాలుని చయ్యన బిలిచి
"విను సంధ్యగోపాలా! వివర
మంతయును
యనయంగ మనదండు యచ్చోట
దిగగాను
అనేక విధముల అవుశఖున మాయె
అనాగత వేష్యంబు యెరుగుదురు
మీరు
యీ శఖున మంతయు యెటువలె
నున్నది?
యీశఖున పక్షులు యేమను చున్నారు?
యీ పక్షులు పలికేటి పలుకులు
లక్షణములు
యీ క్షణంబున మాకు యెరిగించ"
మనెను

## సంధ్యగోపాలుడు శకునములను విప్పి చెప్పుట

జననాథు మాటలకు సంధ్యగోపాలుడు
దినకరుని ప్రార్థించి దిక్కులర్చించి
ఖగములు పలికిన క్రమము తా దెలిసి
'భాను కులధీశ్వర! పట్టభిషేకర!
నేనేమని చెప్పుదు నిట్టి నిచిత్రంబు
నన్నడిగినందుకు నరనాథ! నీకు

[1]. అపశకున

వినిపింపగలదు ప్రత్తాంత
మంతయును
అవుతల పైడికంటె అదిరిపడి
యీచినందుకు
అదరిపాటున బొల్లేవు అరుదెంచు
నిటకు
బలుమృగము కికురు పెట్టినందుకు
పంతము గల శానల పరగ బొల్లేవు
సమయించు
గూబల శఖునాల గుర్రాల రౌతులను
తరిమి చంపిన ధేనువుకు దాగినవారు
భీభత్సు గాగలవారు బిరుదుల
పోనాడి
సురుగాలి గుడార్లు సురిసి
పడగొట్టినందుకు
సరదార్లు అనేకమంది
సమయనున్నారు
కనుపెంటి పలికిన కారణార్థమున
ఆజిలో మన యేనుగులు హతముగా
మడిసేని
పాల పక్షులు పేరెం పారినది
యెందుకు
వాలాయముగ మన అశ్వాలు
వడి వరుగగలవు
అల్ల పులుగులు గూయ ఆ
పంతమునకు
మేలుగల అశ్వాలు మెండుగా
మడియు
పడగలు ముడిచిన పాముల
శఖునాన
పట్టపు రాజునకు పట్టెడి పడిగలు
గొడుగులు
పుర్విపై పడవేసి పురకను గలరు
గొప్పగా కొండగొర్రె
కూసినందులకు
కొదపలేని పరివారము
కూలంగ గలరు
వడి గాలి శఖునాన వసుధీశ!
మన దండు
వడిచెడి మనదండు వక్కవంకలు
బట్టి
అడవులకు వెరచి అటు
పారిపోగలరు
పంతాలు చాల దళముపై
పారెడుటాకు
వనరైన లొటిపిటలు వరగ
నున్నాయి
శీతువుల శఖునాల చిల్లర మూకలు
కూతలు పెట్టుచు గుట్టలెక్కి పోవు
వాసికెక్కిన సూర్యవంశ కులధీశ!
యీ శఖున పంతంబు యిట్లు
గాగలదు'

## సంధ్యగోపాలునితో వీరనాయకులు ప్రలాపించుట

అని సంధ్యగోపాలు రాజుతో
ఆడుచుండగను
వినిరి రాజును గొలిచే వీర
పరివారంబు

పత్తికూళ మన్నెవారు పరగ
నాయకులు:
ఆ సంధ్య గోపాలునకు అంద
రిట్లనిరి:
"వో సంధ్య గోపాళ! సఖినగాడవా
నీవు?
మీ తాత తండ్రులు మిమ్ము మెంచి
వెలయ చనువుచాత
యెదురాడకున్న
మంద మేళము చేసుకొని రాజుతో
మాటాడితివి గాక
బలములు యేనాడు? పసర మేనాడు?
కొలువాలినట్టి యా కుటిల సూపవుకు
తృణము చేబూనక[14] తొలితే పురుకు
యింతమాటకు నీవు విచిత్రముగను
దొర మన్నెవాయకులు దొడ్డ
సరదార్లు
ఆపుకు పురుకుదురని అరుదు
చెప్పితివి

యీ వింతమాటలకు
నిన్నేమనవచ్చు?
ఆవుకు వెరచేమా? అపకీర్తిగాక!
అవతారము లెత్తినా వెరువక మేము
ఘనముగా పొడుతుము కదిసి
పోనీయక
సింహము నైనాను చీరగలవారము
పులినైన గమజొచ్చి పొట్ట బిగించి
చలముున యెదరించి
చంపగలవారము
రెండు చేతులతోడి చెంగి శూరు
డెవరైన
బంటుతనమున పరిమార్చ
గలవారము
వొక్క బొల్లేవుకు వోడుదుమా
మేము?
విక్కరించి బల్లేల చిమ్ముదుముగాని
వట్టి భయము పట్టించితివిగాక
కట్టుమా నీ కవిలె కట్టుమా చాలు!'

## నలసిద్ధిరాజు వీరనాయకులను అప్రమత్తులై యుండగోరుట

అని యిట్లు పరివారము ఆడిన
అందుకు
విని రాజు మదిని ఆవేళ సంతసిల్లి
పంతంబుగల వీర పరివారము
కల్లిశాయగరాదు

'వినరోయి! నామాట విచిత్రమనక
వొక్క రొక్కరు పదిలాన వుండుడి
రాత్రి
భద్ర పేనుగుల మీద పట్టించు
దివిటీలు

14. చెబూనుకొని

నిద్రగాచి వుండుడీ యీ రాత్రి నీవు
నేనక
వంటరికాండ్లను వనరంగ బిలిచి
బంటుకు బారెడేసి ప్రహరి వేయించి
ఆ వెనుక విల్లు విరిసి అమరంగ
డిగండి
చాలుగా వలలన్ని చక్కగా వద్దుకీ
వలలకు యెడముగా వాటముగాను
చిలుకుటంబులు పాతుడీ శీఘ్రము
వేగమున
తగచొప్ప వాడాలు తవ్వించి అపుడు
కాలువలు దీయుడీ కందకాల వెంట
నాయకులు దొరలు నందరు మీరు
అయిత్తుపడి వుండరోయి అశ్వాల
నెక్కి
యంతవాడైనను యెదిరించలేడు
యాదవులంటేను వెరుపేమి లేదు
అవతారమూర్తి యని అవుననెదరు
అదిగాక దిగుమజిలీ అటు నిల్వగాను
అవశేఖున మాయెను వో
అధికులార!
తగనందుచే తృణమైనా బాణమై
తాకు
అబద్ధము కాదు నా మాట ఆలకించి
వినుడి
వజీలు సరదార్లు వడి జమేదార్లు
కన్నోజి రౌతులు యీ కాలిదళమంత
తప్పట్లు దారలు తరచుగా వాయించ
మనుదు

అప్పటప్పటికి తప్పెట్లు అగాతు
సేయుడీ
కావరం తిరుగుచు ......
మువాత పెమ్మినేని మునివుక్కళాన
చెలువుగా వుంచుడీ శానలలోను
నేరిమి వుక్కళాన నంగం బేతినేని
పొదచాల సామినేనితో కూడ
పొందుగా వుంచుడి
జతనాన వుండు' మంచు శానల
తోను
అతుల ప్రతాపశాలి అతివేగమునను
వసుధీశు వెట్టివాండ్లను బిలిచి
'అలసట లేక మీరు అరుణోదయం
దనుక
దీటీలు పట్టరో! ధీరతతోను
దంతులపై కొన్ని ధరమీద కొన్ని
మెండుగా పట్టరోయి! మెరసి దీటీలు'
అప్పుడు వెట్టినాయకులు
అగుబుగులు గాను
పైనున్న దుప్పట్లు పాగాలు చించి
చాలక బొక్కసల చలవ దుప్పట్లు
చించి దీటీలకు చెలగి చుట్టుచును
పరి పరి విధముల పైన్నము గాగ
రమ్యముగా కాటమరాజు రణవీర
తముకాన నుండి
హరి గురువు పల్లికొండతో ఆప్పు
డిట్లనియె!
'బంటు మాటలు విని పరగ
సిద్ధిరాజు

సర్వదళములతోను తగ
గూర్చుకొనిన
చయ్యన వచ్చి చల్లవారితో పోరి
సమయించి మించి
మార్కొని యెదిరించి మరి
నిలచినాడు
వీర తమకము మనము యెక్కిన
యపుడె
అయిత్తుపడిరి అపుడె యాదవులు
ఆది విష్ణు బొల్లావు యెద్దులావులును
గోసంగి బలములు బీరన్న మొదలు
పషిణి తమకము చుట్టు వున్నారు
పగరకు యెదురెక్కి
పల్లికొండ! నీ సెలవు కావలెనని
పరగనున్నారు
బలభద్ర శేఖరుడు! పల్లికొండ
మూర్తి!
యేకాదశి నేడు యవ్వరికి వంతు?
సెలవు దయసేయు' మని పలికి
సన్నుతి జేసి
దివ్యమూర్తి పల్లికొండ తెలిసి తా లేచి

తన వెంట అయితన్నను తగ
బిలుచుకొనియు
పంచమహా వాద్యములు పరి పరి
గతుల
వల్లవులు తిరుమందులు వైన వైనాల
పషిణి బిందె గాజు గిన్నెలతోను
గంధ మక్షింతులు
దివ్యనామంబులు తిరుచూర్ణములు
గొంచు
ఆవుకు తగినట్టి ఆభరణములు
గొంచు
పసిడి బిందెల నీరు బాగుగా గొనుచు
కంచు కొమ్ముల భూమి కక్కటిల
గాను
అసుర ముఖాల గుడారులో
ఆదివిష్ణుండు
పొంకముగా వున్న బొల్లావు కడకు
కళలు గులుకుచు ఆవు కడకు
నేతెంచిరి

## యాదవులు బొల్లావు నలంకరించుట

పల్లికొండ రాజు ప్రదక్షణంబులు
తిరిగి
గోపురూపంబైన గోపాల మూర్తికి
పషిణి బిందెల తీర్థాన పాదములు
కడిగి

ఆవు రూపము అయిన
ఆదినారాయణునికి
అందముగా నొదుట యెదురాకు
చందమున
తిరువణి తిరుచూర్ణము దుద్దిరా క్షణమె

అలదిరి మేనున అగరు గంధంబు
అటు పునుగు జవ్వాది అలదిరి చాల
సురయించి కస్తూరి చల్లి సురటీలు
విసరి
ఘుమ ఘుమ వాసన గుబులు
కొనగాను
ఝణ ఝణయనుచు చలగుచుమ్రోగ
నాలుగు పాదముల నాదుటందెలు
వేసిరి
ఆవుకు శృంగారించెను అయితమా
రాజు
మేలిమి ఘంటలు మెడను మెండుగా
వేసిరి
రత్నాలు దాపిన రాగిరేఖలూను
తళ తళా మెరయ నొదుట
ధరియించి రపుడు
కొమ్ముల బంగారు కుప్పె ధరియించి
రహిమించ మెడచుట్టు రంగుగా
నపుడు
గోమేధికం చెక్కిన బంగారు
గొలుసు వేసిరి

మృదువైన ముత్యాల మువ్వలపేర్లు
ఘంటల సరసన ఘనముగా వేసిరి
పూఁపరము చుట్టు ధరియించిరి
వురువు గజ్జలును
వజ్రంపు సరులు అనవచ్చు వనరైన
గజ్జలును
అ సన్న గజ్జెలు వేసిరి ఆవుకు సందు
సందులను
పాతాళ విఘ్నేశ్వరునితో పంతంబు
గెలిచి
ఆవుకని తెచ్చినాడు రాజు అర్ధనాలు
ఘంట
పొందుగా ఆవుకు బొడ్డుగంట వేసి
ఆభరణాల సొమ్ములు ధేనువుకు
అలంకరించిరి
పల్లెకొండ నివ్వాళి పళ్ళెములు బట్టి
హారతులు యిచ్చిరి ఆదిమూర్తికిని
అప్పుడు సాంబ్రాణి అగుబుగులు
గాను
మహిసాక్షి వేసిరి పొగలు మిన్నంట

## బొల్లావును ప్రార్థించుట

అగరు పొగ చిల్చుచు అవుణ్ణంగ
మామయు అల్లుడు మరి యదట
నిలిచి
హస్తము ముకిళించి అవును యేడు
కొనిరి

"పరబ్రహ్మ స్వరూప! వో పరగ
బొల్లావ!
గోపి నామములు గల గోవింద
మూర్తి!

యోగులను రక్షించిన యో
కామధేనువ!
హరులకు నరులకు ఆదరవు నీవు
మాకు కొలువ మూర్తివి మరి
ఆదివిష్ణుండవు
పుడమిలో జను లెల్ల అరుదుగ
పొగడ
ఆవు అవతారమున మందలో
అరుదుగా బుట్టి
నిరతముగ జూచితిమి నీ రూప
మెల్ల
రూపులో ప్రత్యక్ష రూపంబు మాకు
చూపుతో చూచిన సూక్ష్మరూపంబు
నిత్యపాపము బాయ నిను చూడ
గలిగె
పరగ మల్లికాదేవి పరమేశ్వరుని
పరగ వరమడిగిన సురులు
పడిమాలి
ప్రత్యక్ష సురభులై ప్రబలితిరి
గనుక
కోరినట్లు మాకు కోర్కెలీడేర
కైలాస వాసుని శాపము కలిగెను
మాకు
పరమున సుఖియించ జన్మపావనము
లైతిమి
సౌఖ్యమున బొందితిమి వో
సత్యసురభి!
చలగి పోలురాజు యా చరకువాడ
నున్నంగ

శివద్రోహి ఔఘారి జంగాల చరలు
బట్టంగ
వచ్చి పోలురాజు మరుగు యొడబడిరి
పరవుపకారుడైన పట్టివ్వలేక
పంతాపి సురభివని ప్రార్థన జేసె
మనమి చేకొంటివి మాయస్వరూపి!
పొందుగా జంగాల వెంట పోతివి
గనుక
అందుకు నీవులేక మా తండ్రిని
అవనిపై గూల్చితివి
ఆ పగలు నేటికి అనుకూలమాయె
బలుపైన శానతో పగరాజు రాగ
మన చల్ల పిన్నయ్య మాకని పోరి
తనవంతు పగతుల చంపి ధరణిపై
గూలె
అల్లవాడుగో! పగవాడు అదుముకొని
వచ్చె
మనకు సరిగడ వేసి మార్కొని
నిలచి
బయలు యుద్ధము శాయ
పంతంబు గెలువ
నీవు దిక్కని చాల నెర నమ్మినాము
మా తండ్రి పగదీర మమ్ము
రక్షింపుము
'పరగ యెద్దులావులు' అని
పగతులు వచ్చి
'తలకోలలు వేసి తరిమిపట్టుదుము'
నీదు మహిమ యెరుగక నిట్లాడు
వారికి

మాకు సహాయమై పగతుల నీవు
మడియించినపుడే
ఆదివిష్ణువని యెంతురు ఆవు
గాదనుచు
కలియుగంలో చాల యీ కథ
నిలువవలెను
భువిని కంతకుల చంప బుద్ధులను
నిలుప
నీకు చెల్లునుగాక నెవ్వరి వశము?"
అని యిట్లు వేడిన ఆవు తా లేచి
సంతోషమున బొంది సయ్యన నిలిచి
అల్లుడు మామయు అతి భక్తితోను
అని సేయమని చాల ఆవును వేడి
సాష్టాంగ దణ్ణములు సమరపణము
జేసి
తర్లి వచ్చిరి వీర తమకముకు వారు
వీర తమకము మీన వేతుక నుండి
తమకము విరుగడల ధనముకొండ
రాజులు
క్రిక్కిరిసి వుండిరి వుక్కుపోడి రాల

## బొల్లావు యుద్ధము

అప్పుడు సిద్ధిరాజు దళములో
అగుబుగులు ఆయ
పట్టిరి దివిటీలు పట్టపగలై యుండె
కాల్చిన దివిటీల కారును పొగయు
కప్పెను శ్రీరాము కపిలావుమీద
దివిటీల వెల్తురు ఆవు తీరుగా చూచె
శ్రీహరి రూపమైన చిత్తజగురుడు
గుదారు వెడలి తాను గొదకొని
వచ్చె
ఆలించి వినెను యా ఆదిమూర్తి
తిడిమి తిడిమిన భూమి
దిగులుకొనగాను
అదిరిపాటున ఢుఢుములు
అగుభుగులుగాను
పెట్లు గోవులు కాల్చిరి పెళ్ళుకొని
మ్రోగ
వుదటుగా వాయింప విని
వుగ్రమూర్తి
గోవురూపము అయిన
గోవిందమూర్తి
కొమ్ము రాతన తీడి కోపాన మిన్నంది
పాదము తాటించి పగతుల మీద
మచ్చపుటముగ నెగిళ మరి వుట్ట
దగ్గిరికి
హొమ్మ గమ్మలు చేసి ఘాత
కోరాడి
పగవాడి మీదకి పిడుగులై
పడవలెననుచు
యేనుగుయెత్తు గడ్డలు
యెగసిపడ జిమ్మె
పాదుకొమ్మన చిమ్మె పగులు
గడ్డలును

యెగిసెను ఆ గడ్డ యోజనంపొడుగు
నలసిద్ధిరాజు ముందర సరదార్లు
ఘన గుంపుగా వున్న గడ్డపై బడెను
తలలు పుచ్చలు పగిలి తర్లక
ఆడాడ
మెదడు చిందిన సరదార్లు
మేదినిపైన
వరిగిరి వ్రజీలు వసుధపై నంత
మందటి యాలోన మరి తిప్పరాజు
ఆశ్చర్య మందుచు వచ్చి అటు
చూడగాను
కోపించి మించిన కొంచపుగడ్డ
తిరుణామల తిప్పరాజు నెత్తిపై
బడెను
గ్రుక్కు మిక్కు మనక కూలె
నచ్చోట
ఆ గడ్డ ఘాతలకు దండు అట్టిట్టు
చెదరి
సర్వానల సిద్ధిరాజు సరగ రావెరచి
తమ తమ యాలములకు దగ్గర
నిలచె
మది దలపోయుచు మరియు
నిట్లనియె:
'వానలేని పిడుగాయ వో స్వామి!'
యనుచు
'మిన్ను విరిగెనేమొ మనపాలి మిత్తి
అవునేమో' యనుచు
'చోద్య'మనుచు సంధ్యగోపాలు
రాజుకదకు చనుదెంచి

ముకుళిత హస్తుడై ముందర నిలిచి
'వో రాజ! వినవయ్య! వారికథ
వింతగాదు
యీ గడ్డ పరలేమి? అవుకు
వింతగాదయ్య!
మన దండుమీదికి మరి కదలి వస్తు
తామసంబున కొమ్ము ధరను గుచ్చి
వనర చిమ్మిన గడ్డ
వసుధీశ్వరుండ!'
అని యిట్లు రాజుతో ఆడుచుండగను
పక్కికూళ్ళ మన్నెవారు
పగవీరనాయకులు
ఆ సంధ్య గోపాలునితో అప్పు
డిట్లనిరి
'వంతగాడ వనుచు పలికితిమిగాని
పొగరుచే ఆబోతు పొడిచి
ధరచిమ్మను
దుమ్ము రేగుచుగాని గడ్డ తృణమంత
లేవదు
ఆవు చిమ్మినది అని అరుదు
చెప్పితివి
అస్మికాంతముగాను ఆడితివి మాట
ఘనకార్యములు సేసికొని గడిపిన
వారమే గాని
గగనంబుపై నుంచి గడ్డలు రాళ్ళు
పడి వకరు గాకుండ పరువడి దళము
యిపుడు మడిసెను వింత యిటుల
నేర లేదు
చెప్పంగ కథలను చెవుల వినలేదు

యిదియేమొ మహిమమని మాకు
వింతగా దోచు
నీవు చెప్పినమాట నిజమైతె చాలు
మరి కారణముగాక ఆవు అయితే
మరి యంతలోది?
బలబల తెల్లవార ఆయావుపై గదసి
అడవులదాగిన ఆ కొండ
గృహలందున్న
తలకోలలను బట్టి తాళ్ళ గట్టుదుము'
దివ్యదృష్టి తెలసిన ఆవు
దేవతమూర్తి
పంతములు పలుకంగ వినెను పరగ
బొల్లేవు
పాదము తాటించి బలురంకె వేసి
కొండలు ధ్వనలిచ్చె కుంభిణి వణికె
ఆకాశము ధ్వని బలికె అమరులు
వినగ
వుక్కుటాల మీదికి వురువడి బొల్లేవు
యగసి ఘల్లున ధూకి మన్నీల
యడపక పొడిచె
వుక్కుడాల మన్నెవార్ని తన్నిన
వుర్విపై యెగిరిరి
కుప్పించి పొడిచెను కూల పీనుగులు
ఆ మేద్యంబు దగ్గర అధికులనెల్ల
మున్నూట విలుమూక మునివాత
పెన్నీని
చలమున యెదిరించి చంపె బొల్లేవు
అధిక కోపముచాత ఆదివిష్ణువు
బొల్లేవు

మెండ్యంబు దగ్గిదికి మెల్లనె వచ్చి
కాలి వురులు చూచి కడు చౌకళించి
ఆవల పడదూకె అవలీలముగను
పండిన వెన్నుదొక్క బంతి నేననుచు
తన వాలమును చుట్టి ధరణికి నణచి
త్రొక్కిన సమసెను తుపాకి మూక
కుప్పించి మేద్యంబు కూలంగ దన్నె
తన్నిన మేద్యంబు తరువాత నున్న
మన్నీలపై వురికి ఆవు మాయగ
నెగిసి
శానలకు పిడుగై చెల్లించి పొడిచి
నిలచి ధిక్కరించి నిటు అటు చూచి
అటు వక్క కొమ్మున అదట విడి
పొడిచి
యిటు తన్నిన తలలు వెగసి రాలె
యదరేక
ఘోరయుద్ధము చేసె గోవిందమూర్తి
బొల్లేవు వచ్చేనంటే భూనాథు బలము
హల్లకొల్లారమై అటు తిరిగె మొనలు
మొత్తమై నిలిచెను ఆవుపై మొనసి
రాలేక
సాహసులై నిలచిన వారి చందంబు
చూచి
తన మది ఆవు తలచి ధరకూల్చ
విధము
పగతుల మీదికి నాల్గు పాదచక్రాలు
అని దండు మూకపై నెగసె
తళుకు చందమున

తలలు తెగబడ పాదాలు తాపించి
దూకె
తిరిగి చూచిన శిరస్సులు దబ్బలై
వుండె
కుడిన యెడమన పీనుగులు గుట్టలై
వుండె
ఘన శంఖు చక్రము గల గరుడు
బొల్లెవు
యే తట్టు చూచిన దళము యెడలేక
కదిసె
చాచిరి యీటెలు ఆవుపై సరగ
విలుమూక
తన వాలమున దట్టి తరిమి చంపంగ
చిక్కిన చిల్లర సేనల జూచి
'అవతారమూర్తిని అయివుండి నేను
వక్కొక్కరిని చంప వడివిడి కాదు'
అని తన దేహంబు అటు మించ
పెంచి
పరగ హనుమంతుండు వాలము
పర్వతాలకు చుట్టి
పెకళించి తెచ్చిన చందాన పెనసి
తానపుడు
తన వాళమున కొంత దళమునుచుటి
యెత్తి నేలను గొట్టె యడలేకయుండ
ఘన రౌద్ర కోపమున ఘంటలు
మువ్వలును
చలరేగి మ్రోగంగ ఆవు
చవుకళింపుచును

ఘల్లున పైదూకె అవు ఘనుల
పడదాకె
లేవకుండా త్రొక్కి రేచి కోపాన
నాదు టందెలు మ్రోగ నాల్గు పాదాల
పాదాలు తాటించి యగసె పగతుల
పైన
తన్నెను సంబెట యేట్లు తాకినయట్టు
పరింగలై పుర్రెలు పడగ అడాడ
వనర గుండెలు బద్దలై వరిగిన
దళము
పొదజూపు పగతుల బొల్లావు అపుడు
సుడిసి తన్నిన పేగులు కాల
చుట్టుకొని వచ్చు
కొందరు విలుమూక గుంపులై వున్న
కొమ్ము చక్కగ వంచి కుదురుగా
పొడిచె
పెడ ముఖముగా వెంట పేగులువెళ్ళ
వాలము మెడకు చుట్టి వడినేల గొట్టి
పాలేర గంగ భూపాలుని జంపె
నందికనమ నాగరాజు నడికల్లున
జచ్చె
కొందరు మన్నీలు గుట్టలై పడిరి
యడలేక చంపెను వెద ఆదిమూర్తి
కందుకంబును బోలె కాంతితో నెగసి
ఘల్లున పడదూకి గజముల చూచి
చేరువనుండి ఆయావు చంగలింపంగ
శ్రీహరి గని రాజు చింతింప సాగె

ఆశ్చర్య మందుచు రాజు అటు
దిగులుకొనుచు
గజము సింహము చూచి కలువరించిన
యట్లు
వైరుని కనుగొని రాజు వగదప్పి
యుండె
పంతాన సురభి రాజుపై బడిరాగ
ఘన గజముల మీదికి ఆవు గ్రక్కున
దూకె
ఆవును చూచిరి ఆచటి మావటీలు
మరి గబ్బురింబడి కొలిపిరి మదపు
టేనుగుల
ఛీ పెట్టి యేనుగులు క్రిరున కదిసె
మదపుటేనుగుల బొడిచి ఆవు మట్టి
మల్లాడె
ధరణి గుబ్బురంబేగ దానవు లందరును
యగసి కుంభ స్థళములు ఆవు తన్నిన
యేనుగుల మెదడు
గుట్టలుగ పడివుండు కుంభిణిలోను
కొండల వలె మొండాలు
గొతపెట్టుచుండు
మరి యగసి తన్నిన మావటీలంత
తలలూడి మొండాలు ధరపై కూలిరి
తొండములు బిగ ద్రొక్కి ఆవు
తిరిగి పోనీక
కుతికెలు పొడిచిన గుండెలు చినిగి
వెన్నున కొమ్ము వెడలి యేనుగులు
వరిగె

అలక్ష్య మాయెనని ఆ యాదిమూర్తి
సింహమై యేనుగులపైకి బిరి లఘమ
చేసె
ఘన సింహమని యేనుగులు కలువర
మందె
కల్లుపడి[15] యేనుగులు కడువరిగె
కొన్ని
అది కొన్ని చూచెను అశ్వాల బారు
హయముల నెగసి తన్నిన అవనిపై
వరిగె
తగిళ్ళ పోట్లాట చందమున తాకిన
యపుడె
గ్రక్కున అశ్వాల గుండెలు
బద్దలుగా బగిలె
విలవిల తన్నుకొని విడిచె ప్రాణాలు
గొదకొని అశ్వాల తన కొమ్మున
గ్రుచ్చి
పుర్రెలు పడజిమ్మి వుదుట బొల్లావు
అవలీలగా జంపి అచ్చోటు బాసి
ఘోర రణమున నిల్చి గొదకొని
చూచి
కంచు భేరీలును కదక తప్పట్లు
వరిగిరి రణముపై వగిదార చూచి
సిరిలేని దేవళాల వలె సిరితప్పి
గుడాల్లు
వుండరాదని తలచ ఆ వుగ్రమూర్తి
గొడుగులు పడిగెలు కూలంగ
తన్నెను

15. రావడి

పడదీసి దేహాలు పాదాన జుట్టి
భూం మీద మచ్చపుటముగా నెగసి
దివిటీలు చల్లార్చి దిక్కులాలించి
మొల పొడుగు పీనుగులు మొండాల
నడుమ
శిలబట్టి రక్తాన నిలచె ధేనువ అటు
యిటు చూచి
యదరించి యుద్ధంబు కాయ యన్వరు
లేక
అలుపు దీరగ నుండె అరఝాము
సేపు
వీరనాయకులు అందరూ ఆవేళ
కత్తులు యీటెలు రణమున కడు
పారవైచి
చిత్తు విత్తుగ చల్లంగ చిక్కినవారు
కొందరు మన్నీలు గుట్టల బట్టిరి
బెదరి చిల్లర మూకలు బెగడొంది
పోయి
పొదలు దూరి ఆడాడ పొంచుండ
సాగిరి
అప్పుడు మేఘంబు అటుగప్ప మింట
కప్పెను చీకట్లు ఘనశాన మీద
ఆవు వచ్చేరాక వారికి అటు
కానరాక
ఆ వీరనాయకులు అప్పుడు
వురుకంగ
వకరిపై బడి వకరు వడికట్లు బడిరి
తల్లడింపుచు వారు తల్లక్రిందు లైరి
కత్తులు నేజాలు కడు వంకిణులు

తమ ఆయుధంబులు తరచుగా నాటి
చిత్త విత్తుగాను చెల్లేటివారు
ఆవు వచ్చెనని అప్పుడు బెదరి
ఆ ఘోర రణమున అప్పుడురకంగ
గుడార్ల చేర్ల కొంకులు తగులుకొని
తల్లకిందుగా బడి తారెడు వారు
నెళవు చీకటివేళ నెప్పెరుగలేక
ఆవుకు తొవ్విన దొర్రెల బడిరి
అటుతొలగి కీళ్ళు
వడి పాకులాడుచు వాపోవు చుండిరి
ఆ వీరనాయకులు పిడిబడి అపుడు
వురకంగ
వలలను తగులుబడి వాపోవుచుండిరి
అడదాని చాత ఆపత బడలేక
యేమిటికి వస్తిమని వెతకుడుచువారు
అక్కడ కత్తులు భేడీలు అటు
పారవైచి
మళ్ళీ చూచుచు వారు మరియు
నురకంగ
పడివారి పాదాల్లో పడి లేవలేక
'హరిహరీ నారాయణ! కావు'
మనియేటివారు
చక్కని మేద్యంబు సందున దూరి
పరుగున వురకంగ పుర్రెలు పగిలి
ఆపద నొందుచు అనిరి వారిట్లు:
'యీ గండము గడచి కడతేరితిమైన
బోనాలు పెట్టుదుము నెల్లూరి
పోలేరు తల్లి!'
చాలను దండములు సమర్పించువారు

కాలికొద్ది వురికి కడు మన్నెవారు
కావరపు మన్నీలు కడుదూరముగ
వురికి
ధీరులై నిలచి తిరిగి యిట్లనిరి:
'వోరి! మనకన్నా దొంగ కొడుకు
లేడు!' అనె వకడు
వురికేటి వారిని వూరడించు నొకడు
'పరుగుబారకండి మెడమీద
యే బడికల్లు పడ్డాది'
పోటు బంట్లెల్లను అక్కడ పోగులు
అయిరి
తిన్నంగ పంతాలు పలుకంగ సాగిరి:
'పగలు గాదాయను అవును
పడుగెడలు వేసి
పగదీర పొడుతు'మని పలుకును
వకడు
'యెరగకుండా మనము వెనుకకు
దాసి
యిప్పుడేమాయ' నని యీటె
చేబూని
ఘంటలు అందెలు కదల దాటించి
అటుమళ్ళి కుప్పించి అవు తట్టెగిసి
వెనక లగువున నిలిచి వెనువక
యిట్లనియె:
'యీ రీతి పొడిచిన అవులు
యెడవుండు
అవును మన గుంపు అటు
చదరకున్న

అవలీలగా పొడుతు'నని పలికెను
వాడు
నీతిమార్గుం డొకడు వారితో నిలిచి
యిట్లనియె:
'దగ్గర లేదని అవు తరుచు ప్రేలేరు
అవు అయితే యేనుగులకు
అశ్వాలకైౖ యదిరించదు
సరదార్ల బటులదు దొర్ల
సాహసులను గూర్చి
మాయగా నుండి అవుచాత చంపించు
కొంటిరి
పంతాలు పలికిరి చాటున పడి
వుండలేక
యేటికి చావవలె యీ మాటున
వుండు' మనెను
అవునని తలపోసిరి అందరు నపుడు
'తరుముచు తోక మోర తా
నెత్తినపుడు
నేను హనుమంతుడనుకొంటి త
యావురూపు'
'ఆ రూపుకాదు నీవు అంటివి కాని
కరులపై నురుకంగ ఘట్టిగా చూస్తి
కొదమ సింహము రూపుగానుండె
మరియు
వినరోయి: యదట వుండి నేను
వివరించి చూస్తి
శంఖు చక్రములు చెలగి అల్లాడు

ఆదివిష్ణువు అనుకుంటి ఆ
యావురూపు
యీ రీతి వుండగా యింతపడుట
యేమిటికి?
అన్నలారా! యిక మీరు అవును
తలచక
మన పూర్వ ఫలమనుచు మరి
తలచరోయి!'
ఆ వీర నాయకులు అటు తలపోసి-
'యీ కొలువు బడేటందుకన్నా కూర
తెచ్చుక తిన్న
అలబలం లేక వుందుమనెడి వారు
నందగోపాలు మాట
చెప్పచేస్తిమి గాక
నందకాడ వక దిక్కు-కు
జరగమైతిమి' అనగ
'తనవెంట కొందరు తగిలి రారైతిరి
గాని
పొడిచి చంపుదు అవు మిగిలిపోయెను
గాని
పోయ' ననగా వినెను పొడబాల
సోమన్న
'నేను తరిమితి ఆవును
తలచూపకుండ
తోడు యవ్వరులేక తాణికి పొడవ
వెరచి వస్తిని ఆవు మళ్ళివచ్చునో
యేమో
యే చాలున వచ్చునో యెరిగి
పొడతాము

కాచుండి చల్లలో' ననె వారితోను
వోబళ అనువాడు వకవార్త చెప్పెను
'ఆట పాట గాదు అవు వచ్చెనైన
నజ్జులుగా ద్రొక్కెని నవ్వులుగాదు
చాటున వుండరోయీ చాలు
గాయకుడి'
తండారిగా జెప్పి తా నిలువలేక
గుజ్జర్లు వోబళ గుఱ్ఱాన్ని దిగవిడిచి
బొజ్జ పిసుకుకొంచు పోసాగె నపుడు
చయ్యంపు వోబళు జంజాలి ఆటవేసి
తూట తీగెలవంక దూరె నాపదకు
'సాగిరాగ మొదట శెఖునము
గాదాయ
వేగరాన వస్తిమని వెతకుడిచి వారు
కాని శెఖునాన వచ్చినందుకు ఆవు
కల్లుగా జంపె
యిఖనైవ నెల్లూరికి యిప్పుడే పోయి
మళ్ళి మంచి శెఖునాన వత్తు'మని
పలుకువారు
'యన్నండు ఆవువార్త యెరుగము
గాని
వుండూరి పరిణామాన వుండు'
మనువారు
'నందె గోపాలుని మాట సత్యమనక
వక కావరమున అతని పోనాడబట్టి
సంధ్యవేళకు దిక్కు-కు జరగమైతిమి'
అనగ
హాస్యపరచినవాడు అండ పొదనుండి
'వెరచి పలికేరు నా పంతమెంచేరు

తెల్లవారితే ఆవును తేటముగజూచి
వక్కడనేపోయి మన సిద్ధిరాజు
వద్దికి నేను
పరగ తోలుకువత్తు నా పంతంబు
చూడు
యిట్టట్టు వేగించి యిఘ రెండు
ఝాములు
తెల్లవారి యిక్కడికి ఆవును తేకుంటినైన

అందరము నెల్లూరికి అరుగుదా'మనిరి
అని యిట్లు వారికి అటు తోచినట్లు
అనుకోను వినెసు ఆదివిష్ణుండు
కొందరు పంతాలు పలుకు మాటలును
గోవుకు వెరచి కొందరు కొనియాడు
మాటలును
మనస్సున తలపోసెను మరి
ఆదిమూర్తి

## బొల్లావు రాగా సేనలు పరుగువారుట

'చంపంగ చిక్కిన శానల నెల్ల
వురికి అడవుల బట్టిన వుడుటు
మానరైరి
వేనీడ వుండుట యెరుగరో వారి
నిబ్బరమో
తిరిగి యుద్ధము శాయ నామీద ధీరులు
కలరో
అంతట నిలువక ఆ పంతములు
మాని
వురుకగల వారైతే నేనీడ వుండ
నేమిటికి
వురికిన వారిపైబడి వొగి చంపరాదు
గురి దెలసి అసుర మొఖాలకు
దొరుకు వేగ వచ్చితేను'
అని వుగ్రకోపియై అపుడు బొల్లావు
కాళ్ళ అందెలుమ్రోగ కాలు తాటించి
ఘన రంకెవేసి బొడ్డుగంట నాడించె

ఆ ఘంట ధ్వనులకు రాజు ఆశ్చర్య
మొంది
అడలు చుండగ శానలు అగుభుగులు
అయిరి
వచ్చెను ఆవుయని వాపోవుచూను
దాగిన పొదవిడిచి తల్లడింపుచును
వడి నాయకులు వురకంగ వురదాళ్ళ
భంగి
యాద తీగెలు చుట్టుకొని పడ
వెతుకుచు వారు
సాహస మంతులు వురకంగ
చబుకుల భంగి
కోరిందరెబ్బలు మొఖమున గొబ్బున
గొట్టి
కంచలు గీచిరి రక్తాల కాల్వాయె
పార

వెతపడుచు వురికిరి ఆవు వెన్నంటె
నసుచు
బాగైన నాయకులు పరుగు బారంగ
వుంద్ర కంపను బడి లేచి వాగి
వురకసాగిరి
ఆ ఘంటి ధ్వనులకు ఆవు వచ్చె
నసుచు
తల్లడిల్లుచు వురుకుచు తాము
అడల సాగిరి
పాడి యావుల కొల్లయని వక్క
పరుగున వస్తిమి
తల్లి బిడ్డలు యనుచు తావు
చారకుండ
దిక్కులేని చావాయ యీ
తూడితీగలలోను
నక్కలే దిక్కాయ నట్టడవిలోను
వెతపడుచు వురికిరి వీరు వారనక
పొదబాల సోమన్న పొదతెరువుగానక
యాడయు-రిన సందు యనలేని
పొదలు
ఉప యూడను దూరిన
దేహమంతయును
జీరలు జీరలు జర్జరితముగను
తగిలిన కొర్రి పోట్లు తరచుగా నాటె
బలిమిని పొదదూరి పరుగు బారంగ
వెనువెంట వోబళు యీటెతో వెడలె
వెల్లులు గుండె జరజర దూసె
అస్పైదపి పట్టుకొని ఆ వెంట పరచి

పారవైచి గడార్లు వోబళు పరుగులు
పారంగ
ఘంట వడిలో వుండి ఘణఘణ వాగె
ఆ చప్పుడు విని సామినేడు
ఆవొచ్చెననుచు
తందరలాడుచు తాను వురికి
చలపట్టి ఆవు నన్ను చంపవలె
ననుచు
నా వెనువెంట వచ్చె యేమిసేయుదు
ననుచు
అని గజ్జర్లవాగు గొబ్బున దాటెను
తగ తూములేరు దాటి తా తిరిగి
చూచి
నలుగడల ఆలించి వినెనా
ఘంటనాదు
వసపెట్టుచును యతడు
గచ్చపొద చొచ్చి
పిట్ట కీచుమన్న బెట్టులికి పడుచు
నరులకు పోయుబంటు పొదబాల
సోమన్న
కన్నులు పొకుచుచూ వుండె
కట్టెపొదలోన
సిద్దిరాజుల [illegible]
పొదల గుట్ట దాగి ఆశేను పొసగ
వేడుచును
దాగి వంక నాయలను ఆవు వైపు
అనుచు

యక్కడ దాగిన శానలు ఆవును
వేదుచుండిరి
ఆదిమూర్తి బొల్లావుకు అంతయు
దెలసి
ఆ రణము వెళ్ళెను ఆదివిష్ణుండు
కలువలున్న కొలను కడకొచ్చి
కోపాన
కదసిన కోపాన యా భద్ర
గజముల చంపి
అరిగెలు భేడీలు ఆటు నుగ్గు చేసి
సరదార్ల బంటుల సాహసుల గూల్చి
............[16]
అందలాల రాజులను పందలుగ
జంపి
పాలకీల రాజులను బవరంబున
గూల్చి
అందెలు గడలన్ని ఆటు
విరగద్రొక్కి
తుడుముల భేరీల తొక్కి
తెక్కరము చేసి
వడి వన్నె దమామీలు వక్కలు చేసి
హరిహరులు చూడంగ హరుఖు
పొగడంగ
నారసింహుని రూపమై నటు గదలి
వచ్చి
అంతట బొల్లావు అతి వేట్కతోను
అసురుమొఖాల గుడారు
కప్పుదేతెంచి

పంతమున గుడారులో
పవళించి యుండె
తెల్లతెలవారంగ తొలిమక్క
పొడిచెను
పలికె నానా దిక్కుల కల పక్షు
లెతలేక
యినుడు వుదయాద్రికి యేతెంచి
వచ్చె
అడవుల దాగిన అపసీశ్వరూలు
పొదల దాగిన యట్టి పోటుమన్నీలు
వద్రెల దాగిన వడుసుమన్నీలు
మోకాళ్ళ మోపున లేచి అవును
మోరెత్తి చూచి
వొంగివొంగి ఆవును వెద
వెతకిరంత
ఆ లేదినాక చూచి ఆవు లేదు
లేదనుచు
జననాథు దగ్గిరికి లేచి రాగాను
కలువరింపుచు పొడబాల సోమన్న
కట్టుపొ[illegible]ను
'అదె వచ్చె! అదె వచ్చె! బొల్లావు
అదిగో! అదిగో!' [illegible]
దద్దరిల్లుచుండంగ దండి నా[illegible]
వెరవకు మనుచు అర[illegible]
పొ[illegible]
'అదె వచ్చె! అదెవచ్చె!'
అనుచు [illegible]
'జడియకుడి' అని వీపు చరిచె[illegible]

16. ఇక్కడ కొంత గ్రంథపాతము.

ఎదురొమ్ము సరచిరి యంత
లేదనుచు
భయము దెలుపుచు అతని 'పదపద'
మనుచు

సిద్దిరాజు వద్ద చేరిరందరును
మొగిచి హస్తములెత్తి
మొరపెట్టసాగిరి

## చెదరి పారిన సేన సిద్ధిరాజుతో మొరపెట్టుట

"అవనీశ్వరా! మేము ఆవుతో చాల
ఆపత బడలేక అడవులకు నురకంగ
వర్రెల వాగులవడి చిక్కు కంపలను
అంధకారంబున అతకంపమున
బొంది
ఆవుచే సంసెను[17] అయ్యె మన
దళము
సంధ్యవేళనే చెప్పె సంధ్యగోపాలు
పంతము కాదనిరి మన దళములో
పలుగాకులెల్ల
యెరుగని మాటకు నీవు యెడము
లేదనక
ఘట్టిగా నుండుమని కట్టడి చేస్తివి
నీవు చెప్పిన కట్టడిలో ఘట్టిగా
నుంటిమి
పైనుంచి యాగర్మ పడు చందమాన
అంబరీదుల[18]నుంచి ఆవు పడబోత
శంఖు చక్రముగల ఆవు మన
శానల గూర్చి
గజముల అశ్వాల కల్లుగా ఉంచె

యీరాత్రి సంసిన దళము యింత
అంత అనుచు
చెప్పి చెప్పగలేము రాజ! చేరి నీవు
చూడు"
ఆ మాటకును రాజు ఆశ్చర్యపడుచు
ఆ రాజు మంత్రులు అందరు యా
రణములో నిలచి
యెటు చూచినాను ధరగప్పి పరిగిన
దళములజూచి
'శ్రీరామ! బొల్లావుచేసిన యుద్ధంబు
కన్నుల జూడ మాకు కారణమాయె'
అని తాపమున బొంది రాజు అప్పు
డిట్లనియె:
'కాని శఖువాన నిలచిన కారణం
బిదియు'
యెత్తించిన గుడార్లు వేగంబె దించి
దారణీశ్వరుని దండు తర్లె ఆవలను
యెడముగా బయలను యెత్తించె
గుడార్ల
హేరాళముగ నిలిచె యా రాజు దండు

17. సమిసెను 18. అంబర వీథుల

దేరాలు యెత్తించె ధీరుడై రాజు
ఆట రాజు మంత్రులు ఆశ్వ
ఖండువులు
గాదకాని దేరాల్లో కూచుండి రంత
సర్వదళములను సభవారిని బిలిచి
పురవీశ్వరుండును వాయ్యన బలికె?
'విచ్చుకత్తులవారు! విలుమూకవారు!
గదిమన్నె మూకలార !
కాలబలంబులార!
కంచు టరిగెలవార! అవును
కనుగొని పారి
జాదకాండ్ల వెనువెంటపోయి సరిపోరి
పనిబడి హతము కాయ పైనమై
రండి
యిబ్బడి బత్యాలు జీవితాలు
యిప్పింతు మీకు'
అను రాజునకు మ్రొక్కి
అప్పుడిట్లనిరి
"రాజ! యీ రాత్రి బొల్లావు
రణమందు జొచ్చి
యిచ్చగా బంపెను వేలు లక్షలును
నురుగుచుండగ ఆవు ఘంటనాదులకు
కొండలు ధ్వనులచ్చె కుంభిణి అదరె
అప్పుడు పంపిన మూకలు అంతంత
గాదు
ఘంట ధ్వనులకు మేము తల్లడిల్లాము
యిబ్బడి భత్యాలు యిచ్చినా వద్దు
ప్రాణాలు కలిగితే బలుసుకూరమ్మి
యిబ్బడి భత్యాలు యిటుతెత్తు"
మనగ
మరియు విని యా రాజు మతిని
స్వయించి
ఆ సంధ్య గోపాలుతో రాజు
అప్పుడిట్లనియె
"కాగెడి ఘంటలు మన గజముల
మెడను
మ్రోగుచున్నవి ఆ మ్రోత మిన్నంటి
ఆవు గంటల నాదు కొండ అదిరంగ
మ్రోగె
ఆ మ్రోత లక్షణం బది
యెటువలెనుః"
అడిగిన సంధ్య గోపాలు హస్తములు
మొగిచి
మ్రోతపుట్టిన తీరు మొదలు వచియించె

## సంధ్యగోపాలుడు ఘంట వృత్తాంతంబు తెలుపుట

"ద్వాపార యుగమందు
దుర్మార్గులైన
బాణాసురుడు నరకాసురుడు
పౌండ్రక వాసులును
బహుకాల కర్మండు కంసుడు
బహు రక్కసుండు
కాలయవనుడు బకుడు గడుసు
ప్రళయుండు

విను ధేను కాసురుండు
దంతవ క్త్రుండు
వినుడు సాల్వుండు మురదైత్యు
మొదలుగా
భూదేవి మొయ్యలేక హరికి
మొర పెట్టిన అతడు పరిమార్చ
మదురలో కృష్ణుడై మనుజుడై పుట్టి
పరగ ద్వారకాపురి పట్టణంబు నేలి
అంత భూతకి చంపి అసురుల
గూల్చి
పదహారు వేల గోపికా స్త్రీల భ్రమయించి
చిన్నవాడై యుండి శ్రీ కృష్ణమూర్తి
యింద్రుని దేవేంద్రుని యంత
వాండ్లనిన
వెరువలేక శ్రీకృష్ణమూర్తి వక్క
వేలునాను
గోవర్ధనగిరి గోటనే యెత్తి
మరియు నా గిరికింద మనుజులనెల్ల
కరులు సింహాలు కదిసె హితవుగాను
మేకలు తోడేళ్లు మిళితమై యుండె
వెలుకలు పిల్లిలు యేకమై వుండె
ఘన నాగాదూర్లు గరుడ
భేరుండమూలు
యేకమై పక్షులు వెలయుచునుండె
వైరి వర్గము లేకుండ వసుధ
జీవులకు
రక్షకుడై కృష్ణుండు దాంష్య పెట్ట
గాను

పుణ్ణంగ దేవేంద్రుడు వానకు
వెరువడు యనుచు
ప్రళమైన పిడుగులు పంపెను
యపుడె
శ్రీ కృష్ణునిపై దూకి చిరసమయాన
డాసివచ్చిన పిడుగు డాచాత బట్టి
వడిసి పట్టిన పిడుగు వనర బంధించి
కరుణచే యా విశ్వకర్మ బిలిపించి
'వినుము యా కలియుగమందు
యా విశ్వకర్మ
పాతాళ విఘ్నేశ్వరుండు పరమాత్ముని
పూజ
సేయు సమరంబున చేరి నాదింపు
ఘనమైన యా మంచిగంట గావించు
అదిగాక జాంబవుడు ఆదికులమందు
గడచి జన్మములెల్ల కలియుగ మందు
వీరన్న వరమున బీరన్న యనగ
ఆదికులమున బుట్టి అతడు చేపట్టి
యీరభద్రుని చేతి కరపాలకము[19]
యీడైన
గోసంగి పేరిట కొంగవాలు కత్తి
యిప్పుడే కావించు యినుము యిక
మొకటి
కోర్కతో యా కోడెకత్తి గావించు
ఆ కత్తితో చాల అక్కర గలదు'
కలికావతారుడు చెప్పిన క్రమమున
నపుడు
కావించె యావిశ్వఘను డంతలోన

19. కరవాలము

అది చూచి కృష్ణుండు హాశ్చర్య
పడుచు
ఆ దివ్యాయుధంబులకు కృష్ణుండు
ఆనతి యిచ్చె :
'చలగి మిమ్ము చేపట్టగలవారు
వేవేగమున వచ్చి వేడినయపుడె
సహాయం గమ్మని చెప్పెను స్వామి
ప్రార్థించి యా ఘంట పరగ చేపట్టి
పాతాళ విఘ్నేశ్వరునికి బాగుగా
యిచ్చి
ఆ ఘంట నాదించి హరుని పూజింప
గర్వుడై యిచ్చిన ఘనుని తలుప
డనుచు
అవతారము విడిచి కృష్ణుడు
ఆ యదువంశమందు
కాటమరాజుగా పుట్టి కాలావుల
మేపుచు వెతకి
కరుణతో పాతాళ విఘ్నేశ్వరుని
కనుగొని
భాషించె హర్షించి పరగ సమ్మతిగ
పగడసాలాడను బాగుగా దలచి
అది పంతము గెలచి అప్పుడు రాజు
ముమ్మారు గెలిచెను రాజు ముదముతో
నిలచి
వోడి విఘ్నేశ్వరుకు పడ్డి యా ఘంట
కొమ్మని రాజుకు గొబ్బున యిచ్చె
కవులావులు మందకు ఘంట
గొనిపచ్చె
బొల్లావుకు ధరియించె బొడ్డున
ఘట్టినను
ఆఘంటనాదు అంత యింత గాదు"

## సిద్ధిరాజు వీరులను బొల్లావు మీదికి పంపుట

విన్నపము చేసిన విని సిద్ధిరాజు
వ్యగ్రుడై మండుచు ఆ రాచమూకల
బిలిచి–
"ఘంట చంపదు ఆవుగాతలు గాని
వెసనొక్క ఆవుకు వెరచి ప్రాణంబు
దాచి నూరేండ్లకు మించ తగనుండ
గలదా ?
చావును పుట్టువు సర్వేశ్వరుండు
కట్టడి చేసిన క్రమము మదినుంచి
యెరువక ప్రాణములకు యెదురించ
వలెను
నందికనమనాగరాజు! ఆనంద
కాటమరాజు!
వాగర్త భీమరాజు! వలపర్తి
పాపరాజు!
కందకూరి గంగరాజు! కస్తూరి
తిమ్మరాజు!

ప్రత్తికోట బసువరాజు పద్మాక్ష
గోపరాజు
విటకోట అబ్బిరాజు యింద్రభోగం
అక్కిరాజు
సజ్జనరామరాజు సంకల్పసిద్ధిరాజు!
వింద్యాద్రి జగ్గరాజు యిప్పుడు పోయి
బొల్లావును వెనుతగిలి పోనీయక
చంపి
శ్రీఘ్రాన ర''మ్మని శలవిచ్చె రాజు
యీడు కొల్పిన రాజులు యీచెలు
అంది
సానకత్తులు అందరు జబురుగా నంది
విల్లనంబులు పొదులు వెసగ
తామంది
అప్పుడు రాజులు అవని కంపింప
కదనంబు శాయను కదసి రంతంత
అవు జూడను వచ్చి అవును జూచి
నెమ్మది అస్సురమ్ముఖం గుడాడులో
అవు నిద్రబోవంగ
గొనకొని యార్చుచు కూడిరి
యిరుగడల

ఆ యార్పులు విని అవుతాలేచి
నిజమని శంఖతో నిలిచె బొల్లావు
నిలచిన అవు మీద నెదరి విలుమూక
తెంపుగా విండ్లను తెగనిండ దీసి
విడిచిరి బాణాలు వేయు విధములను
అప్పుడు బాణాలును అవుపై రాగ
పింజలు ధ్వనియని పెనుమ్రోతలై
మ్రోవ
అదలించి దూకుచు అవుపై గదసిన
యేమి యెరుగని అవు వెర్రిగానుండి
కదిసి రానిచ్చె అవు కాలు తాటించి
వద్దికి రానిచ్చె తన వాలమున జుట్టి
అదలంగ చంపెను అవనిపై
రాజులును
చలరేగి ఆయావు శానల మీద
పడి తన్ని చంపుచు వారెందు
జొచ్చినను
పొడిచి చంపుచు అవు
పరిమార్పగాను
సంసిరి రాచమూకలు సాహసులెల్ల

## మాయోపాయమున బొల్లావు వీరులను మడియించుట

ఆర్భాటంబులు విని ఆయాదిమూర్తి
రాగడిల్లుచు కదిసి రాచమూకలచూచి
తన విశ్వరూపంబు దాచి బొల్లావు
మాయరూపము దాల్చి మరి లేవలేక

పండ్లు పూచిన ముసలి
బడుగోద వలెను
గజ్జులు మువ్వలు ఘంటలు సరులు
అవుపై జోరీగ లాషిన యట్లు

పిడుదులై కరుచుక పెనగి
యున్నయట్లు
ఆ రీతిగానున్న అవుపై జొచ్చి
రాక చేరువనుండ రాణువలెల్ల
యడముగా నిలిచిరి యిండ్లెక్కి పెట్టి
వెసదీసి బాణాలు వేసిరి యిరుగడలు
ఆదివిష్ణువు బొల్లావుకు అగురు
బాణములు
భక్తుల మీదను ప్రమథ గణముల
చాత
మంత్రాక్షతలు వేగ మరి చల్లినట్లు
ఆ రీతి తెలియక అ రాచమూక
వెసరేగి చాల వెయ్యంగ సాగిరి
యంత వేసిన అవు యేమనక
యున్న
అప్పుడు కొందరు అటు డాసివచ్చి
అంతటంతట నిలచి ఆవును చూచి
'బాణాలు వెయ్యకుడీ ఆవుపడి
లేవలేదు'
అని యిట్లు ఆడుచు అందరుగూడి
పొంచి చూచిరి అవు పోలికలన్ని
'యీ రాత్రి యుద్ధం చేసింది యీ
అవు కాదు
వంటి కొమ్ము ఆవు కాని యిది
వట్టి ముసలి ఆవు
మన శానల రాత్రి మహి మీద
గూల్చిన
ఆవు దీని బిడ్డ అవు'నని పకడు
'జోరీగలతో అవు సుక్కిందిగాని
కొమ్ము వకటున్నది యీ అవు
కొంచమనరాదు
బలిసి వుంటే యీ ఆవు బహు
పలువ'దనిరి
'గుండె మునర తగిలితే రయముగా
గూడారు యెత్తి
మందలో మంచక యీత మరి
తోలినారు
వేసిన బాణాలు యెత్తి పోయగాని
వక్క శరమంటిన అవు వరుగు
నిక్కడను
తోకబట్టుక దీసి తోలుక పోయి
పొందుగా మనరాజుకు పోలిక చూపి
మరి చంపవలె యీ రూపు
మామీను[20]ంచరాదు
ఘట్టిగా మనమీద కార్యంబు చేసి
మట్టిమల్లాడిన బొల్లావు
మందనున్నాదో
కల్లుపడి వురికెనో కారడవులాకు
యందు చొచ్చెనో కాని వెతికి సాదించి
బాలు బాలున అరువంగ బలాల
బొడిచి
మన మందరమును చంపిన అవును
మామీద కూల
చంపి పోవలె రాజు సముఖం బార'
వారి పంతాలు వినుచు తన వాలము
బెంచి

20. మామీన = మహిమీద

తన విశ్వరూపాన తాను వడి లేచి
కదసిన దళముపై కాలు లాటించి
ఝుడిసి బెమ్మడిపోయి రాణువ జాలి
బడిన
వట్టి వారికి నెల్ల తన వాలంబు జుట్టి
బిగువక అంకించి వెలిగించి యెత్తి
వడసి నేలను గొట్టె పు|రెలు
వొప్పలై పొగెలె
చలగి యా బొల్లావు శానల మీద
వడిసి తన్నిన కొందరు వరగిరి
ధరను
యెందు జొచ్చిన పోనియ్యక
వెనుతగిలి ఆవు
పొడిచి చంపుచు అవు
పురిమార్చగాను
సంసిరి రాచమూకలు సాహసు లెల్ల
చిక్కిన వారిపై చలగి దూకంగ
ఆవు రాకలకు వెరచివారు
అగులుగులైరి
వెరచి వురికే వారి వెనుదగిలి అవు
సందుల గొందులు పొదించి ఆవు
యెందు జొచ్చిన పోనియ్యక చంపగ
అప్పుడు వురికితా రాచమూక అడవి
చేకొనిరి
లెస్సగ రణమందు ఆవు యంతయు
నిలచి
యెటుపార జూచిన యదరించ
యవ్వరు లేరు

వచ్చి ఆసురముఖాల గుడార వద్ద
యుండె.
సలుగడల వురికిన అటు రాచమూక
గుజ్జర్ల వాగున అందరు గూడి
అలసట దీర రాచమూకలు ఆలోచన
పడిరి
'ఆవుచే రాచమూక అంతయు మడిశ
వనరంగ మనము రాజుకు వద్ధికి
నరుగ
పద్ధతి గాదిపుడు పరగ రాజులకు
సరగ రణమున పగతుల చంపను
చావ
కట్టడి కలదు కాకున్న మనకు కారణ
మిపుడు'
అనుచునుండిరి అడి అతిరోషమునను
మరి రాచమూకలకు మరి రోషపుట్టి
'పొడువు: పొడువు!' మనుచు
పొడుములు ద్రొక్కుచు
కదిసిన శ్రీరామ గరుడ బొల్లావు
పాదములు దట్టించి పగతుల మీద
కొమ్ముల గొరిశల కొనగిట్టలాను
వ్రుగుడై పొడిచెను వురివి బొల్లావు
ప్లంలాదని చిరుగోళ్ళ పదును
కలదనుచు
తాను నరసింహుడై తగ గూల్తు
మనుచు
కదనంన రాచమూకలు గగ్గోలు పడగ
ఛౌకళించి వురికి శానపై దూకె

వాసి కలవారు వడి చేరి పొడువంగ
చూచి వాలంబునను చుట్టిరా దీసి
విరిచి నుగ్గులు చేసెను యీటె
లన్నియును
వీర రౌతుల తలలు యెగిరిపడ తన్నె
తనపైన గడలు వేసి తందరనొంది
అటు మళ్ళి వురుకుట వాణ్ణి అరికట్టి
గుదులు కొమ్మ్రన గుచ్చి యగచిమ్మె
యెగిసెను పీనుగులు యోజనం
పొడువు
రివ్వు రివ్వున తటాలున దివిపైన
పడెను
కొన్ని దళములు పైబడి కొందరు
హతమైరి

దుడ్డు కోలలు వారిని దురమందును
గూల్చి
అడ్డ కత్తుల వార్ని హతమణిచి
చంపె
జందాళముల వార్ని సమరమున
గూల్చె
తలపడి శత్రువుల తలలూడ తన్నె
మానవుల జీవించ మరి యాదిమూర్తి
యదరు నెవ్వరు లేక వేడుక దీర
ఆవు పగతుల చంపి ఆనందమంది
రణములో శిలబంటి రక్తములో
నుంచి
వచ్చి ఆసురముఖాల గుడారు వద్దన
యుండె

## పారిన వీరులు బొల్లావును రాజునెదుట ప్రశంసించుట

అప్పుడు కొందరు అతశేషులు వచ్చి
మ్రొక్కుచు చెప్పిరి రాజు ముందర
నిలచి
"వో పల్లనాటి రాజా! వినుమ
పరిణామ మెల్ల
పోరాడి ఆవు చాత పొలసిరి దేవా!
కన్నులు చూస్తిమి ఆవు క్రమమెల్ల
వినుము
పాదాలు నాల్గు పదను చక్రాలు బోలు
పైపిల్ల గొట్టెలు యెనిమిది
రామభాణాలు బోలు

ఆవుకు శోకగాదయ్య హనుమంతుని
వాల మనవచ్చు
వంటి కొమ్ముకాదు ఆవుకు
వజ్రాయుధంబు
శంఖు చక్రంబులు చేరి అల్లాడు
అసుర తలాటములు గల ఆవు
అవనిపై యెగిసెను
నరసింహమూర్తి యనినట్లు యెన్న
దగును
యెదురుగావచ్చి ఆవును వెరువక
చూస్తె

ఘట్టిగా శ్రీహరి గరుడవాహనమెక్కి
కల్లగాదో రాజు! కదలిన విధము
పరగ యాదవులకు ముందుగా
తామరపద్మ ముఖంబు
కలువరేకలు బోలు కన్నుల తీరు
ఆ కర్ణములు చూడ ఆనంద మవును
ఆ దివ్యనామం అమరంగ చూస్తె
ఘట్టిగా శ్రీహరి గరుడవాహన మెక్కి
కల్లగాదోయి రాజు! కదలిన విధము
పరగ యాదవులకు పగదాతగాని
కాకుంటే వో రాజా! నీవును కన్గొని
హరియని వేడిన పాపమంతయు వీడి
పరమ పావనులై పరము
పొందుదువు"

## సిద్ధిరాజు మందిపడి బొల్లావుపైకి బోయలను పంపుట

అని విన్నవించిన ఆ సిద్ధిరాజు
ఘనమైన కోపాగ్ని కన్నుల
దొరియంగ
వేలును రెండేసి వేలు గలయట్టి
బోయల పిలిపించ ఘనాయకుండు
'పరకసాని అబ్బినీడు! పట్టలో
పిన్నయ్యా!
గురిపోతు వన్నయ్యా! గుజ్జర్ల
వోబులు!
మత్తి సాతంనేత! మతుకుల విట్టల!
వంటరి మరిసీడ! వయసు ముకుందు!
జల్లిచి ధన్నీత! సాతర్ల పరచి!
బొగ్గుమళ్ల చంద్రయ్యా! భోగ
సంబినేడ!
నిగ్గుల కామినీడ! నెలవరి భీమినీడ!
జన్నవాడ పామినీడ! జక్కం
ఘోబళు!
మిణుగూరి బొమ్మినీడ! మీనుగ
కొండు!
తొమ్మిదివేలు విలుమూక జోతుల
సామినేడ!
పయనమై రారోరి బటనాయకులార!
యిమ్మహిన వెలసిన యిట్టి సాహసులు
మీరు
పరుగంగ మీరు మీ బల్లములతోను
వేవేగమున బోయి వెయ్యేసి
బాణాలతోను
తోలివేయుడీ అవును తుపాకిగుండ్ల'
అని యిట్లు పేరు పేరున అటు
చెప్పగాను
పయనమై కట్టాయిత్తుపడి వచ్చిరంత
మొగచి హస్తముల రాజుతో మొనసి
యిట్లనిరి!
'ఆవు చేసిన యుద్ధం అంతింతగాదు

అవు మీదికిడిచినవారు హతం
అవుట నిజం
రాజవు మా ప్రాణరక్షకుండవు నీవు
నేడు మా యుద్ధం నీవు కను'మనుచు
అని చెప్పి బోయలు అంతయు వచ్చి
ఘనమైన బొల్లావు కదకేగిరింత.

## బొల్లావు మీదికి బోయ లెగబడుట

అవును చూచితి ఆశ్చర్యపడుచు
యచ్చరింపుచు విండ్లు యలమి
పైకెత్తి
పొంచిరి బాణాలు బొల్లావు మీదట
తెట తెటా విండ్లును తెగనిండ దీసి
నిలచిన అవుమీద కదిసి వేయగాను
నిప్పుల మీదను నెయి చల్లినట్లు
గుప్పెటి అంబులకు అవు గొదకొని
చూచి
యేటికి గండుమీను యెదురెక్కినట్లు
వేటబోయల మీద వేగంబె నడిచెను
నడచిన బోయలు నంత గుమిగూడి
యెడమ కుడెని చేరి బాణాలు
యెడలేక వేసిన
చెవిన బొల్లావుకు శంఖయు లేక
చీదర కొట్టుచు చెల్లించి దూకె
పొడిచిక శత్రువులకు పొట్టలు చించి
వడి రక్తధారలు వరదలై పార
ప్రేగులు తెగి నేల పేరులై రాల
యదరిని భల్లాలు వేసేటివారు
వారిని మెచ్చుచు అవు వడి వడి
పెగసి
సింగిణి విండ్లవారిని చెండు చెండాడె
యెదురింఢ్ల వారిని వెనుతగిలి చంపె
తొమ్మిదివేల విలుమూక బోతుల
సోమినేని
కుమ్మిరణములోను కూల్చె బొల్లావు
గురుపోతు వన్నయ్య గుజ్జర్ల
వోబుళను
నరములు శిరములు నజ్జుగా(దొక్కి
వీర నృసింహుడై వినుతులగూల్చి
అతికోపమున పగతుల అవని పై
గూల్చె
ఆ సమయమ్మున బోయలకు అతిరోష
పుట్టి
తీసిపోక అవును తీరకొట్టుకొని
'చెరిచెగదా అవు చెల్లించి పొడిచెనో
యనుచు
తరిమి చంపసాగె తలచూపకుండ
అవును యిచ్చోట హతము శాయకను
అవుకు పురికితే అపకీర్తిగాక'
అని పౌరుషంబున అతివేగ కదిసి
మల్లెమొగ్గ అంబుల మరి వేయసాగిరి
చిల్లకోల అంబులు చెల్లించి వేసిరి
వెగచర బాణాలు వేసేటివారు

ఆరీతి బోయలు ఆవుమీద అంఖించి
కడిసిన
అలయక ఆవు ఆ రేయి పగలు
వొక విధమున పోరి పగతుల
వసుధపై కూల్చి
అప్పుడు బొల్లావు శ్రీహరిని దలచి
అతి ఖారమును కొండి ఆవు
తలపంగ
కనక రథములపైనుండి హరిహరులు
కనురెప్ప వెయ్యక
చూచి ఆవు యుద్ధంబునకు
చోద్యంబు పడుచున్న
అటుమీద తలచిన హరి సంతసిల్లి
మము చారరమ్మని మరి చాతవున్న
అక్షింతలు వేసిరి హరిహరులు
మునులు
చలగి దేవతులు ఆవుపై కాసలు
చల్లిరి
అప్పుడు బొల్లావు తనపై అక్షింతలు
చూచి
సంతోషమున నిలిచి ఆవు సరగ
వేదంగ
అప్పుడు సంబించి ఆర్కునాయకులు
పుటమెరిగి బల్లాలు పొడిచేటివారు
పేరు చెప్పి ఆవును పెనగొని దాసి
చొక్కచువ్వల గడల చొచ్చి
పొడువంగ
పరమాత్ముని తలచి ఆవు బాలు
బాలున ఆపుచుచును

గన్నెరాకు అంబు ఆవుకు గాయాలు
నాటెను
తిరమందుల వారి బొల్లావుకు
తిరుమణి తిరుచూర్ణం
ఘనముగా కూరినను గాయాల
వెంట
పొత్తపు నేజాల ఆవును పొడువంగ
సాగిరి
'గోవింద! గోవింద!' యని ఆవుకు
కోలల వేసిరి
'రామా! రామా!' యని ఆవును
రణఘొల్లుగాను
ఐక్కల పిక్కల అంబులు ఆవుకు
ఖారముగా నాటెను
తమకం దగ్గర పల్లికొండకు తెలిసి
'గోవింద! గోవింద!' యనిరి
తిరుమందుల గోపాలకులెల్ల
అప్పుడు పల్లవుల రాజులు
'హరహరా!' యనిరి
యేడు సానలు తీరిన వెండి
నేజాపోట్లు
ఆవుకు యెదురొమ్మున అప్పుడు
నాటెను
ఘాయాల బాణాలు ఆవు సంకట్టి
వెడలె
పార్వతి అంబుల పరువెట్టి వారు
పెనగొని యిరుగడల పేరాల
కోరుచు

గుమ్మడిగింజ అంబుల ఆవును
గుప్పంగసాగి
పందగిరి అంబులు పూని పరుగున
వచ్చి
యడపక ఆవును వెయ్యంగ సాగిరి
కదిసి బోయలు యిట్లు కపిలావు
మీద
చదరక యుద్ధంబు చేయుచుండగను
పెక్కు ముంగిసలతో పెద్ద శేషుండు
సాహసాన పోరు చందమున ఆవు
కొమ్ముల చిమ్ముచు గొరిశల
మట్టుచు

ఆకొని బొల్లావు ఆలుగులు
ఆరగించ
దాహముగొని బొ వు రక్తధారలు
త్రావుచు
ధీరులైన బోయమూకల దిండ్లు
త్రిప్పుచును
వింతగా పున్నెపు వెన్నెల గాయంగ
అంతంత పిల్లదీపులు ఆడినయట్లు
పంతపు సురభి ఆటువలె శాయంగ
అంతట నుండి అమరులు చూచి
ఆవు పోట్లాటకు హాశ్చర్యపడిరి

## బొల్లావుకు వైకుంఠ ప్రాప్తి

మెచ్చిరి కనకరథం మేలు మేలనుచు
విష్ణుదూతలతోను వింజామరంబులు
అంపిన ఆవుముందర అటు నిల్పి
దూతలు
అప్పుడు సురకాంతలు అక్షంతలు
వెయ్యంగ
ఆ విష్ణుదూతలు రథంబుపై ఆవు
నెక్కించి
దేవదుందుభులు దివినుండి మ్రోయంగ
కురిపించిరి ఆవుపై పుష్పవర్షంబు
పక్షిణి విమానంబుపై నెక్కి ఆవు
చలగ విష్ణుదూతలు శావలు
శాయంగ

నటుమించి తుంబురు నారదులు
పొగడ
తనయెత్తు పగతుల ధాత్రిపై గూల్చి
మనుజ లోకమునుండి మరియు
బొల్లావు
ఆకాశవీధినుండి అమరులు చూడంగ
యేకాదశీనాడు యిరవైయేడు
ఘడియలమీద
కలవరదుడు అంపిన కనకరథ
మెక్కెను
అరిగెను బొల్లావు ఆ విష్ణుకడకు
ఆవు రథమెక్కి అరుగంగ జూచి

చోద్యమందుచు బోయలు సోలి
సొక్కుచును
........................[21]
పొదలుచు బోయలు పుడమిపై
నెగయుచు
తమ పొడుగు వృక్షములు తామె
దాటుచును
భూనాథు దగ్గరికి బోయలు వచ్చి
కడు వేగమున వచ్చి కరములు మొగిచి
జనపతి కావార్త చెప్పిరందరును

## బొల్లావు దివికేగిన వార్త బోయలు సిద్ధిరాజుకు విన్నవించుట

"వో పల్లవాధీశ! వో పట్టాభిషేక!
పలువైన పగ చచ్చ పట్టపురాజ!
వీనుల పండుగా వినవయ్య రాజ!
ఆ యాదవుల మందను అవనీ
యంటిమి
ఆది విష్ణువుగాని ఆవుగాదయ్య!
వుదయాస్తమానంబు వక్కకై వడిని
కదసిన బలముల కల్లుగా జంపి
మితిలేని బలముల మేదినిగూల్చి
అలుపు సొలుపు నిద్ర హారంబు లేక
యీ రీతి యెడపక యుద్ధంబు
జాయంగ
గగనంబుపై నుండి దేవతలు
కనుగొని చూచి
సురులు మునులు చూచి చోద్యపడి
వేగ
మెచ్చి పువ్వులవాన మేలుమేలనుచు
ఆవుపై కురిసెనుఆ భావమేమొ
నెమ్మది గుడారులో నిలిచియుండంగ
వో రాజ! నీ వంపు వుగ్రంబుతోను
పోయి బొల్లావు పోలిక చూచి
యెడపక బాణాలు యీవలావల
వెడల
వేసిన కదలక యేకముగ యున్న
బల్లాల బరిశల పసవడి పొడిచిన
గాయాలు యీవలావలకు కానవచ్చు
వేళను
హరిహరులు మెచ్చి రథము ఆవుకు
పంపిరి
కడసారి ఆయావు కదకరథమెక్కి
పుడమి జనులును చూడ పోయను
దివికి
మమ్మును యేమనక ఆవు మది
వుండె గనుక
మా ప్రాణములు గడిచి నిను
చూడగలిగె."

---

21. ఇక్కడ ఒకటిన్నర ఆకు గ్రంథపాతము

## మూడవ కాండము

# బీరనీడు యుద్ధము

## సిద్ధిరాజు యాదవుల నోడింప నాలోచించుట

అని విన్నవించిన ఆ సిద్ధిరాజు
విని తమ్ములు తాను వక విచారము
చేసె:
"ఆ కామధేనువు ఆపవిఘ్నందు
కాకుంటె
చలగి యీరీతి యుద్ధంబు శాయదు
ఆవుచే సంసెను అరుదైన దళము
చల్లవారిచే మన దళము సంసెను
కొంత
చల్లవారు మందకు సఖము బలిమి
యనుచు
వుండిరి యాదవులు వురుచల్ల ఆడిగె
చల్లవారు చెల్లినందుకు సంతోష
మాయె
ఆవు దివికేగుట మనకు అది మహా
లెస్స
యిక యాదవుల చంప యంత
మాత్రంబు
మాళంగి బంటుట మంగల్లి పాట
అధిక భుజశాలియని అతనిచెప్పెదరు
సంసంగ చిక్కిన దళము చాలవున్నది
యంతైన వక్కడు యేమి
శాయగలడు
అంతకు మించిన అతిశూరుడైతె
గొదకొని మట్టింతు కొమ్ము లేనుగల
చాత
వశముగాని అవును వధియించినట్టి
యీా బోయలేచాలు
యుద్ధ రంగముకు"[22]
అని యిట్లు సహోదరులతో ఆడుచు
రాజు
వీర పరివారముతో రాజు వినమని
పలికె;
"ఆ బీరనీని హతము సేయుటకు
యేకాదశినేడు యిచ్చోటచేసి
వేకువనే దండు వేగంబె కదిలి
వుదయాన బారుసు వొక కొంత
యేర్పరచి
కదసి గోసంగుల కల్లగా జంపి
మరిపోయి గొల్లరాజు మంద
చుట్టుకొని
తరిమి యా యాదవుల తలలు
ఖండించి
పశువుల చరలను పట్టుగా బట్టి
యెసగంగ నెల్లూరికి వేగుదా"మనెను
కోపాగ్ని కన్నుల గురియుచు రాజు

---

22. యుద్ధరంగమునకు

ఆ పొద్దు సర్వ దళములు అచ్చోట
నుంచె
అంతట సూర్యుండు అస్తాద్రి కరిగె
బాగుగా దివిటీలు పట్టిరి అపుడు
తురుతు జమీనుల త్వరితముగ
పిలిచి
అప్పుడు విచ్చుకత్తులవారిని ఆయుత్తు
పరచి
పారాలు చవికీలు బందు యేర్పరచి
పనుపడి యుండంగ బాయకుదయించె
రూప కందర్పుండు ఆరూఢి నలసిద్ధి
రాజు
భూపాలు నటు దండు ప్రొద్దున గదిలె
భేరీ డమామీలు పెళ్లుకొని మ్రోవ
బారులు మంగోలిపాటను నిలచె,

## సిద్ధిరాజు రాకవిని బీరన్న గోసంగుల పిలిపించుట

ఆవేళ బీరన్న అనుజులు దాను
గొప్పైన నల్లపట్టు గుడారులోను
పరగ జమ్మఖాన పరిపించుకోని
అపైని పులితోలు అమరంగ బరిచి
పంచాక్షరి యిర్రి చర్మము పరుపుగా
బరచి
స్థిరముగా ముక్కంటేశ్వరుని
దేదీప్యముగను
పైడి జంద్యాలలో లింగాల అక్కడ
పరగంగ నిలిపి
కడు మంచి తీర్థాన గంగమైలావుల
పాలు
అభిషేకము చేసి యా బీరినీడు
పంచ ఘంటలు యల పలికించె
నపుడు
ప్రసుఖుల ఘంటలు ప్రణవంబు
మ్రోవ
తూముతో తూమెడు తుమ్మి
పువ్వులను
ఆ నీలకంఠునికి అయి పూజచేసి
తామరలు కలువలు తగు విరిజాజులు
కరముల చేబట్టి ఘనుత వేడుచును
పంచభూతములకు పరతత్త్వమునకు
స్వామికి వొక్కటి సమర్పణంబు
సేయుచు
యీశ్వరుని వేడుచు వీరేశ్వరుడై
యున్నంగ
అప్పుడు చెప్పిరి అధికారులు వచ్చి
"మసిలినేడుపుత్ర! మాకంగి గోత్ర!
సిరిదేవి పెంచిన శివుని వరపుత్ర
పశుపతి సౌమిత్ర! భద్రావతార
పల్లవాది సిద్ధిరాజు బారు లల్లవిగో!
యేనుగులు లొటపిటలు
హేరాళముగను

అల్లవారుగో! వచ్చిరి అశ్వాల నెక్కి-
మానవేశ్వరుని దండు మరివచ్చె
నదిగో!''
అని విన్నవించిన ఆ బీరునేడు
సరగ తన మదిని సంతోషమాయె
తన బంధువర్గమునకు తన
సహోదరులకు
వినయుడై కర్పూర విడియంబులిచ్చి
గొబ్బున సాహసముగల గోసంగుల
నెల్ల
గుబ్బల రంతుల కడువేగ బిలిచె
వచ్చిరి గోసంగి బలములందరును
అనువైన బిరుదులు ఆయుధంబులును
కొంగవాలు కత్తులువారు
కోరసిగవారు
బంగారు పరుజులు పట్టు కత్తులవారు
వెండి కత్తులవారు వింత పరుజుల
వారు
దండైన పడిగె జంజాలములవారు
సన్నపు తిరుమణి సంకుటరిగలవారు
సరిగె కాలి గొలుసులు సంకుటరి
గలవారు
అర్ధనాల జల్లులు అర్ధ కత్తులవారు
మాపుపిడి బాకులు మరివంకిణీలు
అమరించి బిరుదులు అరహుదాలంది
బొడ్డుగంట రంగస, బోడెపాటి
సింగన
బిడిదంపు వురుమన, పిడుగు
సూరినేడు

అర్ధగత్తి కందినేడు, అడిదెంకాచు
మెరుపుకత్తి సందినేడు,
మెడపాగు లంకు
వైరిగడ మసిలినేడు, వాలుగత్తి
మగుచు
తిరుగడల మసిలినేడు, బిరుదుల
బాలినేడు
రొంపి గడ్డం నాగినేడు, రుద్రపాగు
లింగన
కెంపుల కొమ్మినేడు, కెతపాగు
కొండ
పట్టుగత్తి పాపినేడు, బాకుల
బెమ్మినేడు
గంగులంక సూరినేడు, గల్లపాగు
బొడ్డు
కంచుటరిగెల పోలు, గంధమబ్బినేడు
నిచ్చకయ్యం లెంకుమ్మ, నెలవరి బంపు
పెద్దకత్తి వేశన, చేపోలి మాధవు
సదన సందునేడు, సమిడెక
పాకుబొమ్మ
అరిగెల గంచెను, అందెల పాగు
చెన్నుసావడి మన్నీడు, గమిడి పాగు
యెఱ్ఱు
గుడిపెట్టు గుండన్న, గుమ్మడి
పోరినేడు
కారుపోతుల సోమినేడు, కార్చిచ్చు
తిమ్మనేడు
వీరలు మొదలైన వీరగోసంగులు

వారికి కొమరు నాడాలు
కొత్తచల్లడాలు
కమనియ్యముగ చంద్రకావి ధట్టీలు
కడు రత్నములు చెక్కిన
కాలి గగ్గెరలు
కుచ్చుల తురాయీలు కుసుమపూత
రుమాలలు
వరదూసిన కత్తులు వనర బొడ్డు
ఘంటలును
కంచు టరిగెలు మంచి ఘంటల
పద్దాణములు
నీటుకోర సిఖలు నిలువు
తిరుణామాలు
వొళ్ళల్లా గంధాలు వరుగు
రుమాలలును
ఆడకాడకు శ్రీహరి అవుతారములు
బాడుచు
వేడుక కేకలు వేయుచు కొంత
మీసములు గీటుచు మిన్నుచూచుచును

తమ తొడలు సరుచుచు తాను
సొక్కుచును
కీగంట చూచుచు కెరలి పలుకుచును
తప్పెట్ల ధ్వనులకు తావెల్లయనుచు
అప్పుడు చిందులాడి ఆడిపాడుచును
మత్తేభముల రీతి మసలుచు వచ్చి
ఆరువేల గోసంగులు హరిని
దలుచుకొని
మొత్తమై బీరన్న ముందర నిలచి
వారికి అధిపతులు వచ్చిరి నలుగురు
చిన్నగబ్బి పెదగబ్బి చెన్నయ్య
తమ్ములును
చినరంతు పెదరంతు బీరన్న
తమ్ములును
అనిమొన నాల్గువేలు ఆయత్తు పడిరి
బీరన్నకు మ్రొక్కిరి భీకర
లీలతోను
వేడుచునుండిరి విభవమంతయును

## గోసంగులు బీరన్నను చేరి కీర్తించుట

"వో ఆదిజాంబవ! వొశపరి రుద్ర!
అందచూపినయట్టి అకలంక వరుడ!
మాతంగముని వరద!
మరి దివ్యరూప!
మహేశ్వరుని కృపను అతిఘోర
తపమున

వరవీర సేవ్యులై వసుధ లోపలను
శివబాధ మందిన శ్రేష్ఠకులమనుచు
ఆ మహాదేవతలు అటుపడి మారి
అరుంధతియై పుట్టిన ఆ మహామునులు
కారణమున వసిష్ఠు కన్యకను గూడె
వారి కులపావనులు అవతాగపరులు

మసిలి నేడను యొక్క
మరిపుణ్యశాలి
కులసతి మసిలమ్మ కోరిక వలను
వీరన్న వై పుట్టి విరుదు వహించి
ఫాలలోచను కృపను సిరిదేవి
పట్టివై పెరిగి
బాహుబల సేనుడా! భద్రావతార!
పరగితి భూమిలో బహు
పరాక్రముడ!''
అనియిట్లు ప్రార్థించి అమరంగ
మ్రొక్కి
ధరణి వణకంగ తప్పెట్లు వాయించి
రంతులు సేయుచు రాగడిల్లుచును
ధరణి దూమ్రము గప్ప చిందు
దొక్కుచును
విరగడల నుంచిరి విరివిగా నంత
అంతట వీరన్న అతి బలాధిపుడు
దేవపూజలు చేసి దేవునికి మ్రొక్కి
పొందుగా విభూతి పొసగ ధరియించి
చేతులో లింగాల జంధ్యాలనిడియు
కనక పువ్వులు పట్టుదట్టి కాశిగాగట్టి
వొళ్ళున వీరగంధం వొప్పుగా బూసి
తల్లి సిరిదేవి యిచ్చిన సొమ్ములు
ధరియించి
అయితన్న యిచ్చిన హస్తకంకణాలు
అన్నియు దేహమున
అలంకరించుకొని
ఆరువేల గోసంగులు యిరుగడల
అవని గంపింప
కడువేగ తప్పట్లు కంచు
కొమ్ములును
వాయింపు కొనుచు వసుధ ఘూర్ణిల్ల
ఆవులన్న పల్లికొండ అయితమారాజు
కడకు
వంగనర శలవడుగ వచ్చె వీరన్న

## వీరన్న గోసంగులతో అయితన్నను దర్శించుట

బాగుగా తమకంపైని బలరాము
వలెను
అయితమరాజు పల్లికొండ
అందమైయుండ
నడుమ కృష్ణుని వలెను నలనన్న
వెలుగ
కనుగొని వీరన్న కడుదాసి వచ్చి
సాష్టాంగ దణ్ణములు సయ్యన బెట్టి
ముకుళిత హస్తుడై నిలచి
మురియుచు బలికె:
''మా కారణము యెరిగి మమ్మ
యీడేర్చిన
ధీరుడ! పల్లికొండ! దివ్యజ్ఞానమూర్తి!
అన్న కాటమరాజ! అవతారపురుడ!

అయితమరాజు! నీవు నామీద
అత్యంత ప్రేమ
మనతల్లి సిరిదేవి మాయలుగావు
వలచంటి అమృతము సాకు వలసిన
వచ్చి
పేరుగా సిరిదేవి పెంచింది నన్ను
మీ రుణము యీచేరు మేలు
మేలసుచు
వేయు ఘటంబుల యేనుగులతోను
అనువంద నూరువేల అశ్వాలతోను
లక్షల కోట్ల పర్యంతరం
రాణువుతోను
పరగ సిద్ధిరాజు వచ్చినాగని
దొనకొండ పట్టణమునకు
ఆవులన్న కాలారితో అంపెను
జామ్ము[23]
కమ్మల వార్తలు విని అందరు
కలకల నవ్వి
వస్తిమి యరగడ్డపాటికి యిది
జయవార్త యనుచు
కడువేగ ముందరి కార్యమున
కన్నను
అంపేరని చాల ఆశతో వుంటి
నామతి యెరిగి పెంచితిరి మరి నేటి
దనుక
శ్రీహరి బొల్లావుకు శలవు యిచ్చితిరి
అంపిన పగతుల అవు అవనిపై
గూల్చి

అవువేడుక తీరెహరిపురి కేగె
శివపురికా శివభక్తుడు చేరి రాడాయ
మీ అందరి ముందర యీ
ఘడియనైనా
యుద్దము[24] శాయను పంపుడీ
యిప్పుడు నన్ను
తలపడి పగతుల తాను హతము సేతు
మీ కన్నులను చూచి మది వేడుక
పడుచు
తమకముపై నుండి నా ప్రతాపమెల్ల
రంగుగా చూడుడీ శ్రీరాములార!
అన్నలు తమ్ములు అల
బావమరదులు
అందరి ముందర నేను అనిసేయు
విధము
అందముగా గూచుండి
మా యన్నలార!
సీతకై హనుమంతుడు చేరి యాలంక
కాల్చి దగ్ధము సేయుకైవడి నేను
కరుల నురుమాడుదు రణకల్లి
సేయుదును
ఘోర్గించి నరుకను కొంగవాలుకత్తి
పట్టుకత్తి శలవిచ్చి పంపవలె నన్ను"
అని విన్నపము శాయ అందరు
పొంగి
హరిగురువు పల్లికొండ ఆనతి యిచ్చి
సరగ మరుగుననున్న ఛాయల కత్తి

23. జాబు 24. జానపదుల ఉచ్చారణలో 'యిద్ధము'

తరముల నాటి కత్తి తగనుంచె
భువిని
చిలికించె కస్తూరి శ్రీగంధ మర్పించె
ప్రార్థించి యాకత్తి పరగ శలవిచ్చి
అంతట బీరన్న అతి వేట్కతోను
పల్లికొండ రాజుకు పరగంగ మ్రొక్కి
శలవంది ఆకత్తి చేరువను నిలచి
హరి హర బ్రహ్మదుల అందరిని
ప్రార్థించి
సిరిదేవి కొమరక్కను చింతలో
తలచి
పల్లికొండను దలచి బత్తిరెన్నకు
మ్రొక్కి
బొల్లావు బసవన్నను బోరున దలచి
అవులన్నను కీర్తించి అయితమ
రాజును కొనియాడి
ఆ వీరభద్రుని అపుడు ప్రార్థించె:

## వీరభద్రుని ప్రార్థించి బీరన్న బీరము సూపుట

"వో దక్ష సంహార! శరభావతార!
నీది ప్రతాపంబు నేడు నాకిమ్మ
మా తండ్రి మసిలినీడు తల్లి మారమ్మ
నీ పేరివాడను నీబంటు నేను
నిన్ను పూజించి నీ పాదతీర్థంబు
అనుభవించి నీవు అటువేగ వచ్చి
పురివిలో వారి గర్భాన వుత్పత్తి
చేస్తివి
బీరన్న యను పేరు పెట్టె మాతల్లి
యీపట్ల నీమూర్తి యియ్యవో దేవ!
నీమూర్తి కలిగితే నిఖిలంబులోను
సమరంబులో రిపుల చక్కు
సేయుదును"
అనుచు ప్రార్థించంగ ఆ వీరభద్రుండు
తన విశ్వరూపంబు దయచేసె నపుడు
బిరుదుగల బలశాలి బీరినే డంత
పరగంగ ఆకత్తి ప్రార్థింప దొడగి:
"పిడుగుల తునియ! వో పట్టుకత్తి
నీ పదును నీ బలము నేను
యెరుగుదును
దేవకి తనయుండు తెలియ
నిన్నెరుగు
కావించిన ఆ విశ్వకర్మ తానెరుగు
యితరులు నీ మహిమ యరగ
రెవ్వరును
కృతయుగము నాడు దేవతులలోను
భైరవు అను పేర భైరవకత్తి
వీరభద్రుని పేర వెంయు వాలంబు
వాటికి సాటిగా వర్ణింపదగును
ప్రళయమైన పిడుగుల బట్టి బంధించి

గోసంగి పేరిట కొంగవాలుకత్తి
వసుదేవ తనయుండు వసుధగల్పించె
ఆ అవుతారము విడిచి అ కృష్ణ
స్వామి
ఆ వంశమే యని కాటమరాజై
యిపుడు కదనమేర్పరచె
వున్నారు యాదవులు వృగులై
యిపుడు
యాదవులకు ముందర అవు
సమరంబు నిత్యంబు
మాధవ బంటుకు మరి పంపు యనుచు
ఆనాడు శ్రీహరి ఆనతి యిచ్చె
చారపులులు తనకు జాగిలాలాయె
విరుగడల కదసిన విమతుల హల్ప
ఆత్మ రచితముగ నాకు అవుసరము
కలిగె
పరగంగ నీవు నాకు పంపితివైన
భూమినున్న కత్తి నాదు భుజముకు
రమ్ము
నా మనస్సులో చాల నమ్మిక
కలదు''
అనుచు ప్రార్థించంగ ఆ పట్టు కత్తి
అతి వేగమున యెగసి హరులెల్ల[25]
చూడ
వలపటి భుజమందున వాలెను కత్తి
కత్తి భుజమున నిలచిన
కడు సంతసిల్లి
కత్తికప్పుడు నమస్కారంబు చేసి
పరుజులో చెయివేసి పదిలముగ బట్టి
పట్టెడలు కట్టెను పాలు పోయించి
పట్టు తాళ్ళతో పట్టెడలు దూసి
ఘనమైన సింహపు గచ్చుటరిగెలంది
తన మనస్సుకు బుద్ధి మార్గంబు
జెప్పె:
'యెరుక మరిపించి జీవాత్మ యెమునిసన్నిధికి
పోవక పరమాత్ముని చారపోవలె
మనుస!
వైరుల పొడగని విరుగకే మనుస!
మేరువ కంటెను మింతువు గాని
అదరకే వో గుండె! ఆయుధంబు
చూచి
వుక్కుగుండై పగతుల
వుడికించవలెను
చెదరకే వో మనుసా! పెల్ల
ప్రోతలకు
ప్రోతలకు యెదురెక్కు ప్రోగవలె
గాని
పొరలకే వో ప్రాణి! పోరుబలములు
చూచి
జడియక కల్లుగా చంపుదువు కాని
పగతులు చాలరని వో కత్తి! పదును
దియ్యకుమి
మదగజములు బరిమార్తువు గాని'
అని యిట్లు తన మనస్సు అంతయు
చెప్పి

25. అరులెల్ల

తన మరిది చెన్నయ్య తానును
మరియు
ఆరువేల గోసంగులు అతి శూరులై
వారు
మెండుగా యిరుమేల మెరసి రాగాను
ధణధణ తప్పెట్లు ధరణియు మిన్ను
కడు ధ్వనులు చలగంగ
కర్కటిలుచూను
భుజ బలాధిపుడై కదలె భుజశక్తి
మెరసి
వరదీసి యా కత్తి పడి ఝుళిపించి
చెలగి పుసవడి చేసి తాచౌకళించి
ధరణీశ బలములు తప్పక చూడ
మెరసి కేకవేసి మీసంబు తీడి
కత్తి బల్మి తనకు కల్గిన సత్తువ
చిత్తంబులో చాల సింహాగ్రు డగుచు
కదసి చెరకుగోల ఖండించినట్లు
యెదురున్న యా మద్ది
యాటవాలుగను
మరివై చినట్టి యామాను ఘూర్ణిల్లి
మోడు మీదాయెను మొనలు కిందాయ
వాటున ఆ మాను వసుధపై పరిగె
మాను వరగంగను మన్నీలు ధొరలు
మానవేశ్వరుండును మంత్రి వర్గంబు
అంతయు నటుచూచి ఆశ్చర్యపడిరి:
'యింతటి భుజశక్తి యెవ్వరో
యితడు
వక్క వేటున మాను వురివిపైపడెను
చక్కగా నరికెను చెరకు చందమున
మాను తృణముగా నరికె
మానవులెల్ల
వెయ్యి రెండు వేలైన యీడనరాదు
పణతి వితని తల్లి నోము ఫలమెంతో
గాని
యితడు స్వామిపూజ యేమి
చేసినాడో
యితనికి పీశ్వరుడు యెటుకలె
యిచ్చెనో వరము
యింతటి రాజ్యంబు యేలితిమి గాని
యింత బలాధిపుడు యెక్కడా లేడు
కపులు వనచరులు అని కథలు
చెప్పుదురు
భీమినేడు: వారి మందకు
పిన్న పెద్దవై నీవు
ఆ మందలోకి అటు పోయి వత్తువు
ఆ మందలోకెల్ల అతిశూరుడితడు
యతని పేరేమి? భీమన్న!
యెరిగించు' మనెను

## భీమన్న సిద్ధిరాజుకు వీరన్న నెరిగించుట

అప్పుడు భీమన్న అతివేగమునను
చెప్పంగ దొడగెను సిద్ధిరాజుతోను
'మానవేశ్వర! వారి మంద లోపలను

యేనుగులతోనైన యెదిరించ
గలవాడు
భీమ బలశాలియని పొగిడించు
కొనుచు
యంతైన చల్లవారి యరనన్న
వకడు
అతనికన్న మహాఘనుడని
చెప్పుదురు
అమరంగ జాన కంటెను
కరియావులరాజు

కదమవారు అందరు మనసుగలవారు
కాని
కారణంబున మాతంగి కన్య
గర్భమున
వీరభద్ర వరమున వెలయ జన్మించె
ప్రేమతో నూకాంబ పెంచిన కొడుకు
ప్రియమార నామంబు బీరినేడంద్రు
పుడమి వీరికి సాటి భుజబలులు లేరు'
అని విన్నవించిన ఆ సిద్ధిరాజు
విని రాజు తమ్ములతో యిట్లని
పలికె:

## బీరన్న శక్తికి నలసిద్ధి భ్రమయుట

'వీని ఘాత్రమునకు యీ భుజశక్తికి
ధరమీద భద్రావ తారుడు గాకుంటె
నరుడైతె ఆ మాను నరకంగ లేడు
మర్రి నరికిన వాడికి
మర్రి వూడలన యంత?
అరయంగ సారసత్తులైన చందంబు
మాను నరికిన వారికి మానవులు
యీడు గారు
యేనుగ ఘటలను యేర్పరచు'
మనెను
మనుజేశు మాటలకు
మదగజంబులును

అనిమొన యేర్పరచిరి
అటువేగ మరియు
పణ్ణెండువేల యింటివాడు[26] పర్దాల
పిన్నయ్య
వన్నెవెయ్యి గుర్రాల
వంకిణీయులును
వాటముగ నుంచిరి వైనవైనాన
అశ్వాల బారును ఆయత్తు పరిచి
బగులుగా తుపాకి మొనలు బాగుగా
వుంచి
బారులు యేర్పరచె భానుకులాధీశు

26. వింటివాడు

## వీరన్న నలసిద్ధిపైకి నడచుట

బైట బారులై వుణ్ణంగ బలముల జూచి
వుగ్రుడై వీరన్న వురిమి తా చూచి
చేతి పట్టుకత్తి చలగి ఝుళిపించి
తళుకు తళుకున మెరసె పగతులు
తందరకుడువ
బాతుపై నెగసు భైరవు చందాన
కొదకొని వీరన్న గోసంగులు తాను
మద గజంబులు మీద మరివేగ
కదిసె
కదిసిన యా భద్రగజములు
డీకొలిపిరి
మసిలమ్మ పుత్రుండు మార్కొని
నిలచి
ఆదలించి మెరువడి అందె తాటించి
దట్టించి అందెలు ధళధళ యనగ
యేటికి మచ్ఛములు యెదురెక్కినట్లు
కొండలై వచ్చేటి ఘోర గజములను
తొండాలు తెగనరికిన తునియలై రాలి
మొండాలు యెగురునని
మొరపెట్టుచుండు
ఆ మీద చెలరేగి ఆగ్రుడై మండి
దామన యాటలను నరికినయట్లు
దండి యేనుగల నెల్ల ధరమీద గూల్చె
చన్నయ్య చెలరేగి శానలు మీద
బారుల తెగటార్చె బాపురే యనుచు
గుబ్బులు రంతులు కటసి
ఘుఘుగడల
చెలరేగి నరుకుచు చేబాకులాను
గుప్పించి గుద్దిన గుండెలు చినుగు
గోసంగు లందరు ఘోర యుద్ధంబు
యడలేక విమతుల ఖులగూల్చగాను
వీరభద్రునిపోలె వీరన్న యప్పుడు
కదసి కొమ్ము లేనుగుల
కల్లిలో గూల్చి
కుంభ స్థళములు నరికిన మెదడు
కుప్పలై యుండు
మదగజంబులమీది మావుటీలనెల్ల
తృణమాత్రముగ జూచి
తెగనరికివైవ
అంబారి యిలమీద అదునేదార్లు
చిత్తు చిత్తుగబట్టి చెల్లించి నరికిన
వాటు వాటున వరిగిరి వడుసు
మన్నీలు
ఘోటకంబుల వారు గొదకొని
కదిసిరి
యీటెలు నేజాలు యినుప శూలాలు
వీరినేడిపైని బెదరక దాచిరి
తన అరిగె తొగడలు తప్పించి దూరి
కరవాలములు అన్ని ఖండించి వైచి
పౌరుషంబున తన పంతంబు మెరయ
రణమున ఆశ్వాల రౌతులనెల్ల
దురమున వేటాడు తునియలుగాను
వైచను కొంగవాలును వాటికే తగును
అశ్వాల నరుకంగ ఆశ్చర్యమంది

పణ్ణెండు వేల విలుమూక పర్టాల
పిన్నయ్య:
'యేనుగల నరకంగ మనము యేమి
కాయగలము?
వీడు కొలువుచు రాజు వెనక
వున్నాడు
రణమువెళ్ళి వురుక రాత్రి గాదాయ
ఆయువ నూరేండ్లు నేటితో ఆయను'
యనుచు
పర్టాల పిన్నయ్య పరగ విలుమూక
అప్పుడు కదిసి యా అంపవర్షంబు
ఝడివాన కురిసిన చందమున వేయ
పరగ రివ్వు రివ్వున బాణాలు రాగ
చేకత్తిన తట్టిరి చెలగుచు వాని
తాటించి అరిగెలను తట్టిరి వాని
యనలేక బాణాలు యగదట్టి మింటికి
బీరన్న పర్టాల పిన్నయ్య నంత
వెన్ను తునకలు గాగ వేసె
నార్చుచును
పన్నెండు వేల విలుమూక బాగుగా
చూడ
రెండు తునియలై రొప్పుచు వరిగె
పన్నెండు వేల దళమును బీరన్న
పారంగజూచి
దోమలను కత్తిని నరుకుతే తొలగును
గాక
యీ దోమలకు నాకు యీడు
గాదనుచు

జాగి లాల పట్టెండ్లు జరజరదీసి
ఘనమైన జాగిలాల యేనుగుల మీద
గవియించి
చిక్కిన జాగిలాల కానపై విడిచె
చవుకళించి కదిసి జాగిలా లపుడు
బెబ్బులి సంబెట పెనగి యేనుగల
గబ్బితనమున యేనుగల గద్దించు
కరచు
గాలి జాడల తీసి గయ్యాళివాడు
నరుల కాళ్లబట్టి నయముతో యీడ్చు
సాళ్వపక్షి యను జాగిలము కదిసి
సాగబట్టి రివుల చంపంగ సాగె
బేతాళ సరిపెన బిరుదు గజములను
గూన గుర్రాలను గొదకొని కరచు
కొందరు గోసంగులు కోలాహలము
గాను
పెద్దకత్తులు ఝళిపించి పెనసి
నరుకంగ
వారు అల్లనంతంత వడి చార గాను
పటార్ల పిన్నయ్య బలమెల్ల వరిగె
నలసిద్ధి రాజుకు నమ్మిన బోయలు
ఆ బారుల బీరన్న బాగుగా చూచి
ఆ నాయకునితో కదిశ ఆ బీరునేడు
వొన్నె వెయి గుర్రాల
వంకిణిమల్లుతోను
చన్నయ్య పోరాడె చిత్త విత్తుగాను
చిన గుబ్బి అనువాడు చన్నయ్య
తమ్ముడు

మిణుగురు బొమ్మతో మెరసి
పోరాడె
మరియు పెదరంతు మహా
రోషమునను
పరకసాని అబ్బితో పట్టి పోరాడె
వారి వారికి తగిన వారితో పోరి
నడి కల్లిలో నిలచిన సలసిద్ధిరాజు
మళయాల సాహసు(లు) మరి
పీడుకొలిపె
చిల్లర గోసంగుల మీద చెలరేగి
మించి
గూడెగాండ్లను బట్టి గుదులుగా
గ్రుచ్చి
వంకిణి మల్లును వడి ద్రుంచి వైచి
కొంకుల గాలాలు గుప్పంగ సాగిరి

గొల్లర్ల లాడెల్ల గుమి జొచ్చినట్లు
పోర్లించి పొడిచిన చెల్లిరాక కొంత
అప్పుడు విమతుల ఆజిలోపలను
కూల్పంగ శిరసులు కుప్పలై వుండు
రణమున సంసిన తలలు రాసులై
వుండు
గుబ్బలు రంతులు కదసి పొడిచినను
ఘోరాజితో సంసి గుట్టలై వుండ్రి
ఖార్మఖంబున బీరన్న కత్తి
విసురులకు
తలలెగసి నూలేసి ధరణిపై బడును
గుంపులు బడిరంత గోసంగులు చాత
రాల బలంబులు కరులు లొటపిటలు
నేల మీదను యుండె నెరపిన యట్లు

## సిద్ధిరాజు సరదార్ల పరాకుబాపుట

ఆరాజు చూచియు ఆశ్చర్యమంది
మండలపతి రాజు మన్నీల బిలచి:
'సరదారులారా! వో సాహసులారా!
హరులకు వాడని అతిశూరులార!
కరిఘోటకములను కాల్బలంబులను
మరి మావటీలను మంచి సరదార్ల
దొరకొని గోసంగులు త్రుంచి
రందరిని
వకరికి వకరైతే వదుగ రెవ్వరును

యిఖ మీరు సేయుడా యేక
యుద్ధంబు'
అనుచు తుపాకులువార్ని ఆనిమొన
నిలపి
యీటెలు బల్లాల వారితో యిట్లని
పలికె
'పొందుగ రంజకం పొగవెంట ధూకి
సాహసంబున గోసంగుల సమ
యించు' మనెను

బాగుగా బోయలు భళి భళీ యనుచు
తమ మందుగుండును తగ బారు చేసి
సంధించి రంజకం సయ్యన బోసి
జానకి తాళ్ళు చకచ్చంగ రగిల్చి
భూనభోలోకములు భోరు కలుగంగ
కొండలు ధ్వనులిచ్చె గుబగుబా యనగ
దండైన గోసంగి దళముల మీద
వడిగండ్లతో తొలకరి వాన గురిసినట్లు
తొడబడ గురియించిరి తుపాకిగుండ్లు
వెనువెంట బాణాలు వెసకాల్చి విడిచి
పోడిమి త్రొక్కుచు బల్లాల మూకలు పొగవెంట దూరి
ఘోరించి పొడిచిరి గోసంగులు అపుడు
కడసి గోసంగుల కల్లుగా జంపి
తుపాకి గుండ్లు గోసంగులకు తొడిబడ నెల్ల
చిత్రవాన కురిసినట్లు జొత్తు చినుకులును
గుండ్ల వెంటను రక్తము కురియంగ సాగె
ఆ మందు పొగలకు ఆ రవధూళి
మరి యెగసె మింటిపై మబ్బు చందమున
కావుకులో బీరన్న కత్తి ఝళిపించ
మెరపులై మెరిసెను మిన్ను గంపింప
తాటించి నరుకుచు ధర గూల్చె నపుడు

## గోసంగి మూకలు, బీరన్న వైకుంఠమున కేగుట

ఆరువేల గోసంగులకు అంబులు నాటె
నకసిక పరియంతరం నందటికి తగిలె
ఆవేళ దేవతలు అటు చోద్యపడగ
బాగుగా గోసంగులకు అతి భారమాయ
తుపాకి గుండ్లకు బీరన్న గుండెలు తునిగె
దయ్యేక తన వంతు పగ సంపెను గనుక
శ్రీ మహాదేవుండు శివలింగ మూర్తి
తన వరపుత్రుడు తన భక్తిపరుడు
చాలగా అలిసెను నా సముఖానవైన
అలుపు దీరగ నుండు అని తలచి నపుడే

ఖారపు గాయాల బీరన్న పరనూ
తుమ్మని తలచె
పైకొన్న అంబుల పొప్పపై వరిగె
కుడి యడమ వరిగిరి గోసంగు లంత
జాగిలాలు బీరన్న సరసను వరిగె
దండిగా గోసంగులు ద్వాదశినాడు
వైకుంఠమునకు వారెగి అరిగిరావేళ
బీరన్న చెల్లెను పృథ్వికంపింప
వారి మందకు గమిడి వడి దీసినట్లు

మన్నీడు చెల్లెను మంద బలిమి తీసె.
రణమున వరిగిన రాణువను చూచి
అప్పుడు సిద్ధిరాజు ఆశ్చర్యపడెను
యిటు మీద యాదవులు యెంద
రున్నారొ
అబ్ధిలో ప్రొద్దు గూకినయట్లు
అవునేమొ యనుచు
కడువడి చింతించి ఘనధైర్యముగను
మగుడి తన సేనకు మళ్ళెను రాజు

## నల్లసిద్ధి కొప్పుకొండలో దాగబోవుట

అచ్చోట నుండక ఆ ప్రొద్దు రాజు
కొప్పుకొండకు దండు గొబ్బున
నడిచె
కొప్పుకొండన వున్న కొమ్ము
కసినేడు
అంతట కనుగొని ఆ బలములు చూచి
భూలోక మాతను భోరున దలచి
కుంభిణి ఘూర్ణిల్ల కొమ్ము నాదించె
కొండలు ధ్వనులిచ్చె కుధరాలు వరిగె
గండ భేరుండములు కదలి భీతిల్లె
మృగములు శార్దూలములు పారిపోవ
గగనంబు చెదరి చుక్కలు
వ్రాలుచుండె
పెడచాత కొమ్మంది పెనుధార పట్టె

గణుతింప యాదవ ఘనులెల్ల వినిరి
తలకొండ పాటను దారశించి నేడు
వలనొప్ప దళములు వచ్చుట జూచి
తన బలముతో తాను తగగ నిట్లనియె
'రారోయి ఘనులార! సిద్ధిరాజు
యీవేళ
బీరన్నచే రణమున బెగడి భీతిల్లె
బలములు చెదరి యిట్లు పారిపోదలచి
యిక్కడ మనమున్న
వివరమెరుగును కాదు
కొప్పుకొండను మంచి
గృహాలున్నవనుచు
విడిబడి వచ్చుట విధమెల్ల చూడుడు'
అని యిట్లు పలుకుచు అయిత్తు పడగ

కూచిధార పట్టెను కొమ్ముకశినేడు
ధారానాదమును విని రాణేవారు
అతివేగ వచ్చిరి ఆ వీరఘనులు
మంతనంబుగ ఆ స్తమానంబు వేళ
తను జేరవచ్చిన దార శింబినేడు

కస్తూరి కుంకుమ గంధంబు లిచ్చి
అందించి రణమునకు
అరుదెంచమన్న
సిద్ధిరాజు బలములపై శానలు గదిసె

## కొప్పుకొండలో కొమ్ము కశినేడు తారసిల్లుట

కదిసిన సిద్ధిరాజు కలవరమంది
తన మంత్రివరులతో
తలపోసె నపుడె:
"శ్రీహరి బొల్లావు చేసిన
యుద్ధమునకు
యెదలేక పీనుగులు వెండి నిండగాను
ఘనుడు బీరన్నచే గజములు
అశ్వములు
బలములు యెడలేక పడియుండె
రణము
సంసిరి గోసంగులు సందులేకుండ
రాత్రి రణమున వుండరాదనుచు
మనము
బయిలని వచ్చిన యిక్కడ వారి
బలము వున్నాడి
యాదవ బలములే యుందు
చూచినాను
అయినా కొదువయు అనుమానమేల
సాధింప వలెగాక సమరంబువందు

మగడి వచ్చిన దళము మళ్ళిపోకుండ
మన బలము చుట్టుకొని
మాటాబులెత్తి
సమరంబు శాయు"దని
శలవిచ్చె రాజు
కాలిదళములు కదిసె కనకపొడి రాల
అశ్వాల దూకించి యాదవుల
అంది నరుకంగ
కదసిన అశ్వాల యాదవులు కల్లుగా
జంపిరి
దార సంబినేడు కదిసె దళముల
మీద
యోధ బారుల తెగటార్చి
బాపురే యనుచు
వారు వీరును కదసి వజ్రాయుధముల
వంకీళ్ళను కదిసిరి వజ్రీలు కొంత
చెలరేగి పోరాడి చెల్లిరాక కొంత
చేరి యిండ్లతో కలసి చలగి
చెట్లాడిరి

రొమ్మున అంబులునాట రొప్పుచు
పడిగిరి
యిరువరులు సమసిరి యొకడయు
లేకుండ
తరవళ్ళ కత్తులు తరచుగా నాటి
యాదవులు వక లక్ష బలమీద
గూల్చి
అక్కడ సిద్ధిరాజు బలముతో
హతమైరి యాదవులు
రణమున యాదవుల చంపి
లక్షగోల్పోయి
నాలుగో జామాయె నట చుక్క
పొడిచె

శుభ్రకిరణాలతోను
సూర్యు డుదయించ
రాణాలి వారిని తగ సంహరించి
దేశాల కేతెంచ ధీరుడు రాజు
సరదార్లతో రాజు చయ్యన ననియె:
'నేడు యెవ్వరి మీద నెదిరించవలెనో
యెదిరించ రాకున్న యాదవుల మీదికి
ఘడియ రెండు ఘడియలకు కదసి
బోవలెను'
అని తమ్ములును తాను
ఆడుచుండగను
'అవును అవు'ననుచును అందరావేళ
యెదురు చూచుచు నంత
విమతులై యున్న—

---

## నాల్గవ కాండము

# కటియావుల రాజు యుద్ధము

## అయితమ రాజాదులు నలనన్న కడకు వచ్చుట.

మూడు నదులు వకచోట మొనసి
యున్నట్టి
కైలాసముకు దీటుగా ఘన సంఘ[27]
మందు
ఫాలలోచనుడున్న భావంబు దెలసి
ఆవేళ పతివేట్ల అయితమ రాజు
శిష్యుడై తనపాలి శంభు పూజింప
గురుతైన కన్నిక గుణ్ణంబు నందు
జలక మొప్పగనాడి ధవళములు గట్టి
భసిత త్రిపుండ్రంబు భవ్యరుద్రాక్ష
స్ఫటిక హారములు పరగ ధరియించి
మల్లెలు మొల్లలు మరి జాజి పూలు
చల్లగా వాసింపు సంపెంగి పూలు
ముకుళములై విడుచు మొగ్గ
తామరలు
విరులు చామంతులు విరులైన మంచి
మరువంపు పత్రియు
మాచపత్రియును
మారేడు పత్రియు మరి జమ్మి పత్రి

కరకంఠ ప్రియమైన కలువలు
మొదలు
అగరు శ్రీగంధంబు అక్షింతలూను
వేర వేర అన్ని వైనాన దెచ్చి
సజ్జముఖంబున చలువలు పరచి
పరమేశ్వరుని అందు బాగుగా నిలిపి
పంచామృతంబులు బాగుగా దెచ్చి
పంచాక్షరీ మంత్రం పఠన గావించి
మరియును వేద మంత్రోదకములు
అభిషేకములు చేయు ఆ సమయమందు
యేకార్తి పంచార్తి యలమి షడార్తి
మంగళార్తులు బాడి మరి పూజచేసి
రమణతో మహిసాక్షి సాంబ్రాణి
ధూపము
అరయంగ శివునికి అర్పించి నిలిచి
ఆ పార్వతీరమణు అపుడు ప్రార్థించె
"శరణు గిరిజానాధ! శరణు లోకేశ!
శరణయ్య భూదేవ! శరణు పరమేశ!
భవదూర త్రిపురాంత భక్త మందార

---

27. సంగ

నంది వాహనుడ! ఆనంద భూతేశ!
యిందుశేఖర! మాకు యిహపరము
లిమ్ము'
అని మ్రొక్కి శంభుని అపుడు
ప్రార్థించి
అనికి ముస్తీబాయ ఆయితమ రాజు
చల్లాడము దొడిగెను సరిపొద్దు వేళ
వనర శ్రీగంధంబు వొప్పుగా బూసె
ఆలములో తుపాకి గుండ్లు
ఆయుధంబులను
నరికిన తెగకుండ నటు దూర కుండ
వజ్రాంగి తొడిగెను పల్లవుల రాజు
వింతగా శిరమందు పీరజడ అల్లిరి
విరజాజులు తురిమి వేడుక మీర
పరగ మాణిక్యాల పతకంబు
ధరియించి
పచ్చల కడియములు పషిణి
వుంగరములు
మెచ్చైన తావళం మెడనూలు వేసి
అడపగాడు అంతట ఆకు చుట్టియ్య
పనిపడి తేజీల పల్లం గట్టించి
పట్టపురాజు ఆయితన్న పైనము గాగ
అలాగు బాలరాజులు అందరు నపుడు
పాలేట స్నానాలు బాగుగా చేసి
జంధ్యాలు వేసుకొని జాహ్నవి వేడి
అప్పుడు పీరగంధం బలదిరి మేనున
కస్తూరి బొట్లు కడు ఘనముగా దిద్ది
ఘన బాహులందున కడియములు
పెట్టి
రంజితమైనట్టి రత్నహారములు
తగ నొప్ప భూషణాలు ధరియించి
రంత
పుత్తడి వువ్వుల కాళలు గట్టిరి
చలగి సూర్య కటార్లు చేపట్టుకొనిరి
ముత్తైదు లొచ్చిరి ముదమొప్ప నంత

## కరియావుల రాజు యుద్ధసన్నద్ధు డగుట

కరియావుల రాజు కడు సాహసమున
ధీరుడై నెలవంక తిరుమణి దిద్ది
పురమున పీరగంధం వొప్పుగాబూసి
కరముల చామపూ కడియములు
పెట్టి
మేలైన రత్నాల మెడనూలు వేసి
డాకాల పెండెంబు ధరియించె నంత
బిరుదులు ధరియించి పరువడిని వచ్చి
నలభై మూళ్ళదట్టి నడిమికి గట్టి
యేకాంగి భీముని యినప రాగోల
వకనిచే పట్టించ వోపైన యట్లు
వనరైన చెంగావి వలిపెంబు గట్టి
కరియావుల రాజు గజముపై నెక్కె
అందరు అశ్వాల అమరంగ నెక్కె

కదనము శాయను మాకు కట్టడి
గలదు
వో నరనాథ! మీ యెదుట వాడల[28]
భంగి
చాటున్న గుడార్లు చక్కగ బట్టించు
వాటముగ యెత్తించు వాడ
లేర్పడును"
యదు వంశకుల తిలకు విమల
మతితోను
అనిన మారాడక కాటమరాజు
ఘనమైన గుడార్లు కడకు బట్టించ
కనుదృష్టి యుద్ధంబు కానవచ్చేటట్టు
యనయంగ బారులు యేర్పరచగాను
కలికి జగన్నాథు కడనుండి
యపుడు
తటుకున దన్నేరు దాసల్లు వచ్చి
పశుపతిని పొడగని పలికి యిట్లనిరి:

## జగన్నాథునికి నలనన్న అప్పనములు సమర్పించుట

"వసుమతి యాదవ వంశకుల
తిలక!
నరనాథ నీవు జగన్నాథం
దరిశనమున
వరములు నాలుగు వరుసతో నడిగి
యిప్పించుకొని పస్తూ ఆ దేవునికి
అప్పెనం వడబడి మీరు అంపమంటిరి
మూడు వేల వరహాలు మున్నూరు
ఆవులు
మూడు పోతుటెద్లు ముదమొప్ప
వినుడు
పరగ రాచకుమారుని బంగారు
పాలకి
యీ వస్తువులనెల్ల యియ్యక మీరు
సాహసులై యుద్ధమునకు
చపదెంచవలదు
అడుగు దర్శక స్వామి అంపు
వరమిచ్చి
సరగ మమ్మిప్పుడే జగన్నాథు
కడకు
పంపవయ్య స్వామి ప్రసాద"మనగ
కడు సంతసిల్లెను కాటమరాజు
తన యన్నదమ్ముల డాయంగ
పిలిచి:
"వినుడు సాహసులార! వివర
మంతయును
వనర జగన్నాథునికి నేను వొప్పింది
నిజమె
పంపక తీరదు మన పని సాగకుండ
దాసుల పంపింది స్వామి దయ
అంతె చాలు

28. ఢఢల

వసర మన అందరిలో యవరైన
వకరు
జగన్నాథుని కావ చేయుచునుండ
యవ్వరు బొయ్యేరు యెరిగించ''
మనెను
నలనన్నతో ననిరి నవ్వుచు అందరు
''అన్నరో వో యన్న! అవులన్న!
వినుము
యెన్నెన్ని యేండ్లకు వేడుక మీర
యుద్ధంబు గలిగెను అన్నా!
యిప్పుడు మాకు
కళలు గులుకుచు మిగుల వీరకాశలు
గట్టి
ఆ వీరగంధం ధరియించి మిగుల
ఆయుధాలు అందినాము నీ
కన్నుల యెదుట
మేము యుద్ధము చేసేమే కాని
అనుచు మాకిట్లు సంతోష
మయ్యుండగాను
వొప్పుగా యిందరిలో వకరు
అయినాను
అప్పెనపు కాసులకు అరుగంగలేము
అర్థ విహీనులకు పరిశ మబ్బిన
చందాన
ఆకొన్నవారికి పరవాన్న మబ్బిన
యట్లు
కాలారి లొటిపిటలు కరితురంగములు

వడిమీరి సిద్ధిరాజు వచ్చి యున్నాడు
ఆ సిద్ధిరాజుమీదికి కలవిచ్చి మమ్ము
యుద్ధంబు కాయను పంపుదువుగాని
కుటిలారి హరిదుర్గ కొలను[29]
వుండంగ
యిటువంటి పనులకు అంపకయ్య
మమ్ము''
అనిన మారాడక కాటమరాజు
ఘనుడైన తన బావను కనుగొని
పలికె:
''పందెముల వో బావ! పల్లికొండ
రఘుపతి!
యవ్వరిని బొమ్మన్న
యిట్టాడుచున్నారు
యవ్వరు పోవలెనో యెరిగింపు
బావ!''
మత హేష్యము యెరిగిన ఘనుడు
పల్లికొండ
యెతి పట్టభద్రునితో యిట్లని పలికె:
''విమలాత్ములార! మీ రందరిచ్చోట
కదనంబు కాయను కట్టడి గలదు
థందు సహోదరుడు
థయపావనుండు
అందరికి కడుపిన్న అల్లు దాడెన్న
యితనితో యుద్ధము కాయను
యవ్వరు లేరు

29. కొలవన్ను

అతివేగ కటకానికి అంపవలయు యితని
యితడినుంచి మన వంశం యిల రూఢికెక్కు''

## అల్లు దాడెన్న కటకమునకు ప్రయాణమగుట

పల్లికొండ యీ రీతి పంపుశాయగను
కాటమరాజు అయితన్న కలకల నవ్వుచు
అల్లు దాడెన్నను హరికించి పిలిచి
అనుగు కుమారునికి హరుష పుట్టించి
కనకదండె పాలకి ఘనత దెప్పించి
పాలకికి యనమండ్రుడు బెస్తల యేర్పరచి
అల్లు దాడెన్నకు పదహార్గురని యిచ్చి
ముందుగా వరహాలు మూట గట్టించి
మందలో మున్నూరు అవులు మరి వేగ యేర్చి
ఆరూఢిగా మూడు అబోతులాను
కానుక లేర్పరచి జగన్నాథమునకు
గోవుల తోలను గోపాలకులను
పేరుపేరున యాదవుల పిలిచె నావేళ

మురహరుని సేవలకు ముక్వల రంగదాసు
పరమ వుపకారి యా పెయ్యావుల చెన్ను
దేవుణ్యావులు గాచు ధర్మవర్ధనుడు
కావటి కదిరిని కరుణతో బిలిచి
వారికి భత్యాలు వరుసతో నిచ్చి
"అన్నలార! మీరింక ఆవుల దోలుకొని
వెన్నంగ మీ కుటుంబాలు వెంట బెట్టుకొని
పుణ్య పురుషోత్తముని చూడ పొండి వేవేగ"
అనుచు కొమారునికి అటు వప్పగించి
పరగ దాసులతోను ప్రసాద మంది
అందరిని పైనముచేసి అటువేగ పంపి
ప్రసాదంబు పంచి పెట్టించె పరిజనంబుల కెల్ల

## పల్లికొండ పగల నేర్పాటు చేయుటు

"యినకులాధిపు దండు యెత్తించి రాగ
దేశాధిపతులెల్ల ధీరులై రాగ

పందుముల వో బాప! బహు దివ్య పురుష!
పైకొని సిద్ధిరాజు బారుల గదసి

యెవ్వరెవ్వరితోను యెదిరించ వలెనో
యెవ్వరికి దొరకునో యుద్ధంబుశాయ
పగలను యేర్పరుచు ప్రఖ్యాతి గాను
పంపవే యిట మమ్ము బలము
మీవికిని"
అనిన పల్లికొండ అంతలో దెలిసి
వయ్యన వారితో పనర యిట్లనియె:
"యందరికి పగదళము యీడుగా
లేదు
కయ్యాన హతముగా మనకు కట్టడి
గలదు
వారిలో నకిరొకరు వైన వైనాన
యిటువలె పోట్లాడుత నే జెప్పినట్లు
కరియావుల రాజు! కదసిన బలములు
తోను
యర సిద్ధిరాజుతో యుద్ధంబు
శాయుమా
భట్టావుల వల్లభన్న! పరగ
నీ బలము తోను
మట్టి మల్లాడుమా పాప సిద్ధిరాజును
గండ గోపాల రాజు కస్తూరి సిద్ధి
రాజు తోను
ముందుగా అయితన్న! మెరసి
పోరాడు
పురువుగా వుండవెల్లి విరిగోపు తోను
సిరిబాల ముమ్మయ్య! సేయు
యుద్ధంబు
పెదవేగి భావరాజు పెద తరువారు
రాజుతోను
నేతివారి ముద్దయ్య! నీవు
నని సేయుము
నారూఢి నాచకూళ్ళ నాయుడా!
నీవు
పేరుకల యాగు త్రి భీమునితో బోరు
పురుష వృషభుండవో పోచయ్య!
నీవు
తిరుణాహాల తిప్పయ్యతో
ధీరత పోరు
కొండువారి కొండయ్య! గోవుల
గంగయ్య!
మెండైన బలముతో మెరసి
పోరాడు"
పల్లికొండ యీ రీతి పంపు
లేర్పరచె,
కాటమరాజు పల్లికొండ కడు
వేగమునను
యుద్ధము శాయను శలవు యిందరికి
యనిరి

## అయితమరాజు భట్టుతో నలసిద్ధికి కబురు సేయుట

అప్పుడు అయితమరాజు ఆ శానల
జూచి
అపరూప సరస్వతి అను భట్టును
బిలిచి

''సిద్ధిరాజు కడకు శీఘ్రము మే బోయి
యుద్ధంబు శాయను ఋది మంచివేళ
పాలిబెట్టి ఆవు పాలిగాకుండ
పాలిపంతము యేర్పరచి
ప్రఖ్యాతిగాను
వకరొకరు కడసి వైనవైనాన
యల్లలోకములకు యెన్నికగాను
యుద్ధంబు శాయనరె నెరవు
యెంతైన లేక
రణమునకు యెదిరించి యెమ్మనను
నీవు''
ఆనతిచ్చిన భట్టు అతివేగమున
బోయి
పరుగున వచ్చి సిద్ధిరాజుకు ప్రస్తుతి
చేశ
'పరాక్రమశాలి కాటమరాజు భట్టును
నేను
చనుదెంచి యుద్ధమునకు సాగి
రాలేక
ఆదిరిరో వీరన్న ఆపద చాల
చన్నమ్మ చలరేగి చేసిన
యుద్ధమునకు

పరగ యాదవులంటె
భయమొందినారో
భయముచే తీరదు బ్రహ్మకట్టడికి
యేమి తోచక మీరు యీ రీతి
నున్న,
అయితన్న తమ్ములు ఆ
బావమరదులు
కదసి కార్యము శాయ కారణము
ఋపుడు
కనక యాదవులు మిమ్ము గడచి
పొయ్యేరు
సరగ మతసులు విడిచి
సంతోషముగను
యుద్ధము శాయను ఋది మంచివేళ
పిలిచి వివరించి రమ్మని యిటు
పంపినారు'
మేదినీశ్వరుతు విని భట్టుకు మేలు
కట్నాలు
రాకట్టు వుంగరాలు రత్నకడియాలు
భట్టుకు సిద్ధిరాజు బహుమానమిచ్చె.

## కాటమరాజు-సిద్ధిరాజుల బలములు రణమున కలియుట

అప్పుడు సిద్ధిరాజు అతివేగలేచి
భేరీ మృదంగములు పెద్ద
బూరుగలు
రణభేరి వేయించె రాణువ కదల

తమకంబుపై నెక్కె తానుంతగాను
సరగ భేరి మోతలకు సరదార్లు
మొదలు

మొనలు యేర్పరచి కదిసిరి
మొత్తముగ మూక
అప్పుడు నిలిచిన అయితమరాజు
తాను చూచి
తమ్ములకు మరుదులకు తా శలవు
యిచ్చె
పంపు చేలు యేర్పడి యాదవులు
పరువడి రాగ
అవుదాలపై నిలచి ఆ సిద్ధిరాజు
పరువడి వచ్చేటి యాదవుల
పారంగ జూచి
చోద్య మందుచు నుండె శూరుడై
రాజు
ముందుగా జగడాన ముమ్మరముగాను
ఘనమైన బాణాలు కాల్చి
రొక్కడను
అటువెనక తుపాకులు
అగుబుగులుగాను
పెటపెటల తుపాకులు
పెట్ల కాల్చినను
గుబులు గుబులున కొండలు
ఘూర్ణిల్లుచుండె
బాణాలు జబుర్జంగులు పరగ
మ్రోతలతో
భూమి తల్లడించెను ఘోరు కలుగుచును
కదిసిరి విలుమూక ఖడ్గహంబేర్చి
మూకలు మూకలై మొనసి
ఘురువంక

సరిగ నారిబిగువు సళ్ళకుండగను
తటతట పంచభూతములు
వాపోవగాను
అర్చుచు గుప్పిరి అంప
శరములును
యీటెలుతో కదిసి యుద్ధరంగమున
చౌకళింపుచు దూకి చలగి
ఝుళిపించి
వాటముగ పోట్లాడుదురు
పడుసు మన్నీలు
అడిదంబుల దట్టుచు యాదవులు
అటు చౌకళించి
సురియలతో నరికి రణశూరులై
నిలిచి
అరిగెలు తాటించి అన్ని యగదట్టి
గొదకొని గోపాలకులు
రణఘొల్లుగాను
చీకాకు పరచిరి శిరము లెత్తగను
నరకుచు రణమున నార్చుచు కొంత
విడువక పోరాడు విధమున కొంత
పోచయ్య ముమ్మయ్య పోడిమి మీర
అప్పుడు బాలలు అశ్వముల నెక్కి
బాలరాజుల కదసి బలుయుద్ధమునకు
పల్లికొండ తమ్మ పైనము చేశ
అనతిచ్చిన క్రమమున
హరివంశపరులు
తప్పక వారితో తలపడి యుద్ధము
ముప్పరిగొన్న కోపమున కాయగను

## కాటమరాజు-పద్మరాఘవుడు సొగటాలాటలో పంతములు తెలియుట

ఆ సమయమున వీరతమకమున
నున్నయట్టి
పశుపతి నలనన్న పద్మరాఘవుడు
పక్షిణి తమ:కంబుకు పైన గూర్చుండి
రసికుండు యా పద్మరాఘవుం
డనియె:
'అయితమరాజు బాలలు
అమరయాదవులు
సరగ యుద్ధము సేయు సమయంబు
యిదియు
మనవార లే రీతి మసలుచున్నారో
పగవార లే రీతి పోరుచున్నారో
అక్కడి వార్తలు మనకు అని
దెలుపయవరు
ప్రస్తి యని సొగటాలు
పట్టియాడవలెను
అందులో దెలుపుదురు హరిహరులు
మనకు
పట్టుమా సొగటాలు
పట్టియాడుదుము
బావరో తెప్పించు పాళెపాచికలు'
అని యిట్లు మరిచి పద్మరాఘవుం
డనగ
అవుననుచు కాటమరాజు హల్లున
నవ్వి
'యుద్ధముతో వార్త యిటు
దెలిసినట్లు'
అనుచు తన మరిదియంచు ఆత్మ
నూయెంచి
మేరుప ధైర్యంబు మెచ్చి సొగటాలు
సారెలు పాళెపై చయ్యన నిలిపి
వసర సవ్వుచు నలనన్న పాచికెలు
అందింప
పద్మనాభుడు సారెలు పంపులేర్పరచ
'అరిదళములు యాదవుల ఆలించి
చూడు
అరయంగ భూదెల్పు అన్నియు
నివ్వి
యాదవ దళము యెరుపు
పరదళము నలుపు'
అని యిట్లు పొలిచెను ఆ
రాఘవుండు
ఆవులన్న తలచ ఆత్మలోపలను
పరగ గణపతిని దలచి హరుల
ప్రార్థించ
'యిక్కడ సొగటాల యీ
యాటలోను
అక్కడ నా తమ్ముల అని
దెలుపవలెను'

అని భారతిని తలచి పాచికలు విడిచె
'భారపందె'మని రాజు పక్కన నవ్వె
'యిప్పుడు నా తమ్ములు రిపుల విరగబొడిచేరు'
అప్పుడు రాఘవుడు అటు పుచ్చుకొని
'పందెముచూడ నేను లెస్స అయినాను
నా పందెము చూడవా నరనాథ తిలక!'
అస్త్రములచే నలచి పాచికలు అవనిపై విడుచు
జక్కి దగడవైచె సాహసంబునను
'పగదళంబులు సంసె బావరో చూడు
యిప్పుడు మించిన యిలగూలు హరిదళము'
అని సారెపొడిపించి ఆ యెరువు గెలిపించి
అతివేగమున రాజు అప్పుడు పుచ్చుకొని
తప్పక హరిదలచి 'తమ్ములకు మేలనుచు'
అప్పుడు తా వైచె ఆ రాజఘనుడు
సదా ఆదేమాడ సంతోషమనుచు
సాహసంబున ఉన్న రెండు సారెల చీరె
పరగ యిరుదళములు సంసె యా పాళములమీద
యాదవుల పోల్చిన యర్రని సారెలు
అయిదు కర్రెలుపండె అంతలో పలను
'నీ పంతమే నిజము నిజము నీదేను'
అని యిద్దరు వుప్పొంగి అవి యిట్లు వారు
ఆడుతు వుణ్ణాగ యాదవుల రణమున
వక్కరొక్కరు కదిసి రిపుల వైనవైనాన
చక్కగా నరికిరి సమరంబులోను
నరికిన శిరములు నలిగులి ఆరు
హరి నెంచి మూర్ఛితు లయ్యేటి వారు
శంకేమియును లేక చలరేగి మించి
కొంకులు నరికిన కూలు అశ్వాలు
ఝళిపించి కటార్లు యాదవులు సాహసంబు గాను
సూర్య సోమ వీథులు యేర్పడ చొచ్చి నరకంగా
ధర మీద పీనుగులు తరచుగా నుండె
నేలపై పరువడి నిలచి పొడిపించినాను
మేల్వెంతకారు అని మెచ్చియు వారు
తరిమి యాదవుల నరక దద్దరిల్లిరి కొంత
పారేటి రక్తంబు పై జల్లుకొనియు
వచ్చిన వారందు జొచ్చేటి వాటు

నజ్జు నజ్జుగా సురియలు నరికిన
యపుడె
ప్రాణాలు పోతుచును పరగ నిట్లనిరి
తల్లి దండ్రులు భార్య తన వారిని
యడబాసి
బల్లాల నేజాల పాలైతి మనువారు
తలపడి యాదవులు తరిగి పగతులను
బలములు సమయించి భూపాలుల
జూచి

## కరియావులరాజు యరసిద్ధిరాజును వధించుట

యర సిద్ధిరాజు యెక్కిన యేనుగు
మీదికి
కరియావుల రాజు గజము నడపించ
అమిత విక్రమశాలి ఆ కామరాజు
తమకముపై నుండి తా, జూడగాను
యేనుగుపై నెక్కి యర సిద్ధిరాజు
తమ్ముక రాగాను కరియావుల రాజు
కరులపై నుఱకించ గణక
తోడుతను
తిరకట్టి మూకల తెగువతో నరికి
యినప రాగోలలచే యిట్టట్టు లార్చి
యర సిద్ధిరాజును యేకాండముగ
గొట్టె
యఱ్ఱ సిద్ధిరాజు యెక్కిన గజము
భోరున కొండవలె భూమిపై వరిగె
కరియావుల రాజు ఖండించి వైచ.

(ఈ కరియావుల రాజు యుద్ధకాండము అసంపూర్ణముగా తోచుచున్నది).

## ఐదవ కాండము

# బాలరాజుల యుద్ధము

## పోచయ్య పగతుర తలలు ఖండించుట

సిరివాల ముమ్మయ్య సింహ
పరాక్రమమున
చేరిన మూకల నెల్ల చెండు బెండాడి
విడబడి వుండవెల్లి విరిగోపుతోను
చలముచే సాధించి సాహసంబునను
పోరి పగతుని రొమ్ము పొడిచి
పడద్రోసి
దండి విరోధులనెల్ల ధరణిపై గూల్చి
పచ్చందుల పోచయ్య నిచ్చ
పెళ్ళికొడుకు
కన్నె కుమారకము యేలే కమనము
గంగు రాజును
చన్నపట్టణము వేలు దేవముని
వెంగళయ్యను
తిరుణామాల తిప్పయ్యతో ధీరత
జోరి
అగ్రుడై తన చేతి ఆయుధంబునను
తరిమి వారి ముగ్గురి తలలు ఖండించి
తరిగిన శిరస్సులు తన చాత బట్టి:
'అలనాడు అరవెళ్ళి వద్ద ఆవుల
పిలువ
ఆవుల పిలువంగ అవి రావటంచు

నలనన్న వోక్షము పెట్టి నవ్వినన
యందుకు
పంత మీదేర్తునని ముమ్మయ్యతో
పలికితిని
ఆవులు చక్షణాదికి అరుదెంచి నపుడు
ఆరువెళ్ళి గంగను అపుడు ప్రార్థించి
కుంభాలు బోయించి కోర్కెలీడేర
కవులావుల మంద క్రమక్కన లేవ
ముమ్మయ్య పోచయ్య
ముద్దు బాలలార
అవుల పిలువమని అనతి యిచ్చ
అర లేక పిలిచితిమి అవుల మనము
అరవెళ్ళి వద్ద ఆ వేళ నన్న
పోనాడి నిను మెచ్చ పొందుగా మామ
పద్దు కొదువాయనని నేడు నా పంతమీదేర
బహు విధముల నార్చి పగ
సంహరించితిమి
పగవాని శిరస్సులు పశుపతికి నేను
పాదకానుక పెట్టి పంత మీదేర్చి
వత్తును వో మామ! వక ఘడియలోను
అల్ల నేరేడు వద్ద ఆనవాలు గాను

అలసట దీరగ వుండు వో మామ!
అర్ధఝాము
తాను మూడు ఘడియలకు మామతో
తాంబూల మంది
జంబు నేరేడు కాడికి చారంగ వత్తు"
అని యిట్లు ముమ్మయ్యకు
ఆనవాలు చెప్పి

శిరస్సులు కొనివచ్చె శ్రీ వీర
తమకమునకు
పల్లికొండ కాటమరాజు
పద్మనాయునికి
పగతుల శిరస్సులు మూడు
పాద కానుక బెట్టి
పరగంగ నివ్వాళి పట్టెను వేగ

## పోచయ్య పంతమునకు నలనన్న మెచ్చుట

హల్లున నవ్వేను పల్లవుల రాజు
'ఇతని సాహసమెల్ల యిట్లని తెలియ
వలె'
పోచయ్యతో రాజు పొసగ యిట్లనియె:
'చచ్చిన శిరస్సులు రిణమందు చాల
వుణ్ణంగ
తేజమైన శిరస్సులు యేర్పరచి
తెస్తివాయిటకు?
యీ సరదార్ల నీవు సాధించి నరికి
తెచ్చిన మాటైతె మాకు తెలుపంగ
వలెను'
ఆగ్రుడై మండిపడి పోచయ్య అప్పు
డిట్లనెను:
'చెల్లెలి కొడుకని నన్ను చెదర
నాడితివి
నీ తమ్ముడని ముమ్మయ్యను తగును
తగునంటివి
నన్ను చిన్నబోనాడంగ చెల్లునచె
మామ?

నాడు ఆవుల పిలువ లేదని నివు
నవ్వి నప్పటినుంచి నలనన్న నిజము
నారసాలై యుండె నామది యందు
నేడు గొదకానిపోరి ఘోటాజిలో నేను
కోసి పగతుల శిరస్సునులు మీ
కోరిక మీర
పరగ మీ పాదకానికి పట్టితి నేను
మేలని తెచ్చినా మెచ్చుకో వైతివి'
మామ అల్లునితోను మరి యిట్టు
లనియె:
'సాహసంబుననీవు పగతుల సాధించి
నరికి
అల్లుడా! శిరస్సులు కానుక అట్లు
తెస్తునంటివి
అంత వాడైతేను అల్లుడా! నీవు
చచ్చిన శిరస్సులు పలికించు
చక్కని పోచయ్యా?
అతి సాహస మందు అల్లుడా! నిన్ను'

మామాడు మాటలకు మరి చిన్న
పోచయ్యకు
గోరు చుట్టుపై యీటె గుచ్చినట్లాయ
పూని కటార్లు కొద్ది పొడిచినట్లాయ
మంటయై మిన్నంటి మరచి దేహంబు
అర లేక పరమాత్ముడంటె జీనంబు
యీ పద్దు గెలువమని హరుల
ప్రార్థించ
'వో పరమాత్మ! నా నిజ మొక్క-
డెరుగుదువు
పంతముగ శిరస్సులను పలికించ'
మనుచు
పేరిన శ్రీహరి వేడుకపడుచు
పరగ శిరస్సులకు ప్రాణంబు లిచ్చె
ఆగ్రహుడై పోచయ్య ఆర్భాటంబుచేసె
పీసాలు యెగవేసి మిట్టిపడె
శిరస్సులు
ధరణి మున్నుగ అదిరె తమకంబు
వణికె
రణవీర తమకానవున్న రాజు,
పల్లికొండ,
ఆశ్చర్యమందుచు అప్పుడిట్లనియె;
'యింత సాహసఘనుడు యితడు
పోచయ్య
అర్జునునికిసాటి అనవచ్చు యితని
బలపరాక్రమశాలి కానంటె పలకవు
శిరస్సులు
భీమునికి సరిపచ్చు నంటేను పృథివి
లోపలను
లంకలోపల తొల్లి రావణుని చంపి
ఘనముగ విభీషణునికి పట్టము
గట్టిన నాడు
పలకవాయు శిరస్సులు వో
పద్మనాయుడా!
జరసంధునితోను[30] నలగి కృష్ణుండు
సరిపోరెనని వింద సమరంబునందు
నాడు
పలుకవాయ శిరస్సులు వో
పద్మనాయుడా!
కడు పరిశరాముడు కార్తవీర్యుణి
వేయి కరములు ద్రుంచె వేడుకమీర
నాడు పలుకవాంప శిరస్సులు
వో పద్మనాయుడా!
యితడు సత్యముగల సాహసుం'
డనుచు
పోచయ్య పసగు పొగుడుచు చాల
'మేలు భళా' యని మెచ్చి అల్లుణ్ణి
అప్పుడు మూడు విడియము లిచ్చి
అతిసాహసాన వుండిరి
శలవంది రణవీధికి సరగ నేతెంచ,

30. జరాసంధునితోను

## ముమ్మయ్య మృతికి పోచయ్య విచారించుట

జంబు నేరేడికాడ చారంగ పచ్చ
పమిడి తంగేళ్ళన్ని పారంగ చూచ
కవగాని వెతకిన ముమ్మయ్య కాన రాకున్న
ఆలించి తన మామను అంత పంది పిలిచె
'వీరనందుల మామ! యిక్కడ లేవు
యక్కడ వున్నావో నేను యేమి సేయుదును?
విజయ నందుల మామ! వనరంగ పలుకవే!
కంచునందుల మామ! కపటంబు చేస్తివి
గజ నందుల మామ! నీకు యిక్కడ గడి చెప్పి పోతిని
యెందు పోతివి మామ? యెందు వెదకెదను
కదసిన మీ దళములు మీ అన్న కల్లుగా జంపంగ
తామసింపంగ లేక దళములపై దూకి
చండాడుచున్నావ చేరి వోమామ
ఆల జాలము లాడ నేను అల్లుణ్ణి గనుక
ఆనవాలు తప్పి అవలీలగాను
దాగి వున్నావ నన్ను తందర జాయ?'
అని నాలుగు దిశల రణవీధిని జూచిన
కాటిరాడాయుడు ముమ్మయ్య కాంతి చంపుండు
'నేను వచ్చిన దనుక అల్లనేరేడు వద్ద
పంతముగ వుందునని పలికితివి మామ!
పంతము కాడికి వస్తిని పద్ధతులు గలచి'
కల కల నవ్వి పోచయ్య ఘనవాల వేసె
'వాలరా వోధీర! వంశ వర్ధనుడ!
వాలరా వల్లవాది వంశకుల తిలక!
వాల వాలో నీకు వల్లవుల మామ!
వాలరా తావు విడిచిన వల్లవుల ముమ్మకు వాల!
బొందికి పోయిన బాల ముమ్మన్నకు వాల!
వాల వేయుచు పోచయ్య మందలించ సాగె
గాయాలతో ముమ్మన్న కళ దప్పి యుండగా
ముమ్మన్న వీరజడల ముడిచిన పువ్వులు
తెప్పలుగ రక్తాన తేలుచు నుండి
జొత్తువలె రక్తాన సొంపి వుణ్ణంగ
వాలయు చాగ నెత్తురు వరదలోనుండి
వాలన్న మాట వకకాస్త వినెను

మామను చూచి పోచయ్య మందలించ
సాగె
గాయాలతో ముమ్మన్న కళదప్పి
యుండంగ
దగ్గిర కూర్చుండి తాత్పర్యముగను
తొణసి హ స్తముల మామను
తొడలపై చేర్చి
మృదువుగా అల్లుడు, మామ ముద్దుల
ముఖము,
కన్నుల భాష్పములు కాలువలై పార
జిలుగు సన్నపు చంద్రశాలు చేపట్టి
దరదర ముఖమున ర క్తధారలుదుడిచి
'చంద్ర బింబముబోలు చక్కని
ముఖంబు
కాంతి చెప్పగలేను ఘనుడ వో
మామ!'
కఱగి నెత్తురు కరుండ్లున దేహంబు
చంగావి వలపంబు చేదుడిచ నంత
"వో మామ! యీ కాంతి కళలుగల
దేహంబు
పౌ త్రెపు నేజాల పగవారు పొడిచిరా
మామ!
నేను వచ్చినదాక నేలేడువద్ద
నిలువక పగతులమీద యేల
నెదిరించితివి?
కడిసిన పగతులను కల్లిలోపలను
బారుల నరకంగ బాహులు
నొచ్చనటె మామ?

అండలేదని నన్ను అటు తిరుగు
చూ స్తివా మామ?
అప్పుడు సంధించి ఆముకొన్నదా?
మాయగా పొడిచిరటే మామ బల్లాన?
పూని శత్రువుల నీవు పరిమార్పగాను
పరుగంగ వేసిరా బాణాల నిన్ను?
యిరుగడలవచ్చి బాణాలు యదము
లేకుండ
వలపల నరుక దాపల వెడలెనే మామ
దాపల సరికట్టి వలపల వెడలెనే
మామ?
సూర్యకటారితో నీవు చూడ
చోద్యముగ
వెన్నంటి నరుకంగ మాయవెఱువేలు
గూడి
నేజాలు వంకిణి నారసాలతోను
యదరొమ్మున పోట్లు వెడలెనా నీకు
వారిలో సాహసులు వజ్రాయుధ
ములును
వు త్తముడ పోట్లుబడి వురివిపై
నొరిగితివి
గన్నెరాకు అంబులు తాకెనటె మామ
దొనియింటి కోలలు తుదల దూసెనే
మామ?
వెడలెనే నీతో యె త్తివచ్చిన బాణాలు
ఝల్లు ఝల్లున బాణాలు నీకు సందు
లేకండ

కంచువంటి బొందికె ఘడియ
లోపలను
కడుపులో బాణాలు కత్తులు నాటెనా
మామ?
వల్లవుల వారికి వజ్రాయుధాలు నాటె
వైనముగ పోట్లాడి వరిగిరా
ముమ్మన్న?
తిరుమందుల వారికి దివ్య బాణాలు
నాటె
ధీరులై వరిగిరా దివ్యరణ మందు?
అమరంగ నీ వెంట నేను అద్దనైతినో
యనుచు

కపటము వుంచకే ఘనుడవో మామ!
పట్టి పగవులు గావు వల్లవుల మామ?
పద్దుగా చూడు నా పరాక్రమమెల్ల
నిన్ను చంపిన పగవాణ్ణి నేను
హతము చేతు
వీరతమకం రాజుమేను తగిలించు
దును''
తన తొడలపై నున్న మామను
ధరణిపై జేర్చి
పైగప్పి కనకవన్నెల
పట్టుశాలువయు

## పోచయ్య ఉగ్రుడై విజృంభించుట

ఉగ్రుడై పోచయ్య అశ్వాన్నియెక్కి
కాలు తాటించిన అశ్వం కరాళించి
దూకె
చేరి విమతులంతోను చేసె యుద్ధంబు
పోచయ్య వక్కడే పదివేలతో పోరి
అప్పుడే వెనుతగిలి హతము శాయంగ
కాల్బలంబుల నరికి కల్లుగా చంపి
ఆమీద పగతులు ఆముకొని కదసి
ఝుళిపించి బల్లాలు సంధించినాను
చాచి బల్లాలమీద చౌకళించి పోచయ్య
తడయని కోపాగ్నిచే తలలు
ఖండించి
ఆముకొని పోచయ్య హతము
శాయంగ

ఘోరు ఘోరుమనేటి విధము
గోపాలకులనెల్ల
వేడుకమీరి బలము వెలయ
నురుమాడి
యేనుగుల అశ్వాల యన్నగల
బలము
విరివిగా రణమందు వరిగిన విధము
ఘోరాజిలో పీనుగులు గుట్టలై
యుండు
దురములో శిరస్సులు దొంతుల భంగి
గుట్టలై యుండేను కొదువ లేకుండ
ఆరీతి రణమందు యాదవులు కదిసి
వెను దగిలి సరదార్లు యిల
కూల్పగాను

ఉరుమూల వెరపిచి తరచు మిన్నేరు
విడిబడి రణమును వెళ్లేటివారు
లడిబడి రణమున దాగేటివారు
తాటి బొందల సందు దాగేటివారు
పారిపోయి అడవులు పట్టేటివారు
చచ్చినవారికి కింద చొచ్చేటివారు
కడువేగ దొంతుల సందున కడప
లున్నట్లు
ఉండు గుట్టల సందు దాగేటివారు
వెళ్ళేటి వారికి యాదవులు యేమియు
అనక
యెదిరించు మన్నీల పీకులై కదసి
అతి పరాక్రమశాలి అయితమరాజు
'క్షితిమీద శత్రువుల క్షయముగా
నరికి
గండగోపాలరాజు కస్తూరి సిద్ధిరాజు
తోడుగా అందరితో మొనసి పోరాడి
యిరువుగా వుండవెళ్ళి వీరగోపు
అనువానిని
సిరిబాల ముమ్మయ్య సింహ
పరాక్రమముగను
ఆర్పుచునరికిన వీరగోపు అవనిపై
వరిగె
కస్తూరి సిద్ధిరాజు మీద కదసి
అయితన్న
మదగజంబుల బొడిచి మంచి
అశ్వాల గూల్చి
కస్తూరి సిద్ధిరాజుకు ఖండించివైచె
కిరీటాన్వయరాజు కడుసాహసమున

కదిసి ఏబదియుల ఒక్కుగా జంపి
వీర సిద్ధిరాజు యేనాండిము
గొట్టె
నాచకూళ్ళ ముచుకుందు నేతివారి
ముద్దయ్య
సాహసులై వైరులను రణమందు
గూల్చి
అలయక సొలయక అట్టహాసమున
పల్లికొండ చెప్పిన పద్దు మీరకను
వైనముగ వారి బలం వైరుల జంపి
మేరువ ధీరులై మేదినిమీద
ఆరూఢి పోట్లాడి ఉభయుల రక్తం
అసమానముపేళ అవనిపై బారె
పాలేటికి యెదిరించి రక్తం పక్షిణ
ముకు
పారుచుండెను పగవారి రక్తం
అంబరవీధిని దేవతలు ఆనంద
మొందిరి
అప్పుడు యాదవులకు అతిభారమాయ
యెక్కిన అశ్వాలకు యేట్లు
పోట్లాయ
వక్కరొక్కరికి అంబులు వైన
వైనాన
వజ్రాంగి సురియలు వంకిణీలు
నాటెను
తిరుమందులవారి దివ్యబాణాలు
అందరికి వక్క ఘడియలో అలుగులు
నాటెను

హరివంశ రాజులకు అటు మూర్ఛ
లేక
శ్రీహరి భక్తులై సిరిశకల తోను
పక్కెర తేజీలకు బల్లాలు నాటె
పుత్తమ రాజు యెక్కిన
పువ్వులనీడ కడిసి
కత్తుల యీటెల కసిగందు లాయ
వల్లభన్న యెక్కేటి వాసిగల తేజికి
వళ్ళెల్ల నేజాలు పడిపడి నాటి
కడమ గుఱ్ఱాలకు కడు గురుతు
లేకుండ
యడలేక అంబులు యదముల నాటె
యదువంశ కుల తిలకులు యాదవ
పుణ్యులు
అదురు గుండె పిరికి కండలు లేని
ఆ సాహసులు
యెదు రొమ్మున పోట్లతో యేకాంగి
వీరులై
సమరమున చల్లక నిలిచిన
సజ్జనమంతులు
ధనముకొండ యేలేటి ధారుణీశ్వరుడు
తప్పక వారిని గొలిచిన వనరైన
దళము
కాలి పరివారంబు కదనమున వరిగె
అనిలోన యాదవ బలము హత
మాయ
అస్త్రాద్రికి సూర్యుడు అరుగు వేళాయ
ఆవులు మందకు అటువచ్చు వేళాయ
నీతిజ్ఞు లైనట్టి నీతిమంతులకు
ధర్మయుద్ధము శాయను తగని
వేళాయ
పల్లవ నలసిద్ధి పట్టాభిషేకరుని
తమ్ములు చెల్లిరి చాల దళములు
మడిసె
యేనుగులు లొటపిటలు వెలయ
నశించులు
మరి రాచ దళములు మన్నె
మూకలును
హేరాళముగ మడిశ రణమున
యెడము లేకుండ
హతమాయెనని రాజు హాశ్చర్య
పడుచు
వుగ్రుడై యుండెను వురవీర ఘనుడు

## యుద్ధములో యాదవులు అలసి ఆవులన్న కడకేగుట

అప్పుడు అయుత మహా రాజు అమర
యాదవులు
జొత్తువలె రక్తంబు జొబ్బటిల్లంగ
గాయాలు మూవలాపల కానరాగాను
వల్లవ కులాధిపులు వచ్చిరి మరిడి
తిరుమందు లైనట్టి ధీరులు మొనలు

కత్తులు నాటిన శరికశిలతోను
నాచకూళ్ళ నాయుడు నేతివారి
ముద్దయ్య
పోచయ్య ముమ్మయ్య పుత్తమ రాజు
కరియావులరాజు ఘనుడు అయితన్న
పరువుపకార భట్టావుల వల్లభన్న
మొదలు
బలాధిపులకు యదురు రొమ్ము న
బల్లాలు నాటి
చీలికలై అల్లాడు కండల రక్తం
చిమ్మించి పారు
కళి గండలైనట్టి గాయాలు రక్తం
కమ్ముచు యాదవులు కలకల
నవ్వుచు
బారుగ వృక్షాలు పూసిన యట్లు
పారిజాతపు పువ్వులు పరగ
ధరియించి నట్లు
బాకుల పోటు గాయాలు పువ్వుల
బంతులే యనుచు
గజ నారసంబుల పోట్లు యెఱ్ఱ
గన్నేరులే యనుచు
మల్లె పువ్వులు ధరించినట్లు మరి
వేసిన బాణాలు
వేసిన బాణాలు యడలేక నాటె
వెరగొప్పు పువ్వుల బంతులై
తేజంబు మెరసి
పనసలు మామిళ్ళు ఫలమంది నట్లు
యసగంగ పువ్వులు పిందెలు
వికసించినట్లు
ఆరీతి యాదవులు హరికృప వలను
అశ్వాలు కోలుపోయి అచోటు బాసి
వుశ్వాస నిశ్వాస వూపిర్లతోను
అయిగూర్చి నట్లు అప్పుడు వచ్చిరి
అయితన్న వెనువెంట అంది
యాదవులు
పొందుగా దాసాని పువ్వులు గూర్చి
నట్లు
ఆవులన్న కడకు అప్పుడు వచ్చిరి.

## నలనన్న యాదవులను ఓదార్చుట

తమ్ములు రాగాను తప్పక చూచి
తమకముపై నుండి ధరణిపై దూకి
యెదురుగా వచ్చి వారిని యెత్తుకొని
దీవించి
సతుల వర్ణితుండు సంగ్రామ
విజయుండవు
భక్తిగా తమ్ములతోన పలికె నొక
మాట:
"నాకన్న ఘనులార! నాయన్న
లార!

పగతుల మీదికి మీరు పైనమై పోయి
భూకాంతుపై నిలచి భుజశక్తి మెరసి
చలముకొని వారితో సమరంబుచేసి
కోలాహలములై మీ కోరిక లీడేర
దండి బారులనెల్ల ధరణిపై గూల్చి
వేడుకతో మీవంతు దళము వెస
గూల్చు వరకు
మీ దేహాలు బడలెనా దీనాత్ములార!
పరగ ధనముకొండ పట్టణమేలుచు
పల్లెల పానుపులమీద మసిలేటి
దేహాలపై
అంబులు నాటినవి అతిబలులార!
పరగ జాజులమీద పండిన దేహాలు
అందరికి బల్లాలు నాటినవో
అధిపులార!
పన్నీట స్నానంబు అమర్చి పంచ
ప్రాణాలు
పల్లికొండ పంచిన ప్రజ్ఞ యాడేర్చి
యెదకత్తుల పోట్లు నాటి తమ్ములార!
కమ్మని కస్తూరి గంధం అలదేటి
మేనులను
కారేటి రక్తం కరుండ్లపైని
కస్తూరివలె రణదువ్వ
కప్పియున్నాది

చిమ్మించి రక్తం చింది కాశలపైని
రణములో రామభద్రుని తమ్ములు
వలెను
నా యిరుగడల అందరు వెలయు
విధములును
కరకంతు కృపవలన కారణమిట్లాయ
వున్నదేహాలు"నని తమ్ముల
పూరడించి,
తన పట్టు శాలువన రక్త ధారలు
తుడిచి,
కళదప్పి ముఖములు కావురుగప్పి
కందు బారివుణ్ణంగ కాటమరాజు
రవళాలు చేపట్టి రవధూళి తుడిచి,
అందరికి విడిముట్టు ఆనందముగను
గొప్పగా శివనందుల గుడారులోను
పట్టు జముఖానములు పరిపించి వేగ,
అయితన్నకు పట్టుతివాసి అమర
అవయకుండ
భారంపుగాయాలకు తులసిపత్రి
తెప్పించి,
ప్రాణహాని గాకుండ పట్టు వస్త్రాల
ఘట్టిగా గాయాలు కట్టించె అందరికి

# ఆరవ కాండము

## ఆవుల ఎద్దుల జగడము - ఎఱ్ఱయ్యల యుద్ధము

### నలనన్న పల్లికొండతో తమ పాటు విచారించుట

నలనన్న ఆ పద్మనాయుడిద్దరును
వెలయ పల్లికొండతో వేడుక నిట్లనిరి
బలభద్రమూర్తి! వో బావపల్లికొండ!
చెలగి మన యాదవులు చేసిన
యుద్ధంబు
మాఖబహుళ అమానాశ్య
మంగళ్వారంబు మొదలు
బాగుగా తంబళ బ్రహ్మరుద్రయ్య
దశమి గురువారము నాడు తగచల్ల
వారు
యసగంగ బొల్లావు యేకాదశినాడు
అమర ద్వాదశినాడు అమరి బీరన్న
త్రయోదశినాడు తగ బాలరాజులు
యనయంగ రేపట యవ్వరి వంతు?
పల్లికొండ వో బావ! పరగ
ఆనతిమ్ము"
ఘనుడు పల్లికొండ కాటమరాజు
కనియె

### పల్లికొండ పంతము చెప్పుట

"పరగ సిద్ధిరాజు బలములతోను
యసగంగ పోరాడ్ర యుద్ధరంగమున
చట్టవారి యఱ్ఱయ్య సాహసంబునను
శ్రీకంఠము రాజుమీద చలరేగి
మించి
మట్టిగా పోరాడ కట్టడి కద్దు
మరివేగ పగవారి మదగజంబులను
మన సలుగుచెద్దులు కదిసి సమరంబు
చేసి
కదనంబులో చంప కట్టడి గలదు
కోరి యా పగవారిని పుల్లయెద్దు
బసవన్న
ఆరాటి యెదిరిని అందరిని గూల్చు"
అని యిట్లు పల్లికొండ అను వార్త
వినచు
ఆ రాత్రి వుండిరి అష్టభోగముల

## పాపసిద్ధిరాజు తన దండుతో పయనమై వచ్చుట

అక్కడ సిద్ధిరాజు అగ్రుడై మండి
జామున తెల్లవారున శరదార్ల
భటుల
రమ్మని పిలిపించి రాజు తా పలికె:
"యాదవుల మీదికి యేనుగ ఘటముల
అశ్వాల నస్నీటి అయిత్తు పరచి
ఆ పరివారముకు అధిపతియైన
పాపసిద్ధిరాజును పైనము
గమ్మనుము"
"అంకించి రణమునకు అరుగంగ
మాకు
శలవిమ్ము నలసిద్ధి జయశేఖరుండ!"
అడిగిన తమ్ముని అంర దీపించి
నలసిద్ధిరాజు వారిని నని శాయ
బంపె.
పొలు పొందగా సూర్య పుత్రముల
నీడను
కదలె తురంగములు కనక పొడి రాల
బలములు ఉరుగడల బాగుగా నడిచె
పడగ గొడుగులు గల పరగ
నాయకులు
వెనువెంటనే కదిసి వివరముగ
నడువ
వక ఘటం బేనుగులు వడి మావటీలు
పాపసిద్ధిరాజు పన్నిద్దరు
దళవాయువులు

మతిమంతుడైనట్టి మన్నీల
బొమ్మినేడు
మొదలైన పరివారము మొనలు
యేర్పడియు
నడిచెను దళములు నపిరి భేరీలు
నవాదుచేసిరి నాదు యడలేక
ఘన బిరుదు టెక్కెములు
గండభేరుండములు
కురురాజును బోలె కుంజరము నెక్కె
విరుగడల రాజుకు వింజామరంబులు
వెయ్యి తొండాల యేనుగులు
దొడ్డిమీదికి వచ్చి
మెండైన శానలు మెరసి యేతెంచ
యేకోజామున 31 మందకు
హేరాళముగను
ఘనమైన యేనుగులు
కాల్బలంబులును
గుఱ్ఱాల జారును గొడకొని వచ్చె
నలుదళములు జూచి నఱ్ఱావులెల్ల
మిర్రి మిర్రి చూచెను యుఱ్ఱులవలెను
మద గజంబుల చూచి మరి
నలుగుబెద్దు
గదసి రంకెలు వేసు కాలు దువ్వుచును
కాలబలం చూచి కంపటిల్లె
చాలుగా నిలచిరి సమరంబు శాయ

31. వేకువ జామున

దివ్యదృష్టిగల మంద ధేనువలు
కనుక
అశ్వాల నెదిరించి ఆవులు నిలచ
యేనుగుల నెదిరించి యెద్దులు నిలచ
బలముల యెదుట గోపకులెల్ల వరుస
యేర్పడి నిలచెను యా రాజదళము
మరి చూచి యాశ్చర్యమును బొంది
యిట్లనిరి
"గజముల అశ్వముల
కాలబలములను
వక్కచే బొల్లావు లశలుగూల్చె
అటువంటి యెద్దులావులు గల
యాదవుల మంద
యీ మందమీదికి యిప్పుడు వస్తిమి
మనము కుయి చప్పటము లేకుండ
కూలుట నిజము"
అని కద సుసమయాన
అగుబుగులుగాను
తుడుము ఢమామీలు తుదిమేర లేక
తడిమి తడిమిన భూమి దిగులు
కొనగాను
పరగ తుపాకి బలము లందరును
యాదవుల ఆవుల యెద్దుల మీద
గుభగుభ యని కదసి
గుబ్బటిలగాను
వెస కాల్చిరి తుపాకులు యడము
లేకుండ
తొడిబడి యాదవుల మీద తుపాకి
గుండ్లు

వడగండ్ల తొలకరి వాన
గురిసినట్లు
తొడి బడ గురిసెను తుపాకి గుండ్లు
యిరు మూకలవారు వేగంబె కదిసి
తెలివైన అంబులు తొడిగి తెగనిండ
దీసి
బాణాలు మందపై పరువడి వేళ
మంచువలె బాణాలు ముంచుకొనె
మంద
కుంభిణి మీదను కదిసి ఘోర
యుద్ధంబు
యిల పాలె యనుచును యీ తెల
వారు
పరువడి సేయుచు దూరిరి బాటు
లేర్పడుచు
అంతటంతట కదిసి జగడము వారు
అటు కాయగాను
యాదవులు యెద్దు లావులు
యరపింత లేక
పల్లికొండ శలవు లేక పగతులపై
బడరాక
నిలిచిన మైలావుల నీతి యెరుగ లేక
పాప సిద్ధిరాజు బలము లందరును
మనస్సున దలపోసి మరియు
నిట్లనిరి:
"మన మొనలు యుద్ధమునకు మరి
కదిసినారు
యాదవులు రణమునకు యెదురెక్క
రారైరి"

ఆసందు దెలియక సంద్య గోపాలుని
బిలిచి
పాప సిద్ధిరాజు గోపాలునితో పరగ
నిట్లనియె:
"పరగ మన దళములు యెదురెక్కి
పరువడి చేసి
మందపై తుపాకి మందు గుండులును
యడపక బాణాలు వెసగాల్చి విడిచిన
యెదురెక్కిరాని కారణము యేమిటిది
సంద్య గోపాలు?"
విని సంద్య గోపాలు విన్నపము
చేసె:

## సంధ్య గోపాలుడు పాపసిద్ధికి సమయము చెప్పుట

"విను రాజశేఖర! వివర మంతయును
పరగ యాదవులకు పెద్ద పల్లికొండ
కలదు
ఘనుడు పల్లికొండ అనాగతములు
చెప్పవలయు
వెలయు పల్లికొండకు హేష్యములు
తెలుసు
పల్లికొండ శలవు లేక యేపనులు
కావు
దిన దినమున యెవరెవరికి ద్రిష్టి
నూహించి
చల్లవారు బొల్లావు సరగ బిగినేడు
అయతమ రాజు యాదవులు
అంద రిదివరకు
పల్లికొండ చెప్పిన పంపున యుద్ధము
చేసిరి యీవేళ యవరికి శలవు
గాలేదు
యిప్పుడు యెద్దులావులు యాదవులు
కొందరు
పైనమై వున్నారు మన పంజుల గూల్ప
పల్లికొండ శలవు లేక పైకి రాలేదు
పల్లికొండ కాటమరాజు
పద్మనాయకుంతు
యెద్దులకు శలవిత్తురు మన యేనుగుల
చంప
అవులకు శలవిత్తురు మన అశ్వాల
గూల్ప
కాలబలంబుల హతము చేయుదురు
యాదవ ఘనులు
యిప్పుడు వారికి శలవు యిస్తు
వున్నారు"

## సంధ్య గోపాలుని మాటలకు వీరులు చప్పరించుట

అని యిట్లు పంతములు అటు
చెప్పగాను
ఆ పరివారమువిని ఆశ్చర్యమంది
వీరనాయకు లెల్ల యిట్లని పలికిరి:

"పరగంగ సంధ్య గోపాలా!
పంతము చెప్పితివి
ఆ వేళ బొల్లావు పంతము చెప్పితివి
అటువంటి ఆవులని నీవు అమర
చెప్పితివి
బొల్లావు రూపంబు యీ ఆవులలో
పోల్చి యెతికినాను
వక్కటైనా లేదు పసరంగ వినుము
యిప్పు డావుల మందపై మన
దళము కదిసి
గడికొని తుపాకులు కాల్చిన అపుడె
మిత్రి చూచి యెద్దు లావులు యిరుల
భంగి
బాణాల మ్రోతకు ఆవులు పరగ
వురకంగ
తొలిగి పోకుండ యాదవులు
దొడ్డితోలినట్లు
మళ్ళించకుంటె యీవేళకు మలలకు
వురుకు
వూర జంగలి ఆవులతో సంధ్య
గోపాలు!
చాలించు యీ పంతము చక్కగా"
దనిరి.
పలికిరి యిట్లని పరివార మెల్ల
విని పాప సిద్ధిరాజు విస్మయమంది
యేమి తోచక రాజు యేమనకుండ
మది నుస్వాయింపుచు మరియు
నుండగను
కొల్లకు వక...గుంపు లైరంత
అల్లంతటను నిలచి ఆవుల చూచి

రాజ సముఖానవున్న రాణువులెల్ల
'వూర జంగిట ఆవులను వార్త
నిజమె
పోల్చి చూచిన బొల్లావు వంటిది
వక్కటియున్న
దళములు కదసివుంటే ధూకి
తలలూడ తన్ను
యేనుగల అశ్వాల యెడలేక చంపు
అందరిని యీ వేళకు హతేసుగా
గాల్చు
అమరంగ యీయెద్దు లావులన్నింటికి
మరియు చిన్నవాండ్లు ఖేయని
మలుపుచు
అన్నిట మేపుకొని అటు తోలుక
తెత్తురు
పణతులు కట్టివేతురు యీ పాడావుల
నన్నింటిని
దొరకొని చిక్కిన వాటి దొడ్ల
పెట్టుదురు'
తమలోను యీరీతి తలపోత చేసి
'పోటుకొండ్ల వలెను బోరున మనము
గొల్లరాజు మంద అంటే కొల్లకు
వస్తిమి
వొట్టు టావుల తొళ్ళు పట్టుకోరాక
దండైన సరదార్ల రాజు బలము
చూచి
యిలవర గండరాజు యింటికి పోయి
యీ డె బోతే మాడ యిత్తునని
వస్తిమి
యీ డె బోయన మాడ గొనకపోదు

తల కోలతోగాని ఆవులం తోర్లించ
లేము
ఆవులు దొరికితే అని లక్షుపరహాటు'
అని విచారము చేసి ఆ యీలెలన్ని
మట్టుగా తలకోలలు మరసేతు
మనుచు
రాళ్ళసందున బెట్టి కొన్ని రయమున
విరచిరి
కాళ్ళ దొక్కిపట్టి గడలు కొన్ని
విరిచిరి
తాళ్లు లేవాయనని తలపోత చేసి
కొంత ఛట్టీలన్ని గొబ్బున చించి
చేతాళ్లు పేనిరి చలరేగి అంత

తల కోలలు గట్టిరి తగవేట్కతోను
తల కోలలు చేపట్టి ఆవుల దాయంగ
వచ్చిరి
పోల్చి ఆవుల జూచి పొసగ నిట్లనిరి
పెయ్యావు నాదని పలికెను వకడు
నల్ల పొడల యావు నాదనె వకడు
పుల్లావు నాదని పోల్చెను వకడు
మైలావు నాదని మరి పలికె నొకడు
యీరీతి పోలుచుచు వెలయ
వుబ్బుచును
బారుగా నిలిచి తలకోలలు పట్టుక
యెత్తిరి

## ఆవులు లేగలు అందరిని అదిరించుట

తలకోలలు చూపిన ఆవులు
త్వరితముగలేచి
జిరకొట్టి యెద్దులావులు చీదర రేగి
తామబాముల రీతి తరమంగ సాగె
తలకోలలు అటువేసి దైవమాయను
మళ్ళిమళ్ళి చూచుచు మరివేగ వురికి
వేసిన తలకోలలు వెలయ
నురుమాడుచు
త్రొక్కుచు నురుమాడుచు తోక
లెత్తుకొని
కాళ్ల దువ్వుచు కడు రంకె వేయుచు
మొనసి వురికెడు నార్ని మోరెత్తి
చూచుచు

వుండిన యెద్దు లావుల చూచి వుర్వీశు
బలము
హల్లకల్లోలమై అటు పారి పోయిరి
కొల్లకాండ్ల మూకలు గుంపులై
వురికి
అడ మొత్తముగా నిలిచి ఆదిరి
వకమాట;
''పంతము సంధ్యగోపాలు పరగంగ
చెప్ప
తత్తవలు గాదని రాజువద్ద పరివార
మెల్ల
అవి వూరజంగి లావులని వాటిని
బట్ట

తగినన్ని యీటెలు తల కోలలు
చే స్తిరి
ఆవులు యెదురెక్కినపుడే అన్నీద
వేసి
వేగిరాన రాకున్న మన తలల
పెంచులుగా ద్రొక్కి
వెక్కి డొక్కలు చినగ కొందరిని
దొరకొని పొడుచు
ప్రాణాలు గటుపుకొని పరుగున
వ స్తిమి"
అని యిట్లు వారంత అనుచుండగాను
ఆవుల ముందర లేగలు ఆడుచు
నుండి
చల్లాటము లాడుచు చంగలింపుచును
ఆవుల యడబాసి దూరముగా
ఆడుచునుండె
చిన్న లేగల జూచి చేరువకాండ్లు
ముదమొంది నాయకులు మొనసి
యిట్లనిరి
"అన్నలారా! మీకు యింత ఆపద
యాల?
ఆవులన్నియు మనకు హ స్తగత
మాయ
దూరాన వున్నవి త్రుళ్లుచు లేగలు
ఆవులతో కలియకుండ అడ్డము
పోయి
లేగలు తోలుకరావచ్చు
లేశమాత్రమున
తగ వీటి తోలితే తల్లులన్నియును
తమకు తామే వచ్చు మన తావుల
దనుక
అగర్లు గొట్టుచు అవె వచ్చుననుచు
పడగొట్టకుడి లేగల తడెగుడెలతోను
సూక్ష్మమైన సన్నపు చువ్వలతోను
పూరపశువుల లేగల వాగి తోలినట్లు
ఆవులతో తోలుదము" అని అందరు
చేపట్టి
హేపెట్టి తోలంగ యెగిరె లేగలును
శానలు తోలంగ ఆవులు ధిక్కరించి
చిరికొట్టి ఆవులు చిర్రుముర్రాడి
పట్టి తోలుమని బలములు గదిశ
చలరేగి లేగలు చంగలింపుచును
క్రేపుల నటుద్రొక్కి కికురుపడె
దళము
ఆగ్రరు గేయని అరచి ముత్తురుపురులు
లేగలు ఆర్లుకొని లేళ్ళవలె యెగసి
మేదినిపైజూచి మెండైన దళముల
తాటించి తన్నిన తలలూడిపడెను
కాలు తాటింపుచు కదులేగలెల్ల
లేళ్ళ గుమిచూచి సింహములు
లేచినట్లు
యడపక పగతుల యదములు పగుల
తన్నుచు త్రొక్కుచు లేగలు
దళములు గూల్చి
నాలుకలు చాచుచు నతికోపమునను
పగవారు శత్రువులు అరికట్టబోయి
వురికి తల పునకలు వూడిపడ తన్ను
తోకలు గిట్టలు చిక్కి దొర్లెడ కన్నె

ధేనువుల దగ్గరికిపోసు తెరువు
లేర్పడను
యదరించి లేగలు యస గూల్చె
భువిని
ఆవుల దగ్గరికి పోకుండ
అరికట్టి వారిని
పొట్టేండ్లవలె తాకిన లేవలేక
'యరగక లేగలని వస్తి' మనుచు
యదపడువారు
ఆశకు వచ్చిన ఆ కొల్లగాండ్ల
రోషించి లేగలు దురిమార్చి చంపె
గొదకొని లేగలు పగతులు
ఘోషించగాను
పద్మనాయుడు రాజు పల్లికొండతోను
'మఱి వేన సిద్ధిరాజు దళము మంద పై
కదసి
యెద్దులావుల తెరవురా వెంతపరచి
చెల్లాటము లాడుచు లేగలవెంత
నుండగాను
పగదళము చుట్టుకొని లేగలపట్టి
తారినారు
కోపించి లేగలు కొట్టిమిట్టాడి
చుట్టుకున్న దళములు సుడివడ
చంపుచు
ఆ గుఱ్ఱు గేయని తల్లులు
అటు పిలిచినారు
నీ శలవులేక యెద్దులావులు చెల్లింపు
చున్నావి
యెద్దులావులకు శలవు యిచ్చి పంపు
తేర్పరచి
యిప్పుడు యెవ్వరెవ్వరిమీద
యెదిరించవలెనుః
శలవిచ్చి పంపు' మని చెప్పెను రాజు

## పల్లికొండ ఎఱ్ఱయ్యతో పంపు లేర్పరచుట

పల్లికొండ లేచి పంపు లేర్పరచె
పేరు పేరున కాటమరాజు పిలిచె
నందరిని
తమ్ముడు యఱ్ఱయ్యను డాయంగ
బిలిచి
మరిది చట్టవారి యఱ్ఱన్నను మరి వేగ
బిలిచి
'యిద్దరు మీరు నిలచి యుద్ధము
సేయుడి'
అని చెప్పి తమ్ముని మరిదిని అటు
కౌగిలించి
'మా కోర్కె పగతులపై మనసు
రంజిల్ల
మించి పగతుల మెదడు మేదినిమీద
కుప్పలుగ రాలంగ ఘోరయుద్ధంబు
వో తమ్ముడా! వో మరిది!
వుదయాస్తమానంబు

సీతాపతి కృపను సేయుడ యుద్ధంబు
యెద్దుల డీకొల్పి తమ్ముడా!
యేనుగుల బొడిపించు
అవుల డీ కొల్పి ఆశ్వాల బొడిపించు
ఆ మీద పసులజుల మీరు
హతము సేయండి'
అని శెలవు యిచ్చిరి హరిగురువు
రాజు
పనిచిన రాజుకు పల్లికొండకు మ్రొక్కి
యరసన్న య్ర్రయ్య వేడుకతోను
కడు వేగ రణముకు కట్టాయుత్తు
పడిరి
అప్పుడు కట్టిరి హనుమంత కాశ
వీరులై తలకురులు వీరజడ లల్లి
విరజాజులు రణమందు వేగ ధరియించి
మెడను పువ్వులు గంధములు
మేలు హారములు
శర కుంతలంబులు చాతను బట్టి
బెజవాడ బెబ్బులి పెయ్యల
యర్రయ్య
వేడుకతో రణరంగ వీథి కేతెంచి
యర్రయ్య, సాదంటి సట్టిహరి
యర్రన్న

నవరత్న భూషణాలు నపుడు
ధరియించి
కరి మొప్ప ఏక పెను గద తీసుకొని
హరులతో పోరాడ అప్పుడేతెంచ
పశుభాష తెలిసిన పరసు పుణ్యుండు
పశువులలో నిలిచి పగతుల మీదికి
పయనము గమ్మని భావంబు దెలిపె
అప్పుడు ఆవుకు హరిమంత్రం
యెద్దుకు గురుమంత్రం
వినిపించి పీనులకు యిది
మోక్షమనుచు
గురి దెలసి యెద్దులావులు గుప్పన
నిలచి
ఆత్మభావము దెలిసి అవి లేచ ననుచు
అప్పుడు పగదళమును హతముగా
జంప
పల్లికొండ జెప్పిన పంపకం దెలుప
అన్నిటి పేరుపేర ఆవుల బిలచి
పల్లవాది రాజు బలముల పైకి
యచ్చరికెతో బిలిచి యెద్దులావులను
భీకర లీలతో పృథివి గంపింప
బాగుగా డీకొల్పె యెద్దులావుల
బలములమీదికి

## ఎఱ్ఱయ్య యెద్దులను ఆవులను ఆహ్వానించుట

"సురభి ధేనువులార! సురకాంత
లార!
కరుణతో మాపాల కలిగితిరైన
వచ్చిన దళములమీద వుగ్రులై మీరు

యిప్పుడు దీకొని పొడిచి యిల గూల్చుచలయు
వాహిణి సిద్ధిరాజు వచ్చిన దండు
రాశిగ రంపమారై చెడ బొడవు
శ్రీకంఠము రాజు శానలేతెంచు
యేకాంబర నాథ మెచ్చిరించి పొడవు
గుత్తి గుఱ్రంకొండ కూటపుచుకెల్ల
ప్లంహాదు తండ్రిని బట్టి పరగ చీరినయట్లు
అల్లి నృసింహ మూర్తివై ఆదికొని చంపు
కుంభకోణము మూకలు కూడెను దండు
పరగ వేదములకై సోమకాసురుని చంపినయట్లు
జాంబవనాథ ! నీవు చెర్లించి పొడువు
మార్కొనవచ్చును సామంత మళయాళదండు
బలిని భూదానము అడిగి పాతాళ మునకు
అణగద్రొక్కిన శ్రీహరి కృపవలెను
కోర్కొండ గిరినాథ ఘోరించు పగతుల
మట్టి నురుమాడవలె మాయగా నిపుడు
కాశ్మీర కర్నాట దళములు గడికొని వచ్చె
పరశురాముడు కార్తె పరగ వీరుణ్ణి[32]
వేయు శిరములు త్రుంచిన విధమున నిపుడు
హరిమల్లె చెన్నుడా అచెరిపడ పొడువు
వేవేగ పల్లముల యఱ్రమల నుంచి
వచ్చిరి తుపాకి వరస నాయకులు
హరిరామ కృపచేత ఆ రావణునిమీద
పరగ శ్రీరాముడు పంపైనయట్లు
గొడుగుమల్లె చెన్నుడా ! ఘోరించి పొడువు
మదగజంబులు చాల మందమీదికి వచ్చె
మధురలో కృష్ణుండు మామకంసుణ్ణి
తల విదలించినట్లు తడువు శాయకను
కదిరి వోబళనాథ! కలుగా జంపు
పుల్లయెద్దు మట్టియెద్దు పురహరుడు బసువన్న
కల్లగాదు నేడు కట్టడి మనకు
కటక జగన్నాథుని కరుణను మీరు"
యెద్దుల వెనకొల్పి వెనయ దీవించి
ఆవుల బిలిచెను అతివేగమునను
"ఆరురాజ్యపు మూకలు ఆదికొని వచ్చె
పొచ్చి పొడుతువు ధావె పోగలనెవలి!
మొరసరాజ్యపు మూకలు మునుకొని వచ్చె
భాగీరథీ గంగ! బలముతో పొడువు
వాగర్తమూకలు వచ్చెను దండు

32. పరగ కార్తవీర్యుని

శ్రీలక్ష్మి! గుర్రాల చీరుదువు రమ్ము!
గోదావరీ!రమ్ము గొంతి! గాంధారి!
భూదేవి! సరస్వతి! పొందుగా రమ్ము
భూతేశ గిరిజ! వో భూమిదేవమ్మ!
భైరవి! విరాళి! భద్రగిరివినుత!
దుర్గ! మహాంకాళి! దుందుభి! రావె
సౌమిత్రి! జాంబవతి!సముద్రాదేవి!
కంసల్య! రేవతి! కాళిందీ! రమ్ము
ధర్మదేవత! చంద్ర తగమతిదేవి![33]
ఆల్య![34] ద్రౌపతి! రమ్ము, అరుంధతి దేవి!
అమ్మ సీతా! రావె, అంజనీదేవి!
పార్వతమ్మా! రావె, భద్రకాళమ్మ!
పద్మాక్షి! రావమ్మ, పాంచాలి!రమ్ము
పాలపెద్ద! రావె, పతితపావని!రమ్ము
త్రిపురసంహారి! రావె, దివ్యాంబరీ! రమ్ము
దివ్య తేజముగల సప్తద్వీపమా![35] రమ్ము
దేవకన్నిక! రావె, దేవకి! రమ్ము
భోగావతీ! రమ్ము, బొండుమల్లెరో! రమ్ము
గాంధారి! రావమ్మ కయ్యము కాయ
వైనముగా యిక పిలువ వడిప్రొద్దు లేదు''
అన్ని ఆవుల బిలచి తన హస్తములు యెత్తి
మొక్కి పగతుల చూపె మొనసి యిరుగడల
శలకోల యెత్తిన ఆవులు చల్లించి లేచ.

## ఆవులు ఎద్దులు యుద్ధము సేయుట

నాగుపాముల రీతి నర్రావు లెల్ల
పంపులు యేర్పడి ప్రఖ్యాతిగాను
మానవేంద్రుని అశ్వాదారముల చేర్చి నట్లు
పుఙ్గంగ ఆవులు వడి మిర్రుచూచి
పొంకముతో మెరసి పొడెము త్రొక్కుచును
ఝుడుపును యెరుపును శంఖయు లేక
పొడువు, చంపు, త్రుంపు, పొడువు మటంచు
యెద్దులు చెలరేగె యేనుగల మీద
దంతి ఘటములతోను తగిలి పోరాడి
కొమ్మున చిమ్మిన కుంభస్థలములు పగిలి

33. తగ చంద్రమతిదేవి 34. అహల్య 35. (సప్త) దీపమా (?)

యేనుగులన్ని భూధరముల కూలె
ముమ్మరముగ యెద్దులు మొత్తముగ
దూకి
తలలూడ తన్నుచు యేనుగుల తగ
పొడిచి చంపు
గుఱ్ఱాల మీద అవులు గొదకొను
కదసి
నఱ్ఱావు లన్నియు నతి కోపమునను
పరగ వాలముల యెత్తి పాదముల
తాటించి
చాల రోషమున చౌలు[౩౭] దిక్కరించి
తూరి గుఱ్ఱాల పొడిచె తుది పదము
గాను
వెను వెంట యఱ్ఱయ్య
వెసకొల్పుచున్న
చంగలింపుచు యెగసె శంఖయు లేక
అశ్వాలపై రౌతుల తన్నిన అటు
తలలెగసి
అరుచుచు ధరణిపై అన్నియు వ్రాలి
యెగసి పడుచుండెను యా తల లన్ని
భావమరిది చూచి పకపక నవ్వుచును
వ్రాలిన శిరసులపై నడిచె నఱ్ఱావు
తెల్ల
అశ్వాల బారుల కెదురెక్కి
హతము కాయంగ
సలుగు బెద్దులు యేనుగుల
సాహసంబునను

చెక్కిళ్ళ పొడిచిన కొమ్ములు చౌలకు
దూరు
పక్కల పొడిచిన కొమ్ములు బయలకు
వెడలు
కుతికల బొడిచిన కొమ్ములు
గుండెలు తునిగె
వెన్నున కొమ్ములు వెళ్ళగుమ్మచును
పకాళించి తన్నిన కుంభస్థళములు
పగిలి
మెదడు కుప్పలుగ రాలు మేదిని మీద
యఱ్ఱన్న యఱ్ఱయ్య చూచి వేడుక
పడుచు
కరుల నురుమాడుచు యెద్దులు
కల్లిలోపలను
కావు లావులు యెద్దులు రణకల్లి
కాయంగ
యఱ్ఱయ్య చట్టవారి యరనన్న
యసకొల్పగాను
చూచి పాప సిద్ధిరాజు చోద్యపడు
కొనుచు
యేనుగులు గుఱ్ఱాలు రణమున
యేకముగ వొరిగి
వుణ్ణంగ పన్నిద్దరు దళవాయుపులను
పిలిచి
పలికె నిట్లని రాజు బియదు మన్నీల
తోను

---

౩౭. చెవులు

'వేగ సంధ్య గోపాలుని మాట కల్లని
పలికితిరం
యేనుగల అశ్వాల యెద్దు లావులు
గూల్చె
దళములపై కదిసి యిక తాచుల
భంగి
అందరూ కదిసి యెద్దులావుల
హతముగా శాయ వలెను'
అని చెప్పిన తుపాకులు ఆగుభుగులు
గాను
యెద్దులావుల మీద యెడమ లేకుండ
కాల్చిరి తుపాకులు రణఘొల్లు గాను
రణము రణమున రణభేరి వాయించి
కదిసిరి యీ లెలు కత్తులు వారు
మందపై విలుమూక మంచు చందాన
చలగి సమరము చేసిరి చదరక
నిలచి
నలుగు ఎద్దులు ఆవులు పగతులు
సరికొని పోరంగ
యఱ్ఱనన్న యఱ్ఱయ్య చూచి
వేడుక పడుచు
బావమరదులు యిద్దరూ రణములో
భావంబు పోల్చి
పరగ యిరు దళముల కోపమే
ప్రళయ వాయువు గాగ
పురువైన వాయిద్యములు వురుములు
గాగ

దాయల బల్లాలు ఝళిపించి తళుకు
గుఱతెంప తీగలై ఘన మెరుపులు
గాగ
యసగంగ సూర్యపుత్రములు యింద్ర
ధనువులు గాగ
వసుధ తుపాకిగుండ్లు వడిగండ్లు
గాగ
సిద్ధిరాజు శానలు చెలరేగి యప్పుడు
యీరీతి భావమున యడము లేకుండ
సాహసంబున గోవుల చలరేగిపొడిచి
కదిసి గోవులు పొడిచిన కడు
వారుగు వారు
కలసి విలుమూకలు కయ్యంబులోను
యెద్దులావుల మీద బాణాలు
యెడము లేకుండ
పరగ గురియింపంగ పంతపు
ధేనువులు
గొదకొని చలరేగి గోవులు పొడిచ
కదసి గోవులు పొడిచి కాల్బలంబులు
వొంగె
కదసి విలుమూకలు కయ్యంబులోను
గోవుల యెద్దుల గోపాలకుల మీద
యడలేక బాణాలు వెస గురియించిరి
గొదకొని అశ్వాల
కొమ్ముచేసుగులను
కూలిచెను ఆవులు ఘోర రణమందు

## ఆవుల ఎద్దుల పోరునకు దేవతలు హర్షించుట

హరి హరులు దేవతలు అటు మహా మునులు
రుషులు కిన్నెరులును రూఢిగా జూచి
యెద్దు లావుల పోట్లాటకు వేడుక పడిరి
ఆవులెద్దుల మీద పువ్వుల వరషంబు
హరులు గురియించిరి వెనువెంట అక్షింతలు విడిరి
మునులు మగి సంతసంబున యెద్దు లావులు మదిని
'హరిహరులు మాపై అక్షింతలు వేయుట
పాపనివారణంబాయె యిఖపరము లరుగుదుమను
అనుచు సంతోషముగనున్న ఆవుల మీద
వేడుచునున్నట్టి యెద్దులమీద
సంసంగ చిక్కిన సాహసులు కదిసి
వేసిన బాణాలు వెలయు నంబులును
యడలేక వేసిరి వేయువిధములాను
యెద్దు లావులకు పోట్లు యడత్రెక నాటె
ఘనమైన యెద్దులకు గాయాలు నాటె
గన్నెరాకు అంబులు ఆవులకు ఘడియలో నాటె
దోనెయింటి కోలలు యెద్దుల తొడల సరికట్టె
యేనుగుల చంపే పోతుటెద్దులు వరిగె
అలంబులో చాల అంపకోలలు నాటె
భోరు భోరున అరిచె పోడితేగ తెల్ల
చదరక యేనుగుల చెల్లించి పోడిచి
సలుగుటెద్దులు వరిగె సమరంబు లోను
అంతట గోపాలకులు ఆవులెద్దుల చాత
యెంతయు పగతులమీద యెసగూల్చె
దళమును యేనుగుల తగగను ఆశ్వాల
కూల్చిరి రణమంచు కొదువ లేకుండ
యదరించిన దళమును యంతయు గూల్చి
యెద్దులావులు వొరిగె పద్దులు వేగ చెల్లె

## ఎఱ్ఱయ్య కలియబడి పాపసిద్ధిరాజు పనిపట్టుట

తలపోసి ఎఱ్ఱయ్య తడవాయ ననుచు
కదిసెను పగతులమీద కయ్యంబు శాయ

కోర్కెతో జగజంపు గొడుగుల
నీడను
సిద్ధిరాజువెంటను శ్రీకంఠమురాజు
పన్నిద్దరు దళవాయువులు వారలై
వుణ్ణంగ
మదము టేనుగుల దీర్చి మావటీల
చూచి
వేవేగ నవ్వుచు యర్రయ్య చట్టవారి
యర్రన్న
అధిక శూరులమీద అప్పుడు కదిసికి
మహిపాలకునివద్ద
మదము టేనుగులకు
ఆయుధాల కొమ్ములకు అమరించి కట్టి
కడువేగ గొలుసులు తొండాల
గట్టించి
ఘోరాజి ఢీకొల్పి కొమ్ము టేనుగులను
మదగజంబుల మీదికి మరి చట్ట
యరనన్న
గద తీసికొని కదిసి గమనించి మించి
చేరి విక్రమశాలులకు శంఖయు లేక
మెండొడ్డి కదిసిన యేనుగుల
మించి గదయెత్తి
అప్పుడు కదిసి హాంకారులై పోరి
పికుగుతో సరియైన పెను
గదలతోను
దట్టించి యేనుగుల దాసి కొట్టినను
కుంభస్థలంబులు పగిలె
కుంజరంబులు వరిగె
అవుల యర్రయ్య చట్టవారి
యర్రనన్న

అశ్వాలమీద చెలరేగి హోగ్రులై
మంది
వడిసి శ్రీకఠమురాజు శిరస్సుపై
వజ్రాయుధంబు బూని
భీకరశక్తితో నరిగి పెరిగి పడవైచిరి
బావమరదులు యిద్దరు
పాపసిద్ధిరాజును జూచి
కయ్యంబు శాయను కదిసి రావలెను
పరగ గజముపై నుండి పాపసిద్ధిరాజు
కదిసిన వారిపై కరిని ఢీకొల్పి
ఆగ్రులై కదిసిరి అవనిఘూర్ణిల్ల
సాహసులు ఢీకొన్న చందంబు వీర
తమకముపై నుండి తగ నలనన్న
చూచి వేడుకపడగ చోద్యంబుగాను
పింజ పింజ కదిసి బాణాలు పృథ్వి
గంపింప
కడువచ్చు బాణాలు గదను యగదట్టి
భీకర లీలతో పెను గద యెత్తి
కొట్టిరి రిపులను గుట్టలు వేయుచు
రంజిల్లసాగెను రణవీథిలోను
కృతయుగంబున లక్ష్మణు లంకమీదికి
కదిసి
వేగ రావణుమీద యదరించినట్లు
ఆ సిద్ధిరాజుమీద యుద్ధంబు అటు
శాయగాను
సురులెల్ల దివినుండి చోద్యపడగాను
తరుచైన అంబులు యడతడవు
లేకుండ
కంచు తుపాకి గుండ్లు వడిగండ్లవాన
చందమున

పనివడి పోరాడి పాప సిద్ధిరాజును
చేరి యా యఱ్ఱన్న శిరమంట పొడిచ
అప్పుడు యరనన్న ఆయిదు
అంబులు తొడిగి
వైచిన రాజు గజము వుర్విపై నొరిగె
వెనువెంట యఱ్ఱయ్య యోజనంబుల
తోను
రాజ సిద్ధిరాజును రణమందు గూల్చె
తక్కిన బలములు తందర
లాడుచును
చిక్కిన బలములనెల్ల చేరి రణమందు
యెదురు రొమ్మున పోట్లతో యేకాంగి
వీరులై
చదరక నిలచిరి సమరంబులోను
గోపాలకులు వరిగిరి గోవులు మడిసె
పరగ నంతటికిని భానుడు గ్రుంకె
మగిడి వచ్చిరి యిద్దరు మందలోపలికి
అని గెలిచి యిద్దరు అవులన్న యదట
నిట్టూర్పు లూర్చుచు పోట్లతో నిలచిరి
యిద్దరును
కనుగొని నలనన్న కవుగిలించుకొని
మునుపటి తమ్ముల ముందర
వుంచెను
గాయాలకు శ్రీతులసి పత్రి గట్టించ
గొదకొని యిద్దరిని కూర్చుండ
నుంచిరి
పల్లికొండ, రాజు, బంధువర్గంబు
శివపురాణము వినుచు యేకచిత్తమున
నుండి
శివరాత్రి జాగరము చేసినయట్లు
అతివేడ్కతో నున్న అర్కుడు
పొడిచె.



# ఏడవ కాండము

# కాటమరాజు యుద్ధము

## కాటమరాజు పద్మరాఘవుడు యుద్ధమునకు సిద్ధమగుట

అంతట మరువాడు అమావాస్య నాడు
పపంపు నలసిద్ధిరాజు బారు లేతెంచ
కడువేగ యెదిరించి కాటమరాజు
పద్మనాయుడు తాను పైనముగాను
కట్టిరి హనుమంత కాశలు వేగ
హనుమంత కాశపై రేమంతముండ్లు
చామంతిపువ్వుల బంతులు వేసిరి
చలగుచు వేగ
కనక వడ్డాణము కట్టిరి మీద
మేలుతుమ్మెద రెక్క మీరిన వన్నె
సంపంగి నూనె వంపించెను చక్కని
కురులు
వీరజడ లల్లిరి వేడుకపడుచు
ముడిచిరి గేదంగులు జడ
ముంచుకొనియుండ
ఫాలమున కస్తూరి బాగుగా దిద్దిరి
పచ్చల చెక్కిన వులిగోరు
పతకములు ధరియించిరి
సన్నపు రుద్రాక్ష సరులు ధరియించి
వన్నెగా బిరుదులు వరుస ధరియించి

చల్లవారి పుల్లయెద్దు సలుగుటెద్దులకు
కొమ్ములకు కుందనపు కుప్పెలు
దాపి
ఘంటలు మెడను బొడ్డుఘంట
ధరియించె
నాల్గుకాళ్లను నాదుటందెలు ధరియించ
పంచవన్నె జల్లులు పట్టెండ్లు వేసె
ముత్యాలు దాపిన మువ్వలు దాల్చె
శంఖు చక్రంబులు చెవుల నమరించ
శిపనంపుల గుడారు వెడలి
చిరునవ్వుతోను
పరగ తా కోరికదీర యా
పల్లికొండను
తానుండు సింహాసన తమకముపై
నుంచి
మానవేశ్వరుండైన మాధవుడు
నలనన్న
అల్ల రఘుపతిని చూచి అప్పుడిట్ల
నెను:

## భక్తిరన్న రాలేదని పశువులన్న తలపోయుట

"బావరో వో బావ! పల్లికొండ
రఘుపతి!
అన్నిట సంతోషమాయ బావ!
ఆమరంగ వినుము

యీవేళ బత్తిరెన్న లేడాయ బావ!
చలగి యా కురురాజు శానల రీతి
నలసిద్ధిరాజు బలములతో యెద్దు
లావులు నని సేయు విధము
కన్నులజూడ బత్తిరెన్నకు కారణము
లేదు
నేటికి రాడాయ నేనేమి సేతు
మనసు తీరగ నేను మరి సిద్ధిరాజును
మట్టల కుంతలమున నేను వాని
శిరము ఖండించి
పగవాని శిరస్సు గంగకు పాదకానుక
పెట్టు వేళాయ
హరి హర బ్రహ్మరుద్రులు అమర
దేవతులు
సురలోకమున నుంచి చూస్తు
వున్నారు
యింతలో బత్తిరన్న యిటకు
వచ్చునో రాడో
బాపరో, తెలుపుమీ పంతపు మాట''

## భక్తిరన్న రాకనుగూర్చి పల్లికొండ చెప్పుట

విని పల్లికొండయు విస్మయంబంది-
"వో మరిది కాటమరాజు! వినుము
వార్త చెప్పేను
యీ జగడ వృత్తాంతము భక్తుడు
యరగడినాడట్టు
దశమి యేకాదశి ద్వాదశి మొదలు
యీశ్వరుని పూజ శాయగా యేక
చిత్తమున
వున్నాడు యెరుగదు వొగి పెద్దలక్ష్మి
నేడు
అక్కడ పెద్దలకు మోక్ష మందించు
వేళ
కడిసి పగతుల చంప కారణము నీకు
యనయంగ తుదియుద్ధం యిపుడు
నీవు యరగడ్డపాట
పరశు భిండివాల పట్టెసంబులతోను
పగతుల మీద నీవు యెద్దులు పరగ
డీకొల్పిన
చేసేటి యుద్ధము చెల్లేటి బలము
కాశిలో నీ యుద్ధము కానవచ్చేని
అప్పుడు భక్తిరన్న ఆ విశ్వనాధునికి
వప్పుగా సాష్టాంగము వనరంగ
మ్రొక్కి
వేవేగ దొనకొండకు వెంచేసు నతడు
కనక రథములో వచ్చు, కాటమరాజు!
కాశీ తీర్థంబును గయనున్న విభూతి
దేశాంత్రి అయ్యగారు తెచ్చే ని యిటకు
పరగ మున్నూట యనభై ఆమడ
నేట రేపటగాని నెళవుగా రాడు

దివ్యదృష్టిగల భక్తుడు లేడను దృష్టి
నీకేల?
కాటమరాజు! మీయన్న వున్నట్టె
నాకు కొదవేమి?
యిరువురు వంశముల వారికి
యిహ పరము లియ్య
అరిగెను భక్తుడు వుత్తర కాశియాత్ర
ఆవులు మేప దక్షిణానికి అరుదెంచి
వస్తివి

పగలు చేకూరెను పశుపతిరాజు!
నీవు నీ పగతుల నిర్జించువరకు
తల్లివంకవార్ని తండ్రివంక వార్ని
యేడు తరాల పెద్దల వెంటబెట్టుకొని
భక్తుడు వచ్చేని నీవు పగ
సంహ్వారించు"
పల్లికొండమాటకు పశుపతి నవ్వి
'విష్ణపం వున్నాది బావ! విను;మని
పలికె

## పశుపతి పల్లికొండ సెలవు వేడుట

"పరగ యాదవులు పరవుపకారులని
తర తరముల నుంచి ధాత్రిలోపలను
పొగడబడుచు వుండ పోట్లాట
గలిగె
తగిన రాజు లేడు ధాత్రిని
యిన్నాళ్ల
నా పుణ్యవశమున నే కోరినట్లు
నీ పాద పద్మములు నే చూడ గంటి
రాజువు గురుడవు రక్షకుడవు నీవు
భానుకులజుండగు పల్లవాడి రాజు
యేనుగ ఘటములతో యదరించినాడు
యదరించి యుద్ధము శాయ మాకు
మాకు యేది వుపాయంబు?
కదనంబు చేసేటి క్రమము లెల్ల
నేడు

యీడైన రాజుతో యుద్ధంబు గలిగె
తమకు సెలవిచ్చి నీవు తమకముపై
నుండి
చూడుమా వో బావ! చోద్యంబు
అనక".
అను రాఘవుడు తాను ఆ
పల్లికొండకు
వినయులై అనేక యిష్టములు జెప్పి
ముగ్గురు మూర్తులు యిచ్చిన
ముక్కమ్మి కుంతము
డాబేత కుంతలం డాయంగ బట్టి
ఖడ్గ త్రిశూలమనే గాండీవ మంది
పగతుల వడి గూల్చ పద్మరాఘవుడు
కనక నంబుల పొది గాజు విల్లందె
కొందరు కనకపిడి కోలలు బట్టిరి

అందరు యాదవులు సూర్యకటార్లు
అంది
గొనకొని వక లక్ష గోపాలకుల
నడుమ
అనాడు శ్రీరాము పెండ్లికి అరుగు
చందమూను
గలిగి పేరంటాలై గంగయు రాగ
పెనగొని త్రిమూర్తులు
పెండ్లిపెద్దలు గాగ
పనివడి శారదాదేవి లక్ష్మి
పార్వతియు
దేవతలు భృత్యులై దివినుండి చూడ
కమలాక్షు శ్రీహరి కరుణని రాజును
కనక రథమై యితరులకు
కానంగరాదు

మునుకొని మహామునులు దీవింప
పరగ తుంబురు నారదాదులు పొగడ
గవకూడి యా దేవకన్నెక లంత
'కల్యాణమే గౌరి కల్యాణమే'
యనుచు
మంగళ శుభకార్యమైనట్టు రాజుకు
చలగుచు నేతేర సమర సన్నాహంబు
మెరసి
భజంత్రీలు ఢంకలు పంచ
వాద్యములు
త్రిజగంబు లెల్లను దిగులుకొనగాను
నవపంచ గొడుగుల నీడను నలనన్న
గదిలె.

## నలనన్న రణమునకు నడచుట

పడిగెలు గొడుగులు వుభయ
పార్శ్వముల
మెరయుచు పట్టిరి మేలు మేలనుచు
నడుమను బసువన్న నందివలె గదిలె
కలసి యిరువంకలను ప్రమథాదుల
వలెను
సలుగు టెద్దులు గదిలె సాహసం
మెరసి
ఛత్ర చామరములు చేరి పట్టంగ
వెంట వింజామరంబులు
వేయుచునుండ

ఆలవట్టంబులు రాజుకు ఆవ లీవలను
సింహ్వాతలాటములు రాజుకు చేరి
పట్టంగ
భుజకీర్తులు గల రాజుకు భూ చక్ర
గొడుగులు పట్టిరి
హనుమంత పడిగెలు అసుర
తలాటములు
ముందర రణభేరి రాజుకు ముకుంద
బల్లెము
నరగలు వీణెలు నాగస్వరములును
గ్రమ్మున మ్రోవంగ కదిలెను ధాళు

కత్తిపీడు నలనన్న కదిలి రాగాను
కనకతో కదిలెను కాంతి చెంద్రుండు
ప్రళయాంతకుని బోలి పద్మనాభుని బోలి
నలసిద్ధి రాజుతో నని శాయ బూని
నిలచ గొడుగుల నడుమ నీలవర్ణుండు.

## నలనన్న రూపమును చూచి నలసిద్ధి ఆశ్చర్యపడుట

శానలు నలుగడల చేరి కొలువంగ
గజముపై సిద్ధిరాజు కనుగొని చూచి
కాటంరాజు చక్కదనంబు కడు వున్నతంబు
అతని గాత్రంబు చూచి ఆశ్చర్యమంది:
"యిన్నాళ్ళు భూమి యేలితిమి మనకు
యితని దొడ్డతనంబు యితని రాజనము
యెంచి చెప్పగలేదు యెవ్వరు అయిన
అనుకోంగ విన్నవారము కాము ఆశ్చర్యమాయ
చాత కుంతలము బట్టి చసుదెంచినపుడు
యితడు గొల్లరాజని యేర్పడ గాక
అలా యుద్ధం పట్టడాయను గాక
బలభద్రుడు రాముతో పొటిఁపదగును
శరచాపము యశోడు చేబూనితేను
పరికింప శ్రీరామభద్రుడనవచ్చు
గాండీవశస్త్రములు కడు లేవుగాని
పాండవార్జునుడను ప్రతి యనవచ్చు
యింతవాని తొడముట్ట యుద్ధం చేసిన
పంతము నిలుచు"నని సిద్ధిరాజు బలమతో అనెను
'పంతముగల నలసిద్ధి పట్టభద్రునికి గాక
తక్కినవారికి తరముగా'దనుచు
అని యిట్లు పరివారము అంతయు బలుక

## కాటమరాజు-నలసిద్ధి కయ్యమున గలియుట

యినకులాధిపుడైన యా సిద్ధిరాజు
కాటమరాజుతో కయ్యంబుశాయ
మేటి బలములతోను మెరసి పోరాడ
రామభద్రుని బలము రావణు బలము
కదిపిన చందాన కాటమరాజు

పొందుగా నిలిచి పోల్చి మదియందు
పేరుసాగిన సంగుబెడ్లు పెండ్లి
దొరలుగాగ
పేరుగల బసువన్న
పెండ్లికొడుకుగాగ
బుధుడు బృహస్పతి
పురుహూతలు[87]గాగ
పృథివి యఱగడ్డపాడు పెండ్లి
అరుగుగాగ
శ్రీదేవి శ్రీకాంత సేసలు చల్ల
కడగి పేరంటాలు గంగయు గాగ
పశుపతి నలనన్న పద్మరాఘవుడు
పేర్మితో బసునన్న
తోడిపెండ్లికొడుకయ్యె
నిగుడంపు తుపాకి నిప్పులగుండ్లు
యెలమితో పెండ్లికి
యెదుర్కోలుగాగ
అరచి వేసేటి అంబులు
అక్షింతలుగాగ
ఉబురు ఝుంగులు కాల్చిన
సరితాకు గుండ్లు
విరజాజి మొగ్గల వేట్లాట గాగ
పెటబొబ్బలు పూర్పిళ్ళు పెద్ద
రంతులును
పెండ్లిపాటలుగాగ పృథ్వి కంపింప
వడి రక్తధారలు వసంతములుగాగ
పల్లవాదిరాజును పశుపతిరాజు
పెండ్లికూతురు అని పేర్మితో కోరి

చూచి వేడుకపడుచు శూరుడై
వుణ్ణంగ
కదిసి పోరాడుచు కొందరు
కయ్యంబులోను
చెయిచెయ్యి తారసిలి శంకయులేక
సురియలతో పోట్లాడుదురు శూరులై
కొంత
కాలు కాలు పెనసి కల్లిలోపలను
వనరైన బాకుల పోట్లాడువారు
పండ్లుగీటుచు కటార్లు పైకొని కదసి
పడిగుద్దు లాడేటి బిరుదు మన్నీలు
పరువడి సేయుచు పరగ నవ్వుచును
కదిసి సూర్యకటార్ల పొడిచి
కల్లిలోపలను
'వో స్వామి' యనుచును
వొరిగేటివారు
విల్లనంబులు పూని వేట్లాడువారు
చిల్లకోల అంబులు చేరి వేయంగ
తూరి యూ బాణాలు దురమందు వెళ్ళి
సమరంబులోపల చొకళించి కదిసి
జంజాళముల పొడిచి
సరినొరుగువారు
కదసి శాస కత్తులచూసి
కడు సాహసమున
అరచుచు నరకుచు ఆటు పొడుచువారు
పూని యీటెలతోను పోట్లాడువారు
మాఘ బహుళ అమావాస్య
మంగళ్వారమునాడు

87. పురోహితులు

అధికులై పోరిరి అంతకంతకును
పేరాళముగ నున్న యా
శాస సదుమ
అధికులై యాదవులు అతి
సంభ్రమమున
శూరులై యుద్ధంబు సేయుచుండగను
చల్లవారి పుల్లయెద్దు సలుగుటెద్దులు
అపుడు
చలరేగి యేనుగులు చర్లించి
పొడిచి
కోలాహలముగా కొమ్ము లేనుగల
చంపి
సలుగుటెద్దులు యేనుగల
సమయింపగాను
ప్రళయకాలరుద్రుండు
బసువన్న యపుడు
పరగ సిద్ధిరాజును పారంగజూచి
దళములపై దూకె తందరజేసి
ఘనరాజు యెక్కిన గజముపై దూకి
చౌకళించి కొమ్మున సాహసంబునను
ఆగ్రుడై బసువన్న ఆదికొని కదిసె
బసవన్న మీదికి భద్ర గజంబును
యసగంగ డీకొల్పె యా సిద్ధిరాజు
గజము పైకొని రాగ కాలుతాటించి
నిలచి రంకెవేసె నీలకంఠుని బోలి
బసువన్న రంకెకు పట్టపు యేనుగ
గజము సింహ్వాము చూచిన కైవడి
కాగ
ఆగ్రొంచి కొమ్ములు అట్టిట్టు అర్చి

మించి ఘంటల మ్రోత మిన్నంటి
మ్రోవ
కాలు దువ్వి దూకి గజమును బొడిచి
కుప్పించి పొడిచిన కుంభస్థళము
పగిలి
గజము రక్తము శల కాల్వ
చందమున
తప్పక రక్తము ధరణిపై బారె
భోదున కొండవలెను గజము
భూమిపై వరిగె
ధారిణీశ్వరుడు సిద్ధిరాజు ధరిణిపై
నిలిచె
కదిసె బసువన్నపై కాల్బలము
తోను
బసువన్న యిరుగడల పగవారు
చేరిరి
ఆదికొని బసువన్న మీద అంప
వర్షంబు
పింజ పింజలు కదిసి పెన
వెయ్యంగ
వుగ్రుడై నలనన్న వురువడి లేచి
కళ్యాణ శుభమనుచు కాటమరాజు
యదపక ఘంటల కుంతల మెత్తి
ఝళిపించి యా సూర్యకాంతులు
చదర
అప్పుడు తళ తళ మెరయ అవని
గంపింప
ఘంటల కుంతలం ఝళిపించిన
ఘనుడు సిద్ధిరాజు

కదిసె కాటమరాజుతో కయ్యంబు
చాయ
•జలము లందరు చూచి భయమంద
గాను
.... లుజా దీసికొని నలసిద్ధిరాజు
దక్షుడు శంభుడు తాగసిలి నట్టు
ధరణి గబ్బరం యెగయ తగను
పోరాడి
కడువేట్కతో రాము రావణులు
కదసిన యట్లు
పృథ్వి ఆకాశంబు ఘూర్ణిల్ల పోరిరి
యిద్దరును
మచ్ఛము మచ్ఛములు మర్లాడినట్లు
వారధి వారధి వడి కదసినట్లు
వడికొని పోరాడి వసుధపై నంత
మేరువ మేరువ కదిసి మెరసినయట్లు
సాహసంబున పోరిరి సాహసు
లిద్దరు
ధరణి భ్రమము యెగిసె సురలు
తందర నొందిరి
సురలు కండ్లు మూసిరి
కడు చోద్యంబు నొంది

సూర్యునికి యఱ్ఱకావురు
చుట్టినట్లాయ
అతివేగ చంద్రునికి మేఘంబు
కప్పినట్లాయ
కాలాంతకుని బోలి కాటమరాజు
సిరి లఘువుతో కదిసి యా
సిద్ధిరాజును
యెదురు రొమ్మున బొడిచెను యగసి
కుంతలాన
కుంతలాన పొడిచిన గుండెలు పగిలి
రంతుగా నార్చిరి రణవీథిలోను
నెరిగూలె రణముపై నలసిద్ధిరాజు
కాటమరాజుకు యరగడ్డపాట
కారణం కనుక
వారుగుచు కాటమరాజును
యద రొమ్మున పొడిచిన
ఆ కాటమ రాజుకు తగిలె గాయాలు
అంతట సిద్ధిరాజు హతమాయె
నపుడు

## సిద్ధిరాజు మడియగా చింకర్ల భీమన పద్మరాఘవునితో పోరుట

సిద్ధిరాజు ప్రధాని చింకర్ల భీమన
కాటమరాజు సంగడీడు పద్మ
రాఘవుడు

అధిక యుద్ధము శాయ నప్పుడు
కదిసి

మన్నీల బొమ్మినేడు మరి
పళను తోసు
రాగాను యా పద్మరాఘవుడు కడని
గాజు విల్లును కత్తి కనక బాణాలు
వేయుచు అర్చుచు వెస గూల్చె రిపుల
మరియు పగతులు మార్కొని
వచ్చిన
చిరిపోతు రాజుకు శివమెక్కినట్లు
పద్మనాయుడి మేన బాణాలు దాకె
ప్రధాని భీమినేడు బవరంబున గూలె

మన్నీల బొమ్మినేడు మామీద గూలె
పరుగుచు పొడిచిన పద్మనాయుని
పక్షస్థలాన
పోటు నాటిన వీరభద్రుని పోలి
విడబడి బారెడు వీరజడలు
తూలగాను
కోపాగ్ని కన్నుల గురియుచు రాజు
కుంతళం ఝళిపించి కూల్చిన రిపుల
దంతీల బొడిచిన ధరగూలు విధము

## యుద్ధభూమి వర్ణన

కూలేటి పీనుగులు గునియు నశ్వాలు
వాలేటి పీనుగులు వరుగు
లొటపిటలు
కదిలేటి మొండ్యాలు కల్లి నెడలేక
చెదరేటి కండలు రక్తాన
చెల్లింపుచుండె
కొండలవలె యేనుగులు కల్లిలో
గురపెట్టుచుండె
అడాడ పడియుండు మోపులై
ఆయుధంబులును
కొల్లగా పడియుండె రణమందు
కోలపడిగెలును
త్రొక్కితే నలిగిన తుడుము లెడలేక
యెడలేక పడియుండె యేనుగు
చవుడోళ్లు

తెప్పలై రక్తాన తేలు గొడుగులును
కుప్పలై పడియుండు గురుపోతుజల్లు
యీడాడ బడియుండు
వింజామరములు
పొగలుచు రణమందు మొండ్యాలు
పొర్లాడుచుండు
కడలేని లొటపిటల కల్లిలో వరిగి
కొదవలేక రణమందు కొండగట్ల రీతి
పడియు పొర్లాడేటి భద్రగజములును
చంద్రవంక గొడ్డళ్ళు చేపట్టు
కత్తులును
భద్రగిరి యీటెలు భద్రాయుధములు
వ్రారలై పడియుండె
వగి రణమునందు

చౌకట్ల పోగులు పరిపెర
గొలుసులును
రాకట్టు కడియములు
రత్నహారములు
ముత్యాల హారములు
ముద్దుటుంగరములు
పతక హారములు బలు సొమ్ములెల్ల
రక్తాన పెనగొని రణమందు నిండె
సైకపు దుప్పట్లు చలువలు మడిగి
తెప్పలై రక్తాన తేలాడుచున్న
పైకొని పడియుండె పడివాగెలన్ని
యింద్ర నీలపు కత్తులు యినప
జీరాలు
అంకె వన్నెతాళ్ళు ఆ కంచుటరిగెలు
పొంకమైన మంచి భూచక్ర
గొడుగులు
అసుర తలాటములు ఆ శంఖ
చక్రములు
వనరైన ఆ మంచి వన్నె గుడార్లు
హెచ్చుగల్గిన యట్టి వెల్లగుడార్లు
యెత్తినచో పీన్గులు యెడలేకయుండె
మురిగిన మొండాలు మూల్గు
పీనుగులు
ఫరపరలై యున్న పట్టుదట్టీలు
కకచికలై యున్న కక్కుకళ్యాలు
అమర గట్టిన సకళాతు పల్లముల
యశ్వాలు
అలసి గాయములతో అటు
తిరుగుచుండు

కుంభిణీ పల్లాలు కూలినశ్వాలు
కరమొప్పు కేడెలు కావు పడగలును
పడగల క్రిందనుపరగ మొండ్యాలు
చాలుకొని పడియుండు
సంకుటరిగెలును
కూలిన లొటిపిటలు గునియు
నశ్వాలు
హేరాళముగ నుండె ఆ రణమందు
నడికట్లతో పరుగు నాయకులు
తరుచు
వడ్డాణములు పరగు వడుసు మప్పేలు
బొమికెలు శిరములు ప్రోగులై
యుండె
వజ్రాంగి ధరియించి పరగు వజ్రీలు
గొరక పోటులునాటి గొరపెట్టుచుండి
చిల్లకోలలు నాటి చెల్లి సాహసులు
గడియాల సాహసులు
మడిసియున్నారు
చినిగిన డొక్కలు చితికిన తలలు
పారేటి రక్తాన పడిన మొండాలు
పక్కలు ముక్కలై పరగె
రణమందు
పెదిమెలు దంతములు పెనగొని
యుండె
చెక్కిళ్ళు చెవులును చేతులు మరియు
మోకాటి చిప్పలు ముంజేతి వేళ్లు
కనుగుడ్లు అడాడ కండలు వుండు
పుర్రెలు పుసికెలు పోగులై యుండె

పండ్ల సందును గరచి పట్టి
నాయకులు
తరచుగా రణమున తలలు పడి
యుండె
బాకులు చేపట్టి పరగ విడువకను
అటు వక్క ప్రాణాన అల్లాతు
నరులు

మొన తెగిన హస్తములు మోపులై
యుండె
కుమ్మరి చేసిన కుండల కుదురు
కూర్చినట్లు తలలు గుట్టలై యుండె
గజములు అశ్వాలు కాలు బలములును
రణమందు అరలేక రాసులై
యుండె

## యాదవుల గెలుపునకు హరిహరులు మెచ్చుట

తమకంబుమీద యాదవరాజు లపుకు
వస్త్రాల తులసిని పరమాత్మ
యనుచు
వేడుచు కట్టుకొని వీరశేఖరులు
నలనన్న పోటులు నాటిన వెనుక
అరువై యేండ్ల నాటి గాయాలు అవి
పల్లికొండకు
అప్పుడు నలనన్న హరి హరుల
వేడ
పల్లికొండయు దలచె పరమేశ
యనుచు
మెచ్చిరి దేవతలు మేలు మేలనుచు
అతని అందము దృఢ మంతయు
చూచి
హరి హరులు వారిపై అవలీలగాను
పృథివిపై కురిసిరి పుష్పవర్షంబు
అంత గోపాలకులకు ఆవులెద్దులకు
మూర్ఛ తెలిసినయట్లు మోహంబు
వీడె

దివ్యమూర్తి పల్లికొండ దృష్టి
నూహించి
ముందు యుద్ధము చేసి ముమ్మయ్య
పోచయ్య
'రా రమ్మని పిలిచి, 'రణములో
వార్త
కాశిలో వున్నట్టి ఘనుడు భక్తునికి
చెప్పంగ కారణము చెంది వున్నాది
యోగ మార్గంబున యెరిగింపు'
డనగ
శలపంది కాశికి చేరిరి బాలలు
అయితన్న నలనన్న అమర
యాదవులు
పంతాన అరులను పట్టిపోనీక
కుంతళముల సామంతుల కురుచ
కత్తులను
కటార్లు జంజాళములును
ఖండివాలములు
ఘనమైన సిద్ధిశాజు కాల్బలంబులను

పరగంగ గద్దెపై బంతాడినట్లు
వెస యుద్ధమున పెండ్లి చేడుకై నట్లు
అందరి మనసుప అరమరలేక
విరివిగా దళమును యిలగూల్చి తాము
పంతాన పోబడి పగవారి చాత
యెద్దుల వుసి కొల్పి యేనుగుల చంపి

ఆవుల డీకొల్పి అశ్వాల గూల్చి
సిద్ధిరాజు బలముల స్రిష్టిపై కూల్చి
బొందితో బొల్లావు పోయె స్వర్గంబు
అజుడనే పుల్లెద్దు హరిపురి కేగె
పగ మిగుల కుండంగ ప్రఖ్యాతి గాను
పగదీర్చె యరగడ్డపాట నలనన్న

## భక్తిరన్న వచ్చువరకు రణరంగమును వీరగంగ కాచియుండుట

పల్లవ రాజుల పాలేట జంపి
పగవారి రక్తం గంగకు ప్రదక్షిణం తిరిగి
పారుచుండగ గంగకు పగవాని శిరస్సు
పాదకానుక పెట్టి ప్రస్తుతిచేసి
అల్ల కాశియాత్ర అటు బోయినట్టి
వల్లవుల భత్తిరెన్న వచ్చిన దనుక
గంగను రణము కాపాడవలెనని రాజు వేడంగ
సంతోష ముప్పొంగ గంగ చయ్యన లేచి
తమ్ముడు పోతురాజును తానును మరియు
కల్లి నడుమ నిలచి రణము కన్నుల చూచి

ఆ రణము కన్నుల చూచి ఆశ్చర్య మంది
'పరువుపకారులు యాదవులు బహు పరాక్రమమునను
సాధించి పగతుల చాల సమయించి
అరలేక వరిగిరి అమరి యాదవులు
రణము కాపాడితే నాకు రణభుక్తి కలదు
నన్ను పూజించిన నాథుల రణము
వనర కాపాడితే యిటకు వచ్చి బత్తిరెన్న
కలియుగంబున నాకు భుక్తి కట్టడి చేసు'
అని తలచి ఆగంగ ఆ పోతురాజు
వల తిరిగి అ రణము వనరంగ చొచ్చి

పల్లవుల తిరుమందులమీద వైన
వైనాన
శేషగిన్నె 38 లో వీరశాసలు
చేపట్టి
అందరిపై చిలికించి అప్పుడు
ముద్రించి
యీగె వాలకుండ యీపి పెట్టకుండ
కాకులు ఆ రణమందు కదిసి రాకుండ
నక్కలు రణమున నిక్కి
చూడకుండ
నీచుకు భూతాలు నీగిరాకుండ
కౌసుకు గద్దలు కారాడకుండ

ఆకాశము పోయ్యే పక్షులు
అర్రు వంచకుండ
మేదినిపై పందులు మెడ వాల్పకుండ
పుట్టలో చీమలు పొలసిపడకుండ
పెట్టిన తిరుమణి పీకెత్తకుండ
పూసిన శ్రీరామ గంధం
పురిచిట్లకుండ
కాంతిగల దేహాలు యీరీతి
కందువారకుండ
రమణతో కాపాడుచుండెను రణవీర
గంగ

卐

# అగుమంచి కథ

## అవతారిక

శ్రీకృష్ణ దేవుని చిత్తాన దలచి
అంచితంబుగా శారదాంబను ఆత్మలో
దలచి
రమణ తోడుత విఘ్నరాజుకు
మ్రొక్కి
ప్రేమరాంబికను మదిన ప్రార్థన చేసి
శ్రీ గిరిజాధీశు సిరుస్సున వున్న
భాగీరథి గంగను ప్రార్థన చేసి
వాణిత భాషించి వెన్నుకు నెక్కి
బాణావీరుల ప్రెగ్నె కొనియాడి
కాళిదాసుకు భువి కవివరులకెల్ల
వాల్మితో సాష్టాంగ దండంబు బెట్టి
వాలాయముగ నందరిని వాక్కున
దలచి
సంధి లక్షణ మెరిగి
చప్పనేర్చిన యట్లు

ముందుగా సంభువులకు
ముద(మున మ్రొక్కి)
(కలుములకు పుట్టిల్లు) ఘనత
విలసిల్లు
చెలగి జరుగున పల్యా చెన్నయ్యాను
వాడు
పుడమి అరుంధతికి పుట్నింటి
ఘనుడు
కడువేగ అ(గుమంచి కథ
వేట్కతోను)
శ్రీకరంబుగ చెప్పెద చెలగి
యాదవుల కథ
ప్రాకటంబుగ వినుడా ప్రెక్యాతిగాను

## పోలురాజు సంతానము

వల్లవుల గోత్రాన వంశాబ్ధిసోము
...తోడుతను పోలురాజనగ
శివుని పోలిన గనుడు
ఆ పోల్లురాజ్జుకు

అనుఖాంగ లక్షిమి కృప నందుల
సిరిదేవి
పార్వతికి సరివచ్చు పరమ కల్యాణి
యేరుప రాజులై యలమి జనియించె

భక్త వొచ్చల పేరు పరగ
నుతికెక్కు
భక్తుడు ఆశి ... ... ...
అతనికి తమ్ముడు అయితమరాజు
భూతలంబున రిపుల పొరిబుచ్చునట్టి
అయితమరాజుకు తమ్ముడు
అనుజుడు ముమ్మయ్య

... ... ... వసధి గంభీరుడు
ముగ్గురి మూర్తుల పేరు ముదము
తోడుతను
పొలుపొందు కీర్తుల పొదలిన గనుడు
అన్నల ము(గ్గురికి అగుమంచి
య)నగ
వన్నెగా జనియించె వారుజనేత్రి

## అగుమంచి సౌందర్యవర్ణన

అల్య[1]కు సరివొచ్చు అగుమంచి
గుణము
తెల్లమిగా ... ... ...
నల్లతుమ్మెద బోలు నాతి తలకురులు
అలర చంద్రుని బోలు అతివ
నీ మొకము
మెరుగుటద్దముల బోలు మెలత
చెక్కుళ్లు
కాముని చెరుకుయిండ్లు గతినుండు
బొమలు
చెలువముగ బేడిసకు సరివచ్చు
కన్నులు
నిండు సంప్రతి[2] మొగ్గ నెలత
నాసికము
మెరుగు తీగను బోలు మెలత
దేహంబు
దాడింభ విత్తుల దనరు పల్వరుస

తామర తుండును బోలు తరుణి
అస్తములు
కనక కళశముల బోలు కాంత
కుచములును
కొదమ సింహ్మము బోలు కోమలి
నడుము
నీళ్ళ సుడియను బోలు నెరవైన
నాభి
అరిటి స్తంభముల బోలు అతివె
పెనుతొడలు
పొటకర్ర లనవొచ్చు బిగువారు
పిక్కలు
చిగురుటాకులు బోలు చెలియ
పాదములు
పగడపు మొగ్గల బోలు
పాదముల వేళ్ల
నక్షత్రముల బోలు నఖముల తీరు

1. అహాల్య 2. సంపగి

కామధేనువును బోలు
కమలాక్షిమోము
భూదేవి సాక్షిగా పొగడంగ దగును
తరుణి కీర్తికందంబు
తగు చంద్రబింబ

## అగుమంచి గుణములు

యిన్ని అందములుగల యింతి
అగుమంచి
పన్నుగా దనకొండ పట్నంబులోన
వల్లవులు ఆరువేలు వణితలలోను
మెల్లసుగంధి యామురిత అగుమంచి
అక్కన్న దనకొండ నలర తానుండి
భక్తుని చెల్లెలు భామలలోను
పుత్తమురాలు అగుమంచి
పుత్తడిబొమ్మ
కాటమరాజు చెల్లెలు కలికి అగుమంచి
మెటిగుణములతోను మేలగు
అగుమంచి
అయితన్న చెల్లెలు అణిముత్యము
బొమ్మ
... ... కాంత అగుమంచి
భట్టావులరాజుకు బాగైన చెల్లెలు
సుట్టాల సుంభియౌ సుందరి
అగుమంచి
కరియావుల రాజుకు గాంభీర్యపు
చెల్లెలు
మరియాధ గలిగిన మగువ
అగుమంచి
యరనన్న చెల్లెలు హేమంపు బొమ్మ
ముమ్మన్న చెల్లెలు ముద్దు రామచిలక
కొమ్మలలోకెల్ల పూగొమ్మ అగుమంచి
బీరన్న చెల్లెలు పృథివి లోపలను
పొందుగా తిరుమందుల పుత్తమ
రాజుకు
కుందనపు బొమ్మయగు కులసతి
అగుమంచి
అత్తవారింటను అలరంగనుండి
పుత్తమురా లగుమంచి వొనర
యిట్లనియె:
"పైడెండి దాదులార! పనిబూని మీరు
కైజేసి ముత్యాల గద్య[1] దేరమ్మ"
చెలువుగా నీలాల చంద్రశాలలోను
భలువుగా పచ్చలు బాగుగా దాపిన
పన్నెండు స్తంభాల పందిళ్ళ నడుమ
శృంగారమైనట్టి చెలువంపు గెద్దె
దాదులు యా గెద్దె దాయముగ దెచ్చిన
మోదముతో అగుమంచి ముదిత
కూర్చుండె.

---

1. గద్దె

## అగుమంచి రెడ్లను పిలువనంపుట

వేవేగ దాదుల వేగంబె బిలచి
దండిగా పలికెను దాదులతోను
"పొలు పొందగా బోయి భూమిలో రెడ్ల
చెలగి పిలువరమ్మ చెలులార! మీరు
వారితో ఆలోచన వాగి శాయ వలెను
చేరి పిలుచుక మీరు శీఘ్రమే రారె"
అని యానతిచ్చిన అంతలో దాదులు
పనిబూని యందరు పలికి యిట్లనిరి:
"యెవ్వరెవ్వరిని పిలుతుము యేకాంతమునను?"
ఆవేళ అగుమంచి అడిగిన యపుడె
యింతి దాదులతోను యిట్లగనిపలికె:
"పొట్లపాటి పోలిరెడ్డిని పొలుపు మీరంగ
గట్టిగా తోడి తేరె కమలాక్షులార!
పొదిలి గంగిరెడ్డిని పొంకముతో మీరు
కదిలి పోయి పిలువరమ్మ కాంతలార! వేగ
నాదిండ్ల పాపిరెడ్డిని నలినాక్షులార!
పన్నుగానున్న యా భూపతి రెడ్డిని
వాన్నెగాను తోడితేరె వాణితలార!
మీరు
వోరుగంటికి పెదకాపు వానర నాగిరెడ్డిని
కూర్మితో రమ్మనరె కోరిక మీర
యేర్వు రామిరెడ్డిని యెలమితో మీరు
పరువున తోడి తేరె వోవణితలార!
యలమంచి కొమ్మిరెడ్డిని వేవేగ మీరు
నలువున తోడి తేరె నలినాక్షులార!
ధనకొండకు పెదకాపు ధాన్యాల గంగిరెడ్డిని
గనముగా తోడితేరె కమలాక్షులార!
రాజుకు కలిగినవారు అక్కిరెడ్డిని వో అంగుణలార[౬]!
మక్కువ తోడితేరె మాట్లాడ వలెను"
అని యానతిచ్చిన అంతలో దాదులు
పనిబూని యందరు పరువున బోయి
వినయముతో రెడ్లను వేగమే తోడితెచ్చిరి
మక్కువతో అగుమంచికి మరి విన్నవించిరి:
"మాట తప్పకను రెడ్ల తోడి తెస్తిమమ్మ"
వయ్యాన దాదులు వనర నిట్లనిరి
అక్కన్న ఆరెడ్లను అప్పుడు చూచి
జముకాణము పరపించి జననాథు చెల్లెలు
కు స్తరించి రెడ్లను కూర్చుండ నుంచి
విన్నవించె రెడ్లతో వేడుక మీర:

౬. అంగనలార

## పాలేటినుండి అన్నల వార్తలు రాలేదని అగుమంచి శివరాత్రి జంగమార్చన చేయనెంచుట

"మా యమ్మకు తమ్ములార! మాకు
మేనమామలార!
పయనమై మా యన్నలు పాలేటికి
బోవుచు
పాయక నాతోను పలికిన వివరములు
వినరయ్యా చెప్పెద వివరంబు మీకు
ఘనముగా రెణరంగ కంఠీరవుండు
మా యన్న అయితన్న మాధవు
డపుడు
నయశాలి పోలురాజు నందనుండనగ
రాజ తేజోనిధి రాజు గజసింహ్మము
బోజుండు[6] వుత్తమ పుణ్య భూపాలు
పున్నమ చంద్రుండు భూమేలు రాజు
సన్నుతి కెక్కిన సర్వాంగ మూర్తి
మరియు యీ శివరాత్రి
మాసంబునకును
తిరిగి వచ్చెదనని తెరగొప్ప నాతోను
వలనొప్ప బలికెను వరుసతో
వినుడా!
యలమంచి పెద్దలార! అందరు
వినుడా!
చెలగి ధేనువుల మేపి క్షేమమున
మేము
అగణిత పాకేట అందరము మేము

(నిలచి) మాగస్నానము జేసి
మక్కువ మీర
అప్పుడు శివరాత్రి అతివేగముననను
తప్పక వచ్చేమనిరి దాయంగ
మా యన్నలు
రారైరి శివరాత్రి రమణతో వినుడా!
అరయంగ మా యన్నలు అప్పు
డిట్లనిరి
'చెల్లెలా! మా అందరి క్షేమంబు
నీకును
మెల్లముగ పంపేము మేలువార్తలు
నీకు
పావురంబులచేత పంపేము' అనిరి
రావాయె పావురాయిలు రాజులు
వార్తలు
తేవాయె పావురాయిలు నా కిపుడు
దిన దిన వార్త
చేటుకు పావురాయిలు చెలికాండ్ల
బాసి
పరగంగ అడువుల పాలు గాబోలు
చెలరేగి పావురాయిలు చెలగి
దిక్కుల కెగిసి
మల్లక మళ్ళాది బట్టకుండినను

6. భోజుడు

రాలేక పావురాయిలు రణములో
జిక్కి
పోలేక పావురాయిలు పూనిక దప్పి
కూడలి సంగప్ప గుడి
నుండకుండీన?
రాలేక పావురాయిలు రణమందు
జిక్కకుండీన?
కను చెదిరి పావురాయిలు కలిగిరి
కొండకు
కలిగిరి కొండకు కదిలెనో గాక!
చూపు దప్పి పావురాయిలు
చుండి కొండలకు చేరెనోగాక
గోపాలుక్కల వార్తలు కొంచు
రావాయె
వేగుబోయిన పావురాలు వెలికొండ
బట్టె గాబోలు
వాగిర్త చెరువుపై వాలకుండీన?
సక్కని పావురాయిలు సంగడీల
బాసి
రెక్కలు డిగి పావురాయిలు రక్తాన
మునగకుండీన?
సంగతిగా పావురాయిలు సంగడీల
బాసి
లింగాల కొండను నిలువ కుండీన
ముందు రాకటకు ముచ్చటలు
దెలసి
గంగరేగు మానుకై వ్రాలె గాబోలు
నిండిన సంపదలు నిలువంగ జూచి
తండ్రి వున్న లింగాలకొండకు
తావుసేసె గాబోలు

మొలబంటి రక్తములో
మోకాటిబంటి పీనుగులలోను
గోడు గోడున పక్షులు గుబ్బటిల
సాగె
కుతికల పొడుగు రక్తములోను
గురిపెట్ట సాగె
తెప్పలై పావురాయిలు పాలేట
తేలకుండీన?
అన్నల జగడము చూచి అక్కడ
నిలిచె గాబోలు
యరగెడ్డపాటి వార్తలు యేమి
రావాయె
చెరుకూరి చిలకలమ్రి చేరకుండీన?
పగవారి రక్తాన పడి వీదులాడి
భగదేవమ్మ గుంటిన పావురాయిలు
వుండకుండీన?
పుడమీశు అవులన్న బుద్ధులు
వినకుండ
కూడలి సంగప్ప గుడినుండె కాబోలు!
ఆవుల యెద్దుల యాదవుల విడచి
తావులు చేరుకొని పావురాయిలు
తర్లి రావాయె
యేవార్త విననైతి యేమి యీ వేళ
శివరాత్రి అన్నము శివునికి
మెప్పించి
వెలయంగ నిష్టతో ఏనుడు
తానుంటి
అన్నంబు పెట్టిన అన్నదాన ఫలము
సంగతిగా జేతు జంగమార్చనము

వలనుగా చాయవలెను వినరయ్య
మీరు
యలమంచి పెద్దలార! అందరు
వినుడ
వినుడి మీరందరు వివరంబు గాను''
అప్పుడు అగుమంచి అలరంగ
అవార్త
చెప్పిన కొమరమ్మ చేరి యిట్లనియె:
కరుణతో రత్నాల గద్దెపై కూర్చుండి
ప్రేమతో అగుమంచిని పిలిచి
యిట్లనియె:

## శివరాత్రి తమ యింట అచ్చిరాలేదని కొమరమ్మ అగుమంచిని వారించుట

వద్దమ్మ శివరాత్రి వమ్మదు మనకు
యేమిటికి శివరాత్రి యలనాగ
మనకు
అలనాడు మేమును అగుమంచి!
వినవమ్మ
అర్థవీడు ధనముకొండను అలరంగ
నుండి
వర్థిల్లు ధనధాన్య వస్తువులు గలిగి
తామర తంపమై దండిగా మేము
భూమెల్ల యేలుచు పొందుగా
నుంటిమి
మోక్షమూల కొరకు ముందెరుగ లేక
శివరాత్రి వుంటిమి చెలియరో! మేము
పాయక శివరాత్రి ఫలమెల్ల మాకు
అవెంట చూపెను అగుమంచి వినవె
మారుట శంబుడు మాయన్న
పోలురాజు
దారక చెరుకూరు వద్దను నాడు
భక్తులు కొరకును బవరంబులోను
రక్తమెరగ పోట్నాడె రాజాధిరాజు
ధీరుడు మేనమామ స్థిరమందు మల్లు
కూర్మితో పోలురాజు గురుతైన
పెద్దలు
సొరిదిగా కలియుగ చోడాని మీద
చెరుకూరు వద్దను చెల్లిరి నాడు
ముందుగా శివరాత్రి ముదముతో
వినుము
మోసపోతిమి మేము ముందు
అగుమంచి!
సరవితో చిత్రభాను సంవ్వాత్సరము
బోయి
అరవై యేండ్లాయె అమ్మరో! నేటికి
మానిన శివరాత్రి మగువరో నాడు
మానవే శివరాత్రి మధురాక్షి[7] నీవు

7. మదిరాక్షి

బలము చాలకున్నది పణతి
అగుమంచి
వలనొప్పగా శనివారము లుండు
అంగనరో! నీవు అతి వేట్కతోను
మంగళవారము లుండు మానక నీవు
సమ్మతి గాదీమాట సకియరో! మాకు
అగుమంచిరో! మీ అన్నలుండేటి
వమ్మదు శివరాత్రి ప్రెక్యాతిగాను
మొల్లసుగంధిరో! ముదిత అగుమంచి
నల్లచెరువున నీవు నయమొప్పనిపుడు
వెలదిరో స్నానంబు వేట్కతో జేసి
సలలితముగా సుద్ధి చెలమ దవ్వించి
వదలక గోదానము వనిత
అగుమంచి
శివలింగ వస్త్రములు చెలగె నీవేళ
కొంకక యిప్పుడు గోత్రాలు
చదివించి
పంకజనేత్రి తా
బ్రాహ్మణోత్తములకు
అయ్యగాండ్లకు నిపుడు
అర్పణముగాను
దయతోను అగుమంచి దానములు
సేయి
భూమిలో యంచంగ
పుణ్యాత్మురాలువు
యీ ప్రొద్దు శివరాత్రి వుండనే
తగదు"

## అన్నల వార్తలు తెలిసికొనుటకై అగుమంచి గంగను వేడదలచుట

చిత్తములో కొమెరక్క చెప్పిన బుద్ధి
విని అగుమంచి తా నిట్లని పలికె:
"వాహిణి గలయట్టి వనిత
కొమరక్క!
గోత్ర రత్నమా నీకు కోరి
చెప్పెదను
వినుడ త్రిపురాంత లింగము
తేజంబుతోడ
అపురూపమైనట్టి అక్క కొమరక్క
కీర్తులు పొడవైన వో కిరణవాణి!
ప్రార్థించి నీ కృపను పలికెద
వినుమా!
మా యమ్మ సిరిదేవి మగువరత్నంబు
నాయకమైనట్టి నాతిశిరోమణి
కృప నందుల సిరిదేవి గురువులుకు
తల్లి
వుపవాసములుండి వువితంబుగాను
చిన్నయింత నాటనుండి శివుని
కల్పితముగను
అన్నల తోడెట్టు అమ్మ నన్నుంచె

చెలువుగా స్నానంబు చేయించి వేట్క
వలనొప్ప తాజేయు వ్రతము చెల్లింతు
ప్రియముతో గూర్చుండి ప్రియమున
వారిక్క
అమెతలు దీర్తును అత్తరో నేను
బాలనై నేజేయు పాయని వ్రతము
వాలాయముగ నన్ను పద్దనక నీవు
వద్దంటె మన వ్రతము
భ్రష్టుగదవమ్మ
కొదవైన నీబుద్ధి కోర్కెతో వుండు
మరి వక విన్నపము మగువ
చెప్పెదను
అలరంగ వినవమ్మ అత్త
కొమరమ్మ
పావురాయిలు రావాయ పాలేటనుండి
యేవార్త నాకును వినబడదాయ
గడియకొనే బోయి గంగ నేడవలెను[8]
పుడమిలో గల్గిన బుధుల రప్పించు
యెటువంటి వార్తలు యేడవమ్మ
నడుగవలెను
పాటించి పిలిపించు పరగ
బ్రాహ్మణోత్తముల
పంచాంగములు చూవేటి
బ్రాహ్మణోత్తముల
అంచితంబుగ పిలిపించు అత్త
కొమరమ్మ
అన్నల పరిణామము ఆదిలక్షిమి
గంగ నడుగంగవలెను
పన్నుగ పిలిపించు పరగ
బ్రాహ్మణుల''

## కొమరమ్మ బ్రాహ్మణులను పిలిపించుట

అగుమంచి మాటలకు అత్త
కొమరమ్మ
త్వరితముగ పిలిపించె
బ్రేహ్మణోత్తములను
''ఆరు శాస్త్రములు పద్దెనిమిది
పురాణాలు చదివిన బుధులనెల్ల
ద్వారావతి పురోహితుడు
ధర్మ వర్ణించొట్లును
పిలువండి కోర్కెతో ప్రియమున
మీరు
దండిగా దోస్యము[9] తప్పక చదువు
మనుచు
యేరువరాజులకు కాలహేష్యము
చెప్పుమనిన
యేరువ పురోహితుడు యెల్ల
వర్ణలును[10]
మేలమున తోడితేరే వో ముదితలార!
కళ్యాణ పురోహితుడు
గంగవర్ణంబొట్లును

8. గంగను వేడవలెను 9. జోస్యము 10. వర్ణులును

చెలువుగా తోడితేరే చెలులార!
మీరు''
చేడెలు కొమ్మలక్క చెప్పిన పనిబూని
వేడుకతో బిలుచుక యేతెంచి రపుడు
మతిమంతు లగుమంచి సముఖాన
కపుడు
అతివేగ తోడితెచ్చిరి
అగ్రజను లపుడు
తోడితెచ్చిరి యపుడు
తోయజముఖులు
"చూడుమా అక్కన్న! శుభములు
అడుగుమా
వారుగో బ్రాహ్మలు వచ్చిరి''
యనిన
అని విన్నవించిన అగ్రజనులకును
ఘనవేగమున నమస్కారంబు జేసి

అప్పుడు అగుమంచి అలర
పురోహితులకు
తప్పక సాష్టాంగ దండంబు బెట్టి
గంధ మక్షింతలు కర్పూర
భోగాలు[11]
పొందుగా కట్నాలు పురోహితుల
కిచ్చిరి
"పంచాంగములు చూచేటి
బ్రాహ్మణులార!
మాసంబు తనకును మంచి
ముహూర్తంబు
యేదిన మయ్యేనో యేర్పాటుగాను
శోధించి చూడరయ్య సొంపుతో
మీరు''
ఆనతిమ్మని అగుమంచి అడిగిన
యపుడు

## జంగమార్చనకు ఏర్పాట్లు చేయుడని అగుమంచి రెడ్లను ఆజ్ఞాపించుట

పంచాంగములు విడచి పట్టిరి
పురోహితులు
చెప్పంగ సాగిరి చెలగి
ముహూర్తంబు:
''వినవమ్మ చెప్పెద వెలది
అగుమంచి

నేడును సోమవారము పొందుగా
వినుము:
మకరాక్షి అమావాస్య
మంగళ్వారము రేపు
వారము మాసము వరుసతో వినుము
అరూఢిగా మీ యాదవులెల్ల

11. బాగాలు

మోదముతో మీ యన్నలు
మొక్కబడి యున్నట్లు
కాదనక నమ్మికతో కాంతరో వినవె
శివరాత్రి శాయను శ్రీకరము గాదు''
రవితేజు చెల్లెలు రమణి అగుమంచి
పన్నుగా బ్రాహ్మణుల వాక్యములు
వినెను
వప్పెను శివరాత్రి వద్దికె మీర
తప్పక మరియును తలచి
యిట్లనియె:
"బంధువులు మా యన్నలు
పాలేట నున్నారు
మంద లోపలనుండి యే వార్త
తనకు
యే వార్త నాకును వినబడదాయె:
గడియలో నే బోయి గంగను
అడుగవలెను
యెన్నడు ముహూర్తమయ్యె
యేర్పడగాను
పన్నుగా జెప్పరయ్య
బ్రాహ్మణులార!
అనతి"మ్మని బలికె అగుమంచి
యపుడు
"వినవమ్మ చెప్పెను వెలది
అగుమంచి
నేడును వీభూది నిష్టతో నుండి
ప్రాణ దక్షకుడైన భావజ
భస్మాంగు[12]

లీలతో శంభులింగమును పూజించి
పాలించి అన్నంబు భక్తులకెల్ల
తాల్మితో నిడి నీవు తప్పక నేడు
వస్త్రముల్ మాడలు వాయనంబులును
సుస్థిరంబుగ నీవు భూసురుల కెల్ల
దయతోను అగుమంచి దానములు
సేయి
భూమిలో యంచంగ
పుణ్యాత్మురాలవు
వేడుక శివరాత్రి వేగించిన ప్రొద్దున
కడువేగమున యాదవ
కామినీమణులు
స్నానములాడి జంగమార్చలు జేసి
మానిని యాదవ మంచిమూర్త
మున్నది
వలను మీరగ మంగళవారము
నీ పేరు
బలము చాలి వున్నది పణతి
అగుమంచి
స్థిరముగ తెర్జ్యంబు దెవసంబు లేదు
గరిమె యిరువైయైదు గడియలలోన
మంచి మూర్తము వున్నది మగువ
అగుమంచి
అంచితంబుగ పుణ్యఅంగనలు నీవు
పోడిమి రేపును పొందుగా గంగను
వేడుమా అగుమంచి వెలదిరో బోయి"
అని విన్నవించిన అమ్మ సిరిదేవి

12. భస్మాంగు

అగ్రజనులకు గంధ వేగమున
నమస్కారంబు జేసి
అంపెను వేగంబె అక్కన్న వారిని
భూనాథు చెల్లెలు పురోహితుల
నంపుతానే

## జంగమార్చనకు ఏర్పాట్లు చేయుడని అగుమంచి రెడ్లను ఆజ్ఞాపించుట

వనజాక్షి రెడ్లను వరుసతో బిలిపించి
బంగారుప్రాత వన్నె పట్టు
పచ్చడాలు గప్పి
అంగన పేరుపేర నందరిని పిలిచి:
"మామలార! నేను జంగమార్చన
శాయ వలెను
శ్రీమించు దొనకొండ సల్లచెరువు
వెనక
తెగువలరగ నిమ్మతోట లోపలను
ప్రాకట్లంబున చలువ పందిళ్లు
బెట్టించుడా
మట్టి పతులకెల్లను మరుగులు
బెట్టించుడా
యిటువలె చేయించుడా యీ పను
లెల్ల
సన్న బియ్యము నెయ్యి సారపప్పు
తేనె
పన్నుగా బెల్లము పంచదారయును
గోదుమ సెనగలు కొబ్బెర చెరుకు
మధుర ఫలములు మంచి
మదనహారములు
మధురమైన మంచి ఖర్జూరములును
దినుసైన పోకలు తెల్లనాకులును
పాలును పెరుగును పచ్చళ్ళు అల్లము
సాలిననట్లుగ వంట చెరకు
దెప్పించుడ
కొత్త బాంధవులును కొదవ లేకుండ
మొత్తముగ దెప్పించుడా ముదము
తోడుతను
మొల్లలు విర జాజులు మరువము
చామంచి
మల్లెపూవులను మంచి
మొగలిరేకులును
జవ్వాజి కస్తూరి జాళువ బంగారు
లింగ వస్త్రములును లీలతో
మారేడుపత్రి
శ్రీగంధమాదిగా జంగమ
శివపూజ కిపుడు
వరుసతో యిటువంటి వస్తువు లెల్ల
గరిమతో యీ వేళ గడియలో
దె"మ్మనిన

అగుమంచి మాట మీద అందరు వారిని
ఒప్పిరి ధీమంతుని చెల్లెలు రెడ్లనంపుతానే
అని యిట్లు వేగంబె అక్కడున్న

## అగుమంచి తల్లినగరుకు వచ్చుట

ఆవేళ అత్తకు అస్తము లెత్తిమ్రొక్కి
పల్లకి యెక్కెను పద్మాయ తాక్షి
తల్లి నగరుకు వచ్చి ద్వారంబు
దగ్గిర
వయ్యన పల్లకి వరుసతో దిగ్గి
ధనవంతు చెల్లెలు ద్వారంబు జొచ్చి
ఆ వేళ లోపలికి అరిగెను వేట్క
మేలైన నీలాల మేడలోపలను
గనమైన వజ్రాల గద్దిపై కూర్చుండి
అనువేగ సిరిదేవి అప్పుడు తాజూచె
వల్లవుల చెల్లెలు వనిత అగుమంచి
తల్లికి సాష్టాంగ దండంబు బెట్టె
దండంబు బెట్టిన తనయని జూచి
(సిరిదేవి) మెండుగా దీవించె
మీనాక్షి యపుడు
యెదురుగా వచ్చి వేగమెత్తుకొని
దించి
కూతురిని చూచి వుప్పొంగి
కూర్చుండ బెట్టెను
కూర్చుండ బెట్టెను కొదవలేక తల్లి
కొలువు దీర్చి తనయతో
కోమలిట్లనియె:
"నా తల్లి! అగుమంచి నా
ముద్దుపట్టి!
జాతి ముత్యపుబొమ్మ! జాజిపూ
కొమ్మ
నాకు కీర్తి దెచ్చు నా ముద్దు చిల్క
భూకాంత దేవిని పోలినావమ్మ!
అన్నలక్క చెల్లెలు! ఆణిముత్యపు
పట్టి!
వున్నతంబుగ నీవు వొచ్చిన పనులు
నాతోను చెప్పవే తల్లి! నాతి
అగుమంచి!
అగుమంచిని తల్లి అడిగిన యపుడె
ముకిలిత అస్తులెత్తి ముందర
కూర్చుండె
తల్లితో అగుమంచి తగనిట్లు గనియె:

## వదినలతో కలిసి అగుమంచి శివరాత్రి ఒక్క ప్రొద్దుండుట

"నాతల్లి వినవమ్మ నాతి సిరిదేవి
విన్నపము జేసేను విన నౌధరింపు

తల్లిరో మా యన్నలు ధక్షణాది
బోవుచు
తాము చేసేటి శివరాత్రి ఫలము
శాయమని చెప్పిరి చెలరేగి
మా యన్నలు
వొప్పుగా నే జేతు అన్నల వ్రతము
అమ్మ నీ కోడండ్ల నందరిని బిలచి
కమ్మక నాతోన కట్టడి
శాయరమ్మ''
కూతురి కూటాల్కు కృప
నందుల సిరిదేవి
తన కోడండ్లనందరి తప్పక బిలచి
సమ్మతిగ అగుమంచి సముకాన
నిలిపె
సొంపుతో అగుమంచి చూచి
నెలతలను
''అక్కలారా! మనము అందరము
నేడు
వక్కపొద్దులు వుండవలయును
మనము''
అగుమంచి మాటమీద అందరు
వొప్పిరి
శ్రీకరముగ శివుని చిత్తాన దలచి
దండిగా వొక్క పొద్దులు తాముండి
రంత.
కొమరక్క మొదులైన కోటి
బంధువులు
వుపవాస్యము లుండమనె వణిత
అగుమంచి
భామల నందరిని భక్తితో బిలచె
కామిణిమణులెల్ల ఘడియలోపలను
ముచ్చె అందలాలు మూడు పల్లకీలు
వొప్పుగా యెక్కిరి వొనిత లందరును
నెలతలు సిరిదేవి నెనరైన పెద్దలు
కలిగిన వారును గాంభీర్యముగను
నలిరేగి కొమరమ్మ నగరు కేతెంచి
పాలకీలు డిగ్గిరి భామినీమణులు
అందలాలు డిగ్గిరి అంగణామణులు
అందరు కొమరమ్మ మందిరంబునకు
(కదిలిరి వేగ)
చెలువైన పచ్చల సిరిగద్ది మీద
కొలువు కూర్చుండిన కొమరమ్మను
జూచి
కరములు మొగచి కాంతలందరును
అంనముగ జేసిరి అలింగనంబు
అప్పుడు అగుమంచి అత్తకు
సాష్టాంగ దండంబు బెట్టి
వల్లవుల స్త్రిరమందుల వణితలందరిని
మొల్లముగ కొలువుదీర్చి వనిత
అగుమంచి
అందరి నటుబిలచి యిట్లగని పలికె:

## యాదవకాంతలు నల్లచెరువులో మాఘ స్నానములు చేయుట

"చందన గంధులార! అని[13]
సంతోషమునను
నల్లచెరువున మాగస్నానము
సేయవలెను
వేవేగ నందరు కదలుదా"మనెను
పల్లకీలు యెక్కిరి భామలందరును
అందలాలు యెక్కిరి
అంగణామణులు
ఆశీర్వాదములు జేసిరి ఆ బ్రాహ్మణస్త్రీలు
వాసిగా నివ్వాళి వనిత లీయంగ
క్షితినాథు చెల్లెలు పణతి అగుమంచి
అతివేగమున వచ్చె అలర వేడుకను
పాలకీలు డిగ్గెను చలువపందిళ్ళక్రింద
తెల్లపట్టు చీరలు తెరగొప్పనంత
మొల్లముగ కట్టిరి ముదిత లందరును
అప్పలు చెల్లెండ్లు అలర వొదినలును
జలము తొయ్యగజొచ్చి స్నానములు
జేసి
మలయుచు అగుమంచి మతిని
బాంధవుల దలచి
ముగ్గురు మూర్తుల దలచి మూడు
బుటకలు వేసి
స్నానముల్ జేసిరి దరియెక్కివొచ్చి
తడిబట్టలిడచిరి పద్మాయతాక్షులు
మడతలు వేసిన కనకాంబరములు
వేడుకతో గట్టిరి వెలదు లందరును
చేడెలందరు తమ శిరస్సు
లార్చుకొనిరి
పొందుగా వీభూది ధరియించినారు
అందరు శ్రీగంధము అలరు
ధరియించినారు
సిరిదేవి కొమరమ్మ చల్వచప్పరము
క్రింద
గురుతుగా కొలువుదీరి కూర్చుండి
రంత
పచ్చల గద్దిమీద పణతి అగుమంచి
వొప్పుగా కూర్చుండె వొనిత
అగుమంచి
అప్పుడు దాదుల అందరిని బిలచె

## అగుమంచి జంగమార్చన చేయుట

"మక్కువతో రారమ్మ
మధురాక్షులార!
పర్వతపు మటపతుల పదహారు వేలు
అరయంగ బిల్వరే అతివేగ మీరు

13. అని = అధిక (?)

సారంగ మఠపతుల సతాకోటి
జంగాల
వైనాన పిలువరే క్షణములోపలను
పెయ్యల తిప్పునున్న పెద్ద మఠపతుల
చయ్యన పిలువరే జంగాలనెల్ల
దానము లందను దక్షులైనట్టి
ధీరత పిల్వరే దేవబ్రాహ్మణుల"
పంపిన పనిచార్లు పయనమై పోయి
సొంపుతో నందరిని తెప్పించె వేగ
పందుముల యరణప్ప పాయక
వెనుక
అందముగ తెచ్చిరి అతివేగమునను
కదిలిరి వారంత అనుమంతు గెమెనిని
జొచ్చిరి
శరణార్థి తమలోన కరములు
మొగిచి
పొందుగా శంకులు భోరించు వారు
కందువతో గంటలు గణగణ
యనుచు
నాదించు శంకులు నమ్మిన వారిని
పాదుక బంగారు పావాలు దొడిగి
వురువున లింగాలు వుంచినవారు
యిబ్రి చర్మము గప్పి యోగవాగాలు
తొడిగి
గండ గత్తిర జంగాలు కడగురుతు
లేదు
చక్రని బాల జంగాలు కడగురుతు
లేదు
'చూడరాని జంగాల చూస్తిమి
మనము'

వేడుకతో నిట్లు విహరించి నపుడు
మఠపతుల యోగులు మహా
నీతిపరులు
కూడిరి జంగాలు కొదువ లేకుండ
వేడుకతో వేదాలు చదివేటి వారు
వచ్చిరి బ్రాహ్మలు వరుసతో నపుడు
అతివేగ దీవించిరి అగుమంచి నపుడు
అయ్యలకు బ్రాహ్మలకు అతివ
లందరును
మాడలు గోవులు మరి వాహనములు
భూదానము లొసగె భూనాథు చెల్లెలు
ధారుణిలో షోడశ దానంబు లొసగె
అని వేగంబె అక్కన్నవారికి
అప్పుడు దీవించి అరిగిరి బ్రాహ్మలు
అప్పుడు జంగాలు అల శివపూజ
సంతోషముగా జేసి సముకాన
నిలిచిరి
ప్రియముతో కూర్చుండె ప్రియమున
వారికి
లింగ వస్త్రము లిచ్చె జంగాలకెల్ల
రంగు మీరగ నిచ్చెను సంపూర్తి
గాను
సరవితో నిచ్చెను సమయంబునందు
స్థిరముగా సూర్యుడు గూకిన వెనుక
పరగ జముకానము పరిపించి వేగ
అయ్యగాండ్ల గూర్చుండ మనెను
అతివేగ నపుడు
చయ్యన గూర్చుండిరి జంగాలు
యపుడు

అయ్యగాండ్ల ముందర అరటాకు
లిడిరి
వయ్యన అన్నంబు వడ్డించె నందరికి
పాలును నెయ్యియు పంచదారయును
మేలైన చలిమిళ్లు మించిన
అగుమంచి
చయ్యన భుజియింప సాగి
రందరునును
సారపప్పును మంచి తియ్యమామిళ్లు

పంచ పదార్థము లెల్ల
అంచితంబుగను
ఆరగింపమని సెలవు
ఆయెను అప్పుడు
ఆరగింపుచేసిరి అయ్యలు తృప్తిగాను
వయ్యన జలములు వడ్డించి వేగ
తెల్లని ఆకులు కర్పూర బాగాలు
సంపూర్ణముగా యిడిరి జంగాల కెల్ల
అందరినటు బిలచి అగుమంచి పలికె

## అగుమంచి శివుని పూజించుట

జాగారం శాయవలెను స్వాములార
మనము
వేగమే దేవస్థానకు వెంచేయరయ్య''
'అర అరా' యని కదిలిరి
అయ్యగాండ్లు అంత
అరిణాక్షి అక్కన్న అతివెలు దాను
వక్క పొద్దులతోను వచ్చిరందరును
కంపింప యాదవ కామినీ మణులు
సొంపుతో నందరు సొరిది
శెంబుని వేడిరి
పందుముల యరణప్పు పాయక
వెనుక
పదివేల భటులును బాణవిద్యలును
కదలిరి అనుమంతు గమిని గుండాను
కూర్మితో దేవుని గుడివద్ద నిలచి
ద్వారంబు జొచ్చిరి అతివలందరును
కామినీమణులెల్ల కరకంతుని జూచి

స్వామికి సాష్టాంగ దండంబు బెట్టి
వార్త కెక్కిన యట్టి వల్లభు చెల్లెలు
ప్రార్థన చేసెను భక్త వత్సలుని:
"శివ! నీలకంఠ! యో శ్రీపారిజాత
శివలోక రక్షకా! చిత్తజసంహార!
త్రిపుర సంహార! యో దీనమందార!
నిపుణ తంబై నట్టి నీలకంఠదేవ!
గవురి మనోహర! కరుణాంతరంగ!
దేవతాప్రార్థిత! దీనమందార!
నంది వాహన రూఢ! నాగ
భూషణుడుడ!
యిందుశేఖర! మాకు యిహ పరాదు
లిమ్ము
యెందు నీకు సరిలేదు చంద్రశేఖరుడ
అన్నలు చేసేటి ఆస్తారవ్రతము
సన్నుతిగ నే జాయ జంగమార్చనకు
సమకూడి వస్తిని నన్ను కృపజూడు
వేగ''

## శివుడు కళతప్పి ఎరుపెక్కుట

అనుచు ప్రార్థన శాయ ఆ
శెంబులింగము
తనరూపు తనతీరు తప్పెనా క్షణమె
యర్రని వర్ణమై యేర్పడి యుండె
నర్రావుల సిరిదేవి నాతి కొమరక్క
అరయంగ పిన్న పెద్దలు అందరు
జూచి
చెలువుగా విచారముచేసి రందరును
అగుమంచి నా విధము అడిగి
రందరును
అక్కన్న వారితోను అప్పుడిట్లనియె;

"సకల బుద్ధులు నేర్చిన సర్వాంగులు
మీరు
మీకు తెలియని మనోభావము
మాకేమి తెలుసు?"
ఆమాటలు విని పెద్దలు అపుడిట్ల
గనిరి
'అక్కన్న! దైవాల ఆదినిష్ట తెలుసు
నీకు
మాకు తెలియదు నీకే తెలియు
చెప్పవమ్మ''

## పాలేటి రణమున అన్నలు చెల్లుదురని అగుమంచి ఏష్యము చెప్పుట

ఆ మాటకు అగుమంచి అపుడిట్లనియె
'కన్నవారు వినరమ్మ! కరకంఠు
నిష్ఠలను
మీరు అడిగినందుకు నే జెప్పెద వినుడి
మాయన్నలకు సంగాన అరుడు
దయ దప్పకుండీన?
కళలుదిగి శెంబుడు కళదప్పినందుకు
పంపాద్రి పల్లకీలు పాలేట
మడియకుండీన?

వెలదులార! శెంబుడు చింతపోయి
నందుకు
యలమంచి పల్లకీలు యరగెడ్డపాట
కూలకుండీన?
విడిబడి బసువన్న యిక్కడికి
వొచ్చీని రేపు
అన్నల పరిణామము అందకుండీన?
పన్నుగా కాశి బోయిన భక్తిరన్న
వచ్చీనీ రేపు

మాపిటికి ధనకొండ మరి
చారకుండీన?
శివ పానవట్రము గిరగిర తిరిగి
నందులకు
పోలురాజు వు౦దేటి లింగాలకొండ
చుట్టుకొని రక్తము గుభగుభ
యేరులై పారకుండీన?
కొండ మీద శిలలెల్ల 'గోవిందా
గోవిందా' యని
మునిగి రక్తములోన
మొరపెట్టకుండీన?
రంగుగా రక్తము
పిక్కటిల్లకుండీన?
గంగరేగు మాన కైతొట్టకుండీన?
బొల్లావు పుల్లెద్దుకు పోట్లు
బడకుండీన ?
వొరుగుదురు వల్లవులు తిరుగుదురు
స్తిరమందులు
కాలుకాలు పెనుచుక కల్లి
యేరుపరచుక
వల్లవుల తమ్ములకు వజ్రాయుధాలు
నాటి
వరిగిరి పాళేట వైన వైనాన
పల్లికొండ తమ్ములకు ప్రెతిగ్యాది[14]
శూరులకు
వజ్రాయుధం పోట్లునాటి వరిగిరి
కాబోలు
ఆ లక్షా యాదవులు పాలేట అతమైరి
కాబోలు
కోటి గోపాల్కులు కులక్షేత్రముగా
యరగెద్దపాట కూలకుండీన?
అన్నలు పోట్లుబడి అందలాలు
వరగ కుండీన?
తమ్ములు పోట్లుబడి తమకాలు
వరళకుండీన?
గావులు యిందులు గంగకు పాళేట
శివరాత్రి పాలేట చిక్కె కా బోలు"
భావించి అగుమంచి బంధువులతోను
యోగక్షేమములు శంభునితో చెప్పి
చాలించె
మాయాకృతి శంభుని కోపము మరి
నిల్వసాగె

## అగుమంచి శివాది దేవతలను ప్రార్థించుట

"శాంతమే రుద్రవేణి! శాంతమే
భద్రాణీ!
శాంతమే గౌరీశ! శాంతమే గంగాధర!
శాంతమే పర్వతాల మల్లప్ప!
శాంతమే పరిసివేధి!

14. ప్రఖ్యాతి (?)

శాంతమే కుసుమశరవైరి! శాంతమే
సారంగపాణి!
శాంతమే బసువేశ్వర! శాంతమే
ఆదిశెంబుడా నీకు"
అనబెట్టెను శెంబుడు అగుమంచి
మాటమీద
మునికొని యా శాంతమూర్తియై
నిలచ
అనేక విధముల రుద్రునికి
అతివెలు వేగ
సలలితంబుగ నైవేద్యంబులిచ్చి
సంభ్రమముల్ జేసి
స్థిరముగా పదివేలు దివ్వెలెత్తించి
నారీమణులంతా అచ్చోటనుండి
వీరభద్రుని వేగ మతియందు దలచి
వేమారు ప్రార్థించ వెలది అగుమంచి:
"కమనీయ రుదుద్రా! ఘన వీరభద్ర!
పరమేశు నందనా! భద్రాక్షరూప!
శరభావతార! వో శంకర నిలయ!"
తప్పక ప్రార్థించి తరుణులు మ్రొక్కి
గోపాల కృష్ణమ్మ కోవిలకు వచ్చి
"గోపికాధీన! యో ద్వారకా వాస!
భక్తజన మందార! భాగ్యగంభీర!
పుండరీకాక్ష! యో పురాణపురుష!
గజేంద్ర వరద! యో కరుణా
సముద్ర!
అయ్యా గోవింద! ఆదినారాయణ!
శ్రీహరి పద్మనాభ! శ్రీగోపికానాథ
మహానుభావ మయ్య మదనగోపాల!"
అగుమంచి ప్రార్థించె అనేక
విధముల
మక్కువ పదివేల మాడలు కానుక
అక్కజముగ నిచ్చి అతివెలు
మ్రొక్కిరి.

## శివరాత్రి జాగరము

మత్త గెజామణులు[15] మరి
శెంబుని వొద్ద
మొత్తముగ నిలిచిరి
ముఖమండపమున
రాచకొమార్తెచుట్టు రంగు మీరగ
వొచ్చిరి
పనుల వారెల్ల అడ్డతెరలు గట్టిరి
అచ్చట వేగ
అడ్డతెరలలోన అంగాణామణులు
ముత్యాల జముకాణము మీద
ముదము తోడుతను

15. మత్తగజగామినులు

చొక్కముగా నందరు సొరిది
కూర్చుండిరి
భూమిలో శివరాత్రి పుణ్యంబునందు
స్రిష్టిపై శీతాల దిబ్బె మెత్తించి
శివుని కర్పితముగా శివకథ లెల్ల
బసువ పురాణాలు బాగుగా
వినిపించి
శివరాత్రి జాగారము చేసిరా రాత్రి
పసిమించు నంతట పంకజహితుడు
పాయక తూర్పున భాగంబునందు
వేయి కళలతోను వినుడు[16]
వుదయించె
అంతట జంగాలు అలర శివపూజకు
సంతోషమున కదిలిరి స్నానాస కంతా
భావింప యాదవ పణతు లంధరూను
ఆవేళ స్నానానకు అరుదెంచిరంతా
వుదయకాలమందు వుచిద లందరును
నల్లచెరువులోన మొల్లసుగంధులు
గుమిగూడి స్నానంబు గొబ్బున జేసిరి
అంతట అగుమంచి అబ్బురపు
చెల్లెలు
జంగాల తోట్నాని సకియలుదాను
వేగంబె తోటకు వేతెంచి వొచ్చి
బంగారు శెంబుల పన్నీరు దెచ్చి
జంగాల కర్పించి సకియ దానపుడు
సంపంగులు మొల్లలు జాజిపూలూను
యింపైన కలువలు యలమి
తామరములు
పొసగిన గేదంగులు మంచి
బొడ్డుమల్లెలును
పసిమించు నంచి మారేడు పత్రియు
అగుమంచి తెప్పించి అతివెలు దాను
పువ్వుల గెందాన జంగాల శివపూజ
జేసి
అబ్బురపు చెల్లెలు పూని
అయ్యగాండ్ల
ప్రమథ గణాధుల ప్రెగ్గ గానుంచి
జంగాల ముందర యిస్తళ్ల నిమిడి
వైనాన అన్నంబు వొడ్డించ సాగిరి
పాయసము ఖజ్జాయ సుల్ పప్పును
నెయ్యి
పాయక తేనియు పంచదారయును
చెలువైన పచ్చళ్లు శాకావి కూరలు
భక్తితో వొడ్డించ పంక్తి అగుమంచి
వారబోసిన విధము వొప్పుగా నిచ్చ
గంటలు శెంకులు గణ గణ
నాదించిరి
శెంకులు నాదించి శెంబుని దలచి
అయ్యగాండ్లు లింగాల కర్పితము
జేసి
చయ్యన లింగాలు సజ్జలో నిమిడి
ఆరగింపు జేసిరి అయ్యలు
తృప్తిగాను
అస్తముల్ గడిగి జంగాలు
వైన కూర్చుండి రపుడు
అంతట అగుమంచి అయ్యలకు నెల్ల

---

16. ఇనుఢు

కర్పూర బాగాలు సంపూర్ణముగ
యిచ్చి
అంపెను వేగంబె అగుమంచి
యపుడు

వారి హారి మటాల్కు[17] వైనాన బంపె
దీవించి జంగాలు ...
యిరువంశమువారి యాదవసతులు
వారి వారిండ్లకు వొప్పుగా నడిచిరి.

## గంగకు వేటలు బోనాలు తెండని సిరిదేవి చాటింపు వేయించుట

ఆ వెనుక అగుమంచి అబ్బురపు
చెల్లెలు
పణతులు మోసేటి పల్లకి యెక్కెను
తల్లి నగరుకు వొచ్చి సరస
కూర్చుండి:
"కన్నతల్లి వినవమ్మ కాంత
సిరిదేవి।
చెలువొప్ప కోలావారి నాగినాయిని
బిలచి
ప్రియముతో వుల్లమన్నమ వేగ్రాన
బిలపించ" మనెను
అన విని నాగినాయిడు అతివేగ
బోయి
వేగ్రాన బిలుచుక అతివేగ వొచ్చెను
అప్పుడు వుల్లమన్న అతివ సిరిదేవికి
సాష్టాంగ దన్నములు[18]
సరగున బెట్టె
దండంబు బెట్టిన. తగ వుల్లమన్నకు
మేలైన పతకములు మెడనూళ్లు
యపుడు

చాలినట్లు యిప్పించి సంతోషపరచి।
అతనితో సిరిదేవి అపుడిట్లగనియె:
"రంగుగా యిప్పుడు రాజుల
వార్తలు
గంగ నడుగ వలను వేగ్రాన బోయి
గాటముగా గంగకు ఘనభుక్తి ముక్తి
యాటలు బోనాలు వేగ దెమ్మనుచు
సాటించు వుల్లమన్నా। చల్లగా
జయవార మిపుడు"
సాటుదు నని పలికి సాహసుడు
వుల్లమన్న
మేటి సిరిదేవితో మెరసి యిట్లనియె:
"తల్లిరో మా యన్నలు దక్షణ
భూములకు పొయ్యేటి నాడు
అతిరాస కుంబాలు అరవెల్లిలో
బోసిననాడు
వొరికూటి కుంబాలు వామల
పొడుగు
కొఱ్ఱకూటి కుంబాలు
కొండల పొడుగు

17. ఘటములకు 18. దండములు

అరి [19] కూటి కుంబాలు అడ్డకొండల
పొడుగు
జొన్నకూటి కుంబాలు సొప్పవాముల
పొడుగు
అరవెల్లిలో కుంబాలు పోసిననాడు
అగణితంబుగ జయవారము
సాటించినాను
తీటి గెంధం నేడు తీసి నాకు యిచ్చిన
సాటి వొచ్చెద నమ్మ సరగున
నేను''
అని విన్న వించిన అమ్మ సిరిదేవి
పనుల వారిని బిలచి పణతి సిరిదేవి
"తీటియి గెంధము దెమ్మని బిలికె
అమ్మోడు మాటలకు ఆపనులవారు
తీట్కి వేగ్గాన మ్రొక్కి
తెరగొప్పవారు
వేటలు సాధించి వేడుకమీర
ధూప దీప నవేద్యములు సమర్పించి
వేగ
తీటి గెంధము వుల్లమన్నకు
అందిచ్చిరి వేగ
అందుకుని వుల్లమన్న అతివెకు
మ్రొక్కి
నగరు వెళ్ళి వొచ్చినపుడే వుల్లమన్న
గాటముగా గంగకు ఘనముక్తి
బెట్టవలను

వేటలు బోనాలు వేగదెమ్మనుచు
సాటించె వుల్లమన్న జయవారం
సల్లగా నపుడు:
"స్థిరమందుల వార: శీఘ్రాన మీరు
కదిలి రారయ్య గంగను వేడ
పుల్లావులవార! ధూమూడువార!
మెల్లమితో రారయ్య మీరెల్లరూను
కపిలావుల వార! గాంగేయిని వార!
అగణితంబుగా మీరు అందరు
రారయ్య
పల్యాటోప్పు వార! బండారు వార!
చల్ల వారు మీరు సాగిరారయ్య!
మకట కోటవార! మరినేతి వార!
అగణితంబుగ మీరు అంధరు
రారయ్య:''
అని వుల్లమన్న అ పట్నంబు సాటించి
తల్లి సిరిదేవికి సాష్టాంగ మ్రొక్కెను
తిటియి వొప్పగించె స్థిరముగా
నపుడు
అప్పుడు వుల్లమన్నకు అమ్మ
సిరిదేవి
కర్పూర బాగాలు కడువేట్కనిచ్చి
అంపెను వుల్లమన్నను
అమ్మ సిరిదేవి

19. అరెవడ్లు

## అగుమంచి వీరగంగతో పగడసాలాడుట

అప్పుడు అగుమంచి అబ్బురపు
చెల్లెలు
అలరంగ పగడసాల ఆడు
సమయమున
మేలైన తన వాదినెను మించిన
ప్రేమతోన
కాటమరాజు కులసతిని కరుణతో
బిలచె।
'సోముడు అవులన్న సొంపు
వీరగంగ!
కాముడు అవులన్న కాంతి వీరగంగ!
భీముడు అవులన్న బిరుదు వీరగంగ।
గోపాలుడు అవుల్న కోమలి
వీరగంగ।
భూపాలుడు అవులన్న బుద్ధి
వీరగంగ।
రఘురాము డావులన్న రంభ
వీరగంగ!
శ్రీరాముడు డావులన్న సీత
వీరగంగ।
మోదముతో అవులన్న ముదిత
వీర గంగ!
కట్లమీద నల్ల మొయిలు కాటమ
నల గంగ।
చెలియరో గంగకు సరివొత్తు వమ్మ!
మన్నెరాజు దేవులూ। మన
మిద్దరమును

అలర యిప్పుడు మనము
అతివేట్కతోను
పగటివేళ దనుక పణసలు సీడగా
పగడసాల పంద్యాం పట్టి
అడవలను''
అగణితంబుగ బిలచ అగుమంచి తన
వొదినెను
పిలచిన యంతలో ప్రియముగ
వీరగంగ
సదరంగ మాడిరి అతివె లిద్దరును
అతివేగ చిక్కుపడెదవని అగుమంచి
వొహించె
యిది యిదియు నాదని వీరగంగ
వహించె
అరుదుగా పూనియు అగుమంచి
వహించె
రెండు జాములదాక రేమంతుని
చెల్లెలు
గట్టిగా పగడసాలాడిరి
కాంత లిద్దరును
సరి పంద్యా మాయనని చాలించి రంత
పంద్యంబు చాలించి పణతి అగుమంచి
శిరు సంటు కోవలనని తల్లితో
ననియె.

## అగుమంచికి శిరసంటుటకై సిరిదేవి కోడండ్రు నిరాకరించుట

అమ్మ! నీ కోడండ్ల నందరిని
బిలచి
కమ్మక నా శిరసంటు కాంత
లాయవమ్మ''
కూతురి మాటలకు కృప
నందుల సిరిదేవి
నీతితో కోడండ్ల నేర్పుతో బిలచె:
''రుద్రాక్ష కడియాల రూఢి
నల్లమేడ
భద్రాక్ష కడియాల భక్తుని నల్లమేడ!
శివపూజ వర్నాల శివభక్తు రాల!
శివభక్తి కలిగిన సిరిగల కోడల!
మధురాక్షి అగుమంచికి మరివేగ
నీవు
శిరు సంటుమవు రావమ్మ సిరిగల
కోడల!''
ఆరూఢి సిరిదేవి ఆడిన మాటకు
భక్తినయ్య నల్లమేడ పలికి
యిట్లనియె
"నాతి శిరోమణి! వో యత్తగారు!
రాజుల చెల్లెలు రమణి అగుమంచికి
తేజముతో శిరుసంట తీరుగాదమ్మ!''
ఆ నెలత మాటలు వినెను అమ్మ
సిరిదేవి
వేడుకతో వీరగంగను వైయ్యన.
బిలచెను:

''కనుసోగ పూబంత్తి కస్తూరి
మొకము
మన్నెరాజు దేవులు మగువ వీరగంగ
ఆవులన్న చెల్లెలు అగుమంచికి నీవు
వేవేగ శిరుసంట వెలది రావమ్మ!''
అత్తాడు మాటల్కు అపుడు వీరగంగ
''అతివెకు శిరసంట అత్త నే
వెరతు''
వీరగంగ పలికిన విన్నపము వినెను
నాతి శిరోమణి నలినాయతాక్షి
పొందుగా నేతి వారి పోతును బిలచె
"చందన గంధి! యాదవ సకియ
రావమ్మ!
తాలిమి గలయట్టి దయగల కోడల!
రత్నామణి రావమ్మ రావన్న
దేవులు!
రత్నంబు అగుమంచి రాజుల చెల్లెలికి
శిరుసంటుమవు రావమ్మ సిరిగల
కోడలా!''
ఆరూఢి సిరిదేవి ఆడుమాటలకు
తనగు పోతయు బలికె దండంబు బెట్టి
''పాత నీలాలు బోలు భామ
నీ కురులు
నాతికి నేనంట న్యాయంబు గాదు''
పోత మాటలు వినెను నాతి సిరిదేవి

వరషతో బిలచెను పల్లభన్న
సూరను
భట్వావుల రాజుకు బాగైన కులసతి!
పటాని ముత్యమా పణతి సూరమ్మ
అగుమంచి శిరుసంట అతివేగ
రావా!"
ఆరూఢి సిరిదేవి ఆడుమాటలక్కు
సూరమాంబిక పలికె సొంపుతో
నపుడు
"నాతి సీతామణికి సరివొత్తువమ్మ!
తుమ్మెద రెక్కల బోలు
కొమ్మనీకురులు
సొంపుతో నేనంట నేరనోయత్త"
సూరమాటలు వినెను సుదతి సిరిదేవి
కరియావుల నాగను గ్రక్కున
పిలచె:
"తీరుగా నుదుటను దిద్దిన తిలకంబు
కరియావుల రాజుకు ఘనమైన
కులసతి
పలుకుల యింపుగా భామరో నాగ!
అగుమంచి శిరుసంట అతివేగ రావో
నాగమాంబిక పలికె నాతితో నపుడు
"యిందుబింబము వంటి
యింతి నగుమోము
నీలాల వంటివి నెరిగల కురులు
దండిగల రాజుకు దాచగల చెల్లెలు
నెలతరో యీామె శిరుసంట
నేరనోయమ్మ

నలినాక్షి సిరిదేవి నాగమాటలు
వినెను
బాగుగా యరణయ్య భయ్యాను బిలచ
"ఆగణి తంబుగ రావమ్మ
అణిముత్యపు బొమ్మ
సయ్యన భూదేవికి సరివొత్తువమ్మ!
భయ్యామాంబిక రావె భామ
అగుమంచికి
శిరుసంట రావమ్మ సిరిగల
కోడలా!"
ఆరూఢి సిరిదేవి ఆడినందులకు
భయ్యమాంబిక బలికె బాగుగా నపుడు
"కాంతుని చెల్లెలు కాంత అగుమంచికి
నీ పుత్రిరత్నముకు నేనంట వెరుతు"
భయ్యమాంబిక మాటలు వినెను
పణతి సిరిదేవి
చయ్యన ముమ్మయ్య సతి మల్లును
బిలచ
"రంభ! పుత్తళి బొమ్మ!
రాచిలుకవమ్మ!
యిమ్మగా ముమ్మయ్య విల్లాలి
రమ్మి
నా ముద్దు కోడలా! నాతి చినమల్లు!
అమ్మరో అగుమంచికి
సిరుసంటవమ్మ!"
ముమ్మయ్య చినమల్లు ముద్దుమాటలు
విని పలికె
"యేరవన్న చెల్లెలు యేమంపు[20]
బొమ్మకు

20. హేమంపు

అమ్మరో ఆమె సిరుసంట
నేవెరుతుసమ్మ!''
ముమ్మయ్య చినమల్లు ముద్దుమాటలు
వినిపోయి

అగుమంచితో జెప్పె అమ్మసిరిదేవి

## అగుమంచి శిరసంటుటకై సిరిగిరమ్మ సిద్ధపడగా అపశకున మగుట

అమ్మమాటలు విని ఆగుమంచి
యపుడు
'తామసించక యిపుడు తమరు
యీక్షణము
శిరుసంట మని జెప్ప సిరిగిరమ్మను
బిలచి'
అగుమంచి మాటవిని అమ్మ సిరిదేవి
గురుతు గల్గిన ముద్దు కోడలిని
బిలిచ
''సిరిపయిడి కడియాల సిరిగిరి
బోగలింగా!
రాజుల కుమార్తె రత్నాలపట్టి
బోజరాజు కొమార్తె
బోగ సిరిగిరమ్మా
సాదుగుణములు కల్గిన సక్కని
కోడలా!
పోచయ్య నిజరాణి పూబోణివమ్మ!
వాసి కెక్కిన అయితమరాజు
కొమార్తె!

అగుమంచికి శిరుసంట
అమ్మ రావమ్మ!''
అని పిలువ తా వొచ్చెను
అమ్మ సిరిగిరమ్మ!
అత్తగార్కి మ్రొక్కి ఆనతి మీద
అతివేగ బంగారుగిన్నె అస్తాన బూని
వావారి లోపలికి వొయ్య నేతెంచి
రవణుచు అగుమంచికి రమిణి
శిరుసంట
సంపంగి నూనెలు చలగి
గిన్నెలలోను
పొంపుతో నిడుకొని సుదతి
సిరిగిరమ్మ
కరమున గొంచక రాగ
కాంత తానపుడు
దాల ధింద్రము[21] దాకి తలచమురు
చింద్య[22]
సిరిగిరమ్మ అదిచూచి చిన్నబోయ
నపుడు

---

21. ద్వారబంధము 22 చింద (చిందె)

వసరంగ అత్తసు త్రావిన్నవించె

## అగుమంచి శకునఫలితము చెప్పుట

వినియపుడు అగుమంచి
యిట్లగనిపలికె:
"వన్నిగల సిరిగిరమ్మ!
వకవార్త వినవే
చిన్నబో నీకేల? చింతింపనేల?
చమురు చిందినందుకు
శకునంబు కద్దు
అన్నల వార్తలు అందీని గాబోలు
యన్నంగా కోర్కెలు
తలకూడిగా యెసుచు
తలసమురు చిందినందుకు తప్పేమి
సిరిగిరమ్మ?
సయ్యాస వినవే సకియరో నేడు
నల్లచెరువు తూములు నాతిరో
తీయించి
పాలేట వద్దసు పణతులు దాము
అతికె పుణ్యపునీరు ఆదేరు తమరు
యన్నంగ సొమ్ములు యిచ్చెద రేపు
అందరికి చిచ్చులు అగ్నితగిలించి
కందువ ధనకొండ కాలు'గాబోలు
కళ్యాపు చెల్లెలి కనక మేడ తగులబడి
ఆకాశము పొడుగు మంటలా
గాబోలు
కల్లగాదు ధనకొండ
గంగమ్మముందర
చెల్లంబో సిరిగిరమ్మ మనము
చిచ్చుల కోరిగేము''
తలంటమని పలికె తరుణి
అగుమంచి
మీదటి వార్తలు శగున
సత్యంబుగాను
కావించెను బ్రెంమ్మ
కలియుగమువార్కి
అవుశగునము[23] తనకు అయ్యేది
లెస్స

## అగుమంచి స్నాన వర్ణనము

నవ్వుచు వొచ్చి నాతి సిరిగిరమ్మ
చేకొని బంగారు సిరిగిన్న[24]తాను
నాతికి సంపంగినూనె శిరసుపై వుంచి
చేతులు తాళముల్ చెలువుగానంటెను
పరి పరి విధముల భామ శిరసంటె
కురులు చిక్కులు దీసి కూడంగ దువ్వి

23. అపశకునము 24. గిన్న (—గిన్నె)

కీలు గెంటయు[25]వేసి కనక ముడివేసి
చమురు చాతను వొళ్ళు
సక్కగా దుడచి
అలర సిరిగిరమ్మ తన అత్తకు
మొక్క
చయ్యన దీవించ తల్లి సిరిదేవి:
"వినవే సిరిగిరమ్మ! వక వార్త నీవు
పిలువు దాదులనెల్ల ప్రియముతో
నీవు
దాదులనెల్లను దాయంగ నీవు
బటువైన రత్నాల బంగారు గిన్నెల
చందనం జవ్వాజి సకియలు దెచ్చి.
నలుగు బెట్ట" మనెను నాతి
అగుమంచి
వేవేగ నలుగులు వేట్కతో నిడిరి
నలుగాడి అగుమంచి
నయముతో నుండె
మలయుచు సంపంగి మాకుల నీడను

కలితమైన మంచి కనక పీఠమున
అగుమంచి కూర్చుండె ము స్తీమగాను
మక్కువతో కలి మర్దించినట్టి
శీకాయి అడ్డికెలు చెలులంత దెచ్చి
శీకాయ నీళ్ళను శిరుసెల్ల కడిగి
చేరి వామాక్షులెల్ల తెరగొప్ప నంధరు
తొర్లించి బంగారు తొట్లలో నీళ్ళు
వరుసతో జలకము వామాక్షులెల్ల
చెలువైన బంగారు చెంబుల ముంచి
జలకము పైయార్చిరి కలికి
అగుమంచికిని
జనణాథు చెల్లెలు జలకంబు లాడి
పొడువైన బంగారు పుటము[26]
ధరియించె
పుడమీశ చెల్లెలు పొంకంబు మీర
బలువైన చక్కని సురపొన్నల నీడ
శిరుసు లార్చుకొనుచు సిరిదేవిపుత్రి
కరముగా నిపుణమై ఘనతతోనుండె

## స్నానపు నీరు పనసలకు నిమ్మలకు పారుట

స్తిరమందులు వల్లవులు
దివ్యగోపికలు
శిరసులు కడిగి శృంగారపు తోటలోకి
వరుసతో వచ్చిరి వామాక్షులంత
అనువుగా అగుమంచి ఆడినజలకంబు

పనసలకు నిమ్మలకు
పారివుండగ జూచి
కొమరక్క మొదులైన
కోటి బాంధవులు
అమరంగ అది జూచి ఆచ్చర్యపడిరి

25. ఒక కీలు గంటును 26. పుట్టము

## శివరాత్రి స్నాన ఫలితముగా తన తండ్రి అన్నలు రణమున చెల్లిరని కొమరక్క అగుమంచితో చెప్పుట

అప్పుడు కొమరక్క ఆడె నొకమాట:
"వినవమ్మ చెప్పేను వెలది
అగుమంచి
యలమంచి మాతండ్రి యేలేటినాడు
నెలకొని శివరాత్రి నేనుంటి నమ్మ!
శివరాత్రి తగనుండి శిరసంటుకోని
ఆవేళ తానైన ఆడిన జలకంబు
తనరంగ యేరులై............
పొందుగా గొజ్జంగి పొదలకు జారె
అందుకు తార్కాణము అంగనలార!
మా యయ్య వాలురాజు
మండలేశ్వరుడు
దయగలిగి కరణాల వెనక
వేసుకొని
కరణాల కొరకు కన్నె మొగిలి
వీరబయలు
శ్రీ వీరకల్లుగా చెల్లె మా తండ్రి
అరువై అందలాలు ఆడ రుత్తలాయ
తరమునాటి పెద్దలు మా తండ్రివద్ద
చెల్లిరి
రాళ్ళబండి కనమకాడ రక్తంబు
యేరులై పారె
తమ తండ్రి చెల్లితే ధరియించలేక
అమరంగ మా యన్నలు
అయిదుగురు నాడు
పట్నాలు విడిచిపోయిరి
రణభూములకు
శ్రీ కూర్మము బోయను
సింహాద్రి రాజు
శ్రీ వైష్ణుల కొరకు సిందు
ఖల్లాని రాజుమీద
పోరి పోరి వైరుల పొట్టలు జీరి
పుక్కిటలుగుల మీద రాజుల
వుక్కణగించి
దండిగా పగతుల తల లుత్తరించి
వుక్కుజీరా రాజుల వుక్కణగించి
గొడుగులు దప్పించి పడిగెలు నరికిరి
పడిగెల దప్పించి గొడుగుల నరికిరి
పడిగెలు కింద రాజుల గొంతులు
కోసిరి
చక్రాల కొందరిని శిరసులు
ఖండించిరి
పగవారి ఆయుధములు
ఖారంబులాయ
యీ దెల పోట్లకు యీవలావల వెదలి
వాటముగ వచ్చిన ఆయుధములు
పక్కలునాటి
సిందు ఖల్లాని రాజుల శిరసులు
ఖండించి
వరిగెను మా యన్న వల్లవుల రాజు

కానుపుల కొరకు పెద్దరాజు
కల్యాణము దర్లెను
మారాసపు దండుకై మరి పగలుచేసి
వాలికేతవ రాజుమీద వయిబడి
యుద్ధంబు జేసి
లక్ష వెయ్యి జంజాలుగల రాజుల
జంపి
తూము వంటి బొందెకు తూలె
బాణాలు
కంచు వంటి బొందెకు కదిశ
బాణాలు
వుక్కుటలుగుల మీద రాజుల
వుక్కణగించె
దండిగల రాజుల తలలు ఖండించె
యేడేడు కుంభిళ్ళ యెతికి శోధించి
కదా కుంభిణిమీద స్తంభ మెత్తించి
స్తంభాన గండభేరుండ మనేటి
తూము తొల్పించి
తూముతో తూమేడు జంజాలు రాజు
తూలపోట్లాడి
తూము వొంటి[27] బొందెకు తూలె
బాణాలు
కంచు వొంటి బొందెకు కదిశ
బాణాలు
ఆర్లపెంట రణములో అతమాయెను
మా యన్న
యేనుగునాథు కొండకు బోయ
యరనూక మా యన్న

యెరుకుల కొరకై యేటుబడి
బెబ్బులి
యరనూక మా యన్న మరుగు
జొచ్చెను
మరుగు జొచ్చిన బెబ్బులి కొరకై
మా యన్న
నూటొక్క రాజుల నుగ్గుగా
జంపి
వురువడిన బాణాలు వుక్కుటలుగుల
నాటి
యీటెల్ల పోట్లకు వొరిగి రన్నలను
బల్లాలు పోట్లకు భారంబు లాయ
యర్ర భూపతిరాజుమీద వొరిగె
మా యన్న
అతనికి చిన్న మా యన్న
నలనూకరాజు
నున్న బెజవాడకు పోయెను
నలనూకరాజు
కంచుకు పెంచుకు అక్కలగాజుకు
సుంకము లేదని
నన్నభూపతిరాజుల నుగ్గుగా
జంపెను
వుక్కుజీరా రాజుల వుక్కణిగించి
దండిగా పగతుల తల లు తరించి
వొళ్ళెల్ల గాయాలు వుక్కుటలుగులు
నాటి
నున్నభూపతి రాజు మీద వొరిగె
మా యన్న

27. వంటి

అన్నలకు తమ్ముడు ఆ పోలురాజు
పన్నుగా చెరుకూరికి పైబడి పోయ
కలియుగ చోడాని కావేరు వెట్టికి
శిలామంతుల క్షణమందు దెమ్మన్న
పోలురాజు మరుగుకు పోయిరి
జంగాలు
మరుగు జొచ్చిన జంగాల మళ్ళ
బట్టియ్యక
శిలగోరు మొక్కబోకుండా జంగాల
శ్రీశైలము బంపెను శిముడు
పోలురాజు
కాలిగోరు మొక్కబోకుండా జంగాల
పర్వతము బంపెను భక్తుడు
పోలురాజు
జంగాలకొరకు మంద
లింగదార పోసి
భక్తుల కొరకై మంద ప్రాణధార
పోసెను
రక్తమొండ్యంగ పోట్లాడి మా యన్న
పోలురాజు
మూడు కన్నులవాడు ముక్కంటి
మీద
వడియ భక్తుల కొరకై వరిగె
పోలురాజు
తాము నోచిన నోములు యీలాగు
నయిన
ధగ ధగ మంటలో దాగెను మా తల్లి
వల్లమ్మ
నేడు యిలాగు అయెను
నలినాక్షులార!''

## అగుమంచి తన అన్నలకు కీడును శంకించుట

ఆ మాటలకు అగుమంచి యిట్లగని
పలికె :
"నిత్యము నుండి యేరులై పారీని
యేవిధమై వుండేని వో కన్నవార!
సత్యము పాపము సదరంగ
ముయ్యాని పాలేరు
నిత్యము యరగడ్డపాడు నిజము
లింగాలకొండ
ధాక్ష మెరగడ్డపాడు దండు నిల్వ
లింగాలకొండ
మోక్ష మెరగడ్డపాడు మొగనిల్వ
లింగాలకొండ
కోమలేరు తూమలేరు
కొప్పుకొండ మేర
నీళ్ళవలె రక్తంబు నింకి పాలేరు
చార్తాల గుడారు సంపంగి మని
కింద
గుండెలు పేగులు గుదులు
గుదులుగాను

పిల్లా పేటికి రక్తం
పెళ్ళగిలకుండీన!
రంగుగా రక్తంబు కైతొట్టి
పారకుండీన!
గంగరేగు మానికి రక్తము కైతొట్టి
పారకుండీన!
పంచలింగాల కొండకు రక్తము
ప్రదక్షిణం తిరగకుండీన!
కన్నెకల గుండానికి రక్తము
పారకుండీన
కొండమీద వుండేటి శిలలు గోయిందా
గోయిందా యనుచు
మునిగి రక్తములోను
మొరబెట్ట కుండీన!
వాగులు తప్పి వరదలు బట్టి
నెల్లివాగు కూడలి నేరెళ్ళవాగు
పిల్ల కాల్వలు నిండి పెరిగి
యీదులుగాను
రక్తంబు యేరులై పారకుండీన!

పగవారు మా యన్నలు పాలేట
రాక వుండీన!
వొలి వొలో యనుచు
వాలలాడకుండేర!
నీళ్ళవలె రక్తంబు నిండి పాలేట
కలిసి పారకుండీనా వో కన్నవార!
కారుణము యీరీతి గంగసాక్షిగాను
వినరే అంగుణులార!'' తానాడిన
జలకంబు
రంగుగా దలచెను అగుమంచి
యపుడు
శృంగారవు తోట వెళ్ళి
శీఘ్రమే వచ్చిరి.
కూటాలు నడుమ కురువేలు
సవికెలోను
సాటువుకెక్కిన సకల బంధువులు
కొలువు కూర్చుండిరి కురువేలు
సవికెలోను.

## దాదులు అగుమంచిని శృంగారించుట

బాగుగా అగుమంచి పచ్చల గద్దెమీద
వొప్పుగా కూర్చుండె వుర్వీశ సెల్లెలు
యలమితో దాదులు వొచ్చి సరసన
చేరిరి
శృంగారింప సాగిరి అగుమంచికిని

గరి మొకము రీతిన
కమలాక్షి కపుడు
కూర్మితో ముడిచిరి కొప్పుసవరములు
చంద్రుని బోలు వెలదికి నుదుట
బాగుగా దిద్దిరి-పాపట బొట్టు

కన్నుల సన్నపు కాటుక పెట్టిరి
దిట్టముగా నుదుట దిద్దిరి కస్తూరి
అ స్తములో గసి ఆమీద దాదులు
కాంత అగుమంచికి కస్తూరి దిద్దిరి
అక్కలు చెల్లిం డ్రు అరుధాంగలక్షిమి
కొప్పులు బెట్టిరి కొమరొప్ప 'మిగుల'
వాదినెలు మరుదండ్లు
వాలాయముగను
ముదముతో ముడిచిరి
కొప్పు సవరాలు.

## అగుమంచి తన అన్నలిచ్చిన చీరలు-సొమ్ములు ధరింపగా అవి అపశకునముగా సొంపు దప్పుట

ఆగుమంచి దాదుల గొబ్బున బిలచి
" అన్నలు తనమీద అతిభక్తి
గలిగి
యన్నగా యిచ్చిన వారవారపు
సొమ్ములు
పెట్టెలున్నవి [28] తేగమ్మ మీరు''
అంతట అగుమంచి మాట విని
పోయిరి
హెచ్చైన దాదులు వేగాన బోయి
తలుపులు దీసిరి దాదులు యపుడు
తెచ్చిరి పెట్టెలు తెరగొప్ప నంత
వొచ్చిరి సముకానకు వామాక్షు లపుడు
జాళువా బంగారు జతకట్ల నెల్ల
తన దగ్గిర వుంచుక సలలితంబుగను
యనయంగ పేరు పేరున సొమ్ములు
యీయంగ సాగె

## భక్తిరన్న రాక సూచన

తరుణికి భక్తినన్న దయగలిగి
యిచ్చిన
చీరలు సొమ్ములు తీసెను అగుమంచి
పముజులు కమ్మలు బాగుగా
ధరియించి
చెలువైన బంగారు చెరుగుల చీర
రంగుగా ధరియించె
రత్నాల సొమ్ములు
ధరియించె అగుమంచి తాల్మితో
సొమ్ములు
అలివేణి నిలువుటద్దంబులో నీడలు
జూచె
పచ్చలు కడియాలు పైనున్న
చెంగావి
అచ్చుగా నల్లపట్టు కమ్మె అటు
గనిపించ

---

28. పెట్టెలో+ఉన్నవి

ఆదిజూచి అగుమంచి ఆచ్చర్య
పడెను
"నందుల సిరిదేవి! నా తల్లి వినవమ్మ!
భక్తినన్న యిచ్చిన బంగారు
సొమ్ములు
అందముగా నా వొళ్లికి [29]
యుక్తమె యున్నది

ఉత్తర కాశికి బోయిన ఉత్తముడు
గురువు
ధర్మాత్ముడు భక్తిరన్న యక్కడికి
పైనంబు గాబోలు
అమ్మలార! కాశితీర్థము అందీని రేపు"

## కాటమరాజు మరణ సూచన

అని సొమ్ములు చీరలు
అటు కడకు తీసి
అవులన్న తనమీద అతిభక్తి గలిగి
భూవరుడు యిచ్చిన భూషణాలు
ధరియించ
మధురాక్షి [30] అగుమంచి
మణులు దాపిన మంచి
గురుతైన కెంపులు కుందనపు తీగె
మెరువడి ధరియించ మెలత
కంఠమున
చెలువైన కరకంచు చీర తా కట్టెను
అగుమంచి తా నిలువుటద్దంబు చూచి
అగుమంచికి నిలువుటద్దము
నీడలు దెలసి
సకియలు చూడంగా జల జల
వ్రాలెను
కలకంఠి అవి జూచి కడు
చిన్నబాయను

"కన్నవార వినరమ్మ! కాటమరాజు
యిచ్చిన
సొమ్ములు చీరలు సొంపుదప్పినందుకు
మందిష్టి యత్రనైన మహిమకు తల్లి
కుందువతో యెరగెడ్డపాట నుంచి
యేమో కాని వార్తలు వచ్చెనిహో
కన్నతల్లి
ఘనమొప్పగా నేల వ్రాలినందుకు
తెగువతో కాటమరాజు యెక్కేటి
దివ్యరత్నాల తేజి
రక్తాన మునిగి రక్తాన తేలకుండీన!
పగవారి బల్యాలు కాటమరాజుకు
పానుపులాయ కాబోలు
యీ దెల పోట్లు యీవల
వెడలకుండీన!"
అని అగుమంచి చీరలు సొమ్ములు
కడగ వొట్టించ

---

29. ఒడలికి 30. మదిరాక్షి (?)

## అయితన్న మరణ సూచన

అన్న దయగలిగి యిచ్చిన సొమ్ములు
చీరలు తీసెను అగుమంచి
మహిమీద యిచ్చిన మాందావతి
కట్టెను
గైకొని ముత్యాల కంఠమాల
ధరియించె నపుడు
అలవేణి తా నిలువుటద్దంబు జూచి
చెలువైన ముత్యాల సిరిదప్పె
యపుడె
ముత్యాల కంఠమాల కళదప్పె
యపుడె
అగుమంచి కట్టిన పట్టుచీరైన
తెల్లనై కనుపించ గాబోలు
అందుకు అగుమంచి ఆచ్చర్యమంది
"నందుల సిరిదేవి నా తల్లి వినవె!
అయితన్న యిచ్చిన సొమ్ములు
అరుషంబుగా నందుకొని
త్రైలోక మాధవుడు దక్షిణాది
భూమిన
కట్టడి పగతుల రణములో జంపి
ఘట్టిగా యెదురొమ్మున గాయాలు నాటి
అయితమ రాజు యెక్కోటి
అపురూపు సరస్వతికి
పయినిండా చంద్రబాణాలు నాటి
కణలించి అశ్వము కళ్య మధ్యమునను
చెల్లకుండిన పాలేట శ్రీవీరకల్లుగా
వుండంగనాయ''
అప్పుడు అగుమంచి ఆ చీరలు
సొమ్ములు అటు కడజిమ్మి

## ఖట్టావులన్న మరణ సూచన

వరుసతో ఖట్టావుల వల్లభన్న
యిచ్చిన చీరలు సొమ్ములు
తీసెను అగుమంచి
పేటంచు వ్రాత వన్నెప్రతిమెల చీర
గట్టిగా కట్టెను కమలాక్షియపుడు
భావించి పచ్చల పతకంబు బెట్టి
హేమంబు గలిగిన నిలువుటద్దము
జూచి
శ్రీమంతు చెల్లెలకి సిరిదప్పి
సొమ్ములు
వామాక్షి చీరలు వ్రాసిన ప్రెతిమెలు
తోడు ప్రాణము లొచ్చి శోకింప సాగె
కడు మంచి పతకంబు కన్నుల
జూడగాను
గురిగింజ దండలై మార్మికొని యుండె
అగుమంచి అవిచూచి అటు చిన్నపోయ

చెక్కిట చెయి చేర్చుకుని సిరిదేవిని
బిలచ
"ఓ యమ్మ! వినవమ్మ! వల్లభన్న
యిచ్చిన చీరలు
పై వ్రాసిన ప్రెతిమెల కెల్ల
ప్రాణములు వచ్చ
ఆ క్షణములోన తోచక తమలోన
దుఃఖించినందులకు
నిర్జీవ ప్రతిమలు నేడు
దుఃఖించినందులకు
దుర్భాడి చెత్త్యుల దనుమాడి చంపి
భట్టావుల మా యన్నకు బల్లేలు
నాటి

ఆ ఘోరయుద్ధమున
అతఅతము[31]గా బోలు
భట్టావుల రాజు యెక్కిటి వాసిగల
తేజీకి
వొళ్ళెల్ల యీటెలు వడి దాకినపుడె
యేడుకతో మా యన్నలు యేలిన
మందలెల్ల
చూడక రణమందు చిక్కి ని
వో సుదుతులారా"
అని అగుమంచి చీరలు సొమ్ములు
అటు గడజిమ్మె

## కరియావులన్న మరణ సూచన

కరియావుల రాజు యిచ్చిన
కనకాంబరములు
కెంపులు బన్నసరము గరిమెతో
ధరియించి
సొంపుతో నిలువుటద్దము అగుమంచి
కన్నుల చూచెను
బంగారు సొమ్ములు పసిమెల్ల
దప్పెను
సంగతిగా మేనుకు సరిపోకయుండె
మేలైన బన్నసరము మీనాక్షి
కపుడు

తప్పక పువ్వుల దండవలెనే
వుండెను
అందుకు అగుమంచి ఆచ్చర్యమందెః
"నందుల సిరిదేవి నా తల్లి వినవె
సొంపుతో కరియావుల రాజు
యిచ్చిన సొమ్ములు
అగుమంచికి సొంపు దప్పినందుకు
అచ్యుతుడు[32] మా యన్న
కరియావుల రాజు
పాలేట పోరాడి వైరుల పొట్టలు
చించి

---

31. హతాహతము 32. అచ్యుతుడు

పురువడి బాణాలు వుక్కుటలుగులు
నాటి
కరియావుల రాజు యెక్కేటి కరి
వాహణానికి
చెరీరమందు యీటెలు
జజరితముసిరిగ నాటి

కరియావులు మా యన్న కళ్ళన
పరగక వుండీన!
చీరలు సొమ్ములు అగుమంచి
ఆటుబడజిమ్మె

## ఎఱ్ఱయ్య మరణ సూచన

భీముడు యరనన్న పేటొగాని
యిచ్చిన
తామర పూవుల చీర తాల్మితో
గట్టెను
సొంపుతో గట్టెను అగుమంచి
యపుడు
అచ్చర్యముగా నిలువుటద్దము
చూచెను
అద్దములోపల ఆ చీరలు సొమ్ములు
సిద్ధముగా పసుపుచీరలవలె నుండె
భామ అగుమంచి బాబాంధవుల
బిలచి

"సోమకుల గోత్రము
సొంపు చూడుడ మీరు
వెరణన్న యీ సొమ్ములు తనకు
సరిపోనందుకు
సామజంబులవంటి యెద్దులు
యరణన్న యుద్ధంబు చేసి
సిద్దిరాజులవారి శానలు గూల్చి
చెరీరమున వీటెలు జర్చితముగ నాటి
వెరణన్న యీరీతి వెరగద్దపాటన
వరగకుండీన!"

## ముమ్మయ్య మరణ సూచన

ఆ చీరలు సొమ్ములు ఆటుకడకు దీసి
వాసిగా ముమ్మయ్య వరుషతో
యిచ్చిన
ముంగల మురువులు బెట్టి

సందిట కడియాలు సకియ దాబెట్టి
చెలువైన కరకంచు చీర తా గట్టి
అగుమంచి తా నిలువుటద్దము చూచ
అద్దంబు లోపుల ఆ చీర సొమ్ములు

---

౨౩. జర్జరితము

చీర నీళ్ళను ముంచి జిగి దప్పినట్లు
ఆరీతి దేహమునకు అంటుకయుండె
సంపెట కడియాలు జాతి
శేషువి వలెను
మెలగొని తమలోన మెలుగుచు నుండె
తన చేతి యుంగరములు మూడు
తునకలై యపుడు
రంగుదప్పి ధరమీద రాలినట్లుండె
పలికెను తల్లితో బంధువులు వినగః
"ముమ్మయ్య యిచ్చిన ముంగారు
మురుగులు తనకు
వినవమ్మ సిరిదేవి తనకు
వుండనేరదు
కల్లందుల పోచయ్య గార్భపు
కొడుకు
శ్రీ బాలముమ్మయ్య పాలేట తర్లి
స్థిరముగా యల్లవులు సిద్దిరాజు
బలము
శిరుస్సులు తెగగొట్టి శ్రీ
వీరతముకానకు

నివ్వాళిగా బట్టిరి నిష్ఠ కాశిలోన
తావులు చెప్పుదురు తల్లిరో వినవే
పోచయ్య ముమ్మయ్య భూవరుని
కొలువున
సన్నుతిన నిలుతురు సత్యమీమాట
పోచయ్య మెడనుండేటి తులసి
వనమాల
రక్తాన మునిగి రక్తాన తేలకుండీన !
ముమ్మయ్య మెడనుండేటి ముత్యాల
కంఠమాల
మునిగి రక్తములోన తేలకుండీన!
ఈ పొద్దు రేపు వుదయానకు
విపరీత వార్తలు చూడరమ్మా రేపు
నిండిన ధనముకొండ నీళ్ళాటి రేవున
ధోవలు వాగులై దొంతులు పగిలి
శివలోక పయనాలు చేదెలార
తమకు

## బసవన్న మరణ సూచన

రేపు ఘూడోజామున నలినాక్షులారః
ఆపద పాలేట వార్తలు నేటికి
యేడు దినముల నుండి
యరగడ్డపాటును
ఛేసేటి యుద్ధము చెల్లేటి బలగము

బసువన్నకు భారపు గాయాలు
దగిలి
యీశ్వరుడైనట్టి బసువన్నకపుడు
జర్జతముగా నాటె
వుక్కుటలుగులున్ను

కుంచాన బాణాలు కుదబోసినట్లు
మించిన రక్తంబు కరిశ
వరసంబుగాను
మల్లె మొగ్గలవంటి అంబులు
మోపురము నాటి
సిలకలు అంబులు శిరసుపై నాటి
జదల బసువన్నకు సందు లేకుండ
వల్లెల్ల అంబులు యడలేక నాటి
మల్లెమొగ్గలవంటి బాణాలు శిరస్సున
నాటి
గెన్నేరాకులవంటి అలుగులు
గరగర నాటి
కొన్ని కొన్ని అంబులు గుండెలకు
నాటి
యెద్దు రూపము దప్పి సిరిదొలగి
పోయ
వద్ద నిలచి చూచెను గురువు
పల్యకొండ
బసువన్నపై బాణాలు నేర్పున దీసె
తీసిన గాయాలు నిండా
తొలసితీర్థము వుంచి
శిరస్సు కాడనుండి బసవన్నకు
పాదముల వరకు
యడలేక పోట్లు యదమందు నాటె
పశువులకు రాజైన బసువన్నా! నీవు
పశువులపై యోధువులపైకి
ధాతవు నీవు
చెయ్యిన ధనముకొండకు
నిజరూపమునన్ను

వేవేగ కదులుమని పల్లికొండ
సెలవిచ్చెనవుడు
నందుల సిరిదేవి! నా తల్లి!
వినవమ్మ
అన్నతమ్ము లందరుని కోల్పుచ్చి
బసువన్న
పాలేటి నుంచి వచ్చిని తల్లి
పైడి సెంబుతో వుతకంబు
చెయ్యాన దెచ్చి
బసువన్న పాదాలు జలకంబు లార్చి
పాలేటనున్న బాలరాజుల వార్తలు
నీలకంతుని వల్ల సిజవార్తలు
దెలచిని
లక్కసరి కూటాలు రచ్చ లోగిండ్లు
చక్కని కొల్లారప యిండ్లు
సందనాలు మేడలోను
తరుణులందరిని బిలిచి తలుపులు
వేయించి
సిరిదేవి కూటాలు చిచ్చులు దగిలించి
కొమరగిరి కోడండ్ల నెల్లా
మొదులుగాను
అమరలోకానకు అందరము మనము
బందారముగా చెశాచూరవిడచి
గుండాన పడవలను గొబ్బున
యపుడు
బసువన్న వచ్చిని పయనాలు.
మనకు"
అన్నల చెల్లెలు అగుమంచి పలికెను.

## బీరినీని మరణ సూచన

కలితుడు బీరన్న గార్వమున
యిచ్చిన
చీరలు సొమ్ములు తీశాను అగుమంచి
యింద్ర గోపాలు పట్టుచీరలు గట్టెను
కరముల బంగారు కడియములు
బెట్టె
ఆరూఢిగా నిలువుటద్దంబు జూచ
భావించి జూచితే బంగారు
కడియముల్
కంచు కడియముల్‌గా వుండెను
కనుపించినంతలో అగుమంచి
కళదప్పియుండె
"నందుల సిరిదేవి! నా తల్లి
వినువమ్మ!
గోసంగి బీరన్న, బోడావుల
చెన్నయ్య

పోరి పోరి దన రిపుల వారిని జంపి
ఘటాల యేనుగుల ఖండించి చంపి
గుర్రాల లొటిపిటల తునియలుగా
నరకి
మంగోలు బాటన మడియకుండీన!
కొంగవాలు కత్తులు కూలకుండీన
భట్టు కత్తి పగవారు పాలుగాకుండీన
పట్టుచీర దాచినట్లు బందును
దాచితినే మముగన్న తల్లి!
పగవారి ఆయుధానికి బద్దిగొర్లగా
జేస్తి
మొగధీరుడు బీరన్న మడిచిన
వార్తలు
వుదయ వేళకు వార్తలు తెలిసీని
తల్లి!"

## అగుమంచి తన భర్త యిచ్చిన చీరలు సొమ్ములు ధరింపగా అవి శుభసూచకముగా సొంపు మీరుట

ఆ చీరలు సొమ్ములు అటు కదజిమ్మి
అన్నలు యిచ్చిన సొమ్ములు
అరుషముగా పాయనంచు
వన్నెగా తన పురుషుడు యిచ్చిన
వారవారపు సొమ్ములును
ధరియించ అగుమంచి తాల్మితో నంత

పువ్వుల వన్నెచీర పూని తాకట్టి
నవ్వుచు పులిగోరు రవికె తా తొడిగ
మొలక కుచముల మీద
బన్నసరము ధరియించి
అందుకుని ముత్యాల ఆరములు బెట్టి
సందిట కడియాలు సకియ తా బెట్టి

పొంగుచు అలవేణి
పట్టుచీరలు మీద
పత్సళ వడ్డ్యాణము గదియించి బెట్టి
వేడుకతో అగుమంచి నిలువుటద్దము
చూచ
అగుమంచి కన్నులకు ఆ చీర
సొమ్ములు
పువ్వుల వొన్నెచీర పొంకమై
వుండెను
పులిగోరు రవికకి మిక్కుటముగ
బిగువై వుండె
అరయంగా సొమ్ములుకు అటు కాంతి
వొచ్చ
చెరీరమున బంగారుచాయ గనుపించ.

## తనకు సొగుమానము లభించునని అగుమంచి ఏష్యము చెప్పుట

తన వొళ్ళు కాంతికి తాను
అగుమంచి
కన్నవారిని బిల్చిచి కలకల నవ్వెను:
"వింటిరా కన్నవార! యేవి
సోద్యమోగాని
పుట్టింటివారు యిచ్చిన సొమ్ములు
చీరలు
అమరదాయెను తనకు అతి
సొంపులేక
అత్తవారు యిచ్చిన సొమ్ములు
అమిరెను సొంపు మీరగాను
పురుషుడు యిచ్చిన పువ్వుల చీర
అరుషమై మేనుకు అమిరినందులకు
కోరసింహ్మము తా గోరాశిలోను
తిమిరేటి మూకల తెగువతో జంపి
దండిగా పగతుల తలలు తరించి
యెదురొమ్మున యీటెలు యీపున
వెడలి
యీటెలు పోట్లు యీవలావల వెడలి
చదరక నా విభుడు చెల్లెగాబోలు
యిది తనకు మోక్షంబు యిది తనకు
జెయము
కనివుండు అమ్మలార ! కల్ల
గాకుండ
పనిబూని కైజేసి పయనంబు రేపు
నల్లచెరువులోన నర్రావుల సిరిదేవి
వల్లవులు స్త్రీమందులు వారు
వీరనక
పణ్యపు సిరాడ పోవల రేపు
పాలవెళ్ళి గోత్రానకు పైనంబు రేపు
వైకుంఠ పైనాలు వో యమ్మ! రేపు
కనివుండు అమ్మలార! కల్ల
గాకుండ
అమ్మరో సిరిదేవి! అరుదాంగ
లక్షిమి."

మక్కువతో కొమరమ్మ మరియు
నిట్లనియె:
"యింతలేసి పంతాలు యింతి
అగుమంచి
పంతంబు లేటికే బంధువుల మీద
మనివుండువమ్మ యిటువంటి
మాటలాడకు
అనవొద్దు పాపంబు అన్నలు మీద"
పిన్న పెద్దలవారు పలికినంతలోనే
అన్నల చెల్లెలు అగుమంచి బలికె:

"అమ్మలార! పగగలిగి అనలేదు
నేను
పొమ్ములు చీరలు సొంవు
దప్పినందుకు
తెలిసిన వార్తలు జెప్పితే యేమి
నేరంబో గాని
నేరము లెంచకు కన్నవార!
నిజము నా మాట

## గంగను దర్శించుటకై అగుమంచి యాదవకాంతలను పిలువనంపుట

గంగను వేడను గ్రక్కున పోవలెను
వినరమ్మ! అంగనా మణులార!
ఆయత్తపడుడ
యిరు వంశమువారు కన్నవారు
యాదవ సతులనెల్ల
భామలార! పిలువరే ధనముకొండ
పెద్దల"
మక్కువతో అగుమంచి మాటవిని
పోయిరి
వరుసతో స్త్రీరుమందుల వారిని
పిలచేరు
"పందెముల వో పాప! భండారు
లక్ష్ము!
చందన గంధీర! చట్టు మారెమ్మ!

పులిముద్దుల దేశు! భూమాడు పోలు!
పొంగుచు మీరంతా బోనాలు గొంచు
గంగను వేడను గ్రక్కున రారమ్మ!
జెట్టి భోయిన యెంగు! జెడదారు
గంగ!
గట్టిగా రారమ్మ! గంగను వేడ
మకట కోటి మల్లమ్మ! మర్ల
మారెమ్మ!
తటుకున దామసాని తల్లిరో! రావె
గ్రక్కున రారమ్మ గంగను వేడను
నాచకూళ్ళ నన్నమ్మ! నన్నము
నాగమ్మ!
వంచన గలయట్టి పనితలార! మీరు

కల్లందుల పుల్లమ్మ! గాలము
లింగమ్మ!
సంగమేశ్వరుని సంగ! సారంగ
రామ!
పొలతి పువ్వుల బంతి పుల్లావుల
పుల్లమ్మ!
పలికి బొంకని యట్టి పిన్నపాపలార!
నేతి వారి ముద్దమ్మ! నెలతులార!
మీరు
నెనరైన పెద్దలు నేతివారి పోతమ్మ!
క్యాతిగా రారమ్మ గంగను వేడ
గోవుదారి సిద్దమ్మ! గొడ్డటి వార?
ఆవుల వల్లమ్మ అరుధాంగి నాగమ్మ
దండిబోయిన యెఱ్ఱు తరుణులార!
మీరు
నిండు వేడుకతోన నెలతులార!
మీరు
గంగను వేడను గ్రక్కున రారమ్మ!
కొమరక్క మొదులైన గోత్రాల
పెద్దలు
వామాక్షు లందరు తగు వేట్కతోను
కొత్ర కొత్త బోనాలు గొబ్బున
వండించి
పెద్దల నందరిని పేరుపేరున బిలచి
అమర్థంగ ఆగుమంచి అప్పల
బిలచేరు:

"పందెముల యరణప్ప! పయిడివారి
తల్లి!
సన్నము వో నాగ! నలినాక్షి నీవు
పన్నుగా రారమ్మ! బాగీర్థిని వేడ
చట్టువారి సాన! చల్ల నాగమ్మ!
ఘట్టిగా రారమ్మ! గంగను వేడ"
వొవ్వుగా ఆగుమంచి వాదినెల
బిలచేరు!
"భక్తుని నల్లమేడ! పైనమై నీవు
అతివేగ దావమ్మ ఆవులన్న గంగ
అయితన్న నో పోత! అరుదాంగ
లక్షిమి
పైనమై రారమ్మ భట్టావుల సూర!
కరియావుల నాగ! రావో గంగను
వేడ
యరణన్న వోభయ్య: వేగమె రావో
ముమ్మయ్య సినమల్లు! ముదిత
సిరిగిరమ్మ
కమ్ముకొని రారమ్మ? గంగను వేడ"
అందరికి పైనాలు అతివేగ జెప్పి
సందన గందలు[34] సముఖాన నిలచి
అక్కన్న గంగకు అతి నిష్ఠతోను
మక్కువతో వందనం మరివేగ జేశ

34. చందన గంధులు

## గంగను పూజించుటకై అగుమంచి యాదవకాంతలతో బయలుదేరుట

అరయంగ జవ్వాజి ఆకులు
భూతియును
సిరి మించు భంగారు సిటిగిన్నె నిండ
రంగుగా సిడుకొని రమణి
అగుమంచి
అంగణామణి యపుడు అతి
వేగముగను
ఆదివారపు భావి అగ్గుణాలు తెప్పించి
గరిమితో భంగారు కళశాలు దించి
చామంచి కరువేలు చెంగల్వ పూలు
వేమారు మల్లెలు వికసించు మొల్లలు
పొన్నలు పొగడలు బొండు
మల్లెలును
వొన్నిగా జాజులు వాసించి నట్లు
పరగ దాగర్లతో పట్టించినంత
అరయంగ అగుమంచి అతి
వేగముగను
వొప్పుగా పీరగంధము వనరంగ
యపుడు
గాజు కుప్పెలతోను కుదురుగా నుంచి
ఆటకలి బట్టించ అక్కన్నదాను
మేటి రోజుల చెల్లెలు మెరసి
అగుమంచి
దీవించి బోనాలు తెలివితో నంత
భావించి అగుమంచి పట్టించెనపుడు

పీరగంధము కుప్పెలు వెలదుల
చేతికి
అరయంగ నిచ్చెను అతి నిష్ఠతోను
బంగారు నివ్వాళి పళ్యాలు దెచ్చి
సంగతిగా సాంబ్రాణి సతులచేతికి
నిచ్చె
రాజుల చెల్లెలు రమణితో నపుడు
పూజెర్ల చేతికిచ్చె పువ్వులు దాగర్లు
గెజరాజు చెల్లెలు గంగను వేడను
పయనమై వొచ్చెను పణతి
అగుమంచి
దాయాదు చుట్టాలు తల్లివొంక
బలుగము
రాయబేరి మ్రోవంగ రాజుల చెల్లెలు
కుచ్చులు ముత్యాలు కూర్చిన యట్టి
సవరణ పచ్చల పల్లకి యెక్కెను
పందముల తల్లి
దండిగా నీలాలు దాపి వున్నావి
వెండెంచుల పల్లకి యెక్కెను
నేతి ముద్దమ్మ
కొమరొప్ప ముత్యాల కూర్చినయట్టి
కోదండపాలకి కొమరమ్మ గొబ్బున
యెక్కెను
మణిభూషణాలు మాటివున్నావి

అమసల[35] పల్లకి యెక్కేను
అమ్మ సిరిదేవి
కనక భూషణములు కళగులికి నట్టి
కనక దండ్యాల పల్లకి యెక్కేను
కాంత అగుమంచి
వల్లవులవారి దివాణము వాకిట
ముందర
బలువైన మేళాలు భజంత్రీల వారు
ఆరూఢి మ్రోయించిరి ఆగుబులుగాను
బేరీలు డమామీలు బిరుదులు
మద్దిండ్లు
పీరణ డోలులు వెలయ సన్నాయిలు
నరగలు రుంజలు నైతకై ముఖ్య
సన్నపీరణాలు శంకులు ధ్వనలు
కనక తప్పెట్లు కాలకొమ్ములును
భోరున మ్రోపంగ భూనాథు చెల్లెలు
గారవంబున వెడలె గంగను వేడ
అజారము ఏఖఃట్టి ఉసుమంత
గెమినికి
తేజముతో వొచ్చిరి దివ్వె గోపికలు
గెమిని వెళ్ళిరాగానె గంగగుడి మీద
రవిమించు భంగారు రత్నాల కుండ
కనుపించను యాదవకాంతల కపుడు
పల్లకీలు దిగిరి భామామణులు
అందలాలు దిగిరి అంగణామణులు
పాదచారులైరి భామినీ మణులు
మోదముతో వొచ్చిరి
మ్రొక్కేను వారు
కుడిచై లోగాను గోపకాంతలును
సెలగోల కాంతలు శాంభవిని వేడి
అగణితంబుగ మేటి అంగణామణులు
తూర్పు గెమినికి జొచ్చిరి తోయజ
ముఖులు
నేర్పుతో కోవెలకు నెలతలు
మ్రొక్కి
భూత కోట్లకునెల్ల పురుషుడైనట్టి
పోతురాజుకు వారు పొందుగా
మ్రొక్కిరి
నాగకాంతులు నపుడు వేండిబోనాలు
దించిరి
తప్పక తిరుమందుల దాదుల బిలచి
తలుపులు తియ్యమని తెరగొప్పబలికె
తలుపులు తీసిరి స్థిరమందులవారు

## అగుమంచి గంగను శృంగారించుట

అగుమంచి మొదులైన
యాదువ స్త్రీలు
మక్కువతో లోపలికి
మరి బోయిరంత

35. హంసల

నాగభూషణ కాంతకు నమస్కరించి
పట్టు పట్టావళ్ళు పరిపించిరి వేగ
పాతపూజలన్ని వేగ్రాన[36]జరిపించి
సక్కని గంగకు సంపంగి నూనె
అగుమంచి శిడుసంటె
అతి వేడ్కతోను
శిరుసంటి గంగకు చెలువైన కస్తూరి
పసుపున నలుగాడి పణతి శీకాయ
ఆటకల నలుగాడి అతినిష్ఠతోను
కలకంఠి బంగారు కళశాల్కు
జలకంబులార్చి
జాన్నవీ గంగకు స్నానంబులాయ
మేనిమి పట్టున మేనెల్ల దుడిచి
చక్కవిడచి గంగకు పీరజెడలల్లిరి
తప్పక తలయార్చిరి దానవసంహారికి
కడువేగ కుందనము కనకమైనట్టి
పొడువైన బంగారు పుట్టము గట్టిరి
అగరు శ్రీగంధము అలర కస్తూరి
సొంపుగా బూసిరి వామాక్షి కపుడు
కురువేలు పువ్వులు గురుతుగా
జడలకు
సరవితోముడిచిరి
జాన్నవీరగంగకు[37]
వాసిగల గంగకు భంగారు శాసలు
బెట్టిరి
వేగుచక్కను బోలు, వెలదికి
నొదుట
బాగుగా దిద్దిరి, పాపట బొట్టు
అస్తంబు లంకించి ఆమీద వారు
కస్తూరి దిద్దిరి కమలాక్షి కపుడు
కాటుక దిద్దిరి గంగకు నపుడు
దిటముగా కస్తూరి దిద్దిరి కాంతలు
బవిరులు కుంటెళ్ళు పముజులు
కమ్మలు
సవరించు కర్ణములు సకియ
గంగకును
పగడాల బన్నసరము పచ్చల
పతకము
జగదేవ మాతకు సరివితో ధరియించిరి
కీర్తిగల కడియాలు కీట కంకణాలు
మూర్తిగా దొడిగెను పుత్తళి గాజులు
కరమొప్ప వేళ్ళను కనక ముద్రికలు
ధరియించి గంగకు తాల్మితో నంత
హోంకారికి బంగారు వొడ్యాణము
ధరియించి
నవరత్నాల కిరీటము నయముగా
శిరుసున
శివుని ఇల్లాలికి చెలువముగా
బెట్టెను
పన్నెండు చేతుల బాగీర్తి కడుపు
మెండైన సొమ్ములు మేలిమితో
బెట్టెను
గంగకు సొమ్ములు ఘనముగా
అగుమంచి

36. వేగము+శీఘ్రము—వేగ్రము (?) 37. జాహ్నవీ+వీరగంగ

శృంగారించెను యోగశాంబరి
కపుడు
సాంబ్రాణి ధూపముల్ సకియ
దానపుడు
ఘమ్మ ఘమ్మన నెగయ
శృంగారించి
ప్రెమరాంబికకు కుప్పెలు
పన్నీరు దెచ్చి

వలపూరి దిరిగి వార బోయించి
పొలుపుగా రత్నాల పోలు బోయించి
అందముగా కస్తూరిని అలిదించ
నపుడు
చెలువుగా వీర గెంధము జిలికించ
నపుడు

## అగుమంచి గంగకు పోలు పోయగా అది రక్తమగుట

రాజులు చెల్లెలు రమణి అగుమంచి
తేజముతో పోలు అందముగా బోసి
పాలేటికి బోయిన బాలలు లాజుల
బోల్చి
పోలు బోసి అన్నల పోలికలు
జూచి
అన్నల బోల్చిన పోలు అటు
చిన్నబోయి
వన్నెదప్పి పోలు రక్తమై వుండె
ఉందుకు అగుమంచి ఆచ్చర్యమంది
"నంథులు సిరిదేవి! నా తల్లి
వినవె

దుర్వాసు శాపము ధనకొండకు
తగిలింది
యెరిగి వుండుటకన్న యిది నిజమైన
వార్త
పోలు యర్రనైని పోలికలు
వినుడి
ఆవుల మందలు రుక్తలాయె
అమ్మ సిరిదేవి!
వాలాయముగ తన పోలు వార్తలు
జెప్పెద

## అగుమంచి గంగకు బోనాలు పెట్టుట

బాల్మితో బోనాలు దగ్గర దెప్పించి
పల్లవులవారు దెచ్చిన వారి
కొత్తబోనాలు

వారి కొత్తబోనాలు వక వల్లన నుంచి
స్త్రిరుమందుల వారు దెచ్చిన
కొర్ర క్రొత్త బోనాలు

కొ్రత్త కొత్త బోనాలు పకవల్లన
నుంచి
నూటొక్క ముద్ద నూటొక్క పోక
నూటొక్క ఆకు
వాటముగ నిలిపెను వనిత
అగుమంచి
పాటించి యానడుమ పణితి
అగుమంచి

మేటి ముద్దజేసి ముందుగా నిలిపెను
పప్పుతో పదివేలు శాకాపి కూరలు
వాసిగా వొడ్డించ వణిత అగుమంచి
వారబోసి దూపం వొరుషతో
నించి

## యాదవకాంతలు గంగకు నివాళి ఇచ్చుట

పేరు పేరు వరుసన పెద్దలార!
మీరు
నివ్వాళి యివ్వరమ్మ! నిలచి
యెదురుండి
పందెముల యరణప్ప! పాయరాని
యియ్యము! [88] పైడినారి తల్లి
కందువతో నివ్వాళి గంగ·కియ్యండి!
సన్నము నాగ! యో
ముమ్మయ్య కొమ్మ!
పన్నుగా నివ్వాళి భాగిరథికియ్యండి!
గుట్టువారి సాన! జడదారి నాగ!
గట్టిగా నివ్వాళి గంగకియ్యండి!
పులి ముద్దుల దేసు! భూమాడి పోలు!
గనముగా నివ్వాళి గంగకియ్యండి!
పందముల వో పాప! బంగారు
లక్షుమ!

కందువతో నివ్వాళి గంగకియ్యండి!"
భక్తుని నల్లమేడ! పణత వీరగంగ
కరియావల నాగ! యరన్న బియ్య
పోచయ్య సిరిగిరమ్మ! వో
ముమ్మయ్యమల్లా
గనముగా నివ్వాళి గంగకియ్యండి!"
అగుమంచి మొధులైన యాధువస్త్రీలు
నివ్వాళిపాడి చాలించిరి పళ్యములు
కడనుంచిరి
అటు వెనుక మాతంగి వణితలును
నిండుకొని నివ్వాళి నెలతులు దెచ్చిరి
ముఖమండపమున మొత్తముగా
నిలచిరి
నివ్వాళి పట్టిరి నిలచి యెదురుండి
బీరన్న కులసతి చెన్నమ్మచేడె

88. వియ్యమా!

పాడి సాలించి పళ్యములు
 కదనుంచిరి

## తన అన్నల క్షేమమును తెలుపుమని అగుమంచి గంగను ప్రార్థించుట

ధీమంతుని చెల్లెలు అగుమంచి తాను
వేమారుగంగను వేడుకోసాగె
"ఆధిశక్తివి నీవు ఆకిల మాతవు నీవు
నాధరంబులు నీవు నవబ్రహ్మలు
 నీవు
భువనంబులు నీవు భూములు నీవు
రవి చంద్రుడు నీవు రాగంబులు
 నీవు
భోగంబులు నీవు భూములు నీవు
యోగంబులు నీవు యూధంబులు
 నీవు
కదనంబులును నీవు కయ్యములు
 నీవు
మనుజులెల్లను నీవు మాయలు నీవు
కాలమెల్లను నీవు ఆకాశంబు నీవు
యెలివాడలు నీవు వెలధులు నీవు
పాడి పంటలు నీవు పశువులు నీవు
నక్షత్రములు నీవు నభములు నీవు
పక్షియక్షులు నీవు పన్నగములు నీవు
సారంబులు నీవు సవుసారంబు[39]
 నీవు
మెరుగు వాయములు నీవు
 మేషములు నీవు
అల్ల వేధములు నీవు ఆమురులు
 నీవు
అంధంబులు నీవు బ్రెహ్మాంధంబు
 నీవు
కొండ గ్రొహములు[40] నీవు కోనలు
 నీవు
సంధ్యలు నీవు అన్ని జెపములు
 నీవు
మానంబు నీవు మహత్యంబు నీవు
అన్నిట నీవు మాకు ఆదరువు నీవు
గంగరో! మాపాల కలిగితివైన
రంగుకా దక్షణాదికి బోయిన
 రాజుల క్షేమము
మాతోన జెప్పవే మముగన్న తల్లి
భూతల పతులైన పూని మాయన్నలు
యరగెడ్డపాటను యెట్లు వున్నారో
యెరుగను వోతల్లి! యెవరి
 నడుగుదును?

---

39. సంసారంబు 40. గుహాలు

మాకు దిక్కు వీరమండలివి నీవు
చేకొని నిత్య నీశావ నే జేతు
పొడగట్టి నాతోను పలుకవటె
గంగ
వూరికే వున్నావు వో యమ్మ నీవు"
అగుమంచి వేడితే అపుడు
వేరువమ్మ[41]
వుక్కు బొమ్మ వలను వుండెను
గంగ
పప్పుడు గంగను అందరు జూచి
తప్పక తమలోన తలపోసి రంత:
"పొలతులార! యిన్నాళ్ళు బోనాలు
దెస్తేను
కల కల నవ్వినట్లు కనుపించు
గంగ
అమ్మలార! పాలేట యేమో అవుగతి
బుట్టకుండీన?
కమ్ముకొని యాగంగ కళ దప్పి
యున్నది"
అగుమంచి యప్పుడు యా దుర్గిని
జూచి
మక్కువతో వేడి మరియు నిట్లనియె
"యాటలు బోనాలు యేగమే
తెస్తేను
పాటించి నాతోను పలుకవే గంగ:
వేడెరో మాయన్నలు క్షేమము
వింటేను
పాటించి పదివేల బారి గ్రొరెలును
చాలుగా నరికింతు శక్తిరో: నీకు

వొంత కెక్కిన గర్వ శ్రీమంతులు
మాయన్నలు
సంతోషము వింటినైన జాన్న వీర
గంగ
వుత్తరపు గమినిలో వూర జాతరు
సేయింతు
అవులు మంద రాజులు మాయన్నల
వద్ద నుండి
మేలు వార్తలు వింటినైన మించిన
ప్రేమతోను
దక్షణపు గమిని ముందర దామిని
యేటలు
యీక్షణమే నరికింతు యింతిరో!
నీకు
చక్కని మాయన్నలు సంగ్రామ
విజయుండు
కక్కసపు వైరుల కంఠీరవుండు
కానలు ధేనువులు క్షేమాన వొస్తేను
యేపిలు నరికించి ప్రియముతో
బండి సిళ్ళు
యీ రాత్రి యాడింతు మాతల్లి! నీకు
చల్లవారు యేగురు సాహస ఘనులు
చల్లగా వొస్తేను సంతోషమునను
వీరి క్షేమము నేను వింటినైనాను
ముందరి జడలిత్తు ముదితిరో: నీకు
యెద్దులు బొల్లావు యెలమితో
అయితన్న
నెలతరో: పరిణామము నే
వింటినైనాను

41. ఏరువమ్మ (—గంగ)

చేతిగావు యిత్తును శాంభవి నీకు
భట్టావుల మాయన్న పరగ
కరియావుల రాజు
వీరి పరిణామము నేను వింటినై నాను
మూపున కండ యిత్తు ముదితరో!
నీకు
పల్లికొండ మా పెద్దభావ
పద్మరాగవుండు
వెలయంగ చట్టువారి యర్రయ్య
నా మర్ది
లేమరో పాలేట లెస్స వుంటేను
భామరో యెత్తింతు పదివేల దివ్వెలు
నాచకూళ్ళ నాయుడు, నా సుతుడు
పోచయ్య
వాసి కెక్కిన స్త్రిరమందులు
వన్నెగల పెద్దలు
వన్నెగా శుభవార్త నే వింటినైన
పన్నుగా కుంకము బండ్ల దోలింతు
ప్రాణనాథుండు తనకు పాయని
పురుషుండు
రాణవు[42]లో పుత్తమరాజు
పాలేట క్షేమాన వుంటేను
రాతి గుడియు కట్టించి రమణితో నీకు
భక్తితో గట్టింతు బంగారు గుడియు
మాయన్న బీరన్న మన్నీలకు వైరు
రాయసమానుడు గనుడు చెన్నయ్య
వివరమంతులు వారు వెలయ
గోసంగులు
ధారుణి గలిగిన దక్షణ పాలేట
క్షేమాన వుంటేను జాన్నవీర గంగా
భారిగుండము జొత్తు భాగీర్థి నేను
పరగ గోపాలుక్కలకు పరమ
పున్నిడు[43] బసువన్న
ఆ లక్ష యోధువులు అడ్డగల
కంపటము
అక్షయము శాయ వలను ఆదిలక్ష్మి
గంగ!
మోధముతో నీకు మ్రొక్కేను
"గంగా!"

## గంగ దుఃఖించుట

అగుమంచి మ్రొక్కితేను అపుడు
వేరుపమ్మ
పరగంగ మేగము పట్టినట్లుండె
పటపటమని గుడి పగిలినట్లుండె
పెటపెటమని వురుములు
ప్రెళశినట్లాయె
కటకట యేడ్చేప కన్నులలో
పాపలు

42. ర్రాణువ 43. పుణ్యుడు

జొటజొట కన్నీరు జోరున గురియ
గడగడ వొణికెను కంబము
లాదిగాను
పురుతాలు పూగెను పురువు
భూషణాలు
వొడివొడి శాసలు పరుషతోరాలె
రవ్వలు చెదరెను రత్నకిరీటానుండి
యేర్వమ్మ గెంధము యర్రనై యుండె
కాంతియు దప్పెను
(కళయును దప్పె)
అందము దప్పెను అతివి మేనెల్ల
పువ్వుల తోమాలు భూమిపై రాలె
నక్షత్రములు రాలెను భూమిన
యపుడు
పక్షి చీకాకుబడి కూలినట్లాయ
కుడికంట పుతకము కురియంగ సాగె
యెడమకంట పుతకము
యేరులై పారె
గుభగుభమని గంగ గుబ్బటిలసాగె
గుబ్బటిల్లి గంగ గుతి పొడుగున
బెరిగి
గర్భ గ్రాహములో నున్న గంగను
చూచి

బొబ్బర్లు పెట్టెను పోతురాజపుడు
భాగిరథి అదలంగ పణుతులు జూచి
తెగువుతో దుక్కంబు
తెచ్చిరందరును
సిరిదేవి మొపతైన యాదువస్త్రీలు
అరుధాంగ లక్ష్మి అదలంగ సాగె
తామరాకు నీళ్ళు తర్లటించ సాగిరి
కుమ్మరాము చిమ్మవల కుమ్మరిల
సాగిరి
తాటేకు మంటవల దరికొనసాగె
భామలు దుక్కించిరి పాయక
తమలోన
వామాతులు గంగకు
యిరుపార్వము[44]లుండిరి
భాగిరథి దుక్కంబు అగుమంచి
చూచి
తాను వేడి ఆసవుంచి దుక్కము
నిలుపంగసాగె
"శాంతమే రుద్రాణి! శాంతమే
భద్రాణి!
శాంతమే జయదుర్గి! శాంతమే నీకు!"
అనబెట్టితే గంగకు శాంతము
మూర్తియై నిలచ

## అగుమంచి గంగను దూరుట

తీరుని చెల్లెలు డిటమున తూరంగ
సాగెను:
"అమ్మరో! నీకింత దుక్కపడనేల:

44. ఇరు పార్శ్వము

కమ్మక పాలేట గంగరో
మాయన్నలకు
అంత్య కాలంబు చేరి ఆయ గాబోలు
వినవమ్మ గంగ యాదువులుకు
విలయేల్పువమ్మ!
ముందు మాయన్నలకు
ముథముతో నీవు
మిన్ను విరిగి వొచ్చి మీద పడకుండ
అరిచేత ఆనేమంటివి అమ్మరో! నీవు
వొచ్చేటి మిన్నును వెరచి గడగడ
వొణికి
మాయన్నలమీద విడిచి పెట్టితివోమ్మ!
పారిపోయి వొ స్తివా భాగిరిది గంగ?
నిద్రబోయి కలువురించినాను
యెన్నడు పరగ్రాణము యెరుగనేతల్లి!
వాటముగా చెరుకూరి వొద్ద
పోలురాజు
దిటముగా చెల్లిన దినములు నేటికి
అరువై యాండ్లకే అంత్యంబు
చెల్లెనా?
అరమరలేక నాతోను ఆడు వకమాట
నడిబూజన వున్న నాయన్నల బట్టి
యరగెర్ధపాట చెల్లించి వొ స్తివా?
నిన్ను వేడినందుకు(నిత్యముగ గంగ)
చిన్నబోయి వున్నావు సిద్ధంబుగాను
నన్నుగూడి పలుకవు
న్యాయమా నీకు?
ఘూరంగ యాగంగ ధుక్కపడిన
విధము

కారణము చెప్పేను కన్నవార
వినుడి!
మబ్బుగప్పినట్లు మీనాక్షి యుండంగ
పరావారు అన్నల మీద దయగలిగి
వుండేర?
గుడి విరిగి పడ్డట్లు కోమలి యుండగాను
పోలురాజు ఆవులుమంద
పోదొక్కకుండీర?
కన్నుల పాప సోకించి నందులకు
కన్నవారు ధనకొండ కాకి సోక
మయ్యాని
స్తంభములు గడగడా కదిలి
నందులకు
కుంభిణిలో ధనకొండ కూలకుండీన?
పెద్దపెద్ద భూషణాలు
వూగినందులకు
మెరుపడితో పాపమ్మ మేడ గాలీని!
మంటలో చెల్లెలు మడియ కుండీన?
యేరువమ్మ గెంధము
యర్ర నైనందుకు
పారేటి రక్తము పాలేరు నిండీని!
శాసలు విడిబడి చెదిరినందులకు
యీక్షెణమె ధనముకొండ అతమై
పొయ్యాని!
పువ్వుల తోమాలు భూమిపై
రాలినందులకు
ఆమినిగా శివపురికి అందరము రేపు
కలిగిని నమ్మరే! వో కన్నవార!

గుభ గుభమని గంగ గుభ్భుటిర్లి
నందులకు
గర్భ గ్రోహము కెదురుగాను......
శోభనాలు గుండాలు సోరలు
యేరుపడీని!
గానకొని పోతురాజు కూతలు
బెట్టినందులకు
ధనముకొంద పట్నము
దగ్గమయ్యాని!
పక్షులు కిలకిల పలికినందులకు
ఆశించిన ప్రజలెల్ల అడలకుండేరః"
బంధువులుతో చెప్పి భాగిరిథిని దూరి
"యిప్పుడు పలుకకుంటివైన
యీప్రొద్దు మాపిటికి
కర్పుర గంధియై నా శోభనమందు
వొచ్చి
వొప్పుగా మేలు వొనరంగ నిపుడు
చెప్పవే అన్నలు క్షేమంబు నీవు!"
అనుచు అగుమంచి అప్పుడిట్లనియె:
"నందుల సిరిదేవి! నాతల్లి వినవె!
పదరమ్మ పోదాము పట్నానికిపుడు"
భామలందరు వినిరి అగుమంచి
మాటలు:
"కలకంఠి అక్కన్న! గంగనేల
దూరేవు?
బాలరాజుల కందరికి పాలేట
మధ్యమున
కాలము తీరితే గంగ యేమి జేసు?
గట్టిగా వారికి కారణము యుండెను
యెంతవారికైన యీశ్వర మహిమ
దొంతులలో దాచిన దాగునటమ్మ?
అట్టి ఆ గంగను దూరతగదు
అగుమంచి".

## యాదవకాంతలు తిరిగి నగరకు వచ్చుట

అంతట నగరుకు వణితులు
నడిచిరి వేగ
తెగువతో గంగకు తెచ్చిన వొస్తువులు
బోనాలు కానుకలు పూజార్థకిచ్చిరి
వారు వీరు పల్లకీలు యెక్కిరి
వరుషతో నపుడు
మచ్చికతో స్తిరమందుల మగువల
బిలచిరి
హెచ్చైన వల్లవుల యింతుల బిలచిరి
ఆవేళ అగుమంచి అందరిని బంపె
అప్పుడు అగుమంచి అరుదెంచి వచ్చె
రంగుగా వజ్రాల కీసీట మందు
వనరంగా కూర్చుండిరి తాపంబు మీద
కెంబుల పుతకాలు తెప్పించి వేగ
మొక మార్జనము చేసి ముందర
నిలచిరి
బంగారు పళ్ళ్యమున
పాయసాన్నములు

సమ్మతిగా నొడ్డించిరి
సకియ లందరును
బంతులు కూర్చుండిన పణుతుల
కపుడు
సవిఖ్యంబుగా వారికి పణతు
లొడ్డించిరి
చెలవై బోంచేసిరి సవిఖ్యంబుగాను
అంతట అగుమంచికి అన్నము
కావుసుగాలాయ
డిగ్గునలేచి అగుమంచి ఆచ్చర్యపడెను:
"నాతల్లి వినవమ్మ: నందుల
సిరిదేవి!

యేదిక్కని తెలుసు కుందునమ్మ
వుత్తర కాశికి బోయ్ను వుత్తముడు
గురువు
రాకపోయినందుకు వొగుతునా నేను?
పావురాయిలు అన్నల పరిణామము
వార్తలు
తెలియనందుకు వొగుతునా నేను?
తలకొని అంత్యకాలము దగ్గిరాయ
నేమొ?
సారెసారెకు సెగునాలు పుట్టించనేల?
యేరీతి అయనో యేమి జేసేను?"

## యాదవకాంతలు అగుమంచిని ఓదార్చుట

యేడు తరాలు పెద్దలు యేరెమ్మ
యివుడు!
వెనకటి మన అయ్యలు యేరే
వున్నారు?
శ్రీకూర్మము యేనుగు నాధు కొండ
చెలగి బెజవాడ చేకొని కల్యాణము
చెలగి చెరుకూరు చేరి కాంత్యాలు
చెల్లిన అయ్యలేరే చేడె అగుమంచి?
వాలాయముగ బ్రెంహ్మ
వ్రాసి యుండంగ
కాలిమితో నిండి ధరమీద జనులకు
చావు పుట్టుకసరిగాను జేసెనో
బ్రెంహ్మ"

అచే అలుకదీర్చిరి అం..ణామణులు
వూరికే వుండమనిరి వుచితంబుగాను
గారవించిరి అగుమంచిని
కాంతలందరును
పంచ పదార్థములు గారవించి
బంగారుగిన్నెల దెచ్చిరి
ఆరగింపమనిరి అగుమంచి నపుడు
అరయంగ తల్లికి ఆలింగనము చేసి
భామలతోడు పాలకీలు యెక్కెను
కొమరమ్మనగురుకు గొబ్బున
తానొచ్చి
అంతట సూర్యుండు అస్తాద్రి కూకె

మలయుచు అక్కన్న
మందిరంబునను
పరిపించి యున్న జాజుల శయనము
మీద
స్థిరముగా అగుమంచి పవళించె
నపుడు

## గంగ అగుమంచికి కల చెప్పుట

అరధరాత్రి వేళ అరుదెంచె గంగ
సేసగిన్నె వకచాత చక్ర మొక చాత
పట్టుక వొచ్చెను గంగ
ధనకొండకూను
నారాయణను పేరు ననుదినము
బిలచేటి
యేరువమ్మ తేజీని యెక్కి తాకదిలె
నిరుతముగా ధనకొండకు నీరుజనేత్రి
ఘట్టిగా అగుమంచికి కలజెప్ప
వొచ్చెను
గంధ పట్టెలు మంచి కనకభోరు
తలుపు
కనక శూలము జూపెను గడియలు
దొలిగె
నప్పుడు శాయక చంద్రసేనలు
కరిగె
అగుమంచివున్న గద్దిపై దివ్వెలు
తప్పక మలిపెను దాన(వ) సంహారి
మచ్చికతో నపుడు మాధవుని
చెల్లెలకి
పచ్చని అక్షింతలు పైబడ జల్లి
అగుమంచి వద్ద నిలచి యా గంగ
తాటేకు మంటవలె తల్లిదరకొని
సాగ
అక్కరో యేమి జెప్పుదు నేను!
యేమందు నమ్మ!
అతివేగమున గంగ ఆడె నొక మాట
అప్పుడు యేరువమ్మ
అతిదుక్కమునను
చెప్పంగ సాగెను జెననాథు చెల్లెలకి:
"యేమి నిద్ర బొయ్యేవు అగుమంచి
నీవు
వామాక్షి! నీనిద్ర ఆపద తెరుగదు
నన్నేల దూరితివి నా మాట వినక
వరుషతో మీ అన్నలు వార్తలు
జెప్పేను వినుము!
శివునికి యెత్తిన శీతాకు దిబ్బెము
అఱరు సమురు బిందెను అగుమంచి
లేవె?
అమ్మవున్న ధనముకొండకు
ఆపద పుట్టెను
పాయక దివ్వెలు పాలేట మలిగెను
తప్పక అగుమంచి ధరమీద
కూలినందులకు

వొప్పుదప్పి సంగాన వొరిగెను లేవె!
అయిదు కొండలచుట్టు అశ్వాలు తిరిగి
నందులకు
వహిబడి సంగాన వొరిగెను లేవె
వరుసతో కొంగవాలు కత్తులు
వైషంబె యిపుడు
విరువైన బెబ్బులి బిరుదాంకములు
పట్టెతిరుమణి నొదుట వున్న
రూపు జూచి
గెట్టిగా సేనల కదనమున జంపి
అడ్డాపు గట్టుక ఆరుల చెలికిలోన
విడిబడె పెరుమాళ్లు వేగలేవమ్మా!
పాలేట యాదవులుకు
అమర వైకుంటము గలిగెను
అగుమంచి లేవె!
పంతమున మంగోలుపాటి
బైళ్ళ
పంతు మీరిన వీరభద్రులందరును
నెత్తురు వొరుదులై కడ్గంబు మెరళను
చెన్నుపాటి బయిళ్ళ సంపంగి
పూదండ
చెన్నుని మెడనుండి క్షణములో
దెగెను
ధరిణిపై వ్రాలెను తప్పక యిపుడు
అరయ నిద్రబోక అగుమంచి లేవె!
మత్తేభముల వారు మడిచి రందరును
జొత్తువలె రక్తంబు కురియంగసాగె
దిగులు లేక నీవు నిద్రబోకు
అగుమంచి

నిజవార్తలు నీవు అడుగుదువు
లేవమ్మ
మెండు సంగపుతోట గాతకుని
నరికితే
గాటముగ అందమైన కన్ని మొగిలి
వొరిగె
వాడిన పువ్వుల వాసన వనిత
అగుమంచి
కాశిలోకి బోయెను కడువేగ లేవమ్మ
ఆపద వార్తలు అడుగుదువు
అగుమంచి లేవె!
మాచెర్ల చెన్నుని మంటపము
ముందర
పాతిన వుక్కు స్తంభము పడెను
భూమ్మీద
చాలించు నీ నిద్ర సకియరో! లేవె
సాక్షికై పొన్నారు సంపతి వెలసీని
దీక్షగురుడు భావదేవుని చేతి
చక్రంబు తునియలై చేరె సంగాన
చక్రంబు నేల వొరిగె లేవమ్మ!
కమల గంధర్వుండు వొర[illegible]
[illegible]భుని
చేతిశూలంబు తునియలా[illegible]
సుంద[illegible] [illegible]వమ్మ!
మగువరో! పూడల మర్రి సంగాన
పగవారు నరికితే పడెను లేవమ్మ
తెగువుతో సంగాపు దేవుని ముందరి
మొగమంటపు విరిగె లేవమ్మ!

మదురాక్షి! బెజవాడ మల్లప్ప
ధరియించి వున్న
రుద్రాక్ష తావులాలు రూఢి దప్పె
లేవమ్మ!
ఆదినారాయుడు చేతి ఆలరు శెంఖంబు
పాదుకొని ధరమీద కూలె లేవమ్మ!
పన్నెండు గటాలు భద్ర సేనుండైన
దక్షిణ పాలేట
మెండుగా వారిగెను మేదిని మీద
నిండెను యిది మీకు నెలత లేవమ్మ!
వారధి వుప్పొంగి వనమెల్ల నిండి
యేరులై పారీని యెరగడ్డపాట
సారెకు నిద్రబోకు సకియరో లేవె!
సౌరిది యిప్పుడు మీర సూర్యుని
చుట్టు
వరదగుడి కట్టెను వనితరో లేవె!
కారుణము నిండెను కాంతరో లేవె!
కల్యాణపు లింగము కంఠ సోమప్ప
మూర్ఛ నిద్ర బొయ్యేవు ముదిత
అక్కన్న
కార్చిచ్చు పడి ధనకొండ కాలె
లేవమ్మ!
వెన్నముద్ద పెరుమాళ్ళు వెలయ
భూమిలోన
సన్నుతి కెక్కిన జగదేకమౌళి
కొంచక పంచలింగాల కొండ వద్ద
నుండి
అంచితంబుగా గాతలు అణిగె
లేవమ్మ!

కాశి విశ్వేశ్వరుని కొలువులో నుండి
వాసి మీరగ ధనకొండకు వచ్చెను
లేవె!
తేరులు రథములు తెగువతో పాలేట
(వీరుల బలములు) విరిగె లేవమ్మ
పంచ వన్నెల చిలుక వుండేటి
పైడికంబము మేడ
ధగ ధగ మంటలోన సమిసె
లేవమ్మ!
లంకాధిపతులైన రాజుల మీద
శంక లేక పోసిరి శరాసార గాను
బొంకక చెప్పేను పొలతి లేవమ్మ!
అయోధ్యా పతులెల్ల అబ్ధిలో
మునిగిరి
మీకు చెప్ప వొచ్చినాను గొబ్బున
లేవమ్మ!
శిరసున తలుగుల్లు శరీరమందు
నాటి
వొరగిరి లంకలో అగుమంచి నేడు
వనచెర్ల లంకలో వారిగిన వార్తలు
వినక వున్నావు నీవు వెలది
అగుమంచి!
గోపాల క్రిష్ణమ్మ యెత్తిన
కొండకింద నుండి
గోపాల్కులు ఆకొండ వెగిచెను లేవె
ఆవులు పెయ్యలు అల్లకల్లోలముగ
చెల్లెను
ఆపద పుట్టెను అయ్యయో
ధనముకొండకు

శిముడు పెట్టిన తోటలో
యమునివారు జొచ్చి
పువ్వులు కాయలు పుడమి తెగవై చిరి
యేనుగుతో సింహము యెదిరించి
పోరితే
అణస లేక వొ స్తిని అగుమంచి
లేవె!
చాలు చాలని వొ స్తిని వణిత
లేవమ్మ!
రెక్కలు తేజీలు రణములో మడిచీను
అక్కన్న! నిజవా ర్త అడుగుదువు
లేవె!
పరమేశ్వరుడు పండించిన పంట
కోరుపట్టిరి పాలేట గొబ్బున
లేవమ్మ!
పణస పండ్లు పాలేట పంచిరి
లేవమ్మ!
ధనముకొండ పలెను దక్షణాది
విధము
పంచలింగాల కొండ వద్ద నుండి
వొచ్చిరి లేవమ్మ!
కూచిగుంపు లాయ ధవముకొండ
వలసలు దీసె లేవమ్మ!
పూచిన జూరగ రీత్తి కరిగిర్ది పాలేట
విరివైన వృిక్షాలు భూమిపై వొరిగె
లేవమ్మ!

గరుటడు పాములకు కారాగె
లేవమ్మ!
తరువుకాళ్ళు వొచ్చిరి
ధనముకొండకును
కైలాస పైనాలు కదిగె లేవమ్మ!
జడిబెట్టి వరషము దశిమినాటి నుండి
విడువక కురిసేను వెలది అక్కన్న!
లింకాల కొండ చుట్టు నెరవళ్ళు బట్టి
గంగు రేగులు ముంచుకొనె గ్రక్కున
లేవమ్మ
సెలగోల పురదాళ్ళు శిమునికి
వొప్పగించి
పాలవళ్ళి గోత్రము పాలేట వొరిగె
లేవమ్మ!
పైడుత్ర బంజాలు పాలేట(గలిసి)
మాయమై పోయెను మగువ లేవమ్మ!
దివినుండి దేవతులు (దిగివచ్చి)
చూచి
భావించి రథములు బంపిరి లేవమ్మ!
పాడ్యాన తెల్లవాతి పయనములు
మీకు!"
అని యిట్లు వేరువమ్మ అగుమంచి
కిట్లు
కాని కల జెప్పి గంగ గ్రక్కున
కదిల.

## అగుమంచి తల్లి నగరుకు వెళ్ళుట

అంతట అగుమంచి త్రుళ్ళిపడి
మేల్కొని
దిగ్గున తా లేచి కడువేగ అగుమంచి

వణిత ధయర్నమునను[45] గుబగుబ
మని గుబ్బటిర్లగాను
తత్తరంబున లేచి తమకంబు మీద
తీతుకుని అగుమంచి గాదుల
గొబ్బున బిలచ:
"కలగంటి దాదులార! గ్రక్కున
మేలుకోరె!
వెలమితో దివ్వెలు యెలిగించరమ్మ"
చెగ్గు దిగ్గున లేచిరి దివ్వెలు కంబాన
వేగ్రాన (దాములు) వెలిగించి రంత
తప్పక వెలిగించిరి దాదులందరును
"దాదులార! వినరమ్మ తమకపు
కలగంటి
నిదుర లేపరమ్మ నెంత
కొమరమ్మను"
అమరంగ దాదులు అతివేగబోయి
కొమరమ్మను లేపి గొబ్బున వొచ్చిరి
తలచిక్కు బాపినట్లు తలవోసి
యపుడు
యెలమితో కదవార్త వెరుగంగజెప్పి
అప్పుడు బాయను అమ్మరో! వినవె
తప్పక యీశ్వరుడు దయదప్పె
గాబోలు
కొరగాని కలగని గొబ్బునబోయి
సిరిదేవికి కల జెప్పవలెననుచు
అమ్మవున్న నగురుకు
అంపవలననుచు
వెయివేళ యిటు కలగన్న యెరిగింప
నేర్చు
అవునన్న వీరగంగను
అడుగవలననుచు
'యేమివార్త జెప్పునో
యెరుగవలెగాని
అంపవే గ్రక్కున అక్కరో! నీవు'
అంపించిరి అగుమంచిని
అతివేగమునను
ధీమంతుని చెల్లెలు దీటి బట్టించుకొని
భామలు వొచ్చిరి బజార్లు బట్టి
పారిగంట తలార్లు పట్నముగాతురు
తలారి రామన్న తగువేట్కవొచ్చి
గన వేగమున సిరిదేవికి వొకవార్త
జెప్పెను
అయితన్న వొచ్చెను అమ్మ సిరిదేవి
'అయితన్న వొచ్చెనందేను అదిరిపడి
సిరిదేవి
దివ్వెలు ముట్టించిరి అతివేగమునను
ఆవేళ కొలువుదీరి అమ్మతానుండె
అయితన్నగాదు అగుమంచి రాగానె
కూతురు రాగాను చూచి కృప
నందుల సిరిదేవి
చింతించి కడుపులో దిగులుజొచ్చి
యుండె
రాజుల చెల్లెలు రమణి అగుమంచి
దాదులు కొలువు ద్వారంబు వెదలి

45. ధైర్యమునను

తగ రాజు చెల్లెలు తల్లి సముకమున
నైన నిలచ
పొగలుచు దుక్కాన బోవుచు
సిరిదేవి
తన కూతురిని జూచి ధైర్యంబు లేక
యెడలేని శోకమున యిట్లని పలికె:
"నాతిరో అక్కన్న! నా ముద్దుపట్టి
నీతిగాదు యీ వేళ నీకు రా తగునా?
రాజులేని వెనక నగరంబు వెడలి
రాజెల్లునటవమ్మ నా తల్లి నీకు?
మీయత్త కొమరమ్మ మేనవారనుచు
వియ్యమంది దివష మాయెనమ్మ!
యే ప్రొద్దు అడికలు యెవ్వరెవ్వరితోడ
పలవోత మాటలు తలపోయనమ్మ
కలవారి యిండ్లను కడుపేదవారు
తెలియక చుట్టెరకము తెగిశాయరాదు
పుట్టింట వున్నదని వారి వారితోడ
కష్టపడుతా నుండు కొంత
కొమరక్క
అలివిగా నీవును అర్ధరాత్రివేళ
లలితంబుగా నీకు నాతి రాదగునే?
యేమివార్తనైన యెంత లేదనక
అమితో జెప్పక కనుపించ
వొచ్చినా
అటుమీద యేమి మాటలాడినా జెల్లు
మేనవారనుచును మందిమేళము
కాయ
మనవంటి వారికి మరి నీతిగాదు!"

అమ్మాడు మాటలకు అగుమంచి
బలికె:
"నిమ్మళాన వొస్తినంటే నేరంబు
లెంచను
పుచ్చుకున్నవారి యిండ్ల
జొంచాయలేద?
యిచ్చిన వారియిండ్ల యిటువంటి వేళ
కన్నవారి యింటికి కదపంచనైన
అన్నము భోంచేతు
రమ్మనరో జనులు?
మాయమ్మ యింటిని మహలెస్సగాను
వైకుంఠ పైనాలు
వొచ్చియుండగాను
శ్రవణానందముగాను చెప్పవొచ్చితిని
నేను వొచ్చిన పనికి నేరము
లేదుతల్లి!
అత్తచాత అంపించుక
అమ్మ నీనగరికి
గ్రక్కున వొచ్చినా కలగని తల్లి!"
కలయన్న యప్పుడు కాంత సిరిదేవి
నెలపొడువున నుండి
నెర్వైర[46]పడుచు
వున్న యా తల్లితో నప్పుడిట్లనియె:
"నీనోటి వాక్యము నే
నడిగినదాన గాను
కాదేకు మంటలాయ తల్లిరో!
మనకు"
"వానకు పిడుగులు పడిందె నిజము

46. నివ్వెర

మానినా తమకపు మాటలే పిడుగులు
అబ్బరపు కూతురనుకుందు నిన్ను
గొబ్బున ముచ్చటపు కూతురువని నీవు
యెదు వంశముల వారికి విషవాక్కులే
ప్రొద్దు
కోరుచున్నావు కూతురా! నీవు
కలగన్న వార్తలు గ్రక్కున
తెల్పుమా!"
"అలాగే జెప్పేను అమ్మరో! నీకు
వివేక మెరిగిన వెలధ నీ కోడలును
అవులన్న వీరగంగను
[illegible]పించువమ్మ"
అగుమంచి మాటల[illegible]సిరిదేవి
మక్కువతో పిలచ[illegible] మర్లవారి
గంగను
"క్రమమున అగుమంచి కలగన్న
విధము
అమరంగ జెప్పవే అవులన్న
గంగ!"
ఆ మాటకు వీరగంగ ఆడెనొకమాట
"యేమి మాటలు జెప్పేను యలనాగ
యిప్పుడు
గారవించి ఆ కన్నకల జెప్పనేరను"
వీరగంగ మాటలు విని యపు
డిట్లనియె
"ఇందరు వుండీని యేమి వో
వీరగంగ
చెంద్రస్సు తెలిసిన దానవు నీవు
దేముడు అవులన్న దేవులు నీవు
దివ్యోగ్యానివి గనుక తెలుచును
నీకు
ముందు గురుతులు మోదముతో నీవు
కొదవ లేక జెప్పితివి గంగరో! నీవు
గాజు యిల్లు మునిగిన కారణము
చెప్పితివి
నిజవార్త ఆ మాట నిజమాయ
తనకు
పచ్చల కంటమాల తొళసి వనమాల
గుదికొ[illegible]డ్లు వొచ్చిరి
[illegible]కొండకూను
వె[illegible]యుంచు యిటు వెరిగి
వుండగాను
ఆడిగితిగాని మా కందరికి తెలుచునా?
కడు వేగ వున్నట్లు గంగరో
జెప్పవె"
సంతోష మాయనని సఖియ
వీరగంగ
అంతట కూర్చుండి అగుమంచి
సంగరాన
'అగుమంచి కలలు అందరు
వినవలెను'
అంతట కొమరక్కను యాదువ
సతుల
నీతిగా బిలపించె నెలత సిరిదేవి
వైనాన బంధువులు వొచ్చిరందరును

కొమరక్క సిరిదేవి కొలువు
దీరియుండిరి
రాముకుల గోత్రము రముణు
అందరును
కూర్మితో వారందరు కొలువై
యుండిరి

## అగుమంచి వదిన వీరగంగతో తన కల చెప్పుట- వీరగంగ కల విప్పి యాదవ వీరుల మరణమును తెలుపుట

అతివేగమున వీరగంగ అగుమంచిని
బిలచి
అగుమంచిని బిలచి అతివయిట్లనియె
'యేమి కల గంటివి యింతి
అగుమంచి
గంగ మాటలు విని అగుమంచి కల
చెప్పసాగె

**అగుమంచి :**

"అమరంగ మనయింటి ఆదిలక్ష్మి
గంగ
క్షేమంబు చెప్పెను చెప్పెద విను
శీతాళ దిబ్బెము సమురు చిందెనని
చెప్పెను
నే గన్న కలలు నెత్తురువాన
కురిసినట్లుండె
యీ కన్న కలలు యెటువలె
యున్నదో
పలుకువే వీరగంగ! బంధువులు
వినగాను"

**వీరగంగ :**

"వినరమ్మ మీరంత యివరంబుగాను
శీతాలు దిబ్బెము సమురు
చిందినందులకు
భూతలంబుగ ధనకొండ పుణ్యంబు
నేటితో
శ్రీమహాలక్ష్మి తొలిగెను స్థిరముగా
అక్కన్న!
వామాక్షి! నెత్తురు వాన కురిసి
నందులకు
నదురు బాలభీములు తడిసేరు నిండి
రక్తమున"

**అగుమంచి :**

"యీ రెండు కలలు యీలాగు
నుండె
యిక నొక్క కలగంటి వింతి
వీరగంగ!
భీకరముగా అయిదు కొండలు
పెళ్ళగిలెనమ్మ

వుదయగిరి తూర్పున వొరగ
కలగంటి నమ్మ
అధిగొని తేజీలు ఆ కొండ చుట్టు
మడియ కలగంటి మల్లవారి గంగ

వీరగంగ :

"పై వొచ్చు రిపుల బారులుగా నరికి
చల్లవారు అక్కడ సమయ కుండేర
జిల్లుల తేజీలు సమిసి నందులకు
వారిని గొలిచిన పరివారమంత
పోరాడగ బల్యపోట్లు నాటి
సాగల కొండను సమసి వుండేర?"

అగుమంచి :

"ఇక నొక్క కలగంటి యిందీవరాక్షి!
ఆవల మంధలు రు త్తలై అమ్మరో!
నేడు
యీవలున్న నల్లకొండ యిరుగల
తగులపడి
యేనుగు పొడుగు పీనుగులై
అగ్నిలో మడిసెను
గాదంగి మాకులు భూమిపై వొరగ
కలగంటినమ్మ!
యీ కన్న కలయెవరికి బడును
యెరిగించవమ్మ?"

వీరగంగ :

"నల్లకొండ ఛోలును, నాతిరో! వినవె
నల్లవారి గోసంగులు సమయ
కలగంటివమ్మ!

అగుమంచి :

"మరివొక కలగంటి మగువ
వీరగంగ!
చెరుకూరి చిలకలమర్రి చెరువను
అడ్డాపు కట్టెను అరుట్ల చెలికెలోను
విడిబడి పెరుమాళ్లు పోగ కలగంటి
నమ్మ!
యీరగంగా! యీకల వివరించ
వమ్మ!"

వీరగంగ :

"వీరనారసింహ్మడు విడిపడి పోయి
చెదరించి పగతుల చేరి తునియలు
కాయనున్నాడు
కరుణతో బొల్యావు కనకరథమెక్కి
బొందితో కైలాసంపోను కలగంటి
వమ్మ!"

అగుమంచి :

పన్నుగా మంగోలుపాటి బైళ్ళ
వీరభద్రుని కరువాలము విరుగ
కలగంటినమ్మ!
యీ కన్న కలలు యెవరికి పడు
నమ్మ?"

వీరగంగ :

"కరువాలము విరిగినందుకు
కాంతరో! వినవె
గాత జేసి శానల తెగువుతో జంపి
బీరినాయుడు రణములో అతము
గాటోలు
రాలిన పువ్వులైతే రణము లోపులను
వానికి యెదురొమ్మున ప్రాణాలు
నాటిని
సక్కని గోసంగులు సమిశ బీరన్న"

అగుమంచి :

"గంగరో! యిక నొక్క కల
వినరమ్మ!
సంగాపుతోటంత సక్కగా నరికితే
కన్నె మొగిలు పువ్వులు రెండు
కైవారెనమ్మ!
వన్నెగల పువ్వుల వాసన కాశిలోన
యీశ్వరుడు ధరియించేటి వీబూథి
లోన
యీశ్వరూపులు బోయివుండ కలగంటి
పూలు రాలింది యేమో! పూసిండ్డి
యేమో!
ఆవులన్న వీరగంగ అటు
విన్నవించు"

వీరగంగ :

"ఆవులన్న చెల్లెలు! అగుమంచి!
వినవమ్మ
కన్నె మొగిలి పువులయితే
కంఠమాలికె బాలలు
సంగాపు తోటలోన రంగుగా
యుద్ధంబుజేసి
ధనముకొండ రాజులు దక్షవాది
భూముల్లో
ముష్కరయ్య పోచయ్య మునపుగా
చెల్లిరి
కాశీకి పోయిన భర్తుడికి పొడగట్టి
కాశితీర్థము వొచ్చీని అగుమంచి నీకు
పూత్రిగల బాలలు ముందుగా
చెల్లితేను
చేటువొచ్చి ధనకొండ చెడను
కలగంటివమ్మ!"

అగుమంచి :

యిటు వినుము వీరగంగ! యిక
నొక్క కల జెప్పేను
చెన్నుని మంటపము ముందర వేసిన
గజ స్తంభము
యిరగ కలగంటి యేలనాగ! వినవె
కాకొర్ల తెలుగురాయుని
కంఠమాలలు తెగి
చేకొని రక్తాన చిక్క కలగంటి
యీకల జెప్పవే వీరగంగ! నీవు"

వీరగంగ :

"వల్లభుని కంఠమాలికె, వక వార్త
వినుము,

ఇల్లిదుడు కరియావుల
పట్టాభిరు[ద]డు
తరిమి పగవారిని తలలు కండించి
గురుతుగా పోట్లునాటి వొరిగినాడమ్మ!
కరియావుల మీయన్న కల్లగా చెల్ల
కలగంటివమ్మ!"

అగుమంచి :

"వీరగంగ! నేనాక యింత
కలగంటి
పొన్నూరి బాచయ్య భుజమున
చెక్రంబు
వేటారు తునియలుగా విరగ కలగంటి
నమ్మ!
చలమున [ప]విశాలు సమయ కలగంటి
నమ్మ!
వీరగంగా! యీకల యెవరికి పడును
యెరిగింపవమ్మ!"

వీరగంగ :

"చెలువమైన [ప]విశాలు ధారుణి
చక్రంబు
సరవితో విరిగినే చందంబు వినుడు!
కటారు మన్నీల కల్లుగా జంపి
భట్టావుల రాజుకు బల్యాలు నాటి
అక్కరో! పాలేట అతము గాటోలు
భట్టావుల మీయన్న పాలేట చెల్లితే
పోయి కూతలు జేసి పగవారు మనకు
పగవారు మనకు పొడవ
కలగంటివమ్మ!"

అగుమంచి :

"యెక్కువ కలగంటి వో వీరగంగ!
వినవె
చేకొని వోరుగంటి శెంబుని
కంచుకంబము
యేడు తునియలుగాను విరగ
కలగంటి
సక ..గా జెప్పవే సకియ వీరగంగ?"

వీరగంగ :

"వోరుగంటి శెంబుని వరస
సం[బ]మైతే
పరగ ధనముకొండ పట్టభ[దు]ండు
మహిలోన అయితన్న
మాధవు డిపుడు
ధరలోన దక్షణాది రాజుల జంపి
యెదురొమ్ము గాయాలు యీపున
వెడలి
చెదరక అయితన్న చెల్లెనోయమ్మ!
మరచి అయితన్న మహిమీద చెల్లితే
మనకు కైలాసపైనాలు కలుగ
కలకంటివమ్మ!"
వీరగంగ చెప్పిన విధమెల్ల తెలిసి
నవనందు చెల్లెలు నవ్వి యిట్లనియె:
"వోగంగ! నా [ప్రా]ణవల్లభుని
వార్తలు
తెగువతో వాస్తేను తా జేసిన
పుణ్యంబు
బొందితో వైకుంటము
పుణ్యకాంతలును

యిక నొక్క కలగంటి వీరగంగ
వినవె
వో వొదినా! వీరగంగా! వున్నట్లు
చెప్పవే!
బెజవాడ మల్లప్ప మెడనున్న
రుద్రాక్షలు
చేరులు తెగి రక్తాన తేల కలగంటి
నిజముగా యీకల
నిర్ణయించవమ్మా''
అక్కన్న మాటలకు అవులన్న గంగ
గ్రక్కున యీ కల కని జెప్పెనంత!
''బెజవాడ మల్లప్ప రుద్రాక్ష
చేరులు
తెగి వ్రాలినందుకు తేలి రక్తాన
కొయ్యని రిపులను ఖండించి నరికి
పెయ్యల యర్రయ్య పృథివిపై నేడు
కదనంబు రిపులను కల్లుగా జంపి
వురువున శెరములు నాటి
వారిగె నో యమ్మ!''

## అగుమంచి:

''యీరీతి మున్నుగా యువతులు గంగ!
యరణయ్య పొలేట చెల్లినట్లయితే
మందబోటు పోకుండిన
మర్లవాడి గంగ?''

## వీరగంగ:

''నంధుని వంశమెల్ల రణవీథిలోన
మందకంపటీలు మడియ
కలగంటివమ్మ!''

## అగుమంచి:

''యిక నొక్క కలగంటి వీరగంగ!
వినవె
చిత్తజగురుని చేతి శంఖంబు
మూడు కుప్పలై నిలచ
ముత్యపు చిప్పవలె రక్తాన మునగ
కలగంటి''

## వీరగంగ:

''చెప్పేను యీ కల చేపట్టి వినుము
చేకొని చిత్తజగురుని శంకంబు
వొప్పలై రక్తములో
వొరిగినందులకు
చట్టువారి యర్రయ్యకు పడును
యీ కల
భీమ బలశాలి పట్టపు యేనుగుల
నరికి
శ్రీమంతునికి యెదురొమ్మున
శెరములు నాటి
చట్టువారి యర్రయ్య సమయ
కలగంటివమ్మ''
గట్టిగా వీరగంగ కల చెప్పినందుకు
మాధవుని చెల్లెలు మరియు
నిట్లనియె:
''మృగశాక్షి వీరగంగ! మనుధులవార

కలవారమని నేను కడ్డ
పొంచుందుము
సలపట్టి యేరువమ్మ సంతోషము
నేటితోను
వుడగజేశ నేటితోను వో వీరగంగ!
మేడలు పన్నెండు మెరశి పాలేట
పీనుగలు బొందెలు బోరుకొండ
వలెను
యోగుల చందాన యొక కలగంటి
వొదినా వీరగంగా! యీ వార్త
యిట్లుండె"

## వీరగంగ:

"విరివైన మేడలు విరిగి నందులకు
కాపుతో పోరాడి రక్తంబు కాల్వలై
పారినందులకు
బసువన్న యెద్దులు పాలేటి వెంట
వాసిగా చెల్లేరు వో అక్కన్న!
వినవె"
వొందన మెరిగి వర్ణించి నందుకు
మాధవుని చెల్లెలు మరియు
నిట్లనియె:
"యేమిసేతును వీరగంగ! యెద్దులు
చెల్లితేను
రాఘుకులగోత్రము వొడియల
పాలాయెనమ్మ!
యికనొక్క కలగంటి వోయమ్మ!
వినవె
బలమైన కల్యాణము బసువన్న
కిరీటము
నడిమికి రెండుగా నరికిన
విధమాయ
వొడిదప్పి రక్తములో వొరుగ
కలగంటినమ్మ!
యీ కల యెవ్వరికి బడునో
యెరిగింపు వీరగంగ!"

## వీరగంగ:

"నెలకొని యీ కల నిలకడగాను
చెప్పేను అక్కన్న! చేకొని
వినవమ్మ!
వైనకాంత సోముని వొజ్ర కిరీటము
విరిగి రక్తములోన మునిగి
నందులకు
సరసి సహోదర పాలు కలిగిన రాజు
పశుపతి పట్టభద్రుండు
బవ్వె[47]చారిత్రుండు
కుసుమ శార్దిండు గోకుల
పోషకుండు
వాసికెక్కిన మంత్రి వల్లవుల
గోత్రుండు
దక్షణాది రాజుల తలలు కండించి
వక్షమున పగవారి వొజ్రాలు నాటి
వొజ్రాల తమ్ముకొన
వొరిగె నోయమ్మ!
నిజవార్త రేపు వొచ్చునోయమ్మ!"

---

47. భవ్య

మచ్చికతో వీరగంగ మాటలు
వినియు
అవులన్న చెల్లెలు
'అర అరా'[48]యనుచు
"రవితేజవారు రాజశేకరుండు
మాయన్న అవులన్న దేనువలకు
రక్షకుండు
చెల్లిన వార్తలు నిజమైతే
అమరపురినుండి
దివ్వె రథములు బంపేరు
దేవతులపుడు
పంచలింగాల కొండమీద ప్రత్యేక్ష
మైవుందురూ
అంచితముగ కైలాసము అందరికి
మోక్షము
పొంకముగా శివపురికి పొందుగా
మనకు
శంకలేక ధనకొండ చిచ్చుల పాలౌను
చందనగంధ లందరు
సమయకుందేర?
కందువతో యిక నొక్క కల
జెప్పేను వినుమా!
నాథొండ్ల నిలయుడు నవరత్న
కంటసరి
పాదుకొని లోకాన మునగ
కలగంటినమ్మా!
వీరగంగ నీవు యీకల వివరించ
వమ్మ!"

వీరగంగ :

"వుర్వీశుని చెల్లెలా! వినవమ్మ
యీ కల వృత్తాంతము
వింటికి అర్జునుండు విప్పర్ల
సింహ్మము
కంటక త్రిరిపులను కల్లుగా జంపి
బలిమనికి యెదురొమ్ము గాయాలు
నాటి
పద్మనాయుడు అవనిపై నొరిగే
యిటువల నున్నది అగుమంచి
యిపుడు"

అగుమంచి :

రాఘవుడు పృథివిపై నొరిగితే
సదయుడై దనకొండ
సొర్గలోకమునకు
బుధవారము నాడు పోవల మనము
వినవమ్మ వీరగంగా! యిక నొక్క
కల జెప్పేను
వనజనాభుని మైనున్న సొమ్ములెల్ల
ఘాతమీరగ కలగంటినమ్మ!"

వీరగంగ :

మునుకుని యీ కల ముచ్చట వినుము
భావించి యీ కల భద్రసేనుండైన
రవితేజ పల్లికొండ రగుపతికి పడును
చెరుకూరివద్ద అంటిన గాయాలు
బాలరాజు లంత పాలేట చెల్లితేను

---

48. 'హరహరా'

కాలము చేరువై గాయాలు పడ
కుండినా?''

అగుమంచి :

''గరిమితో యింక నొక్క కల
వినవమ్మ
సూర్యుని చుట్టు వరదగుడి కట్ట
కలగంటినమ్మ''

వీరగంగ :

''పగవారు అవలమందలు పోనియ్యక
చుట్టుకుని
కదలక పొడిచేటి కలగంటివమ్మ!''

అగుమంచి :

''యిక నొక్క కలగంటి యలనాగ!
నేను
రామభద్రుడు యెక్కేటి రత్నాల
శింహాసనము*
వాలాయముగా రక్తాన వరగ
కలగంటినమ్మ!''

వీరగంగ :

''రత్నాల శింహాసనము రక్తాన
మునిగితేను
తెగువుతో కాటమరాజు యెక్కేటి
దేవేంద్ర తమకము

పగవారు నరికితే భూమిపై వరగక
వుండినా?
పోటుదప్పి ధనముకొండ
పాడుగాకుండినా?''

అగుమంచి :

''గట్టిగా యీకల గంగరో వినుమా''
.........................

వీరగంగ :

''లంకాధిపతులైన నెల్లూరి రాజులకు
బడును
చెల్లుగా నరికియు శిరములు కండించి
వొలురాజు మనములు[49] వరగ
కుండిర?''

అగుమంచి :

''గంగరో యిక నొక్క
కలగంటి నమ్మా!
తల్లడిల్లుచు నల్లచెరువు తూములు
విరిగి
మునుకొని ధనముకొండ ముంచ
కలగంటినమ్మా!''
రక్షకుడు అవులన్నరాజు వీరగంగా!
యెటువలె వున్నదో యెరిగింప
వమ్మ?''

---

* సింహాసనము. 49. మనుమలు.

వీరగంగ :

''పగవారి చాత పశుపతి చెల్లితేను
పున్యపు నీరాడ పొందుగా మనకు
నెలతరో పున్యాపు నీరాడినపుడే
మలయుచు ధనకొండ మంటలై
మండీని
పున్యాపు వైకుంట పైనాలు రేవు
కలిగిని వోయమ్మా! గ్రక్కున''
ననిన

కాని కలలాయ గంగరో! వినుము
పాయక మా యన్నల పట్టి
యమునివారు
వాడిన విశాలు వృత్తమైతే
ప్రాణాలు విడువన (భగ్గున)
మండెను
కాశి దోవలు యెదురుచూడ కలగంటి
యిదియేమి గంగా! (యెరిగింప
వమ్మ?)''

ఆగుమంచి :

''యిక నొక్క కలగంటి వీరగంగ
వినుమ
కనక మేడలు కాలి కంబములు
విరిగె''

వీరగంగ :

''కట కటా పాపమ్మ కనకమేడ కాలి
మంటలో చెల్లెలు మడియ కుండీనా?''
చెల్లెలు అంటేను శిరసు వొంచి
అగుమంచి
కొలుకుల కన్నీరు గొబ్బున
[illegible] ధుమికెను
''మమ్మా[illegible] చెల్లెలు మేడపై నుండి
యిమ్ముకుని-అగ్నిలో యేలాగు
సమిసినో!
యిందరము రథమెక్కి యింద్ర
లోకానకు
తాగన్నా కలలు చెల్లెలికి
తార్కాణ మాయె

వీరగంగ :

''వాడిన విశాలు వార్తలు వినుమా!
అయితన్న వేయించిన ఆరిటి
వనమైతే
స్తిరమందులకు పడును తెలుసు
అక్కన్నా!
నరపతులు నెల్లూరి రాజులు
యమునివారు
వారు వీరు పోట్లాడి (వరగకుండేర?
శ్రీవీర కల్లుగా చెల్లకుండేదా?''

అగుమంచి :

''యీ వార్త నిజమైతే యరగెడ్డపాట
నుండి
ఆవులమంద పరిణామ మందకుండీన?
శ్రీహరి సతాశిముడు వొచ్చినంతులకు
వనరాశి పోయిన వొల్లవుల గురువు
చనిపోయిన వారి మనివున్న వారికి

దినమెరిగి (శివగురువు) తీర్థము
గొంచు
సందివేళకు ధనకొండ చేరినా
యేచోట నున్నారో యెరుగము
మనము
కడసారి కలవిను గంగరో! నీవు
దొడ్డి వెళ్ళి బసవన్న తురుతు వార్తలు
గొంచుక
శంకరు డిక్కడికి జయవార్త
గొంచుక
రంకెలు వేయుచురాను
కలగంటినమ్మ!

యీ కల జెప్పవే వీరగంగ నీవు॰"

వీరగంగ :

"కలియుగమున మన మాటలు
కథలై ముందర
నిలువ గలిగే విధి నేడు యీ
కలలకు
ఆవులమంద పరిణామము అందరు
చెల్లినా
దేవదేవుడిక్కడ తెల్లవారి వొచ్చీని"

శ్రీశ్రీశ్రీశ్రీశ్రీ జయము మంగళాది జయము సంపన్నజయం జయం జయం గలుగవలెను. యవ్వరు సదివినా యెవ్వరు విన్నా వేఁదం శాయక తప్పులు వొప్పులు దిద్దుకుని గనత పొందించ వలెను. తెలిసిన వారికి యేమీలేదు. తెలియనివారికి యింకా అనేకం వున్నది. యీలాగున వుండును కాబట్టి విష్ణు వీశ్వేశుడు పాదమాన.

తోడేటి పాపయ్య కొమారుడు పొట్టెయ్య వ్రాసిన అగుమంచి కథ సంపూర్ణం. ౧౮౯౦ సంవ్మత్సరం నందన సంవ్మత్సరం ఆవణి నెల ౩తేదీలు. యెవ్వర్లు ధాచుకోరాదు. సదువుకుని పెడకంటి పల్యె గ్రామంలో వుండే తోడేటి యిద్యెవొన్తుల్కు[50] యివ్వవలెను. అట్లా యివ్వక పోతే పుస్తకములో వ్రాతంతా యెలాగా వున్నది, కడన యట్లావున్నది అలాగు ఆవును గాక, తెలిసినోర్కి విశేషం వ్రాయలేదు. యింతే, దన్నములు.........

50. విద్యావంతులకు.

# భక్తిరన్న కథ

## ప్రార్థన

శ్రీకంఠు మదిలోన జెలగ ప్రార్థించి
చేకొని శ్రీహరి చిత్తమున నెన్ని
పంకజగర్భుని ప్రణమిల్లి మ్రొక్కి
పొంకమౌ శారదను బుద్ధిని దలచి
అతులిత కవిరాజు లందర దలచి
మతియందు రేణుక మాతకు మ్రొక్కి
యేకదంతుని మది నే కొనియాడి

మాకు భాగ్యము లివ్వ మహి నెలకొన్న
గరిమితో ధనకొండ గంగను వేడి
హరిహరాదుల కృప యాదవ కథను
జగమెల్ల నెరుగగ జనములు మెచ్చ
శ్రీగిరి మల్లప్ప సేవ తత్పరుడు
భక్తుడు గిరిని తా పట్టిన వ్రతము
సత్యంబు జెప్పెద జనులార! వినుడు

## భక్తిరన్న శ్రీశైల పర్వతముపై జపము చేయుట

చుక్కల నగమున్న సూర్యుల మఠము
యెక్కువౌ పర్వతం బేలేశ్వరమును
కాముని గుండంబు ఘనలింగ వీడు
హేమాద్రి నడుమను
యింద్రకీలాద్రి
శిరేశ్వరంబును చెలగ మహానంది
అధికేశ్వరము పురహరునికి యిరవు
భూతేములకు వైరి బొబ్బ వీరన్న
పాతాళ గంగ యాభ్రమరాంబ
మఠము
గంగలోపల నున్న ఘనమైన కొండ
భృంగి నటన కుండు పుట్టలో
యిరవు

చేత హరిణపిల్ల శిరసున గంగ
మతిశిలానందుల మఠము పడమటను
మరివేగ సారంగ మఠమున నుండి
గిరిభేద వినుతుండు గిరిశ స్వరూపి
వృదురాజ శేఖరుడు
వురగభూషణుడు
విడువక కొండ తా విల్లు గలవాడు
ప్రమథ రక్షకుండు బసవతురగుండు
అమిత విక్రమశాలి అంగజ వైరి
హస్తమున విరించి నణచిన స్వామి
వస్త్రము పులితోలు పల్లెవాటుగను
కరిచర్మ పచ్చడం గప్పిన భోగి
మరి యావుపాలను మరిగిన యిట్టి

కైలాస మేలిన కర కంఠమూర్తి
తెల్లని విభూతి దేహము పూసి
మల్లప్ప వరమున మరి బుట్టినట్టి

వల్లవులకు గురువు వనరంగ జపము
చేయగ మున్నుతా చెల్లినవారు
వో యని జపమున నొగి గనబడిరి

## తరమునాటి పెద్దలు తమకు గయలో పిండప్రదానము చేయుమని భక్తిరన్నను కోరుట

అయిదు రణముల చెల్లిన అయ్యలు వచ్చి
జేయని భక్తుని చెంగట నిలచి
'హర హర రక్షింపు' మని పల్కిరంత
తరము పెద్దలు తన తాత తండ్రులును
ఆయనతో బల్కిరమ్మ పూర్వులును:
'గయ నన్నమును బెట్టి గంగను గలిపి

భక్తిడి మము ముక్తి బొందించు మికను
భక్త వత్సలుడవు భక్తిరయ్య నీవు'
నియమమున జపములో నిష్ఠలు జూప
కనక శూలము బెణికె కప్పెర చెదరె
దక్షిణమున మెరసె ధర గుబ్బటిల్లె
శిష్యులు భీతిల్లి జపము చాలించిరి

## భక్తిరన్న కాశియాత్రకు పోదలచి ధనకొండకు వచ్చుట

కాలహేష్యము దెలిసి కరకంఠ నుతుడు
నిలిచిన పెద్దల నిష్ఠలు జూచి
పలికెను భక్తుడు ప్రమథుల తోను:
'కాశికి పోదాము ఘనులార రండు'
చేసెను పైనము శిష్యుల నపుడు
తన తోటివారికి తానున్న మఠము
ఘనవేగ నొప్పించె కదలె ధనకొండ
మహిలోన అయితన్న మనుజేంద్రుడుండు

పెయ్యల తిప్ప ప్రవేశింపగాను
పర్వతమున నుండు భక్తుని రాక
వరుసతో ధనకొండ వారెల్ల వినియు
కొమరక్క సిరిదేవి గోత్రజు లెల్ల
తమరు విచారము తలపోయ సాగిరి:
'మఠము విడచి యిటకు మాయయ్య వొస్తె
కట కటా కష్టము గాకుండున యిక
దేవపూజను యిట్లు దిగనాడి రాగ
భావింప ధనకొండ పలు కష్టమౌను

యతివరు డిటువలె యే వార్త లేక
సతి వర్ధితుడు పూజ చాలించి రాడు
తొల్లింటి వార్తలు తోచక యుంచె
పల్లె జడలధారి పట్టము రాడు'
యిటువలె సిరిదేవి వెత దలపోయ
మఠప్రస్తు లటు వచ్చి మరి
శంఖుపట్టిరి
నగరి కేతెంచగ నాతి సిరిదేవి
'తెగువతో మీరెల్ల దేశికు నెదుట
వుండుట సరిగాదు వుచితముగాదు
పొం'డని దెల్పెను పొలతుల కెల్ల
దేశయాత్రికు డపుడు దేవు పూజించి
శోంచేసి కాశికి పోవలె ననుచు
శిష్యులు గొల్చిరా శివభక్తు డంత
పసిడి బొగడ దూది పావడాల్
[illegible] దొత్తిగి
వల్లు విభూతితో యోగవాగాలతో
తల్లివుండిన యింటికి తా వచ్చి నిలచె
దేశికు డటకు నేతెంచుట గాంచి
వాశిగా నర్ఘ్యము పాద్యము దెచ్చి
పాద ప్రక్షాళన పణతి తా జేయ
నాదించె సంకును నతిముదమునను
నుదుట్లను తల్లికి నానరంగ సతికి
ముదముతో ఆత్తకు భూతిని బెట్టె
పందుషుల యరణప్పను పరగంగ
బిలిచె

ముందుగా పలికొండ మ్రొక్కి
పెద్దలును
అన్నలు తమ్ములు అయితన్న
మొదలు
పన్నగ భక్తునికి వందనము జేయ
పురహరనుతుడు దా
పులిచర్మమునను
ఆరూఢి గూర్చుండి అందర నపుడు
కూర్చుండుడని ఆజ్ఞ గురువు తా నిచ్చె
కూర్చుండి అందరు గురువును జూచి
శ్రీశైలమున నున్న క్షేమము లడుగ
పశుపతి వినుతుండు పరగంగ దెలిపి
అత్తను తల్లిని అతివను జూచి
భక్తుడు యిట్లనె పణతలతో:
'నారీరమణులార! నా వార్త వినుడు
వారణాసికి పోయి వచ్చెద నేను
వుడురాజముఖులార! యోగములోను
అడిగి రన్నయు నన్ను అయ్యలు
తాము
అక్కడ నుండి నే నరుగక వచ్చి
యిక్కడ నృత్తాంతమెల్లను దెలుప
నీవున్న నగరికి నే వచ్చినాను
దీవించి పంపవే తిరముగ నన్ను'
అమ్మను కాశికి అరుగంగ నడుగ
క్రమ్ముక సిరిదేవి కాంత మేనత్త
అందరు తెలబోవ అమ్మ యిట్లనియె:

## సిరిదేవి భక్తిరన్నను కాశికి పోవలదనుట

'పొందుగ కాశికి పోయెదనంటే
గుండె యవిసె మరి గుబులుగానుండె
వుండుము కాశిపోవొద్దు నా కొడుక!
వారణాసికి పోయి వచ్చెద నంటె
నోరాడ దిక మాట నుడువను నాకు
నా యయ్య! నీ శంఖునాదము విన్న
వోయని యీ పురి వుప్పొంగె నిపుడు
నీ విటుముందర నిలిచినందులకు
దివినుండి శివుడు తా దిగినటులుండె
అరిగెద కాశికి అంటివి కొడుక!
పరువడి దుఃఖము పట్టగ లేను
భాగ్యభోగ్యములను పట్టము విడిచి
యోగుల గండి పో నుదుటను గలద
మమ్ముల విడనాడి మఠమును విడచి
యిమ్ముల కాశికి యేగంగ నేల?
నీకు యెందుకు కాశి నీలకంఠుండ?
మాకు బుద్ధులు చెప్పి మావద్ద నిలువు
గయవద్దు కాశి ప్రయాగ పోవలదు
మా యయ్య పెయ్యలతిప్ప మఠమున
నుండు'

## భక్తిరన్న తల్లిని కవిలెలు తెమ్మనుట

కడుప్రేమ నిటువలె కన్నతల్లి యన
వడ లింగమూర్తి తా నవ్వి
యిట్లనియె:
'రాజ్యభోగము జూచి రాణువ జూచి
తేజముగల మంద ధేనువుల జూచి
నిశ్చయముగ నిట్లు నీకెట్లు దోచె
మోక్షము నొందేటి ముందెరుగవుగ
యిరువంశములవారి కిహపరములును
గరిమతో నావల్ల కలుగంగ వలెను
మమ్ము పోవలదన్న మాటేమి తల్లి!
అమ్మ నా జనకుడు హతమైన వార్త
కనివుంటి యికనేను కాశికి పోయి
మునుపటి వారికి మోక్ష మందించి
వెనుకటి వారికి వేగమే నేను
తీర్థము యిచటకు తెచ్చెదను తల్లి!
వార్తలు మారాడ వలదు మాయమ్మ!
కవిలెలు తెప్పించు కన్నతల్లి నీవు'
కొమరుని మాటకు కృప నొంది తల్లి
'పల్లికొండ నడుగు పరువడి కవిలె'
తల్లి పలికిన విని తపసి తానపుడు
పల్లికొండను జూచి పలికె తానిట్లు:
'దివ్యదృష్టి నెరుంగు
దేవతామూర్తి!
భవ్యుడ హరిగురువ! పల్లికొండయ్య!
మనసున నెరిగిన మహనీయమూర్తి!
చనిపోయిన వారి చావని వారి

ప్రతికించ భక్తియిద ప్రమథుడ నీవు
కవిలెలు దెప్పించు కనిపోదు కాశి'
శివభక్తు డడిగిన చెచ్చెర ననియె:
'రహస్యమౌ మాట రసభంగ మౌను
బయలు పుచ్చగ రాదు భక్తిరయ్య
యిపుడు'
పందుముల రఘుపతి పలికి
నందులకు
నందుల కుల గురువు నవ్వి
యిట్లనియె:
'కందర్ప గురు భక్త! గాంభీర్య
శాలి!
అందరు విన్నది అది లెస్స గనుక
వినియుంటె మంచిదివినుము వో బావ!
కవిలెలు దె' మ్మనె
కరకంఠసుతుడు
శివగురువు మాటకు చెచ్చెర కవిలె
హరిగురువు భక్తుని కందిచ్చె కవిలె
కవిలె లందుక జూచి కరకంఠసుకుడు

## భక్తిరన్న కవిలెలు చూచి ఏష్యము చెప్పుట

'పూర్వపు చిత్రభాను వోయి
యీవరకు
యిర్వగ యేబదెన్మిదేండ్లర్ధ మాయె
శ్రీకూర్మ మందున సింహాద్రిరాజు
చేకొని కళ్యాణము చెలగి పెద్దయ్య
యేనుగనాథు గిరిని యర్ధనూకరాజు
పూనిక నలనూక భూపుడు బెజవాడ
చెరుకూర పోలాజు చెల్లిరి వెనుక
చిత్రభానాబ్దము చేటు యాదవులకు
తెలిసి కాశిబోయె దినమున నుండి
నెలలు పద్దెనిమిది నిండుగా నుండె
గురుతుగ మాఘ'మని
గురులింగమూర్తి
సరవితో నందర సముఖము నందు

## పాపనూకను దయతో చూడుడని భక్తిరన్న బంధువులకు చెప్పుట

'వో బావ! పలికొండ! వో కొమరక్క!
నాబుద్ధి వినరమ్మ నా తల్లులార!
తమ్ముడ అయితన్న! దయ వుంచ
వోయి!
నమ్మించి తెచ్చిన నాతి యిటనుండె
పాపనూక వుండెను బాంధవులార!
కాపాడుచుండుడు కన్నతల్లి మీరు
పాలి గెలిచి తెచ్చిన పాపమ్మ మీద
తాలిమితో నందరు దయవుంచరమ్మ
అగుమంచిసి పాపను అమ్మరో! నీవు
వొాగి నొక్కటిగ చూచుచుండుము
తల్లి!
వుసురు మంటే మనసు వొప్పదు
నాకు

కసరక యెప్పుడు కనికరముంచు
అప్పకూతురటని అదలించ వలదు
చెప్పితినని తల్లి చిత్తమున నుంచు
కూతుళ్ళమీదను కృపనుంచు నటులె
వో తల్లి! పాపపై వుంచుము దయను
కొమరక్క! వో యత్త! కోడలుమీద
అమితమౌ దయవుంచు' మనిచెప్పె వేగ
ఆలాగు భక్తిరయ్య ఆనతి యివ్వ
శిష్యులను భక్తుని సిరిదేవి యపుడు
పొసగంగ అన్నము భోంచేయ బెట్టె

## భక్తుడు కాశికి బయలుదేరుట

వొక్కరొక్కరు తమ యోగదండములు
గ్రక్కున పుచ్చుక కదలిరి వేగ
కొమరక్క సిరిదేవి గోత్ర పెద్దలను
ప్రేమతో సిరిగిరమ్మ పెండ్లి చవికె వద్ద
అందరు తిరుగ నంప అయగారు కదలె
పందుముల పలికొండ బాలుడయితన్న
అందరు వచ్చిరి అయగార్ని గొలిచి
వెంగట పలికొండ సరస నయితన్న
గంగరావుల సీద బొంగారాల బయలు
రంగు మీరగ నిలచి రఘుపతిని జూచి-
'వుండుడు ధనకొండ నుత్సాహముగను
దండిగ నాచంద్ర తారార్కముగను
యేలుడు పట్నము యీశ్వరు కృపను
బాలరాజు లందరికి భయభీతి గరపి
రఘుపతి నడిపించు రాజ్యభారంబు'
అగణిత పల్లికొండ అయితన్న మొదలు
తమ్ములు మరుదులు దండము లిడిరి
సమ్మతి నందరు సర్వేశ్వరునికి
వందనములు చేసి వచ్చిరి మగడి
బంధువులను బంపి భక్తుడు కదలె
ముమ్మయ్య పోచయ్య ముద్దు బాలకులు
యిమ్ముగ కదలిరి వెనుకొని వారు
కందర్పహరనుతుని కలసుక కొలిచి
నందుల కురువకు నట వచ్చి నిలచి
అల్లుని తమ్ముని అలుముక వేగ
వల్లవ కులగురువు వారల కనియె:
'వక్కట మీరలు యోగక్షేమములు
గ్రక్కున శిశువులారా! కనీ వుండరోయి
అందరితోగూడి అనుమతి తోడ
పొందుగా నుండుడీ పోయి వచ్చెదను
దక్షణాది వార్త ధనకొండ వార్త
నిశ్చయముగ దెలియ నేవేగ వత్తు'

చెల్లిలి కొడుకును చిన్ని ముమ్మయను బాలులు ధనకొండ పరువడి వచ్చిరి.
మళ్ళించి భక్తుడు మరి పోయె కాశి,

## భక్తుడు మార్గమధ్యమున పుణ్యక్షేత్రములు దర్శించుట

కాలాంతక సుతుండు కదలె
త్రిపురముకు
చేరి సర్వేశ్వరు సేవలు జేసి:
'హరహర గౌరీశ; అంగజవైరి!
త్రిపురములు గొట్టిన దిట్టవు స్వామి!
కృపజూడు మమ్మును గోరాజ
గమన!'
అని సన్నుతించియు అచ్చట తర్లి
చెన్నుమీరగ వచ్చి చేజర్ల నిలచె
కపోతలింగము కరకంఠునకును
ప్రదక్షిణము చేసి ప్రార్థన జేసె
'కాశికి సరిగాను కావలసి నీవు
వాశిగ నిచ్చట వ్రతము చేకొనియు
జపతపముల చేత శంభు మెప్పించి
ఆ పక్షి రక్షించి హరిహయునకును
మేలన శిరస్సులో మెదడిచ్చినట్టి
చెలగి కీర్తిని గన్న శిబిచక్రవర్తి
ప్రాపున చేజర్లవతిగ వెలసితివి
కపోత యీశ్వర! కరుణించుమమ్ము'
మరునాడు భక్తుడు మరి తర్లిపోయి
ధరణాల కోటను తగు వేట్క నిలచె
అమరేశ్వరుని జూచి హస్తములు
మొగిచి:
'ప్రమథ రక్షకుండ! భక్తవత్సలుడ!
కరుణించు ముక్కంటిని కన్నట్టి
స్వామి!
ధరణాల కోటీశ! దయయుంచు
స్వామి!'
అని సంస్తుతి చేసి అచ్చట తర్లి
ఘనుడు వుండ్రపల్లి కడకేగి నిలచి
వర్ణించె యా పద్మవల్లభు నపుడు
'శంఖు చక్రము గల సరసిజనాభ!
పంకజేక్షణ హరి! బ్రహ్మాండనాథ!
లంకాధిపతి యగు రావణహర్త!
పొంకముగ అయోధ్య
పురినివాసుండ!
సీతామనోహర! క్షీరాబ్ధి శయన
నాతుబ్రపియు! పద్మనాభుండ!
శరణు'
అనంతశయనుని అర్చించి వెడలి
స్థానము బెజవాడ దరిజేసె గురువు
క్రిష్ణ స్నానము చేసి కీలాద్రి యెక్కి
విష్ణుతో పెనువుద్ది వెలయ మల్లప్ప
వేడెను భక్తుడు వినమిత శిరుడై:
'పైడిని వర్షించి భక్తుల గాచి
చినుకు చిన్నము యెత్తు క్షితిని
వర్షించి
కనక నిక్షేపముగా జేసినావు

నిజముగ నీ కీర్తి నిండె లోకమున
బెజవాడ మల్లప్ప పెంపొందినావు
విజయ మి'మ్మని స్వామి వేడి
మరునాడు
రాజమహేంద్రము రమణతో నేగె
గోదావరిని మునిగి గురువు తా లేచి
ముదమున సారంగు మోక్షమొందించి
ఆదరించిన యట్టి అమ్మను వేడి
ముదమున శ్రీకాకుళమున కేతించి
సువర్ణముఖిని మునిగి సౌరిది
భక్తుండు
వర్ణించె ఆ తెనుగు వల్లభుని వేడి-
'విల్లును దునుమాడి యింతిని గొన్న
వల్లభస్వామి! నావందనము లివిగో!
రాతికి ప్రాణంబు రాజేసినావు
సీతాపతీ! నీకు శర'ణని వేడి
పరుసవేది లింగము పయనమయ్యేగి
కరపాట నిలచెను కరకంఠ నుతుడు
చిలక సంద్రంబున చేసె స్నానంబు
'వెలుకు చూపులు దొడ్డ తళుకులు
గలుగు
చిలక సముద్రమా! శర'ణని వేడి
ప్రణాళి సముద్రమునకు పరగంగ
జేసి
మణిత పట్టము బోయె
మహనీయమూర్తి
మణి కేశ్వరుని జూచి మరి
మొక్కినించి

వేడంగ సాగెను యీశ్వరు నపుడు:
'కరకుట్లు దెచ్చిన కన్నప్పను మెచ్చి
తరుణి వంట[1] బలికిన దాతవు నీవు'
ప్రాకటముగ దేవు ప్రార్థన జేసి
యేకాంబరుండు తా యేతెంచె వేగ
శ్రీపురి పొంతకు[2] చేరంగ వచ్చి
ఆ పొద్దు యింద్ర జింహుడు
కట్టించిన[3]
యిహపరములు నివ్వ హెచ్చెన నదిని
యాకుళంబమును నదిని స్నానము
జేసి
కటకమునకు జేరె ఘనుడు భక్తుండు
మహానది స్నానము మరిజేసి గురువు
బహుగ జగన్నాథు ప్రార్థన జేసె:
'పుండరీకాక్షుండ! భువన రక్షకుడ!
కొండ గొడుగుగ నెత్తు
గోపాలమూర్తి
ద్రౌపది అభిమాన ధన రక్షకుండ!
జీవుల రక్షించు శ్రీహరి దేవ!
వటపత్రశాయి! వో వాలిసంహారణ!
కటక జగన్నాథ! కరుణించవయ్య!?'
అని వేడి కాశికి అభిముఖముగను
అతిసాగరము బోయె నా భక్తిరయ్య
వెయ్యిపాయలై వచ్చి యేరులు
గలసిన
చయ్యన సంద్రమున స్నానము జేసి
'అయ్య! సాగరముల కన్నిటికి పెద్ద!
కులాబ్ధిసాగర! కోటి పుణ్యమూర్తి!

1. తరుణి సజ్జను (పా.) 2. శ్రీ పురుషోత్తము (పా.) 3. గట్టిన (పా.)

కలియుగము వారికి కన్నతల్లివిగ
గాంభీర్యము గలుగు ఘనపుణ్యనదిగ
అంబుధి జలరాశివయ్య! శరణార్థి!'
తేజముతో నుతించి తెరువు సాగించి
రాజ్యములను జూచి అటు సంతసించి
భార్గవనది జూచి భక్తిరయ్యపుడు
స్వర్గానికి మోక్ష స్నానము జేసి
అతినిష్ఠ ప్రయాగ నలగంగ మునిగి
గంగస్నానము జేసి గలుగ మోక్షంబు
సంగతిగ యమున సరస్వతి జూచి
స్నానంబు జేసియు సరగ భక్తుండు
వినతుడై గయ వాసుల కిచ్చె
దానములు

## భక్తిరన్న కాశి చేరి అచటి దైవములను సేవించుట

అంతట గణపతి నటు జూచి మ్రొక్కి
అంతరంగంబున అతిభక్తి వేడె:
'మూషకవాహన! ముక్కంటి పుత్ర!
శేషభూషణుండ! శరణార్థినయ్య!
కొంచెపు బొజ్జయు గుజ్జరిరూపు
అంచితంబుగ గల ఆదిదేవుండ!'
అని సన్నుతించియు నచ్చట తర్లి
కాలభైరవు వేడి కడు వేట్కతోను:
'యీశ్వరుని సుపుత్ర! వీర హంకార!
దూషకులకు వైరి! దుష్టసంహార!
భూతపుణుకులపెద్ద! భూరివిక్రమ! దః
ఘాతతో భూతాల ఖండించు దేవ!
యీశ్వరుని కుమార! యిలభర్గు పట్టి!
పరువడి నను బ్రోవు పరగ శరణార్థి!'
కాశిలో రుద్రుని కంబాలు జూచి
కాశి వీరన్నకు కరములు మొగిచి
'శంకరుని చమట నుద్భవించియును
కరవాలు శివునిచే గ్రక్కున బడసి
పరగ శాత్రవవైరి! శరభాశరభ!
శరణార్థి' యని భక్తి సన్నుతి జేసి
వల్లవభక్తుడు వచ్చె విశ్వేశు
సతి అన్నపూర్ణమ సదనంబునకును
చని అన్నపూర్ణకు సాష్టాంగపడియు-
'కన్నతల్లివి నీవు కాశిలోపలను
పన్నుగ వున్నట్టి ప్రమథనాథులకు
పిన్నపెద్దలకును బీద సాధులకు
అన్నము నీ పేర ననుదినమునను
భోజనము గల్పించు పూబోణివమ్మ!
రాజితముగ మమ్ము రక్షించు తల్లి!'
అన్నపూర్ణను వేడి ఆ విశ్వనాథు
సన్నిధికేగెను సరిభక్తితోను
విశ్వనాథుని జూచి వినుతులు జేసె:
'వాశిగా శివయోగి! వ్రతముల
భోగి!
గవిరీమనోహర! గంగాధరుండ!
శ్రీరతి వర్జిత! చిత్ర కన్నుండ!
పయినింద పులితోలు ఫణిరాజభూష!
నచుశాలి శ్రీకాశి నాథుండ! శరణు'

అమరంగ ప్రార్థించి ఆ భక్తిరయ్య
స్వామి సన్నిధి జాగ సరగ నివ్వగను
మనవి జేసిన యంత మఠము
యేర్పాటు
ఘన విశ్వనాథుని కరుణను వేగ
మఠము గల్పించుక మహాదేవదేవు
పటుతరముగ తపము భక్తుడు జేసె,

## భక్తుడు గయకు వచ్చి శ్రాద్ధము లాచరించుట

అక్కడ యేటి మీ దారునెలలకును
గ్రక్కున కాలము గనవచ్చె దనకు
అంకమును సమీప మయగారు జూచి
శంకరనుతుడు తా చాలించి తపము
మునుపటి వారిని మోక్ష మందించి
వెనుక తీర్థముగొని వెడలంగ దలచి
నభకేశ నుతుడు తా నటువచ్చి
గయకు
సభ బ్రాహ్మణుల గూడి జరుపంగ
క్రతువు
అతినిష్ఠ ప్రయాగ నలగంగ మునిగి
యతి వర్జితము క్షౌర మట శ్రాద్ధ
మొనరించి
కాశిలో కేదార ఘట్టమున మునిగి
వాసిగ కాలభైరవ దర్శనమును
విశ్వేశ్వరస్వామి వైన దర్శనమును
అన్నపూర్ణను జూచి అట శ్రాద్ధ
మొనరించి
పన్నుగ గయక్షేత్ర ఫల్గుణి మునిగి
నది వొడ్డునను వంట నతిభక్తి జేసి
యందు ముండవ భాగమట శ్రాద్ధ
మొనరించి
ఫల్గుణీ శ్రాద్ధము పరి సమాప్తించ
విష్ణు పాదము లొద్ద వెస నొక్క
సగము
నిష్ఠతో శ్రాద్ధము బెట్టి పిండములు
విష్ణు పాదంబుల బెట్ట పశువులు
ముట్టగ విష్ణు పాదముల దన శిరము
మూడు మార్లంటి కపాల
మోక్షము నెంచి
యట విష్ణు షట్కోణ మందొక
గుంట
పటుగతి తిలల తర్పణ మాచరించి
వటవృక్షమున మిగతవంతు
అన్నముతో
శ్రాద్ధము పిండ ప్రదాన మొనరించి
పిండములట తినిపించి గోవులతో
శ్రాద్ధ పిండముల శేషము వటపత్ర
మందుంచి ఆఘ్రాణ మమర
జేసియును
ప్రేత పర్వత మెక్కి బ్రహ్మాది
మూర్తి
త్రయ సరస్వతి గణనాథాది సర్వ
విగ్రహ దర్శనము వెస జేసి ధ్యాన
నైమీలిత నేత్రుడయ్యె భక్తిరయ్య

## భక్తిరన్నకు స్వర్గస్థులైన పెద్దలు కనిపించుట

సోమ వంశంబున శూరులై నట్టి
నాయన ప్రపితా మహాదు లెల్లరును
రాయ భోజుండటు విజయభోజుడాది
జేయని గోచర మాయెను మరియు

### ఆవుల వలురాజు

కండె మొండెము కోట కలభూత
గంగు
దండించ కరణాలు తలకి వేడగను
కరణాల కొరకునై కదిసి దండెత్తి
దురమును గంగు రాజుతో జేసి చంపి
కీర్తిని గన్నట్టి కవులావుల గంగు
రాజు పుత్రుడు వలురాజును దోచె
వలురాజు పద్దను వైరుల ద్రుంచి
కల్లుగా రిపులను ఖండ్రించి కలను
వురువు గాయాలతో నుర్విని బడిన
తరిమిత్త తాతయు తా దోచె నపుడు

### సింహాద్రిరాజు

శ్రీవైష్ణవుల గాయ సింహాద్రిరాజు
శైవ మతస్తులౌ సింధు భల్లాణు
శ్రీ కూర్మ మందెదిరి చెలగి
యుద్ధములో
మూకల నెల్లను మునుమున్న ద్రుంచి
సింధు భల్లాణుని శిరసును నరికి
చంద్రాయుధము నాటి చెల్లిన యట్టి
సింహాద్రియును సతి సీత గన్పడిరి.
భూమాటి శంకర పుణ్యుండు మంత్రి
ధీమంత ప్రభు సన్నిధిని నిల్చి పోరి
మెండైన గాయాల మేనమామచట
కాండెంబులో చెల్లగా శంకరమ్మ
గుండాన వారిగెను గూడి గన్పడిరి.

### పెద్దిరాజు

సంతు లేదని చాల చింతించి తరలి
కాంతతో కళ్యాణ ఘనపురి కేగి
పుత్రులు గల్గగా భూమికి రాక
శాస్త్రము గాదని చెప్పె పెద్దలని
అక్షత గంధంబు నద్దిన మోము
పక్షులు నొక్కంగ పరరాజు లంప

పక్షుల కొరకునై పరిపరి గతులు
ఆపూరి ప్రభు పగకై దండు వెడలి
వావిరి సేనల వరుసలు త్రుంచి
పోరాడి రాజుల పొట్టలు చించి
ఘోర యుద్ధము జేసి కుంభిళ్ళు నరికి
ఆరెమాని వీర వయ్యాళి బయలునను
వారిగిన పెద్దిరాజు, వనిత పెద్దమ్మ
శోభనాల గుండాన సౌద వేరు పరచి
అద్భుత గంధపు మ్రాను లెలమి
పేర్పించి
అంచితముగ విభు నందుండ జేసి
మంచి సొమ్ములను బ్రాహ్మణులకు
నొసగి
వరుస బిడ్డల వొడ్ల[4] వారి కొప్పించి

దండ మొప్పగ బెట్టి తగ[5] వారి కెల్ల
గుండము లోపల గుప్పున దుమికి
మంట లోపల నిల్చి మాటలాడియును
కంటికి రెప్పగా కాపాడి యెపుడు
ఆరిన గుండము నందున రూపు
ధారుణి సభవారు తబ్బిబ్బు పడగ
బంగారు బొమ్మనా బాగుగ జూచి
బొగ్గులు తామర పూవులై దోయ
పంత మీదేర్చి బాలు లొప్పించి[6]
సంతసమును గూర్చు సతి విభు దోచె.
దామసానిమామ దశముగా[7] పోరి
రామ రామా యని రాజు
సముఖమున
పొలసిన వెంగళ పోతమ దోచె.

## యరనూక రాజు

యెరుకులు శరణన విడువక కాయ
యర్రభూపతి తోడ యెదిరించి
నిలచి
యేనుగ నాథు కొండన
యరనూకరాజు
అనిలోన రిపులను హతముగా నరికి
యర్రభూపతి తల వెస నరికి కలను
వర్రున ప్రాణాలు వరద్రచ్చుచుండ
యెదురొమ్ము పోట్లతో యిల గూలినట్టి

సదయుడు యర్రనూక సతితో
గన్పించె.
చలమున రాజుల చంపి చెండాడి
పులిముద్దు రాఘువుడు భూమి
గంపింప
ధిక్కరించిన వారి తెగటార్చి చెండి
అక్కడ సరికల్లు సయ్యావద్ద బడిన
చక్కని రాఘవు దేశమలు గన్పించె

4. వడ్ల 5. తన 6. బాలనిప్పించి. 7. తరచుగా

## నలనూక రాజు

నున్న బెజవాడకు నురవడిబోయి
నున్న భూపతులను నురుమాడి
చంపి
బలువైన యీటెలు బల్లెముల్ నాటి
నలనూకరాజు తా నడికల్లులోను
దుర్గదేవిపెంట ద్రుంగగ భార్య
అగ్నిగుండము బడ్డ నమ్మతో దోచె.
పట్టపు కరులను పగతుర ద్రుంచి
ఘట్టిగా యెదురొమ్ము గాయల తోడ
చట్టి మారయ, రాజు సముఖాన
బడగ
అట్టె నిప్పులబడ్డ అతివ గన్పడిరి.

## పోలురాజు

లింగమంతుల కథయ మిది
పోలురాజు
జంగాల నందర సతుల బిడ్డలతొ
శ్రీశైల మంపియు చెలగ తోడిచ్చి
వాశిగా చెరుకూర వసియించనపుడు
చోడారి సెలవియ్య సొరిది
సేనలతో
మూడు కన్నులవాడు ముక్కంటి
యెదిరి
సమరంబు చేయంగ జంపి
ముక్కంటిని
శ్రీమంత చెరకూద చెల్లిన తండ్రి
తిరుగువార బడిన తిరుమందులెల్ల
వరుసగ గన్పడిరి భక్తుని కపుడు.

## కల్లందుల మార్నీడు

బల్లి కురు నందు బవరంబు జేసి
కల్లుగా శత్రుల ఖండించివైచి
యిమ్మధక్కమరాజు వెసద్రుంచి
కలను
యిమ్ముగ గాయాల యిల గూలినట్టి
కల్లందుల మార్నీడు కాంతయు దోచె

## మసిలినీడు

అల్లంత దూరాన అతిరథుడైన
వాశిగా జాంబవ వంశవర్ధనుడు
మశిలన్న యనబడు మాతంగవరుడు
వినుకొండ యేలెడి వీరభల్లాణు
అని నెదిరించియు నతని యేనుగుల
గుర్రాల గూల్చియు గూడి భల్లాణు
శిరసును కరవాలుచే నరికి కలను
పడిన మశిలన్నను పడతిని జూచె.

## బోడావుల అన్నెపాకు

బోడావులన్నెపాకు భూరియుద్ధమున అశ్వాల నరికియు నతనిని గూల్చి
కంచర్ల ప్రభు గజకంఠకు తోడ విశ్వవిఖ్యాతుడై యిలమీద బడిన
అంచితముగ నెడిరి ఆతని కరిఘటల అన్నెపాకును భార్య అచట గన్పడిరి

## కల్లందుల పోల్నీడు

రాళ్ళదిండి భైరవరాజు కురువ వద్ద పోట్లచే కల్లందుల పోల్నీడు వారిగె
జలోధీరుని జంపి సైన్యము నరికి అప్ప చిటినూకతో అతడు కన్పడియె.

## చల్ల భూపతి

వుత్తర సరిహద్దు వొడ్డెరాజులతొ మర్ల పిన్నమనాయుడు మామయ్య
యుద్ధము జేయగ వొడ్డెభూపతితొ మరియు
బాలరాజు లనికిని జరగ బోనీక మర్ల చిన పిన్నముతు మరది
పెదతండ్రి భూపతి పేరు నిల్పియును పెదమామ
చల్లభూపతి కడు సాహసమునను కొడుకు మాటలనేర్పు గుణులని
తత్తరిల్లగ పోరి తలలు జనులు
ద్రుంచియును అనెడు వారలు వొడ్డె యధిపు
కత్తుల పోట్లచే కలనిలో బడిన యుద్ధమున
వుత్తముడు చల్ల భూపతి భార్య పోరి రిపుల ద్రుంచి పొలసినవారు
భద్ర వారి భార్యల గూడి వరుస
అత్తరి గన్పించె నందరతోడ గన్పించె.

## ముమ్మయ్య పోచయ్యలు పిండములకై చేతులు చాచుట

తరము పెద్దలు తన తాత పెద్దలును కోకొమ్మని బాలురు గొబ్బున దోచె
పరగంగ గన్పడ భక్తుడు మురిసి బాలులు హస్తములు పరగ
ఫీక నమస్కృతులు వెసజేయ వెంట ఛాచియును

నిలిచిన బాలుల నిలువెల్ల జూచి
జొత్తువలె ర క్తము జొబ్బిలి కురియ
భక్తుడు తా జూచె బాలు లిద్దరను
వాలుజడలు గల్గు వల్లవ గురువు
నీళ్ళను బాలుల నెట్టన జూచి
పోట్లచే ముమయ్య పోచయలకును
జొట జొట ర క్తము జొబ్బిలి గురియ
తమ్ముడు ముమ్మయను తడయక
చూచి
సొమ్మసిలి భక్తుడు శోకింపసాగె
అల్లుడు పోచయ్య ఆకారమునకు
వల్లవ కులగురువు వలపోయసాగె

## బాలుర మృతికి భక్తిరన్న దుఃఖించుట

'మత్సరేఖలు గలుగు మా బాలులార!
వక్షము పోట్లతో వస్తిర మీరు
బాలులు ధనకొండ పరిణాన వుండ
వాలాయముగ కాశి వస్తిని నేను
నందుల కురువకు నన్నంపిపోయె
యిందుశేఖరు వద్ద యిటు
నిలిచియుండ
యీ లోన చెడువార్త యెరుగను
నేను
కాలము గూడెను గంగ దయదప్పె
ముమ్మరముగ పోట్లు ముప్పిళ్లు నాటి
తమ్ముడ ముమ్మన్న! తలచితివ
నన్ను!
బర్లెముల పోటులు బలువుగ నాటి
అల్లుడ పోచయ్య! అనివార్ర
దెస్తిర!
అల్లుడు తమ్ముడు హస్తముల్ చాపె
హర హర యెవరికి అన్నము
నిడుదు!'

## భక్తిరన్న దొనకొండకు మరలుట

పరికించి భక్తుడు పరమేశు దలచి
బాలులు కలనిలో పడిన వారలకు
పారేటి అన్నము పరగ బెట్టుదునని
పూజించి విప్రుల పోనంపి యవల
బాజని విశ్వేశు దనర ప్రార్థించె:
'కాశినుండియు యింటి
కడతేగుటకును
యీశ! యనుగ్రహించి యిటు
జూపుమయ్య
యిమ్ముగ నడచియు యే బోవు వరకు
తమ్ముల శల్యములు ధరణిని
గలయు
బొందిని విడి జీవి పోయెద' నను చు
తుండెగర వేసియు తొత్తుశూలమును

వచ్చేడి శూలముకు వక్షము బట్టె
చెచ్చెర హరుడు తా వచ్చి
శూలమును
అమరులు మెచ్చగ అరచేత బట్టి
ప్రేమను రథమిచ్చె మేలని పొగడి

కాశి తీర్థము గయ ఘన విభూతియును
వాశిగా పాత్రల వలను బట్టియును
రథముపై నుంచియు రవితేజఘనుడు
బదుడని శిష్యుల పైనము జేసి
కదలెను భక్తుడు కావడితోడ

## భక్తిరన్న విశ్వేశ్వరు డిచ్చిన రథముపై దొనకొండ చేరుట

పదపడి ఖేచర భాగంబు పట్టి
నందుల కురువకు నటు వచ్చి నిలిపి
అందు రథమునుండి అన్న తాడిగ్గి
వందన మొనరించి బంపె రథమును
'చంద్రశేఖర!' యంచు శంఖు
నాదించి
నందుల కురువ స్నానమును
జేసియును
సరగున శిష్యులు శంఖులు బట్ట
కరమొప్ప భుజమున కావడి బెట్టి
పొడపాటి మిట్టలు ప్రొద్దుండ బోయె
పొడపాటి వీరన్నను భక్తుడు తాను
ఆవేళ ప్రార్థించె అతిభక్తితోను
'వో వీరభద్రుండ! వో యీశపుత్ర!
కావిఘట్టుగు కాశె గలిగిన దేవ!
నీ పేరిటివాడు నీ వరసుతుడు
వీరన్న యనువాడు బిరుదుగల శూర
క్షేమాన వున్నాడ? శరచాపమూర్తి!
ప్రమథ రక్షకుండ! ప్రజ్ఞావిశేష!
భద్రేశ! ఆయుధాలు బరగిన మూర్తి!'

నంది కుప్పెల జలమటు జలకమార్చి
నుదుటను విభూతి నొనరంగ బెట్టి
శలవని దండము చయ్యన గదలె
చల్ల (చాలు) రావుల బయల
చయ్యన నిలచి
పల్లజడల దారి పట్టెను శంఖు
వల్లవ కులజుండు వరభక్తుదేగి
నల్లచెరువు కట్ట నాదించె శంఖు
చంగల్వలును మంచి చామంతి పూలు
శృంగారమై యొప్పు తీగమల్లెలును
పెంపైన జాజులు పెద బొడ్డుమల్లె
సంపంగ తామర సరవి గన్నేర్లు
వనరంగ నేలపై ప్రాలియుండుటను
కనులార వీక్షించి ఘనుడు భక్తుండు
పొల పొల దుఃఖించి భూతేశు దలచి
'బాలుడు అయితన్న పట్నాన లేడు
రేపటి శివపూజ మాపటి పూలు
మాపటి శివపూజ రేపటి పూలు
చాలవు అయితన్న సద్భక్తి జేయ'
రాలిన పుష్పపు రాశులు జూచి

అనుమాన మొందియు నచ్చట తర్లి
అగుమంచి కట్టించినట్టి నడభావి
చెంగల్వ బావికి జేరగ వచ్చి
భామలు నీరుతేమి పాడు బడుండ
క్షేమమా ధనకొండ చేటు పుట్టెనని
గంగనగరు కేగి కాలాంతనుతుడు
గంగ మండపమున కావడి దించి
గంగను ప్రార్థించె కరములు మోడ్చి
'జలజాక్షి! పూబోణి!
జమదగ్ని రాణి
కినుక వైరుల గొట్టు గిరిరాజ పట్టి!
శరణార్థి పావని! పురహరు రాణి
కరవాలు శూలము కంకణములును
మెరుపులు కన్నులు మేఘము
కురులు
విలసితముగ నిట వెలసిన గంగ
ఇలవేల్పు వని నమ్మి యిటు కాశి బోతి
పలికొండ అయితన్న
బాలరాజులును
పాలేటి కేతెంచి బవరంబు జేయ
తిరుమందులు వల్లవధీరుల నెల్ల
ఐరిగొల్ల జేసితే భాగీరథీ! నీవు!'
అనుచు గంగను బల్క
ఆ ఘను డపుడు
ఘనమజ్జనము జేసి కాశితీర్థమున
నొసటను విభూతి నుంచి గంగకును
హస్తముల్ ముకుళించి అంబును
వేడె
'అసుర సంహారిని ఆదిమూర్తివని
వెస నమ్మి పోతిని యిటుజేయు
పెరుగ!'
కసిపడెను గంగ కరకంఠనుతుని
భక్తికి మదిలోన వనరుచు గంగ
వక కంట రక్తము వక కంట నీరు
గ్రక్కున జారంగ గంగ తా నపుడు
పొల పొల దుఃఖించు పూబోణి జూచి
కలకంఠి ధనకొండ గంగకు
మ్రొక్కి
శిష్యుల భక్తుడు చింతించి కదలి
యసగంగ శివుగుడికి యేతెంచె
గురువు
చేతులు ముకుళించి శివుని ప్రార్థించె
'భూతి పుండ్రము చేత పుణుకు
పేరులును
పుత్తడి పరుసము పులితోలు కాసె
భూతేశ్వరుండవు పూని పెండెంబు
త్రిపుర సంహారక! త్రిశూలధారి!
కపటపు నవరసము గలిగిన స్వామి!
గవిరీ మనోహర! గజచర్మ ధరుడ
శిరమున జాహ్నవి శివయోగి
శరణు!
పరమేశ్వరా!' యని ప్రస్తుతిజేసి

## సిరిదేవి నగరులో భిక్షము గొనుడని భక్తిరన్న శిష్యులను బంపుట

గయ చంద్ర విభూతి కాశితీర్థమున చయ్యన జలకము సల్పి శంభునికి

ఆవేళ శిష్యుల నందర బిలచి
ఆరంచిగియు రాగ అనతి యిచ్చె
శివరాత్రి సమమగు సిరిదేవి నగరు
అక్కడ శిష్యులు అయ్యను వుంచి
గ్రక్కున నగరికి కదలి తామేగిరి
సిరిదేవి నగరికి శ్రీఘ్రమే పోయి

## భక్తిరన్న అర్ధరాత్రివేళ సిరిదేవి నగరుకు భిక్షకై వచ్చుట

నిశి సమయము వేళ నీలకంఠుండు
వెస శంఖు నాదించె వీథుల వెంట
కరకంఠుని గంట ఖంగున మ్రోయ
తరుణులు మేల్కనిరి తల్పము నుండి
'అమ్మలారా! భిక్ష అయ్యలారా! భిక్ష
సమ్మతినిడరమ్మ! సఖులార! భిక్ష
సంధ్య భిక్షము పెట్టి శతఫలమమ్మ!
సత్యము యిడరమ్మ! జలజాక్షులార!
తేరమ్మ భిక్షము! దేశయాత్రికునకు
కోరి భిక్షంబిడ కోటి ఫలమమ్మ!
నారీ రమణులార! నడవడి భిక్ష!
పశ్చిమున నిడ భిక్ష పరమేశు ప్రీతి
తల్లులారా! భిక్ష, ధర్మాత్ములార!'
అలాపనము చేశ అయగారు తాను
అలాపనమె గాని అయ గానరాడు
శంఖునాదమెకాని జంగము లేదు
పంకజముఖు లటు పరిపరి చూడ
గంటనాదమె కాని ఘనుడట లేదు
వింటి మనుచు తాము వెదకెడి వారు
మాయలవాడుగా మమత గావించె
మాయల జంగము మర్మమెరుంగక
కరుణతో సిరిదేవి గ్రాలెడి వాడ
దరవాజ గుర్తించి తా నగరు కొచ్చె
'కాశినులడియు వొాస్తి ఘనతల్లి! వేగ
దేశాంత్రికిని భిక్ష తేవమ్మ! తల్లి!'
గంటనాదుకు తల్లి గ్రక్కున లేచి-
'కట కటా అన్నము కడమ కాబోలు
రచ్చల వీథుల రాచ యంగళ్ళ
అచ్చోట కోటల అరుగులమీద
మరియెటో నిద్రించె మహనీయు దతడు'

## సిరిదేవి కోడండ్రు అన్నము లేదనుట

పేరెము కోడండ్ల పేరెత్తి బిలిచి
'కాంత సొమ్ములిడుదు కరియాల కాంత!
యంత్రైన నీనగర అన్నము గలద?'
'తాలికిన బోనమే దొంతి లేదమ్మ!'
'కలికి జాజిమొగ్గ! కాటమరాజు

నారి వీరగంగ! నగరున కలదు?'
'వీరైన బోనము యేమియు లేదు'
'భావించి చెప్పుము భట్టాల సూర!
నీవు జంగానికి నిటు కుడువబెట్టు'
'అందైన బోనమే అధికము లేదు'
'యింట నేమైన వున్నదా?
యర్రయ్యదాన!
కోడల జంగమును కుడువగ బెట్టు'
'పీడిన బోనము యేమియు లేదు'
'అపురూప కన్యక! అయితమభార్య!
కృపజూచి జంగమును కుడువగ
బెట్టు'
'అపరాధ మగునమ్మ! అధికము లేదు'

'ముద్దు కోడల రావె! ముమ్మయ్య
సకియ!
పద్దుగా జంగముకు పారణ సల్పు'
'అంటిన బోనము అది పెట్టరాదు'
యింట జంగమ పూజ యిటు
కొరవడియె
'భద్రాక్ష తావళాల భక్తినల మేద!
నిద్రమేల్కొనిరావె! నీరజగంధి!
అల్ల సిరియాళు మాంసము
అడిగినయట్టి
పల్ల జడదారొచ్చె మల్లప్పయిటకు
పసతి అరఘ్యం బిడి పాదములు కడిగి
వెండియు బోనము వేగమె జేయు'

## భక్తిరన్న భార్య మేడాంబ తన యింట అన్నము కలదనుట

అంతట మేడాంబ అత్తతో బలికె:
'చింతింప నీకేల? శివుసాక్షిగాను
దొంతిలో దాచితి తొణకనోగిరము
యామరక అన్నము యెప్పుడు
దాతు'
'భామ' నీ దాచిన పని యేమి
చెపుము?'
'వుత్తరకాశేగిన వుత్తము డొచ్చునో
పాలేటికేగిన బాలు లొచ్చెదరొ
అలములోనుండి అన్నలొచ్చెదరొ
అంటని బోనము ఆటు దాచినాను
పాలించి దాచితి పరమేశునాన!

సత్యమైనది యిది స్వామిసాక్షిగను!'
'సత్యమైనది యేతె సఖియరో
తెమ్ము'
గిత్తగవు కూటనంకు చేరి
తిరిగిపోయి
పట్టినేళ్ళ శిబిక దిడ్డించుకొనియు
పట్టు వస్త్రంబును పైన గప్పుకొని
వనజాక్షి మేడాంబ వచ్చెను వెడలి
తాను వోగిరమును తాగొంచు రాగ
ఆలాపనము జూచి అతివగా దెలిసి-
'పాలేట అన్నము పంచిపెట్టనలె
పోట్ల తమ్ములుబడిరి బోనమెవ్వరికి?'

మాటాడకను తాను మదిని చింతించి- మరి జంగముల దీక్ష మరచింది
'సంపద గర్వంబు సౌభాగ్యగరిమ తల్లి'
పెంపైన రాజ్యము విభవముగూడి

## భక్తిరన్న మేడాంబ తెచ్చిన అన్నముపై విభూతి చల్లి వెడలుట

అరయ భక్తుడు వేగ అన్నము మీద నల్ల పూసలు దక్క నాతి సొమ్మెల్ల
విభూతి చల్లియు వెడలె గ్రమ్మనను కొలుకు లూడియు ధర గుప్పున
శంభునిగుడి కేగె సర్వేశనుతుడు బడెను.
రుద్రాక్ష తావళాల్ భద్రాక్ష సరులు గడ గడ వణకియు కడు భిన్న
క్షుద్ర శంఖుల దండ సూత్రము యయ్యె
నరుత

## అయ్యగారికి ఎంగిలి అన్నము పెట్టబోతివని సిరిదేవి కోడలిని మందలించుట

మేడాంబ అత్త సమీపము కేగి- అంటు లేనన్నము అయగారి కిడక
'అన్నము వల్లక అయగారు పాయ' అంటు వద్దది పెడితివి అయగారు
విన్నవించెను తాను విన్నపము పాయ'
వినియు- అత్త మాటకు కోడ లడలుచు
'అంగనామణి! వినుమమ్మ బలికె:
మేడాంబ! 'అత్తయ్య! అంటు లేదా శంభునాన:
యెంగిలి బోనము యెతులకు గొంచు బంగారు పాత్రలో పదిలము జేస్తి
పోతివి జంగము పాయె తా మగిడి యెంగిలి గాదత్త విను విన్నపంబు
సత్యమా బోనమసి సకియ! కాశి బోయిన నీదు కన్నకొడు
చెప్పితివి కవునా!

దేశాంత్రి యైతేను ద్వేషించదమ్మ!
పరదేశి జంగము పట్టును భిక్ష
స్థిరముగ నామాట సిద్ధము నమ్మ'
'పరదేశి జంగమో భక్తుడో యగుట
అరయంగ విభు గుర్తు యెరుగవా
నీవు?'
సిరిదేవి పలుకంగ చెప్పె మేడాంబ:
'పొదలమెకము తోలు పుట్టు
కుండలము
వొడ లెల్ల విభూతి యోగ వాగములు
కప్పెర డాచేత కనక శూలంబు
యిప్పుడె మగిడేగె యెరుగను గురుతు
త్రైమూర్తి సాక్షిగా తలబ్రాలు
నాడు
తాము జూడను గుర్తు తలయెత్తి
విభుని
కంకణము గట్టిన కన్నెత్తి జూడ
యింకెటు విభుగురుతు యెరుగుదు?'
నంచు

## ఉడికిన అన్నపు మెతుకులను మొలకెత్తించుమని సిరిదేవి కోడలిని పరీక్షించుట

మాటలాడగ అత్త మరి యిట్టు
లనియె:
'బోటిరో! సత్యమౌ బోనమ యైతె
నీళ్ళలో అన్నము నిక్షేపఱించి
మొలిపించు అన్నము ముదిత!
యీవేళ'
అత్తాడు మాటకు అతివ మేడాంబ
అత్తతో యిట్లనె అంజలి బట్టి:
'రోళ్ళను బోసియు రోకళ్ళదంచి
నీళ్ళతో కడిగియు నేరి దాళ్ల మీద
వుడికిన మొలచుట వుండునా
భువిని?'
కోడలాడగ జూచి మేడాంబ కనియె:
'అది యేమి చోద్యము అన్నము
మొలువ
మది రాక్షి! వినగదే మరి కథ
చెపుదు:

## సిరిదేవి కోడలికి గౌతమ సాటువ చెప్పుట

భక్తి జూడగ గోరి పరగ దేవతలు,
అతిథులై గౌతముని అన్నము నడిగిరి
సంతసించియు వొప్పె సత్య
గౌతముడు

పాల చవుడు గాక పల్లము గాక
నీళ్ళ జాలును గాక నెరి బీళ్ళు గాక
కలచోటు కృష్ణ రేగడ సరిపొచ్చు
వెలిగొండ పడమర వెలసెను మర్రి
వూడలు కొమ్మలు వుగ్రూతలూగు
చూడ వేడుకయైన సొంపైన మర్రి
వింధ్యాద్రి మలలలో విరివైన మర్రి
కుంజరముల కిరవు గురుతైన మర్రి
పెంజేరి గున్నలు పెను పాములకును
త్రాచులు నాగులకు తావైన మర్రి
శేషుండు పుట్టలో క్షేమాన నుండు
గండ భేరుండవ కాపోతములును
మెండుగా పాపురాలు వుండు యేప్రొద్దు
కొంగలు కోవెలలు గోరువంకలును
నింగి దాకెడు యెత్తు నెలవు చిలుకలకు
పైడి కంటుల కిరవు పరగిన మర్రి
ఆడకాడకు దిక్కు లాక్రమించెనన
మర్రి క్రిందను నిల్చి మరి నిక్కి చూచి
యిరవులై కాపురాలు వెస చేయుచున్న
పక్షులతో నిట్లు పలికె గౌతముడు:

## గౌతముడు పక్షులను మర్రి విడిచి పొమ్మనుట

'వృక్షము ఖండించి వెస నగ్ని గాల్చి
చల్లార్చి యీ పోడు చక్కగా దున్ని
నలుసులు యేలియు నతి వేగమునను
కొర్రవెట్టగవలె గొబ్బున మీరు
యిరువుగా దీమర్రి విడిచి పో' మ్మనెను.
ఆమాట విని పక్షులు ఆక్రోశమొంది
తామెల్ల మూకలై తల్లడ పడుచు
యేకమై అప్పుడు యెలుగెత్తి అడలె:
శోకించి కన్నీరు సోనలై కార:
పిల్లలు పక్షులు పికపిక లాడె
తల్లడించియు తాము ధరణిపై వొరుగ
తల్లులు బిడ్డలు తరి చావ వొచ్చె
'చెల్లంబో గౌతమ! చెప్పెదము వినుము
అంభోధి సెలల కొన్నాళ్ళటుబుండ
అంబుధి యెరుకువాడు హత్యకట్టుకొనె
మర్రిచెట్టున మేము మరినిలువగాను
మర్రికి నీవల్ల మరి చేటు పుట్టె
పట్టుము శాపము పరగ గౌతముడ!
యిట్టు మా యిరవుచెడ నీ యిల్లు చెడును
వుండ యిరవులు లేక యెండను తగిలి
వుండుదమని యిటు వొచ్చితిమి మేము

కులాయములు చెడ్డ కోన తా చెడును యిరవుగా దీమ్రి విడిచిపొమ్మనెను
మాలాగు మీరును మరి కస్తి పడుడు' గౌతము మాటకు
శాపము పెట్టగ సంయమి వరుడు ఖగములన్నియును-
'యీపట్ల మీమీద విధి దయతప్పె 'వెతనొంది చావుకు వెరచి
క్రొరపెట్టగవలె గొబ్బున మీరు యెటుపోము?'

## గౌతముడు మఱ్రిని నరికించుట

కోపించి గౌతముడు గొబ్బున వచ్చి మ్రికి దగ్గర మరి చేరకుండ
దీపించు గొడ్డళ్ళు తెగు మడ్డి కత్తులు ముని కుమారుల శేషమూర్తి తా
చంద్రవంక పరశు చౌకాట కత్తులు తరిమె
మెత్తగ నూరించి మెరుగు పొడివేసి శేషని వధియించ సెలవిచ్చె
పొందుగా పోటికి బోన మర్పించి మునియు
ఘనమైన పారలు గడ్డపలుగులును శేషని తునియలు చేసిరి వేగ
పూనియు గుమిగూడి శేషుడు సమసిన చెడె మ్రి వేగ
ముని కుమారకులు పురపడి గొడ్డండ్లు పుంకించి నరికిరి
అనువుగా మ్రికి అటుయిటు విరివైన యామ్రి యీపలావలను
నిలచిరి కుంశలు పెట్టుచు కూలంగ నరికిరి
మ్రికి కాలము మరి నిండె ననుచు అతలకుతలమై అవనిపై వొరిగె
'హరహర మహదేవ! హరహర కూకటి వ్రేళ్ళతో కూలంగ నరుక
శంభో!' అకులు కొమ్మలు హతిహతముగను
చేకొని నరుకంగ సెలవిచ్చె ఖండ్రించె మ్రిని కణికెలు గాగ
మునియు మండ్రించె నామ్రి తునకలు జేర్చి
పీకతో పలుగులు వెస గుద్దలులతో మంత్రించి విభూతి మ్రిపై వేయ
మూకలై శిష్యులు మొదలు అంతలో మంటలు ఆకసము పొడవు
త్రవ్వియును మంటలు మండెను మసిమయ్యె
మురియుచు ఖండ్రించ మ్రి
ముని కుమారకులు అంతైన తొరటలు అరక కాలె

ఆకులు కొమ్మలు ఆ పశులెల్ల
యేకమై కాలెను వెస నగ్నిలోను
కొమ్మ కొమ్మకు నున్న
కూలాయములును
కుమ్మరావము రీతి కుమిలియు కాలె
కలగాలి యా మర్రి కణుకులై యుండె

చలపట్టి గౌతముడు సమయాపు సేసె
పోడుమీదను వాన పొర్లంగ గురిసె
పీడక దున్నియు వెస నలుసు లేరి
సత్యమా గవుతుడు* సఖియను బిలచి
విత్తనంబులు లేని వివరము దెలిపె

## వేయించిన విత్తనములను గౌతముడు మొలకెత్తించుట

జలగన్య వేగమే జమిలికాదేవి
నిలయంబునకు నేగి నెలతనుగాంచి
అలరంగ దీవించి అడిగె విత్తనము
జలగన్య సత్యంబు అలవిభుని
మహిమ
అలివేణి తా జూడ వలెనని యపుడు
పైడి మంగలమున పరిపాటిగాను
వెండి మంగలమున వేయించి
యపుడు
సరగ విత్తుల మూట జలగన్యకివ్వ
మరి విత్తులను గొంచు మగువ
తానేగె
మలల వేటకు నేగి మగిడి గిరిరాజు
జలగన్య కెదురుగ చయ్యనవొచ్చె
చెల్లిని తా గాంచి శ్రీఘ్రమే పలికె
'యేల వొస్తివి తల్లి? యెరిగింపుమమ్మ
అన గిరిరాజుతో అనుజ యిట్లనియె:
'అనువంద ముసలొచ్చి అన్నము గోర

అనుమతి పొందెను అన్న! నీ మరిది
అన్న! విత్తులకొస్తి అవియును
దొరికె
పరగ యీవిత్తులు పండునో లేదొ'
యెరుగను అన్నయ్య! వెళ్ళివచ్చెదను
'నోచిన వారికి వేచినా పండు
నోచని వారికి వేచకా పండవు'
అనవేగ జలగన్య అచ్చట తర్లి
వెనువెంట అడవికి వేంచేసె తాను
పతి గొర్రుపట్టంగ భామ విత్తగను
సత్యాని కా క్రొర సరగున పండె
వుడికిన అన్నము వుర్విలో మొలువ
కడు అబ్బురంబదే కాంత మేడాంబ?
సత్యబోనంబైతె సారసగంధి!
ప్రత్యక్షముగ మొలుచు పరమేశు
కృపను'

---

* సత్యమా గౌతముడు

## మేడాంబ అన్నపు మెతుకులు మొలకెత్తించుట

అత్తమాటల నెల్ల ఆలించి వినియు
చిత్తర్వు కూటాలు చేరి మేడాంబ
నీరాడు చోటుకు నెలత తా బోయి
సరవితోడుత మూడు చాళ్ళు
చేసియును
అన్నము చాళ్ళలో అర్పితము చేసి
మన్ను పైనను గప్పు మదిరాక్షి
యపుడు
జలకము చివికియు సాంబ్రాణి వేసి
నీలి చీర ధరియించి నెలత
గూర్చుండి
పృథుగండ గత్తెర భుజమున జేర్చి
యెదురుగ కాళికి వెలది కూర్చుండి
ప్రాణేశు ప్రార్థించె పరి పరి గతుల

అన్నము మొలచియు అది వనమాయె
బల బల తెలవారె పసులు
క్రేవులును
యెలుగెత్తి అడలెను వెస
పక్షిగణము
కాంతలందరు లేచి గ్రక్కున తాము
భ్రాంతి నన్నము మొలచి ప్రబలి
యుండుటను
కనుకొని మెడనున్న
గండ కత్తెరను
కని తొలగించిరి కాంతలు వేగ
'నాతిరో! మేడాంబ! నా నోముకన్న
నీతిమంతురాల! నీ నోము హెచ్చు
సీతకు సరియౌదు' సిరిదేవి మెచ్చి

## సిరిదేవి తాను నోచిన నోములు కోడలికి చెప్పుట

'సత్యము చెప్పెద సఖి వినవమ్మ!
మున్ను యలమంచిలో ముదమొప్ప
నుండి
చిన్న ప్రాయంబున
చిటిబోట్ల నోము
బాల ప్రాయంబున బహుగ
నోమియును
యల ప్రాయమున యెన్నొ విధముల
నోచి

యీడేరు ప్రాయమున యెద్దును
నోమి
వడుగులు పెండ్లిండ్లు వలనొప్పజేసి
అడు గడుగు బెట్టితిని
అన్న సత్తరువు
విడువక పదకొండు యేండ్లు
నోమియును
పదిరెండు యేటను పరిసమాప్తించ
పదివేల యెద్దుల బలిజ పాపన్నను

అయిదువేలెద్దుల జెట్టి అల రాముని
పిలిపించి పర్వతం బేగ బరువులును
కొలవిచ్చితిని యెత్త శీఘ్రమే
యపుడు
జల్లించు బియ్యము చమురు
సంచులును
పప్పులు చక్కెర పండ్లు ఫలములును
వప్పైన రసగంధ వస్తువు లెల్ల
చీని చీనాంబర సెల్లాల దిండ్లు
పూనిక్క తివాసీలు పొడవు గుడార్లు
పైడి తోరణములు పట్టుతోరణాలు
వెండి తోరణములు వేరుగ పట్టి
జడల జంగములకు జడమాడ లెన్నొ
అన్నియు వారలు అయత్తపరచిరి
బాణ విద్యల మూక పరగ ముందరగ
పంచ వాయిద్యముల్ మించి
మ్రోయగను
కంచుకి జనములు గ్రమ్మక నడువ
అందలాలెక్కియు అతివ సిరిదేవి
ముందుగ కొమరక్క ముదితలు
కదలిరి
పరగ అశ్వదళాల బారులు ముందు
విరివైన విలుమూక వెన్నంటి
నడువ
యలమంచి నుండియు
వెడలి వచ్చియును
చెలులందలాలు దిగి శ్రీగిరి కెదుర
పడిసాగి మ్రొక్కియు భామలు
పలికిరి!

'విడువక పదకొండు యేండ్లు
నోమియును
పదిరెండు యేటను పరిసమాప్తించ
మదినెంచి వెడలితిమి మహనీయ
మూర్తి!
యలమంచి వెడలిన యేడు
అడుగులలో
వెలయచింద్రైనవి యే సమకూర్తు
యేడు అడుగులు దాటి వెళ్ళినవెనుక
కడమగునవి మీ కులుకగు
అర్పితము'
అని తర్లి పోతిమి అతివ మేడాంబ!
పని వడి పర్వతమల్లప్ప పురిగ
యేవురు వడియలు యెలుగులై వచ్చి
వావిరి బరువులు వడిదిమ్మి చెదర
అటులైన కబురును అందినంతటనె
చెట్ల నారను దీసి చేలములు దిగిచి
సన్నబియ్యము పప్పు సరకుల కిసుక
గోనెల బట్టించి కూర్మికట్టించి
మైసాక్షి సాంబ్రాణి మరివేసి
మ్రొక్కి
పయనమై చేరిరి పర్వతంబునకు
అమర యేదుము కరియావుల నేయి
క్రమమున గుడిలో అఖండమున
కిడియు
పాతాళగంగ లోపల మునిగి జలము
చేతను గొనివచ్చి శివుని మార్జనము
జేసి అంజలి బట్టి శివుని ప్రార్థించి
వాసిగా నైవేద్య మొసగియు నవల

జడలెన్ని జంగాలకు జడ మాదలిచ్చి
వడియలకు శంఖును వరనంది
లింగము
పైడి తోరణమును పట్టు తోరణమును
వెండి తోరణమును నివ్వగ నొకరు
కడువెలితిగా అమ్మగార్లకు మ్రొక్కి
వడియకై వెదుకంగ వనితెల నంపె

## సిరిదేవి కుష్ఠ జంగమును తెచ్చి పూజించుట

జంగము వెదుకంగ చనిన దాదులును
అంగ డంగడి వీథులన్నియు తిరిగి
తూరుపు బోయిన తోయజాననలు
పడమర కేగిన పణతులు వొచ్చి
దక్షిణామేగిన దాదులు వొచ్చి
'యెచ్చోట జంగము వెదకిన లేదు'
వుత్తర మేగిన వువిదలు వొచ్చి
'నాదించి శంఖును నటు చేర్చినాడు
వొక కరియెద్దును వాకిట గట్టె
ప్రకటితముగ చీముపడగ
రక్తముతో
వున్నాడు జంగము వ్యాధితో' ననగ
తానును కొమరక్క దండము పెట్టె
అంతట మఠపతులామె కిట్లనిరి:
'యింతి! మరలిపోయి యలమంచి
లోను
యేవురు జంగాల కిడ మ్రొక్కు
కొనుము
యీవు జంగము తక్కువ
యిటననేల!
కుష్ఠ జంగము దెచ్చి కూర్చుండ
బెట్టి
నిష్ఠలు చెడగొట్టనేల జంగాలకు?'
అమ్మలమాటలు అపుడు తా వినియు-
'అమ్మలార! విన్నపము అది
వినవొకటి
విడువక పదకొండు యేండ్లు
నోమితిని
ఏండ్రెండుయేటను పరిసమాప్తించ
నోము నోచెడివారు నొక వెలితియైన
నోము విఘ్నంబని నుడువుదురు
పెద్దలు'
అయ్యలకును తెలిపి అతివ సిరిదేవి
అయ్యను గొనిరాగ అడ్డ తెరలందు
కొమరక్క సిరిదేవి గొబ్బున బోయి
నీమంబునను మ్రొక్కి యిటు
రమ్మనంగ
'వోయమ్మ! యిటులేల వచ్చు
చున్నారు?
నాయందు కుష్ఠను రోయరా మీరు!'
అయ్యమాటలు విని అపుడిటు లంటి-
'యెడ లేక పదకొండు యేండ్లు
నోమితిని
కడముట్టగా జేయ కదలి వచ్చితిని

పన్నెండు యేటను పరిసమాప్తించి
యన్నంగ భక్తులకు అన్నముబెట్టి
నాభి శంఖంబును నందిలింగమును
వీభూతి పిడిగంట వెండి తోరణము
పైడి తోరణమును పట్టు తోరణము
జడమాడ లివ్వంగ జంగము కొరవ
యెక్కడ జంగము వెదకిన లేడు
యిక్కడ దొరికితివి యిటు
రాగదయ్య!'
అన్నంత జంగము అప్పుడిట్లనియె :
'యెన్నైన రానమ్మ! యీవ్యాధి జూచి
వున్నవారలు పోదురు వువిదలార!
యిపుడు
నీ నోము విఘ్నమౌ యెందుకు
పొమ్ము!'
అటులన వినినేను ఆ కొమరమ్మ
బడిబడి ప్రార్థించి పాలకినుంచి
పట్టువస్త్రము బురక బాగుగా గప్పి
పాలకి దెచ్చితిమి పణతి మేడాంబ!
పాలకి దించియు పాలునేతులతో
బంగారు పళ్ళెమున పాదములుంచి
అంగుళములు గడుగ అరచేతినిండ
అయ్య రక్తము చీము అందు
పురువులును
అయ్య పాదము తీర్థము
ఆరగించగను
అయ్యలు చూచియు 'హరహర'
యనుచు
'యేసీమదానవు? యెటనుండి
వొస్తివి?
యెసగ చీమును రక్తము
మెసపుదానవిట
వద్దన దెస్తివి వడియ పంక్తికిని
కద్ద యెచ్చట?' నని కనలిపల్కగను

## సిరిదేవికి శివుడు ప్రత్యక్ష మగుట

అంతలో జంగము అదృశ్యమాయె
బంతిగ చీమును పారురక్తమును
పురువులు కస్తూరి పుష్పములాయె
పరమేశ్వరుండట ప్రత్యక్షమాయె
బంగారు వస్త్రము పాంకోళ్ళు దొడిగి
బంగారు బెత్తము పట్టుక నచట
అంతట నేనును హరునకు మ్రొక్క
సంతసించియు 'కోర్కె సరవి
తెల్పు'మనె
'నీవె నా సుతుడుగ నిలపుట్టు
మంటి'
'అవుగాక' యనె హరుడు అతి
సంతసమున
వుప్పొంగి మరిమరి వందన
మిడియు
వొప్పుగా మగిడియు వొచ్చితి
పురికి.

## భక్తిరన్న పుట్టుక

యలమంచి వొచ్చిన వెనుకను నాకు
అల చీము రక్తము ఆరగించినది
గర్భిణియై దోచె ఘనముగా నాకు
నిర్భరముగ నాకు నెలలు నిండగను
పసిడి పళ్ళెములోన బాలుని గంటి
వెస జడలేనును యెక్కువలేక
చౌత కప్పెరయును ముత్యాల
సరులు
భూతి పూసిన వొడలు పుణుక
వకచేత
పసిడి పళ్ళెమునున్న భక్తుని చాయ
ఆసచే జూచుచు ఆశ్చర్యమంద
అన్నదమ్ములు నలుగురు
ఆ పల్లెకొండ
యెన్నగ దానములు యిడిరి
విప్రులకు

హరుని అవతారము అనుకొని
రపుడు
పరగంగ నిట్లనె పల్లికొండపుడు:
'పురహరు డిచ్చట పుట్టిన వార్త
మామ ఘోలరాజు తా మరి వచ్చి వేగ
కామసంహరు జూడగా వలెగాన
కాలారులను బిల్చి కమ్మలు వ్రాసి
ఆలమందకు కమ్మలంపుడు మీరు'
పల్లెకొండిటు జెప్ప బాగు బాగనుచు
పిలిపించె కరణాలపేర్మి నచ్చటను
ఆలమందను పోల అధిపుడు వుండె
తనయుడు గలిగెను తడవులేకొచ్చి
కనుల జూచియు పోవగా
రమ్మటంచు
కమ్మను వ్రాసిరి కన్నతల్లి!
అపుడు"

## సిరిదేవి భక్తిరన్నను నగరికి పిలిపించుట

అమ్మ ఖేదాంబకు అంతయు జెప్పి
రాత్రి భిక్షమడుగు రక్షకుడెవరో
వెదకి తోడుకరాగ వేగమె బంపె
గొబ్బున నాగినేని కూటాలు వెడలి
శంభుని గుడిలోని శిష్యులతోను
వుండంగ జూచియు వొప్పుగా
చెలులు
దండంబు బెట్టిరి దగ్గర నిలచి:

'సిరిదేవి పిలిచెను శిష్యులు మీరు
వేగంబె రం' డని విన్నవించినను,
ఆ భక్తుడటలేచి 'హరహరా'
యనుచు
శంభుని గుడినుండి చయ్యన వెడలి
తల్లి వుండినచోట తావొచ్చి నిలచి
ఆలాపనము చేసి అయ్యల తా నచట
భుజమున కావడి భూమిపై దించి

అజినము పులితోలు అవనిపై పరచి
కాళ్ళు పావుకోళ్ళు కడకు బోదీసి
చల్లగ కూర్చుండి శంఖునాదించె
ఆలించి వినెపు తా అమ్మ నూకాంబ
బావించి పిలిచెను బంధువర్గమును
సివాళి పళ్ళెరము నిటు గొనిరాగ
పందుముల యరణప్ప పైడివారమ్మ
అందరు గూడుక అర్ఘ్యోదకంబు
పైడి చెంబుల దెచ్చి పాదముల్ గడిగి

వెండియు అర్ఘ్యము వెలది ముగించి
సివాళి బట్టెను నీలకంఠునకు
సేవలు హారతులు చెల్లించిరపుడు
బిడ్డలు కోడండ్లు ప్రియము తోడుతను
అడ్డతెరల మరుగు అయ్యకు మ్రొక్కిరి
పుత్రులు గల తల్లి పోత్రాజు సతియు
భక్తిరన్నను జూచి పరగ భాషించె:

## సిరిదేవి భక్తిరన్నను గుర్తింపలేక పోవుట

'నిర్మల చిత్తుండ! నీతిమంతుండ!
ధర్మంబు తప్పకు తండ్రి! నాతోను
పలుకుము నీ విడిదిపట్టు యెచ్చటనో
తలిదండ్రులుండిన స్థలమును జెప్పు'
తల్లి పల్కగ విని తపయోగి పల్కె
'అల్ల మధుర, ద్వారక అది పూర్వతావు
హరి యేలు పట్నము అయోధ్యతావు
పుట్టుక యలమంచి భూములతావు
ఇట్టిపు డీతావు యెలమి నాతావు
తండ్రి వద్దకు నేను తర్లిపోచుంటి'
వెండియు ననగను వెలది యిట్లనియె
'నిను జూడ నా సుత నెగ పోలికలుండె
ఘనరంగ నీయట్టి వన్నవ గురువు

పోత్రాజు పుత్రుండు పోయెను కాశి
కాశికి బోయె నా కన్న పుత్రుండు
కాశిలో పుత్రుని కానవా తండ్రి?'
ఆ సిరిదేవితో అపుడిట్లగనియె:
'కాశీ పురమనంగ ఘనలింగ వీడు
దేశయాత్రికు తీరు తెలియంగ లేరు
నల్ల బొంతయ్యలు నలుదెసలందు
యర్ర బొంతయ్యలు యెల్లెడనుందురు
కొణిదెడు తీర్థము గోరంత భూతి
మూకలై యున్నారు మాకన్న ఘనులు
కన్నతల్లివి నీవు కానంగ లేవు
యెన్నంగ పెరవారు యెరుగుదుర గురుతు?
నన్నేమి అడిగేవు నాతల్లి నీవు?'

## యరణప్ప భక్తిరన్నను గుర్తించుట

అన్నంత భక్తుని ఆనవాల్ పట్టి
పాల సంద్రము తెప్ప పందుముల
యెరణప్ప
వాలాయముగా తల్లి వర్ణించి పలికె:
భాషింప నీకేల భాగ్యము వచ్చె?
కాశి బోయిన కొడుకు కాడటే తల్లి
శిరసున పల్లజడ శివయోగి కళలు
గురుతెరుగవ? పైన కుంజరపు శాలు,
వరభూతి వొడలును భద్రాక్ష సరులు
హరిహరాదులు మెచ్చి అయ్యకు
యిడిన
గురుతులు చూడవే కూతురా! నీవు'
కూతురుతో చెప్ప కృప నందులనూక
భూతలమున బడి పొర్లంగ సాగె:
కరువుకు ఆమని కలిగిన యట్లు
సిరిదేవి కొడుకుని శిరసెత్తి చూచి
వాడిన చేనిపై వర్షించినట్లు
తోడుగ ధనమును దొరికిన యట్లు
కరములు ముకిళించి కన్నసుతునకు
దండము బెట్టెను తల్లి సిరిదేవి
పరగ దండముబెట్ట భకుడు అపుడు
తల్లినుదుట భూతి తడయక పెట్టె:
'తెలియలేను కుమార! తెరగు
చోద్యంబు!
కొడుక! కాశికినేగ కోరిన దాది
వుడుగదు కన్నీరు వో ముద్దు
పుత్ర!
బాలరాజులు దండు పైనమైపోయె
పదిహేను నాళ్ళాయె పరిణామ
మెరుగ
యేలాగ వోర్తు' నని యెలుగెత్తి
యడలె
తల్లి మనసు గురువు తహతహపరచి
'నీవు దుఃఖింపంగ నేటికి తల్లి?'
అంతట కొమరత్త అమ్మ సిరిదేవి
భక్తునికి యిరు పార్శ్వభాగము
లుండిరి
పందుముల యరణప్ప,
పైడివారమ్మ
సంతస అగుమంచి, చట్టవారి సతి
అప్పలు చెల్లెంద్రు అందరు వచ్చిరి
వదినలు మరదంద్రు వచ్చి
రందరును
తెరల చాటుననుండి మరదండ్లు
చూచిరి
కాశి తీర్థము యిచ్చె కలవారికెల్ల

## పాపనూక యెచ్చట నున్నదని భక్తిరన్న అడుగుట

'కంచంత బలము కలవారిగ జూస్తి
అప్పల చెల్లెంద్ర అందర జూస్తి

అమ్మను జూస్తిని అత్తల జూస్తి
నమ్మితి గద పాపనాతి యేదమ్మ?
పందుముల వారి బలగము జూస్తి
యెందున పొడగాన యేదమ్మ పాప?
వల్లవుల వారినెల్ల వరసతో జూస్తి
తల్లి! పాపమ యేది?
తడవాయె రాదు!
తిరుమందులవారి తీరెల్ల జూస్తి
తీరుగా నా చెల్లె దివాణమున లేద?
అంత మ్రొక్కినయట్టి అప్పల
జూస్తి
యింతి పాప యేదమ్మ?
యెంత సేపాయె!
చేరి మ్రొక్కినయట్టి చెల్లెండ్ల జూస్తి
గారాబమౌ పాప కానరాదమ్మ!
నేతివారిని జూస్తి, నాతుల జూస్తి,
భ్రాంతియయ్యెను చెల్లిని
పలికించు నాతో
మర్ల వారిని జూస్తిని మగువల
జూస్తి

పొర్లెను మనసును పొడగానవైతి!
చల్లవారిని జూస్తి, సఖియల జూస్తి,
నలినాక్షి చెల్లెలు నాతులతో లేదు!
ముచ్చట అవు పాప ముచ్చట విన్న
యెచ్చోట చెల్లిని యెద దలచినను
దవ్వుగ కాశిలో తలతు చెల్లెలిని
భవ్యమౌ చెల్లి నెడబాయదు మనసు
తల్లిదండ్రులు లేని తన చెల్లిమీద
వుల్లము యెడబాసి వుండదు నాకు
యేవేళ దేవపూజ యెలమితో జేయ
ఆవేళ చెల్లెలు ఆత్మలో నుండు
అగునుంచిని పాపను
అమ్మరో! నిన్ను
తగ సమానముగ చూడ
తగుననలేద?'
భూతేశు భక్తుడు పొలతి పాపమను
ఆత్మలో తలపోసి అడలంగ సాగె.

## యరణప్ప భక్తిరన్నకు పాపసూక వృత్తాంతము చెప్పుట

ఆ సమయమున భక్తుడాడు మాటలకు
పందుముల యరణప్ప పాప
వృత్తాంతము
పొందుగ దెలిపెను పుణ్యగురువునకు
'వల్లవ భక్తన్న! వలపొయ్యనేల?
చెల్లెలు పాపమను చెప్పెద వినుము

పల్లికొండ రఘుపతి బంధువులెల్ల
చెల్లెలను మనుమివ్వ
చెప్పె బ్రాహ్మలకు
జన్మనక్షత్రము చప్పంగజూచి
ఫాల్గుణ అమవాస్య పగలు
బుధవారము

యిల్లట మివవచ్చు యిలువెళ్ళరాదు
మనుము యిల్లటమును
మరి యివ్వకుంటె
ఘనమేడ నుంచుమనె కళ్యాణ
చెల్లెలిని
కోపించి మేనత్త కొమరమ్మ లేచి
'యీపగిది వారింట్లొ
యిల్లడముకన్న
చెడి ఆడవులయందు చేరేది మేలు!
వెడగులమా' యనుచు
వెళ్ళి పోయినది

ఆవులన్నకు జాబు అపుడు
వ్రాసియును
ఆవులన్న వుత్తరము అందినవెనుక
కమ్మను జదివియు కలవారికి జెప్పి
అమ్మ సిరిదేవియు అయితన్నవారు
కట్టించిరి మేడను కనకపు పోడ
నెట్టన పాపను నీవొచ్చు దనుక
ఆరూఢిగా మేడ నమ్మవుంచినది
నెరమెంచకు యిడి నీకు చెప్పితిని.'

## పాపనూకను మేడ బెట్టినందులకు భక్తిరన్న దుఃఖించుట

'పాపను మేడుంచె పాపపు తల్లి'
కోపంబుతో తాను గోడు గోడడలె
మిన్నువిడిగి తనమీద బడ్డట్టు
కన్నుల వుదకము గగనమై కురిసె
'వల్లవ చరితలు వైనాన బాడ
కళ్యాణ చెల్లిని కని యిటు తెస్తి
యెల్ల లోకంబుల యెన్నిక గాగ
తల్లి పాపను విడదలచుట యెరుగ!'
తల్లివంకను జూచి దావాగ్నివలెను-
'యిల్లు సిరి దొలుగునని యెంచితే
అమ్మ?
పెండ్లి చేయక బంది పెట్టితివి నీవు
యేండ్ల తరబడి రాజ్యమేలగ దలచి

చేటు యెరుంగక చేస్తివా అమ్మ!
నేటికి చేకూరె యేమందు వమ్మ?
కట కటా! చెల్లెల్ని ఘాత చేసితివి!
పటునింద పాత్రైతివి పలువురి లోన
మేలు చూడగలేక యీలాగు చేస్తివి
యేల కట్టుకొంటివి యీ పాపమైన
ఆగురువు పల్లికొండ అటు
వూరుకొనెన?
బాగుగాదని చెప్పి మాన్పడా వారిని?
యెగ్గులు యిక మిమ్ము యెంచనేల?
శీఘ్రమే తమ్ముల చేర బోవలెను'

## యాదవకాంతలు కాశి తీర్థము గొని పాపనూక మేడకు పోవుట

అప్పల చెల్లెంద్ర అందర బిలచి
వప్పుగా తీర్థము వైనాన యిచ్చె
తల్లికి మేనత్తకు తగువారికిచ్చి
కళ్యాణ చెల్లెలికి కాశి తీర్థ మంపె
పసిడి చెరుగు చాటున పందుముల
యరణప్ప
కాశితీర్థము గొంచు కదిలెను తాను
కనక దండ అందలము కాంతలు బట్ట
గను యెక్కి యరణప్ప
కదలెను వేగ
చల్లవారు వేయించిన
చాలురావుల వెంట
వెళ్ళి పాలకి దిగి వెలదులు తాను
పైడి కుండల మేడకు పాలకి చేర్చి
నిచ్చెనలు చేర్చిన నెలతలు, యెక్కిరి
పైడి కుండల మేడపై పావురాలు
పద పద బెదరగ
పాప మేల్కొనియె
దిగులున చెల్లెలు దిగ్గున లేచి
తగ ధనకొండను తప్పక చూచె
'యెన్నడు రానివారు యెందుకొచ్చి
రాకొ!
తన్ను మేడకు పంపి తర్వాత
యిపుడు'
చేత నివ్వాళియు చెంబుల నీరు
పట్టించుకొనివచ్చె పరుగున పాప
అంది చెంబుల పాద్యము
అర్ఘ్యమైనంత
పందుముల యరణప్పను
పట్టుక పాప
అడలంగ సాగెను అమితముగాను
కనియరణప్పయు కన్నీరు తుడిచె
'యిందరు వచ్చితిరి యేమి కారణము:
విందు చెప్పు' మటన్న
యరణప్ప చెప్పె
'అన్న భక్తుడు వచ్చె అయితన్న
తోడు
కన్నుల నిను జూడగా బంపె చెల్లి!'
భక్తిరన్నని చెల్లి ప్రలపింప సాగె
'పుణ్యగురువు దెచ్చి బోనున ద్రోచె
కన్నుల జూచునా'? కనకన అడలె
'అన్నలతో బుట్టి (నెనరు)
యెడమాయ
పావురాలు తోడు పక్షులు తోడు
చిలుకల తోడును సిద్ధించె నాకు
కంబాలు తోడును గానుంటి యిచట
అన్నలు యెవ్వరు? అక్కలు
యెవరు?"
కన్నీరు గార్చును కళ్యాణము చెల్లి
'అన్న యిటు తేబట్టి
అగచాట్లు ఆయె
నందుల పుణ్య గురువు నాడొచ్చివేగ

పందుముల వారిని పరగ వల్లవుల
చరితాలు వైనాన సరగ బాడగను
తిలకించి కూర్చుండి తెరగెల్ల వినుచు
తాత బంధువులను తమవారి నెల్ల
ఖ్యాతిగా బాడంగ కడదాక వినియు
మారాచులకు జెప్పి మమ్ముల దెచ్చి
బోయల కర్పించి పోవుట యెరుగ!
కంటిమి కాలము కనడాయెనమ్మ!
వింటిమి యరణప్ప యీ చిత్రమేమి
భక్తుడు చెల్లెల భ్రమత పడ్డాడు
చిత్తాన దెచ్చుట చెల్లె నేటి?' కన

## పాపనూక మేడ దిగి రాననుట

చేతుల బట్టుక-'చెల్లెరో! యిపుడు
నాతి! మేడను దిగిరావమ్మ!' అనగ
'కాలము చెడుగాయెగద! మేడ దిగను
పాలేట అన్నలకు పగ చేరువాయె
యంతైన మేడ దిగను యనిపల్కె-
పాప
అంతట కాశి తీర్ధము యరణప్ప
యిచ్చె
కన్నుల కద్దుక కడుభక్తి త్రాగి-
'భక్తుడు కలుగుట భాగ్యము అబ్బె
అప్పలారా! పొందు' అన మేడదిగియు
అన్న సముఖానకు అందరు వచ్చి-
'అన్న పిలిచెనన అవుర్న అడలె
పంతమున దిగదాయె భక్తుడ!
వినుము
కస్తిపడి వేడుత కాశితీర్థ మిడ
కన్నుల కద్దుక కడుభక్తి త్రాగి
భక్తుడు కలుగుట భాగ్యమబ్బెనని'
యరగడ్డ పాటునుండి యరలెక్క-
పావురాలు
చేటువార్తనుతెచ్చి చెప్పపాపమకు

## భక్తుడు మునినది వద్ద గాయపడిన బసవన్నను చూచుట

చెల్లెల్ను అగుమంచి చేరంగ బిలిచి
..................................................
..................................................
వల్లవగురువు మల్లెవాగు దాటియును
అల్ల 'ముసి', వద్దకు అటు ముందు
పోయె.
ఆలోన బసవన్న అందరు సమయ
ఆలమందలు యెడ్లు యాదవ బలము
బాలరాజులు వారుగ పాలేటివొడ్డు
నీలకంఠుని కెదుర ని.. ..ర్త దెలుప
శిరసున నుండియు శ్రీపాదమునకు
శరీరమంతయును జర్జరితముగ
కసిగండలై యున్న గాయాలతోడ

'ముసి'వద్ద కొచ్చెను ముక్కంటి
మూర్తి
కాలాంతపుణ్యుండు కాశీనివాసి
ఫాలలోచను డైన బసవదేవునికి
వెదకిన నువ్వుగింజ వెయ్య
యెడము లేక
యెదురొమ్ము పోట్లతో అల నందివచ్చె
ప్రక్కను లింగసుళ్ళు
పరుస వేదియును
ప్రుష్ఠైను పోట్లతో చూడ గురుతవక
పోట్లను రక్తము పొటపొట గురియ
యేట్లోకి బసువన్న యెదురుగా వచ్చె
బసువన్న రాగాను భక్తుడు తాను
శిష్యులు యెదురేగి శీఘ్రమె చూచె
భక్తిరన్నను జూచి బసవదేవుండు

భక్తి కాలును దువ్వి పటురంకె వైచె
బసవన్న దేహము బాణాలు విరిగి
వెసరేగి పొడిచిన యీటెల పోట్లు
'కటకటా శంకర! కారుణ్యమూర్తి
యిటుల నీ రూపెరుగ కిటు బొడిచినారు
నీలకంఠుడ వని నిన్ను దెలియకను
ఫాలము నంబులు బరపిరి నిన్ను
అలనాడు త్రిపురాల అసురుల నెల్ల
యిల గూల్చినాడవు నీవు మహేశ!
కారణార్థంబిటు కావలసి అనిలో
నీ రూపు దాచితి వేల చింతింప?
ఆరువదేండ్లు చిత్రశా[illegible]ద్ధము
యిదియు
వారిగిరి తమ్ములు వగవగనేల?'

## భక్తిరన్న బసవన్నను అనునయించి ధనకొండకు బంపుట

అనియిట్లు బసవన్నను
అనునయించియును
మును గాయముల నున్న ములుకులు
దీసి
గాయాల రక్తము కారకుండగను
అయగారు వీభూతి అద్ది గాయముల
తీర్థప్రసాదములు తినిపించ పలికె!

'అర్థి జనావన! అతి వేగనీవు
తమ్ముల వార్తలు తల్లికి దెలిపి
కొమరత్త మొదలైన
కులబాంధవులును
అమ్మ వుండిన నగరు అగ్గిమట్టించి
యిమ్మగు కైలాసము యేగు'మటనెను

## భక్తిరన్న పాలేరు దాటి యుద్ధరంగమును చేరుట

అని చెప్పి బసవన్నను అంపి పీటికిని చనెను భక్తుడువేగ సమర భూమికిని

వొప్పుగా పాలేటి వుత్తరపువొడ్డు
తెప్పలై ప్రవహించ తిరుగు
రక్తమున
గుండాలు మడుగులు కుదిరిన జూచె
కండలు గుండెలు కడు శల్యములును
వెల్లిగా మడుగులకు యెగదట్ట చూచి
చెల్లున భక్తుడు శంఖు నదించె
భాగీరథి గంగను భక్తుడు చూచి
వేగ కావడి దించి యిటులాడ సాగె!
'కాలసంహారి! వో పాలేటగంగ!
వాలలు రక్తమును వైళమే యాడి
చాలగ సిదురించు శాంభవి వీవె
తమ్ముల వొప్పించి తగ కాశిపోతి
నమ్మి వెళ్ళినవారి నడిపాలు చేస్తి
ఆ యశోదకు పుట్టి యాదవులకును
ప్రియములు జూపించి
పెంపు వహించి
తరతరంబుల వారు తమ్మ సేవించి
సిరిసంపదలు గూడి చెలగిరో యమ్మ!
పాలవెల్లిగోత్ర బావమరుదులును
పాలేట చెల్లిరి పలుకవా నీవు?'
గుంటి గంగను బల్కి
గురులింగమూర్తి
గుంటి గంగకు భూతి గొబ్బున నలది
కాశితీర్థము పులకాపన చేసి
వాశిగా నైవేద్యము వలనుగ బెట్టి
తాంబూలమును ధూప దక్షిణలొసగి
అంబుజాక్షికి మ్రొక్కి అటు
తర్లె గురువు.
వొడ్డునెక్కి కదలి వొచ్చి భక్తుండు
అడ్డమౌ నేరేళ్ళ ఆ వాగుదాటి
తమ్ములున్న రణము తాపార జూచె:

## భక్తిరన్న యాదవులు పడియున్న రణభూమిని చూచుట

అమ్మ హేశ్వరులును ఆ భక్తిరయ్య
యిరువంశములవారు యరగడ్డపాట
వొరిగియుండుట జూచె
వల్లవుల గురువు
సిద్దిరాజు బలము సేనలు జూచి
యెద్దులావుల జూచి యేనుగుల చూచి
గుర్రాలు లొటిపిటలు కూలుట జూచి
వర్రుగ కాలార్లు వరుగుట జూచి
తమ్ములు చేసిన ధర్మ యుద్ధంబు
యిమ్ముగ వేడుగ వెస తిరిగి జూచి
కనిచూపుమేరను కల్లిమధ్యమున
మునుములు రథదంతి మొగి
హయములును
రథసారథులు వున్న రాజులు
దొరలు
వితథమై వొరిగిన విధమును జూచి
తెగిపడ్డ శిరములు తేలు మొండెములు

వగరించు లొటిపిటలు వణకు
గజములును
గుబ్బలు విరిగిన కొన్ని రథములును
బొబ్బలు పెట్టుచు పొర్లు
హయములును
దండెలు విరిగిన తగు పాలకీలు
మెండుగ తెగిపడ్డ మేలు ఛత్రములు
వాపోవుచున్నట్టి పరిజనంబులును
చూపుమేర వుభయవైపుల జూచి-
'యెంతటివారైన వెయ్యేండ్లు మనరు
యింత చాలదె కీర్తి యెన్నాళ్ళకైన?'
అనుచు సంతసమున ఆభక్తిరన్న
తన తమ్ములుండెడి తమకము చెంత
నలుబది స్తలఖాల నాముగుదారు
కళ దప్పియుండుట ఘనుడు
తా జూచె
గోపకులు పోట్లతో గూడార్లవద్ద
యేపుడిగి పడియున్న
విధమును జూచె

## భక్తిరన్న కాటమరాజు కళేబరమును చూచి శోకించుట

ఘనుడైన తమ్ముడు కాటమరాజు
పైన గప్పిన శాల్వ ప్రక్కకు దీసి
తమ్ముని ముఖమును తా జూచి
అదలె:
'ప్రేమతో ఆవుల పెద్ద భూపతియు
తల్లి పెద్దమ్మయు తనయుల కొరకు
కళ్యాణ శంభుని కదువేట్క నోమి
వరమున గన్నట్టి వంశపావనుడ!
పరివీరకల్లుగా సరదార్ల దొరల
యేదుతరాల పగలు
యెదను పాటించి
పుడమార్చి రణమున పొలికల్లు జేసి
వలసిద్ధిరాజును ననిలోన జంపి
బలువు గాయాలతో పడితివి నీవు
యెదయందు తమ్ముడా!
యెనిమిదిపోట్లు
నుదుటను చూపట్టె నురువగు పోట్లు
అలనాడు జెప్పిన అనతి మీరు
వలనుగ పోట్లాడి వరిగితి విచద
దయగల మీ తల్లి తనయుల కొరకు
వేయి నోములు నోచి వెస
నిన్ను గనెను
కొన్ని నోములు నోచి కూతును
గనెను
అన్నకు చెల్లెకు అన్యాయ బ్రహ్మ
సన్యాసి బ్రతుకుగ
సమకూర్చి వ్రాసె
వొప్పుగా తలిదండ్రులు వున్న
రోజులలో
గొప్పగా పెంచిరి కూర్మి మోహాన
అంతలో వారికి అంత్యంబు నిండ

చేంత పెరవారల చేతికి మిమ్ము
(అప్పగించి)
అగ్నిగుండము జొచ్చె అమ్మ
పెద్దమ్మ
ప్రెగ్నెతో ముదితల్లి పెంచెకొన్నాళ్ళు
అంతట వుండనీక అయ్యః నేవచ్చి
పంతమాడియు దెచ్చి పట్నము జేర్చ
పలికొండ సిరిదేవి పాపమెంచకను
ఆలమందకు పంపి అడవి పాల్జేసిరి
యిల్లడ ముంచక యెటులో సిరిదేవి
పెళ్ళిజేయక చెల్లిని పెట్టెను మేడ
అన్నకు అడవిల్లు అనుజ కాకసము
కన్నతల్లి జేయున ఘాతకమిట్లుః
అన్నదమ్ముల పుత్రులము
అందరము మనము
యెన్న అన్యాయము యెవరికి లేదుః
యెన్నడు నిను జూతు యేమి
చేయుదునుః
అని యిట్లు తమ్ముని అలుముకి
యేడ్చి

## తమ్ముడు అయితమరాజు కళేబరమును చూచి భక్తిరన్న దుఃఖించుట

తమ్ము డైతమ రాజును
డాయంగ వచ్చి
యిమ్ముగ శాలువ విడదీసి జూచి
అయితన్న ముఖమును హరహరా
యనుచు-
'వయితరిగి రణమున వరిగితివి
అనుజః
పన్నుగా యలమంచి ప్రభువైన దాది
యెన్నడు కష్టములు యెరుగవు నీవు
ఆవులన్నను గూడి అలంబులోన
నీవు యుద్ధము జేసి నిలిపితి కీర్తి
సిరిదేవి మాటలు చిత్తమున నిడక
అరిగి అన్నన గూడి ఆలము జేసి
వురువు గాయాలతో వొరిగితివి
అనుజః'
అరుదయ్యెనని కొనియాడి అటు తర్లి

## కరియావుల రాజును చూచి శోకించుట

కరియావులరాజు కడకు నేతెంచి
వలిపెపు శాలువ వర్జించి కడకు-
''చెలువుగ సింహాద్రి శేఖరు కూర్మి
కరపుణ్య రణశూర! వంశపావనుడ!
వోరుగంటి ప్రభువులకు వురువగు
సురియః
పానుగంటి రాజు ప్రక్కలో
సురియ!

ఘనకరి ఘటవైరి! కరియాల రాజ!
పల్లవ రాజుల బలముల మీద
చెల్లుగా పోట్లాడి వేతుల దట్టి
వొళ్ళెల్ల గాయాలు వొప్పుగా నాటి
కల్లిలో వొరిగితివి ఘనరణశూర!
చెల్లు నీ' కని యిట్లు చెలగి
పల్కియును

## భట్టావుల రాజును చూచి శోకించుట

వచ్చెను భట్టాల వల్లభు కడకు
వొచ్చియు భక్తుడు
వొనర యిట్లనియె:
'కట్టడి రణశూర! భట్టాలరాజ!
ఘోటక ఘటమాల కొట్టి చెండాడి
తీరుగా రణకేళి తేలితివి అనుజ!
వొరుస శత్రువులను వుర్విపై గూల్చి
బరువు గాయాలతో పడితివి కలను'
పరి పరి కొనియాడి భట్టావుల
రాజును

## పెయ్యాల యర్రయ్యను చూచి శోకించుట

నిజగురువు అటనుండి నేగి
యావలను
బెజవాడ బెబ్బులి పెయ్యాల
యర్రయ్య
కడనిల్చి పైనిండ గప్పిన శాల్వా
కడకును దీసియు కన్నుల జూచి-
'మరి నీవు బెజవాడ మల్లప్ప కరుణ
వుర్విని బడగానె వోపుణ్యమూర్తి!
దరికొని కాలెను తగ వాడ నాడు
అందుకు బ్రాహ్మలను అడుగగ
చెప్పిరి
మందసమున నుంచి మడుగు
ద్రోయుదని
గండాన బుట్టెను కనుక
యీ బాలుడు
వుండ కీడవు నన వొగి చేసి రటుల
మడుగున దిగి స్నానమాడను
మునుగ
జడిమందసమునంటి జలధిపై లతల
పడి చుట్టుకొని యున్న మందసము
రాగ
తలుపులు సడలించి తాళములు తీసి
పోలికలు జూచియు పూర్వస్మృతి
వచ్చి
తమ్ముడంచెంచియు తగ విచారించి
అమ్మ కరువవుట మేనత్తకు యివ్వ

అత్తగు చట్టి మారమ్మ తా గొనియు
యెంతయు ప్రేమతో యెత్తుచు పెంచి
కూర్మితో తనుగన్న కొడుకు
యర్రయకు
సమముగా పెంచెను సారసగంధి
'బెజవాడ బెబ్బులి'గ పేరు వహించి
భుజబలమున శత్రువులను ఖండించి
పాపసిద్ధి ప్రభుని బవరాన గూల్చి
యేపుగా శానల విడబడి నరికి
కదసిన సేనల ఖండించి పైచి
తుదకిటు రణములో తుదిముట్టినావ॥'
అని యిటు తమ్ముని అటులాడి కదిలి

## తన చిన్నతమ్ముడు ముమ్మయ్యను చూచి భక్తిరన్న అడలుట

చిన్నితమ్ముడు ముమ్మయను
చేరంగ బోయి
కదనిల్చి భక్తుడు కన్నీరు గార్చి
అడలుచు బలికెను అన్న తానపుడు-
'చిన్నితమ్ముడ! నిన్ను చెలగ
పురినుంచి
అన్న పాలేటికి అరిగిన వెనుక
నీవైన వంశము నిలుపగలేక
నీవు రణానికి నేగంగ నేల॥
పల్లవ గోత్రజుల వంశమంతయును
పల్లవరాజుల బవరమునందు
వంశక్షయము గాగ వ్రాసెనా
బ్రహ్మ॥'
సంశయమును వీడి సర్వజ్ఞమూర్తి-
'అన్నదమ్ముల పుత్రులందరు మీరు
పన్నుగా పాలేటి ప్రక్కను గూడి
వొక్కరొక్కరు యెదిరి వైరుల మీద
చక్కగా పోరాడి సమసితి రిచట
యీ కీర్తి జగములో యెన్నాళ్ళకైన
ప్రాకి వీరకథల ప్రజ లెన్నుచుంద్రు॥'

## పద్మరాఘవుని కళేబరమును చూచి భక్తిరన్న శోకించుట

తమ్ముల గొనియాడి తానటు కదలి
పద్మరాఘవు చూచి పలికె భక్తుండు॥
'మరిది పద్మరాఘవ॥ మండ
లేశ్వరుడ॥
అరుదయ్యె నీ చెలిమి అనుజుని తోడ
కులమున వెలమవు చెలిమిన్ని మరిడివి
చెలికాండ్ల చిత్తమా! చెరగున పైడి!
నాదెండ్ల పైడివార్లకు పెండ్లికొడుక!
విప్పర్ల సింహమ! వీటికి రాజ॥
విప్పర్ల నీవు బుట్టి విలయెల్ల యేలి
తమ్మునితో చెల్మి తగ నీవు జేసి
యిమ్ముగ ధేనువుల నెల్లెడ మేపి

మేలు కీళ్ళకు మాతొ మెలగితివి నీవు వీరులకును నీకు వేరు లేకుండ
కలియుగమున వీరకథ లెన్నినాళ్ళు జరుపుదు రెప్పుడు మరిది
నిలుచునో అన్నాళ్ల నీకీర్తి నిలుచు! నాయుండ!'
రణవీర తమకాన రాజుసన్నిధిని
ఘనముగా అవుసరాలు
కడు భక్తితోను

## పుత్తమరాజును జూచి శోకించుట

పొందుగా తిరుమందుల పుత్తమరాజు వితరణ గుణశూర! యేకైకవీర!
చందము జూచియు జాలి భక్తుండు! వోరుగంటిలోన పోరులుగెలువ
'కొమరత్త సుతుడవు ఆ రెక్కలశ్వము వాహ్యాళి వెడలి
గుణ విశాలుండ! స్వారి చేసియు దాని సమయ
సమర విజయ! శత్రుసైన్యాల వైరి! జేసితివి!
తమ్మునితో రణస్థలిని పోరాడి తమ్ముడైతన్నకు తగు ప్రధానివిగ
సమ్ముఖమున సింహాసనమున నుండి అమ్ముల పాలైతివయ్యా వో మరిది!
క్షితిని పాలించియు చిరకీర్తిగనియు యిమ్మహి నీకీర్తి వెలయు'నంచరిగి

## అల్లుడు పోచయ్యను జూచి వగచుట

అల్లుడు పోచయ్య నటు చూచి కలను ధిక్కరించిన వారి తివిరి చెండాడి
వల్లవ గురువు తా వగవంగసాగె: పెక్కురు మన్నీల పృథివిని గూల్చి
'చక్కని పోచయ్య: చెల్లెలి కొడుక వురువు గాయాలతో వొరిగితివి
వెక్కస రిపులను వెన్నులు విరచి అల్లుడ!

## నాచకూళ్ళ నాయుని చూచి దుఃఖించుట

మరి మరి స్మరించి మగి యటు అడలి నాచకూళ్ళ నాయుడా! నా చిన్న
నాచకూళ్ళ నాయుని నడిగల్లు జూచె: మరిది

వాసిగ రణమున వైరులమీద పురువుగా గాయాలతో వొరిగితివి
చేసి ఘాతలు వారిని చెండు చెండాడి మరిది!
పోరాడి రణమున భూపతుల గూల్చి

## చట్టువారి యర్రయ్యను జూచి శోకించుట

రట్టడి శూరుడు చట్టివారి యర్రయ్య వయ్యన రణములో వరిగితివి
అట్టె రణమున గూలుటది జూచి మరిది!
బలికె: అయ్య కీరితి కాముడ' వని పల్కె
'యెలమితో పెయ్యల యర్రన సరస కదలి
చెలికాడ! పడితివా చేసి యుద్ధమును దామసాని వెంగళు తనయుని జూచి
భీముని రాముని పేరెన్నికైన 'వేమారు శత్రుల యేపణగించి
సామజంబుల వైరి చట్టవారి యర్రయ్య అల్ల మీ మేనత్త ఆల పెద్దమను
మత్తేభములనెల్ల మట్టి మల్లాడి తలచియో కాటమధవుని చెంగటను
యిత్తెరంగున పెయ్య లెర్రయ్య వొరిగితివి ధరమీద వో చిన్న మరిది!
యెదుట

## తమ్ములను మరదులను తలచుకొని భత్తిరన్న విలపించుట

అని యిట్లు భక్తుడు ఆ రణభూమి 'పేరు కీర్తులు గన్న బిరుదాంకులార!
చని చూచి యెల్లెడ చాపకట్టుగను నెరవైన రణరంగ నిశ్శంకులార!
తమ్ములు మరుదులు తగిన సత్యమే జయమన్న సర్వజ్ఞులార!
బాంధవులు నిత్యులైన మీరే యీ ధాత్రిలోను
ముమ్మరమగు పోట్లు మూర్ఛలు పాలేటి పిదులు పరము పుణ్యులును
చోయి పలుకరు నాతోను భక్తుడ నేను!'
కళదప్పియుండుట కల్లిమధ్యమున అడలుచు బలిచిన ఆ పుణ్యగురువు
వల్లవ తిరుమందుల వునికిని జూచి కథ కొకర్రైన పల్కరు భక్తుతోడ

## భక్తిరన్న పడియున్న పల్లికొండను అవతారమూర్తిగా కీర్తించుట

హరి గురువు కడనిల్చి
ఆ భక్తిరన్న
పరదక్షిణము జేసి పడి సాగి మ్రొక్కి
పరమాత్మ: గోవింద!
బలభద్రమూర్తి
ఆదినారాయణా! అజుడ! గోవింద!
మత్స్యమై జలధిలో జొచ్చి వేదములు
తెచ్చి బ్రహ్మకు నాడు యిచ్చిన దేవ!
కూర్మమై నగమును కుదురుగామోసి
వేమారు దివిజుల యేలితివపుడు
వారాహరూపము వయ్యన దాల్చి
హైరణ్యనేత్రుని హతము జేసితివి
నరసింహమై హిరణ్యకశిపుని
ద్రుంచి
కరుణించి ప్రహ్లాదు గాచితి వపుడు
వామన మూర్తివై వచ్చి యా బలిని
భూమి దాన మడిగి పుచ్చితి వటకు
పరశురాముడవై పరగి లోకమున
కార్తవీర్యుని ద్రుంచి కీర్తి జెందితివి
దశరథ సుతుడవై తాటకి ద్రుంచి
కుశికు యాగము గాచి గూడియు పోయి
శంకరు విలు విరిచి జానకి గొనియు
లంకరాక్షసుల నిశ్శంకతోగూల్చి
పొంక మణగించిన భువన రక్షకుడ!
గోపాల కృష్ణుడై గోవులగాచి
వ్రేపల్లె యందుండు వేల గోపికల
మనసున దనరూపు మరి యుండజేసి
కంసాది రాక్షస గణముల దునిమి
వంశపావనుడవై వర్థిల్లినావు
నీ మహిమ వర్ణింప నిఖిల లోకముల
వేమారు వెదకిన యెవ్వరులేరు
యిరు వంశముల యున్న యెల్ల
యాదవుల
గురుమూర్తి వగుచున్న
కులపావనుండ:
హరి! మాకు దిక్కివె వరపుణ్యశాలి!
పరమాత్మ! దిక్కివె! పలుకు
నాతోను
నినుగూడి తమ్ములు నీరణస్థలిలో
అనిజేసి వారిగి యున్నారలు వీరు
యీడు జోడుగ తమ్మ లిరుగడ
మరుములు
వీడక పోరాడి యిల గూలియుండిరి
కాశి తీర్థము యిచ్చి మనుల నందరిని
వాశిగా కైలాసవాసుల జేయ
కాశితీర్థము దెస్తి కనుము భక్తుడను
బావరో! నాతోను పలుక వదేమి?"

## భక్తిరన్నకు శివుడు ప్రత్యక్షమగుట

యీవిధి నడలిన యేమనకున్న
'రఘుపతి మిము గూడి
రణరంగమందు
పగతుల కెదిరించి బవరంబు చేసి
సమర రంగంబున చావలేదనుచు
నీమదినుంచితో యేమన విపుడు
చూడు' మటంచును శూల మెగ వైచి
పడు శూలమునకును పట్టె రొమ్మెదురు
తొలకరి మెరుపు నా దూరము కెగయ
శూలము దివినుండి సుర లందుకొనిరి
పర్వత మల్లప్ప పయనమై వచ్చె
గురుడున్న చోటికి కూడి ప్రమథుఁతో
భక్తుని యెదుటను ప్రత్యక్షమైన
భక్తి సాష్టాంగము పడి మ్రొక్కె
గురువు

## కొమ్ము కసినేడు భక్తిరన్నను జూడవచ్చుట

కొప్పుకొండ నున్న కొమ్ముకశినీడు
అప్పుడు రణభూమి నటు పారజూచె-
'నాలుగు పూటలు నయ్యె నేటికిని
డాలు డమామీలు తగ గొడుగులును
గురుతుగా నున్నవి గుడి గుడార్లిచట
పెరువారు రణభూమి పరగ
వొచ్చిరాలా
కాశిబోయిన యన్న ఘనుడు
భక్తుండు
వాశిగా రణభూమి వచ్చియున్నాడా
తెలియవలె' నని కొమ్ము
తెరగొప్పనంది
వల భుజముపై నిడి వచ్చె అచ్చటికి
సాగిలబడి మ్రొక్కె సరగ భక్తునికి
బాగుగ దీవించి భక్తుడిట్లనియె!
'నలుబదేండ్లయె కొమ్ము నాదము
వినియు
కలగ కొమ్మూదుము కశినీడ:నీవు'
గురువు జెప్పినమాట గొబ్బున
వినియు
పరిపరి విధముల పట్టెను కొమ్ము
ప్రణవ నాదంబుగా ప్రజ్వరిల్లగను
విని కొమ్ము నాదంబు యీశ్వరుడు
మెచ్చె
శింగినాదము కొమ్ము శివయోగి
యెదుట
ఖంగున మ్రోయంగ కని భక్తు డలరె

## చనిపోయిన యాదవ వీరులకు గంగ ప్రాణములు పోయుట

రణము కావలియున్న రణవీరగంగ
ప్రాణాలు యిడి లేపె పరమపుణ్యులను
వీర మాహాత్మ్యము వెలయంగ వారు
వీరులై శివలీల వెస నాడి రచట
శిరసుల వెంట్రుకలు చెదర
నాడుచును
'హర హర లింగ! శివా! హర!'
యనుచు
వల్లవు లానంద మొప్పగా నాడిరి
యెల్ల తిరుమందులు వుల్లాసముననను
'నరహరి! గోవింద! నారాయ'ణనుచు
పరిపరి విధముల పలుకుచు నాడిరి
'హరిహరి గోవింద!
హరి ముకుం'దనుచు
శరణు జేయుచు లేచె సరగ పలికొండ
యెల్ల వీరుల తాము యిట్లని రపుడు

## వీరకథ యెల్లకాలము నిలుచునట్లును, యర్రగడ్డపాడు పుణ్యక్షేత్ర మగునట్లును శివుడు వరమిచ్చుట

మల్లికార్జుని జూచి ప్రమథుల జూచి
పల్లెకొండను జూచి భక్తుని జూచి!
'యెల్లకాలము నిలువు డీ వీరకథలు!'
వల్లవులు తిరుమంధులు వందనము
చేయ
'వల్లె' యనుచును నవ్వె అల్ల
మల్లప్ప
'వీరులై మృతిబొంది వీరస్వర్గంబు
పరగ కాశి జలము పాలేటి నీరు
వెలయు శ్రీశైలమై యిదె
లింగగిరియు
విలసితముగ కలిని యెరగడ్డపాడు
యిదె పుణ్యక్షేత్రమగు యెరగడ్డ
పాడు!'
విరివియౌ పాలేటి వీరు లెల్లరకు
బోరున ప్రాణాలు బొందులు వీడె
పలికొండ భక్తుడు పరగ వీక్షించి
తాలిమి చెడి కొంత తడవు చింతించి
'కశినీడు! ర'మ్మని గారవించియును
'పసి బిడ్డ లాదిగా పరగు మీరెల్ల
తర తరముల నుండి దైవయోగమున
బిరుదులు వాయించి బిడ్డల మారు
వేరు బంధము లేక యెల్ల కాలంబు
కోరికతో యింటి కొడుకుల రీతి
మేలు కీళ్ళకు మాతో మొలగితిరి
మీరు
కల కాల మిట్టులే కలుగును మీకు!'
అన్న అనుమతి చేత అకశి నీడు
మదన్న సంహారు డిటు మన్నించి అరిగె పన్నుగా జనె అటుబాసి రణభూమి.

## భక్తిరన్న చాగలకొండకు వచ్చి చల్లవారికై విలపించుట

ఆగత మెరిగి భక్తుడా పల్లికొండ
చాగల కొండకు చనుదెంచి రపుడు
చల్ల వారలు పోట్ల సమిసిన విధము
అల్ల రఘుపతి భక్తుడటు జూచి
యచట
పిల్ల యేరుగ రక్త పోర్లిక జూచి-
'చల్ల నా తమ్ములు! సాహసులార!
బలువు యుద్ధము జేసి పగతుల
ద్రుంచి
యిల గూలితిర మీరు వేరు వేరుగను
చల్ల పిన్నమరాజు! సాహస ఘనుడ!
బరువుగా యెదురొమ్ము బాకులు
నాటి
వొరిగితివి ధరమీద వో పిన్నమయ్య
చిన్ని నా తమ్ముడా! చెలగ
నారాయణ!
మన్నె మూకల నెల్ల మహి మీద
గూల్చి
యెన్నియో మొయినిండ యీటెలు
నాటి
వొనరంగ ధర మీద వొరిగితి
విచట
గుణ ధీరుడా! చల్ల గోవింద! నీవు
చందమామను బోలు అందమౌ
మోము
సందేహమును లేక సర్వ దళములను
నుఱుమాడి రణభూమి వొరిగితివి
నీవు
వీరుడ వను పేరు వెలయంగ జగము
పొంకమౌ తమ్ముడ! వెంకటశౌరి!
శంక యెంతయు లేక సైన్యము
ద్రుంచి
మూల బలము తరిగి మొన విడ
బొడిచి
బల్లెములు యెదురొమ్ము బలువుగ
నాటి
కల్లని వొరిగితిగా వెంకటాద్రి!'
అచ్యుతుడు వొరుగుట అచట
జూచియును
వొచ్చియు భక్తుడు వొర్గించి బలికె:
'చల్ల అచ్యుతుండ! సమర నిశ్శంక!
యెల్ల వైరుల సేన యేపణగించి
మచ్చరంబుగ పోరి మన్నీల జంపి
హెచ్చుగా అలుగులు యెద యందు
నాటి
యియ్యెడ రణములో యిటుల
గూలితివ!
అయ్యయ్యో తమ్ముడా!' అని
పలవించి,
బంధువులను జూచి మరుదుల జూచి,
'పందుముల గోవిందు! బలు
పరాక్రముడ!
తమ్మునికి ప్రధాని! తన చిన్న
మరిది!
అమ్ముల పాలైతి వయ్యయో'
యనుచు

వల్లవుల తిరుమందుల వైన వైనాన
అల్ల రణమున వెదకి అందర జూచి
'చాగలకొంచ రణసాహసులార!
త్యాగ మూర్తులార! ధన్యాత్ములార!
కాశి తీర్థం బిదె గైకొను' డన్న
వారిగా పిన్నముకు పలికె నిట్టులను.-
'శరణార్థి! శరణార్థి! శంకర వినుత!
వేరుగా జూస్తిరి యెల్ల కాలమును
గతమైన మాటలు కదప నేమిటిక
చతురంగ బలమును సాహస మెదిరి
మాఘ బహుళ సప్తమి అది
మొదలుకొని
అష్టమి నవమి దశమి అదరక
మేము
చలమున నెదిరించి చాగలకొండను
బలముల గూల్చియు ప్రఖ్యాతి మించి
ముందిర శౌర్యము మ్మైన కెరుకపడగ
పొందుగా పోట్లాడి పొలిసితిమి
యిచట
మా రణముకు రాక మమ్మాదరింపక
యరగడ్డపాటికి వెళ్ళియు నీవు
తమ్ముల ముందర తగ నాదరించి
మమ్ము వేరుగ జూచి
మాట్లాడుచుంటి
కల కాలమిచ్చట కనిపెట్టుకొనియు
నిలచితి మిటురాక వలపక్ష మాయె
వీరమాహాత్మ్యము యెల్లకాలంబు
మేరలు మీరక యేర్పరచు' మనిరి
అని యిట్లు చల్లవారు అడిగినందులకు
విని పల్లెకొండయు విశ్వేశనుతుడు
'పాలేటి నెలకొన్న భాగీరథి గంగ
యిలలోన శివలీలలు యెసగిన వారికి
వీరగంధము జందె మిచ్చి యామీద
పేరుగా గొలుతురు పెంపుగా నెపుడు
సాక్షాత్తు శివురాణి జలదేవి గంగ
యిచ్చోట చెల్లితిరి మీరలు గనుక
వీరగంధము జంధ్య మెసగి సాంబ్రాణి
వరధూప నైవేద్య మొనర చేసియును
పాలేటి వీరులకు పరమ పుణ్యులకు
యిల మీకు యెందును వేరు లేకుండ
కొలుతురు మిమ్మెపుడు కులము
వారంత

## భక్తిరన్న మంగలిపాడు వచ్చి ఒరగిన బొల్లావును వీరనేని జూచి దుఃఖించుట

చాగల కొండవిడి సరగునవారు
మగిడియు వచ్చిరి మంగలిపాడు
బొల్లావు పోట్లాడి భూపతుల జంపి
బలువగు సిద్ధిరాజు బలముల నెల్ల
చెల్లగ పొడిచియు చీకాకు పరచి
ఆకు యెడములేని అమ్ములు నాటి.

యేకాదశీనాడు విష్ణుపురి యేగె
ఆ రణమున చెల్లిన ఆవును జూచి
బీరు నాయని జూచి పేరెత్తియడలి
మాను వొరిగిన రీతి మరియుండ జూచి
తను గొలుచు గోసంగిదళములు చుట్టు
అనువుగ రణములో హతమైన జూచి
పగవారు గోసంగి బలముల మీద
తెగబడి చెల్లిన తీరెల్ల జూచి
గుర్రాలు యేనుగులు కుంభిణిమీద
వర్రుగా చెల్లిన వైనము జూచి
భక్తుడు పలికొండ పరగ నిట్లనియె
'వంతుకెక్కిన జాంబ వంశవర్ధనుడ
అలనాడు మసిలినీడు అరువదేండ్ల
మున్ను
బల్లికురువను పోరి బలముల గూల్చి
కల్లుగా పోట్లాడి చెల్లె మీతండ్రి
నేటికి బీరన్న నీవు యిచ్చోట
పాటి తప్పక పోరి పగతుల జంపి
గాటంపు అలుగుల గాయాలు నాటి
వొరిగితివి ధరమీద వో బీరినాయుడః
సిరిదేవి నిను బెంచి చేసే పెద్దగను
వేరు బంధము లేక వీరాజిలోను
గురుతుగా బాగాది గుండు సన్నిధిన
బీరినాయుని గుండు పేరెన్న బడును
వీర గోసంగుల బీరన్న నీకు
కలియుగ మందున గంగ సన్నిధిని
కొలుతురు నిన్నును కోర్కెతో
నెపుడు
కాశితీర్థం బిడి గోసంగి వీరునకు
వెస వచ్చి కూర్చుండిరి యీవలిద్దరును

## బసవన్న ధనకొండ చేరుట

బసవన్న ధనకొండ పట్టణము చేర
ఆ సిరిదేవి కొమరమ్మయు సతులు
బసవదేవుని జూచి భక్తినందరును
అర్ఘ్యము నైవేద్యమమరంగ నిచ్చి
సాష్టాంగ మొనరించి సర్వేశ్వరునికి
పళ్ళెమున నివాళి ఖామలు దెచ్చి
అల్ల బసవన్నకు అర్పించగాను
బల బల కన్నీరు పళ్ళెము మీద
కురియుట సిరిదేవి కొమరమ్మ చూచి

## యాదవకాంతలు గుండమున కాయత్తపడుట

గురువు చెప్పిన మాట గురుతులు
తెలిసి
అంత్యకాలము తమ కయ్యెనని
యెరిగి

పందుముల యరణప్ప, పైడివారితల్లి
సిరిదేవి వందనము చేసి రందరును-
'వుండరాదింకను వో కన్నతల్లి!
గుండముకు యత్నము గొబ్బున
జేయు!'
అగుమంచి నటు పిల్చి అమ్మ తెల్పగను
సగరుల పిలిపించి సర్రితవ్వ
గుండము
'అన్నలారా! నేను అతివల గూడి
పున్నెపు సీరాడ పోవలె నిపుడు
కొలను గావించుడు గొబ్బున మీరు'
అన సగరులు తాము అంతయు
త్రవ్వ
గంగ సన్నిధి నిల్చి కరములు
మొగిచి
గంగతోడుత పలికె గవురు
అగుమంచి:
'గొనకొని సగరులు గుండము
త్రవ్విరి
అనువుగ జలకము ఆడియు మనము
గుండాన బడవలె కోమలి యిపుడు
లెండు! పయినమయి లేచి రం'డనిన
'అన్నువ చెల్లెలా: అగుమంచి వినుము
యెన్న జనన మరణము లెదుగను నేను
మిన్ను మన్ను గలిగియున్న
దినములును
యెన్నియో యుగములు యెరిగితి
నేను
శివ విష్ణు బ్రహ్మలు చెల్లు దేవతలు
అవిరళ దిక్పాలులు అందరు చెల్లు
పుట్టుట గిట్టుట పొదము వారలకు
యిట్టు నిలచువారు యెవ్వరు లేరు
తనకు పుట్టుట గిట్టుట తథ్యము లేదు
విను విను చెప్పెద వెంది అగుమంచి
కలకాలమును ముందు కలియుగ
మందు
నిలుచును భక్తిని నీ వేగి యిపుడు
వొక్క ప్రొద్దుండియు వొప్పుగా నీవు
గ్రక్కున బోనంబు గావించి తెమ్ము!
జంట యెడబాయక సఖి! అగుమంచి!
వేడుకనుంటిమి విందును గుడువ'
గంగన మరితెలిసి కాంత అగుమంచి
సంగతిగా వచ్చి జలకము లాడి
పున్నెపునీరాడి పొలతి వేవేగ
అన్న లిచ్చిన సొమ్ములు
ఆభరణములు
ధరియించి అగుమంచి తల్లికి మ్రొక్కి
పరిజనులతోగూడి బాజార్లవెంట
తిరువీథు లూరేగి తెరువు నచటచట
తన వంటి సొమ్ములు తరుణుల కిడుచు
పనివడి ముత్తైదు పణతుల కిడుచు
కోటలు విడిచి పోవ గోపకాంతలును
వాటమౌ గాదెలు వరుస వస్తువులు
బొక్కసముల నుండు రొక్క-
జాలెలును
గ్రక్కున కొల్లబెట్టి కాంతలందరును
కొమరమ్మ సిరిదేవి గొబ్బున తాము
పట్టణములో నున్న ప్రజల నందరిని

యెట్టొ వలసలు బోవ వేగ చాటింప
పసిబిడ్డ బాలాది పలవరింపుచును
వెస దొనకొండ విడి యేగిరి ప్రజలు

## సిరిదేవి కొమరక్క లక్కసిరి కూటాలతో అగ్ని కాహుతి యగుట

దేశాది రెడ్లను తా సిరిదేవి
కరణాల కాపుల గ్రక్కున బిలచి-
'యిరువురకును ఋణము యిటు
తీరెనయ్యా!
అన్నలారా! మాకు అంత్యము నిండె!'
చిన్నబోయిరి ప్రజలు సిరిదేవి పలుక
గోడుగోడున ప్రజ గుబ్బటిలసాగె-
'యేడువ పనిలేదు యేలుకొండెపుడు
మామారుగా మీరు మా యన్నలార!'
కొమరమ్మ సిరిదేవి కూటాలనున్న
పదార్థపెట్టెలు పంట వస్తువులు
విదితముగా ప్రజకుయిచ్చె సిరిదేవి
ప్రాపులేకను ప్రజ పలవరింపగాను
తాపత్రయమునొంద తగదని
చెపుచు-
'కారణ మిటుల గావలసెను సుండి!
వారల నోదార్చి వగవకు డనుచు
సిరిదేవి తెలిపియు శీఘ్రముగాను
కొమరక్క సిరిదేవి గోపికా స్త్రీలు
తమ తమ కూటాల తలుపులు
మూసి
అగ్ని దరికొల్పిరి; అటులేగినట్టి

## అగుమంచి సొగుమానము

అగుమంచి గుండాని కాయత్తమాయె
మంటలు మండెను మింటి పొడవునకు
పంతమునను వచ్చెను బాలరాజుల
చెల్లెలు
వచ్చి చంపుడు కట్ట వరుసతో
నెక్కెను
హస్తములు మొగిచి అగ్నిదేవునికి
ప్రిస్తుతింప దొడగె పాలేటి వీరుల
గగనంబు భూదేవి వలరాజు దలచి
వప్పుగా వరములు వసరంగ నిచ్చె
హస్తములు ముకుళించె సభవారి
కపుడు
గుప్పున అగుమంచి గుండాన దుమికె
చమురు కుండలు వేసి సఖియలు
అడలిరి
పొగలుచు వెల వెలపోయి రందరును
గంధపు ప్రాకులు కడకును కదుల
పొందుగా కూర్చిరి ప్రోగుగానపుడు
చందనగంధియు సమసి మసి
యాయె

## బసవన్న ముక్కన్ను తెరువగా ధనకొండ పట్టణము భస్మమగుట

బంగారు కంబాన వరగిన బసువన్న
ముగురు మూర్తులదలచి ముక్కన్ను దెరిచె
భాషింప ధనకొండ భస్మమై పోయె
లక్కసిరి కూటాలు రాచ లోగిండ్లు
చిచ్చులు తగిలి కాలె సిరిదేవి కూటాలు
కొమరగిరి కూటాలు కొలిమిమంటలై మండె
అగుమంచి కూటాలు అగ్గి తగులబడెను
కాటమన్న నల గంగ కూటాలు కనుకులై మండె

బత్తుని నల్లమేడ భద్రాక్ష కూటాలు
భద్రాక్ష కూటాలు కాలి భస్మంబు లాయె
చిత్తర్వు కూటాలు చిచ్చులు తగిలె
కొల్లారు కూటాలు కొలిమి మంటలై మండె
కైలాసగిరికి కాంతలు పయనమైరి
కనక రథము లెక్కిరి గోపకాంత లందరును
పాపనూక మేడమీదికి పరమేశ్వరుండు
చిత్రబాణములు శివుడు శీఘ్రమే పంపె
పాపనూక మేడ భగ్గున మండె

## యాదవ కాంతలు కైలాస మేగుట

పాపనూక అగుమంచి పక్షిణిరథ మెక్కిరి
యెరణప్ప, తల్లప్ప, యేడాక్షి అక్కప్ప.
సిరిదేవి, కొమరక్క, సీతలందరూను
మరివేగ అగ్నిచే మడిసి రందరును.
బత్తుని నల్లమేడ, పణతి వీరగంగ,
కరియాపుల నాగ, కాంత లందరును

కనక రథములు యెక్కి కైలాస మేగిరి
కాంతలు రాగాను కరకంఠకుండు
బత్తినన్న కైలాస బండకడ నుండి
పాతేటి వీరులు ప్రఖ్యాతిగాను
బసువన్నకు దండప్రణామము చేసిరి
కరుణతో యాదవులు కైలాసమేగిరి

---

అనుబంధము – I

# యరనూక రాజు కథ

[ ఈ వీరగాథ మొదటి సంపుటమున పెద్దిరాజు కథకును పోలురాజు కథకును మధ్య నుండవలసిన మూడు కథలలో నొకటి ]

## అవతారిక

శ్రీలోలు గోపాలు చిత్తమున దలచి
రఘురామునకు మ్రొక్కి రమణ తోడుతను
ప్రేమతో పార్వతి పెద్ద సుతుండు
సర్వవిఘ్నేశుని సతతము దలచి
విష్ణు బ్రహ్మాను శివు వేడ్క ప్రార్థించి
వాణిని మదిని గీర్వాణి నుతించి
రాణించు శివురాణి రమణి ప్రార్థించి
కడువేడ్క ధనకొండ గంగను దలచి
కాళికాంబకు మ్రొక్కి కవుల కీర్తించి
ధారుణి తమకీర్తి దశదిశలందు
వెలుగొంద కృతులచే వెలసెడి భూమి
పూ చంద్ర గోత్రాబ్ధి పూర్ణ చంద్రుండు
ఆరూఢి వినిపింతు యాదవ చరిత
రమణతో యరనూక రాజు పోట్లాట
విఖ్యాతిగా విన వేడ్క సొంపెసగ
సరగ వేడ్కతో చెపుదు శ్రద్ధగా వినుడు.

## ఎరుకల పగ తీర్చుటకు యరనూక రాజు ఏనుగమలను నిలుచుట

అరయంగ యరనూక యాదవేంద్రుండు
గరిమతో రిపుగజ కంఠీరవుండు
వల్లవుల ఘనుండు వల్లాంబసుతుడు
యెరకుల పగకునై యేనుగమలను
యేపుతో నిలచెను యెదిరించి రిపుల

## యఱ్ఱభూపతి తన దళములతో యరనూకరాజుపై దండెత్తి వచ్చుట

అంతట యరభూప అవనీశు డనియె!
చయ్యన అనుజుల సభికులతోను!
'వీరశూరులు మీరు విక్రములార!
మనతోను యెదిరించి మార్కొని నిలచె
యెరుకుల పంపున యరనూకరాజు
పరగయోధులు మీరు పంతముమీర
యిపుడు యాదవుల మీరు ఇల గూల్పవలెను
కడువేగ తర్లుడు కదనము సేయ!'
రమ్మని మన్నీలకు రాజుత్రావాసె
అంపిన కమ్మలకు అవని కంపింప
కడువేగ కదిలెను కాలారి మూక
ధీరుని ఆనతి తీవ్రమై వచ్చె
ఘడియాలసములేక కదిలెను మూక
అతివేగమే దొరల అశ్వాలు కదిలె
తుములను కదిలెను దుర్గాల మూక
గోకార భూమేలు గుణుడగు రాజు
మరివేగ కదిలెను మన్నెమూకలతో
అంస్తానపుర మేలు అందెల సోమినీడు
మసలక కదిలెను మన్నెమూకలతో
పంతగిరి యేలేటి బరిగెల భామినీడు
ఆరూఢి కదలెను అలము సేయ
భూసాంగి యేలేటి భూనాయకుండు
ముదమొప్ప విలుమూక ముందుగా కదిలె
యిందుకూరు యేలు వీరశేఖరుడు
సయ్యన కదిలెను సర్దార్లతోను
గంధవతి యేలెడి గంగురాజును తాను
వాలాయముగ దండు వచ్చెను యెత్తి
పదివేల రౌతులు పక్కతేజీలు
మెండైన బలముతో మెరసి యేతెంచె
బల్లేలు యీటెలు బాణాల మెరుపు
చలగుచు దళములు సమకూడి నడచె
విండ్లు తుపాకులు వెలయంగ బూని
వయ్యన నడిచిరి వద్దె రౌతులును
మాతాపురము యేలే మహిమండనుండు
అరుదెంచె వేగమె అలము సేయ
శూలాల బండ్లను చొక్కుచు నడిచె
బండ్లపై యీటెలు బారులుగ నుండి
వరఫిరంగుల బండ్లు వసుధ కంపింప
దళముకు ముందుగా తర్లె నంతంత
ఘనవేగ నడిచెను కాలారిమూక
బహుళము కదిలెను భద్రగజములు
ఆవేళ చారులు అదిగెలు ఫౌజు
దండి యేనుగమల దరిసెసు దళము
సానకత్తులు జిబురు జంగుల వారు

మరివేగమున తర్లె మార్గాన ముందు
గొరకలు గిరికాండ్ల ఘోటకములతొ
ప్రతిమీరగ కదలె పాలె గాండ్లెల్ల
గజములపై ఢాలు కన్నోజి బలము
ముందుగా మన్నీలు ముస్తీదు కదలె
నేజాలు బల్లాలు నేపైన బిరిసె
గాటమా బండ్లును కదిలెను వేగ
గుజ్జరి దళములు గుర్రాల బారు
వాలాయముగ తర్లి వచ్చెను బారు
అరెమరాటీలు అతివేగ వచ్చె
శీఘ్రమె వచ్చెను చిల్లరి మాక
కడు వేగమే కదలి గక్కున వచ్చె
దొరలును మన్నీలు తోడి మూకలతొ
సరివారు కొలువంగ సరిదార్లతోను
మహి నెర భూపతి మరివేగ తర్లె
యేకవీర వెంట యేనుగు ఘటము
ఆరూఢి యరభూప అధిపతి నిలిచె

## యుద్ధమునకు కట్టాయత్తపడుడని యరనూకరాజు తన మంత్రి పులిముద్దు రాఘవుని హెచ్చరించుట

క్రమ్ముక బలములు కదదిగ గాను
వేవేగ యాదవులు వేగంబె అంత
అంతంత యరనూక ఆ రాజఘనుడు
భూపాలకుడు పులిముద్దు రాఘవుని
ఆరూఢి పిలిపించి అపుడిట్టు లనియె
'ధీరుడః పులిముద్దు దినకర తేజ!
తగువేట్క యరపతి దళములతోను
కలుపుక వచ్చెను కయ్యము నేడు
పసగ యాదవులెల్ల పంతము మెరయ
అనికి ముస్తీదు గమ్మని చెప్పుమనిన
రాయబారులు వచ్చి రాఘవ! మనల
రాజధర్మము కామ రమ్మని పిలువ
ముదమొప్ప దళముకు ముందెదుర వలెను
అనికి యెల్లగను కట్టాయత్త పడుడు'

## యరనూకరాజు యుద్ధమునకు సిద్ధమగుట

అనుచు యిట్లని చెప్పి ఆ రాజఘనుడు
వయ్యాన విడిదికి వసుధీశుడొచ్చి
జలకమాడి ధరించె చలువవస్త్రములు
తిలకము నుదుటను దిద్దెను రాజు
అన్నము భుజియించి ఆకుల వైచి
పగరతో పోరగ పయనమై రాజు
తుపాకి గుండులు దూరకయుండ
వాటమౌ మేనున వజ్రాంగి దొడిగి
చయ్యన కర్ణముల చౌకట్లు పెట్టి

యెలమితో రత్నాల వెలుగులు మీర
పొందుగ కంకణ భూషణములును
పసిమించు రత్నాల పచ్చల తాళి
వనరంగ ధరియించె వసుధీశు డంత
వైరుల చెండెడి వాటప్పిరంగి
చయ్యన ప్రక్కన సవరించి యంత
పరగ మిల మిలలాడు పై జార గట్టి
కడు వేగ రణమునకు
కదలుచుండగను

## ఎరుకులను శత్రువుల కప్పగించుమని యరనూక సీత భర్తకు చెప్పుట

అనువేగ యరనూక అతివ తా వచ్చి
తన ప్రాణవిభునితో తరుణి యిట్లనియె
'నరనాథ! యరనూక!
నా ప్రాణనాథ!
మనభూమి యెచ్చట?
మనూజేశా యిచట
పగవారితో పోర పయన మయ్యావు?
గజములు గలవాడు కయ్యాలబదేల?
మన్నించు నా తెల్పు మనవి ప్రాణేశ!
యెన్నాళ్ళు పాలగు యెరుకతో నీకు
యేమిటికి మచ్చరము?
యేలయ్య రాజ?
సంతతి కలిగింది సర్వేశుకృపను
మనసున దయయుంచి మచ్చరము
వీడి
అమరంగ యెరుకుల అంపుము వార్ని
పన్నుగ ప్రత్యక్ష ఫలమిచ్చె
హరుడు
ఆది విష్ణువు గొల్చి అటుమీద యిచట
పగబూనగా రాదు పట్టభద్రుండ!
వసుధీశ! పంపాద్రి వైశంబె పోయి
అన్నదమ్ములగూడి అరుదెంచి వెనుక
చలపట్టి యీ పగ సాధించవచ్చు
వైరము చాలించు, వాదేల మనకు?

## శరణాగతులను శత్రువుల కప్పగించుట అధర్మమని యరనూకరాజు భార్యకు చెప్పుట

కలకంఠి మాటలకు కలకల నవ్వి
తరుణితో యరనూక ధరణీశు డనియె
'భామరో! యీ బుద్ధి పలుక నీకేల?
దళముతో యత భూపధవుడు
తా నెదుర
పరగ యెరుకుల విడువ పంతంబు గాదు

పుడమిలో వలుతాజు పుత్రుడ నేను
మరుగు జొచ్చిన పీరి మరల
పట్టిచ్చి
యిటుమీద భూమిలో యెటులుండ
గలను?
యేమి బుద్ధులు మాను యెలనాగ నీవు
సామ్యము యెరుగువా?
సరసిజనేత్రి!
సతతము పక్షుల చంపెడి యెరుకు
పుర్వి నా పక్షులు వుపకార మనుచు
పరగ పక్షులు వాని ప్రాణములు
నిలిపె
వైర మెంచక పక్షి వాని రక్షించె

కాపోతములు వాని కాచిన వార్త
యెన్నంగ జగతిని వెలసెను కీర్తి
కదనంబునకు వెరచి కాచియు విడువ
దురమున పగతుల ద్రుంచుదు గాక!
ప్రాణము దాతునే! పణతి యరనూక!
అటుగాక వుపకార మన్ని దేశముల
పరలోక సాధన పణతి యరనూక!
చావును పుణ్యంబు సమరంబు నందు
కావించినాడిట్లు కపట నాటకుడు
అరులకు నెదురగ అనుమానమేల?
నూరేండ్ల కైపను నుదుట వ్రాతాను
యిందుకు చింతింప నేల లతాంగి!'

## యరనూకరాజు తన దళములతో యుద్ధమునకు బయలుదేరుట

భాను తేజుడు యిట్లు భార్యకు తెలిపి
పడతుల యెడ తగు వారిని వుంచి
చెలగి యాదవులకు చెప్పెను రాజు:
'పరువడి కొలువుడి భట్టావుల పతిని'
అని యిట్లు యాదవుల కళని
నొప్పించి
తరువాత కదిలెను ధరణీశు దంత
భేరి డమామీలు పెద్ద బూరలును
కన్నీలు రుంజలు కనక తప్పెట్లు
ఘుమ్మని మ్రోయంగ కేల
బంధువులతొ
చయ్యన కదిలెను సమరంబు సేయ

పడు వాగె తేజెక్కి పట్టభద్రుండు
తర్లిరి యాదవులు తమకంబు
మెరయ
జముజాలు యీటెలు చాయ
కత్తులును
పొదవైన విలుకాండ్రు పుడమి
కంపింప
పొందుగా తర్లెను పులిముద్దు
రాఘవుడు
కురుచ చౌకత్తులు గుజ్జరి బాకు
అమరంగ అందుక ఆపవువారు
సమరంబు కావేళ ధనుదెంచి రంత

తీరైన బల్లెములు తిరుగు కత్తులును
కనక నందులవారు కదలె పట్టుకొని
చంద్రగిరి యీాటెలు చేతి కత్తులతో
శానల గదిలించె జడదారివారు
గద లాయుధములు గండ్ర గొడ్డండ్లు
కదిసిరి పట్టుక గాంగేయువారు
లక్షణవరులు కల్లందులవారు
కదలిరి వేవేగ గజముల మీద
చక్రకూటులవారు శంకరువారు
చెలగి యేతెంచిరి సేనల మీద
ధీమంతులైనట్టి దినకరు వారు
ధీరత నడిచిరి, దివ్య బాణాలతో
బండారువారును బంతులవారు
కడు వేగ రణముకు కదలి రందరును
యెన్నిక తేజీల నెక్కి యిరుగడల
వేవేగ తర్లిరి యెల్లావులవారు.

## యాదవ దళములు యఱ్ఱభూపతి దళముల నెదుర్కొనుట

యేసుగమల పసమట యెరభూపు దళము
గొదకొని యదువులు గొబ్బున నడచి
ముందుగా యెలగోలు మూకల నణచె
తరుచైన విల్లులు ధర నెక్కు వెట్టి
బాణాసనంబులు బారులు దీర్చి
చెండాడి పగతుర సేనల నరికి
వేరుజాల విరిగె యెదురెక్కు మూక
పృథివిపై బెబ్బులులు పోరాడి నట్లు
ఆజిలో తేజీల నటువేగ తోలి
చౌకము వురికించి సైన్యము కదిలె
జమురు జంగులు గ్రుచ్చి సైన్యము గూల్చి
తడయక గూల్చిరి తల్లడ పడగ
వడగండ్ల వానలు వర్షించి నట్లు
పెట పెట తుపాకులు పేల్చిరి రిపులు
అట్టి సాహసమున ఆలము చేసి
దట్టమౌ అలుగులు తరచుగ నాటి
విధితోడ పోరాడి విరుగక రిపుల
పదను కత్తుల చేత పగతుర నరికి
వీర శూరుల నరికి విడువక అంత
వానకాలము రీతి వర్షించె కలను
కాలార సేనలు కదిసెను బలము
చెలగి పోట్లాడిరి సేనలు తమలో
కమ్మి మేఘములోన కడు వేగ మెరుపు
కాంతులు మెరసెడి కత్తులతోను
తడయక వురుములు తగ గుణధ్వనులు
వురువున రక్తంబు వుప్పటిలి కురియ
దొరకొని రక్తాన దొర్లాడుచూను
పెడబొబ్బ కూతలు పెద్ద రంతులతో
పోనీక రిపులతో పోట్లాడు వారు
క్షణముకు నిర్వ్వర చెల్లించి నట్లు

గుదియలు చేబూని కుంభిణి మీద
ధట్టించి కొట్టిన దంతము లూడి
వణకుచు రణమందు వరిగెడి వారు
మురుపీడ దరిజేరి ముసలాన నడిచి
అలుకచే రణమున ఆర్చెడి వారు
కురుచ చేకత్తుల కేరుచు పొడువ
గురుబెట్టుచు రిపుల కూల్చెడి వారు
కేటము నడ్డుచు కేరుచు నరుక
చిదురుపలై ధర చెల్లెడి వారు
మోకాళ్ళు కాళ్ళును మురుపీడ నరుక
మొండెములు ధర గూలి మొరపెట్టు వారు
బాకులతో పొడిచి పడ నెట్టివేయ
వనరంగ భూమిపై వరిగెడి వారు
కైజాలతో పొడిచి కడుపులు జీర
పదరుచు ధరమీద వరిగెడి వారు
వైరుల కెదురెక్కి వంకీల పొడువ
వరలుచు కుంభిణి వరిగెడి వారు
సురియలతో పొడిచి శూరులందరును
మ్రొక్కుచు రణవీథి సొరిగెడి వారు
ఫిరంగి కత్తుల పెనగి నరికియును
కండలు తెగి కొంత కైవాలు వారు
చేరఫిండ్ల కదిసి చెల్లగి పోట్లాడి
కదనంబులో గూలి కలగెడి వారు
చేయి చేయి కలిపి చేరి నరికియును
చెదరక రణమున చెల్లెడి వారు
పదరుచు నెదురెక్కి పగతుల నరికి

కోలాహలముగ నార్చి కుతికెలు విరిగి
కూడలుడిగి అచట కూలెడి వారు
వరవళ్ళతో పోరి వలలూడ నరికి
మద్దులవలె వారు మడిసిరి కలను
కటారు యుద్ధము కలగి చేసియును
కొద్ది వూపిరితోడ కూలెడి వారు
సానకత్తుల పొడిచి చౌకళించియును
చేకొని కొందరు చెల్లెడి వారు
శరములు గాడియు చెల్లెడి వారు
మందు పొగల చేత మడిసెడి వారు
చెడి విరిగి మూకలు చెట్లపాలైరి
బాణాలు వడి దాకి బవరంబులోన
సేసలు మడిసిరి చెలగ కలనిలో
గొదకొని శత్రులు గుదులుగా పొడువ
కూలిరి భూమిపై కుములుచు వారు
సురియలు బట్టక శూన్యహస్తములు
పరువులు వారుచు పలవించు వారు
రాత్రివేట్లు తగిలి రాలెడి వారు
వూపిరి వెళ్ళక వొరిగెడి వారు
శిరసు పోటులు నాటి చెల్లక కొంత
సొరిదిగా చెట్లలో జారబడువారు
కటారి పోట్లచే కలగి కొందరును
పొదల లోపల చేరి పొర్లాడువారు
దిమ్మరిమూకల తిరుగార బట్టి
గొదకొని పొడిచిరి గోపాలు లంత.

## యాదవ వీరులు యర్రభూపతి సోదరులను జంపుట

చలమున శత్రుల సైన్యము జంపి
విజయభూపతిజేరి యెదిరి యాదవులు
చేరి నరుకులాడి శంకలే కెదిరి
విజయభూపతినని యిలమీద గూల్చి
త్రిమురుచు యాదవులు ఓట్టలై కదిసె
విజయభూపతి పడ వీరశేఖరుడు
అతని సహోదరుడు యాదవులమీద
గొనుకొని పోరాడ గొబ్బున కదిలె
వీరశేఖరు బంధు లిరుగడ చేరి
బంతులు గట్టియు పగతుల మీద
విల్లనంబులు బూని వివిధ బాణములు
జడివాన గురిసిన చందాన బరుప
డాలులు ద్రిప్పుచు తరిమి శత్రువుల
వీరశేఖరు శిరసు విదళించి పెరికి
పంతము లాడుచు పడవైచి రంత.
అతనికి తమ్ముడు యదువుల మీద
గజవరదుడు కదిసె కయ్యంబు
సేయ
మహిని యేనుగులను మసిలిన యట్లు
గజవరునితో పోరి కడువేగ రిపుల
తరిగి గుట్టలు బెట్టి తలకాయలెల్ల
యదువులు పోట్లుచే అవని కంపింప
కుములుచు శత్రువులు కూలిరచ్చోట
గజవరగుడు చచ్చె కడు ప్రొద్దు క్రుంకె
కాలకేతుడు విరిగె ఘనమూకతోను
విరిగిన కాలకేతు దేక వీరవని
ధరణీశుడు యరభూప దళమున
గలిసె
వీరులై యదువులు విమతుల నరికి
మగిడియు నేగిరి మహరాజు గలియ
కనక నందుల పెంట ఘనుడు
యరనూక
దేర యెత్తించియు ధీరత మెరయ
కడువేగ దేరలో కంపటీలు తాను
చేకొని శివరాత్రి చేసిరా రాత్రి
అవ్యయ శివపురాణాదులు వినుచు
ధీరుడు చాలించి తిరిగి బంధులతొ
అన్నము భుజియించి ఆరాత్రి గడపె

## యర్రభూపతి తన గజబలముతో యాదవుల నెదుర్కొనుట

అంతట యరభూప అవనీశ్వరుండు
పిక్కటిలు రోషాన భీమ కోపమున
సరదార్ల దొరలను సరసకు బిలచి
వసుధీశు డెరపతి వయ్యన పలికె.
క్షత్రియోత్తములార! సాహసులార!
కదిసి బారులనెల్ల కల్లిలో జంపి
హేరాళమై సేన కెదిరి యాదవులు
పసర కాలాపుల వసుధపై గూల్చి
రాజుల పడ గూల్చి రంతు చేసిరిగ
చయ్యన దళములు పరగ నంతటను

యేనుగు లన్నిటి యేకముచేసి
ముస్తీదు బారుల మూకల ముందు
చాల తుపాకులు చయ్యన వుంచి
యిలమీద బారులు యీటెల వారి
వాటముగ నుంచుదు అవనీశు
నెదుర
మట్టింతు కరులచే మహిమీద రిపుల
భద్రగజముల దండు పగతుర ద్రుంచ
బంటుతనంబున బారులు దీర్చి
పరగంగ ముస్తీదు బలముల నెల్ల
అమరంగ రణమునకు ఆయత్తపరచి
ఇనుప జీనులు కరుల కింపుగా
దొడిగి
కడకను కొమ్ముల కత్తులు గట్టి

దొరకొను గొలుసులు తొండాల కిచ్చి
మావటీలు దొరలును మదకరుల
మీద
మలసిరి కరులపై మావటీలంత
చాలుగా నిలిపిరి సైన్యము ముందు
అటువెనుక సరదారు లవని గంపింప
గొబ్బున దీర్చిరి ఘోటకములను
భేరీ ధమామీలు పెళ్ళుగ మ్రోయ
పరగంగ యరపతి భద్రకరి యెక్కె
అరుణోదయంబున యదువుల మీద
గొదకొని రణముకు గొబ్బున నడిచె
రావణు సేనలు రాముని మీద
పన్నుగ నడిచిన పగిది నేతెంచె

## యాదవ వీరులు యర్రభూపతి గజబలమును మట్టుపెట్టుట

ఆరూఢివచ్చెడి ఆ సేన జూచి
అప్పుడు యదువులు ఆయత్తపడిరి
వీరకాసెలు గట్టి వీగజడ లల్లి
వీరగంధము మేన వేడుక నలది
కస్తూరి పునుగును కడువేగ పూసి
పరగంగ ధరియించె పైడి
జంద్యములు
అమరంగ ధరియించిరి
ఆయుధములను
నందుల ముప్పిళ్ల నారసములతొ
కత్తులు జముజాలు గండ్రగొడ్డండ్లు
తిమురుచు నేతెంచు ధీరులమీద

కడువేగ యదువులు కదిసి రావేళ
కత్తులు యీటెలు కదిసెను చాల
చిత్రవిత్రుగ పోట్ల చెల్లిరి కొంత
పూని యీటెల పోట్ల పొలిసిరి
కొంత
వణుకుచు రణవీధి వరిగెడివారు
ఆయుధములు పెరికి అర్చుచు
యెదిరి
తలిగొని రౌతుల తలను ఖండించి
గుడ్లు వెళ్ళగ వచ్చి కూలు పీనుగులు
బాటలుగా నరికి బారుల గూల్చి
ఘోరు కొండలరీతి పొర్లాడువారు

అర్భాటములు జేసి హతముగా నరికి
వాలాయ మవనిపై వరిగెడి వారు
కయ్యంబులో గుండ్లు కడుపులో
చిక్కి
చయ్యన రణమున సమిసెడి వారు
పొంత నైజాలతో పొడిచి యెదురెక్కి
దిట్టమౌ శత్రుల ద్రెంచెడివారు
తలగ కత్తుల పోరి తరిమి పోనీక
వీర శూరుల గూల్చి యిల పడువారు
వీకతో పోట్లాడి యెంతయో నరికి
వాపోవుచు భువిని వ్రాలెడివారు
ఆజిలో యెదురెక్కి అశ్వాల నరుక
గుంపులై తేజీలు కూలె నా కలన
గంద్రగొడ్డలి పూని గజముల నరుక
మట్టుగా గజములు మడిసె నా కలన

## యరనూకరాజు యర్రభూపతిని చంపుట

కాలకేతుని గూల్చి గజముల నరికి
మార్కొని శత్రుల మహిమీద గూల్చి
కడు వేగ యరనూక కంఠీరవుండు
ఆజిలో యరపతి నంతట గదిసి
చేకొద్ది తొండము చెండి కుంజరము
ధరపడ నేసియు దార్కొనె రిపుని
కొలను జొచ్చిన కరులు ఘూర్ణిల్లు
నట్లు
సింగంబులును తారసిల్లిన యట్లు
చెలగంగ చెలిగిరి చేతి కత్తులతొ
పుర్విపై నెగసియు పుర్వీశులపుడు
చిమ్ముచు కత్తుల శిరసుల పొడిచి
కేడెములు కేడించి గీటుచు నెదిరి
కదిసి భూపాలకులు కదన
విక్రములు
చెలగి పోటుకు పోటు చేకత్తి పొడిచి
రెండు పోటులు నాటి రెట్టించి
ధరను
కదిసి జంజాలిని గాడిగ పొడిచి
యర్ర భూపతి కూలె యేనుగమలను

## యాదవవీరులు యుద్ధమున మడియుట

సరగున యరనూక సరసుని కడను
యదుకులు లందరు యేనుగుమలను
వుక్కుటలుగులు గాడి వురవడి నాటి
పాలవల్లిగ బడె బవరము నందు
తిరమంచు మరుదులు శిరసు
పోటులతొ
చిమ్మించి రక్తము చిందగ పడెను
వాటమౌ పోటులు వజ్రాంగి దూరి
వల్లవ వీరులు వొరిగెను ధరను
సామజంబుల నెల్ల చక్కగా నరికి
మన్నీలు పోట్లచే మడిసిరి కలను
చేబల్లెముల పోట్లు శిరముల నాటి

చెల్లె తిరుమందులు చెలమున పోరి
యెదురొమ్ము పోటులు యెక్కువ నాటి
కై వాలి లెల్లరు కదన రంగమున
మెండుగ బల్లెములు మేనుల నాటి
మద గజములు తిరుమందులు మడిసె
వొయ్యన సరదార్ల వుక్కణగించి
వల్లవులు పోట్లచే వరిగెను ధరను
సరగ రాజుల నెల్ల సంపయంగ జేసి
పోరాడి రౌతుల పొట్టలు జీల్చి
పులిముద్దు రాఘవుడు భూమిపై
వొరిగె
బల్లెముల పోటులు బలముగ నాటి
పందుము పెద్దయ్య పడెభూమి పైన
శంకలేకను హయసంఘమున నరికి
శరములు వాటియు సర్వాంగములను
శంభుని కొండయ్య చెల్లె నా కలను
భద్రకరుల గూల్చి పగతుర నరికి
బాణాలు శిరమున బారుగ నాటి
గాయాల రక్తము క్రమ్మి కురవంగ
గాలము లింగన్న కైవాలె నచట
పతగ రాజుల గూల్చి పయుల కోనేరు
యీటెల పోట్లచే యిలపై గూలె
గద్దరి శత్రుల కల్లుగా నరికి
కశికంఠన్నముగ మేన్న కత్తుల్లు నాటి
గాంగేయు వెంగళు కదనమ్మున
వొరిగె
సరిష్టోలి రిపులను సమరాన గూల్చి
జముదాళి పోటులు చాలగ నాటి
సారంగు [illegible] నా కలను

తడకొని పగతుల తలలు ఖండించి
చింతల నర్రయ్య చెల్లె బాణముల
మహిమీద రిపులను మట్టి మల్లాడి
మట్టుగా అమ్ముల మకుటము నాటి
మల్లెపోయిన పెద్దు మడిసెను
కలను
గాదకొని పగవారి గుదులుగా పొడిచి
కొండేటి నారయ్య గొ[illegible] నాటి
వయ్యన ధరమీద వొరిగె నా వేళ
కోలాహలమ్ముల కొమ్ము దేనుగుల
తొండముల్ చీల్ప్రడించి దురమున
గూల్చి
యీటెల పోటులు విరివిగా నాటి
గోవింద లింగన్న ఘోరాజి వరిగె
దట్టమౌ శత్రుల ధీరత నరికి
చింపి కత్తులపోట్లు శిరమున నాటి
శ్రీమంతు రంగన్న చెల్లె నా కలను
కూటువ మూకల కూలంగ నరికి
గరుకైన బల్లెము గాయాలు నాటి
గోపాలు శంకరు గూలెను కలను
మన్నీల నెల్లను మహిమీద గూల్చి
మాధవు మల్లయ్య మహిమీద గూల్చి
మాధవు మల్లయ్య మహిమీద చెల్లె
సందు లేకను విర్గి సానకత్తులును
సంగము చల్లయ్య సమసెను కలను
శూరులు పొడిచియు సురియలు నాటి
వొయ్యన ధరమీద వొరిగిరి చాల
మంచాల పాపయ్య మడిసెను కలను
బండారు చంగన్న బవరమున నొరిగె

పృధివిపైశత్రుల బింకంబులణచి
భూపతి పురుషోత్తం పుడమిపై
నారిగె
ఆరూఢి బలాల హతముగ నరికి
యదువులు పోట్లుచే నవనిపై బడరి
యేనుగు పతికుల యేక వీర కలను

దండి శూరులు పోట్లు దళముగా నాటి
వీరక్షేత్ర మనంగ యిరుమేననాటి
వలురాజు పుత్రుని వల నిరుగడల
మడిసిరి యాదవుల్ మరి పెక్కు
గతుల

## రణభూమి వర్ణన :

కంకట గుండెలు కలిసి రక్తమున
యెండవేసిన రీతి యేకవీర పెంట
దొబ్బలు ప్రేగులు దొరసి రక్తమున
ధుమిలి పారగసాగె దొడ్డ
రణమునను
వృక్షముల్ ధరమీద పడ వెచినట్లు
కరులు గొంటబడె కలసి రక్తమున
కుమ్మరి పేర్చిన కుండల రీతి
కుంభిణి శిరసుల గుట్టలుదోచె

వసుధపై చెరుకులు వడి నరికినట్లు
చీంద్రించి నట్టుల చేతులును కాళ్లు
పోట్లచే రక్తము పొంగుచు నంత
పొర్లి పారగసాగె పొలికల నంత
వీరకాళెలు రక్తయేరుల వెంట
ఆరూఢి రణమున నల్లిన జడలు
శేషులపలె లేచి చెలగంగ సాగె
జొత్తుగ రక్తము జొబ్బిలుచుండ
నిడుదప్పి కన్నుల నిట్టూర్పు విడుచు

## యరనూకరాజు భట్లకు తన అడియారము లిచ్చి యింటికి పంపుట

కలనిలో యరనూక ఘన విశాలుండు
కుములుచు భట్లను గుణయుతుల బిలచి
భూనాథుడు శరీర భూషణంబులను
రయమున భట్లకు రాజు తా యిచ్చె
సన్నైన మెడనూళ్లు సందెకడియాలు
చిన్న సేలవులును చిలుకల వాళి
వంకిణి ములనూలు వాలరి గొలుసు

అమరంగ భట్లకు అడియము లిచ్చి
భట్లతో నొకమాట పలికెను రాజు:
"గుణవీర రణమెల్ల గొబ్బున బోయి
అడియార మందించు యాదవ సతికి
కొడుకు భట్టాపుల గుణదీపకునకు
పయ్యెన నాచేతి వ్రాలను యిమ్ము
వ్రాలను చదువుక వల్లవపతిని

అదలకుడని చెప్పు దయలార! మీరు
తగనొప్ప భట్టాల తనయుని మీరు
దైన్యమొందక నుండు తండ్రి లేదనుచు
గారాబు భట్టాల కంఠీరవుండు
కన్నీరు బెట్టక కడు చూడరయ్య!
బాల బుద్ధులు మాని బంధుల గూడి
యెంతయు రాజ్యము నేలగా జెపుడు"

అని యిట్లు భట్లకు నంతయు జెప్పి
కలనిలో మూర్ఛిల్లె, కదలిరా భట్లు
కడు ప్రొద్దు గుంకెను గ్రమ్మె చీకటులు
గుంపులై పులుగులు ఘుమ్ముమ్మన యెగిసె
కనుగొన చుక్కలు కనిపించె మింట.

## యరనూక సీత దుస్స్వప్నమును గనుట

ఆరాత్రి యరనూక యధిపతి దేవి
భూపుత్రిని హసించు పొలతి సోయగము
యీ రూపు రేఖల యింతి యరనూక
బంగారు తరికోళ్ళ పట్టి మంచమున
పరుపైన జాజులు పాన్పున బరచి
పద్మాక్షి నిద్రించె పరిచారికలతో
కలువరేకులవంటి కన్నుల నిద్ర
చెంగియా యరనూక చెలువతో జెందె
తన విభు దేగిన తలపోతతోను
అలివేణి కలలోన నంతయు దెలిసి
యరనూక తన భర్త యేకవీరవని
పగవారితో బోరి బల్లెముల్ నాటి

చెలగి కదనమున చెల్లినట్లుగను
అటు వే కను భట్లు నచ్చటనుండి
చెంగి అడియారముల్ చేర్చినయట్లు
అడియారముల కెదురు అరిగె యరనూక
పుచ్చుక అడియారముల్ పొలతి యరనూక
అమరంగ గుండాన కాయ త్రపడగ
పుత్రుడు భట్టాల పృథ్వీవరుండు
పనిబడి రణముకు పైనమైపోయి
తెగువతో రాజును తెచ్చిన యట్లు
కడియంగ తన విభు కన్నుల జూచి
పతిగూడి కాలగ పణతి కలగనెను

## యరనూక సీత యాదవ కాంతలను పిలువనంపుట

అదిరి తా లేచెను అతివ యరనూక
మేనెల్ల పులకించి మెలతల లేపి
"అమ్మలారా! రండి! అతిదాదులార!

కానిది కలగంటి కామినులార!
యేమిసేతునమ్మ యే మందు విధిని
పొందుగా పోరమ్మ పొలతుల బిలుప

కడువేగ రారమ్మ కాంతలతోను"
అని యిట్లు యరనూక ఆనతిచ్చినను
పరువున బోయిరి పణతుల బిలువ:
"ఆవు పువ్వులవార! ఆవులవార!
కడువేగ తిరుమందు కామినులార!
పల్లవ చెలులార! వో యక్కలార!
అతివ యరనూక మాయమ్మ
బిలచెడిని"
అందందు పిలువంగ యాదవచెలులు
కడువేగ నిద్రలు కరముల నులిమి
చేరిన దాదుల చేడెల కనిరి
'రాత్రిరి వేళను రమ్మని పిలువ
యేమి పనుండెను యరనూక చెలికి
దాదులారా! చెపుడు తగళాక్షి మాట
రాజులు లేనపుడు రాచకూటముకు
నాతులు పోరాదు నామాట వినుడు
నగరులు వదలిరా న్యాయంబుగాదు'
అని యిట్లు భామలు అడుమాటలకు
'అటులైన వినరమ్మ అది యెరిగింతు
కలగని యరనూక కాంత తా మిమ్ము
రమ్మని మమ్మంపె రారమ్మ మీరు'
'కలగని యరనూక కడు
చిన్నబోయె
పోదము రారమ్మ పొలతులారిపుడు'
యరనూక కలయన యదువంశమెల్ల
గొల్లుస యందఱు కుములుచు లోన
వెలదుల మోములు వెలవెలబోయె
తామరపై నీరు తల్లడి విలాగు

కాంతల కన్నీరు కడవలుగ కురిసె
చిన్నబోయి చెలులు చీకాకుపడిరి
వెనుదగిలియు మంట లెగసినయట్లు
మగువలు తలపోసి మందిర మెదలి
రాగవీథిలో కాకరంతులు యెగసె
పరువులు వారుచు పలువరించుచును
గూబలు వొండొంటి గూడుచు
యెగసి
వాలాయముగ ముందు వలపోయ
సాగె
గూండ్లలో పైడికంట్లు గుబగుబ
అదిరె
నెలవు దప్పె గురుచు నెత్తురుగ్రక్కె
అది గని అదలిరి అంగనామణులు
కడువేగ దుఃఖము కాంతలు మాని
రారమ్మ! పోదాము రమణులారిపుడు
దైవము కృపవుంటె తరళాక్షులార!
చలగ అపద తప్పు శకునములైన
దైవము దయదప్ప తప్పు
గ్రహములును
వగవను పనిలేదు పనితలు రండు
ఆరూఢి తలపోసి యాదవ చెలులు
పల్లకీ లెక్కిరి పణతులందరును
తిరమందు పల్లవ తరుణు లందరును
కడువేగ నగరికి కాంతలు వచ్చె
ముదమొప్ప దాదులు ముందుగనేగి
చెప్పిరి దేవికి చెలులు వచ్చిరని

## యరనూక సీత యాదవకాంతల నాదరించుట

అరుదుగ యరనూక అతిసంతసమున
వదినెలు చెల్లెండ్రు వచ్చిన నెదిరి
ఆలింగనము జేసి ఆ రాజుదేవి
భామలు నగవుచు బంగారు మేడ
గూడియు వచ్చియు కూటములోకి
పలు హేమకంబాల పందిరిలోన
పరగంగ జమకాణ పరపించి పణతి
పలువిధ ఆసనాల్ పరగ జేర్పించి
గొబ్బున యాదవ గోపికామణుల
కడువేగ కూర్చుండ కాంత సెలవియ్య
చెలగి కూర్చుండిరి చేడె లందరును
గంధము కస్తూరి కలిపి గిన్నెలతొ
దాదులు అందివ్వ తరళాక్షి పట్టి
వదినెలకు యరనూక వరుసగా పూసె
చెలగుచు మదిరాక్షి చెల్లెండ్ల కెల్ల
కడువేడ్క గంధంబు కంఠమున
బూసె
పక్కించి బాగాలు పరడుటాకులును
కర్పూర విడియముల్ కాంతల కిచ్చి
రాజదేవియు నుండె రత్నాల గద్దె
ముచ్చట వార్తలు ముదమొప్పనాడి
కలకంఠు లెరనూక కాంతకిట్లనిరి
"రమణీమణీ మమ్మ రమ్మనుట
యేమిః
అమ్మరో! జెప్పుము అతివ
యరనూక"
చెప్పుమని యడిగిన చేడెలతోను
కడువేగ యరనూక కల సెప్పసాగె

## యుద్ధమున కేగిన భర్త ఏమయ్యెనోయని యరనూక సీత యాదవ కాంతలతో చెప్పి చింతించుట

"నాతి పువ్వుల బంతి! నా
మేనవదినె!
పులిముద్దు రేశమ్మ! భూపతచ్చమ్మ!
యిలధరు సీతమ్మ! యిన్ద్రుని పోత
చంద్రుని పెద్దమ్మ! శంకరు
మల్లమ్మ
కనక నందులమ్మ! గాంగేయు
వెంగ
కాంతలారా! వినుడు కలగంటి నేను
కల్లందుల కనక! గాలము లింగ
సంగము చంగమ్మ! సారంగు రాము
పొలతి పువ్వులబంతి! పుల్లాల పుల్లి!
సరివచ్చు వియ్యము సంకుల
సానమ!
చెన్న కృష్ణుని చెన్ను! చెవుల
వీరమ్మ
పందుము పద్మాక్షి! బండారు జంగ
చెల్లెలు ఏనమ్మ! శంభుని కొండ!

ఆత్మబంధులుమీరు (అంగనలార!)
అంగన లారమ్మ! అచ్యుతు కాంత!
గోవిందుని గోపి! గొడ్డటి కాంత
మాధవు మల్లమ్మ! మంచాల కేశు!
మల్లెబోయిన రాము! మట్టావు లక్క!
దొంతుల జోగమ్మ! దొంతుల పోత!
చింతల నారమ్మ! చీదర సింగ!
భాగీరథుని వెంగ! పయ్యేల కంగ!
తూకట కోటమ్మ! మరల పూరెమ్మ!
జమ్ముల సానమ్మ! సాగి యమ్మమ్మ!
పచ్చిపాల్ సూరమ్మ! పశుపతి నూక
వెల్లాల యెల్లమ్మ! వెన్న ముద్దమ్మ!
జెట్టి బోయిన కోట! జడ దారి కోట!
తుందెబోయి నన్నమ్మ! ముందలమూద!
ఆవుల సోదమ్మ! ఆవుల సోమ!
పగనొప్ప బంధుల తరుణులు మీరు
అచ్యుత వంశము అమ్మలా రిపుడు
చెలులార కలగంటి చెప్పెద మీకు
ఆత్మ బంధులు మీరు అంగన లార!
కొరగాని కలగంటి కోమలులార
చారదు నామనసు చెదిరెనో యమ్మ
తనువు వణుకుచు నుండె తల్లడిలె
గుండె
సత్పుత్రు కొదవగ సంతస మంటి
వప్పక్క దైవము వైదొలగె నేమొ
కల్లగాదు వినుడు కామిను లార!
అరుంధతీ సమము అత్త వల్లాంబ
యన్నంగ కలగనె యలమంచి నాడు

యిందుముఖులార! కల వినరమ్మ
జెపుదు
భూపతి వలురాజు భూపుల జంపి
తప్పక యీటెలు తాకి పీకలను
మనుడవు వలురాజు కై వాలె వెనుక
తెల్లవారక ముందె తెచ్చిరి వార్త
అడియారముల నంచి యా
వల్లమాంబ
తరిము త్త మొదలైన తరుణులతోను
అరువది యార్గురు అగ్నిరగిల్చి
తిరుమంద కాంతలు తెగువ
తోడుతను
పల్లవ సఖియలు వరుస నందరును
గుభ గుభ మండెడి గుండాన బడిరి
ఆరూఢి మడిసిరి అమ్మలందరును
అత్త తా కలగనె ఆ రాజు చెల్లె.
తరుణులార! నాకు తప్పదు నిజము
వలదన్న నావిభుడు వల్లవ రాజు
పగతులతో పోర పైనమై పోయె
తిరుమందుల వదినె ధీవిశాలమతి
పాపవు దైవము పగబూనె నేమొ
పంపాద్రి నెడబాసి పణుతులారిటకు
వచ్చిన మొదటనె వచ్చె నీ బెడద
చెడుకల కంటిని చేడెలారిపుడు
రమణు లారా! నాడు రఘుపతి తాను
పరభూమి వలదనె పల్లెకొండయ్య
పొందుగా జెప్పెను పోవల దనుచు
అల్లుడు పల్లికొండ రయ బాంధవులు

తగదని పలికిన ధరణీశు డొచ్చె
రఘుపతి మాట నారస మయెనేమొ
కొమరమ్మ మాడల్లు కూడి వచ్చినవా
ఘోరాజికిని బోయె కువలయ పతియు
పొలతులారీ రాత్రి సొందుగా
మనము
యేరీతినో వుండె నేమి సేయుదును?"

## యరనూక సీత కల చెప్పుట - యాదవ కాంతలు కల విప్పుట

రాజ దేవికి తాము రమణు లిట్లనిరి
"అలివేణి యరనూక అమ్మరో!
వినుము
యేమి కలను గంటి వెవ్వరు వచ్చె
నారీమణీ దెల్పు నాతల్లి నీవు
భామరో! మనవారు పరిణానవుండ
అమ్మరో నీకింత అలకుట యేం?
మగవరో! నీకల మాతోను జెపుము
తెలియ జెప్పదు మన్ని తెలిసి
నట్లుగను"
అని యిట్లు యడిగిరి యాదవ
చెలులు
పలుగంగ కలజెప్పె పణతెఱనూక:
"మఱిగి చీకటి గ్రమ్మె మగువ
దివ్వెలును"
పులిముద్దు దేశమ్మ పొసగ నిట్లనియె
"మగువ యీ దివ్వెలు మలిగి
నందులకు
భామరో నీయింటి భాగ్యము తొలగె"
"పరువగు గజనిమ్మ పడ
కలగంటి"
'పరువు దప్పియు నిమ్మ వ్రాలి
నందులకు
పరగ నీ విభుడుండె పమికి గుడారు
సిరి దప్పి రక్తాన చిదుకునో
యమ్మ!'
'పొలతులారిట కంటి పొసగ
పకియింతి
పొక్కుచు పురి వెళ్లి పోను కలగంటి'
'పురి వెడలి యింటి పొందైన లక్ష్మి
మగువరో! తొలగెను మహలక్ష్మి
మీకు'
'పమిడి శాలలు విర్గి పణతి దూలాలు
అదటున తునియలై అవనిపై
వ్రాలిగె
యెవ్వరికీ కల యెరిగింపు దమ్మ?'
'యెలమి చిత్తరు మేడ లిం
గూలునమ్మ'
'అంత కాలగ గంటి అతివ నా వదెన'
'మేడలు మండిన మెలగ యాదవులు
మేన బల్లెము నాటి మేదిని బొడగ
చిత్తరు ప్రతిమలు శిరిగల చెలులు

అమరంగ గుండాన అందరు
బడును'
'శోకు భూషణములు శోరకొని
యగ్ని
కుమిలి కాలగ గంటి కోమలులార!'
'భూపుడు నీ విభుడు భూమిపై
వొరుగ
తొది బడి కాలుదుర్ తోడు
గూడుకొని'
'పంకిన వృక్షము పలువురు నేరి
పడనరక కలగంటి పణతులారికను'
'యేమని జెప్పుదు యరనూక దేవి
పొలతిరో! మీ యన్న పులిముద్దు
ఘనుడు
పోరాడి శత్రుల పొడిచి వధించి
ఆలంబులో బడె అమ్మ నా విభుడు'
వినియు తా నెరనూక యిట్లని బలికె
"కట కటా రాఘవుడు కై వాలి తేను
అమ్మలారా! పతికతి భారమౌను
తరుణీలలామరో! దావాగ్నిలోను
వనర పువ్వులు బంతు లొరుసగా
కాలె
యెన్నగ యీకల ఏమిటో
చెపుము?"

"వినవమ్మ యీకల యరనూకదేవి!
పులిముద్దు మీయన్న భూమిపై
వొరుగ
భామరో! ఏనును పతిని గూడుకొని
గుభ గుభ మండెడి గుండాన
బడుదు"
పడతి తా యరనూక బంధులతోను!
'హాగొప్ప వినరమ్మ పడతులారిపుడు
పండిన పనసలు పడ కల గంటి
చెంగి యీ కల యెట్లు చెప్పుదు
మీరు?'
పనిబూని దేవితో పడతు లిట్లనిరి!
'పగవారి నందర బవరము గూల్చి
పందుమ్లు వారికి బల్లెముల్ నాటి
చెలగ రణంబున చెల్లిరో తల్లి!'
పొక్కుచు దుఃఖాన పొగిలి యిట్లనిరి:
'చేడెగో ఏమని చెప్పుదు మమ్మ
తడవాయె మేమొచ్చి తగ చాలు
కలలు
చంద్రుడు గ్రుంకెను చెదరె
చుక్కలును
కుక్కుటా లెలుగెత్తి కూయంగ సాగె
వచ్చెద'మని లేచి వనిత లందరును
పైనమై వెళ్ళిరి పల్లకీ లెక్కి.

## భట్టావులరాజు గరిడిలో సాము చేయుట

ఆవేళ భట్టావులా రాజ ఘనుడు
పుల్లావుల పతుల భూరి గరిడిని
సాధన జేయంగ చనుదెంచి వేగ
బిర బిర చల్లడం బిగువార దొడిగి

మట్టుగ ధట్టిని మరి వేగ కట్టి
గుత్తము శిరసున కుళ్లాయి బెట్టి
గట్టిగా బరిగోల కరమున బూని
ధట్టించి సాధన ధరణి భేదిల్ల
బెట్టుగా జేయుచు పెడ చేత త్రిప్పి
ఉలుకగ ఝుట్లతో నురవడి బెనగు
బరికోల త్రిప్పుచు బాహప్పళించి
ధరణిపై మల్లుల దగ పడద్రోయు
బాణాలు ద్రిప్పుచు పరవళ్లు త్రొక్కి
రాళ్ళగోతము చేత రయమున నిల్పి
అరచేతను నిలిపి అల్లటు వైచు

## భట్టు అడియారములను తెచ్చి యరనూక సీత కిచ్చుట

తొలగెను చీకటి తూర్పు దిక్కునను
రవి యుదయాద్రిపై రంగుగా నిలచె
అంతట రణము నుండా రాజభట్లు
తెచ్చిరి గురుతులు తీవ్రముగాను
చింతించి భట్టులు చిన్నబోవుచును
గృహమేడ ముందుండి గొనకొని
పొగడె
"వల్లవకులరత్న వో పుణ్యకాంత
భూసుత సరియగు పొలతి
నీ గుణ [illegible]
వోహో పతివ్రత! వో పుణ్యశీల!
వేవేగ రావమ్మ యరనూక సీత!
వైరుల కెదురించి పోరునగ గూల్చి
పోరాడు శత్రుల పొట్టలు జీరి
దండి వారులనెల్ల ధరబడ జేసి
యేనుగులను గూల్చి యెరపతి
జంపి
వాటము యీటెలు వక్షము నాటి
యిమ్ముగ శరములు వీపున వెళ్లి
వలరాజు పుత్రుండు వారిగె
నీ విభుడు
పల్లవ రాజిల వొరిగెను తల్లి!
మన్నె సింహము పోట్ల మడిసెను
తల్లి
తేజమౌ గురుతులు తెస్తిమి తల్లి!
యన్నగ కులసతి యరనూక
పతివి
[illegible] తల్లి [illegible]"
అని [illegible] భట్లు [illegible]
యెలుగెత్తి [illegible] వినెయెర సీత
కాంతలం[illegible]రు [illegible] కటకట బడిరి
మగువ[illegible]చెదరు దుఃఖమగ్నులై రంత
అడియారములు రాగ యాదవ
సతిని
పిన మసి తో నున్న వెంది దేశమ్మ
'చెప్పితి నంతయు చెలులార మీకు
తెల్లవారక ముందె దెచ్చిరి గదవె
కల యర్థమే వచ్చె కామినులార!'
అని యటు దేశమ్మ యన యరనూక
ప్రాణేశు గురుతులు భట్లు దెచ్చిరట
పదరమ్మ పోదాము పద్మాక్షులార
అని పలికి యరనూక
యాదవసతులు
బంగారు పళ్ళెము పట్టువస్త్రములు

చెంబులతో నీరు చేదెడు గొంచు
వయ్యన యెదురేగి వనితలందరును
తత్తరింపుచు భక్తి తరుణులు తాము
యెన్నంగ తెరబట్ట యరనూక
సీత
తెరచాటున నిలిచి తెరగొప్పనంత
వుదక కుంభము పట్టి వుర్వీశుకాంత
వారికి ఉడిమారె పళికి తా మొక్కి-
పళ్ళములో నివాళి పట్టించె నంత
తరుణి తా దిష్టిని తా దీసి భక్తి
మొక్కియు భట్లతో ముదిత
యిట్లనియె
'భట్టులారా! మీరు బలులెస్సయాయె
యేదయ్య యరనూక విభుడు
నా భర్త?
రాదాయె యిచటకు రాజు యేమాయె?
వాలాయముగ విభుడు వరుగగ
జూచి
వస్తిరా అయలార! వోర్వక మీరు
యెప్పుడు రాజును యెడబాయ
కుండు
తోడులు వస్తిరా ధీరనట వీడి
కూర్మితో రణముండి గుణధీర
మిమ్ము
అంపెడి యప్పుడు అన్న నా విభుడు
యేమని జెప్పెను యెఱనూక
విభుడు?

- ఆవార్త నాతోను ఆనతివ్వండు'
అన విని యా భట్టులపు డిట్టు లనిరి
'నారీమణి! విను నాతల్లి! జెపుదు
ఆరణమున నుండి యంపెడు నపుడు
ఆనవాల్ తన చేతి యంగుళి మిచ్చె
భూనాథు దేహము భూషలు యన్ని
అందుక తెస్తిమి అందుకో తల్లి
బంగారు పళ్ళము భామ తాబట్ట
కొంగు భూషలు విప్పి గొబ్బున బెట్టి
తిప్పమె నడియాలు తెరగొప్పనంది
కన్నుల నద్దుక కలకంఠి చూచి
పళ్ళములో సొమ్ము పచ్చి
రక్తమున
కలియ కలిపినట్లు కనిపించె నంత
బంగారు వస్తువుల్ పసిమి
బాసియును
కందువారియు రక్తకలితమై
యుండె
గొల్లున అదలంగ గోపికామణులు
తిరముగ యరనూక దేవి తోడుకొని
కుంటాల లోనికి గొబ్బున బోయి
పరగంగ బంగారు పట్టిమంచమున
హంసతూలిక పాన్పు నడియాల
నుంచి
సురటీల విసరించె సుదతులచేత

## గరిడిలోనున్న భట్టావుల రాజుకు భట్లు అతని తండ్రి మరణ వార్తను చెప్పుట

కనుగొని భట్లను కాంత యిట్లనియె:
'కులదీప కుందును గుణవిశాలుండు
సాధన జేయును చయ్యన మీరు
రయమున భట్టాల రాజుకు జెపుడు'
అనతిచ్చిన భట్లు యతివేగ బోయి
గరిడిముందు నిలిచి కైవార మొసగి
'భట్టావులాధిప! వనధి గంభీర!
విక్రమార్కుని సమ! తీర హన్మంత:
గండరి రిపులకు గండరిగండ!
చండ భాస్కర తేజ! సర్వజ్ఞమూర్తి!
యదుకూలధీశ్వర! యరనూకపుత్ర!
వినవయ్య భట్టాల విక్రమశాలి!
దండి వైరులచంపి ధరమీదగూల్చి
తేజీల నాజిలో తీవ్రత నరికి
యేనుగులను కూల్చి యెరభూపుజంపి
యెదరున పోటులు యేకమునాటి
గాయాలతో తండ్రి కడబట్టి వారిగె
రావయ్య భట్టాల రాజసుతుండ!
రాజిదు గురుతులు రయమున నంది
యెదురు జూచెడి తల్లి కెలుగంగ జేతు
భానుతేజుడ! తండ్రి పంపున మేము
పట్టుక వస్తిమి భట్టాలరాజ!'

## భట్టావుల రాజు దుఃఖించుట

అనియిట్లు భట్టులు ఆనతివ్వగను
విని యపుడు భట్టాల విక్రమశాలి
మాష్టీలతో సాము మరివేగ వదలి
పట్టిన కోలను పరువడి విడిచి
పొలపొల దుఃఖాన పొగులుచు కంటి
గ్రుక్కుచు కన్నీరు గుణధీరు
కనియె:
'యేమోయి గుణధీర! యేమి వార్తలన
వ్రాలాకు దెస్తిమి వ్రాక్కుచ్చె మీకు
తేరోయి భట్లార! తెచ్చిన కమ్మ
యి'మ్మని పలికిన యిళధరుసుతుకు
కస్తి పడుచు తాను కమ్మనందించె
పుక్తులు చదువుక పుర్వీశ సుతుడు
కన్నుల నద్దుక గద్గదికమున
'హో తండ్రి! నీవోయి వాగి
ముత్యములుగ
నాతండ్రి! వ్రాస్తివి నన్ను వల్లనుచు
రాజ్యమేలుమటంచు వ్రాస్తివి తండ్రి!
అరయ యీ రాజ్యము అయ్య మాకేల?
బంధుల పోషించ పంపితి కమ్మ
బంధులు నాకేల? పట్టము యేల?
శిలలేని పూజలు చేతునే తండ్రి!'

అని మది కటకట నడలుచు వేగ
దండి మాష్టీలను దగ్గర బిలిచె!
'జట్టీలలోనయ్య జగబిడ్డ రామ!
వుక్కు బోరల గంగ! వుయ్యాల
చందు!
బాణకారీ మల్లు! బరిగెం సోము!'
అను వేగ మాష్టీల నందర బిలిచి
జట్టీలతో జెప్పె భట్టాలరాజు:
'మాయమ్మ యరనూక
మానినీమణియు
పురుషుని ఆడియార్లు పుచ్చుక వేగ
యెదురుచూచును నన్ను యరనూక
దేవి
యెనయంగ మాతల్లి యరనూక
సతిని
గుండాన బడకుండ గొబ్బున బోయి
ఆన బెట్టగవలె హరిహరు మీద
తల్లికి ఆనడి తగ వూరడించి
యేర్పడ రణమున కిప్పుడె బోయి
మా తండ్రిని గొనుచు మాపు
వచ్చెదను
మాపు రాకుంటెను మా యన్నలార
వుదయము కొచ్చెద నుర్వీశు గొనుచు
శంక లేదీమాట శంకరునాన'
అని యిటు మాష్టీల కనువేగ జెప్పి
భేతాళునకు మ్రొక్కి వెడలె నారాజు.

## భట్టావుల రాజు తల్లినగరుకు వచ్చుట

కట్టిన కాశతో ఘనవేగ రాగ
గృహ మేడపయినుండి కోమలి తల్లి
తనయుని రాకను తాజూచి వేగ
సంగతి గా దేవి సఖియల కనియె
'భామలారా! చూడు భట్టాలరాజు!
కడు చిన్నవోయి నా గారాబుపట్టి
గరిడి వెళ్ళింది వరు కదిలి వచ్చుటలు
కనుగొనుచుందురు గదరమ్మ మీరు
గొడుగులు తేజీలు కూడుకరాగ
ఆపి యిరుగడలను అందలమెక్కి
వెలయ చామరములు వీయుచు
నుండ
పైపుల ఛెలగుచు వచ్చు నాసుతుడు
సర్వసన్నాహము సఖులును లేరు
ఒంటరిగేతెంచి వచ్చెడి సుతుడు
తనయుని కెంధైన తగు గారబములు
మురియుచు తండ్రికి ముద్దు
చూపుదురు
మురహరి దయదప్పె మురిపెంబు
దప్పె
తండ్రి లేనీ బిడ్డ తరుణి నా సుతుడు
యేమందును విధిని!
యేమి సేయుదును!'
అనియిటు తలపోయ నారాజు
సుతుడు
మోద ముడిగి వచ్చి ముందర నిలచి

తల్లికి సాష్టాంగ దండము బెట్టి.
తనయుడు మ్రొక్కిన తరుణి
యరమూక
కొడుకును దీవించి కోమలెత్తుకొని
'అరయ బట్టావుల అయ్యరో! నీవు
అదితి వంచగనేల అబ్బురపట్టి
నీతోటి ఘనులును నీకన్న ఘనులు
కనుగొని నీకును కరములు ముడువ
వసుధీశపుత్ర! యేల మ్రొలి
మ్రొక్కెదవు

నిలచి మ్రొక్కిన చాలు నెమ్మది నాకు'
తల్లి పల్కిన విని తనయు డిట్లనియె:
'తల్లి నీ గర్భాన తగనొప్ప బుట్టి
తల్లికి మ్రొక్కిన తగదనవలదు
కన్నతల్లికి మ్రొక్క కాపాడు హరుడు
హరిహరులకు నూరు అమ్మ తల్దండ్రి
నామాట వినవమ్మ ననుగన్న తల్లి!
సొరిది దుఃఖము చేత సొలుచున్నావు
నాతోను జెప్పమ్మ నను గన్న తల్లి

## యరమూకసీత తన భర్త అడియారములతో సొగుమానము సేయ సిద్ధపడుట

సుతుడాడు మాటన్ను సుదతి
యిట్లనియె:
'భానుని సమతేజ భట్టాలరాజ!
అడియారములు వచ్చె
అయ్యవద్దుండి
కమ్మయు వచ్చెను మడియుండరాదు
భూషలు వచ్చెను భూనాథు నుండి
పొందుగ గుండము బోవలె నేను
తనయుడా గుండంబు త్రవ్వించు వేగ

పుణ్యపు నీరాడి భూసురవులకు
చేకొద్ది దానముల్ చేసెడి వరకు
ఘాటుగా తెప్పించు ఘనసార తరులు
కురుచగా నరికించికొని తెచ్చివేగ
పొందుగా గుండాన పోసగించు
కొడుక
చాలుగా నుంచుము చమురు
కడవలును
పసుపు చీరను గట్టి పైనమౌ వరకు'

## రణభూమికేగి తండ్రి కళేబరమును తెత్తునని భట్టావుల రాజు ప్రతిన సేయుట

పొలపొల దుఃఖించి భూపతిసుతుడు
తల్లి పల్కులు విని తనయుడిట్లనియె:

'అడియారముల గూడి ఆయత్తపడగ
తగునమ్మ యరమూక తల్లి రో నీకు

అమ్మ నీగర్భము నందున బుట్టి
తండ్రి లేకను నంప ధర్మమా నీకు?
అచ్చట మాతండ్రి అణగి వుండంగ
చచ్చెదనంటవు బాల నాతల్లి!
ప్రాణేశ్వరుని నెడబాసి నాతల్లి
భావ్యమే గుండాన పడగ వోయమ్మ!
భట్టు తెచ్చిన సొమ్ము పరగ బుచ్చుకొని
వేడుక పైనమైతెపరు మెచ్చెదరు
సతిపతులును గాల జతగూర్చు
హరుడు

పతిలేని గుండాన బడుదువా తల్లి?
యిలమీద నీ మోము విధి
యనుకొనుము
పొలతి నీగర్భాన పుట్టినందులకు
పతివున్న రణముకు పరగ నే బోయి
నీతావునకు తండ్రి నే గొనివత్తు
జోకతో యిద్దర జోడుగా జేసి
అంపెద గుండాన కన్నరో! వినుము
తల్లిరో నన్నంపు ధైర్యము ఘనం?

## రణభూమి కేగవలదని యరనూక సీత కుమారుని వారించుట

భట్టాలర్గాజు తా పరగ బోవుదన
వెలది యిట్లనె మోము వెలవెలబోవ!
"కటకటా! భట్టాల: కన్నకుమార!
యెటుల బంపుదు నిన్ను యెవ్వరు లేక
పగవాని రణముకు పంపి నేనిచట
యెటుల వోర్తును పుత్ర! యేతీరు
చెపుము
వరుసతో వినరమ్మ వో కాంతలార
పరగ నా పుత్రుడు పైనమైనాడు
వలదని చెప్పుడు వామాక్షులార
నెలవుగాదు కొడుక నిన్ననికంప
నెలకొని తొమ్మిది నెలలు నే మోసి
కనిపెంచి యీడేర్చి కడగండ్లు బాసి
కలని కెట్లంపుదు కన్నకుమార

కనుగొన కదనము కడుభీతి నొదవు
యరనూక పతిని నీ వేకవీరవని
వెరపు లేకేవిధి వెదకెదు కొడుక
సొరిది గా రణమున సోలి భూతములు
మరిమరి యెదిరించి మార్కొను
తనయ
కలనిలో మూగియు ఘనశక్తు లుండు
తరముగా దన్యులు తగభూమి
బొరగ
భూపతి మీతండ్రి భూపుల జంప
కట్టలుగా నుండు కలను పీనుగులు
కుంభిణి కరులును గూలె విలమీద
గుట్టలుగా నుండు కొండ పొడుగునను
రౌతుల తీజీల రణమున నడుక

ప్రరేవాటుగ నుండు వసుధనంతటను
అట బ్రహ్మరాక్షసులా రణభూమి
దారి చుట్టుకయుండు తరలక
యెపుడు
అటువంటి రణముకు
అయ్య నిన్నిపుడు
యేరీతి బంపుదు యెరిగియుండియును
పశిబిడ్డడవు తండ్రి భట్టాలరాజ
పోవద్దు రణముకు పోవద్దు కొడుక
బంధుల నెడబాసి వచ్చితి మిటకు
కపటనాటకధారి కిట్టడి చేసె
పంపాద్రి నెడబాసి పైనమైవచ్చి
(వాప్పుగా కలనికి వాప్పిస్తి విభుని)
పంపితిని కుమార పట్టపురాజు
శ్రీహరి దయదప్పె చేటొనగూడె
బసవన్న వరమిచ్చె బాలిక కలిగె
పాపపు దైవము పరభూమి జూపె
ఘనతగా శ్రీకూర్మ కళ్యాణములకు
పుత్రసంతత కయి పుడమీశ్వరుండు
యేకవీరాజ్ఞచే యిచటి కొచ్చితిమి
యేనుగునాథు కొండిటను తావాయె
రాజుకు, యేకవీరను నమ్మితి మిట
పద్దన పంపాద్రి వైళంబె విడిచి
వల్లవపతి దెచ్చి వసుధకు నిడితి
నాతండ్రి నిన్నంప నా
చిన్నితనయ
భూపతి శోకాన మునిగి యుండగ
పుత్రశోకము వేర పుట్టించెదవటర"

## భట్టావుల రాజు తల్లికి ధైర్యము చెప్పి తన్ను దీవించి పంపుమనుట

అని యిట్లు ఘనతల్లి ఆడుమాటలకు
ధీరుడు తల్లితో ధీరతలు పలికె
పూనియు భీతిని బుట్టింతువీవు
పగవాని నిలనెందు పట్టి సాధింతు
మాతండ్రి పగవాడు మహిమీద
నెదుర
విడువక మార్కొని వెసవాగ్ని
దృంతు
పగవారు తండ్రిని పట్టిదాచినను
చలమున పోరాడి సాధింతు నేను
హిత ఘాతముగ నరకి ఆలములోను
దాడివెట్టియు కొండ దగ్ధము చేసి
పోరిలో తెగటార్చి భూపతుల నెల్ల
ఖండ్రింతు వారిని ఘనశక్తి
మెరయ
యెర్రభూపతి వైవు యెందరుండినను
వేవేగ పొలియింతు వెదకి పోనీక
తెగువ దేవేంద్రాది దివిజులు మెచ్చ
తెచ్చెద తండ్రిని తెరగొప్ప యిటకు
సోమకాసురుని జంపి సొరిది వేదములు
దెచ్చి బ్రహ్మకు యిచ్చు దేవుని
పగిది

వచ్చెద తండ్రితో వల్లవ తల్లి
అమ్మరో నన్నంపు ఆలము కడకు
పసిబిడ్డడని నీవు భావించకమ్మ
పసి బిడ్డడే గాడ పరశురాముండు
కార్తవీర్యుని జంపె కామధేనువుకు
చిన్నవాడని మది చింతింప వలదు
అబలవు బాలుడంచడలెదు నీవు
బాలుడై పుట్టియు పవన పుత్రుండు
భానుని కబళించి పట్టడా మున్ను
చిన్నవాడని మది చెదరనాడెదవు
చిన్నవారలు గార శ్రీ కుశలవులు
హయమును బంధించి యారాము తెదిరి
సేనల గూర్చిరి చెలగుచు వారు
పసిబిడ్డలే గద పణతి నాతల్లి
సామెత లెంచగ చనె ప్రొద్దు చాల
అంపవే రణముకు అమ్మ దీవించి
అంపిన నేబోయి అయ్యను దెత్తు

## యరనూక సీత కుమారుని దీవించి పంపుట

సుతుడాడు మాటకు సుదతి యరనూక
గజ గజ వణకుచు కాంతయిట్లనియె
"యేమని దీవింతు యెట్లు పంపుదును
గట్టిగా దిన్నంప కలుగదు మనసు
చంద్రశేఖరు డిటు సమకూర్చె పుత్ర
యేలాగు పంపుదు యరనూక తనయ
యేమని దీవింతు నేమందు విధిని"
''తల్లిరో! పంపవే తర్లిపోవలెను
ప్రతిమాట లాడకు పరగ ప్రొద్దెక్కె
అయ్యపాదములాన! హరి హరు తోడు!
నాతోడు! పంపవే నను గన్నతల్లి!
తల్లిరో! నేపోయి తర్లిరాక మును
తమక మెక్కితి వైన త్రిమూర్తులాన!
పరమేశ్వరుని యాన! భట్టరయ్యాన!"
ఆనలు వెట్టిన అమ్మ తా జూచి
కొడుకును దీవించె కోమలి తాను :
"కోరి సంజీవిని గొబ్బున దెచ్చి
నట్టి వీరుడు హనుమంతుని బోలి
పనిబూని పోవయ్య! భట్టాలరాజ!
శంకలేకను తండ్రి సమరభూమికిని
శీఘ్రమే రావయ్య! శ్రీధరులు కృపను
భీతినొందకను కుంభిణులు శోధించి
పరిణాన రావయ్య! పరమేశు కృపను"
అనియిట్లు దీవించి యాదవకాంత
బొమ్మని సెలవిచ్చె పుత్రుని కపుడు
అమ్మ మాటలుగొని అంజలి జేసి
ధీరుడు భట్టాల దీవరు డపుడు
కడువేగ రణముకు గదలగ దలచి

బిరుద చల్లడమును బిగువార దొడిగి
హనుమంతు కాశె తా నాపయి గట్టి
చెరుగు వీడిచి కట్టె చల్వ ధట్టియును
వజ్రంపు తళుకుల వంకి మొలజెక్కి
భీకరముగ నందె బిరుదు కఠారి
అరిచేత బట్టుక అమ్మవద్దకును
చనదెంచి మ్రొక్కిన జనని తా జూచి
ఆత్మలో ప్రార్థించె హరిహరు వేగ;
''సూనృత వ్రతులార!
సురదేవులార:
నా వరపుత్రుడు నా ముద్దు కొడుకు
కలనికి వస్తుండె కాయుడు మీరు
ఆదిశక్తివి గంగ! అమ్మరో! నీవు
వెంబడిపదవమ్మ యలమంచి గంగ''
అనియిట్లు ప్రార్థించి అంపెను సుతుని
అమ్మచే సెలవంది ఆ రాజమనుడు
తేజిపై గూర్చుండి తేజంబు మెరయ
ఛత్రచామరములు చేగి పట్టగను
అందలాల్ పల్లకి లారాజు వెంట
గొనకొని కొలుపంగ కొమరుడు
వెడలె
పుల్లాల కేశవుడు పౌరి హయమెక్కి
రాజు వెంట నేగె రభసంబు మెరయ

## పరివారమ్మును వెనుకకు పంపి భట్టావులరాజు ఒంటరిగా యుద్ధభూమి కేగుట

భైరవ నరవను భట్టాలరాజు
అశ్వమును దిగెను ఆపియు రాజు
పరువడి భట్టాల భానుతేజుండు
పల్లకీ లందలాల్ పరివారము గని-
''పరిణతి రానేల పరివార మీవు
సంపద యొద్దను జతనమై యుండు
ఆడవారుండిరి అబలల తోడ
పైదండు రాకుండ ప్రజలుండవలెను
ధీరుడ! కాపాడు ధీరత మెరసి
పొందుగా యిరువురం పోనేల యనిరి
ఒక్కడనే పోవు టుచితంబు యగును
యేనుగుప్రత్యుష్మల కీతెంచి నేను
తండ్రిని వెదకియు తర్లి వచ్చెదను
మావా! రేపో వత్తు మరిది కేశవుడ!''
అని పల్కి కేశవు తా రాజ మనుడు
పరిచరుల్ ధొరలును పరగ కేశవుని
తానెక్కు తేజిని దళముల నెల్ల
తిరుగనంపియు రాజు ధీరుడు కదిలె
భైరవునడవను ప్రళయాగ్ని బోలి
వారిధి హనుమంతు పడి దాటినటుల
ఒక్కడె భట్టాల వసుధీశ సుతుడు
తగ ధూళి పైలేచి ధరణిపై గప్ప
మంధరధీమడై మహీధర మెక్కి
పరువడి రణమును పరికించి జూచె

దట్టమైన గుడార్లు ధర మేరలేక
హేరాళయై యుండె ఏకవీర అని
కనుచూపు మేరను కదనము జూచి
పర్వతమును డిగ్గి పార్థివసుతుడు
కడువేగమున వచ్చె కలను దగ్గరకు

## యుద్ధభూమి వర్ణన

మనుజ సంచారము మరియేమి లేక
దొరకొని మృగములు దొడ్డగా వుండె
యెలుగులు పులుగులు యెసగ
వరుదులు
చిరుతలు తోడేళ్లు చేరి గుంపులుగ
లెక్కలేని మృగంబు లెల్లడ ముసిరి
మనుజుల భక్షించి మరి మత్తుచేత
చొక్కుచు మృగములు సొరిది
యా కలను
చప్పరించుచు రక్త జాలును ద్రావి
క్రాలుచు రొప్పుచు గంతులు వైచు
చంగలింపుచు పొర్లు చలగి
యా కలను
కదుపులై యుండెను కదనంబు
నిండ
వాటికి వెరవక వల్లవరాజు
ధిక్కరించుచు తాను ధీరత మెరసి
యిలపయి గదనము వీక్షింప సాగె
కొట్టి వేసిన బొంది
క్రొవ్వుదొబ్బలును
గుట్టల రీతిని కూలు పీనుగులు
దరిదప్పి వొరిగిన దళములు
మెండు
కలనిలో వొరిగిన గజములు
తరుచ
కరులను నుగ్గాడి ఘనులను భోదువ
ఘోర కొండలరీతి పొర్లాడుచుండె
కన్నోజ రౌతులు కాలారి మూక
పక్కెర తేజీలు పరగ రాహుతులు
మది మేర తేలిక దూలెను తరుచు
కంఠము గుండెలు కరకు
వెంట్రుకలు
కాళ్లను కీళ్లను కరశిరంబులును
నజ్జులై యుండెను నడి కల్లు లోన
బోయలు చెంచులు బోరియు లెస్స
బంతులుగా కర్లి పడియుండిరంత
పిక్కలు డొక్కలు ప్రేగులు దెళ్ళి
వ్రేళ్ళను కాళ్లను వెన్నెముకలను
చెక్కలుగా నరుక శిరసు
పుర్రెలును
కుప్పకై పడి యుండె క్ష్మంభిని మీర
వెల్లి నిండినట్లు హేరాళముగను
పీనుగు మొండెముల్ పెక్కులు
వుండె

## ఖట్టావులరాజు రణభూమిలో తండ్రి కళేబరమునకై వెదుకుట

డాసి యా బొందుల దగ్గర కొచ్చి
వయ్యను తండ్రిని వర్ణించి చూచె
యీ రూపు గాదిది యిచ్చోట లేదు
కటకట పడుచును కదిలెను రాజు
ధరమీద వొరిగిన దళముల నెల్ల
విడల దీసియు తండ్రి వివరించి చూచె
చెండాడి చెల్లిన సేనల నెల్ల
తర్లదీసియు జూచి తండ్రిని గనక
పొగులుచు నా రాజు పోయి ముందునకు
కళదప్పి పడివున్న కాలారిమూక
పడదీసి తండ్రిని పసగ జూచియును
చీకాకుగా నున్న చిక్కెడబాపి
వెదుకుచు తండ్రిని యెత్తి చూచుచును
అందున గానక నా రాజ ఘనుడు
దరికొను దుఃఖాన తల్లడిల్లుచును
పొలకలై పొలిసిన బొందులు దెచ్చి
పొసగించి తమతండ్రి పోలిక జూచి
వీక్షించి తండ్రిని యీ రూపుగాదు
పోవుచు మగుడుచు పొక్కుచు నంత
తిరిగి వచ్చుచు తండ్రి తీరెల్ల జూచి

## ఖట్టావులరాజు కనకనందుల పెంట రణములో మరణించిన మామలను చూచుట

ధీరుడై రణమెల్ల ధీరత వెదకి
కనక నందుల పెంట కదిలె నారాజు
వీరశూరులు గూలు విధమెల్ల జూచి
పంజుదాళ్ళు బిగువ పన్ని గుడార్లు
శిలలేని గుడులుగా చేద్పడి యుండె
గోపాలకులు బడె గుడహార్ల ముందు
కసిగంద గాయాలు కత్తులు నాటి
సమిరిన తిరుమండ్లు చందము జూచె
దిగ్గజముల వంటి తిరుమండు లెల్ల
గ్రమ్గిన విధమెల్ల మరి మరి జూచె
వగచి దుఃఖించెను వల్లవరాజు
"తిరుమండల మామః ధీవరులార
వగుసగా పోట్లు మీ వక్షము నాటి
వొరిగితి రిలమీద వో మామలార
శంకలేకను పోరి శరములు నాటి
చెల్లితిరో మామ! చెలగి యిలమీద
మదయుక్త రిపులను మద మణగించి

మహిని రాలితిరి యిట మామలార!
మీరు
ధరణీశుడౌ తండ్రి దగ్గర లేడు
యెచ్చట వారిగెనో యరనూక
తండ్రి
చెప్పుడు మామలు శంకేం మీకు
కలలోని తండ్రిని కానంగ లేను
యేమి తెల్పరు మీరు యెచ్చోట
నుండె

మీ తోడుబుట్టువ మీనాక్షి మిగుల
వలపోయుచున్నాది వసర మా తల్లి
తల్లిపోవలె మామ తండ్రిని
గొనుచు
అయ్యయ్యో మామలార! అయ్యను
విడిచి
వొయ్యన మీరిట వుంటిరి మామ!
రాత్రి కావచ్చెను రాజా కన్పడదు''
అని ప్రలాపించుచు నచ్చోటు కదిలె

## ఏకవీరపెంట రణభూమి వర్ణన

ఏకవీరాపెంట కేతెంచె రాజు
మహిని యా కదనము
మరి యెటులుండె
ఘనమైన శక్తులు కదనములోన
విహరించు చుండె పు విపరీతముగను
చెలరేగి భూతముల్ చేరి యా కలను
కర్కశ పిడుగు కండలు మెసవి
సొక్కుచు శివమాడు సొరిది
యా కలను
శాకినీ ఢాకినీ చలగుచు కలను
కేరుచు నార్చుచు కేకలు వేయు
చిల్లర భూతముల్ చెలరేగి వచ్చి
యాదులాడుచు రక్త యేరులలోన
వాటికి వెరువక వల్లవరాజు
శూరుడై రణమున చొచ్చి పోవుచును
వెదుకగా రణమును యెటువలె నుండె
హతముగా నరికిన అశ్వాల బారు

కూలిన శవములు గుజ్జరి దళము
సరదార్లు దొరలును సామంతవరులు
మడిసి గుట్టలు పడె మహిమీద చాల
మేర లేకుండెను మేదినంతటను
పెనుగుట్టలై యున్న పెద్ద తేజీలు
భీకర రాహుతుల్ బిరుదుమన్నీలు
పోట్లచే రణమున పొర్లుచు నుండె
దవడలు పండ్లును దండ చేతులును
నరికిన భుజములు నల్లని యొడలు
కదలేక యుండెను కల్లి మధ్యమున
కొంకులు నరికిన ఘోటకాలెల్ల
పంబ దన్నుక యుండె పారిపోలేక
తెగిపడిన తలలు తేలి రక్తమున
మీసాలు యెగవైచు మేటుల్లపగిది
అటువంటి రణమున ఆ రాజఘనుడు
వెదకుచు నడచుచు యిటునటు చూచి
చీకాకు శరముల చిక్కెడబాపి

బిట్టుగ తండ్రిని పేరున బిలిచె.
రట్టడి రణశూర? భట్టాలరాజు
అరుదుగ చూచెను ఆ కదనమును
తేరులు సారధుల్ తెగిన గొడ్డులును
పల్లకీ లందలాల్ భద్రకరులును
తొండముల్ తెగి కూలె దొడ్డగుట్టలుగ
వాగె బిగువు దప్పి వాహనంబులును
పొర్లాడు చుండెను పుడమిపై మిగుల
మావటీల్ గూలిన మదకరులెల్ల
కొండలవలె తిరుగు కొమ్ము యేనుగులు
కట్టలుగా గూలి కాలారి బలము
మిట్ట పల్లము గతి మేదిని యుండె
మందు పొగలు దాకి మరి వీరవరులు
సందులు పిడిలియు సమిసి రచ్చటను
వింటికోపులు జిబురు యిసుప జీరెలు
కేశాలు గెజాలు కీలు కత్తులును
పొడి పొడిగా విర్గి పోగులై యుండె
బల్లెముల్ యీటెలు బాణకత్తులును
కైజార్లు వంకులు కంచుటగ్గెలును
కచ్చుపెచ్చుగ నుండె కల్లిమధ్యమున
బొత్తులై పడియుండె బోరి గుడహార్లు
చంద్ర గుడారులు చంద్రహారములు
సమరమునను బడె సంకులముగను
భేరీ ఢమామీలు పెద్ద బూరలును
తుడుము నగారాలు తుదిమేర లేక
కుప్పలై పడియుండె కుంభిణినంత
శింగిణుల్ తరకసాల్ బిరుకత్తు లెల్ల
సరగ కుప్పలు గుండె సందులేకుండ
బాణాలు వడి దాకి బారులు మడిసి
హేరాళమై యుండె యేకవీరవని

## భట్టావులరాజు తండ్రిని గానక ఏకవీరను ప్రార్థించుట

కనుమేర రణమును కన్నుల జూచి
ఆశ్చర్యమును బొంది ఆత్మతా దలచె:
"అవుర యీ ఆనిచేయ హరునికె
తగును
నరునికి సాధ్యమా నరయ
యీ రణము
కంటిని రణమును కన్నులనిండ
కల్లిలో తండ్రిని కానలేనైతి
తండ్రిని దెత్తని తల్లితో పలికి
కడువేగ వచ్చియు కానలేనైతి
ఆయ త్తపడకుండ ఆనలు బెట్టి
యెదురు చూడుమనంటి
యరనూకనమ్మ
కన్నుల తండ్రిని గననైతి కలను
మాయగప్పెనొ యేమొ మరి
యిట నాకు
యేమందును విధిని యేమిసేయుదును
ధీరుడై నిలచియు దిక్కులు జూచి
పరులు నా తండ్రిని పట్టగ వెరచు
యేనుగునాథు కొండేకవీరివు
సర్వేశ! శంకర! సర్వలోకేశ!
భూపుల గూల్చియు భూమిని వొరిగె

చూపుము తండ్రిని సురలోకవినుత
గాంభీర్య ధనుడగు ఘనుడు
నాతండ్రి
పోరాడి సమిసెను భూనాథుడిచట
వెదకిన కనుపించ డెచ్చోటనైన
కానరా తండ్రిని కలనిలో మీరు
సుందరి పరశక్తి సురులకు తల్లి
వీరశూరుడు తండ్రి యిచ్చోట గూలె
అరులతో పోరాడి హతమాయె
తండ్రి
చూపుము మ్రొక్కెద సుందరి నీకు''
అని యిటు శోకాన నడలి యారాజు
ప్రార్థించె నేకవీర్వరశక్తి నెదను

## భట్టావులరాజుకు ఏకవీర ప్రత్యక్షమగుట

బెదదంపు మిడిగ్రుడ్లు పెద్ద కోరలును
నాగభూషణములు నందుల కదెము
తరుచు వీరజడలు తామరరవిక
చేత శాసపు గిన్నె సింధూర బొట్టు
[illegible]
[illegible]
పర్వతాకారమై పరువున వచ్చి
రాజు యెదుట నిల్చి రమణి యిట్లనియె:
"యెవరవు నీపేరు? యెవని
పుత్రుడవు?
సురలైన రణమును జూడ వెరతురు
దేవాది దేవతల్ దేవేంద్రుడాది
వీక్షించ వెరతురు వీరులీరణము
నడిరాత్రి కావచ్చె నడికల్లులోన
వెరపక నెదకేగ [illegible]
[illegible]
[illegible]
తరిమింతు వురికింతు తథ్యము
చెపుమ
నా యాజ్ఞచేతను నరుడ శక్తులిటు
యేమనకున్నారు వెరతురు నాకు"

## భట్టావులరాజు ఏకవీరతో తరకవాదము చేయుట

పెళ పెళ నార్చుచు పలుకగ శక్తి
వినియును భట్టాల వీరశేఖరుడు
బెదరక నెదురగ చేర యిట్లనియె
''గంగవో. గౌరివో గద్దించి పలుక
తలనిండ జడలును త్రాడుల వలెను
మెలియించి పలికేవు మేదిని నీవు
శక్తుల మొనగత్తె చెప్పుము పేరు
తరుచు మాటలు మాని తర్లిపోవలెను

కుంభిణి నిల్చియు గుడ్లెర్రజేతు
చలగ సీరంకెల శంక లేదు మరి
హరి హర బ్రహ్మల కవతారమైన
పరశక్తిని గొలిచెడి పల్లవుల మేము
రుద్రగణాదులు రూఢిగా మెచ్చ
భద్రమౌ లింగము ప్రమథుల మేము
మందరధరు భక్తమాన్యుల మేము
ఝడుపు వెరపు లేదు జరిగి
పోపొమ్మ
పాములల్లాడగ పరువులు బారి
చేష్టలెల్లను వీడి శక్తి పోపొమ్మ
వంటరి యీకల్లి వనిత వెదకెద
తలచూప వెరతురు దానవు లెల్ల
నీకు నే వెరతున నిలిచి యున్నావు
మాతల్లి యరనూక మదిరాక్షి తాను
ఉచ్చు కాయ త్తమై సిద్ధముగ నుండె
యిపుడె వత్తునటంచు యింతికి జెప్పి
వెదక వచ్చితి రణము యరనూక
పతిని
కనుపడదు మా తండ్రి కల్లి
మధ్యమున''
అనియు భట్టాలరాజాడు మాటలకు
చలగ యా దేవియు చలమున పలికె
''యెవరోయి నరుడ! నీవెదిరించి
పలుక
పూని పల్కెదవ వీవు పుట్టుక వినుము
నారూపు గుర్తించ నగున నీ కెపుడు
హరి హర బ్రహ్మాదు లంతము
లపుడు
మాతనై బెంచితి మహిను
జెన్నొంద
యేరూపు యెరుగుదు విలలోన నీవు
అరగంగ నారూపె సవనెల్ల నేనె
గంగ మీ యిలవేల్పుగను పల్కెద
వీవు
ఆరూపె నారూపు ఆలించి వినుము
సూర్యుడు చంద్రుడు సౌరిది
తారలును
సురలును నారూపు సురరాజు నేను
నరులు నీ లోకము నాగలోకమును
గగనంబు దిక్కులు కలయ నారూపు
ప్రళయ వాయువు నేను పరిపూర్ణమేను
కారణం జమదగ్ని కామిని నైతి
పరశురాముడు కొడుకు
పరంజ్యోతి నేను
కలకంఠి యరనూక గారాబు కొడుక
కాచితి నిందన్కు కరుణించి నిన్ను
పరవారు నైతేను పారద్రోలెదను
రాజ సుతుడ వౌట రానిచ్చి తిటకు
కాపాడి తిందనుక కరిగె నా మనసు
మన్నీల దొరలను మహిమీద గూల్చి
వారుగుచు మీతండ్రి వొయ్యన
నన్ను
యేకవీరా యనె యరనూకరాజు
అతడు తల్చుటవల్ల నాత్మ నుప్పొంగి
కాపాడితి రణము గొలెత్తకుండ
వారిగిన తండ్రిని నొగి బ్రదికించి
మాటలాడించెద మహి రథములను

పరగంగ తర్లింతు భార్గవ పుత్రికి
యేరీతి కొలిచెద వెరిగింపు"
మనిన
అను శక్తి మాటల కా రాజఘనుడు
కల కల నవ్వియు ఘనుడిట్టు
లనియె!
"నాతండ్రి యరనూక నమ్మిన వేల్పు
నాతోడ తండ్రియు నరయ మాట్లాడ
మరి వేగ వినవమ్మ! మాతరో!
నిన్ను

అమరంగ కొలిపింతు
నానందమొంద
కడమ శక్తుల కెల్ల ఘనభోగములతో
కల్పింతు కొలువులు కల
విధంబునను
తుష్టిగా భక్తులు తుదిమేర గాగ
జరిగింతు నమ్మకము శంభునితోడు

## ఏకవీర భట్టావుల రాజుకు తండ్రి కళేబరమును చూపుట

ఆరాజు మాటల కలరి యాశక్తి
కలకల నవ్వియు కడు సంతసించి:
"పదవయ్య భట్టాల పట్ట భద్రుండ!
చూపెద తండ్రిని సురుచిరమూర్తి!"
ఘనుని వెంటనిడుక కదలె రణముకు
వివరింప నారణ మేవిధముండె:
మల్లెలు జాజులు మరువము తావి
కురువేరు దవనము కూడిన తావి
క్రమ్మక కస్తూరి ఘనత జవ్వాజి
ఘుమ్మను వాసన కుంభిని వెలయ
గరిమెతో యాదవ గజములనంగ
వీరులు వొరిగిన విధమెల్ల నపుడు
పేర్మి నేకవీర ప్రియమున జూప
ఘోటకముల నరికి గొరకలు నాటి
ఆజిలో వొరిగిన యాదవుల్ జూచి

ఆ చోటు కదిలెను ఆ రాజఘనుడు
గర్భ నిర్భేద్యమౌ గాయముల్ నాటి
గాలము లింగన కలనిని జూచె
పంతము రౌతుల బారులగూల్చి
పెయ్యల కోనేరు వొరిగింది జూచె
శంక లేకరులను శిరములు దునిమి
శశిధరు వారంత చెల్లుట జూచె
మట్టుగ పోటులు మకుటము నాటి
మాధవువారలు మడియుట జూచె
తీరుగ నందర తిలకించి చూచి
ఆచోటు కదలెను ఆ రాజఘనుడు
సంగబోయిన వారు సారంగువారు
కనకనందుల వారు కల్లంద్లువారు
కలనిలో గూలిన క్రమమెల్ల జూచె
"పందుము వారికి బల్లెముల్ నాటి

రాజువద్దను వొర్గె రావయ్యచూడ
చీకాకుగను పోట్లు శిరముల నాటి
వొరిగెను తిరుమందు వరులను జూడు
జడదారువారును శంభునివారు
పశుపతి వారలు భద్రాక్షువారు
కూలిన గోపుల గుంపును జూడు
భార్గవువారలు పయ్యలవారు
వొరిగిన ఘనులను వో రాజ! చూడు
అందరు గూలిన ఆ చోటు చూచి
దాపట చెల్లిరి దాయాదు లెల్ల
వలపట చెల్లిరి వల్లవులెల్ల
పొందుగా భట్టుల భూనాథ రమ్ము
రాజుల నరికియు రాశిగా జేసి
పూని యీటెలపోట్లు పొలుపుగా నాటి
పులిముద్దు రాఘవ భూపతిమామ
వొరిగినా డితని వైనము జూడు''
అని యిటు దెలుపగ నా రాజు వచ్చి
మేనమామను జూచి మిగుల దుఃఖించె:
"తిరుమందుల ఘనుడ!
దివ్యప్రతాప!
వొరిగితివా యిట వైరుల జంపి
మేటి యీటెల పోట్లు మేనెల్ల నాటె
అయ్యకడ వరిగితివి అనిలోన
మామ
వనరంగ కుడి భుజం వల్లవపతికి
కుడి భుజము విరిగి కూలితే మామ!
బావ మరిది వీవు బంధుడ వీవు
బారులు తెగటార్చి బల్లెముల్ నాటి
అండ బాయక చెల్లి తయ్య
యిచ్చటను
తండ్రిని గనపలె తర్లిపోయలెను"
అని యిట్లు ఆ రాజు నడలంగ జూచి
అనియెను యెకవీరాతని జూచి:
"అడలకు మీ తండ్రి నపనిశవరుని
చూతువు ర''మ్మన చురచురపచ్చి

## తండ్రి కళేబరమును చూచి భట్టావుల రాజు దుఃఖించుట

ధరణిపై వొరిగిన తండ్రిని జూచి
యెలుగెత్తి భట్టాల
యదుకులాధిపుడు
తన తండ్రిపై బడి తానేడ్వసాగె:
"పుట్టిన తావులు భూములు విడిచి
చెల్లితి విటులను చేసెను బ్రహ్మ
కంఠము రక్తము గమ్మియు నుండె
పోటులు నాటియు వో కన్నతండ్రి!
కాణాచి యంటమంచి కడజేసి వచ్చి
యేనుగమల చెల్లి తెరనూక తండ్రి!
యెదురొమ్ము రక్తము యేరులై పార
యీటెలు రొమ్మున విరిగియు నుండె
బల్లెముల్ నాటెను బహుగను తండ్రి
కదిసిన పగవార్ని ఖండ్రించి వైచి
కుంభిణిపై యిటు కూలితే తండ్రి
తమ్ముల బంధుల తగ నెడబాసి

యిచ్చట మరణించితే తండ్రి నీవు!
దండిగా రిపులను ధరణిపై గూల్చి
దండచేతులు నొచ్చె తండ్రిరో నీకు!
గొదకొని రాజుల ఘోరాజి గూల్చ
గొరకలు నాటెను గోపాలమూర్తి
జొత్తుగ రక్తము జొబ్బిలుచుండె
ప్రదరముల్ కడుపులో బారె
నా తండ్రి
వాలాయము రిపుల వసుధను గూల్చి
మరఫిరంగి గుండ్ల వారిగితే
తండ్రి!
తొడిగిన వజ్రాంగి తుత్తురుమయ్యె
తూపాకి పోటులు దూరె నా తండ్రి
కాంతియౌ దేహంబు కందువారినది
పరబాణములు నాటి పారె నా తండ్రి
పుత్తడి జంధ్యము పోగులు తెగియు
చెదరి పడుండెను శారీరమందు
ఖాసిల్లు మెడనున్న పచ్చపతకమును
వాసిగ రక్తము వన్నెయై యుండె
పెరిగెను చౌకట్లు ప్రేలి రక్తమున
కనుపించకుండెను కన్న తండ్రిపుడు
వురరము రక్తము నుబుకునుండె
వుక్కుటలుగులు నాటె వుదరాన
తండ్రి!
తండ్రిరో! నేనెంత తల్లడించినను
తలయెత్తి చూడవు దయలేద నీకు
పలువరించినగాని పలుకవు నాతొ
దశముల గూర్చుక తర్లి రాననియు
అళిగితివో తండ్రి! అలుకేల నీకు
పలుకవు నాతోను పంతమా తండ్రి!
దండ యెవ్వరు నాకు దయలేద
తండ్రి!
యేమనకున్నావు యరనూక తండ్రి!
పలుమారు ఆడలిన పలుకవు నాతో
వూరకుండుట మీకు వుచితమా
తండ్రి!
సమరంబునను నీవు చంపగ మిగులు
పగతు రెచ్చట నుండె పలుకుము
తండ్రి!
పోరాడి రిపులను పొలియింతు
తండ్రి!
యెంతయు తలపోయ వెరనూక
తండ్రి!
బాలుడ నుంచితి పట్నాన నన్ను
అయ్యా! నీవెంటనే నాజికి రాగ
చెక్కుడు రణమున శత్రులనెల్ల
వీరపతివ్రత యరనూకదేవి
కేమని జెప్పుదు నే వార్త జెపవు
తాత యేల్ యలమంచి
తర్లిపోయినను
ప్రజలెల్ల వచ్చి నీ పరిణామ మడుగ
యేమని జెప్పుదు యరనూక తండ్రి!
అల్లుడు పల్లెకొండాతురత వచ్చి
మామ యేదని యడుగ మరి
యేమి జెపుదు?
అయ్యా నీ చెల్లెలు అత్త కొమరమ్మ
మాయన్న యేదన మరి
యేమి జెపుదు!

ఆవుల పోత్రాజు కర్ధాంగి లక్ష్మి
పావని శిరిదేవి బావ యేడనిన
యేమని దెలుపుదు యరనూక
తండ్రి?

కరుణ యెంతయు లేదు కన్నెత్తి గనవు
తండ్రి నీ యొద్దను తర్లక యిపుడు
విడిచెద ప్రాణంబు యిప్పుడు
చూడు"

## ఏకవీర యరనూకరాజునకు ప్రాణములిచ్చుట

కలనిలో భట్టాల ఘనవిశాలుండు
కడు దుఃఖమున బల్క ఘనసురల్
వినియు
సోమవంశపు పతుల్ శూరులు వీరు
కనుగొన తెంపుచే కల్లిమధ్యమున
తెంపు జేసె నటంచు దేవతావరులు
హరుడు విష్ణువు బ్రహ్మయాశక్తి
కనిరి
'పలికించు రాజుకు ప్రాణములిచ్చి
ముదమున సుతనితో భూపతి
నిపుడు
ముచ్చట లాడించుము మునిరాణి
నీవు'
అని దెల్పి కనక రథ మంపిరి సురలు
అని దెల్ప వినియును ఆ యేకవీర
మాయ రూపిణి శక్తి మహిమతో
నపుడు
సౌరిది శరీరము జొచ్చె వేగంబె

ముదమొప్ప రాజుకు మూర్ఛయు
వీడె
ఆజిలో పోరాడి యా రాజ
ఘనుడు
అలసి నిద్రించిన యటు మేలుకొనెను
శరములు నాడించి కదలె నట్టిట్టు
పురమున రక్తము పులుకుచు నుంత
తనయుని వంకను తాజూచి రాజు
పుత్రుడౌట నెరిగి భూనాథు డపుడు
అదరియు పుత్రుని అక్కున జేర్చి
మొగము తప్పక జూచె ముచ్చట దీర
పలుచని చెక్కిళ్లు పట్టి తా జూచె
వీపున చెయి జేర్చి విన్నదనాన
కనుగొని పుత్రుని కడు చిన్నకురులు
వన్నెగా దువ్వుచు వరుసతో చేత
తనయుని తోడను తండ్రి
యిట్లనియె:

## యరనూకరాజు పుత్రునితో సంభాషించుట

"హా పుత్రః భట్టాల అయ్యరో! నీవు
యెట్లుల వస్తివి యెవ్వరు పంపె

కూడుచు మృగములు కూతలు
వేయు
మేరలేకను వుండె మేది నంతటను
పీటి ధాకల కెర్వ్వ కిటువంటి రణము
యేరీతి వస్తివి యేదేండ్ల కొడుక!
బాలుడ నెంచక పణతి మీతల్లి
పనిబూని యెటువలె పంపె కుమార!
నోములు సుతునికై నోమి మీతల్లి
తనయ నిన్కని పెంచి తానోర్వలేక
కలని కెట్లంపెను కన్న కుమార!
పశిబిడ్డవని నిన్ను భావించు కొనక
యీ దండి రణముకు నెట్లంపె తల్లి?
బిట్టుగ శవములు పిక్కటిలు చుండు
వస్తివి బెదరక వల్లవ రాజ
మదిరాక్షి మీతల్లి మనసెట్లు కరిగె
యెంత కఠినురాలు యీ కల్లిలోన
వెరపు లేకెటువస్తి యదుకులాధీశ!
రాతి గుండియ తల్లి రణముకెట్లంపె?
ఝడుపు లేకెటువస్తి చక్కని
కొడుక!
అతిభీకర రణముకు అయ్య నిన్నంపి
యెటులోర్చుకొనె నయ్య యెలమి
మీ తల్లి?
కొడుక నిన్నంపియు కోమలి సీత
గుండెటు భరియించి కుదురుగ
నుండె?
యెంత నిర్దయురాలు యరనూకదేవి!
కడు చిన్న బాలుని కలనికి బంపె
కలని నుండి భటులు కానంగ రాగ

కన్నీరు బెడితివో కమ్మలు చదివి
నామీద ప్రేమచే నాయయ్య నీవు
ఆపదపడి వస్తి ఆబ్బురపు
కొడుక!
ధరణి పై పోరిగిన దళముల జూచి
దద్దరిల్లితొ పుత్ర దాహ మొందితివో
అల్ల కల్లోలము నగు కల్లిలోన
బాధ నొందియు వస్తి భానుప్రతాప!"
అని యిట్లు రణములో ఆ రాజఘనుడు
తనయుని తోడుత దయతోడ బలుక
పరగంగ తండ్రితో పలికెను
సుతుడు
"నరనాథ! యరనూక! నాతండ్రి!
నీవు
పక్కడ విచ్చోట వొరిగి యుండినను
యెట్లు భరింతుము! యెవ్వరు దిక్కు!
ఆప్తులై వచ్చిరి హరివంశమెల్ల
సమరంబు జేసియు సమసి రిచ్చటను
నరనాథ; గనవస్తి ననుగన్న
తండ్రి!
ధరణి కుమారుడై దనరినందులకు
తండ్రిని వెదుకని తనయుడు
యేల?
బవరముననను నాదు భ్రాంతెల్ల దీర
యీరీతి పొడ గంటి నిప్పుడు నిన్ను
చల్లనాయెను తండ్రి సంతసమాయె
చెడ్డది రణమని జెప్పుమవు నాకు
జలధిలో మత్స్యంబు చరియించునట్లు
కూర్మము గిరిని తా కుంభించినట్లు

వో అయ్యా రిపులను నురుమాడుదేను
తరమైన పంపాద్రి తరలియు మీరు
తర భట్టరయ్యను వరమడిగిటకు
తనయుని నిచ్చెను తనమూర్తి నేస
హరివంశమున బుట్టి యవతారమైన
ఆలము కెరుతునా అయ్యరో నేను
శంక యేలను తండ్రి! చెలగి
యీ రణము
తండ్రి! నీ భుజబల్మి తద్దయు గల్గి
సమరంబు కెరతునా జననాథ!
తండ్రి!
తండ్రికి గల పగ తనయుడు దీర్చ
అవును ధర్మంబని అవని
పల్కెదురు
మాతల్లి యరసీత మధురాయతాక్షి
తమకము యెక్కిన తగ నాన బెట్టి
వనరంగ రణముకు వచ్చితి తండ్రి
కదనములో నిన్ను కనుగొంటి
తండ్రి
చెప్పుము పగలు నీచిత్తమునున్న
యే రాజు వచ్చెను? యెవ్వరు యెదిరె?
వేవేగ వినుపించు యరనూక తండ్రి!
పట్టుదు వేధింతు పగలు యీదేర్తు
కపటముంచకు తండ్రి
కరకంతునాన!
యెర్ర భూపతి వంశ మెందరునున్న
మరుగు బెట్టక నాతో మరివేగ జెప్పుము
చంపుదు గెలుచుదు సమరంబులోన
కోటలు దుర్గముల్ కోలాహలముగ
చెటుల యేనుగుమల చిచ్చును బెట్టి
మగిడి వచ్చెద తండ్రి మరివేగ జెప్పుము
అయ్య నీసెలవిచ్చి అంపుము నన్ను"
ఆరీతి పుత్రుడు ఆడు మాటలకు
పుత్రున కెరనూక భూనాథు
డనియె:
"అడిగితివి పగలు అయ్య నీవిపుడు
చెప్పెద వినవయ్య! చెలగ నీవిపుడు
కారు చిచ్చుల రీతి కలనిలో నెదిరి
సరిగ పోరెద పతి సమసెను
అదుగో
ఆతని సహోదరు లతి పరాక్రములు
కనక నందుల పెంటగల తమ్ములెల్ల
చెల్లిరోయి కుమార! సేనలతోడ
యిప్పటికి రిపులు యెవ్వరు లేరు
కలదెర్రపతికిని కలిగిన సుతుడు
పేర్మి నేనుగుమల పెరుగుచు నుండె
దీరుడ పురికిని తిరిగి పొమ్మిపుడు
యెదురు జూచును తల్లి యరనూక
సీత"
అని సుతునికి బుద్ధులన్నియు దెల్పి
కొడుకు తొడను మూర్ఛ గొబ్బున
జెందె.

## యరనూక రాజాదుల కళేబరములను ఏకవీర పట్టణమునకు చేర్చుట

తండ్రి మూర్ఛిలగాను
తనయుడు జూచి
గట్టిగా తండ్రిని కరముల బట్టి
కన్నీరు బెట్టుచు కట కట అడలి
ధరణిపై నటువుంచి తాజూచి రాజు
పరువడి శక్తితో పలికె నీలాగు
"క్షమింప మునిరాణి! భార్గవు తల్లి!
పరదైవమవు నీవు పర (o)
జ్యోతివమ్మ!
ఆదిలించి వెదిరించి అయ్యను జూపి
తడవు బల్కించితి తగునమ్మనీకు
తద్దయు మాతల్లి తరుణి యరసీత
యెదురు జూచుచు నుండు
వేగపోవలెను
పలుచనాయె యిరులు బయలాయె
దిశలు
ప్రేమతో వేడెద యేకవీర నిను
రాజును బంధుల రథములపైన
యెక్కించి నందర వేగంబుగాను
ఘన హయంబులగట్టి కదిలించు
వేగ"
రత్నాల పల్లకి రాజును వుంచి
యేకవీరాంబ తా వేగంబె తాను
కల్లిలో గూలిన కదమ నందరను
భట్టరయ్య కృపను వైకుంఠ మంపి
"వినవయ్య భట్టాల విక్రమశాలి!
తర్లింతు రథములు తడవు లేకుండ
అప్పుడాడిన మాటలివి తప్పరాదు"
అని పల్కి రాజుతో నామె శక్తులను
పేరు పేరున బిల్చె యేకవీరపుడు
"శంకరి! మీనాక్షి! చండికాదేవి!
బోరున రండు పూబోణులారిటకు
పులిముద్దు రాఘవ పుణ్యాత్ముడితడు
పూని నడిపించుడి పుష్పరథమును
పెద్దమ్మ! చౌడమ్మ! పల్లజడలమ్మ!
తీరైన చక్కని తిర్మందు వీరు
పరగ యీ యరదముల్ బరుపుడి
మీరు
చెంగట కూనమ్మ! చెలగ మారెమ్మ!
కలకంతు లారిపుడు ఘన వల్లవులను
గల అందలములను కడువేగ బట్టి
నడువుడి రాజుతో'' నన శక్తులెల్ల
కలకల నవ్వుచు గ్రక్కున వచ్చి
యేకవీరాంబయు వెలయ శక్తులును
పన్నిన రథములు పల్లకి లెల్ల
పట్టుక వైనాన పరువడి నిలువ
అంబ తా పైనమై యా రాజు వెంట
భట్టాల రాజుతో బాగొప్ప ననియె
''మీ తండ్రి రథముపై మీరెక్కి
డిపుడు
రణభేరి వేయించి రథము
నడిపింతు"

అన విని రాజు తా నరదము యెక్కి
జంఝూ యని రథము చలగంగ
తోలె
అటువెన్క పులిముద్దు ఆధిపతి
రథము
పొందుగా వుటమెగిసి భూమిపై
నడుప
తిరమందు లరదముల్ తీవ్రమె
కదిలె
పరగంగ శక్తులు బారులు దీర్చి
ఘనముగ నడువగ గగన మధ్యమున
గల దేవతులు జూచి కడుచోద్య
మందె
'వనర భట్టరస్వామి వర
ప్రసాదమున
వసుధను జనియించె వంశ వర్ధనుడు
యీతడు హరివంశ పృథ్వీవరుండు
కలియుగమున వీని కథ నిల్చు'
ననుచు
మెచ్చి సురలు జన, మెలత యేకాంబ
వచ్చె భార్గవపురికి వనర తెలవార
పురి సమీపంబున పొదలు పూదోట
జాజులు గొజ్జంగి సంపెంగ విరులు
పరువమైన మొగిలి పసుపు
రంగుగను
వికసించు మల్లెల విరవీగు లత
వాటంపు పొన్నలు వరుసను లతలు
మారేళ్ల నేరేళ్ల మంచి వెలగలును
చింతలు మామిళ్ల చిగురాకు పొదలు
తరుచుగ నుండెడి తరుల నీడలను
రాజు రథము నిల్పె రణభేరి వైచె.
రాజును భట్టాలరాజు దెచ్చెనని
గుబ గుబ లాడుచు గుంపులు గూడి
పరువులు బారుచు పట్నపు ప్రజలు
తము గొనవచ్చిరి ధైర్య ప్రతాపు
కదమ వారరదముల్ గ్రక్కున నిల్పి
పులిముద్దు రాఘవు పొన్నల నీడ
అందర నుంచిరి ఆరటుల నీడ
కనక రథమున నున్న ఘనుని
యరనూకు
వుత్తము నుంచిరి వృక్షమునీడ
దీవించి భట్టాల ధీరుని తాము
గొల్లున నార్చియు గొబ్బున కదిలె
అదృశ్యమాయెను ఆ శక్తు లెల్ల
యేకవీరేగెను యేనుగుమలకు

## తండ్రిని తెచ్చితినని భట్టావులరాజు తల్లికి నివేదించుట

అంతట భట్టాల ఆ రాజ ఘనుడు
తల్లికి జెప్పంగ తా కదలెనచట
వేడుక తోడుత యరనూక దేవి
పసుపు చీరెను మోము పలుమారు
తుడిచి
ప్రక్క బరుండిన పట్టి నెత్తుకొని

ముద్దాడుచును తన ముదితల గూడి
పీణెలు మద్దెళ్ల వెలయ సన్నాయి
జతగూడి వాయించ చెలగు భోగమున
ఆటల పాటల నటు ప్రొద్దుబుచ్చ
నిద్ర వేగింపుచు నీరజనేత్రి
తన విభు నెడియాలు దగ్గర వుంచి
కన్నుల జూచుచు కండ్ల కద్దుకొని
సారెకు నివ్వాళి సఖియలు పట్ట
కాంతియౌ సొమ్ములు కన్నులజూచి
యరనూకదేవి తా వెలదుల కనియె:
"తరుణులార! వినడు ధరణీ
విభుండు
సొమ్ములు నెడబాపె శోదున బాసె
రాలేదు పుత్రుడు రణమున కేగి
మరయు చంద్రుడు గ్రుంకె మలిగెను
దివెలు
తంత్రిని గనుగొన తనయుడు పోయె
రాలేదు యెటులొకో రమణు
లారికను
సుతుడైన రాలేదు సూర్యుడు
పొడమె"
పైదలు చెరనూక వెలది యటుండ
కడువేగ భట్టాల కంఠీరవుండు
అనువుగ నగరికి ఆయన రాగ
చూచియు చేడెలు చురచుర వచ్చి
'అమ్మ! నీ తనయుడు యాదవ
ఘనుడు
అల్లడుగో వచ్చె నవనీశ సుతుడు'

సుతుడు వచ్చె నటన్న
సుదతి యరనూక
గద్దెపై నుండియు ఘనుని వీక్షించి
దిగ్గున లేచెను దీనతతోడ
'కామిను లారిదె కల్లిలో నుండి
చనుదెంచె కొమరుడు సరగున మీరు
పట్టుడు నివ్వాళి పై దృష్టి దీసి'
దిగ దిగ దీసిరి దృష్టి గోపికలు
నెలతలు పట్టిరి నివ్వాళి నంత
తనయుని కెదురుగా తల్లి తావచ్చె
అమ్మను కనుగొని యా రాజ ఘనుడు
తలవంచి తల్లికి దండము బెట్ట
వందనమిడు సూను వదనము జూచి
ఆదరమున తల్లి అక్కున జేర్చి
'తెచ్చితివా తండ్రి! దేవు నావిభుని
తవు పువ్వుల తీరును అచ్యుతుకేశు
పులిముద్దు రాఘవు భూపతి మరిది
అందర రెచ్చితివయ్య నా కొడుక!
వలురాజు పుత్రుండు
వరవిక్రముండు
యెచ్చోట నున్నాడు
యరనూకరాజు?'
తల్లి పల్కగ విని తనయు
డిట్లనియె:
"అమ్మరో! మాయయ్య అరులతో
పోరి
అలసి నిద్రించిన ట్లవనిపై వారిగె

మరియు నీతోడు తిరుమందులు
ముప్పురు
రణమున పోరాడి రణభూమి వొరుగ
వారిని తండ్రిని వనర దెచ్చితిని
చూతురు పదరమ్మ
సుదతు లందరును"

అనిన కుమారుని హర్షించి తల్లి :
"భట్టర పరమేశు వరపుత్రుడవుగ
అందర దెచ్చితి వనినుండి యిటకు
భట్టాలరాజ! నా భాగ్యము పండె
జగమున నీపాటి జనులెవ్వరుండు?"

## యరనూకసీత భర్త కళేబరమును చూడవచ్చుట

అని యిట కొమరుని హర్షించి పలికి
మగువ మాటాడుచు మరి వేగ వచ్చి
బంగారు గద్దెపై భామ కూర్చుండి
దాదులు పెట్టంగ ధరియించె నగలు
పట్టుచీరెను గట్టి పణతి యందివ్వ
వామాక్షి నడుముకు వడ్డాణమిడియె
పశిమించు కడియముల్ పద్మాక్షి
కపుడు
బాగొప్ప పాదాల పణతులు యిడియె
తతిరాకుబోడి యద్దము చేతనంది
నీరజనేత్రియు నీడ తాజూచె
కామిని తన రూపు కడు
వేడ్కజూచి
కలకల నవ్వియు కామిని పలికె :
"మునుపటి కన్నను ముదమొప్పె
రూపు
కడువేడ్క జూడుడు కామినులార!
పోరులో నా భర్త పొలిసిన వెనుక
చేటుకై యిటులుండె చేడె నారూపు
ఘనవల్లభు డట మారేళ్ళనీడ

కొలువుండె పోదాము కోమలులార!
అతివలార! పదుండు ఆలస్యమేల?"
నారీమణియు పల్కనాతులందరును
కలకల ధ్వనులను కదలి రందరును
అటువెన్క తిర్మంద అతివ లందరును
అధిపుల గన్గొన ఆయత్తపడిరి
పుత్తడి బొమ్మల పోలినయట్టి
రమణులు యరనూక రమణి
తోడుతను
వీరుడౌ తనయుడు వెంటను నడువ
వనితలందరు వచ్చె వనములోనికిని
చూచెడి ప్రజలెల్ల చుట్టుక రాగ
తరలాక్షి తన విభు దగ్గర జేరి
'చూడుడు నా విభు సుందరులార!
పరగ శాలలో నిద్ర పరత నొందినటు
చల్లని నీడను సరసత నుండె
నే వచ్చు టెరుగడు నేడు నా విభుడు
ఆజిలో పోరాడి అలసెనో లేక
పలుక లేకుండెనో పణతులారిపుడు
రక్త పచ్చడమెల్ల రక్తమున తడిసె

పట్టుక రారమ్మ పట్టు పచ్చడము
తనువునంటున్నది తడిసి రక్తమున
మెల్లన దీయరే మేను నొప్పకను
పట్టు పచ్చడమును పై చారకప్పి
తన విభు మోమును తరుణి వీక్షించి
గంధము కస్తూరి కలిపి దెప్పించి
కడుభక్తి నెఱనూక కరములనంది
పొలతి గాయములకు పూసె
నిండుగను

## యరనూక సీత వలపోత

తరుణి విభుని వద్ద ధరణి గూర్చుండి
ముఖము తప్పక జూచి
ముచ్చటలాడె
భామ విభుని తోడ భాషించె యిటుల:
"యేమయ్య ప్రాణేశ!
యరనూకరాజ!
నుపవిని వినవైతి పురిపురి దెల్పప
జగడము వద్దంటి సర్వథా మనకు
యెరుకుల విడుమంటి విను
ప్రార్థనంటి
వినవైతి నా మాట యిటులాయె
కడకు
పోరుకు వలదంటి పోతివి వినక
పగవద్దు పంపాద్రి పదమంటి రాజ!
హితులతో యలమంచి కేగుదమంటి
తమ్ముల గగనసైన తర్లవు పురికి
పరివాన బాలుల పంపాద్రి పంపి
కన్నవారలతోడ కలుపవు సుతుల
అన్నదమ్ముల బాసి అరుదెంచి
యిచట
పగబూని పోరిగితి ప్రాణేశ! నీవు
పంపాద్రి నెడబాసి పరభూములొచ్చి
పరులను ననిగూల్చి పడితివి కలను
యెరుకులు నీ పాలి యెములైరి
నాథ!
పరిపరి దెలిపితి ప్రాణేశ! వినవు
వక్షము పోట్లుచే వల్లవరాజ!
పసుధను గూలంగ వ్రాసె నా
బ్రహ్మ?
మెడచుట్టు రక్తము మెత్తుకవుండె
కడు దేహమెల్లను కందువారినది
బల్లెము పోటులు బాటలై యుండె
భట్టరస్వామి నీపాల లేడాయె!
యలమంచి గంగ నీ వెంబడి రాదు
తగ యిలవేల్పెటొ దాగెనో నాథ!
కలకల యెదలేక కాయుదు ననిన
పాపపు గంగ నీ పాల లేదాయె!
యమురాలు యేకవీ రెంబడించినను
యేనుగుమల గూలి తెరనూకరాజ!
వాపోవు బిడ్డల వారించవేమి?
దయలేక యున్నావు ధరణీశ! నీవు
పసిబిడ్డ లెల్లరు పలువరించెదరు

యెవరికి వొప్పింతు యేమి
చెప్పవుగ
మల్లటించెడు సుతుల్ మాటాడవేమి?
తనయులపై భ్రాంతి తలకె నారాజు?
నేరేళ్ళ నీడను నిద్రించుచుంటి
యెటులోర్చుదును నాథ! యేమి
చెప్పవిక
మెత్తని పరుపులేక మేనెల్ల నొవ్వ
ధర పండి యుంటివి తరువులనీడ
తరముల బంధువుల్ ధరణి
జనులును
వగచుచు నుండిరి వారిని జూడు
జాగాయె పలుకవు బాలుల జూడు
మనసెట్లు కరుగదు మనుజేశ నీకు?
బాలలకై రాగ పరభూమిలోన
సరవి భట్లరుస్వామి సంతాన మిచ్చె
రవధూళి నీమీద రాలియున్నదిగ
పొలయెండ నీమీద పొలసెను రాజ!
ఆలమున కేగిన యాదవు లేరి?
కొలిచెడి పరివార గోపాలు లేరి?
సరగ నీవెక్కెడి స్వారి గుర్రమును
వైరులు చెక్కిరా వల్లమ్మ తనయ!
ఘోటకా లేమాయె? గోవు లేమాయె?
భూనాథ వస్తివా పుత్రునివెంట
తగు బాంధవులు యెల్ల ధరణిని గూల
తగదక్క వస్తివా వలురాజపుత్ర!
ధరణీశ! నీవెంట తర్లి రాననుచు
పలుకవా! యేమయ్య! ప్రాణేశ!
నాథా
మేలాయె పలుకవు మేదినీశ్వరుడ!
కదలి వచ్చెద నేను కడుప్రొద్దు లేదు
భూనాథ నేబోయి భువిజనులెల్ల
సరవిని జూడంగ చనుదెంతురాజ!"

## సొగుమానము చేయుటకై గుండమును త్రవ్వుడని యరనూక సీత ఆజ్ఞాపించుట

తదయక విభునితో తగ ముచ్చటాడి
చయ్యన లేచెను సఖియ "యరనూక
ఆవు పువ్వాల వెంగ, అచ్యుత లింగ,
పులిముద్దు దేశమ్మ, పొలతు
లందరును
తెరగొప్ప నాథుల తిలకించి చూచి
"ఏమయ్య వో బ్రహ్మ! యిటుల
వ్రాస్తివిగ
మహియెంచ తరమౌన మన
కింతజేసె
పదపద" మంచును పణతు లందరును
పంచ వాయిద్యముల్ పరువడి
మ్రోయ
తామర చెరువుకు తర్లిరి వేగ
కనుగొని ప్రజలంత క్రమ్ముక రాగ
సుతుడును తోడురా సుదతులెల్లరును

శ్రీఘ్రమె వచ్చిరి చేరి కాంతలంతా
కనుగొని భూమికి కరములు మొగిచి
భాషించె యరనూక భక్తితో నిలచి
"శివశివ! మహదేవ! త్రితరక్షకుండ!
హరహర! శరణార్థినయ్య!
మహదేవ!
తరులును గిరులును తగ సాగరములు
నదులును నిధులును నన్ని జీవులను
పొందగా కుక్షిని పోషించు దేవ!
నన్ను బ్రోవు దయతోను నాథుని
జేర్చు"
అని వేడి వుప్పర్ల నచటకు బిలచి
చాలిన వస్తువుల్ సకలము నిచ్చి
"అన్నలారా! గుండమును
వేగముగను
త్రవ్వుడు వేగమె తగ ప్రొద్దు లేదు"
అని పల్కి వుప్పర్ల నంపియు మగిడి
తన కుమారుని బిల్చి తరుణి
యిట్లనియె
"కట్టెలు దెప్పించు గ్రక్కున బోయి"
తల్లి పల్కగ విని తనయుడు లేచి
పరగంగ పరజనుల్ పట్టపు ప్రజలు
పరువడి వనికేగి భట్టాలరాజు
మంచి గంధపుచెట్లు మరి
యేపెతరులు
తగు పెను మద్దులు తరులు పట్టించె
తామర చెరువుకు తరువులు దెచ్చె
కురుచలుగా నర్కి కూర్చె యేపెలును
తరిగించి గుండాన దాపిరంతటను
మంచి గంధపు తరుల్ మరి
చందనములు
గుగ్గిలం మ్రాకులు గుండాన గూర్చి
పుణ్యాహవాచనం భూసురుల్ చేయ
అగ్నిని గొనివచ్చి నట వుంచి రంత
ఘన తైలకుండలు కడను బెట్టించ.

## భట్టావులరాజు తండ్రికి దహన సంస్కారము చేయుట

పతి నందలము సతి పట్టించెనంత
స్వారిబోయిన రాజు చనుదెంచినట్లు
కొలిచెడి పరివార గోపాలవరులు
దొరలును మన్నీలు తొలగక రాగ
ప్రేల్చె తుపాకులు పెట్టుగొల్పగను
భేరీ డమామీలు బిరుదు వాద్యములు
ఆరూఢి మ్రోవగ నవని ఘూర్ణిల్ల
శీఘ్రమె తెచ్చిరి చెరువుదగ్గరకు
అందలమున రాజునవనిపై దించి
భూసురుల్ తగు క్రియల్ పూని యొనర్ప
గోవుదానము లాది కోరినవెల్ల
భట్లకు ద్విజులకు పరివారములకు
కామధేనువువలె కామితార్థములు
కరుణతో నిడి విభు కణకులపైని

సుదతి తా పెట్టించి సుతుని కిట్లనియె
'రావోయి! నా పుత్ర రాజశేఖరుడ
తనయుడ మీ తండ్రి తలచిచ్చుపెట్టు'
అమ్మ పల్కంగ సుతు డల్లనబోయి
జలము మట్టి పాత్ర చయ్యన నుంచి
కడవ భుజము బెట్టి గ్రక్కున వచ్చి
కొరవి చేతను బూని గొబ్బున తాను
దీనత ముమ్మారు తిరిగి తా వచ్చి
కొరవి తలక్రిందిడి ఘొల్లున అడలి
భుజమున కడవిడిచి భూమిపై వరిగె
పుత్రుడు అడలంగ పొలతి యరనూక
అడలేటి తనయుని అక్కున జేర్చి
కన్నీరు దుడుచుచు కడుపూరడించి
'రాజాధిరాజ! యదురాజకుమార!
నాయనా! అడలకు నాతండ్రి! నీవు'

## యరనూక సీత సాగుమానమునకు ఆయత్తపడుట

తన సుతు నిట్టుల తగ గారవించి
కదలెను యరనూక కాంత వేగంబె
పొగులుచు యదువులు బోరున అడలె
ఆవుపువ్వుల తిరుమ, అచ్యుత కేశవు,
పులిముద్దు రాఘవు పొందుగా దింగి
[illegible]సగా [illegible]డాల [illegible] [illegible]చి
తగు ప్రియలొనరించి తగువారి వలన
కణుకులు రగిలించి కదలి రందరును
నియమొప్ప నా సతుల్ నిమ్మలనీడ
పన్నించి తమకాలు పరువున వచ్చి
రాజశేఖర కాంత రమణి యరనూక
పన్నిన తమకము పణతి త్తాయెక్కి
ఆటపాటల వారలందరు వేగ
తమతమ విద్యలు తగులీల దెలుప
జతగూడి వాయించి సరసవాద్యములు
పాత్రధారులు పొడుచు
బహువిధంబులను
వివిధ గర్మనెరయ విలసిల్లెనచట
పట్నాల పల్లెల ప్రజలెల్ల గూడి
[illegible] గట్టు[illegible] [illegible]జల[illegible] [illegible]చ్చి
[illegible] [illegible]మ[illegible]నూ[illegible] కా[illegible]త సెల్ల[illegible]ను
అలివేణిని చూచి నన్ని దిక్కులను
అతివలు యిరుగడ అకుచుట్టివ్వ
తమ్మపడిగ చేత తరుణులు పట్ట
కడిగి వింజామరల్ కాంతలు విసర
వల్లవ తిరుమంద వనిత లందరును
తత్తరపడుచును తమకము చుట్టు
పొగులుచు నిలిచియు
పొలతులుండగను

## యరనూకసీత కూతురు నాగమ్మకు చనుగుడిపి ఊరడించుట

పొరిపొరి నాగమ్మ పోరుపెట్టుచును
తల్లికి చెయి చాపి తరుణులవద్ద

అలమటింపుచునుండ అతివెలుదెచ్చి
'అమ్మ! నీ కూతురు ఆకలి గొనెను
బాలకు చన్నివ్వు భాగ్యపుతల్లి!'
అనుచును కూతును అమ్మకందివ్వ
కూతురు నాగను కోర్కె నెత్తుకొని
చెక్కిళ్ల దుడిచియు చెలగి ముద్దాడి
చనువుగ యరనూక చన్నిచ్చెనంత
''తనివిదీరగ కుడువు తల్లిరో! నీవు
యెడమాయె కూతురా! యేల
చూచెదవు
పాపపు దేవుడు బాపెనే తల్లి!
పసికూన! నాచిన్ని బాలనాగమ్మ!
కన్నుల నీళ్ళిడి కడు చూచెదేమి!
యెన్నడు పొగులవు యేలనే తల్లి!
గండు తుమ్మెదవంటి ఘన కురులకును
సారెకు జలమార్చు సఖియలు నుండె
పోరును మాన్పేటి పొలతు లుండిరిగ
రమ్మని చన్నిచ్చు రమణులు నుండె
చక్కని నాతల్లి! సఖియ నాగమ్మ!
తల్లిలేదని నీవు దైన్య మొందకుము
తలిదండ్రి లేరని దగ్గరదీసి
తనర పోషించెడి తరుణులు
యెవరు?
యెవరికి వొప్పింతు! నేమందు విధిని
యెవ్వరు జూతురు! యెవరు
బెంచేరు!
గారాబమున బెరిగె ఘనముగా బుట్టి
కడ తల్లిదండ్రిని కరువు జేసికొని
దరిలేని సుతలైరి తనయరో! మీరు
అమర ముత్యపు చిప్పలనెడి నీ కనుల
తీరుగ కాటుక దీర్చువారెవరు?
దేవుడు యిటుజేసె దిక్కేది యికను''
తల్లిచన్నుల పాలు తనివిగ గుడిచి
అమ్మయెదనుండి అల్లాడసాగె
అల్లాడు తనయను ఆతల్లి జూచి
కూతురు చెక్కిళ్ళు కోమలి చేత
తడవుగ నులుముచు తరుణి
ముద్దాడి
''సంతోషమాయెనా చక్కని
తనయ!
తీరెనా రుణమెల్ల దేవుని యాన!
ఆపద యెరుగవు అలరుచున్నావు''

## యరనూక సీత తన బిడ్డలను పెంచుమని వదిన పుల్లమ్మను కోరుట

అని యిటు తలపోసి యా రాజకాంత
తమకముచుండియు తరుణుల బిలచె
"యిద్దరు వార! నా యీ ముద్దు
సుతుల

యిచ్చెదగొనరమ్మ! యీడేర్చరమ్మ!
భార్గవసతులార! భద్రాక్షులార!
బాలల పుచ్చుక పాలించరమ్మ!
పయ్యావులవార! పందుములార!
యిచ్చెద బాలల యీడేర్చరమ్మ!
గాంగేయుని వార! కల్లందువార!
కన్నబిడ్డల నిత్తు కని పెంచరమ్మ!
కనకనందుల వార! కరుణతో మీరు
ఆదరించుడు సుతలనందుక మీరు
మల్లెబోయిన వార! మాధవులార!
బాలల చేకొని బ్రదికించరమ్మ!
కొండగొడుగు వార! గోపాలువార!
కొమరుల యిచ్చెద గొబ్బున గొనుడు
పచ్చిపాలావార! పశుపతి వార!
పొందుగ్గ బాలల పోషించరమ్మ!
మట్టావుల వార! మదిరాక్షులార!
సిరి బాలల నిత్తు చేకొనరమ్మ!
శ్రీధరు వారలు! చింతల వారు!
కడు బాలలను యిత్తు కడతేర్చరమ్మ
జడదారు సతులార! శంభునివార!
తల్లిలేని సుతల దరి జేర్చరమ్మ!,,
ఆరీతి యెరనూక అతివల బిలువ
వల్లవ తిరుమందు వనితలు యెల్ల
తమకము దరినిల్చి తరుణి కిట్లనిరి
''ఓ యమ్మ! వినవమ్మ!
ఓ యెఱనూక
అతివల కేరికి అర్భకు లివ్వ
హర్షించి యుండరు అర్భకు లమ్మ!
బోధించి యెత్తిన పోరు చేసెదరు
పూబోణి కిప్పించు పుల్లమ్మ సతికి
యితరుల కైనను యిమదరు
సుతలు''
మగువల మాటలు మరివేగ దేవి
తరుణులందరు విన తగ నిట్టులనియె
"నాతిరో! పుల్లమ్మ! నా మేనవదినె!
పుచ్చుక బిడ్డల పొలతి యీడేర్చు
రాజ మారుగ జూడు రాసుతు తల్లి!
అమ్మ! నీ కూతురు అతివె
సూరమను
భట్టాల పతికిచ్చి పరిణయమొనర్చు
సుదతి నాసుతుడు సుతుని
కేశవుని
తోడుగ బెంచియు దొరలను జేయు
నామారుగా పెంచి నాగమ సుతను
తరుణి నీ పుత్రుకు తగ పెండ్లిజేయు
సరియని పుల్లాంబ సంతసించగను
పరగంగ యెరనూక పణతి నాగమను
పొందుగా ముద్దాడి పొలతి పుల్లమకు
యిదొ ఆని అందిచ్చె యింతి
యెరనూక
బాలల నొప్పిచ్చి భామ తా నడలె
మోరున నడలిరి గోపకాంతలును

## యరనూక సీత బిడ్డలను భక్తిరన్న కప్పగించుమని చెప్పుట

అదట యరనూక అడలుట మాని
కనుగొని పల్కెను కాంతల తోడ:
"సఖియలార! కుమారుడు
శంకరమూర్తి
పరుసవేది జడల బంధించు గురుడు
పర్వత మల్లప్ప భక్తుడై పుట్టె
భక్తుని చేతికి బాలల యిచ్చి
పదుడు భక్తుని వెంట పంపాద్రి
వేరుపుటకి
యలమంచి కేగుడు యాదవులంత
నెలవుగాదీభూమి నేర్పున విడిచి
కదులుడు యలమంచి కరకంతు
వెంట"
పలికిన యరనూక పడతి మాటలకు
పణతులందరుగూడి భామకిట్లనిరి:
"కోమలి యరనూక గురుతెట్లు
తెలియ
యెటుల గుర్తింతుము యదు
జంగమూర్తి
పంపాద్రి నెడబాసి పైనమైనపుడు
బాలుడుగా నుండె పశుపతిమూర్తి
యెవ్వరి నెరుగము యెట్లిత్తుమమ్మ"

## యరనూక సీత భక్తిరన్న గుర్తులు చెప్పుట

ఆమాట కెరనూక అప్పు డిట్లనియె;
"అమ్మలారా! వినుడు
యదుజంగమూర్తి
భూతేశ గురువున పోలికల్ దెలియ
గురుతులు పరికించి గురుతు
చూపుమని
ఆనవాల్ భక్తుని అడుగుడు మీరు
పొన్నగ గుండమువద్ద పొన్న
లున్న విగ
తియ్యని మామిళ్లు తీగె మల్లెలును
కమలచెరువు చుట్టు కమ్మకనుండె
కన్నె కొలను బావి గట్టున వుండె
నాలుగు మూలల నంది మూర్తులును
పరమేశ్వరుడు వచ్చి పార్శ్వము
నిలచి
గోపెడు విభూతి గుండము మీద
అయ్య తాచల్లిన అందిరు జూడ
పొలిసిన గుండాన పొగ తెలికెగయు
నందులు పల్కెను నాల్గు దిక్కులను
ధారుణి కంపిల్లు తరువులు కదలు
యేకధ్వనిగ గంట లెలమిని మ్రోయు
అవి మీకు గుర్తులు అమ్మలారపుడు
బాలలు మీరును భక్తుని వెంట
కదలుడు యలమంచి
కలకంఠులార!"

## యరనూక సీత దాన ధర్మములు చేయుట

పరగ గుర్తులు చెప్పి పణతి
యరనూక
కడువేగ దెప్పించె ఘనవస్తు తతిని
గోవులు వస్త్రముల్ కొరలేని ధనము
రాసులు బోయించి రమణి యరనూక
కొల్లగా ద్విజులకు కోరినవెల్ల
దానమిచ్చెను తరళాయతాక్షి
మగువలు యిరుగడ మరివేగ నిలిచి
పలికిరి యరనూక పణతితో నపుడు
తరళాక్షి యరనూక తమకము
దగుచు
కూటమునకు నేగి కూడి రావలయు
నన విని స్నానము నతివ యొనర్చి
తన తోటివారితో తర్లె కూటముకు
వనితలు వచ్చి తివాణము చొచ్చి
సఖియలు కూర్చుండె
జమఖాణమునను
తాళబీగములిచ్చి దాదుల కిచ్చి
దాదులతో చెప్పె తల్లి యెరనూక
'యెరుగడు తనయుడు వెలయ
బాలుండు
ఘనవస్తువులు కనకాంబరములును
వుండె పదిలముగ వుండుడు మీరు'
అని యిటు దాదుల కంతయుదెల్పి

చిత్తర్వు ప్రతిమల సిరిగల చెలులు
శీఘ్రమె వచ్చిరి చెలియ లందరును
పొంగుచు నుబ్బుచు పొలతు
లందరును
పొలుపుగ సీతాకి పొన్నల నీడ
పుష్పపు గంధము బోటులు గొంచు
సరగును దేవిపై చల్లిరి తాము.
పసుపును గుంకుమ పణతులుదెచ్చి
వరుసగ దేవిపై వనితలు చల్లె
అంగరంగము భోగమాట పాటలును
ఘనముగ జేయుచు క్రమ్మక రాగ
తరుణులు వచ్చిరి తరువు నీడలకు
కనక గచ్చురుగుల కాంతలు వుండి
ప్రజల నందర బరాబరులు చేయించి
కనకపుటరుగున గౌరిని నిలిపి
పదివేల చేటలు పరగమాడలును
పదివేల చీరెలు పరగ భూషలును
చాలగ దెప్పించి సఖియ యరనూక
గౌరినోమును నోమి కథయెల్ల
వినియు
పొందుగా బ్రాహ్మణ పొలతుల బిలచి
సఖి పంచిపెట్టెను సకల వస్తువులు
చీరెలు రవికెలు చెలువుగ నిచ్చె
చూచెడి ప్రజలకు సుదతి యరనూక

## యరనూక సీత సొగుమానము

అటు వెన్క యరనూక అందరికి
మ్రొక్కి
పట్టుచీర విడచి పసుపు చీరగట్టి
వనర పూబంతులు వయ్యేన జుట్టి
కదలె గుండమునకు కాంతల గూడి
ఘణతులు గుండముల్ ప్రదక్షిణించి
సురులను ప్రార్థించె సుందరి తాను
"భక్తుడు వచ్చిన పరగ సురులార
ధరణిపై పల్కుడి తలగక మీరు"
అని యిటు సురులను ఆమె
ధ్యానించి
చప్పున కట్టెక్కె సఖి యఱనూక
గుబగుబ లాడుచు గొబ్బున నగ్ని
మింటి పొడవుసాగి మెలగుచునుండ
భక్తితో నగ్నిని ప్రార్థనజేసె
"దేవాదిదేవులు స్థిరముగ నీవె
సర్వజగము నీవె జలధులు నీవె
తృణ కాష్టములు నీవె తుదమొదల్
నీవె
అయ్య! నీవే దిక్కు
అవతారమూర్తి!
పరువడి వచ్చిరి ప్రజలంత చూడ
దేవ వనెకొని తేజస్వరూప
మేదిని సత్యము మెచ్చగా నిలుపు
అయ్యరో! నీయందు ఐక్యము
జేయు"
అని వేడి నిమ్మ పండ్లద్ద మందించి
అతివ చమురుకుండ లమర
పుష్పములు
గొప్పగా యరనూక గుండాన వైచి
అతివ తాభక్తితో నగ్నికి మ్రొక్కి
"అమ్మలారా! దీవె నందుకొండనుచు
ఆ చంద్ర తారక మవని వర్ధిలుడు"
ప్రజలను దీవించి పణతి యరనూక
వెసబారి దూకెను యరనూక దేవి
గుప్పున యరనూక గుండాన బడగ
మువురు తిర్మంద స్త్రీల్
మొగి చిచ్చుబడిరి.



# యఱ్ఱయ్య తరకవాదము

## గంగ ఆలమందలను చెదరగొట్టుట

చేరి గోపాలకులు రాజు సేవలు
చేయంగ
ఆరూఢిగా గొలువంగ అమరుల తల్లి
అందెలు మువ్వలు అతిఱన్న
సరములు
[పొందు] యైన ముత్యాలు
భూషణంబులును
కంకణంబులు వన్నెగాజులు
వడ్డాణము
శంకరు సతియైన జాన్నవి గంగ
యేడేండ్ల పాయమున యఱ్ఱయ్య
యెదుట
ఆరూఢిగా నిలచె ఆవులమందలో
పసుపు వన్నెల, రవిక
పట్టుపుట్టము గట్టె
అసురుల సంహారి.........గూచె
గంగ ఆర్భటములు కూడవు ఆవులు
బెదిరెను
చెంగు చెంగున యెగిసె సలుగుటెడ్లు
ముంగల
[గుంటి] గంగ యెఱ్ఱి కూతలు కూసె
కోటివేల ధేన్వలను గొబ్బున
ఘలిపెను

కయ్యాలుయేంటి గంగ గాతకొని
అరిచె
పెయ్యలు బెట్టురికి బెదిరిపో సాగెను
దిక్కులు నాలుగు తెరుకట్టె గంగ
యెక్కడ జూచినా యే సందు
లేకుండ
పారుజాత పుష్పాలు భామ యెగజల్లె
యేరువమ్మ డాకలకు యెద్దులు
బెదిరెను
యెక్కడ జూచినా యేకకూతలు
కూసిరి
అక్కడ నిజరూపు ఆయెను గంగ
మరివక వింతగాను మైకూతలు
గూసెను
యిది యేమి సోద్యమని యాదవులు
యరగందిరి
సురుకు బాణంబులై...... రామర్లె
కరికరి కోపమున గంగ
కవులావులగూసె
దిరుణి నుండి ఆవులు తెప్పలు వీడి చేరె
మాధవుని కవులావులు.........
పోకుండ కవులావుల పొర్లగూచె
గంగ ॥౧॥

## యఱ్ఱయ్య గంగను నీవెవరవని ప్రశ్నించుట

కన్నుదీపమున యఱ్ఱయ్య
గంగవంక జూచె
వెన్నాని తమ్ములతో వేగంగ వచ్చె
బెజవాడ పెట్లుకాడ పెయ్యల
యఱ్ఱయ్య
యింతితో యెదిరించి యిట్లగని
పలికె:
"మాయకూతలు గూచేవు
మా మందలోను
కోయవారి పడుసువో? గొబ్బున
జెప్పుమ?
వూరికె వుండమంటే నువ్వు
చెవ్వకానుకులు
యెరికివారి పడుసువో?
యేమి నీకులము?
రంతులు చేయుచు
గంగగంతు లేసేవు
యింతిరో నీపేరు యేమందురమ్మ?
కంతను నిలుచుండి చెయ్యెత్తి కూసేవు
దీప్తపు కవులావులు పడత్రొక్కేను
నిన్ను
చూతము వో రాక్షసీ! వో పాప
నీపేరు?
యేతీరున వాస్తివో యెరుగము నిన్ను
దానవో దయితవో తరుణి నీ పేరు
ధేనువులు పొర్లంగ తెరువేది నీకు
కూతలు కూసేవు గురుతెరుగలేవు

నాతివైతే నీవు నాతోను బలుకుమా
యిటువంటి దైత్యాలు యెన్నైన గలవు
తటపటలు మాముంగల సాగవు నీకు
గోపాల్కులు కల్లర్లు కొట్టేరు నిన్ను
పాపరో! తొలగవే పంతంబు మాని
మారాజు విన్న కల్లరి మాట వచ్చేను
జానులు బొర్లకే జరగవే పడుస!
రాగతనంబున కొరగాదు నీకు
కాగులు పాలుదాగి కదలవే పడుస!
యిన్ని మాయలు బోను యేమిటికి
నీకు?
వెన్నముద్దలు దిని వెళ్ళవే పడుస!
వెలుగుల వెంటను యేసాలు బొర్లేవు
పాలు పెరుగు దాగి పదవమ్మ తొలగి
తూరి వస్తివైన తూడలు త్రొక్కేని
నిన్ను
మీగడ పాలుదాగి మెల్లనే పొమ్మి
కోడెలు నిరోధి గోరంత విన్న
సూడుమ.........వకవంక
ఆవులన్న చెలువు అయినా నిపుడె
కావరము అణిచేని కడకు బోవమ్మ!
యెద్దులు.........యేపాటి విన్న
గద్దించి త్రొక్కేని కడకు బోవమ్మ!
కయ్యాలు వెంట శక్తి ఘాతలు
చేసేవు
పెయ్యలు త్రొక్కేను నీపేరు
జెపుమ ॥౨॥

## గంగ తన్నెరిగించుకొని తనకు మ్రొక్కి పూజసేయుమనుట

తిన్నని కస్తూరి తిలకింపు బొట్టు
వన్నెల పైసాల వాలంబు శూలంబు
మాణిక్యాల కిరీటకం మగువ తా
వచ్చెను
ఆవుల మందలో నిలిచి
అపుడిట్లగనియె:
"ద్వారక మండలోపల తరమునాటి
పెద్దలు
గారవమున గొలిచిన గంగను నేను
లోకాలోకములు పుట్టని నాడు
ప్రాకటముగా వెలసిన పరంజోతిని
నేను
మిన్నును మన్నును మిగులు
భూములును
యెన్నిజూచిన గాని యేరువ రాజ!
వారధి యేరులు వర్ధించి చూచిన
అగ్గి తన కోపమున ఆకలో మాతను
చండవైరులంతెల్ల గుండె దిగులును
నేను
కొంపలు వురిమితేను కొట్టు పాతును
గంగ
గాయ గాసి తుంగభద్ర గోదావరి
కృష్ణగిరులు
తరులెల్ల పెన్నగా తమాయె మన
పెంపు అంటి నామాట
సురులు మునులు గన్న
సుందరీమణిని
గార్యంచి నారాజులు కుక్షాల విధిని
నేను
భూలోక శక్తినై పుట్టిన దానను
బాలజంగము జడలు ప్రబలిన దానను
సవితి పోరుకు వెరచి జనికినదాన
సరిలేరు నాకును శక్తు లెందరైన
నీతిమంతుడ! వినర నీకు నే గంగను
భూతకోట్లు నా సేవ పొందుగా
జేతురు
నాగ భూషణాలు నాకు నావిభునికి
నాకు నా దేవతలు వందనము జేతురు
ఆకాశగంగను ఔర నాపేరు
నిక్కి శివుని శిరస్సు యెక్కినదానను
చక్కని జాలరి గంగ నాపేరు
పోనాడకు నన్ను ఈట భూపతి
తమ్ముడ
జాన్నవి తనపేరు జగమెల్ల
యెరుగుదురు
మ్రొక్కడు తలవడు యెక్కడి రాజొ
గారవంబున మీరాజు కని పూజ
చేయడు
అవులు పాకనాడు అవల పోవంగ
గట్టిగా మీరాజును కవులావుల మిమ్ము
పట్టి పూజలు గొందు పాలేటి
వద్ద"॥శి॥
మాశక్తి మాటలకు కడు కోపముననను
యనక ధిక్కరించి యవ్రయ్య బలికె:

"మాత్రమైన శాంత్రము ఆవులమంద
మీదికి వచ్చె
పరగ దక్షణాది పషువులకు మేపులు
కలవని చెప్పిరి గవిరీలు మాకు
గవిరీల మాటలకు కడు సంతసిల్లి
విరివిగా దొడ్డిగుఱుపు వేగంబె
చేస్తిమి
పచ్చిమల దైత్యలు పరువున
వొచ్చిరి
యెరుపుమల దైత్యలు యేగంబె
వొచ్చిరి
అంబెమల దైత్యలు ఆదిగొని వొచ్చిరి
గాల పోసమ్మ దాకారుల మెసమ్మ
......శక్తి మండలాదేవి
తగుళ్ళ జలిశక్తి దొడ్డి మైసమ్మ
మూకుళ్ళ పోతురాజు ముంధుగావచ్చి
అంక(మ్మ. పోలేరమ్మ) ఆదిమా
శక్తులు
దుగ్గిదేవి మారెమ్మ దృఢశక్తులూను
మలలమ్మ శలలమ్మ
మహాశక్తులూను
ఘనమైన శక్తులు కడు వేగముననను
పరువున వొచ్చిరి పశువుల
మందలోకి
కడియాలు అరిసెలు గట్ల
పొడుగుననను
కుడుములు పిండికూరలు కొండల
పొడుగుననను
చాపట్లు పిండి వంటములు
సన్నవంటకం
తీపియైన పిండివంటలు తేనె పేరిన
నెయ్యి
ఆరవెల్లి గంగకు ఆవులలోను
గారవంబున బోయించె కాటమరాజు
కొవ్వును నంజుళ్ళు కొఱ్ఱకూటి
కుంభాలు
అభివృద్ధిగా బోయించె అవులనడుమ
కూడిన శక్తులు కుంభాలకు ఏగె
దండిగా భోంచేసి తలలు
విరబోసుకొని
సొక్కుచు సోలుచు సోద్యంబుగాను
ఆనందమును బొంది ఆడిరి శక్తులు
మీగడ పెరుగులు మెండుగా
భోంచేసి
కాగుల పాలుదాగి గఱ్ఱున దేపి
తిరుగబడి వస్తిమి తెరువాయె మాకు
మక్షవల్లభుండు మాధవుడు నలనన్న
దక్షణాది పోవంగ మచ్చరించేవు
రట్టడి కాటమరాజు నలనన్న
కొట్టేను పోవమ్మ కోమటి
తొలగి" ౹౹౨౹౹
ఆదిలక్ష్మి గంగ అపుడిట్ల గనియె:
"యెఱ్ఱి బుద్ధులు యేమిటికి నీకు
యఱ్ఱయ్య యిటు వినుమ యెమ్మెలు
మాని

ఢిల్లీ సురతాని కోటలు దిగ
దొనిపించి
పిగిలి పింఛపు జల్లులు బిరుదులు
దెస్తిరి
అక్కడ సాయకారమై వస్తిని నేను
అల్లణి బూబునై నేను ఆవులలోకి
వస్తిని
యెరుగుదు పొమ్మనెను యాదవరాజు
కాసిగా యిలలోను కవులావులు...
వాసిగా చీకటి వసనాభి కోనలో
మేసి వీర కవులావులు మెరవడితోను
కంకణము యెగవేస్తివి కైలాసము
పొడువు
సూర్యుడు కావి గప్పెను చూస్తిరా
మీరు!
అష్టదిక్పాలకులు అటు చోద్యముగ
నుండిరి
యేకాంబరిని నేను యెరుగుదురు
జనులు
యేయంచ గలిగినయట్టి యేరువరాజు!
శంకభూమికి వొస్తిరి తెగువ
తోడుతను
నవిలిస్వ్వ గాసిరి నడుము గట్టితిని
పిగిలి పింఛపు దండలు పేరులువేసి
ఫారుటాకులు చీరె పైని గప్పితిని
మీర నాయిక విల్లు మేరుటంబులును
ఆ రూపమున వొస్తిని ఆవులలోకి
యెరుగుదు పొమ్మనె
మీ యాదవ రాజు
కరకంఠుడైనట్టి కాటమరాజు
యెరుకు మలల మీద యెద్దు
లావులును
ముత్య సరి పుట్టము ముత్యాల బొట్టు
మెత్తని పట్టురవిక మేనుగంధంబు
కొత్త శంఖులపేర్లు కుందనపు
కమ్మలు
మత్తె ఖాము నడుమన నెత్తిని
యెరుకలబుట్ట
.........ముకిరాకులు కంటసికలు
పొంకముగ మెడతీగ చంక నొకపాప
కొల్లాపురి అమ్మను కోర్కెతో దలచి
వల్లవుల మొగరాజుకు యెరుక
జెప్పితిని
యెఱుగుదు పొమ్మనెను మీ
యాదవరాజు
ఆరవల్లి దొడ్డి గుడుపు వొప్పదునాకు
మారు గాచివున్న యేకాంబరిని నేను
జంగిలి దైవాలు సాటి యటరా తనకు
భంగపరతును మిమ్ము
ఫాళేళ్ళిలోను"॥౩॥

## కాటమరాజు చిల్లర దేవతలకు మ్రొక్కడని యఱ్ఱయ్య పలుకుట

సంతసంబున జూచి చక్కని
యఱ్ఱయ్య
యింతితో యెదిరించి యిట్లగని పలికె
"అతుల ప్రతాపశాలి యాదవరాజు
సతులు వర్ణితుండు జగమెల్ల
యెరుగుదురు
తరువులే చెల్లెళ్ళు తగ పోతు కోడెలు
అన్నలని జగమెల్ల యన్నంగ వినవ?
ఆవులే తల్లిగా ఆంబోతు తండ్రిగా
భావించినాడు మా బడుగుల రాజు
యిటువంటి రాజు నీకు యెటువలె
మ్రొక్కేని
తటపటలు మాని శక్తి
వైదొలుగుమా!
............మైన రాజుకు యవ్వరు
వున్నారు?
గోడిగ గుఱ్ఱాలసాల గట్టించినాడు
దేశాల రాజులకు చెయ్యెత్తి
మ్రొక్కడు
వాసిగా వల్లవుల కాటమరాజు
కాశంగి రుద్రుడైన కైలాసపతికి
ఫాలలోచనుడైన భక్తవత్సలునికి
యెత్తిన కరములు యెత్త దెవ్వరికి!
చుక్కలు మేలని త్రిశూలధరునికి
ముక్కన్ను గలిగిన మూర్తమా
ఘనునికి
యెత్తిన కరములు యెత్తదెవ్వరికి
భూతిపునుకుల పేరు పునుగుజవ్వాది
నాగభూషణుడైన నందివాహనునికి
యెత్తిన కరములు యెత్త దెవ్వరికి!
చంద్రశేఖరుడైన జగమెల్ల యేలేటి
మందలో బసవన్న మల్లికార్జునికి
యెత్తిన కరములు యెత్తదెవ్వరికి!
బసవ శంకర బిరుదుగల రాజు
బడుగుల రాజు
కొట్టేను పోవమ్మ కోమతి తొలగి
రక్షకుడు కాటమరాజు పేరు చెప్పినా
అసురుల గుండెలు అవలించేను
యింతేసి బింకము యేమిటికి నీకు?
పంతపు దైత్యలు పారిపొయ్యేని
కాటమరాజు ఘాతచేసె నాయసా
భూతాలు తలలు విడిచి పొయ్యేది
నిజము
నీవు అనంగ నెంత? నీపేరు
అనంగ నెంత?
భావంబులో శుక్ర ప్రగ్నె నీకేల?
కావరంబున వొచ్చి గంగ ననేవు
ఆవుల పొర్ల గూసి ఆటలాదేవు
పొద్దు పోయినచోట గద్దరితన మేల?
బుద్ధి మనసుకు తెచ్చుకొని పోవమ్మ
తొలగి
మీరిన యెద్దులు చేరి పొడిచేని

దరశీలు పెక పంక వాస్తివో నీవు
రట్టడి కాటమారాజు నలనన్న నిన్ను
కొట్టేను ఫోవమ్మ కోమలి.
తొలగి''॥౬॥

## గంగ :

''యిటువంటి జంకులకు య్యిరమ్యా
నేను
తనకను భూలోక శక్తి నా పేరు
గారవాన నన్ను కని పూజ చేయక
నిర్బంధమున బోయిరి
నీతిమంతులును
చేరి హరిశ్చంద్రుండు సేవింపలేక
కులపీరుని గొలవడా గురుతు
నా మాట
మర్రి కిందట సుగ్రీవు మారాజు తల్లి
మతి యందున దలచి మతి వినడాయె
గొట్టెముచ్చు అయి తలకోతలు
బడెను
కుంభకర్ణుడుంను వన్ను గురి
తప్పలేక
నిద్ర పొక్కును చాత నీలయి
పోయెను
సంపద విర్రవీగె శక్తియని తలచక
కురరాజు అక్షోణి పదకొండు
అక్షోణి బలముకు
సాయమైతని విన్నావ
వాయునందనుడు వన్ను వాకున
తలవక
పట్టుబడె లంకలో గట్టిగా వినర
దళావళారులు ధేముడు సాగెను
విసిగెను పోరాడి విధిచాత తొల్లి
నిష్ఠ దెల్పను నేను నిజరూపు శక్తిని
ద్రిష్టముగ మీయింట లేని వేల్పును
నేను
ఆకాశగంగను అవురా! నా పేరు
యేకాంతమున పోయేవు
యేరువరాజు!
అంతర్వా గంగను అవురా! నా పేరు
నిక్క శివుని శిరసు యెక్కిన దానను
చక్కని జాలరి గంగ నా పేరు
పోనాదక కాటభూపతి తమ్ముడా!
జాన్నవి తన పేరు జగమెల్ల
యెరుగుదురు
జగిరాముడు వుదయించిన (బహా)
చక్కనినేను
భూతాల వైరిని పాతాళగంగను
చేతి శూలము కొంది చెండుదు వైరుల
పెన్నాగవతి మీయందు పెంపుండి
నామాట
అన్న దోషంబు అనుచు నా మాట
యేమన నర్మదయందు యెంచగల
మాట
యేమరికారుల బట్టి యేపణగించు
నా మాట
పాప దోషంబులు సయ్యాన బట్టి

యేపున మీరంగ యెలుగు నామాట
కాలవిధిని నేను గంగను నేను
వాలాయముగ కొల్వరా వాదు
మనకేల?"॥౭॥

## యఱ్ఱయ్య :

"పశుపతి కవులావులు పాలేరు
దాటంగ
పసి బాల వైమచ్చి పశువులు గోరేవు
కోరలు తాటించి నోరు దెరిచేవు
బారలు చాపకు పశువులు బెదిరేను
జడలు దిప్పకు గంగ మెడలు
నొచ్చేను
గుడ్లు దిప్పకు గంగ మాయెడ్లు
బెదిరేను
శూలమేటికి త్రిశూలంబు నీది
కరకంఠకుని యెదుట
కాలుద్రువ్వుతావు
భుక్తికి ఆశించి యెమ్మెల బొర్లేవు
శక్తి నిన్ను త్రొక్కించ చెల్లులేదు
యెద్దులకు
పాలేరు దాటి పోలేరు అనుచు
పిల్ల కాల్వలు దాట భీతి చెప్పుతావు
గోవులకు అడ్డమా కొంపు నద్రలను
క్రొవ్వున కొయ్యకు పొట్టక్రొవ్వు
రానివ్వ
యెలిగొండ పాలేరు యెళ్ళి విరిపింతు

ధేనువలచేతనే దుక్కి చేయింతు
గబ్బిదేవతా! యింత కావరమా నీకు?
వుచ్చిన పాలేరు వుర్ల దొక్కింతు
వుసికె నుప్పులు చేసి వున్నావ గంగ?
పశువులదాత తొక్కించి పాలేరు
జేరుతు
నీరు మంటలు జేసి నిక్కుచున్నావు
పారుబోతువు పొంగి పార నీకేల?
బాగాతిగుండు అనంగ నెంత? బండి
అసంగ నెంత?
భంగపెట్టి మడుగు వుర్ల దొక్కింతు
నల్లగుండు యెక్కి నలనన్న యెదుట
పల్లదాలు ఆడకు పడుచు బుద్ధులను
వాలున వొస్తివి వరదన బోతివి
కాలు రొమ్మున వున్న కావరమె నీకు
వొకని చేసుకుని వొకని మోసుకొని
వొకనిమీద యెక్కిన పశుపతికాన
అడవుకత్తె నిన్ను అనరాదుగాక
యాదను నా కొల్వ యెళ్ళు
నా మంద"॥౮॥

## గంగ :

"భాగీరథి గంగను బడుగులరాజ!
యోగమాయల శక్తిని యరగవా
నన్ను?
యెరగకుంటి వైన యేటిలోపలను
పరువులు బాదింతు పాలేటి వొడ్డున
తల్లిని దైవమును ధరణీశ్వరా నీకు

పల్లదాలు ఆడకు పశుపతిరాజ!
కారు మాటల నన్ను కదిలింపరాకు
పారిగొర్ల రీతిని పశువులు తరిమింతు
జలము మంటలు చేసి జడలు
విరబోసి
కొలవక పోనివ్వ యవ్వరిని
కొనసాగనివ్వ
మ్రొక్కక పోనియ్య మొనకట్టనివ్వ
శిక్షించి మురుజుడు చేయుదు మిమ్ము
చిక్కి మ్రొక్కిన వెనుక సిగ్గులుచేటు
చేతులెత్తి నన్ను చేరదాయనుకోర
పోతురాజుకు చెప్పి పొలిజేతు
మిమ్ము
ఆవుల యెద్దుల యాదవుల మిమ్ము
కావర మణచక కదిలిపోనియ్య
శక్తులా మొగ విడిచి చలము సాధించి
నిత్యపూజలు కొనక నిన్ను పోనివ్వ

గుంటి కిందను వైచి గుండెలు
పగల
కంటి దాపుల మిమ్ము కలవర
పరతు
మిన్ను బెళ బెళ వురిమి మిరుగుర్లు
రాల్చి
కన్నులకు చీకటి కప్పింతు నేను
(కదమ) రాజులనెల్ల గర్వములు
బగులు
గుబులు గుబులుగ కడుపులో
గుబులు బుట్టింతు
గుబులు గుబులున రాళ్ల కురిపింతు
మీద
పిడుగులు బట్టట్లు పీనుగులు జేతు
అదరువు అయితిని ఆవులకు మీకు
వాదు నాతో నీకు వలదుపో రాజ!"
॥౯॥

## యర్రయ్య :-

"అరికాల బుల్మించి అరియింట
నిలచి
మొర్రిబాగుల మమ్ము యెదిరింపరాకు
బాగది గుండెక్కి భైరవ దిరిగేవు
గుండు నా యెద్దులచాత కూల
దొక్కింతు
కన్నబిడ్డల దిన్న కర్మరాలవు నీవు
యెన్నడు బాయను యిటువంటి
శిశుహత్య?

మేగవా...పై నెక్కి మొదట
పాపంబు
నేగాల వైతివి యిట్లు నీళ్ళలోపలను
ముందల మూడుకోట్ల మునులు
చూడంగ
అంగమొల అయితివట అదియేమి
పనికి
మొగవాని వలె వొచ్చి మోనై నిలిచి
నవుస్తు కేకలు వెయ్య నాయమా నీకు?

పచ్చి రక్తము చాల బద్దిలో బట్టి
యిస్సమెరి సాగిన విడిమాల పోత
ఆడవారితో బోలిన అపవిర్ధి అపుచు
కూడదంటేను కుప్పలించేవు
జాతు లేమిటికి నీ చేతు లేమిటికి?
కూతలేమిటికి? యేటిలో కూపదు
నానుసు
బద్ది కత్తిబట్టి పశువుల దరి మేవు
సద్ది కూటికి వాస్తివి జాగునీకేల
కరకంతు రూపమైన కాటమరాజు
కరుకులాడి మమ్ము కదిలింప రాకు

మొగులు బుట్టిన యపుడె మోసంబు
నీకు
మొక్కలకు యెద్దుచాత తొక్కింతు
నిన్ను
గంగాభవానివి దొంగవు నీవు
ముందల వేరుగాక ముచ్చట
లేమిటికి?
చేతులో ముద్దలకు చెడుమాటలాడి
ముద్దలకు ఆశించి మురిసేవు సొరెకు
నీచ బుద్ధులు మాని నిల్వక పొమ్మి"
॥౧౦॥

## గంగ :-

"కొదవ బుద్ధిని యర్రయ్య
కొల్వరానన్ను
కొల్వనన్న యపుడె కోపంబు
వచ్చును
వెలిగొండ పాలేరు వెళ్లి విరిపింతును
తెప్పవలె ముంతును ధేనువలను
నిన్ను
గుప్పనా బాగదిగుండుతో కొడుతు
సుడియై తిరుగుదును సుడిబడ
గొడుదును
వాడిగల గోపాళ్కుల వాగున
ముంతును
మేలిమై వొచ్చి యెడ్లను నీళ్ళలో
ద్రొక్కుదు
నీళ్ళలో ద్రొక్కుదు నిన్ను
సాగనివ్వను

చట్టవారి యర్రయ్యను
సాగిపోనివ్వక
కొట్టుదు నేలతో కోపంబువచ్చు
పేలేవు నాతోను పెయ్యల
యర్రయ్య
జాలి బుట్టింతును జర్జరితంబు గాను
రాజును అరికట్టి రాఘవుని తిదుదు
కొల్వక నిన్ను నేను కొనసాగనియ్య
ఆదివేల్పును నేను అమ్మను నేను
ఆది యెరగవు నీవు అల్పుడవు గాంగ
బొల్లావు బసవన్నను పోనియ్యక
మిమ్ము
గొల్లలా వురికింతు కొనకూతలు చేత
పెళ పెళ నార్చి బెగడ బుట్టింతు
మంచి గోపాల్కులు యేర్లు గావలెను
శూలాన యేతును సుడిబడ గొడుదును

తోలి తోలి తరిమి దొరతనము
జేతును
ఆవుల పొర్లగూచి ఆదరించినపుడె
పోలికతో అన్నియు పొర్లాడ వలెను
చూతుము మీ ప్రెగ్గె చూడు
మన్నాము
పోతురాజును బిల్చి బొబ్బలు
బెట్టింతు
పట్టపు రాజు! నా తోటి
పట్టియిడవనేల?
గుట్టున శోకుమా కొల్వుమా నన్ను
మ్రొక్కనన్నా పెగ్గె మొదటనే నీది
మ్రొక్కక పోనియ్య మొగబిరుదు
నాది
నిక్కముగ యీమాట నిలపంగ
లేవు

చిక్కి మ్రొక్కిన వెనుక సిగ్గులుచేటు
నీ తరమా పోను నీలవర్ణుండ!
యేతరము నా కొల్వక యిట్లాడినార?
కొల్వనన్న మాట కొనకు నీ నోట
నిల్పుమా గట్టిగా నీ వాక్కు పూట
రవ్వచాయను కాటమరాజు యిచ్చోట
బావు బిరుసుడు దైవము నేను
తరివారికి మీకును మీ తరతరము
నుండి
తిరుమండులకు మీకు దిక్కుసుమి
నేను
కుంతము బట్టి యింత పంతమా
నాతోను
గంతులు వెయ్యకు కాటభూపతి
తమ్ముడ!" ॥౧౦॥

## యఱ్ఱయ్య :-

"అసుర నీ కన్నులకు మదము
దట్టినదా!
కసరక మాతోను కచ్చి చేసేవు
దుండి నీకు యిసుమంటి దండి
యేడ గలిగె
వుండ చారవు నీవు దుండగ మేల?
చెంగులిడిసి నీవు దిక్కులు
చూసేవు
గంగ నీవెన్నడు కానవు మునుపు
చనువులేని చంక పారెకు యెక్కిన

గద్దరి పడుచు! నీ కావర మేమో?
మంద ముందల నిలిచి మాయల బిల్లి
యెదిరించి మ్రొక్కమన యెట్లాడె
వోరు
చిత్రకన్ను గలిగిన శివునికేగాని
వచ్చి దైవమా నీ వంటివారికి
మ్రొక్కడు
వామదేవుడు నందివాహనునికే గాని
తామసి నీ వంటి దైవాలకు
మ్రొక్కడు

ఆపదోద్ధారుడగు హరునికే గాని
అసుర దైవాలకు అతడేల మొక్కు?
యింతేసి మాటలు యేమిటికి నీకు
మోళిపురాజు నీకు మ్రొక్కడు
పొమ్మి
అయితపడి వస్తివి ఆవులలోకి
కుసుమ కోమలి నిన్ను కొల్వడు
పొమ్మి" ॥౧౨॥

గంగ:-

"బాలుడవు కాటభూపాలుడవు నీవు
యేల మా యెఁరిగాక యియ్యక మీది
తరతరము మీ యింట పూజలు
గొన్న
తరము నాటి యేల్పును తలసవా
నన్ను?
అంబురుషులు కవులావులు అన్ని
డిక్కులను
యెందరు దేశాల యెద్దులు మేపితిరి?
వలపట దాపట తమ్ముల నిన్ను
కాపాడి వచ్చిన గంగను నేను
వలితట కోడివలె వలపట నీకు
బొడలు విని వచ్చిన జాన్నవిని
నేను
కొలవకుంటే అపజయము నీకు
నిన్ను నీ తమ్ముణ్ణి నిలువబెట్టించి
నీతో అన్ని మాటలు నిలుపుదు
సూడు
కుయ్యో! మొఱ్రో! యని కూయించి
మిమ్ము
గద్దించి నానోట గవురా కల్యాణము
పాడించకున్న భాగీరథిని గాను
జంగిలి దైవాల యెంగిలికి రోసి
ముంగల నిలిచితిని ముజ్జగము
లెరుగ
ప్రతిగ్గె పట్టాము పాలేటి వొడ్డున
యేర్చిపెట్టిన మంచి యెఁర
గొఁరెలును
కుంకము వసంతము కొమ్ము
తగుళ్ళను
కొంకిక పూజలు కొందు నీచేత
వకరిని యిద్దరిని వరదను గలిపి
మ్రొక్కనన్న రాజుచేత
మ్రొక్కించుకుందును
కృష్ణ డెబ్బైరెండు రేవుల కించిత్తు
గాను
దాటి వొచ్చితినని ధైర్యంబుతోను
వున్నావ వో రాజ! పూర్ణితంబుగను?
కొలవక పోనియ్య గురుతు నా మాట
వాదు నాతో నీకు వలదు
నలనన్న!'' ॥౧౩॥

# యఱ్ఱయ్య గంగ తప్పులెన్నుట

గంగ అన్న మాటలకు కణెగె
యఱ్ఱయ్య: అంగమొల అయితివట ఆది
''యెంగిలి పడుచ! యింత
యేగ్రంబు యేల? ప్రాణానికి అడ్డపడితివి యెవ్వరికి?
ముందర దెలియక మొగవారి
యెదుట
సంగులు చేసేవు సైసావు మాకు
యేర్నివక మరువక యెస్సు తగిలి
నీవు
ఆశించి వొస్తివి అవులలోకి
నీవంటి గంగలు నిండు యెదురు గలవు
సేవ చేయమని చెడుబుద్ధులు సూచం
మందలో జొచ్చి నా ముందల నిలచి
యేమందురే జనులు యెమ్మెలాబోకు
యీరీతి పద్నాల్గు యిగంబులందు
యేరాజు యెవ్వడు? యేడె
నీ విభుడు?
అతని పేరు యేమె అతివేగ జెప్పు
కోర్కెతో నీవుగన్న
కొడుకు లెందరును?
యెందర్ని గన్నావు?
యెందరున్నారు?
తిందువట బిడ్డల తెలుపు నాతోను
యే చీర గడితివి? యెటు
మొక మైతివి?
మించివచ్చి నిన్ను మింగేదెవ్వరును?

రంగు మీరగ నిద్ర రాదటే నీకు
యేమి పనికి?
యెనిమిది నామములు నీకు
యెవ్వరు బెట్టిరి?
యే దుర్గవై సోమకుని తురిమితివి
జడలు?
ముక్తి వెరిగి అసురుల యేల
సంపితివి?
రక్తము బడిపావు యేరాజు నీకిచ్చె?
మరియు దెభ్భరెంతు
[illegible]
వెఱ్ఱివిగా నిను కొలిచినవారి పేరేమి?
హరి బలిని మూడు అడుగులు
అడిగె దానంబు
ధరణి మిన్నున రెండు అడుగులు
అయె
కడమ అడుగుకు తావు కానరాకున్న
బాలుని శిరస్సున పెట్టి
పాతాళమణిచె
అలివేణి దాగితివా అడుగులో
నుంటివా?
మందిగల అతివా మింటి కేగితివా?
కుంటెనకాణ్ణి చేసుకుంటివట
అదియేమి చెప్పుమా?'' ౹౹౧౪౹౹

## గంగ తన మహిమలు పొగడుకొనుట

గురుతులడిగిన గంగ గుంటిపై
నెగసి
"యఱ్ఱయ్య నన్ను అడుగ
యెంతటివాడవు?
నిన్న మొన్నటి వాడవు నీవేమి
యెరుగుదువు?
తనను గొలిచినవారు తరము
యిటు యినుమా రాజ
ఆగ్నేయపు మూలకు అటు
మొకమైతి
చెంగువిడిచి యఱ్ఱపట్టు సీర గట్టించి
పొంగు బాయసి బెల్లో పెట్టి శోభిల్లి
అగ్నిదేవత నన్ను గొలిచి హారంబు
వేట్టె
దక్షిణపు మొకమై ధవళ వస్త్రములు
గడితి
యచ్చని కొఱ్ఱకూటి యేడి కుంభాలు
రమణీయముగ రత్నకంకణములు
బెట్టి
యముడు తనను గొలిచె
యెఱుగుదురు సురులు
నైఋతుడు మొకమై నల్లపుట్టము
గడితి
నైఋతుడు నను గొలిచి సీరాజనము
బెట్టె
పడమట మొకమై పాలసీరె గడితె
వలి నట్లుగా గొలిచె వర్షుడు తనను

వాయువ మొకమై వన్నెవాలిపెము
గడితి
శాయల కరువాలము చాత
దరియించి
పాయసాన్నంబుల పదార్థములు బెట్టె
వాయుదేముడు తనను వంగొని
గొలిచె
వుత్తరపు మొకమై ముత్యసీరె
గడితి
కుంభేరుడు రాజనపు కుంభాలు బోసె
ఈశానపు మూలకు యిటు మొకమైతి
పట్టుసీరె మంచి ముత్యాల కంకణాలు
యీశానుడు తనను గొలిచె యిచ్చెని
వరములు
అష్టదిగపాల్కులు అమురులు
అందరును
యేడి కొలిసిరి ఆదివేల్పుని నన్ను
బడుగుల రాజ! నీ పంతము మాను
సత్యముగల అరిచంద్రుడు కాశిలో
తనను గొలిచె
సతిపురుషుడు విద్దరు
సాంబ్రాజ్యమేలె
యేక చక్రముగ భూమి యేలిన
గనులు
కోర్కెతో దామిన గొర్లతో గొలిచిరి
పూరుకుంచు గొలిచెను
పులిజున్ను తోను

పురుహూతుడు నన్ను పైడిపువ్వుల
పూదించె
కనగారల దెచ్చిన శాంభవిని నేను
బగిరాముడు దెచ్చిన పరమ
పతివ్రతను
బండమాటలు మాను బడుగుల రాజు!
॥౧౪॥

## యర్రయ్య :-

"గంగనంటా నీవు రంగులు జేసేవు
జాగుల బొర్లక శక్తి వై దొలుగుమా
యిద్దరు పెళ్ళాలకు వక్కడే
మొగుడు గద్దు
వక్కతికి ముగ్గురు మొగులు
యెక్కడ గలరు?
ముగ్గుర్ని చేసుకున్న ముదితరో నీవు
కొంచక ముగ్గుర్ని కొనసాగవైతివి
అంచితంబుగ నీ బ్రతుకు అయ్యో
నిటుపలెను
యెంచి చూచిన మాట యెక్కడికి
ప్రియము?
పుట్టింటికి కొరగాక పట్టితివి ప్రగ్న
అత్తవారికి కొరగాని అతివెవు నీవు
యిచ్చిపుచ్చుకున్న తావు యెరగని
యితుమాలపోత!
సిగ్గుబడక మాతోను దిక్కరించేవు
యనమండుగురిని గన్న
యెచ్చిరికముతోను
దేశము మీద బోతివి తిట్టరా నిన్ను?
చిల్లరి బుద్ధులు చెల్లించ వచ్చేవు
మర్లి పోవే నీ మంకు మాటలు మాని

వెర్రి గొల్లనంట నీవు మాయెంట
బడేవు
యెర్రిగాడ యీశ్వరుడు యిద్దరు
యెలదుల మోచె?
యెర్రిగాడ దెన్నేవుడు పదహారువేల
స్త్రీల వెంటనే తిప్పె?
యెర్రిగాడ బ్రెంహ్మ సరస్వతిని
పుక్కట బెట్టుక
అటు సోద్య మెచ్చెను సకల
జనులకూను
వెర్రివై నీవు మా యెంట బడ్డావు
కల్ల లాడితివి యిచ్చోట కానక నీవు
యిల్లాలువై వకని యింట వుంటివా
నీవు?
చేసుకున్న మొగని పేరు చెప్పవే నీవు?
నీ కొడుకు కూతురు పేరు గొబ్బున
జెప్పు?
వురుకులు బెట్టేవు నీ వూరు పేరేమి?
వూరు పేరు జెప్పవు వుండదు మనసు
వాలున వాస్తివో వామాక్షి నీవు
వాలు సుక్క యెవ్వరికి వైనమేకాని
నేను అడిగిన అన్ని నేర్పులు నాతోను

చెప్పలేక నీవు చిక్కితి వైన
గోరాట మా మంద గొబ్బున
వెళ్ళు"॥౧౩॥
కాఱ్ఱేడు ఆడిన కంటకపు మాటలకు
ఘనతతో అరవెల్లి గంగ యిట్లనియె:
"యశోద యింట బుట్టి యెన్నొ
తరము లాయె
ఆశించి గొలిచిరి యాదవులు నన్ను
కంటికి రెప్పవలె కాపాడి మిమ్ము
వెంట వెంట తిరిగి వేసారితిని
పగ చేరువకు వచ్చె పాకనాడు
యిదుగో
చిత్రభాను సంవత్సరము చెల్ల
నున్నారు

మీరు హతమైన యెనుక మీ మహాత్మ
మేది?
కోరి రాజు కొలువక కొలుచువారేది?
బలిమిని మీరాజును పట్టి
మ్రొక్కించక
కలియుగమందు నా కథలై నిలుసును
పాలేట అరికట్టి పంత మీడేర్చక
అలిగి పూజలు గొందు అగ్నె పెట్టి నిన్ను
మొరతోపున నాకు మ్రొక్కవా
యిపుడు?
యెక్కడ బోయేవు యెరగవా రాజ?
వాకరిని విద్దరిని వారిగె ననిపించి
మోసపుచ్చి ముందల మ్రొక్కించు
కొందు''

## గంగ ఆలమందలను కలవర పరచుట

నూటొక్క శక్తుల వెంటనే తాను
పోటు కూతలు బెట్టి పోతన్నను
బిలిచి
నవనాటి సిద్ధుల నలుగురైదుగురిని
వేవేగ రమ్మని యెంట బెట్టుకొని
అరవెల్లిగంగ అరి వేరమునను
తూరి పాలేట తుంపిళ్ళు గురిపించి
అల్ల శ్రీ రాఘవుడు అంబోది కడకు
వెల్లువాసిరి చేన నిడిన యట్లు
కోటాన కోట్లు కూర్చుక వేగ
పరుగున వచ్చి పాలేట నిలిచి
అవులు చూచి గంగ అర్భాటములు
చేసె

గోవులు గనుగొని గొరికెను పళ్లు
యేనుగు లెక్కికూసె యనక
ముందలను
సలుకుటెడ్లు చూసి సప్పట్ల గొట్టెను
నఱ్రమాను లెక్కి నఱ్రావులు గూసె
కుఱ్రలు దరిమెను గొఱ్రెల రీతి
మందనావుల గూసె మచ్చరంబునను
పచ్చని పీరసేస పైబార జల్లె
యేరు బగబగ మండె యాక
కూతలాయె
పోరుకు రాచమంద పొర్లబడి గూసె
రంతులు అర్భాటములు సింతమాను
లెక్కి

బంతి తోలినయట్లు పాడియావుల
గూసె
జానలెక్కి రాజుధేనువల గూసె
చివ్వ చివ్వన యెగిరి జువ్విమాను
లెక్కి
కచ్చుకు రాచి మంద కవులావుల
గూసె
తబిసి మానులెక్కి అబిసి కూతలు
కూసె
వుప్ప సప్పని కోపాన వురికించి
యెర్లను
గోకుళము యెంటజూసి మాకువూసె
డాకాలు తరసి దయ్యమై తోచె
గంగ రూపు దాచి గరాటు చేసె
నింగిమోయగ బెరిగి నిప్పులు రాల్చి
కణిగి మాకులు యెక్కి కణిగి
కోపమున
తునక మాకులు యెక్కి తుళ్ళెను
గంగ

పుబ్బల మిట్టల మబ్బువలె నుండె
కిబ్బిబ్బ యని యార్చె వుబ్బి పాలేరు
వుర్లెను యేటివొడ్డున తర్లెను గంగ
చెర్లించి సురభుల మర్లించె శక్తి
బడుగుల రాజు మంద పరదక్షిణం
తిరిగి
పిడుగులు బడ్డట్లు పెడబొబ్బలార్చె
చేతి శూలము వెగసి చక్రంబు దిప్పె
మచ్చలు మాయలు రాజు మందలో
చేసె
యెలుగులై పులుగులై యీడాడ
అనక
కలవర పరచె మంద కలవర పడెను
పోతలింగడు రెణబొబ్బ లిడుచూను
భూతకోట్ల పశువుల బోయల
దరిమెను
సిద్ధుల అగ్నెదాత శిముని ఆవుల
మంద
మొదలై పాలేరు మోనై నిలిచి ॥౧౬॥

## యర్రయ్య ఆవులెద్దులను పాలేరు దాటించుట

యేటిలోపల గంగ యెమ్మెలు
బొర్లంగ
కాటమరాజు తమ్ముడు ఘనుడు
యర్రయ్య
మేలైన యెద్దుల మేలు దీకాల్పి
''కాళంగి వో రుద్ర! గణవీరభద్ర
రంగనాథుని ముద్ర! లక్ష్మైన్నిద్ర

పరగంగ శివకాశి! బంగారుకాశి!
కూర్మమై ధర మేసి కులతటరిని వేసి
కొమరప్ప పూబోణి కోగిలవాణి
పల్లవవాణి! భ్రమరికా రాణి!
నవరత్నములు కెంపులు నాదము
సొంపు
పరగరాజులు జంపు ప్రగుసుల ద్రుంపు

పండిన గజనిమ్మ! బంగారు బొమ్మ!
పచ్చివగడపు కొమ్మ! నిత్యామృతపు
గుమ్మ!
తిరుపతి పైడికొండ! తీర్థాని నిండ!
రంగనాథుని కొండ!
బన్నసరములు పచ్చ! పద్మనాయుని
మచ్చ!
అర్జునిపై మచ్చ! అణిముత్యపు
కుచ్చ!
గురునాథుని శూలమా! గుండెల
గాలమా!
నడివాన కాలమా! నాయమైన
నీలమా!
కయ్యానికి వెదిరించి కట్టిరుపులాను
రంతుల రెణభేరి! రాజుల వైరి!
మాణిక్యముల రూప! మర్దవారి
తరుప!
కంటిలోపలి ఎరుప! మింటిపై
మెరుప!
పంతమున రావయ్య పాలేరు దాట
మగువను యెదిరించి మెరుపువలె
మెరసి

చేకొని వైరుల చెర్లించి పొడిసిన
దీకొని రావయ్య తిరువెంకటేశ!
యెంచ గలిగిన యట్టి
కంచి వరదప్ప!
కొంచక పాలేరు గొబ్బున దాటుడి!
.... ... .. నీవు చెదరక మనుసు
యగబడి దాటుడా యేరు
అనంగ నెంత?
పిల్లకాల్వలు యివ్వి లక్షణము
చాయక
చల్లవారి ధేనువులు! సరుగున దాటుడి
పందుములువారి ధేనువులు!
పాలేరు జొచ్చి
కందువతో దాటుడి శక్తిగాతలకు
యరవక
నిర్వాణిశక్తి నీళ్ళలోపలను
గర్వంబు అణుచుడి గంగని
చూడక"
యఱ్ఱయ్య పెయ్యల యఱ్ఱయ్య
విద్దరు
చయ్యనాడి కొల్పిరి శక్తి
మీదికిని ॥౧౭॥

## గంగ మట్టిపెయ్యాను దాచుట

వాలంబు జళిపించి గంగ
శూల మెగవేసె
పాతేటిలోపల భగ్గునమండె
తొలకరివానలు తొలికురిసిన యట్లు

నురుగులు తెప్పలు నురవడివచ్చి
యెచ్చరించెను గంగ యేరు అల్ల
యేకఘంటలు మండె
పచ్చగెడ్డలు ముంచి పారంగ సాగెను

నిప్పులు మింటిపొడువున గుప్పుమని
యెగిసె
అప్పుడు బాగిరితి ఆర్భాటములు చేసె
మిణుగుర్లు వెగిసెను
మింటి పొడుగునను
వెరగంది పోయిరి యాదవులు
అపుడు
యెక్కడ జూచినా యెడల సందులేక
దిక్కులు నాలుగు తెరికట్టి గంగ
కొండవలె బెరిగెను గోవుల
ముందల
పన్నెండు రేవుల బారలు సాచె
పచ్చగెడ్డలు ముంచి పాలేరు
వుపొంగె
యెచ్చరించెను గంగ
యేరు మంటలాయె
మురుజుడు ఆవులను ముంచెను
గంగ
బొబ్బలుగా వుబ్బి పోలిక చిక్కె
పొక్కెను కాళ్ళను బొబ్బలేకుండ
తెక్కలు పగిలెను ధేనువలు
చిక్కెను
సురులు మునులును చూచి
చోద్యపడిరపుడు
వెరగంది గోపాల్కులు వెల వెల
బోయిరి
గుంటి క్రోవులు నేల గుబ్బటిల్లినట్లు

మంటలు నిప్పులు మింటి పొడుగున
వెగిసె
ఆకాశ గంగ ఆవుల నడుమ
కూతలు బెట్టెను కులగిరులు
అదుర
కణిగి దిక్కులు భూమి గజ గజ
వొణికె
కడుపులో వుదకము కాగినయట్లు
సల సల పాలేరు తెర్లంగ సాగె
జడలు విరబోసుకొని చెర్లించి గంగ
పెళ పెళ నార్చెను పెయ్యల
మర్ల సాగెను
ఆవులు సలుగు బెడ్డలో......
లేగలు తరువులు మూకలు జేసె
పోగుబారి గంగ పోకుండ నిలిపె
మర్లు మల్లయ్య మంచి సజ్జనుడు
ఋరవై అయిదు ఆవుల యేర్పక
యపుడు
అరణంబు లిచ్చెను ఆ యావులన్న
మట్టి యావు గర్భమున పుట్టినయట్లు
మట్టి పెయ్యను బట్టి మడుగులో
దాచె
ఆవులు బెదిరించి అర్భాటములు
జేసె
చట్టు క్రిందను దాచి గంగ సంతోష
పడెను''

"౧౪"

కడుకోపమున యఱ్ఱయ్య గంగవంక
జూచి
యెన్నని తమ్ముడు యేగంటె
పలికెను
"వైరము నాతోను వలదుపో
శక్తి!
ఆట యేమి నాతోను తటవట శక్తి
యెలిగొండన బుట్టిన పిల్ల కాల్వలు
యివ్వి
పిల్ల కాల్వలు దాటలేరని తగ
జెప్పతావు
కృష్ణా గోదావరి దాటేటి ధేనువలకు
యిసు మంటి పిల్లకాల్వలు దాట
భీతి జెప్పినావు
అల్ల శ్రీరాఘవుడు అంబుధి దాటంగ
వనచరులచేత వారధి గట్టించె
వారు అంత వారము వామాక్షి
మేము
నీగుండు యేమి లక్షణము?
నీ కొరకొరలు మాను!
వురదాళ్ల గట్టి గుండు వుర్ల
దొక్కింతు
తీసి గుండు అగ్గిలోకి తిప్పి
వేయింతు
బిర బిర అని ఆ గుండు పెరికి
వేయింతు
తలకోలలు వేసి ఆ గుండు తర్ల
దీయింతు

(నీ) బడాయిలు మాని పదవమ్మ
తొలిగి
కాశీలు చాత గుండు కజికెలు
చేయింతు
వుక్కు మొలలచేత ప్రక్కలు
చెక్కింతు
నిక్కక పోవమ్మ! నీ వేషాలు మాని
గొబ్బున వెగ విడిసి కోడెలచేత
వుచ్చిన పాలవేరు వుర్లదొక్కింతు
మచ్చరించిన సలుగు యెద్దుల చాత
పచ్చిపైరులుగాను పాలేరు
దొక్కింతు
కోడెల చేతను కోమలి యిపుడు
పొంగిన పాలవేరు వూడద్రొక్కింతు
యేరు అనంగ నెంత? నీరు
అనంగ నెంత
పారిపోవే శక్తి నీ పంతాలు మాని
బండ మాటలు మాని గుండ
దిగవురికి
వుండవమ్మ శక్తి వొదిగి
వొక వంక
మీరిన కవులావులు గుండుమీదికి వొచ్చి
చూరుగా ద్రొక్కెన నురుగు
వొక వంక
కన్నుల మూసుక కదకు బోవమ్మ
మంది మేళమునను మందలో నిలిచి
పొంచుగా కొల్వుమని పొర్లేవు
సారెకు

నిత్యముగ కొలుతుము నీలకంఠుణ్ణి
శక్తి నిన్ను గొలిచితే అవుసత్య
మవును ॥౨౦॥

వల్లవుల కాటమరాజు వంక
తా జూచి
పల్లవపాణి తా పలికె నొక మాట
''అడ్డ బొట్టుయవరిది? తిరునామం
యెవరిది?
వొష్టిరము లాడకు వుచితంబు గాదు
సాటిరాకు నా తోను కాటమరాజు!
భూలోక శక్తిని భూకాంతను నేను
తల్లివని మ్రొక్కుదురు ధరణి
లోపలను
గొర్లకాపరవు గాంగ గురుతెరుగ
వైతివి
దొడ్లలోపల చాల దుత్రి పిశాచులు
నిలుపుకున్నానని నిశరము నాను
యెలముబు కాంతను యరగవా నీవు?
అటు మునుపటి వార్తలు అంతయు
వినుమ
మిన్ను మన్ను మేలు గిరులు పుట్టని
నాడు
అంబారగిరికిని అరవై వాకిళ్ళు
కంబాలు నాలుగు కడవొత్తులు నాలుగు
పదారు డిళ్ళు పాదుకంబ
మొకటి

ఆదరువుగా నిలచి ఆమీద విరాజగతి
పై నుండి
కంటికి నిద్రలేక గట్టిగా నేను
అఖిలాండ జ్యోతినై వెలుగుచు
నుంటిని
యేవాకిట నుంటివి? యే దిండున
వుంటివి?
యే తావున వుంటివి?
యెరుగవానన్ను?
వుచితమైన మాట వొకటైన మీవలన
కలలోను వినలేదు కాటమరాజ!
పశువుల గాచేవాడ! పాముమీదవాడ!
అసురుల సంహార! అంచమీదవాడ!
ఆకుమీదవాడ! హస్తాన రాయి
యెత్తినవాడ!
ఆయుధము చేతబట్టినవాడ!
ఆదిలక్ష్మిపతివని ఆశించివస్తి
దశావతారుడ! తప్పక వినుమ
పక్షిమీదవాడ! పశుపతి వినుమ
కుదిరి మూడు అడుగులు
కూల్చినవాడ!
యెశోదయింట బుట్టిన
యిళ్ళుదొంగవు నీవు
దూర్వాసుని శాపంబు తొణికినవాడ!
సన్నుకుడిసి అసురను సంపినవాడ!
మత్స్యావతారుడ! మకరిని
ఛంపినవాడ!

అక్షయమనంగ మిన్ను అరిచేత
నిలిపి
పొన్నమాను యెక్కిన
పురుషోత్తముడవు
మా యుగంబులన్ని మనసున
గ్రహియించి
వొంటిచేతివాడః వాలపెట్టినవాడః
అంటక పరమొండెమై నిలిచినవాడః
అంతవాడవని నీవు ఆశించి వొస్తి
వలపక్షపు మాటలు వద్దు నలనన్న!
చయ్యన ననుగొలువక
సాగిపోనియ్య ॥౨౦॥
సంకుమోమిణి అలశంకరి
పద్మాక్షిణి పద్మకుల చింతామణి
అష్టవీరా జలాంబరి ఆది పరంజోతి
దిగ్గి మండతేశ్వరి వొత్తిలెక
మిత్తిలేక
కుంచిలేక స్తంభంబులేక అఖిలాండ
కోటర
వీర జగజ్యోతివై వెలుగుచున్నున్న
గోకుళములోనున్న
గోసంద్రవతి యీ
అయివోధ్యలోవున్న అంబుజ
కన్నెవు
యిలరాజుకు తల్లివి..............
..............................
(గ్రంథపాతము)
..............................

.....................సికరు పట్టుదట్టి
అరికాళ్ళ తామరపద్మం
అరవైయ్యారు చెరుగులు అర్ధగిరుసు
నుదుట భస్మధూళి వాలుగన్నుల
చింతామణి
చేతుల పరసవేది అరికాల తామర
పద్మం
ముంజాత మునిమీసము అరిచాత
గొగ్గిపండ్లు
అరవైయ్యారు కొండల గెలిచి
అలుగులు వుద్ధరించి
నాదులేని పెంటలోను నగాశ్వరము
తీసికొని
మొకములేని పెట్టితో జిహ్మములేని
జాల దీసుకుని
తొడపైన కూర్చుండ బెట్టుకొని
వర్ణములేని బోగముబాడి
ఆసురముఖాల సింహాన్ని పల్లము
గట్టించుకున్న
ఆదిశక్తివి నీవు నీ పన్నగడ
అశ్వము
పన్నగడ అలించి వినుమ
అరవైయ్యారు చెరుగులు అర్ధగిరుసు
అర్ధళము వకచాత హలాయుధము
వకచేత
ఆ శూలము వకచేత............
దబరకము * వకచేత దక్కి
వకచేత

* ఢమరుకము

అసురుల మర్దించ అంబు వకచేత
ధూర్తుల మర్దింప దుడ్డు వకచేత
గద్దగోరు వకచేత గజాంకుశము
వకచేత
శంకు వకచేత శక్రము వకచేత
పరువైన దానిమ్మపండు వకచేత
పన్నెండు చేతుల పన్నెండు
అయుధములు పుచ్చుకొని
అసుర ముఖాల సింహాన్ని పల్లము
గట్టించుకున్న ఆదిశక్తివి నీవు
అశ్వము పన్నుగడ ఆలించి వినుమ
యీశ్వరుడు గుర్రము విష్ణుపల్లంబు
బ్రెమ్మదేముడు గోగిలి
అష్టదిక్పాలకులు అంకివాన్నెవారు
సూర్యచంద్రాదులు కక్కుల
కళ్ళెము
యితర దేవతలు అగితాళ్ళు
బోడిదేవతలు అశ్వానికి
పొట్టపట్టెడ తాళ్ల
యెల్లదేవతలు అశ్వానికి యెగపట్టెడ
తాళ్ళు
చుక్కలు అశ్వానికి
చూపుకన్నులును
ఆకాశము దవడలు మేఘమే
అశ్వానికి మేత
భూదేవత అశ్వానికి నోరు
నవ్వున సవుకు జేసి
యెక్కినిక్కి తోలినావు నీపేర్లు

చెప్పవే శక్తి ॥౨౨॥

బెట్టురికి మింటిపై పిడుగులు
రాల్చుచు
గురుతులడిగిన గంగ గుంటిపైనెగసి
"యఱ్ఱయ్యా! నన్ను
అడగ యెంతవాడవుర!
రాజు నాకెవ్వడు రాజు తేజుండు!
పూజచెయ్యక నిన్ను
పోనియ్య"ననుచు
మురిజుడ్డు మందనావులను ముంచెను
గంగ
"జర్జితంబుగ మిమ్ము సాగిపోనియ్య
యెఖడకు బోయెవు యఱ్ఱయ్య
యికను
చక్కని మీ రాజును మ్రొక్కక
పోనివ్వ
పారిపోతివ నా తోను భుజశక్తి
వెరసి?
యేరీతిని బొయ్యేవు యఱ్ఱయ్య
యికను?
యెక్కడ జూచినగాని అక్కడ
నారూపు
చిక్కములో పిట్టవలె చిక్కుబడితిరి
మీరు
గంతులు వేసేది యెంత యెగిరేది
పంతమా నాతోను? పాలేరు
ధాటనివ్వ

ఘట్టిగా నా మాట కాదనక వినర!
పట్టితిని మర్లవారి మట్టి పెయ్యను
వాడిసి
యఱ్ఱయ్య మీ ఆగ్నె యిక
చూతమనుచు
గుంటి కిందను దాచితే గురుతు
యరగవైతివి
కయ్యలో దాచితి గట్టిగా వినరః
పెయ్యను జూచుకో పేరు నీకేల
మాయల మాటలు మాముంగల
సాగవు
గుసగుసలు మాని కొలవరా నన్నుః
పంతాలు మా ముంగల ప్రగ్గెలు
సాగవు

సంతోషంబున సన్ను సాగి పోనివ్వు
జాగులు బొర్లితే సాగిపోనివ్వ
బాగుగా కొల్వరా పాలేటి లోపల
గంగమైలావుల కటలంపు గోవులను
యాదవ వీరవరుల యేటిలో ముంతు
నీ మెచ్చి రణము మురిపెము
యఱ్ఱయ్యమాను
యిచ్చోట కొల్వరా యిది నీకు లెస్స
ముచ్చటలు యిచ్చోట మురిపెములు
మాను
అరికట్టుకున్నాను అవుల మిమ్ము
కరకంఠకుని పాదమానః
కదలి పోనివ్వ "౨౩"

## కాలారులు గంగవార్తలు కాటమరాజుతో చెప్పుట

యఱ్ఱయ్య గోపాల్కుల యేగమే
పిలిచెను
"కవులావుల చన్నయ్య! కాలారి
మారెన్నః
గ్రక్కునబోయి మీరు
కాటభూపాలునికి
యివరమంత మీరు యిన్నవించండి"
వడివేగ గోపాల్కులు వచ్చి రాజు
వెదట
కడు వేగమున నిలిచిరి
గంగవార్తలును

మనవిగా చెప్పిరి యాదవులు
జననాథుతోను;
'గట్టిగా తనపేరు గంగననుచు వచ్చి
మట్టిపెయ్యను బట్టి మడుగులో గాసి
అటు యిటు పోనియ్యక అరికట్టు
కొనెను
కొట్టెను పాలేరు కొండలు తెగను
యఱ్ఱయ్య శక్తితో యెదిరించి నిలిచె
పోరాడు చున్నాడయ్య
ఫాలలోచనుడ!
రావయ్య కాటమ రాజశేఖరుడ!"

## కాటమరాజు వచ్చి గంగను ధిక్కరించి పలుకుట

విని రాజు పద్మనాయుడు
వీరపరివారము
పనువడి వచ్చిరి పసువుల మందలోకి
"జాగులు చాయక శక్తి వైదొలుగు!
దానవలు నామందలో దగ్గర రావు
నేను కోపము చాయ
మర్రిమింగే వానికి మర్రివూడలు
ఘనమా?
గట్లు మింగేవానికి గుట్ట యేమినుము
వట్టి ప్రగ్నెలు మాను వాదు నీకేల?
వాడుగాలి మెట్టంగా శాట సెబునేల?
కావరంబులు మాని కడకు బో శక్తి
పారి పోవే వొక పంక ప్రగ్నెలు
మాని
యేరుగాసినానని యెమ్మెలు బోకు
దాటనివ్వకుండే దబ్బర వచ్చు
మట్టిపెయ్యము దెచ్చి మా కప్పగించు
గుండు దిగిపోవె నీ కూతలు మాని
తక్కిన దైవాల తలసను నేను
ముక్కంటికే కాని మొక్క నెవ్వరికి
నిక్కక పోవె నీ తక్కులు మాని
వ్రారె వాగులు గాచి యెర్రివై నీవు
గుర్రేవు మా యాదవుల కొదవచేసి
నీవు
వొకని కాలికిందనుండి కార్యార్థము
కొరకు
వొకని నమ్మించి వొస్త్రివి వాడక
నీవు
కన్ను బోగొట్టుక కలకాలము
మిడికేవు
వకని యెంట బోతివి వాడక నీవు
మీరి నడుమ వొరుడు మ్రింగెను నిన్ను
వొకని యందు యెడలి వయ్యాన
వస్త్రివి
యెక్కడ గెలువు లేక యిక్కడికి
వొస్త్రివి
శక్తినంట నీవు చాల నిక్కేవు
...ులకు బొర్లేవు వాదు నీ కేల?
పస లేదు నీ ప్రగ్నె పంతము
మాను
కోతివలె యిగిలించి కొవ్వరించేవు
నిప్పు ద్రొక్కిన కోతివలె
త్రొక్కులాడేవు
జడలు నీవు పెద్దచెర్లో రొయ్యవలెను
పసువులు బారేవు పాలేటి వొడ్డున
సవుకు తగిలిన అశ్వమువలె
తల్లడించేవు
సవుకు లేక సదువు సాదకం గాదు
యిందుకు రోషించ యేమిటికి నీవు?
కందువతో మంద వెళ్ళి కదలవే
పడుచ"॥౨౪॥

## గంగ తాను యాదవుల ఇలవేలుపు ననుట

గుంటిమీదను గంగ మింటి పొడుగున
బెరిగి:
"కంటకాలు యేమిటికి కాటమరాజా?
కొల్వక పోనిచ్చ్య గురుతు నామాట"
పెళపెళ నార్చి జడలు విరబోసు
కొనెను
కడు వేగమున భూమి గజగజ
వణికె
మిన్ను బెట్టూరికె మెరుపులు బుట్టె
గర్జిల్లె మేఘము కయ్యాలు ఎగదొట్టె
"వోరి కాటమరాజ! వొయ్యాన
వినరా!
యేడు దరాలు నాటి యిలవేల్పును
నేను
నేడు మ్రొక్కనని నిక్కేవు సారెకు
గోపాళ కృష్ణుండు గొలిచెను నన్ను
ద్వారకి లోపల గొలసి వైకుంఠ
మేగిరి
విష్ణు పాదమున యెలసిన దానను
అష్ట దిక్పాల్కులు అందరు గొలిసిరి
విఘ్న గండము కొరకు ఎలియ
రేపల్లిలో
నందుని వింట బుట్టి నాతి నైతిని నేను
బలభద్రుడు నాయన్న
పల్లికొండాయె
తరివారు గొల్తురు ధర్మాత్ములూను
అవుల వొలురాజును అయిదుగురు
మీ తండ్రులు
భావించి గొలిచిరి బడుగుల రాజు!
సచ్చిన మీతండ్రిని సరుగున
మాట్లాడిస్తిని
వొచ్చినీవు నన్ను వాకు నాలసవు
దక్షణాది పగలు సాదక మవును
మచ్చరంబు యేమిటికి మాధవ!
కొల్వర" ॥౨౩॥

ఆనంత కోటి యాదవులు అతి
భక్తితోను
అన్నము భోంచేసి అపుడిట్ల గనిరి-
రాజులు ప్రధానులు తేజంబుతోను
కాటమరాజుకు మనిమి గ్రక్కున
జెప్పిరి
నంద గోపాల్కులు ఆనందమూన
పొందుగా బలికిరి కందువతోను:
"ముంగిట ముత్యము మూలధనము
మనకు
గంగను గొలిచితే కలుగు సంపదలు
కొండంత దాపు అవును గోవులకు
మనకు
గోపాల్కులు మందలకు
సంతోషమునను"
పద్మనాయుని అడిగె పశుపతిరాజు:

## గంగను కొలువదగునని పద్మనాయుడు కాటమరాజుతో చెప్పుట

అడిగిన పద్మనాయుడు అపుడిట్ల
గనియె:
"తల్లి భాగీరథి తరాతరము మనకు
గంగ అనంగ నీరు కలదు జగితిలోను
గంగలో మునిగితేను కలుగు పుణ్యంబు
నీరులేక జీవనము నిలువ దెవ్వరికి
నీరూపకారము నీరు తరముగా
యినుమా గంగను చేపట్టి యీశ్వరుడు
వుప్పొంగె
శక్తి చాయంగ ఈశ్వరునికి
శంకు చక్రము గలిగె
శక్తి చాయంగ బ్రెంహ్మకు స్తానంబు
గలిగె
శక్తి చాయంగ విష్ణు శేషువు మీద
ప్రవశించె
శక్తి చాయంగ అరిచంద్రుడుకు
చంద్రమతి గలిగెను
సాంబ్రాజ్యం గలిగె సంతోషపడెను
శక్తి చేయంగ మాంధాతరాజు
సతియును సుతులు
కలిసి వుండిరివారు కడువేట్కతోను
శక్తి చాయంగ కృష్ణుడు చరణము
యేటుబడి
కటికి జగన్నాధుడై తటుకున
వెలిసె
కటకట అనుగా గంద్రగొడ్డట నరికిన
కొట్టినా తల వొచ్చి గొబ్బున అతికె
యిచ్చెన సంపదలు యిచ్చేను గంగ
అక్షయముగ గొలుతాము ఆవుల
మందలో"

## కాటమరాజు గంగకు కొలుపులు చేసి మొక్కుట

కాటమరాజు పద్మనాయుడు
కడువేట్కతోను
తిరుమందుల వారిని తీవరముగా
బిలిచి
ఆరిటి స్తంభాలు పందిరి ఆదిలక్ష్మికిని
పచ్చని పందిళ్ళు పెట్టిరి పొలేటి
వొద్దున
తమలపాకులు తోరణాలు తగ
వేట్కతోను
పాలవెల్లి గట్టిరి ప్రఖ్యాతిగాను
నూలి స్తంభాలు ఆరిటి మాకులు
దెప్పించి
మగువుకు తరువాత మాలి గట్టించెను
మల్లెలు మొల్లలు మంచి కురువేళ్ళు

కస్తూరి వీర గంధము కనుక
బండారు
సకల పదార్థములు సమర్పించి
రపుడు
బద్దిగొర్ల మంచి బాగనైన తగుళ్ళు
పొరిగొర్లను గావు పోతును దెప్పించి
గంగను గొలచెను కాటమరాజు
జాము జామున బోయించె జాము
భోజనాలు
బొల్లేవు బస్వన్నను పొసగ రప్పించి
తెల్లవారిన దాక గంగమ గొలిచెను
వల్లవులు తిరుమందులు వైన వైనాన
పద్మనాయుడు రాజు ప్రఖ్యాతిగాను
గంగను వేడిరి కరములు మొగిసి
"సక్కదనము తల్లి! జాగారవెల్లి!
అరియు రాజులకు తల్లి! అనుచు శోభిల్లి
సొంపు యింపుల ప్రేమ! జోడు
చందమామ
కన్న పుత్రుడు రా పె. కరకంటులభామ!
శాప విమోచన భాగీరథమ్మ!
శాప విమోచన గాంధారివమ్మ!
యేపున నీరూపు యెరగని వార్ని
కాపాడుదువమ్మ రక్షింతువమ్మ
ధరలోను పెద్దిరాజు దండెత్తిపోయి
వురవడి యెదురొమ్మున పోట్లను నాటి
జంగ ప్రతాపుని చంపి సరివీరకల్లున
వొరిగిన పెద్దిరాజున సరుగున
మాట్లాడించిన గంగవు నీవు
ఆవులకు యెద్దులకు అరిసి వేగంబె
(పూరెల్ల) యిప్పించి పూనిక చేసి
పల్లవాది రాజుల పగలు వీడేర్చు!
తల్లివి నీవు" అని దండంబు
పెట్టిరి ॥౨౬॥

## గంగ కాటమరాజును అనుగ్రహించుట

సాటి గాబట్టి గంగ సంతోషపడెను
మట్టి పెయ్య వచ్చెను మందలో
గలిసె
కలకల నవ్వుచు గంగ తా బలికె:
"పల్లవాది రాజుల పగలు మరిపింతు
నీల్లను పుట్టిన పూరెల్ల నేరంబుచేసి
పుల్లరికి యిప్పింతు భూపాలకుండ!
కపులావుల రక్షింతు కాటమరాజ!
పోలురాజు పగలు పోకుండ నిలిపి
వారికి మీకును వైరంబు చేసి
వీరకల్లుగా సంపింతు నేను
ఏనుగలు గుఱ్ఱాలు యెద్దులావులను
శానాపశాకలు సంపింతు నేను

అంభోయని యెద్దుల అలుగులు చెల్లును పంచలింగాల కొండ చుట్టు''
ఆరగించు అని చెప్పి ఆ శక్తి
కుంభిణిమీద కూలేది నిజము అదృశ్యమాయె ॥౨౩॥
అంచితంబుగ కోట్లు ఆవులు యెద్దులు

శ్రీరాములు. ప్రమాదీచ నామ సంవత్సరములో కార్తీక శుద్ధ సప్తమి బుధవారము నాటికి గుజ్జర్లపూడి కోటయ్య కొమారుడు పెంటయ్య వ్రాసిన ప్రతి. యర్రయ్య తరకవాదము. తప్పులు వొప్పులుగా దిద్దుడి వో బుద్ధిజనులారా!

-:)o(:-

# అలుగులు పోలు

## అవతారిక

శ్రీ పార్వతీనాథు చిత్తమున దలచి
గోపాల కృష్ణుని కోరి నుతియించి
బ్రహ్మదేవుని దలచి భాగీరథికి
మ్రొక్కి
సింహయానపట్టి చేరి గణపతిని
అష్టాది వరణాల అయ్యల కొనియాడి
ఆదిమా కవులకు అస్త్రము లెత్తి
మ్రొక్కి
పృథివిలో ముమ్మయ్య పోచయ్య
యిద్దరు

ధనముకొండలోపల తగ వేట్కతోను
పనిపడి కంఠసరి బాలలిద్దరూను
బొంగరాలాడిన పూనికె వినుడి
సంగతి చెప్పెద
శ్రవణానందముగాను
యింపుగా సభవారు యిందరు మీరు
కంపింప యీ కథ ఘనులార
వినుడి

## ముమ్మయ్య పోచయ్య వేడుక బొంగరాలాడుట

ముమ్మయ్య పోచయ్య
ముద్దుబాలలిద్దరూను
అమ్మనగరు బొంగరాలు
అందుకొని వేగ
కనకసరి పచ్చల కంఠసరి బాలలు
అనుదినము బొంగరాలు
ఆడుచునుండ
పద్నాల్గుయేండ్లు పరియంతరము
దనుక
ఆరుద్రైన బొంగరాలు ఆడుచునుండిరి

చిత్రభాను సంవత్సర శివరాత్రి
మాసమందు
శాస్త్రమంతులై నట్టి చిన్నబాలలూను
దేవేంద్ర వైభోగ ధీరులై నంత
దేవతా బొంకరాలు దినదినమువారు
సంతోష చిత్తులై తమరాడసాగిరి
అంత్యకాలము వార్కి అయ్యేటి
తుదకు
వేడుకలకు తమరాడిరి వెండిమ్ములికి
బొంగరాలు

ఆడిచాలించి అవిముద్దరించి
బచ్చన బొంగరాలు పదిలెము
సేయించిరి.

## ముమ్మయ్య పోచయ్యలు దేవతా బొంగరాలిమ్మని సిరిదేవి కొమరక్కలను కోరుట

పోచయ్య ముమ్మయ్య పొంకంబు
మెరసి
'పెద్దలనాటి బొంగరాలు
పెట్టెనున్నావి
యిద్దరము పలుకరించక
కాని యియ్యదు తల్లి'
అని యిట్లు తలపోసి
అమ్మనగరుకు వచ్చి
క్షణములోపల వచ్చి తల్లి సముఖాన
నిలచి
కామితఫలదులై కరములు మొగచి:
''పద్మలోచనలార! పద్మినులార!
విద్వాంసులైనట్టి వో వెలదులార!
యిన్నాళ్ల దనుకను వేడుక
బొంగరాలు
పదిలముగ దాచినారు బంగారు
బొంగరాలు
ముదమొప్ప ఆవి మాకు ముదల
బెట్టించు
సిరిలక్ష్మి పార్వతి సరివచ్చు మీరు
హేమంపు బొంగరాలు
[illegible]
మారు మాటాడక మంచి వాక్యమున
తీరైన బొంగరాలు దీవించి
యియ్యండి"

## అశుభములను తెచ్చేడి దేవతా బొంగరాలు ఆడవలదని సిరిదేవి కొమరక్కలు బాలురకు హితవు చెప్పుట

బాలల మాటలకు పణతు లిట్లనిరి:
''వాలాయముగ బాలలార! వచ్చి
మీరిపుడు
దేవతా బొంగరాలు తెమ్మంటి
రిపుడు
అవి మీకు వద్దురోయి అన్నలార!
వినుడి
అర్గురు చక్రవర్తులు పదహార్గురు
రాజులు
వైరము చాతను వర్థిల్లరైరి

అంతలోనేవారు అనుమానముచేత
కంఠసమున కొందరు కలహమున
కొందరు
అనుకోంగ భువిలోన అది
విందుము మేము
జయముగాని బొంగరాలు
క్షేమాస నుండ
పాయక ఆడిన ఫలమేమి మీకు
యప్పటివలె యిద్దరు యేర్పాటుగాను
తప్పులు ఒప్పులు తరువాత లేక
నేను చేయించిన బచ్చన బొంగరాలు
బోడికలార! మీరు బొంగరాల
బయట
ఆడుడి అన్నలార! అందముగ మీరు
దేవతా బొంగరాలు తెమ్మన వచ్చునా?
రామలక్ష్మణులు రమణతో నాడి
సీమెల్ల యెరుగంగ సీతను
గోల్పోయిరి

బలభద్ర కృష్ణులు యెరుగంగ నాడి
జలధిలో ద్వారక సమయదే నాడు?
నాటినుండి బొంగరాలు
నేటి దనుకాను
తరాతరము బొంగరాలు తలువ నే
వెరతు''
సిరిదేవి కొమరక్క చెప్పి మాటలకు
పరుసతో బాలలకు వజ్రాలు నాటి
వీపున మొనలు వెళ్ళినట్లాయ
''సంపదల కాశించి శరీరములు
దాచుక
బ్రతికేటి వారికి భయమదే తల్లి
చేరి కాలము దగ్గరకు వచ్చె
సంవత్సర ఫలము
బొంగరా లిచ్చి మము పంపవే తల్లి!''

## అగుమంచి దేవతా బొంగరాలు తెచ్చి బాలుర కిచ్చుట

కంఠసరి బాళ్ళల కదలికె జూచి
"నేడైన బొంగరాలు నేనియ్య
వెరతు
అగుమంచి యిస్తేను అన్నిటికి
లెస్స''
జాల పల్లకిలోన జననాథు చెల్లెలు
శేషుని బోలిన జలపోత బొంగరాలు

అతివేగమున దీవించి అగుమంచి
యిచ్చె
''ప్రతి వాదించక బాలలార,
పట్టుక మీరు
వోడుగెల్పులేక వుర్విపై మీరు
ఆడుడు బొంగరాలు అన్నలార!
మీరు''

హెచ్చుగా ముమ్మయ్య యులమి
పోచయ్య
అందిరి బొంగరాలు అగుమంచి
చాత
కందువతో లింగముద్ర కలిగిన
బొంగరాలు
ముమ్మయ్య అందుకొని మ్రొక్కెను
వేగ

విష్ణుముద్ర బొంగరాలు
వీరశూరుండు
వచ్చుందుల పోచయ్య పరగ తానందె
అంపించిన బాలలు అమ్మ నగురు
వెడలి
మద్దికాయల మేడవద్ద కమరి
వేగ వచ్చిరి

## బాలురు సంగడీలతో కలసి పందెముల చవికెకు వెళ్ళుట

పట్టైన మేషాలకు పల్లాలు వైచి
పట్టు వాగెలు బట్టుక బాలలకు
దెచ్చిరి
యేడికల నెక్కిరి యిద్దరు సంగడీలు
అందలాలు యెక్కిరి అతివేగమున
కదలిరి
కొందరు సంగడీలు గుర్రాల నెక్కిరి
సూర్య సోమవీథుల శూరులై బాలలు
పేరాల ద్రొక్కించు బిరుదు
మేషముల
తప్పెట్లు పిల్లగోవులు ధారలు
భూరగలు
వుపాంగముల చాత వూరు వెళ్ళిరాగ
పట్నము కాంతలు భ్రాంతిపడి చూడ
విష్ణుండు పోచయ్య ఈశ్వరుడు
ముమ్మయ్య
బాలలు బొంగరాల బయటికి వచ్చి

వాలాయముగ బాలలు వచ్చేటి
విధము
ముప్పై కురశాలలు ముమ్మయను
కొలిచి రాగాను
అప్పుడు ముప్పైయిద్దరు అల్లుని
కొలిచి రాగాను
ముద మొప్ప యేడికలతో
ముస్తీదులైరి
చుట్టుకొమ్ములకు సూర్యపురము
వాగెలును
పట్టు కుచ్చుల జూలు పల్లాలు మీర
ముత్యాల కుచ్చులు ముఖపడిగె
వాగెలు
పుత్తళి గొలుసులు పూలతరులట్లు
డాకాల పెండెంబు జల్లుల ముస్తీదు
భీకరాకారమై బిరుదు మేషములు
శేషువుం పేకిటి చిల్లకొండి యేశిక

హెచ్చుగా ముమ్మయ్య యెక్కెను
వేగ
పచ్చలందుల పోచయ్య పల్లకొండి
యేడిక
మచ్చికతో యెక్కెను మరివేగ
కదిలె
ముత్తాల గొడుగు నీడన ముమ్మయ్య
కదిలె
చిత్తజుడు పోచయ్య శంఖు
చక్రముల నీడన
పచ్చ గొడుగుల నీడన బాగొప్ప
గదిలె
గచ్చుటరిగెల వారు కమ్ముకొని రాగ
బంగారు బొంగరాలు పట్టించుకోని
సంగడీలు తాము చయ్యన కదిలె
బొడ్డు గంటలు పేరెములు
బారుచును
యేడికలు బోడికల హెచ్చరికతోను
వడి వడి బాలలు వచ్చిరి కదలి
తెట్టె రావుల బయట దేవునిగుళ్ళ
వద్ద

పుట్టమెగసి బాలలు పొట్టేళ్ళ దిగిరి
వాసెలు కురుసాలెలు
వారందుకొనిరి
శేషువు బోలిన మేషముల దెచ్చి
మరివేగ సిరిపొన్న మాకులకు
గట్టిరి
యిరుగడ సంగడీలు యెక్కిన
అందలాలు
అన్నరావుల బయట అందరాలు
దిగెను
ధన్యులకు బట్టిన జగజంపు
గొడుగులు
కొండ రావులకును గొడుగులు
శేర్చిరి
పండిన పనసల పల్లకీలు చేర్చిరి
పంద్యాల చవికెలో బాలలు
సంగడీలు
అందరు కొల్వుదీరి అతివేట్క
నుండిరి

## బొంగరాలాట ప్రారంభము

కొలువున్న బాలలు గొబ్బున లేచి
కాశల బిగువార కట్టిరి వేగ
వాసిగా బొంగరాలు వారందుకొనిరి
కుశలవులు ఆడినారు కొంతకాలంబు
బలభద్ర కృష్ణుండు పరగంగ నాడి

దుర్వాసు శాపాన డుల్లిరి
యాదవులు
పేరులు కలియుగమున పెంపొంద
వలెను
బ్రహ్మ త్రిమూర్తులు పరగ బుట్టించి

అంభోధి బలమున అంబరీషుడు
గొల్ల
కుంభిణిమీద రాలెల్ల గోవుత్తై పుట్టి
అంభోజు వంశాన ఆయ పరీక్షిత్తు
పరీక్షిత్తు వంశాన బలువైన
బొంగరాలు

తరాతరము నాటినుండి దాచిన
బొంగరాలు
దాచిన బొంగరాలు ధాత్రిపై నిల్పి
పోచయ్య ముమ్మయ్య
బొంగరాలందిరి

## సంగడీలను ఉద్దీలుగా సమకూర్చుట

సంగడీలను బిలిచిరి చయ్యన వారు
''జెట్టిబోయిన మల్లు! జడదార వెంకటి
పట్టి మీరిద్దరు వుద్దిగా వుండండి
ముత్తబోయిన పాపన్న!
బత్తుల గోపన్న!

అత్తుకొని మీరిద్దరు ఆడండి వుద్ది"
అనిన సంగడీలు అంగిరి
బొంగరాలు
వనముల సీదల వ్రాసిరి గెర్రలు

## పురస్త్రీలు బొంగరాలాటను వేడుకతో చూచుట

భామలు సీళ్ల మోతురు
భావులు మూడు
అగుమంచి కట్టించిన అగ్గుణాల భావి
ముమ్మయ్య కట్టించిన ముత్యాలభావి
నిమ్మలు మావిళ్లు నేరేళ్లు చుట్టు
సిరిదేవి కట్టించిన చెంగల్వ భావి
అరువేళల భావికి అయ దక్షణాన
కల్లాల కాంతలు గంగరావుల బయట
ముత్తాల జాజులు మల్లెల వనములు
గురుతైన శంభుని గుళ్ళ దాపునను
వుద్దీలు వకరొకరు పసరంగ బట్టిరి
అరుదైన బొంగరాలు ఆడంగ సాగిరి

బాలలాటలు చూడ ప్రజలు వచ్చేరు
పాలకాపిళ్ళవారు భారులు గట్టుక
చేలగంపలవాళ్లు చేరి చూడంగ
తిరుపతి పసుష పతె తీరుగా వచ్చు
సిరిబాల ముమ్మన్నను చేరి చూచేరు
కాంతలు మగువలు గంధర్వ స్త్రీలు
భోరున చూచేరు పోచయ్య నపుడు
ముంచుకొని సభవారు ముమ్మయ్యను
చూడ
పొంచుకొని సభవారు పోచయ్యను
చూడ

సంగడీలు బొంగరాలు సభవారు చూచేరు
పుచ్చుకొని బొంగరాలు పోచయ్య ముమ్మయ్య
డాచాత బొంగరము వలచాత జాలె
పుచ్చుకొని బొంగరాలు భూమింప సాగిరి
పదివేలకు తీరించి పాలమాని బొంగరము
పాలమాని బొంగరానికి పగిడిది ములికి
యేనూటికి తీరింది యేగెమాని బొంగరము
యేగెమాని బొంగరానికి యెండిది ములికి
పట్టుతాళ్లు దాపిని బలువైన బొంగరాలు
చుట్టిరి జాలెలు చోద్యంబుగాను
వేడుకతో బొంగరాలు వకవిడుత నాడిరి.

## పందెము కట్టుమని పోచయ్య ముమ్మయ్యను సవాలు చేయుట

ఆడి ఛాలించియు అపుడు పోచయ్య
వల్లవుల ముమ్మయ్య వంక పారజూచి
"కల్లరిపులకు వైరి! కంఠసరి ముత్యమా!
అలర యీడుజోడు మాయమ్మ సైదోడు
నామీద ప్రేమగల నా మేనమామ!
విన్నపము చేసేను వినవోయి మామః
యిన్నాళ్ళు దనుకను వేడుక భొంగరాళ్లు
ఆడితిమి యింతవరకు అవునని మెచ్చంగ
వోడు గెల్పులు లేక వుల్లాసముననను
వాద ప్రతివాదంబు వచ్చును మనకు
అందుకొని బొంగరాలు ఆడవలె మనము
వాటు పందెము కానవచ్చు మనకిపుడు
వాటు పందెము మామః వప్పుమని పలికె

## పందెము వలదని ముమ్మయ్య పోచయ్యకు హితవు చెప్పుట

పోచయ్య మాటలకు పోలురాజు
సుతుడు
"రచ్చరావుల చిలుక! రఘువంశ
తిలక!
కొమనాల సింహమ! గుణవంశ
తిలక!
పోరు రిపులకువైరి! పోచయ్య!
వినుమ
వనరంగ వాటు పందెము
వప్పుమంటివి నీవు
వనర యిద్దరి సందు వాడు[1]గెల్పు
అయితేను
నీవు వోడతేను నేరంబు తనది
తాను వోడితేను తలవంపు తనది
దేవతలు ఆడితొల్లి దేశములు
విడచిరి
కవురవులు పాండవులు ఆడి
కాపురాలు విడచిరి

తాతలు ఆడిరి ధనములు వోడి
బలరామ కృష్ణుండు పరగంగ నాడి
జలములో ద్వారక సమయదే నాడు?
రాముడు [2] మలిసెట్టి రమణతో నాడి
జమదగ్ని గోల్పోయెను చీకటి
కోనలోను
రామ లక్ష్మణులు రమణతో నాడి
సీమెల్ల యెరుగంగ సీతను
గోల్పోయి
కుశలవులు తమరాడి ఘోరాజిలోను
యసగంగ తండ్రి మీద
యెదిరించినారు
వోడుగెలుపు లేక వూరికే మనము
ఆడుదాము టెంగరాలు అల్లుడు!
పోచయ్య!"

## పందెము ఒడ్డుమని పోచయ్య ముమ్మయ్యను బలవంతము చేయుట

కందువతో ముమ్మయ్య కలకల
నవ్వెను:
"యంత చెప్పినగాని యెరుగవు
నీవు

1. ఓడు 2. పరశురాముడు

పందెము కావలెనని పలికేవు సారెకు
యేపందెమడిగినా యిస్తును నీకు
ధీమంతుడః కోపంబు తెచ్చుకోవద్దు''
మామ ఆడుమాటలకు మరి
చిన్నిపోచయ్య
''యేమంటివి వో మామః యెంత
మాట్లాడితివి!
పోరు వచ్చిన వెనక తల్లి పుట్టిల్లు
పేరు చెప్పకుంటేను బిరుదు
దక్కెనః
వెనుకతియ్య నేటికి వినవె
వో మామ!
కనకము వక పందెము
కవులావులు వకపందెము
మెడనున్న సొమ్ములకు మేటి
పందెంబు''

అడుగు దర్లక వప్పుమనె అల్లుడు
పోచయ్య'
అల్లుడు మాటలకు అప్పుడు
ముమ్మయ్య
"తక్కిన వాడైతె తర్కించగలడుః
వక్కపందెమునకు వంటి చేస్తివి
నీవు
రెండో పందెము లేదనరాదు
మూడో పందెమునకు మొనసి
యాడితేను
కళగుల్కు నక్షత్రాల కంతమాలకు
సాటి
కొయ్యపూసకు సరి కోరితివి నీవు''

# ముమ్మయ్య తన పచ్చల కంతమాల విలువను చెప్పుట

అప్పుడు ముమ్మయ్య అల్లునివంక
జూచి
క్రమమున కోపంబు కన్నుల
కురియంగ
ఘరీన యీాటెలు గాడినట్లాయ
ధరణి మిన్ను రెండు
తారసిల్లినట్లాయ
ఖళఖళా యని పల్కి బాలుడు
ముమ్మన్న

''కళగుల్కు వయ్యాన యిట్లాడ
వాకెట్లు తోచెః
చుక్కలు దాపిన సొంపైన మణికి
కొయ్యపూసలకు సరిశాయ
కోరితివినీవు
వయ్యాన నిట్లాడ వాకెట్లు తోచెః
వోక్షము లేనట్టి వనమాలపేరు
చుక్కలు దాపిన సొంపైన మణికి

చెక్కపూసలకు సరిశాయ చెల్లునా
నీకు?
రావణబ్రహ్మను రణములో బట్టి
కావరం బణచిన ఘన కంఠసరియు
కుంభకర్ణాదుల కూలంగ వైచి
గంభీరమైనట్టి ఘన కంఠసరియు
తాటకి మర్దించి ధనువులు విరచిన
కటిక జగన్నాథుని ఘన కంఠసరియు
ధనకోటి స్నానంబు తగనాడి తెచ్చి
ఘనమైన రత్నాల కంఠమాలికెయు
వడ్రంగి చేసిన వనమాల పేరు
దొడ్డశాయ నీకెట్లు తోచె పోచయ్య
అయితన్న యేలు ధనముకొండ
అంగళ్ళ వెంబడి
అమ్ముదురు కాసుకొకటి ఆ తులసి
పేర్లు
కుబేరు చింతకొండవాగుల వెంబడి
సైకాలుగా బెరిగి శానలు గలవు
కూలికాండ్రను దెచ్చి కోసి రంపాల
వెలచేసి అమ్ముదురు రాగి కాసులకు
వాసి కెక్కిన యట్టి పడ్రజాలపేరు
దాసరి పూసలకు సరిశాయ ధర్మమా
నీకు?
ఆచరణకు రాని మాట ఆడంగ నేల?
పోచయ్య చాలును బొంగరము
వేయుము''

## పోచయ్య తన తులసి వనమాల మహిమను పొగడుట

తమ మామ ముమ్మన్న
దట్టించినందులకు
షమర నిశ్శంఖుండు సరగ
నిట్లనియె:
''తోచని మాటలాడేవు దొరవంట
నీవు
యాచకులు బెట్టుదురు ఘటువంటి
సొమ్ములు
లెఖ తేలిన సొమ్ము నీవు పెట్టినావు
మేనమామవుకాక మించి షకమాట
ఆడితివిగాక నిన్నవుననరాదు
సాక్షాత్తు దేవుండు సకల జీవులకు
వక్షముళి లేని యీ వనమాల పేరు
ముగ్గురు త్రిమూర్తులకు మోక్షమైనట్టి
జగమెల్ల రక్షించు జయము
వనమాల
పుట్టింప రక్షింప పొదవణగింప
యిటువంటి సొమ్ములకు యీడు
లేదనెను.
యేనూరుకోట్ల భూమండల మెల్ల
యెనభై నాలుగు లక్షల జీవరాసుల
నెల్ల
కాపాడు వనమూల కడలేని యట్టి
కోపము శాంతము గుణము వనమాల

3. వోటను

వనమాల కొంచమని వున్నదే మామ
కానక ఆడుకొంటివి ఘనుడ
ముమ్మన్న
నీ కంఠమాల యేమి నిక్షేపము
చేసీని?
పాషాణమైయ్యెందు బాల ముమ్మన్న
వో మామ ముమ్మన్న! వొకవార్త
వినుమ
సామెత చెప్పేను జనులెల్ల యెరుగ
తాతలు యేడు తరాలవారు
అమర మీ అయ్యలు అయిదుగురు
చెల్లిరి
వారికి మోక్షము వనమాలపేరు
యిరువంశముల వారికి
[illegible]హాపరముల త్రోవలు
అలనాడు మీ తండ్రి ఆవుల
పోలురాజు
జంగాల కొరకునై సమరము చేసి
శక్తులందరని పంపె పర్వతాము

చిత్తవృత్తుగ పోట్లెడి చిలకమర్రికాడ
అత్తుకొని పగతుల హతముగా చంపి
మూక్కంటి బాణము
వక్షస్థలంబు నాటి
చెరుకూరికాడ చెల్లె మీ తండ్రి
పొంకముగ తొలసి తీర్థము పోసె
మా తండ్రి
అంచితముగ కయిలాసమునకు
అంపె పల్లికొండ
నాడు మోక్షము యిచ్చు వనమాల
పేరు
కానక మాటలాడితివి గర్వంబుచేత
యికనొకటి వో మామ!
యర్రగడ్డపాటి
[illegible]లరాజు లంచదు పయనమైపోయి
సద్దులజులమీద శాసల మీద
యుద్ధంబు చేసి యిల మీద వరిగిరి
వేగంబె జాలెచుట్టి వేయుము
బొంగరము"

## బాలురు పందెపు బొంగరము లాడుట

పోచయ్య మాటలకు సరిపోను
ముత్యమయ్య
'అక్కకొడుకువు గాక ఆడితివి నీవు'
పచ్చల కంఠసరి పరగ వనమాల
సరిపందెములు చేసి జాలెలు చుట్టి
అందుకొని బొంగరాలు
ఆడంగసాగిరి

మునుపుగా చిన్న వొడ్డి ముమ్మన్న
వైచె
ఆటు వెనుక కుప్పించి వైచె
పోచయ్య
వోడు గెలుపులు లేక వక
విడుత నాడిరి
పడివడి నాడంగ వచ్చె కోపంబు

చెమటలు వుర్విపై దిగజారగాను    ఆడిరి బొంగరాలు అతి వేగముననూ.

## ముత్యాల మలిసెట్టి ముద్దుకోడలు బొంగరాలాట చూడ వచ్చుట

అగుమంచి కట్టించిన అగ్గునాల బావి    పున్నమ చంద్రుని బోలిన కాంతలు
వచ్చిరి ధనకొండనుంచి వనిత శేనూటికి    ముత్యాల మలిసెట్టి ముద్దుకోడలు తాను
కలువ రేకులవంటి కన్నుల కాటికె    చూచె బాలల ఆటల చోద్యంబుగాను
బన్నసరములు కీల్లు పతకములు మెడనూళ్లు

## ముమ్మయ్య వైచిన బొంగరము కోమటి బాచమ్మ కాలిలో దిగబడుట

తముకాన ముమ్మన్న తాలుబ్బై జాలె    చేటుకు బొంగరము చేడెకాలు నాటె
యగసి ఘోరన యార్చి యిట్టట్టు జూచి    కత్తి వలె బొంగరము గాడిన యప్పుడె
తగిలి దక్షుని గొట్టు వీరభద్రుని రీతి    నెత్తినున్న నీళ్లకడవ నెలత బట్టలేక
బొంగరము రివ్వున బోవైచె ముమ్మయ్య    భుజమున బట్టలేక భూమ్మీద వైచె
    ధరణిపై యాకాంత తా మూర్ఛబోయె
చేతులో వైచి చేరు తెగివచ్చి    ఆ కాంత మూర్ఛిల్ల అందరు జూచిరి
మబ్బు పొదుగున యగసి మాయమై బొంగరము    కోకలు గప్పిరి కూడి యిరుగడల

## ముమ్మయ్య బాచమ్మకు ఉపచారములు చేయుట

కనులెత్తి ముమ్మయ్య కాంతను జూచి    పెరికి బొంగరము తియ్య పిరికి వారంచు

కమ్మరిని పిలిపించి పటకార
తెప్పించి
గట్టిగా తియ్యించిరి కమ్మరిచేత
యదలేక రక్తము యేరులై పారె
పుక్కిట తాంబూలము భూమిమీద
వైచె

పట్టు చీరెలు దెప్పించి పట్టెలుగ
జేసి
గట్టిగా గాయమునకు కట్టిరి వేగ
కర్పూర పలుకులు తెప్పించి
కర్ణముల పూదించె
దేహమెల్ల చెమట బుట్టె తెప్పిల్లిచూచి

## బాచమ్మ ముమ్మయ్యను దూరుట

చిన్ని ముమ్మయ వంక శిరసెత్తి
చూచి
కను లెత్తి చూచియు
కాంత యిట్లనియె:
“అయ్యయో? ముమ్మన్న!
హత్య గట్టు కుంటివి
కట్టు కుంటిరి బాలలార! కడు
క్రొవ్వి మీరు
వయ్యన జనులెల్ల వోర్వలేని
మాటలు
ఆడికెలకు లోనైతివి అన్న
ముమ్మన్న
చేటుకు పుట్టిల్లు చేరనిచ్చేర?
నేరము తనవల్ల నిందమోపేరు
కూరిమి పెదసెట్టి కూతుర తాను
కోటికి పడగెత్తిన వారి కోడలిని
నేను
తన సాటివారిలో తలవంపు లాయె
చేస్తిరి బాలలార చల్లంబు మీరు
వస్తిరి తనసాటి వారెల్ల రాగ

వర్తకుల వంశాన వంచనలేని వార
కాలికి చేటుదెస్తిరి ఘనపుణ్యులార
అపకీర్తి దెస్తిరి అన్నలార మీరు
చేపట్టరు అత్తగారు జనులు
నోరు మూయ్యరు
మూకుడు గప్పేర ముమ్మన్న
వినుము
చేకొని పుట్టిల్లు చేరనిచ్చేర
మూడు ప్రాణాలు వలగొంటివి
ముమ్మన్న వినుమ
బల్మి గల్గితే బ్రదుకవలెగాక
హెచ్చుగా అన్నలకు వచ్చిన త్రోవ
మీయన్నలకు వచ్చిన త్రోవ
మీ కెన్నటికి వచ్చుని?
కయ్యానకు మీరు కదలి పోగాను
తన కన్నులార కాన్నెన్నడు జూతు
తన పుసురు మీకు తగలక
మానదు”
అతివెమాటలు బాలలకు అలుగులై
నాటె

సిరి బాల ముమ్మన్నకు
చిన్నపోచయ్యకు
గురిచేసి బాణాలు గుమ్మినట్లాయ
వల్లవుల ముమ్మన్నకు వజ్రాలు నాటె
బల్లాలు యెదురొమ్ము పరిపినట్లాయ
కల్లందుల పోచయ్యను కత్తులు నాటె
కల్లిలో పగవారు కమ్మినట్లాయ
పీటెలు యెదురొమ్మున వేసినట్లాయ
షరీస అమ్ములు గాడినట్లాయ
పూని కటార్లతో పొడిచినట్లాయ
"ముమ్మయ్య యెదురొమ్మున
ముప్పిళ్ళు నాటి
కమ్ముకొని రక్తము కారెనని విందు
చేకొని కండలు చెదిరి ముమ్మన్న
పొన్నకాయంటి శిరస్సు పొడిచెనని
విందున"

## ముమ్మయ్య తన అన్నల వార్తలు చెప్పుమని బాచమ్మను కోరుట

ఆ కాంత అడలుచు ఆడుమాటలకు
దయయుంచి ముమ్మయ్య తరుణితో
బలికె
బాల కోమటివారి పడతిని జూచి
"చాల చక్కని యింతి! జాజి
పూబంతి
సకియ మెరుగులబంతి! జాజి
పూబంతి
మక్కువపు బొమ్మ మగువ
పుత్తడిబొమ్మ
యలమి జనులుమెచ్చ యలనాగ
బాచమ్మ
ఆలివేణి యరబప్పు అగుమంచి
మారు
యలనాగ మూడు ప్రాణాలు
యట్ల వలగొంటిని?
నలనాక్షి చెప్పవే? నా తోడు సీడ?
యిప్పుడాడిన మాటలు యేర్పాటు
గాను
చెప్పుము బాచమ్మ మా చెల్లెళ్ళమారు
మొనసి కోమటి బుద్ధికి మోసంబు
లేదు
కనకాంబరంబులు కట్నాలు
సొమ్ములు
ధనకొండ లోపల తోడబుట్టువు నీవు
సారె చీరలు నడిపేము సైదోడ నీకు
నేరము లేకుండ నిందలేకుండ
పోడిమిగ పుట్టింటికి పోయి విడిచేము
సంతోషమున మేము సారెలు
నడిపేము
నీవాడిన మాటలు నవ్వులు గావు
బొంగరాలాడ బట్టి పుట్టు పూర్వాలు
ముందర వచ్చేటి మోసంబు
తెలియక

ఆదితివి యీావరకు ఆడినమాటలు ఆ వార్త సీకేటికి ఆనతీయవమ్మ
కొమరక్క సిరిదేవి కొలువులోకి పోయి దాచక చెప్పుము సయిదోడు నీవు"

## అన్నల వార్తలు సిరిదేవికి తెలియునని బాచమ్మ చెప్పుట

బాలల మాటలకు పణతి యిట్లనియె మీ యన్నలు బోయిన మేలువార్త
"కలకాలము ధనముకొండ కడు వేడ్కతోను మీ అమ్మ సిరిదేవిని నేనెరుగ
యేలిన వార్తలు యెరుగుదు గాని మీరడుగబోండి
ముప్పైమూడు నేల కోటలు మూడు గడిదుర్గాలు అమరంగ చెప్పేని అన్నలార మీకు పయిడివారి తల్లియ్యాను పరగంగ
యిప్పుడు యేలుచున యెరుగుదు గాని ఆడుగుడి పయినాన మీ అన్నల వార్త చెప్పేని
కంతసారి బాలలార కడమవార్త నేనెరుగ కోపము మాటలు గురి కాయరాదు అపద మాటలు అవి నిజముగావు
మువ్మన్న బొంగరము మురికి నాటినందులకు పగవారి మాటలు పాటింప దగదు పోరోయి మువ్మయ్య పోచయ్య
దిమ్ముటబట్టి మిమ్ము తిట్టితిగాక మీరు
చేటుకు బొంగరము మురికి నాటినందులకు పోరాదు నొవ్వుచే పురిలోకి తాను యేరీతి పోవలె యిప్పుడు నేను
ధీరులార మిమ్ము తిట్టితిగాక వొప్పగించరోయి వో బాలలార"

## బాలురు బాచమ్మను ఆమె అత్తవారింట దించుట

కెంపులు దాపిన కనకదండ పాలకి ఆసబెస్తలచాత అతివేగ బట్టించుకోని
జెట్టిబోయిన మల్లు కలవడిగినారు
అందళము దెప్పించి అతివెను కూర్చుండబెట్టి సురటీలు యిసురుచు శూరులై బాలలు

దరవాజులు జొచ్చి ధనము
కొండలోకి
పెద్దలైన కోమటి పెద్దల బిలచి
వద్దికెతో బాలలు వప్పుమని పలికిరి
యిద్దరు తసిరీలు యిప్పించిరి
వేగ
"కద్దు వక నేరము కాయుడ మీరు
చేటుకు బొంగరము చేరు తెగివచ్చి
అతివెకాలు నాటె అనుమాన పడక
నేరము తనవల్ల నిందమోపేరు"
ప్రేమతో జప్పంగ పెద్దలిట్లనిరి
'అయ్యలార యింక ఆటలుమాని
వాతప్పు చేతప్పు వచ్చును వినుడి
అదియెంత పని గనుక వేంచేయ'
మనిరి
అత్తగారింటికి అతివెను వప్పజెప్పిరి

## సిరిదేవి కొలువు దీరుట

పట్టెళ్ళ చవికెలో పవళించె సిరిదేసి
పొలతి తా రత్నాల పోలు బోయించి
తెలివైన శీతావళి దిబ్బెము లెత్తించి
కొమర బండారము కుప్పబోయించి
కొమరక్క సిరిదేవి
కొల్వుదీర్చి యుండిరి
అగుమంచి మొదలైన అర్ధాంగ
లక్ష్మి
సకల యాదప స్త్రీలు సముఖాన
నుండిరి
భక్తుని నల్లమేడ పణతి వీరగంగ
అతివె చక్కని యింతి అయితన్న
పోత
వల్లవుల కోడండ్రు వరుసతో
నుండిరి.

## బాలురు అన్నల వార్తలు చెప్పుమని సిరిదేవిని నిర్బంధించుట

వెళ వెళా వచ్చి బాలలు పొట్టేండ్ల
దిగిరి
దరబారు జొచ్చి తల్లి సముఖాన
నిలిచిరి
సిరిదేవి కొమరక్కకు చెయ్యెత్తి
మొక్కిరి
కొమరక్క సిరిదేవి గొబ్బున
దీవించిరి
సమర సాహస సింహాసనము మీద
గొబ్బున బాలల కూర్చుండ మనిరి
నిబ్బరముగ బాలలు నిలచి యిట్లనిరి

''కొమరక్క వోయత్త!
కృప నందుల నూక!
సామజ గంధులార! శ్రీ కాంతలార!
భామిణి మణులార! వో పణతులార!
శ్రీలక్ష్మి పార్వతికి చెలువంద మీరు
పోలురాజు నిజరాణి పొలతి
నూకాంబ!
పాటించి బొంగరాలు పట్టి ఆడగాను
వేటుదప్పి బొంగరము
వెలదికాలు నాటెను
నాటిన కోపాన నాతి యిట్లనియె
మీ అన్నలకు వచ్చిన త్రోవ మీకు
యన్నటికి వచ్చీని
వో యమ్మ యిట్లనె వుల్లాసముగ
ఆడెను
ఆవార్తలు జప్పమంటె
అల్గి పోయెనమ్మ
నీవెంత లేదనక మేము ఆడిన
మాటలు
అన్నలు పోయిన వార్తలు
అనతియ్యవమ్మ
కన్నతల్లి నీవు కల్లలాడకమ్మ
కడువేగ జప్పవే కన్నతల్లివి నీవు"

## సిరిదేవి బాలురను మభ్యపెట్టు జూచుట

ముమ్మయ్య పోచయ్య ముచ్చెటలు
వినియు
అమ్మ సిరిదేవి అక్క కొమరక్క
"వివేక మెరుగని వెర్రి బాలలార
యివరెందు బోయిన యెరిగింప నేటికి
బాలలార యింతేసి పనులేటికి మీకు?
ఆ వార్తలు మీకేటికి అన్నలార
యిపుడు"
మాటలు మరిపించి మరి తల్లి బల్కె
''తెట్టిరావుల బయట శంభుని
గుళ్ళవద్ద
ఆడుచున్నారని అయిదువలు చెప్పిరి
తల్లి కన్నులజూడ తగ నోచనైతిని
యన్నదు బొంగరాలు నాయదుట
నాడరూను
కన్న కొమాళ్ళ ఆటలు కన్నుల
చూచేము
ఆడుడ బొంగరాలు అన్నలార
మీరు''

## బాలురు సిరిదేవిని నిలదీయుట

ఆ మాటలు సిరిదేవి ఆడినందులాకు
కంఠసరి బాలలు కలకల నవ్విరి
"యేమి మాటలాడేవు తల్లి
యరుగని దాని వలెను
అన్నల వార్తలు అడిగిన యప్పుడు
అన్నల వార్తలు అతివేగ జెప్పితే
నిముషమున బొంగరాలు నిలచి
ఆడుదూము
హరుషించి అన్నలు పట్నాన లేనిది
యరుగమటె తల్లి యాల
చెప్పెదావు

మరుగు జెప్పితివైన మాయయ్యా
ఆన
చిన్న వారమని చూచేవు తల్లి
సిరిదేవి
యేరీతి వుందుము యాల దాచెదావు?
ముమ్మయ్య పోచయ్య ముచ్చటలు
విన్నియు
...... ......... .............
...........................

(అసంపూర్ణము)

# ముమ్మయ్య-పోచయ్య బొంగరాలు

[ఈ తాళ పత్రప్రతిలో మొదటి పత్రము లేదు. 2 నుండి 7 పత్రముల వరకున్నది. 8వ పత్రమున కుడిభాగము కొంత విరిగి పోయినది ]

.......................................

## ముమ్మయ్య పోచయ్యలు గంగరావుల బయలులో బొంగరాలాడుటకు సిద్ధమగుట

... ... ... వల్లవుల ముమ్మయ్య
అలర యింద్రునకు జోడు
మాయమ్మ సైదోడు
నామీద దయ ప్రేమ నా మేనమామః
గంగరావుల బయట బంగరములు[1]
అరబోవలను[2]మనము
శృంగారపు వేడుకల[3]
తెప్పించుమనిన
రత్న[4]రావులబైట ఘడియారము
సాటించుమనెను
వచ్చిరి బాలరాజులు వసుధీశు కడకు
గాజుగోరలతోను గంధము కస్తూరి
తేజముతో బాలలకు తెచ్చి తా నలదిరి
పక్కెరబొడ్డు గెంటపై మెత్తజూలు

పల్లంబు అంసల బాగైన తరుటు
ముత్యాలు నీలాలు రత్నబంగారు
యిత్సగా సందుల యిమిడిన పల్లము
ముత్యాల ముకమరుగు ముద్దుల
కళ్యంబు
అరిటాకు మెత్తయు ఆంవాకు తరుటు
సూత్రాన కళ్యము సురవాగె తరుటు
జగబిరుదు అనువాడు
వుగ్రగాతకుడు
వుగ్రగాతకుండు వురువడినబోయి
బోడిక లిద్దరు వేడుకల దెచ్చిరి
వేడుకలవంక చూచి బాలలు
అనియేక సంతోషపడిరి

## దేవతా బొంగరాలు తెమ్మని బాలురు సిరిదేవి కడకు బోడికలను పంపుట

దేవుతులనాటి బంగరములు
తేవల ననిరి

"పెద్దలనాటి బంగరములు
పెట్టెలున్నావి

---

1. భొందరములు 2. వలెను 3. ఫడికలు 4. రచ్చ

అమ్మ కూటాలకు బోడికలు
అతివేగమున బోయి
సమ్మతిగా బంగరములు సతగున
అడిగి
తెగువతో బంగరములు తేవల
మనకు''
అనిన మాటలకు వారు అచ్చోట తర్లి
వుగ్రగాతకుండనువాడు
వురువడిన బోయి

సిరిదేవి కూటాలకు శీఘ్రమే పోయి
కరములు ముఖళించి ''కాంత వినుము
వినుము
తల్లి నీ పుత్రులు ధర్వీశాలకులు
అలనాడు తొల్లి దేవుతులు ఆడిన
బంగరములు
పక్షీంద్రుల పోచయ్య
బాల ముమ్మయ్య
పంఘమని పలికిరి పద్మాయతాక్షి''

## ప్రమాదకరమగు దేవతా బొంగరాల నిచ్చుటకు సిరిదేవి నిరాకరించుట

వెరగంది సిరిదేవి వెలవెలబోయి
నడుము నెక్కున విరిగి
నాతి యిట్లనియే:
... ... ... ... ... ... ...
... ... డిజిమ దుర్గిశ క్తికి
చేటైన పుట్టెను
రాముడు లక్ష్మణుడు రయమున నాడి
సీతను కోల్పోయిరి సీమెల్ల యెరుగు
బలరామ కృష్ణులు పరగ నాడగను
యసగ ద్వారకాపురి పట్నంబు
దగ్ధమై నీరులో మునిగి
పోగానె కృష్ణునకు ... ... .......
... ... ... ... ... .....
(ప్రద్యుమ్యుని కుమారుడు) పతగ
అని రుద్రుడు[5]

అనిరుద్రుడు కొమారుడు యసగ
వజ్రీడు[6]
వజ్రీడు పరీక్షిత్తు వంశ ......
........అవుతారము బాలించి
హరి వైకుంఠమునకు అరిగిన
పిమ్మట
అర్జునుండు హరి మునిమనమల
.............................
...., ....... ....., ని పోయి
ధర్మ భీమ అర్జున నకుల సహదేవ
సమరంబులో త్సావగ మిగిలిన
వారిని దెచ్చి
యాదవ .... .... ..... ....
.... పురంబునకు మహీపతి జేసి
పాండవ పవిత్రుడైన[7] పరీక్షిత్తునకు

5. అనిరుద్ధుడు 6. వజ్రుడు 7. పౌత్రుడైన

పరగ అస్తినాపురంబు
(పట్టంబుగట్టి)
పాండవ నందనులు పరమపద
మేగిరి
పరగ వజ్రీడు భూమి పాలింపుచు
నుండె
వజ్ర ..... ..... ..... ....
....., పావనముగా పూజించిరి
తరాతరము పెద్దలు
నరునకు యీ బంగరములు ఆడ
నాయంబు కాదు
.... .... .... టి దాకాను
తరాతరము పెద్దలు దాచినారు
వెరుతుము
భాగీరధి సముఖాన బంగరములు
ప.....

..... ....... ..... ...... ......
... లును మీరు పొందుగా నిలిచి
తప్పక చప్పరయ్య తగదని మనకు''
పుగ్రగాతకుండను వాడు పురువడిన
బోయి
బాలలకు వెయివేలు ప్రస్తుతి జేసి
తల్లి ఆడినమాటలు తప్పక
వినిపించెను
''దేవుతలు నాటి బంగరములు
తెమ్మన వచ్చునా?
నరపతులకు ఆడ న్యాయంబు గాదు''
అని కన్నుల కోపంబు కాంత
తాబలికె:

## సిరిదేవి పలుకులకు కోపించి, బాలురు దేవతా బొంగరాలు తెమ్మని సంగడీలను వంపుట

అమ్మాడిన మాటలకు అతికె
రోషంబు పుట్టె
పలికెను ముమ్మయ్య బాలలకడ
జొచ్చి;
పాయక పన్నెండేండ్లు పర్వతాలు
నడిచి
పూని మల్లప్పచాత పుచ్చుకున్న
వరము
మలిచెట్టి పోచయ్య నురివీర గౌరు

సిరిదేవి అడిన మాటలకు సిద్ధంబు
జేసి
యీశ్వరుడు బక్తుడు యిలదరుడు
అయితన్న
వాసికెక్కిన సోమ వంశమున బుట్టె
హిమ్ముగా రామకీర్తి ముమ్మయ్యను
తాను
అమ్మను బంగరములు అంపించు
మనెను.

అచ్చట మాటలకు అమ్మకు
పొలతిగాను
రాజనీతులు బలుకుటకు న్యాయంబు
గాను
పోచయ్య సంగడీలు పోయి
తెమ్మనెను
కొమరగిరి నూకాంబిక కొలువుండ
గాను
సంగడీలందరు చెయ్యన వచ్చిరి
కరములు ముకళించి కాంతను
కీర్తించిరి
"యిందుముకి సిరిదేవి! కొమరక్క
యిందరుండగాను
చంద్రమతి దేవికి సరివత్తువమ్మ!
వంతుకెక్కిన యట్టి కీర్తిమంతురాల!
సీతకు సరివత్తువమ్మ సిరిదేవి నీవు

అమ్మరో! నీవుముందు ఆడిన
మాటలకు
ముమ్మయ్య పోచయ్య మాద్దు
బాలలూను
పరగ కోపించి పలికిరె తల్లి!
కరకంఠుడు వర మిచ్చె కలిగిరి
పుత్రులు
నగపతులు అన నీకు నాయమా తల్లి?
మలిచెట్టి పోచయ్య మరి బాల
ముమ్మయ్య
కరుకంటుడు బక్తుడు కాదటవమ్మ
కగ కంటుడైనట్టి బస్వనై పుట్టె
సందేహ మేటికి సకియరో తల్లి!
అమ్మరో! బంగరములు అందియ్య"
మనిరి

## కొమరగిరి చెప్పగా సిరిదేవి సంగడీలకు దేవతా బొంగరాలిచ్చి పంపుట

కొమరక్క యా మాటలకు గొబ్బున
లేచి
సిరిదేవి తోడను చెన్నొంద బలికె:
"అంతట బంగరములు అడనే రాదు
దంతి ఘటముల వంటి కొమాళ్ళ
జూచితేను
సంతోషము గాదటే సకియరో
మనకు?"

కొమరగిరి మాటలకు సిరిదేవి
గొబ్బున లేచి
వారబోసి ధూపము వరుసతో బట్టి
ముత్యాల నివ్వాళి ముదమొప్ప పట్టి
పెట్టెలలో బంగరములు చేపట్టి
అందుకొని
అట్టె బాలల చేతికి అందిచ్చె
నూకాంబికె

దీపంపు కళలతో చంద్ర బింబంబు
బ్రాహ్మణక్క వడికింది పట్నాలు
జాలె
చెలగి కస్తురి నుదుట దిద్దిన కాంత

యలమక్క వడికింది యరనూలు
జాలె
ముత్యాల కుచ్చులు ముప్పది జాలె

## బాలురు బొంగరాలాడుటకై గంగరావుల బయలుకు వెళ్ళుట

జాలెలు బంగరములు సరగున
అందుకొనిరి
కొలువు గొబ్బున లేచి గొడుగుల
నీడను
పోచయ్య ముమ్మయ్య పొట్టేళ్ళ
నెక్కిరి
అందరు గోపాలకులు అశ్వాల
నెక్కిరి
కొందరు గోపాలకులు గోడిగిల
నెక్కిరి
ముత్యాల గొడుగులనీడ ముమ్మయ్య
కదిలె
పట్టు గొడుగులనీడ పక్షీంద్రుల
పోచయ్య కదిలె
సవరీల గొడుగులనీడ సంగడీలు
కదిలిరి
సాగిరి బాల రాజులు సకలనేర్పులను
కల్లాల కాంతలు గంగురావుల బైట
బోడిగుండ్ల మిట్టకాడ బంగరాల గెరిడి
బంగరాల గెరిడికి బోధికలు వచ్చిరి

అందరు గోపాలకులు అశ్వాల డిగ్గిరి
పొందుగా బాలలు పొట్టేళ్ళ డిగ్గిరి
గనమైన రావుల కట్టిరి వేడుకులు
అన్నవు రావుల అశ్వాల కట్టిరి
కొండిగా రావుల గొడుగుల చేర్చిరి
పండిన పణసలు పల్లకీలు జేర్చిరి
అందు కొమ్మల మీద మందిష్టి
పచ్చా డావహిచ్చిరి
అందుకొమ్మనిరి బంగారాలు
ఆవేళ బాలలు
పాలమాని బంగరానికి పట్నాలు
జాలె
పైడివి ములికెలు బాగొప్ప జేసిరి
యేపిమాని బంగరానికి యరనూలు
జాలె
యెండివి ములికెలు వేగంబె జేర్చిరి
వేడుకపడి బంగరానికి ముమ్మయ్య
ఎండి పొదిగించె
భ్రాంతి పడి పోచయ్య బంగరానికి
పైడి పొదిగించె

## సంగడీలను ఉద్దీలుగా సమకూర్చుట

అప్ప కొమారుని జూచి ఆ బాల
ముమ్మయ్య
పలికెను వక మాట పంతంబు తోను;
''బంగరము లాడవలను పోచయ్య
మనము
సంగడీల వుద్దుల సమకూర్చ''మనెను
''కరకంటు లింగయ్య! గనుడు
రంగయ్య!
మీరిద్దరు బంగరాలు వక వుద్దిగా
నాడుడా!
శ్రీకంటు వోబుళు! సిటికేశ్వ రాగవు!
మీరిద్దరు బంగరాలు వక వుద్దిగా
నాడుడా!
బుద్దుల చన్నయ్య...మాడి శంకరు!
మీరిద్దరు బంగరములు వక వుద్దిగా
నాడుడా
దాసి బోయిన రామన్న! ధర్మజుని
అత్కుతు!
మీరిద్దరు బంగరములు వక వుద్దిగా
నాడుడా!
మత్యబోయిన పాపన్న! బత్తుల
గోపన్న!
మీరిద్దరు బంగరములు వకవుద్దిగా
నాడుడా
బండారు యల్లయ్య! బడుగుల
మల్లయ్య
మీరిద్దరు బంగరములు వక వుద్దిగా
నాడుడా!''
ముమ్మయ్య పోచయ్య మునుపాడ
సాగిరి
సంగడీలందరు సరగున ఆడేరు

## పురస్త్రీలు బొంగరాలాటను వేడుకతో చూచుట

అచ్చట కాంతలు అటు సోద్యపడుచు
వచ్చిరి ధనముకొండ వణిత లందరును
పాలించి యాస్త్రీలు కేలలు బాడుచును
కేలలు బాడుచు బాల యవ్వనమున
మంచు మించిన యట్టి మంచి
వలపములు[8] గట్టి
మెచ్చుగా కస్తూరి దిద్దిన కాంతలు
కలిత కంకణములు కడునొప్ప
ధరియించి
ఘల్లు ఘల్లున [మోవ కాళ్ళ
కడియాలు

---

8. నలిపెఘులు

నిగ నిగమను జాతిముత్యపు
సరులు దాల్చి
నిండు వేడుకతోను నెలతలందరును
యెదురేగి వేతెంచిరి వెంతయు
వేట్కతోను
ముదమొప్ప రంజిల్ల ముత్యాల శాస
కాంతలు మగువలు కన్నెలందరును
భ్రాంతిపడి చూచేరు బాలల ఆట
నీళ్ళ కడవల వారు నిండి చూచేరు
చల్లకడవల వారు చేరి చూచేరు
పాల కడవల వారు ప్రబలి చూచేరు
వోబుళపు పరుష వలను వచ్చేరు జనులు
తిరుమల పరషవలను తిరిగి చూచేరు
పర్వతపు ప్రజల వల ప్రబలి
చూచేరు
మస్నీలు మాష్టీలు మరి సాహస
ఘనులు
కన్నుల చూచేరు కంతసరి బాలల ఆట

## పోచయ్య ముమ్మయ్యలు పందెము కట్టుట

పుటమెగసి బాలలు పుచ్చుకొని
బంగరాలు
తటుకున బంగరములు తగజుట్టి
ఆడుచును
అచ్చట పోచయ్య అపుడిట్ల గనియె
"మామరో వో మామ: వల్లవుల
మామ
మామరో వో మామ:వలురాచ మామ:
పందెములేని బంగరాలు పట్టరాదు
మనము
పందెము వద్ద వలను ప్రఖ్యాతిగాను"
అనిన పోచయ్యను జూచి ముమ్మయ్య
అపుడిట్ల గనియె
"ఆడితివి పోచయ్య అందరిలోను
వోడితె పోనీయ వాకు దప్పక నీవు
యెటువల పందెంబు నాకెరిగింపు"
మనిన
అనిన మాటలకు పోచయ్య
ఆడెనొక మాట
"నేను గనక వోడితి నైన వో మామ:
వినవె
నేను ధరియించి వు.............

(అసంపూర్ణము)

# యఱ్ఱగడ్డపాటి పోట్లాట

## ప్రత్యంతరము

### అవతారిక

శ్రీరంగధాముని చెలువొప్ప దలచి
కారుణ్యమునను శ్రీ కమలజు దలచి
శంభుని దలచి స్వశక్తి పూజించి
అంబను శ్రీ శారదాంబను దలచి
యేకదంతుని కొనియాడి వేగంబె
లోక లోకములెల్ల లోలత మెరయ
చేకొను గుండాల శాంభవి ప్రాపు
సమకూర్పు నని చాల సన్నుతి జేసి
విమల విజ్ఞాన వివేక గుణములును
గంగాభవానిని గనత ప్రార్థించి
కొంకు బంగారుచే దొరికిన మేలు
సమ్మత మొనరింతు సర్వజనములకు
నెమ్మది బోయపాట నెలకొన్న గంగ
కంజలి మొనరించి కడు వేట్కతోను
సంజీవి రాయని సతతంబు దలచి
కనక సంపద లొసగు గంగాభవాని
యలమంచి గంగను యంతట దలచి
తన మది నిలిపి తాత్పర్యంబుతోను
పకటించు యరగడ్డపాటి పోట్లాట
ప్రకల భూజనులకు చెవులు పండువుగ
వివరించు యీ కథ యిద
మెట్టిదనిన

### కాటమరాజు దక్షిణ భూములలో పశువులను మేపి తిరిగి పాలేటికి వచ్చుట

అవనిపై యాదవ వంశంబు లోను
భువన భీకరుడును
భుజబలోన్నతుడు
వసుధపై పెద్దిరాజు వర తనూజుండు
అసమాన ధీరుండు అమిత
విక్రముడు
పశుపతి నలనన్న పట్టభద్రుండు
దేశ దేశములెల్ల ధేనువుల మేపి
వడ్డి దేశమునేలు వసుధ పాలకుని
దండించి కోపరాలండ విడిపించి
మరల దక్షిణభూమి మరి వేగ వచ్చి
బిరుదులు జేకొన్న భీకరోన్నతుడు

కరిమాధవుని యాజ్ఞ కాటభూపాలు
పరగ దక్షిణభూమి పశువుల మేపి
యసగంగ జన్నవాడ కేతెంచి నచట
పొసగంగ గొబ్బిదేవరకు బెట్టియును
రంతుకు నెల్లూర రాయ నరికించి
పంతగించిన క్రియ పగ నేరుపడను
వెరవొప్ప చిలుకను వేయించి రాజు
..........................
పగ బెణికి తన మరిది
పద్మనాయుడును
తగు బంట్లు జనులును తమ్ములు
బలము
లెద్దులావులు కోడె లేపార మిగుల
సందడింపుచు పరిజనముల తోడ
గడిభూమి లోపల కయ్యంబు బెణికి
నడి భూమికిని తిరిగె నతివేగమునను
పాలేరు గడ్చిపోవతె ననువారు
వాలాయముగ సరసి పద్దను నిలిచె

## కాటమరాజునకు యుద్ధ శకునము లగుట

యెద్దులు పోట్లాడి యెట్టెట్టు చెదరె
దద్దిల్లి కోడె లందందె బెదరగను
కాలావు లోక లక్ష కాలు కదలకను
చౌలాలకింపుచు చిరకొట్టసాగె
నది చూచి నలనన్న నాశ్చర్యమంది
మదిలోన నిదియేమి మాయయోగాని
అని పద్మనాయని నడుగ నూహించి
తనకైన మరిదిని డాయంగ బిలిచి
తెలియ చెప్పిన విని తేటగా నవ్వి
పలికె నలసన్నతో పద్మరాఘవుడు
కలకల నవ్వుచు కడు వేట్కతోను
"సలలితంబుగ నేను చప్పంగ
వినుమ
విను మహిపాలక! వినవె వో బావ!
ఘనముగా యీ గోగణంబుల భాష
నీ సహోదరుడగు నీతిపాలకుడు
వాసిగా యఱ్ఱయ్య వనర గుఱ్ఱెరుగు
పిలువ నంప" మటన్న ప్రియవాక్య
ములకు
కల కల నవ్వుచు కాటభూపాలు
తన బంట్ల కొంద రుద్ధతి నేగనంపె
పనిబూని యఱ్ఱయ్య పాలికి బోయి
అన్న కాటమరాజు ఆనతి వారు
విన్నవించిన యతి వేడుక పడియు
బెజవాడ బెబ్బులి పెయ్య తెఱ్ఱన్న
రాజ పూజితుడు సురుగంగ విజయు
హొలుపొంది కాటభూపాలుని జేరి
వాలి దండముబెట్టి వరుస దీవింప
కరములు ముకిళించి కడు
వేడదొణగె
"వారిధి గంభీర! వంశ విస్తార!
ధీర ధీరోద్ధార! దివ్యావతార!

కరుణా సముద్ర! వో కాటభూపాల!
నను పిలువ నంపిన పని యెల్ల మాకు
విన సాధరింపవే విమల చరిత్ర!"
అని పల్కు యర్రయ్య ఆకు
వాక్యములు
విని కాట భూపాలు డిట్లని పలికె
"వినవోయి తమ్ముడు! విను
విచిత్రముగ
ఘనమైన వృషభముల్
కామధేనువులు
చాల పోట్లాడిన శకునంబు తెలియ
కాలు కదలని యట్టి కట్టడ తెలియ
పాలేట మల్లాడు పంతముల్
తెలియ
మేలు కీడును తెలియ మేమిమ్మ
యిటకు
రప్పించితిమి సహోదర మీకు
ముందు
క్రమముగా బెజవాడ శివుని
సత్కృపను
గోవు భాషాంతము కొంత దెలిసితివి
నీవు దాచక మాకు నెరిగింపు"
మనిన
నవ్వుచు నెరనన్న నలనన్న కనియె
"యీవ్యాళ పనికాదు రేపు
ఝామునకు
యేర్పడి జెప్పెద యిలతలాధీశ!
పంపుమా శలవిచ్చి పంపవే" యనిన

పొమ్మని శలవియ్య పోయి
యర్రయ్య
యెమ్మె మీరగ విడిది కేంతెచి రాత్రి
పప్పు పూపాజ్య ఫలర సాన్నములు
వొప్పార భుజియించి వొగి నిద్ర
జెంది
తెలవారిన వెనక దివ్యతేజముగ
పల్లవితాత్ముడై స్నానంబు జేసి
తెల్లని వలిపెములు తెరగొప్ప గట్టి
మల్లికార్జునుని తన మదిలోన నిలిపి
భక్తితో మందలోపలికిని బోయి
భక్తితోడను నిలిచి పెయ్యెలెర్రన్న
ధేనువులకు మ్రొక్కి ధీరుడై సురభి
ధేనువులకు చుట్టు దిరిగియు తనదు
హస్తంబులు మొగిచి
అనియేకముగను
ప్రస్తుతింపుచు బల్కె పెయ్య
లెర్రన్న
"సురభి ధేనువులార!
సురకాంతలార!
కరుణతో మాపాల గలిగితిరైన
మీలోన వాక్యంబు మేము
తెలియగాను
చాల గోరిన భక్తి సమకూర్పవలెను
ముందర నడిచేటి మేలిమి కీడు
అందరు వినగ మా కానతి"
మ్మనిన

## ఎఱ్ఱయ్య గోపు భాషాంతరములు విప్పిచెప్పుట

యఱ్ఱయ్య భాషలు యెద్దులావులును
నఱ్ఱావులెల్లను నాలించి తెలిసి
యెద్దులావులు దూడ లేఘార మిగుల
మందలోపల చాల మట్టు మల్లాడి
సందడింపుచు చాల చౌకళింపుచును
అందలి ధేనువులు ఆవల పొరలె
యీవలి ధేనువులు ఈవల పొరలె
అదలె ధేనువులెల్ల అంబోయని చాల
మెడలెత్తి వంచెను మిగుల దేనువులు
కనుగొని యఱ్ఱన్న కాటభూపతికి
వినుపింప చనుదెంచి వినయుడై మ్రొక్కి
ధేనువులు తెల్పిన తెరగెల్ల తెలిపె
"విను కాటభూవరా! విను మహారాజ!
చప్పన్న భూముల ధేనువులమేపి
వప్పుగ నెల్లూరు వచ్చిననాడె
గడిమన్నె వారితో కలహంబు గలిగె
తొడిబడ నెల్లూర ధొరలకు మనకు
యీడైన జగడంబు యిక్కడ గలుగు
జోడైన రాజులు జూడంగ గల్గు
సరియైనరాజులు సమయింప గలుగు
పరిపరి విధముల పల్కె ధేనువులు
లంకకు ప్రతిబోలు నెల్లూరు యనగ
శంకలేకను యేలు జనపాల గురుడు
దశకంఠుడన దగు నలసిద్ధిరాజు
దశరథ రాముగా తల్పనీ వనిన
పటు విభీషణు బోలు పద్మరాఘవుడు
అర్జుని సాటిగా అయితమ రాజు
అర్జుని తనయుగా అవనిలో నెన్న
ఘర్జించు రిపువైరి కరియావులన్న
భరతుని ప్రతి బోలు భట్టావులన్న
నకులుని సాటితో నసగ ముమ్మయ్య
చలగి సుగ్రీవుడై చట్టువారెర్రు
పొలుపొంద అంగదు పుత్తమరాజు
వనచరులను బోం వసుధలో మనకు
ఘనమైన గోప కుమార వర్గంబు
నారూఢమగు యీడ నాలంబులోన
శూరులై పోరాడి సుక్కి యిరుబలము
యిచ్చోట చచ్చేరు యని యెద్దులావు
లెచ్చరింపుచు బల్కె వెలమి సాహసమున
యిది ముక్తికిని త్రోవ యిది వీర మహిమ
సదయులై పొగడొందు జగము లోపలను
పరగంగ యఱ్ఱగడ్డ పాటను మనము
పురిణింపగా జల్ల పోలురాజపుడు
చెప్పిన దినములు చేరువై వచ్చె
వప్పుగా యాదవులు వసుధపై వరగ
కట్టడ చేకూరె కామధేనువులు
రట్టడి యెద్దులు రవుతు రాణువయు,
చచ్చుట సిద్ధంబు సమరంబులోన

యిచ్చవచ్చిన రిపుల యెదిరించి పోరి
చచ్చి స్వర్గము జూడ సమకూడె
నసుచు
ముచ్చట్లు వార్తలు మురియుచు నాడు
ధేనువులును బలుకు తెరగెల్ల మీకు
వినిపించితి'' ననిన విని నలనన్న

## కాటమరాజు రణోత్సాహము

కలహంబు నవుసన కలకలనవ్వి
చలమొప్ప పెన్నిధిచే దొరికినట్లు
చావుకు చింతింప జాల నేననుచు
కావున స్వర్గభోగము గల్గుననుచు
మదిలోన నవ్వుచు మరిది రాఘవును
సదయుడై గనుగొని
జనపాలుడనియె:
"వినుము పద్మనాయుడా! వింటి
విచ్చోట
ధేను భాషాంతరములు తెలిసెగా
మనకు
సరియైన రాజుతో సమరంబు గలిగె
ధరణిలో మన తాత తండ్రుల పగలు
సమముగా పోరాడ సమకూడె మరిది
క్రమమెరిగి యిచ్చోట కనక దేరాలు
కోటి గోపాల కుమార శేఖరుల
యేటివెంట గుడార్లు యెత్తించు
మనుచు
శలవిచ్చి పంపవే నా చిన్న మరిది
పలనొప్ప నీ''వన వుప్పొంగి పొంగి
యాదవులను పిలిచి యిట్లని పలికె
"మేదినిపై నచట మీకు యీ వేళ
హేమాద్రి గూడార్లు యెత్తుడీ"
యనిన
ఆ మానవాధీశ్వరుడు ఆడు
వాక్యములు
విని వేగ యా యాదవులు
వేట్కతో బోయి

## యాదవ వీరుల రణ సన్నాహము

కనక కుండలు బూని ఘన గుడార్లెత్తి
యెండకు చాటుగా యర్ర గుడార్లు
మెండుగా ఆమీద మేఘవన్నెలను
వేడుక గుల్కెడు యెల్ల గుడార్లు
ఆడగ ఆ మీద హనుమంత పడిగెలు
మంచులు చొరకుండ మైన గుడార్లు
మించి యుండెడి మంచి మీను
టెక్కెములు
బసువన్న యుండెడు బంగారుపోత
పసిమించు ముత్యాల బరువు
వాచూరు

యిరవొంద నొకదేర
యింపుసొంపలర
పురహారు మారుగా పొగడు బసువనికి
ముని దొడ్డి నడుమను ముందుగా
యెత్తి
కనక కలశములు కడు వేగబూని
పంచనందుల నిలిపి బహు హారుమేని
పంచవన్నెల శాలుపై ఘంటశంఖు
సింహాసనంబుపై సిరులు చెన్నొంద
గంవ్వార రిపుగజ కంఠీరుడనగ
బసువనికి యిరుపార్శ్వములందు
వేవేగ యింద్ర గోపాలంబు వకటి
బాగింపగా యఱ్ఱపట్టు గుడార్లు
నలుదుగా నలుబదినాల్గు స్తంభాలు
తెరగొప్పనొక త్రికూటం బనేటి
యెరవుగా నొక గుడారు
యెత్తిరామీద
గురుతుగా బంగారు కుండలు యెత్తి
పన్నుగా ముత్యాల పందిలి బెట్టి
కన్నుల కావిరి కప్పినట్లుగను
పన్ని యెత్తిరి సూర్యపట్టు గుడార్లు

చూపుడు గంభాల చుట్టు సరాదు
లేపార యెత్తిరి యలమి యేడుకల
తిరుమంద లుండేటి తెల్ల గుడార్లు
పిరివిగా యెత్తించె విఖ్యాతిగాను
తగిన వాళ్ళకు నెల్ల తగిన గుడార్లు
వేగంబె యెత్తించె భూవిభు
డావులన్న
యేలుచు దివిజులు మెచ్చ
వెంలేనియద్దీ
ఘనముగా నవరత్న కనక పీఠంబు
వనరంగ వైచియు వుబ్బుచు మదిని
ఘనులైన యా యాదవులు
గ్రక్కున బోయి
వినుపింప నావేళ పద్మరామవుడు
తన భావ కాట భూ ధరణీశ కపుడు
తెలియజెప్పిన మీద తెలిసె
నలనన్న
చెలగుచు మరిదిని చేదంట బట్టి
రంజిల్ల రత్నాసనంబుపై నెక్కి
రాజు రాఘవుడును రమణతో గూర్చి
గూర్చుండి మరిదిని కొనియాడెనంత

## తనకు కోట లేదని కాటమరాజు చింతించుట

"నా చిన్న మరిది! యో నాయుడ!
వినవె
యీా వసుంధర యేలు యీా
సిద్ధిరాజు

యేవ్వాళ వచ్చునో యెరుగంగ రాదు
కోటలేని యుద్ధము కూడునన రాదు
సాటిలేని యుద్ధంబు సమ్మతము గాదు
అలనాడు వినవేమొ తండ్రుడు లేవురుసు

చలమొప్పగా కోట చాటులేకపుడు
అందరు జగడాన హతమైరి మరిది!
ముందు జేసిన కలహమును విన్న
విధము
అరివీరు కలహాన హతమైరిగాని
నెరవీర కలహంబు నే వినలేదు
అరకల్మి గాకుండ అలంబులోన
నెరవేర కల్లుగా నని శాయవలెను
ఘనులైన రిపులను కదసిన వేళ
యేనుగకును యెద్దు అశ్వాని కావు
తరుపుకు తట్టువ బంటుకు బంటు
వరగ రాజుకు రాజు పంజులు గదసి
కాలారి నెదిరిన కంపటీ డెదురు
మును నొప్ప యేదహోరాత్రములు
రిపుల
తోలి పట్టుడీ యని ధిక్కరించి
డీ యనుచు
చెలగి శత్రుల గని జగతీశు నెదిరి
పోట్లాడవలె మరిది పొందుగా
యిపుడు
కోట పెట్టగ వసగూడదు యుద్ధంబు
హరిహరాదులు మెచ్చ
ఆయిత్తముగాను
వెరవొప్ప కోటగావించు విచ్చోట"
నని పల్కు నలనన్న కనియె
రాఘవుడు

## కోట కట్టుట వీరలక్షణము కాదని పద్మరాఘవుడు చెప్పుట

"విను కాటభూపాల! వీరాగ్రగణ్య!
వితరణ గుణశాలి! విఖ్యాతిపరుడ!
సంతతము గొనియాడ సర్వజ్ఞ
నీధివి
పున్నమ చంద్రుని పోలు నీ గుణము
కన్నుల చల్లగా కంటిమో బావ!
కోట కొత్తళంబులు కొమ్మలు
మరుగు
చాటులు మాటులు చావజాలకను
మనియుండె వారికిని మరుగింతె కాని
చనిపోవువారికి చాటు లేమిటికి?
యెల్లలోకమువారు యెన్నికగాను
సల్లలితాత్ములై జనులు
పొగుడుదురె?
ప్రాణహానికి చాల భయపడి రాజు
గణుతింపగా చాటు గావించె ననరె?
నగుబాటు కాకుండ నామాట వినుము
తగు బుద్ధి యెరిగింతు ధరణిపై
మనకు
యేనూరు కోటలు యెదుట
నుండగను
నన్నూరు కోటలీ నడుమనుండగను
అన్నలు దమ్ములు ఆప్తులు సుతులు
పన్నుగా బందువుల్ బలములు లెక్క

గల వృషభంబులు కామధేనువులు
తలపగా కోడెలు తరువులాదిగను
మేలైన కోటలు మేదని మీకు
వాలాయముగ నుండ వరుసతో మీరు
మెండుగా నా కోట మేకొని పెట్క
దండిగా భోగింప తగుగాక మీరె
కొమరప్ప పెట్టని కోట మా మదిని
అమరు కోటకు కొమ్మలనదగు
మేము
కొమ్మలు కూలక కోటలు బడునె?
ముమ్మరంబుగా ధనము ముడుపులు
మీరు
ముడులపై నుండెడు ముద్రలు
మేము
కదు ముద్ర గోల్పోక కనకంబు
పోదు
వున్నతంబుగ కన్ను లెన్నగా మీరు
పన్నుగా కన్నుల రెప్పల చాలు
మేము
కనురెప్ప కోల్పోక కన్ను
మోసమగునె?"

అని పద్మనాయుడు ఆడు వాక్యములు
విని కాటభూపాలు డిట్లని పలికె:
.............................
"నాయడా! వినవయ్య నా చిన్న
మరిది
పాయరాని సంగడీడవు వో
పద్మనాయుడా!
అందుకు బుద్ధి మాకానతిమ్మ"నిన
పెద్దిరాజు కొమారుని ప్రియ
వాక్యములును
వొప్పుగా వనలేక వుచిత
వాక్యములు
"చెప్పెద కాట భూజననాథవర్య!
అన్నదమ్ములు మీరు అందు వకరైతె
పన్నుగా పగవారు పగ శాయగలరె?
యెన్నగా గుమిగూడి యెవరైన
మనను
కన్నెత్తి చూడగా గలరె వో భావ
యీ వసుంధర!" యన విని
నలనన్న
నవ్వుచు యా పద్మనాయని కనియె

## చల్లవారిని తోడి తెమ్మని కాటమరాజు పద్మనాయుని పంపుట

"వల్లవులను గూడి వాలాయముగను
చల్ల పిన్నమనేని సముఖాని కేగి
యిక్కడ నడిచిన వృత్తాంత మంత
అక్కడ మా అన్న కంత వినిపించి

ఆ రాజు లేవురి ఆలస్య పడక
భోరున తె"మ్మన భూపాలుని
కనియె:

''అమ్మహీపతి కడకు
అవనీతలేంద్ర!
పొమ్మన్న నేనట్లు పోరునే బావ
పల్లవాధీశుతో పగబెటికి మనము
చల్ల వారిని గూడి సకలంబు నెరుగ
వచ్చి సాగలకొండ వద్దను నిల్చి
అచ్చోట మీరపుడు ఆడువాక్యములు
యిటువంటి తాణ్యంబు యెచ్చోటలేదు
తటికున యిటువంటి
తాణ్యంబునకును
తగిన యీ పరిపాటి ధరణీశ్వరులలో
వొగి యెవరి పాలిట వచ్చునోగాక
గండిలోపల నుండి గజము
అశ్వములు
మెండైన బలములు మెరసి రారాదు
మచ్చరంబున వచ్చు మన్నీలనెల్ల
శిక్షింపనేవచ్చు చెండు బెండుగను
పేరు బలమును యెవరి
ప్యారనున్నదియె
వారి బంపుదమని వస్తిరి మీరు
అనిన వాక్యములకు ఆ చల్లలాకు
తన తమ్ములను తాను తలపోసి
పోసి
అందలాలను దిగి అన్నదమ్ములను
మందరధీరులై మన్నెరాజులును
గోపాలులును లక్షగోసంగు లాది
యేవుతో నిల్చిరి యీ రాజువద్ద''
అని పద్మనాయుడు
ఆడు వాక్యములు
విని కాటభూపతి వెల వెల బోయి
''కట కట రాఘవా! కాని మాటలకు
యిటువలె పిన్నయ్య నెట్లంపుదకట!
తమ్ములు మేము పెద్దలు
సూడ వారు
తమ్ముల పనిగొన తగుగాక తమరు
తమ్ములపని విన్న తాలనే భువిని!
తమ్ము రాజును గొన తగుగాక
మరిది
పిన్నయ్య పేరయ్య పృథ్విలో
జనులు
పిన్నలు పెద్దలుపొగడగా వినవె!
పరదళంబులును మందలై
రాకమున్నె
యెరసిద్ధి రాజులు యిల రాకమున్నె
వేగంబె మీరున్ను యరనన్న
గుమిగూడి
బాగుగా పిన్నయ్య పాలికి పోయి
యీ వివరమంతయు వినిపించి మీరు
వేవేగ దోడుక యీపురి రమ్ము
పనిబూని పొ''మ్మన్న
పద్మనాయుడును
తన మరిది పెరనన్న తగిన
బంధువులు
కొందరి భటులను కూర్చుక వేగ
అందలంబులు యెక్కి అతి
మోదమునను
సందడింపుచు వారు
సన్నాహములును

అందరూబోయి రంతట చల్ల వార్ని
అందగుని గని అందలంబులు
డిగియు
వందలంబుగ బావమరదులు
లిద్దరును
చల్ల పిన్నమనేని సన్నిధి జేరి
................ ......
వారు దండండము బెట్ట వరుస
దీవించ
........................
రంజిల్ల నా పద్మనాయుడా వ్యాళ
అంజలి యొనరించి అప్పుడిట్లనియె

"యదుకులాధీశ్వర! యిచ్చట యిట్లు
యిదియేమి నిలుచుట?
యేమి కారణము
నలసిద్ధిరాజుతో నాలంబు గోరి
నలనన్న నిల్చినాడని నాడె తెలిసి
లక్షగోపాలులు లక్ష కంపటము
అచ్చటనే నిల్చి రది యేమొకాని
పెద్దిరాజు కొమార్థు పెట్టించె మమ్ము
అందలంబులు యెక్కి
అన్నదమ్ములును
పాలేటికిని జాల పైనమై రండి
..............................."

## చల్ల పిన్నయ్య సాగలకొండ రాజ్యమును విడిచిరా నిరాకరించుట

మరిదారు మాటలు మదిలో దెలసి
యిరవుగా పిన్నయ్య యిట్లని పలికె
"పరదళ సింహమ! పద్మరాఘవుడ!
ధరణి యేలిన సిద్ధిరాజు దళములును
ధీమ సంబున యెదిరి తెగటార్చి వైవ
మేము యిక్కడ వుండ మితి యేరు
పరిచె
కలకాలమును మమ్ము కన్న కడగానె
వలపక్ష మొనరించి వసుధీశ్వరుండు
చెప్పినట్టుగ......చేసెను మాకు
అప్పుడే తెలివిడి ఆయను మరిడి!
నమ్ముడు పెట్టిన రాజ్యంబుగను
నమ్మిన నాపాలి నఖిల దేవతలు

హరిహరుల్ నిర్మించి అందరు మెచ్చ
యిరవుగా మాకిచ్చి యుండరే మరిది?
యదురు బలములు యెదదాక
కుండెదము
పదిలాన యఱ్ఱగడ్డపాట మీరుండ
యామారి యుండక యేర్పడ మీరు
భూమిపై పగవారు పూని రాకుండ
గట్టిగా హెచ్చరికగా వుండు" దనిన
అట్టి పిన్నయ్యకు అనియె రాఘవుడు:
"అన్నలు దమ్ములు అలర
బాంధవులు
నిన్ను గొల్చిరిగాని నీయంత వారి
నీ మాట జవదాట నేర్తురే వారు?

భూమిపై రాజుల పోంకములు దూల
దంతి ఘోటకముల తగిలి పోరాడ
పంతగించిన వారి పరిమార్చగాను
యెక్కడెక్కడికిని యేర్పడ బంప
.................................
ఘనముగా మీరును కదిలిర''మ్మన్న
కనుగొని పిన్నయ్య కడువేగ బలికె
.................................
"మనసులోపల నీవు మా మారుగాను
ఆవులన్నకు మరిది! హర్షంబు పుట్ట
దవ్వుల నున్నారు తగ చల్లవారు
యేవిధంబునను సందేహ మేమిటికి
భావింప తండ్రులు పరగ తాత వాకదె
పరగండ భేరుండ పక్షు లన్నిటికి
శరీరములు వకటి శిరములు వేరు
అలాగు మా మది ననుకొందు మరిది!
వాలాయముగ రిపులు వచ్చుచున్నారు
తాత తండ్రుల పగ ధర నిల్వకుండ
యేతావు నైనను యీడేర్చుటె లెస్స
సాగలకొండ జనార్దనస్వామి
వేగంబె సాక్షిగా వెళ్ళించి యిచ్చోట
పరిపరి విధముల పగవారు మేము
గురిపడి పోరాడి చచ్చిన వెనుక
పిల్లాపియై యేట మాపై రక్తములును
కొల్లగా బారిన గురుతు మీకగును
గువ్వటి జడ దేలి గొబ్బున వచ్చి
నవ్వుచు రక్తాన నట పుచ్చెలాడు
నలనన్న నా యుద్ధము నటు చూడవలెను
యేల మీరును బోయి వేగంబె యెందు
చాటున్న దేరాలు చక్కగ దీసి
వాటముగ యేర్పరచ వలెనయ్య మరిది!
తమ్ముడు నలనన్న తన మదిలోన
మమ్ము దూరక చాల మన్నించ మనవె
కడువేగ మనపాల గల్గిన రాజు
.................................
పల్లికొండకు మన బంధు వర్గముకు
వల్లవులకు మన వల్లభన్నకును
అయితమ రాజుకు అన్నదమ్ములకు
వైనాన జాబులు వ్రాశంప మనవె"
అని పద్మనాయని ఆ యరనన్నను
తన కౌంగిట జేర్చి తమ్ముని మరిది
పనిచిన యరగడ్డపాటి కేతెంచి
గొనకొని నలనన్న కొలువుకేతెంచి
జావను కనుగొని పల్కె రాఘవుడు!
బావరో! వో బావ! భావ నలనన్న!
మీరు పంచిన బోయి మేము వేడుకలను
పేరుగల్గిన చల్ల పిన్నయ్యతోను
కొన్ని వార్తలు మీరు కూరిమి చాల
అన్ని మార్గములను ఆ చల్లవారిని
రమ్మన రారైరి రంగుగా తమరు

నమ్మియుండిన యట్లు నలనన్న! జూడ
సిద్ధిరాజు నెదిర్చి చిత్తవిత్తముగ
గద్దించి రిపులను ఖండింతు మనుచు
సలలితంబుగ గలిగె చల్ల తాణ్యమును
బలములును కొంత బాగుగా నిలిపి
యసగ సాగలకొండ యుండిరి వారు
పొసగంగ పిన్నయ్య పుడమిలో జనులు
పదివేల విధముల ప్రకటించి పొగడ
సదయుడై యున్నాడు సర్వేశు కృపను
పగరాజు లెల్లను పైకొనక మున్నె
........................
........................
తగిన వారలవేగ తాణ్యాల నిలుపు
దని నిను దీవించి పంపె న''న్న నగ
మనసులోపల చింత మానె నలనన్న
తప్పక మరిదిని తా చూచి పలికె!

## కాటమరాజు బొల్లావు మహిమను ప్రశంసించుట

చొప్పుగా వినవయ్య వో చిన్న మరిది!
నీవు చెప్పినమాట నిశ్చయంబుగను
అవును ముందుగా హరి హరులు మెచ్చ
యక్కడ పుండినా బ్రతికించు మనను
గ్రక్కున సురభిని కడు వేడుకొనియు
అరుదైన ఆరు తాణ్యము లేర్పరచి
పురవుగా బొల్లావును వుంచగా వలెను
కృతయుగంబున కార్తవీర్యుని కొరకు
ప్రతి జేసి పుట్టెను భార్గవేంద్రుండు
దేవతలు పొగడంగ త్రేతాయుగమున
ఆ వీర రావణు నంతముకాయ
దశరథసుతుడై ధర నుద్భవిల్లె
దశకంధరుని గూల్చి ద్వాపరమునను
కంసభూవరు జంపి కల్కి- రోహిణికి
భాసురంబుగ బలరాముడై పుట్టి
కాలకన్యుని జంపె కలియుగంబునను
హాలాయకము యాదవాన్వయు ద్రోవ
ధేనువై పుట్టెను దేవతలు పొగడ
పూని నెల్లూరి భూపాలుని బలము
చంపును త్రుంపును సమరంబులోన
తెంపులు వొనరించు ధేనువ మమ్ము
కంటికి కనురెప్ప కాపాడు రీతి

యింటి వేల్పువలె వుండునే మరిది
వెదకి బొల్లేవున్న యిరువుల జూడ
అతివేగ వేగర్ల అంపవే మరిది!"

## పద్మరాఘవుడు వేగర్లచే బొల్లావును వెదకించుట

అనిన బావను చూచి హరుషించి మరిది
తనరంగ వేగర్ల దగ్గర బిలిచి
వినరోయి భటులార! విను శూరులార!
వనరుగా బొల్లేవు వున్నతావులును
యేరుల ప్రాంత్యాన వుండు బొల్లేవు
ఆరూఢమైయున్న నాతావు వెతకి
శ్రీరామ బొల్లేవును శీఘ్రంబె చూచి
మారువార్తలు గొంచు మాపటికి రండి"
కర్పూర విడియములు కడువేగ నిచ్చి
అంపిన వేగంబె ఆ క్షణమె పోయి
బాగైన యా మల ప్రాంత్యముల కేగి
వేగంబె వెదకుచు విపినంబులోన

## వేగర్లు బొల్లావును దర్శించుట

త్రేతాయుగము నాటి దేవతాపుట్ట
ప్రాలిగా కనుగొని బాగుగా జూడ
పెక్కు కొమ్మలతోను పెద్ద చందనము
అక్కడ శృంగారమైన వనమున
చందన పున్నాగ జంబు జంబీర
మందార బూరుగ మహిసాక్షి వెలగ
మాతులుంగ లవంగ మారేడు జమ్మి
చూత కేతకి పనస సురపొన్న తింత్రి
బృందార వృక్షముల్ పొలుపు నటింప
సుందరం బెక్కడ చూడ చోద్యముగ
చల్లని విరజాజి చట్ల నీడలను
వాలివై బొల్లేవు పవళించియున్న
ఫణి రాజు గొడుగుగా పట్టె ధేనువుకు
గణుతింప నెమిళ్ళు కడువేగ చేరి
అరుదుగా నాట్యములు ఆడంగ దొణగె
సరుగున తుమ్మెదలు చాలగా జేరి
మోదంబుగాను వున్మాదముల్ చలగ
సాధు పోషకుడగు చవులాలకింప
కోవెల లొక కొన్ని గుంపుగా చేరి
భావింప రాగముల్ పాడంగ దొణగె
కీరము లొక కొన్ని కెరలుచు పండ్లు
సారంబులును గ్రోలి చలగి వేడుకల
శ్రీరామ కీర్తనల్ సేయుచుండగను

ఆరాము బొల్లేవు ఆలించి చాల
అవిరళ వుత్సాహసంపన్నత్వమునను
.............
వినుచున్న బొల్లేవు వేగర్లు జూచి
పనివడి బొల్లేవు పాదపద్మముల
అల్లంత గనివారు అప్పుడు మ్రొక్కి
బొల్లేవు నుతియించి పొలుపుగా ననిరి:
'శ్రీవత్స లాంఛన! శ్రితపారుజాత!
దేవేంద్ర వందిత! దీన మందార!
సకల జీవాధార! సాగర వాస!
అఖిలాండ పోషక! ఆబ్ధి గంభీర!
యాదవాన్వయుడైన యా నలనన్న
ఆదరంబుగ రేపు యాదవుల్ దాము
మిము జూడగా గోరి మీకు
ముందుగను
సముదయంబుగ రాజు చెప్పి
రమ్మనుచు
మన్నన చేబూని మమ్మంపినాను
మిమ్ము గంటిమి మేము యంత
ధన్యులము
పోయి వచ్చెద"మని పొందుగా వారు
వేయి భంగుల నావు వినుతింపు
కొనుచు
మాపటి వేళకు మందకేతెంచి
గోపాల పతిగాంచి కోర్కెతో
మ్రొక్కి
యదుకులాధిపునితో యిట్లని రంత:
"వేదకి బొల్లేవున్న యిరువులు
చూచి
వచ్చితిమి యిట మీకు వార్తలు మేను
అచ్చట గల మహిమ లన్నియు
జెప్పెదము
ముని శిఖామణి గౌతముని
వనం బొకటి
అనియేక విస్తీర్ణ మయి యుండు
నందు
పొలుపుగా వృక్షములు పూచి
కాచియును
ఫలియించి ఫలములు పక్వమయి
యుండు
జాజి పూ పొదకింద శయనించి ధరణి
రాజుయై బొల్లివు రంగుగా యున్న
తుమ్మెదనాదములు దొరకొని శాయ
కొమ్మలపై జేర కోవెల ధ్వనులు
చెలగి రాగములెల్ల చెల్లించి పాడ
చిలుకలన్నియు రామచిలుకలు బాడ
నెరి మయూరము లెల్ల నాట్యంబు లాడ
కోరియు శేషుండు గొడుగుగా బట్టి
చేరి యా మృగములు సేవ యొనర్ప
గోవురూపమైన యాగోపాల మూర్తి
మార్గమంతయు జూచి మళ్ళివచ్చితిమి
బాగుగా యీ వార్త ప్రౌఢత మీకు
తెలియజెప్పితి'' మన తెలిసి
వారలకు
శలవిచ్చి పొమ్మని చేదండ నున్న
పరిచారకులతోడ పలికె నలనన్న
''వినుడి తలవరులను వేగంబె పంపి
గొల్లకొని ఘూ లక్ష గోపాల ధరుల

యెల్లి ప్రొద్దుట వెళ్ళ ననియేకభక్తి
బొల్లేవు వేడుకో పావలె వేగ
పైనమై బిరుదులు పదిగెల తోడ
ఆయుదంబులతోను ఆయత్త పడుడీ
పదిలమై నొక కొంత బలములు
నిలిపి
కదలక మందలు కాపాడు మనుము"
అనిన రాజుకు మ్రొక్కి
ఆ పనులవారు
ఘనమైన తలవరుల గ్రక్కున పిలిచి
ఆవులన్న అనుమతి నంపి రా క్షణమె
వేవురు తలవరులు వేగంబె బోయి
చెప్పంగ దొణగిరి కానలకెల్ల
"చొప్పుగా వినరయ్య వొగి
సూరులార!
గోవిందు బసవన్న! గొళ్ళ నారన్న!
ఆవు పువ్వుల మారు! అచ్యుతుని
కేతు!
పంకజ నబ్బొళ్ళు! పైయ్యావు శేషు!
శంకర భూపతి! చక్రాల చెందు!
కల్వాల కనకమా! కనకము రంగ!
నవ్వీర శూరుడా! నరహరి నాగు!
ఆసురేశు వైకుంతుడన పరశురాము!
పొసగంగ రఘువీరు! పువ్వుల మాచు!
మదన గోపాలు! మర్ల పిన్నయ్య!
సదయుడౌ వోభళ! చన్న గోపాళ!
పుల్ల భూపతి! పుల్లయ రంగు!
ముల్లోకములువున్న మురహరిపద్మ!
గాంగేయ వెంగళు! కనకపు వెంగు!
బంగారు గొట్టడి! బలభద్ర రాము!
మురహరు జడదారు! ముంగర భీము!
పర వుపకారి వో పయ్యావు శంభు!"
దేవుడావుల గాయు ధర్మవర్తనుడు
కావడి కదురును కదు ఆదిగాను
పిలిచి వారలతోను ప్రియ
వాక్యములును
పలికిరి తలవరులు ప్రఖ్యాతిగాను-
"వెరవుగా బొల్లేవును వేడుకోవలసి
ధరణీశు నలనన్న తన బలంబులకు
రేపు ప్రొద్దటివేళ నెర యోధలెల్ల
మెప్పు మీరను గూడి వెడలి
రమ్మనెను
కొంత యాదవదళము గోకులాన
నుంచి
పంతగించిన క్రియ పైనమై రండి"
అని వారికిని చెప్పి ఆ తలవరులు
వినుపింప నలనన్న విమలుడై
యుండె
అంతట సూర్యుడు అస్తాద్రి కరిగె
అంత కంతన చీకటై తోచె భువిని
కలువలు వికసించె కమలముల్
ముణిగె
కలువల రాజు వెన్నెల గాయ దొణగె
మదనుడు వేటమార్గంబుగా వెడలె
సదయుడై యున్న యా జనపాలు
డంత
కొలువులు జాలించి కొనిభక్తితోను
జలుక మొప్పగ నాడి జలువలు గట్టి

అంరుచు శివపూజ అతివేగ సల్పి
పొలుపుగా లేచి సంపూర్ణ కాంతలును
అమరంగ భోజనాలు చేసి ఆ రాత్రి
వ్రతము
క్రమమొప్ప శ్రీరామకథలెల్ల వినుచు
నడిపె నాల్గు ఝాములు నతిభక్తిచాత
గడిచె నంతట వేగ గ్రక్కునన్ తూర్పు
తెల్ల వారగ చుక్క తేటగా బొడిచె
పలుచనై నక్షత్ర పంక్తియు నణిగె
కొండ తూర్పున నెక్కె కోరి
భాస్కరుడు
మండలాధీశ్వరు మరి వేగ లేచి
స్నానంబు గావించి ధవళ వస్త్రములు
నానందముగ గట్టి నలనన్న యపుడె
సరగున సంధ్య వందనము గావించి
కరమొప్ప నీమంబుగా లేచి రాజు
పొసగ భూషణములు పొందుగా బెట్టి
రసికుడై తన మరిది తను జేరి గొల్వ
కొలువు కేతెంచియు గూర్చుండి వేగ
దళవాయి బిలిపించి ధరణీశు డనియె
''పరగిన యాదవా బలములు నేడు
వరుసతో పైనమై వారేగుదేర
త్రిజగంబు లెల్లను దిగులుకొనంగ
విజయంబు గొను రణభేరి వేయించు''
అని వారికిని జప్ప నా క్రమంబునను
మనుజనాథుని యాజ్ఞ మదిలోన దెలిసి
భీకరంబుగ రణభేరి మ్రోగించె
గోకులాపతులెల్ల గొబ్బున వినియు

## కాటమరాజు తన పరివారముతో బొల్లావును దర్శింపనేగుట

తనుమీద వ్రతములు తమరంతసల్పి
అమితవైభవముల ఆయుత్తుపడియు
పటు భటావులతో పడిగెలతోను
కస్తూరి గంధము కనకగిన్నెలతోను
విస్తీర్ణముగనుంచి విరజాజి వన్నె
కుంకుమ జవ్వాజి కురువేరు పచ్చ
బుర్కాయి గందపొడి
పునుగు మైసాక్షి
అగరు గుగ్గిలమును అడిగా వేగ
పగడపు పల్లకీ పట్టించి రాజు
అచ్చమ బంగారు అమరు పాలకిని
పచ్చవిల్తుని తండ్రి భక్తుడు యెక్కి
పచ్చల పాలకీ పద్మరాఘవుడు
హెచ్చుగా అపరస యెక్కె నవ్యాళ
యరనన్న ఆ సరస యెక్కె
పాలకియు
సరస గదిలెను వారి చట్టువారి
యఱ్ఱయ్య
వేగరవె పాలకి యెక్కిరా వెనుక
బాగుగా నడిచిరి బలములు పెక్కు
సవరణములు చాల జర్గి గొడుగులును
నవనీశ్వరుని వెంట నడిచె వేవేగ
కట్టాణి ముత్యాలు గట్టిన జల్లి
పట్టు గొడుగుల గదిలె
పద్మరాఘవుడు
గురుపోత్తు సవరాలు కూర్చిన జల్లి

యఱ్ఱ గొడుగులతోను యరనన్న
గదిలె
వెలలేని ముత్యాల వెల్ల గొడుగులును
విలసిల్లగా గదిలె యఱ్ఱయ్య వేగ
వందిమాగధులు కైవారంబు శాయ
సందడింపుచు పరిజనములు గొలువ
శంఖాలు గమడీలు చలగి బూరుగలు
బింకంపు నభేరీలు బిరుదు కాళెలను
రంజిల్లు పీణెలు రజిత దండెలును
గోవింద పీణెలు గొప్ప పీణెలును
భావింపరానట్టి బ్రహ్మపీణెలును
దండెలు పీణెలు తరచు కిన్నెరులు
మెండైన రావణ మేటి హస్తములు
భేరీ ఢమామీలు పెద్ద గౌళులును
బూరలు ధారలు భోరు కలగంగ
శ్రీ విష్ణుపదములు చిత్తాన నిలిపి
భావంబులో రామభక్తుడై బాజు
దీనుడై వేవేగ ధేనువులున్న
కానసంబున జొచ్చి కామధేనువును
కనుగొని నప్పుడు కనుచూపుమేర
కనక పల్లకులును గ్రక్కున డిగ్గి
కాట భూపాలుండు కడువేట్కతోను
కోటి యాదవులును గోవింద యనగ
స్వస్తి వాచనములు చదువుచు
వేట్క
ప్రస్తుతింపుచు మంచి
బ్రాహ్మణోత్తములు
వంది బృందములు కైవారములు
శాయ
అందంద శ్రీరామ యనుచు
తాళములు
దాసుల కైతాళ దండెల ధ్వనుల
వాసిగా పాడి యాడుచు వచ్చువారు
మంతనంబున వచ్చు మంది
సందడులు
వింతగానాలించి వినియు బొలేవు
వాసన పసిబట్టి వడి వేగ లేచి
శేషు పడిగెల క్రియను చవులు
నిక్కించి
నలు దిక్కులును జూచి నరనాథు
జూచి
బలువైన యా సైన్య భావంబు దలచి
గొడుగులు పడిగెలు గొప్ప
టెక్కెములు
తడబడి గొనివచ్చు దళముల జూచి
యదు కులాధిపుడని యెరిగి బొల్లేవు
మదిలోన యిట్లనియె:
'మహిపాలు డిటకు
తనుమయ్య కలహంబు తాళియుండగను
నను వేడగా మది నాటి నేనున్న
యీ వనంబున కొచ్చె యాదవరాజు
భావింపగా మనకు పగవాడు కాడు'
అనుచు బొల్లెవును యప్పటి వలెనే
తన యిరువున చేరి తా పవ్వళించి
యుండిన కాట భూవీరాగ్రగణ్య
మండలాధీశుండు మరిది రఘుపతియు
పోయి యా బొల్లెవు పుణ్యాశ్రమమున
ధాష్టంగ ధనుదెంచి దళములు తాను

చూచి యా వనమున చోద్యా మెన్నుచును
పూచిన యా జాజిపొద నీడనున్న

## కాటమరాజు బొల్లావును అలంకరించి పూజించుటు

ఆవును గనుగొని అతిభక్తితోను
ఆవులన్నియు మ్రొక్కి ఆవు పాదములు
పాలేటి వుదకాన బాగుగా గడిగి
నీలాంబరుని మదిని నిలిపి యంతటను
బంగారు పళ్ళెముల బట్టి తీర్థంబు
శృంగారముగ మరిది చేతి కందియ్య
బలముల కెల్లను పద్మ రాఘవుడు
సలలితముగ సమముగా తీర్థమెల్ల
పొందుగా వడ్డించె భుజియించి రంత
అందరు కొనియాడ నలన్నన్న యిపుడు
పట్టు వస్త్రమును చేపట్టి యవ్వేళ
బట్టుగా బొల్లెవు పాదములు తుడిచి
కాటమరాజు తన కన్నుల నద్ది
వాటముగా ఆవు వరభక్తు డపుడు
స్థిరముగా ఆవుకు తిరుమణి బెట్టి
తిరుచూర్ణ మా నడుమ తీరుగా దీర్చి
వురమున శ్రీగంధ మొనరగా నలది
కరమొప్ప నవరత్న కంఠహారములు
వన్నెగా బంగారు వనమాల పేర్లు
సన్నపు గురుమ్మ్రగ జల్లులు వేసి
ముత్యాల పేరులు మోముపై జార
రత్నాల పేరులు రహిని మై మెరయ
శంఖు చక్రములును స్థిరముగా మెరయ
పంకజనాభుని ప్రభలు చాలికలు
వురవున దిరిగిరా వురుగబ్బు పేర్లు
గంగడోలు దిరిగిరా ఘంటల పేర్లు
నాలుగు పాదముల నాదు టందెలును
కొమ్ముల బంగారు కుప్పె ధరియించి
ధేనురూపము దాల్చు దివ్యమూర్తికిని
సాంబ్రాణి ధూపంబు చయ్యనవేసి
పశుపతి నలనన్న ప్రార్థింప దొణగె:

## కాటమరాజు బొల్లావును తనకు యుద్ధమున సాయపడుమని ప్రార్థించుటు

"దేవ కృపాంబుధి! దేవేంద్రవినుత!
కావగా దయసేయు కరుణాసముద్ర!
పదినూరు జింహ్వల ఫణిశేషమూర్తి!

సదయుడౌ మిము బొగడ జగతిపై
మాకు
కార్యంబు చేకూడె కల్లిమధ్యమున
భావంబు చేపూని పగతులనెల్ల
చంపుమీ త్రుంపుమీ సర్వేశ యీశ।
పంపుమీ మీదైన పటు కటాక్షమును
మచ్ఛమై సోమకు మర్దించి మగుడి
తెచ్చి వేదములిచ్చు దివ్యావతార।
కూర్మావతారమై కుధరంబు క్రింద
నిర్మల మతితోడ నిలిచిన దేవ
ధరణి హిరణ్యాక్షు దట్టించి చంపి
ధరకొమ్ము నిలిపిన దాక్షిణ్యమూర్తి।
నరసింహమూర్తివై నఖదైత్యుజంపి
అరసి బాలుణ్ణి గాచినట్టి దేవుండ
యిల దానములు మూడు యేలమి
నడిగియును
బలు చక్రమూర్తిని బదిరి మార్చితిని
కార్తవీర్యుణ్ణి బట్టి గర్వంబు నణచి
వార్తకెక్కిన యట్టి భృగువంశ
తిలక।
కయ్యాన నా దశకంఠు కంఠముల
విదళించినట్టి యో వీర శేఖరుడ।
మదగర్వమున నంటి మామను కంసు
పదపడి చంపిన బలభద్రమూర్తి।
తరుణుల మానంబు తరిమి గైకొన్న
పురములు గెలిచిన బృందావతార।
యలమి లోకములెల్ల యిట్టు రక్షింప
గలవాడ వవుదువు కలికావతార।
అంచితంబుగ నీదు అవతారమహిమ
యంచగా నలవిగాదు యవ్వరికైన
కేశవ రూపంబు గిరి యెత్తినట్టి
నీ శరీరము నందు నిలిచివున్నదియు
పన్నుగా తగరూపు యెన్నగానట్టి
పదములు శిరములు పరియంత
మందు
ముద మొప్ప జగతి త్రిమూర్తులు నీవె।
కడు వేగ నీమోము గరుడని రూపు
నడుమ జూచిన నీవు నరసింహ్వా
రూపు
పక్కను జూచిన ఫణిరాజు రూపు
వెనుకను గనుకొని వివరించి చూడు
హనుమంత రూపుగా అమరి
వున్నదియు
అవనిపై నాలుగు అవతారములును
భువన భీకరుడవై వుండితివి దేవ।
యిలలోన బొల్లేవు అనియెడి పేరు
చలమున రిపులను చంపుదువయ్య
బ్రహ్మయు నీమోము భావించిచూడ
నిర్మల సుజ్ఞానులయిన నీ పొదుగు
క్షీరాబ్ధిగా అవని జనులు యెన్నుదురు
ధారుణి నీ కొమ్ము తపస్యేంద్రులెల్ల
హరిహరాదుల బోల్చి అమర
నెన్నుదురు
గొరసాలు వరుసగా
గొనియాడచుండ
అష్ట దిక్పాలకులు అందురు పొగడ
శ్రిష్టి యెల్ల యెరుగ చెలువంద నీవు
మమ్ము బ్రోవ నుంటివి మాధవమూర్తి

మిము గొల్చి యున్నాను మిము
జూచినాను
గొల్లరాజును నేను కోర్కె మీరగను
పల్లవాధిపునితో పగ బెఱికి వస్తి
నా పగ లీడేర్చ నన్ను రక్షించు
రేపు నాలుగు జాములు రేవులకాడ
మాపు నాలుగు జాములు
మందలకాడ
యెక్కడ పగవారు యెదురైనచోట
ఫ్రుక్కన పగవారు కదలి రాకుండ
పిల్లగొరెసెల నీవు భీతి పొందించు
వాలాన కొందర్ని వడిజుట్టి చంపు
కొమ్ముల కొందరిని కోరాడి పొడుచు
చిమ్మగా రక్తము చీరి వెంటాడి
జగతిలో నీ కీర్తి జనులెల్ల పొగడ
పగ నిర్వహించుమీ సంతాన సురభి!

## కాటమరాజు బొల్లావును తోడ్కొని వచ్చి శాణ్యమున నిలుపుట

యనుచు యాదవరాజు యప్పుడు
మ్రొక్క
కనుగొని బొల్లేవు కడు సంతసిల్లి
పగయెల్ల తనదిగా భావించి మదిని
తగ మోదములతోడ ధగణీశు జూచి
అగ్గలంబుగ అమృత పూరంబు
లొలుక
దిగ్గున తా లేచి దేవతాసురభి
నిలిచెన న్నలనన్న నిమిష
మాత్రమున
సలలిత వైభవం బలర మోదమున
కొమరొప్ప ముత్యాలగొడుగు బట్టింప
రమణీయ్యముగ ఆవు రంగుగా కదలె
చామరంబులు వెల్ల ఛత్రములు బట్టి
శ్రీమంతులై రాజశేఖరులు నడువ
కాళ్ళను అందెలు-ఘల్లుఘల్లు అనుచు
తాళమానంబుగా తగు వేట్క మ్రోప
ఘనమైన శంఖములు కనక
తప్పెటలు
ఘన మృదంగంబులు కర్ణచిరవులు
వేణునాదములును వీణె నాదములు
ప్రెణితింప భేరులు పెద్ద బూరుగలు
ధారుణి వణకంగ తమటంబు లాది
చేరి యిరు గడలను చెలగి మ్రోవంగ
గోవురూపంబైన గోపాలమూర్తి
ఆరూఢి ఆ తావు కట్టు లేతెంచి
అచ్చోట యెత్తిరి అసుర మోములడి
యెచ్చు అయిన వక దేర యింపు
సొంపలర
పరుపు దిగువన వేసి పట్టుతివాసి
పరచిన బొల్లి ఆవు పవళించె నంత.
ఆవుకు శాణ్యములు ఆరు యేర్పరచి

ఆవు వినగాను అవులన్న యిట్లనియె
"అడ్డావు కట్టయు, అమల చెలికె
తుండి లింగముకొండ, తూము ల
యేరు
పుచ్ఛముల పాలెము, పొమ్మనవుంట
యెచ్చువై వలుగళ్ళ యేనేవు తరుచు
యెదురుల చెరువును యెలమి
ఆదిగను
వదలక కాపాడ వలనయ్య!"అనుచు
ధరణీశు మ్రొక్కిన తలయెత్తి ఆవు
వరమిచ్చి పొమ్మన్న వసుధీశ్వరుండు
యరగడ్డపాటికి యెత్తి చనె నంత
.... ... ... ...
తమకంబుపై నెక్కి తన మరిది తాను
కొమరొప్ప కూర్చుండి కూరిమిచేత
మరిదివంకన జూచి మండలాధిపుడు
కరుణతో పలికెను కల వాక్యములను:
"అరుదైన ఠాణ్యంబు ఆవుకు అమిరె
యెరువుగా ఠాణ్యంబు యిరువుగా జేసి
సాగలకొండ జనార్దుని యెదుట
బాగుగా పిన్నయ్య బలములు నిలిచె
చిల్లర ఠాణ్యాలు శీఘ్రమేర్పరచ
వలనయ్య వో మరిది! వనర
యాదవుల
పిలువు నంపు" మటన్న ప్రియ
వాక్యములును
అలరుచు నాయుండు యాదవుల
జూచి
పనికి వారలనెల్ల పైనంబుచేసి

## పద్మనాయుడు చిల్లర ఠాణ్యములను ఏర్పరచుట

'మరిగుంట ఠాణ్యనామము అవులన్న
నగ్రావుల నీవు నని మొననుండి
గుర్రాల నీటెల గొంకక పొడుపు
... .... ....పార్థివ జలముల నీవు
మందలావులతోటి మన్నీల నెదిరి
పెండ్యాల యెద్దుల పేరుకల బలము
అండబాయక నిలిచి ఆలంబు నెదిరి
కడువేగ వేయరుల కదిసి
పొడిపించు
యడపక సంగన! అతివేగ బొమ్మ
అమిత విక్రమశాలి అల్లాడి పరశు!
కొమరొప్ప లింగాల కొండపై నుండు
(కలి) కుల ముమ్మన్న!
గద పంజతోటి
యెలుకొండ దాలుకన
యెందుకు మాట
మునిమాడి పాలన, పోని నీ బలము
దామిసెట్టి చెరువు దాపున నుండు
సమమైన బలముల సమకూర్చి బాల
హరిశ్చంద్ర భార్గవ! అల శానతోటి
దరిమడుగు దిక్కున తగ వేడ్కనుండు
కరివరద! నీదైన కలమూకతోటి

కరియెద్దు కురువను కదలకనుండు
రాచెర్ల కృష్ణమః రంగుగానీవు
రాచగుళ్ళపాటు రమణతో నుండు
యెక్కువ మారెల్ల యెలనాగ! నేడు
చలువొప్ప నీవుండు శానలతోడ
కొప్పుకొండ నె త్తమున
కొమ్ము కసినేడ
వొప్పిన మూకతో వొనర నీవుండు''
అని యిట్లు నాయుడు
ఆడు వాక్యములు
విని వారు పయనమై వేగంబె పోయి
తమ తమ తాణ్యాలు తగు
మోదమునను

అమిత వైభవముల అటు నిలచిరంత
అక్షోహిణి యెద్దులు ఆదూర నిలచె
రక్షించు కాటమరాజు చేరగను
నలుగు టెద్దులతోడ చట్టు వారెఱ్ఱు
యలమితో నిలిచెను యఱ్ఱగడ్డపాట
కొదవ లేకుండ యా గోపవర్గంబు
యిన కులాధిపునకు యిరుగడల
కొలువ
బ్రాహ్మలు దీవించ భట్లు పొగడగను
అమ్మహిపాలుండు నలకొలువై య్యె
మండలాధిపుడైన మరిది రాఘవుడు
దండిగా యుండిరి తగు వేట్కనంత

## పెరినీడు గోసంగి పేరులతో కొలువు దిరుట

అంత నా పంచముండగు
భట్టు యెన్న
వింతగా పటు పరాక్రమము వేమారు
కొనియాడ జగతిపై గోసంగి
బలుడు
ఘన బలోన్నతుడగు గతి బీరినేడు
శివసేవకుండగు శివ నాగమయ్య
నవుధరించిన కులనాయకోత్తముడు
పినరంతు పెదరంతు
బీర్నేని తమ్ములు
వినతి యిరుగడలను వెలసి
కొలువగను

చినగబ్బి పెదగబ్బి చెన్నుసోదరులు
ఘనముగా బీర్నేని కదసి
కొలువగను
పరగ పాడావుల పాలన్ని ద్రావి
పెరిగిన చిన్నయ్య ప్రేమతో కొల్వ
గంట గంటల బోడిపాగ సింగిలియు
విజయ శూరులును బొగ్గండు
... ... ... ...
అడ్డకత్తియు పెబ్బులిదము కన్న
పొడుగుత్తి చెన్నయ్య మొదురుల
బొమ్మ

ముర వైన మురుగులు ముత్రికి
ముసులు
రొంప గందమనేడు రుద్రకోటి కొండ
కెంపుల కొమ్మినేడు కోళంపు దింగు
వాలుక త్తియు నుసివి వరమూదినేడు
... ... ... ...
గచ్చుటరుగుల గంధ కల మబ్బినేడు
నిశ్చలవ్రతు నిమ్మ బోడయ రంగు
పెదగు త్తి పాపడు బెబ్బులి మాదు
సదయుడ చన్నమ సదరికి నేడు
గుదిపెట్టి గొండడు గుడ్డూరి పోయి
కదకంపు విట్టలి కడు పోతినేడు
కనకపిడి యాపు కారుపోతుల నాయి
పినక త్తియును కారు
పెనుగొండ మాచు
అరిగ కుంభల మేడి అనమడి పోలు
సురక త్తియును చెన్న మాచు
అక్కినేడు
జమిడిపొగల బొమ్మ చోకరాల
పోతు
కొమర గిరియును కారుపైమతిమారు
వీరలు మొదలైన వీర గోసంగులు
ఆరువేలును గూడి ఆ బీరినేని
కొలువంగ సిరిదేవి కూర్మినందనుడు
కొలువగా గూర్చుండి కులభటుల
జూచి
సమర నిశ్శంకుండు
సాహసోన్నతుడు
అమిత విక్రమశాలి యగు బీరినేడు
తనకైన భటులతో తానును యిట్లనియె:

## కాటమరాజు తనకు తాణ్యామియలేదని బీరినీడు చింతించుట

"వినుడి సాహసులార!
వివరంబుగాను
ఘనుడైన నలనన్న కాంతిచంద్రుండు
ఆదిమూర్తి యైన ఆవుకు మొన్న
పాదచారై పోయి బాగుగా మ్రొక్కి
అనువైన తాబ్యాన ఆవును నుంచి
మనుజనాథుండును మన్నెరాజులకు
పనిబూని తాబ్యాలు బాగ యేర్పరచి
మదిలోన నలనన్న మరిచెనో నన్ను
అలనాడు మాయమ్మ అమ్మ నూకాంబ
నలనన్నకును జెప్పి నన్నప్పగించె
అన్న! నీ తమ్ముండు ఆదరంబుగను
మన్నించమని చాల మనవిగా జెప్పె
ఆమాట తప్పక ఆవులన్నియును
మామీది జ్ఞాపకము మరిచెనో! లేక
యన్నడు యుద్ధంబు యరుగడు
యనుచు
చిన్నవాడని పంప జాలకున్నాడో!
జగతంబు యన్నడు కాయలేదనుచు
పగవారిపై నన్ను పంప కున్నాడొ!
యెప్పుడు పగవారు యెదిరింప వెళ్ళ
అప్పు డంపుదమని అటు వుండెనేమొ!

మనసులో మర్మంబు మనకెట్లు దెలుసు?
రాజానంకదలె.... ......

యీ రెండు వార్తలు వేగంబె తెలిసి
ఆమాధి వక రాణ్యా మడిగి వత్తాము"

## బీరినేడు తన గోసంగి దళముతో కాటమరాజును దర్శింప నేగుట

శివపూజ చేసియు శివునకు మ్రొక్కి
వివరమున సొమ్ములు వేట్క ధరియించి
చెవులను ముత్యాల చౌకట్ల జోళ్ళు
నవరత్న ఖచితమౌ నపరంజి పైడి
పతకము మొలనూలు బన్న సరములును
అతికమౌ పేరులు అణి ముత్యములు
కుచ్చెల కుళ్ళాయి కులుకు నెమళము
పచ్చల కడియాలు పసి దుంగరాలు
రం గైన మురుగులు రత్న హారములు
బంగారు మొలతాడు బాగుగా నింప
తెలి వైన మొలదట్టి తిలకంబు బొట్టు
పొలుపుగా బంగారు పువ్వుల కాలు
భైరవ బలుదును బహు పీర వరుడు
సొరుగా బిరుదులు సమర శేఖరుడు
గానుకొని మాతంగి గోత్రపాలుండు
జనులెన్నగా నుర్వి జాంబవకులుడు
పిరన్న వరపుత్ర వినుత సాహసుడు
బీరన్న యను పేరు పృథివిపై పొగడ
యిగోవొంద అర్ధనారీశ్వరు జల్లి
బీరన్న ధరియించె బిరుదు.

అన్నియును
తమరంగ గోసంగు లందరు నపుడు
తమ బిరుములన్నియు ధరియించి రంత
కొమరొప్పగా నంత క్రొత్త చల్లడము
రమణీయ్యమగు చంద్రకావి దట్టీలు
పులితోలు బిరుదులు పూని కాశలును
చెలు వైన సరిపెనలు చెంపగంధాలు
గాటంపు టరిగెలు గంట గాలములు
నీటైన కుడిసిగలు నిలువు నామములు
సిగల పువ్వుల చెండ్లు సింహామరిగెలును
వకకాల వరిగేటి వారుగు రుమాళ్ళు
వరలు గోసిన కత్తు లొనర చేపట్టి
కిరుచు చే కత్తులు గీరు గంధాలు
పులిచర్మములు మంచి జోడు ఘంటలును
తలకొని వాల చర్మములు చక్రములు
పొగడ పచ్చలపేర్లు భుజ బంధములును
తగిన గవ్వల పేర్లు దండ కడియములు

యెలుగు తలాటములు వేట్క
భుజములు
యెలుగు చర్మములును యెన్నగా
కటిని
యెడఫక బిరుదు లన్నియును
సవరించి
యెడమ చాతన కొమ్ము
యిరువొక్క వేర్లు
కోపంబు చూపును కోర మీసములు
దాసిన నవరత్న దండ కడియములు
రంగు మీరిన వన్నె రావిరేకలును
... ....మెడ పెను నేవళములు
వాలు గత్తులు సన్నవలిపె దుప్పట్లు
చెలువొప్ప సవరించి చెలగు
తప్పెట్లు
అప్పుడు మోయింప ఆగుభుగులు
గాను
తప్పెట ధ్వనులకు తాళమానముల
అడుగుల చిందుల నాడేటి వారు
ఆడుచు హరి హరాదుల
పాడుకొనుచు

వేడుక గంతులు వేసేటివారు
ఘనమైన సింహ్వాంబు గచ్చుటరి
గెలును
మొనకత్తి ఝళిపించి మురిసేటి
వారు
అడ్డకత్తులు ద్రిప్పి అంత మెరుపళ్ళు
అడ్డ బెళుకులతోన అటు వచ్చువారు
కత్తులు ద్రిప్పుచు కరుల కై వడిని
మత్తుగా మసలుచు మరి వచ్చువారు
మొత్తమై గుమిగూడి ముందర
నడువ
మెరసి గోసంగులు మెండుగా
నడువ
బిరుదుల నీడను బీరన్న కదిలె
గబ్బిలి రంతుల కదసి కొల్వగను
గొబ్బున నలనన్న కొలువు కేతెంచి
మండలాధిపుడైన మహిపాలునకును
దండమొప్పగ బెట్టి ధర సాగి
మ్రొక్కి
ముకుళితంబుగ నిలిచి ముదముతో
ననియె

## బీరినీడు కాటమరాజును తాణ్యా మడుగుట

"సకల జీవాధార! సజ్జనోద్ధార!
ఖగపతి బిరుదులు గల మహారాజు
రవితేజ! యాదవ రాజన్య చంద్ర!
వివరముగ వినుడీ నా
విన్నపం బొకటి

చల్లవారేవురు సాహసోన్నతులు
చల్లగరిగల వేగ సరుగున నిలిచె
బోగమపాటను బొల్లేవు యిప్పుడు
బాగుగా నిలచెను పగరుల జంప
మరియు యాదవులకు మంచి పేరైన

ఆరుద్రైన రాజ్యాలు అందరికి అమరె
ధరణీశ! మాకొక రాజ్యమేర్పరచి
పరగంగ విడమిచ్చి పంపుమీ నన్ను''
అనిన కాటమరాజు అల్లున నవ్వి
తన మదిలో నున్న దయతోడ
పలికె
"విను వీరి నాయుడా! వివరంబు
గాను
నిను బంప కార్యంబు నేడేమి గలిగె?
అమ్మ నూకాంబిక అలనాడె నిన్ను
సమ్మతంబుగా నిచ్చి చయ్యన బంపె
ఆ తరి నూకాంబ అనియె నొక
మాట
ఇతడు నీ తమ్ముని హితవుగా
జూచి
ఇతడు మన్నన బంటు యితడు
శూరుండు
ఇతని బాహుబలంబు యెన్నుదురు
జగతి
పురుణించ మీ తండ్రి బోలురాజపుడు
చెరుకూరు కాండెమున చెల్లిన వెనుక
పగవార్లు ఘుందలై బలములు
గదియ
జగడాన నెదిరియు జంపి పగతులను
మడిసె నంతట
మసిలి నాయిని భార్య
కడు మసిలమ్మన ఘనపుణ్య కాంత
పైనమై గుండాన పడనురుకు వేళ
వైనాన యీ శిశువు వప్పించి మాకు
యిచ్చిన యీ శిశువు అయిన
దాదులచే
జలపింప పదములు రెండు పరువళ్ల
నేర్చ
జగతిపై గోసంగి జాంబవకులుడు
పగవారిపై నితని పంపగా బోకు
నిను మొయ్య కార్యంబు నెన్నడు
గలదు
పనిగల వేళను పంపుమా యనుచు
అమ్మ చెప్పిన మాట అతిగడువ
వలదు
తమ్ములు సిద్ధిరాజు దళము లేతెంచి
చెప్పరాని యిద్ధమును చేసేటి వేళ
అప్పుడు ఆరజాము ఆలంబు కాయ
వచ్చెద వటు నీవు వధరిన బలము
యివ్వుట ఆ సౌద యే లగ''మ్మనిన
నలనన్నతో వీరినాయు డిట్లనియె
"తెలియ జెప్పెద రాజు లేటిగా
వినుమ
యన్నగా శత్రువుల్ యెదిరిన వేళ
వెన్నిచ్చి వచ్చుట విహితంబు గాదు
పట్టదగ వచ్చిన పగవాని కన్న
అట్టట్టు జుణుగక అటు కాళ్ళ మనక
ఘట్టిగా సత్కీర్తి గైకొనవలెను
యట్టి వానికి భువి నిదియె పద్ధతియు
పగవారి పొడగని పారిపొయ్యేటి
తగవు గాదిది వీర ధర్మంబు గాదు
పంతగించిన రిపుల బరిమార్చకున్న
వింతగా శత్రులు యెన్నుదు రవని

చిన్ననాటను నుండి సిరిదేవి మమ్ము
మన్నించి పెంచిన మన్నడ బంట
పగవారు వినినను పనికి రాదనుచు
నగియేరు పురజనుల్ నను జూచి
దాల
మనుపు మీరెన్నడు ముదమొప్ప
నన్ను
ఘనముగానే జూడ కలహంబు గలిగె
యేడు తరముల పగలు యిట
రాకమున్నె
నేడు తాణ్యము మాకు నేర్పడ దెలిపి
కరుణతో శలవిచ్చి కడు
ప్రియంబునను
పరదశముపై నీవు పంపుట లెస్స
అప్పుడావుకు తాణ్య మేర్పడ
నిలిపితివి

అప్పుడే నా తాణ్య మమర కుండినను
దక్షిణాధీశులు తర్లి వచ్చేరు
యీ క్షణంబున మమ్ము యిప్పుడే
బంపు
బ్రహ్మాది విష్ణువు పరమేశ్వరాన
బ్రహ్మ ప్రభావంబు బసవేశ్వరాన
నమ్మిన బొల్లేవు నరహరి యాన
అమ్మ నూకాంబిక ఆగుమంచి యాన
నిరుపమ గుణశాలియగు పాపయాన
యరఅప్ప యాన... ... ... ...
పల్ల ఇడలును గల భక్తిరన్నాన
బల్లిదుండగు రఘుపతి పాదమాన
ఆలనాడు శ్రీకృష్ణ దరిచేత పిడుగు
... ... ... నపాలయుని''

## కాటమరాజు బీరినీనికి మంగల్లిపాడు తాణ్యమును నిర్ణయించుట

బీరన్న మాటలు ప్రేమ నాలించి
మారుమాటాడక మహిపాలు డపుడు
కొంత యాదవ బలము గొబ్బున
పంపి
వింతగా యా కత్తి వేగ నిప్పించి
వప్పుగా ఆ కత్తి వర్ణించె రాజు
..........................
"పృథివిలో నీ కత్తి పిడి జూచిరేని
కుదురుగా జనులకు కుధరమై తోచు

మొనవంక జూచిన మొనసి
శత్రులకు
ఘనమైన సింహ్వంబు ఘాతమై
తోచు
ధార జూచిన కత్తి తగు
శత్రులకును
ఆరూఢి వజ్రాయుధంబుగా తోచు
పెనక జూచిన కత్తి పెంపు
తోడుతను

గానకొన్న బలితంపు కోరమై
తోచు''
అటువంటి కరువాల మపుడు
పూజించి
తటుకున నలనన్న తమ్ముని కపుడు
కర్పూర విడియంబు కరవాల మిచ్చె
వొప్పుగా గోసంగు లౌనరశూరులకు
నేర్పున విడియముల్ నెరివేగనిచ్చి
అప్పుడు భూపాలు డనియె
నంతటను
''విను వీర నాయుడా!
వివరంబుగాను
అని మొన వైరుల హతము
సేయుటకు
విరివిగా నిను గొలుచు
వీర శూరులును
పరగంగ మంగల్లిపాటను నిలువు''
అని వీరనేనిని యా చెన్ననేని
పనిచిన రాజుకు పద్మరాఘవునికి
అప్పు డందరు మ్రొక్కి అచ్చోట బాసి
పంపుతో మంగల్లిపాటికి వచ్చి
నిగనిగ మను పట్టు నీలి గుడార్లు
పగవారి కెదురుగా పరగ యెత్తించి
చెలువొంద పట్టు జముకాళముల పైని
కొలువుండె వీరన్న
కుల బాంధవులతో.

(అసంపూర్ణము)



# భక్తిరన్న కథ

## (ప్రత్యంతరము)

### అవతారిక

శ్రీ కంటు మదిలోను చెలగి ప్రస్తుతి
చేసి
చేకొని శ్రీహరుని చిత్తాన దలచి
పంకజగర్భునకు ప్రణమిల్లి మ్రొక్కి
పొంకముగ శారదను బుద్ధిలో దలచి
అతులిత కవిరాజుల అందరిని దలచి
మదిలోను రేణుక మాతకు మ్రొక్కి
యేకదంతుని మదిన యే
ప్రొద్దు దలచి
మాకు భాగ్యము లొసగి మహిలోన
వెలసి

గరిమతో దొనకొండ గంగను దలచి
హరిహరాజుల కృపను యాదవ
పుణ్యకథయు
జగమందు వెలయంగ జనులు
మెచ్చంగ
శ్రీగిరి మల్లప్ప సేవా ధురంధరుండు
భక్తుడు పర్వతాన పట్టిన వ్రతము
సత్యంబు చెప్పేను జనులార!
వినుడి

### భక్తిరన్న శ్రీశైల పర్వతము మీద జపములో నుండుట

సుక్కల పర్వతాన సూర్యుల
మటము
యెక్కువయిన పర్వతంబు
యేలేశ్వరంబు
కామని గుండంబు ఘనలింగ వీడు

హేమాద్రి గిరుల నడుమ
యింద్రకీలాద్రి
శిగినేశ్వరంబు[1] చెలువయిన
మహనంది బుగ్గ
అటుకేశ్వరంబు[2] పురహరుని
కృపను

---

1. శిశిరేశ్వరంబును (పాఠాంతరము)
2 అధికేశ్వరము (పాఠాంతరము)

భూతాళకును వోయిగు
బొబ్బ లీరన్న
పాతాళగంగ యా భ్రమరాంబ
మఠము
గంగలో బసువన్న ఘనమయిన
కొండ
భృంగి నాట్యకుండు పుట్టలో యిరవు
దాతను జింకపిల్ల శిరస్సున యింతి
మతిశాలి నందుల మఠము
పదమరాను
మరివేగ సారంగ మఠమున నుండి
గిరిభేది జనకుండు కేచరమూర్తి
పుడురాజు వోదనుండు వురుగ
భూషణుడు

విడువక నొక కొండ విల్లుగా బట్టి
ప్రమద రక్షకుండు బస్వ
తురంగుండు
అమిత విక్రమశాలి అండజవైరి
హస్తాన బ్రహ్మను అణచిన స్వామి
వస్త్రాది పులితోలు వొల్యేవాటుగ
నొాయిచి
కరిచర్మ పచ్చడంబు కప్పిన భోగి
కక్షపాల త్రిశూలము కలిగిన జోగి
మునులావుల పాలు మరి త్రాగినట్టి
కయిలాస మేలిన కందేందు మవళి
తెల్లని విభూది దేహాన పూసి
మల్లప్ప వరమున మరి వేగ బుట్టి

## తరమునాటి పెద్దలు తమును ముక్తి పొందించుమని భక్తిరన్నను కోరుట

వల్లవూగ పుణ్యగురువు వనరంగ
జపము
సేయుచుండంగ తొల్లి చనిపోయిన
పెద్దలు
వొయ్యన జపములోను వొచ్చి
పొదకట్టిరి
అయిదు రణముల చెల్లిన అయ్యలు
వొచ్చి
జయమని భక్తిరన్న జపములో
నిలచి
ద్వారావతి నేలిన తాతలు వచ్చిరి

'హరహరా రక్షింపు'మని
పలికి రంత
తాతలు తండ్రులు తరమునాటి
పెద్దలు
మతాన బంధువులు మరి నిలచి రంత
అయ్యవంక బలుగము అమ్మవంక
బలుగము
'గయిన అన్నము బెట్టి గంగ నస్తులు
గలిపి
భుక్తిబెట్టి తమముం ముక్తి బొందించు
భక్తవచ్ఛలుండ! వో భక్తిరన్న!'

## భక్తిరన్న కాశియాత్రకు పోగోరుట

అని జపములోను నిష్టలు జూప
కనక శూలము బెణికె కప్పెర
తొళికె
కక్షపాళము చెదిరెను కఖండము
తొణికే
దక్షనాది మెరిసెను ధరణి
గుబ్బటిల్లెను
శివులు భీతిల్లి జపము చాలించి
బసువన్న హరహ ప్రయాగ
పొయ్యేటి

కాలహేష్యము దెలశను
కంటమాల గురువు
వల కాల పషిణి మువ్వ వల్లవుల
గురువు
నిలచిన పెద్దల నిష్టలు చూచి
పలికెను భక్తినన్న ప్రమదుల గూడి
'కాశాత్ర పోయి వొచ్చేను
ఘనులార! వుండుడ'
శివులకు పయనంబు చెప్పె నావేళ

## భక్తిరన్న ధనకొండకు వచ్చుట

తనతోటి మహాత్ములకు తానున్న
మటము
ఘనవేగ వొప్పగించి కదిలె
దొనకొండకు
మహిలోన అయితన్న
మాధవుం దేలేటి
పెయ్యాలతిప్ప మటాన
పెరివేళ మాయను
పర్వతాన నుండి భక్తుడు పట్నానకు
వొచ్చనందేను
వొరుసతో దొనకొండ వారెల్ల వినిరి
పల్లవులు తిరుమందులు వారెల్ల
వినిరి
ఘల్లున రంతాయ తూటాలల్లోన్ను

కామరక్క సిరిదేవి గోత్రాల
పెద్దలు
తమరంతో విచారము
తలపొయ్యి సాగిరి:
''మటము విడచి ధనముకొండకు
మా అయ్య వొచ్చింది
కటకట హంత్యంబు కాకుండ
శిముడ!
జప తపములు మరచి యీ తావుకు
వొచ్చింది
ఆపద ముందర అయిపుట్ట కుండీని
దేవపూజ విడచి మటము
ధిగనాధినందుకు

భావించి ధనముకొండ పొడు
గాకుండెనః
యతీశ్వరుండు యేమో వార్త
వినకుండేను
సతుల వర్జితుండు చాలించి రాడు
పూర్వజన్మము యేమొ పొదగట్ట
కుండేను
పర్వతం దిగిరాడు భక్తిరన్న యిపుడు
అంకసరి యేమొ అనువాలు
తోచకుండేను
శంకరు డిక్కడికి చాలించి రాడు
తొల్లిటి వార్తలు యేమొ
తోచకుండేను
పల్లజదల గురువు పట్నానకు రాడు
సిరితొండ ఇంటికి శిముడు వొచ్చె
నండేను
గరిమ తోడుక కంచి కైలాస మరిగె
నిటుతో పొదిలె నిరియవ్వ యింటికి
వాటముగా శిముడు వచ్చిన యంతనే
గాటముగ బొందితో కయిలాస
మరిగె

అటువలె ధనముకొండ అయ
గాబోలు
అన్నము గవుతమ్మను శిముచు
అడిగిన యంతనే
చెన్నుమీరగ మటము చేటుబుట్టి
పోయను
ఆరీతి దొనకొండ అయ గాబోలు''
సిరిదేవికి విచారము శాయంగ నపుడు
మటము వొద్దను శెంకులు మరి
పట్టిరంత
కటకట విని శెంకుల నాద మందరును
నగరికి వొస్తున్నాదని నాతుల బిలచి
'తెగువతో మీరంత దేశాంత్రి
యెదుట
వుండరాదు; యిక మీరు వవ్వర్ల
చాటున
వుండు'మని పలికెను వొదిన
మరుదండ్లను
'నా అయ్య వొస్తున్నా'దని నాతి
సిరిదేవి
చయ్యన నగురంత సుద్ది చేయించెను

## భక్తిరన్న తల్లి నగరుకు వచ్చుట

దేశాంత్రి అయ గారు దేవపూజ చేసి
బోంచేసి కాశాత్ర పోవలె ననుచు
శిశువులు కొలిచి రాంగ శివగురువు
యపుడు
పషిడి ఖించిన ధూదిపావాలు తొడగి

వొళ్ళెల్ల వీభూది యోగ వాగాలు
తల్లి వున్న నగిరికి తా కదిలి వొచ్చెను
రాచగురువు వొచ్చి నగురు చొచ్చిన
యంతలోనె
వాసిగా శెంభుని వుదుకములు దెచ్చి

పాదార్చన జేసెను పణతి అగుమంచి
పాదార్చన కాయంగ భక్తినన్న శిశువులు
నాదించిరి శెంకులు నగిరి లోపులను
యాదవ పుణ్యగురువు అత్తకు తల్లికి
వీభూది ధరియించె విశ్వనాథుండు
గొబ్బున పల్లికొండ గోత్రాల పెద్దలు
అన్నలు తమ్ములు అతిభక్తి తోను
వొన్నెగా భక్తునికి వందనము చేసిరి
పురహరుడు దీవించ పులితోలు మీద
ఆరూఢి తానుండి అందరు నపుడు
కూర్చుండుమని సెలవు గురువు తా నిచ్చె
కూర్చుండి అందరు గురువును జూచిరి
శ్రీశైలము మీది యోగక్షేమము అడిగిరి
చూచి అందరితోను సుద్దులాడిన వెనుక

## భక్తిరన్న తనను కాశియాత్ర పంపుమని తల్లి నడుగుట

అత్తను తల్లిని అతివేగ పిలుచక
పలికెను భక్తినన్న పణతులు గూడి!
"నాతీతమణులార! నాతల్లి! వినరె
వారణాసికి బోయి మళ్ళి వొచ్చేను తాను
యేడు తరాల పెద్దలు యోగ్యంబు[1] లోను
అడిగిరి అన్నంబు అమ్మరో తనను
అక్కడ నుండి పొయ్యేనని వొస్తిని వేస్తు
గ్రక్కున నీకును యీ క్రమమెల్ల చెప్పేను
నీవున్న నగిరికి నేను వొచ్చినాను
దీవించి చెరుకూరు కవిలెలు తెప్పించు
అమ్మరో! కాశాత్ర అంపవే తనను"
అని యిట్లు పలికిన ఆ కాంతలెల్ల
అందరు చిన్నపోయి ఆచ్చేర్యపడిరి

## కాశి పోవలదని తల్లి భక్తిరన్నను బ్రతిమాలుట

"పొందుగ కాశాత్ర పొయ్యేద నంటేను
గుండె చాలదు; కొడుకు గుబులంచె కపుడు

1. యోగమ్ము

వుండును కాశాత్ర వొమ్మదు తనకు
నేడు నీవు కాశాత్ర పొయ్యేద
నంటేను
నడుము విరిగిన చంద మాయనో
కొడుక!
వుండుమ కాశాత్ర వొమ్మదు తమకు
నేడు నీవు కాశాత్ర పొయ్యేద
నంటేను
నోరు నిండెను కొడుక! నోరాడదు
తమకు
ప్రయాగ బొయ్యేనంటే
వో బత్తినయ్యా!
వో అయ్యా! నిన్నంపి యెట్లుందు
కొడుక?
నిశ్చలంగ కాశాత్ర నీవు పొయ్యేద
నంటేను
వ్రిక్షము విరిగి పడ్డ విధమాయ
తమకు
చెరుకూరి కదిలెలు తెమ్మంటె కొడుక
పరువడి దుఃఖంబు పట్టంగ రాదు
నా అయ్యా! నీ శెంఖు నాదంబు వింటేను
బోయలు దొనకొండ
పొదచిన ట్లాయను
నీవు వొచ్చి మఠాన నిలిచినా
వంటేను
దివినుండి దేవతలు దిగి వొచ్చి
తనుకొంటి
దనుముకొంతనుండి తమ్ము దయ
జూడవలె గాక

వెసయంగ కాశాత్ర యెట్లు
పోయెద నంటివి?
వేగి లేచి మిమ్ముల కన్నుల చూడ
కుంటేను
పగులు చీకటి తనకు పట్టినట్లు
వుండెను
మిమ్ముల వెడబాసి మటములు
విడచి
రమ్మని కాశినుండి జయరేకలు
వొచ్చిన
భాగ్యభూములు విడచి పట్నాలు
విడచి
జోగుల గూడి పోను వ్రాసెనా
బ్రహ్మ?
నుడుగులు తప్పిన నోము ఫలములు
తప్పక
కడువేగ గర్భాన కంటిని మిమ్ము
విడువక నోములెల్ల విధమాయ
కొడుక!
కొడుకతో! నీ ప్రాపు
కుడువలేదాయను
నీకేల కాశిపోను నీలకంటుండ!
మాకు బుద్దులు చెప్పుచు మా అయ్యా
నీవు
మా అయ్యా! పెయ్యల తిప్ప మఠాన
నుండుమా!
గయ్యాల? కాశాల?
ప్రయోగ యాల?[4]"

4. గయ 'యేల? కాశి 'యేల? ప్రయాగ 'యేల?

కడు వేగ బుద్ధులు కన్నతల్లి
చప్పగాను
నడ లింగమూర్తి నవ్వి యిట్ల అనియె

## కవిలెలు తెప్పించమని భక్తిరన్న తల్లినడుగుట

"రాజ్యభూములు చూచుక నగళ్ళు
చూచుక
తేజముతో సంపదలు ధేనువల
చూచుక
నిచలముగ యీ మాట నీకట్ల
తోఁచెకె?
మోక్షాన పొందేది ముందెరుగవైతివి
యంత రాజ్యము లేలిన
యెన్ని భూములు యేలిన
దొంతులలో దివ్య అవుట
దూర మెరుగవైతివి
నే గలిగి మోక్షము నిలుపవలె గాక
పంగతిగ మీతోటి సాటి వారము
మేము
యిరు వంశముల వారికి
యిహపరములకు త్రోవ
గరిమతో నానుండి కలుగవలె గాక
మమ్ముల కాశాత్ర పోవద్దన్న
మాటేమి తల్లి?
అమ్మరో! అయ్యలు చెల్లిన
అంకసరి వార్త
కవిలెలు వినివుండి కాశాత్రపోయి
తీర్థములు యిచటకి తెచ్చేము తల్లి!
వార్తలు మారు మాటలు వొద్దు
వో యమ్మ!
కవిలెలు తెప్పించు వో కన్నతల్లి!"
"నీవు కొడుకవు గావున నేర్చి
నేరములు
కాయ నే కర్తను గాని కవిలెలు
దేచు కర్తను గాను
వో అయ్య! పల్లికొండ వాడుగో!
నడుగొ!"
తల్లి ఆడిన మాటలకు తలమొగ్గి
అపుడు
పల్లికొండను పిలచి పలికె నావేళ
దివ్యద్రిష్ట యెరిగిన దేవతామూర్తి
కావైన హతిగురువు పల్లికొండను
అడిగె:
"మనస్సులో దెలసెను
మహనియ్యమూర్తి!
చనిపోయిన వారికి మనివున్న వారికి
బ్రతికించ అన్నము బెట్టు
ప్రమథుడవు నీవు
మా కావు ధ్యానము మీ కావున
గలదు
రాస్యపు మాటలు రసభంగము చేసి
బయలు పుచ్చరాదయ్య పందముల
రగుపతి!"
సందుల పుణ్యగురువు నవ్వి
యిట్లనియె

"కందర్ప గురుభక్త! గాంభీర్యశాలి!
అందరు విన్నది అది లెస్స గాక
సముసుకృతము లేటికి? స్వర్గానికి త్రోవ
చూచేటి ముచ్చటలు చుట్టాలు బంధువులు
వినివుంటె మంచిది వినుము వో బావ!
కవిలెలు తెమ్మని కరకంటు పలికెను

## భక్తిరన్న కవిలెలుచూచి గత ఏష్యములు చెప్పుట

శివగురువు మాటలు విని తెప్పించె కవిలెలు-
హరిగురువు శివగురువుకు అందించె కవిలెలు
"పరుసతో అంకసరి వ్రాత జుచినాను
పొంకముగ చిత్రభాను పోయి యీవరకు
శాంతులేదు యాభయి యెనిమిది యేండ్లున్నరాయె
శ్రీకూర్మమందున సింహాద్రిరాజు
చేకొని కళ్యాణాన వెలగి పెద్దయ్య
యేనుగు నాథు కొండన యరనూకరాజు
పూనికతో నలనూక భూనాథుండు బెజవాడ
చెరుకూర పోల్రాజు చెల్లిన వెనుక
చిత్రభాను సంవత్సరము చేటు యాదవులకు
తెలిసి కాశికి బోయె దినమున నుండి
నెలలు పద్దెనిమిది నిండుగా నుండె
అంకసరి యేటిమీద అరునెలలై వున్నది
నెలలు పన్నెండైన నిలచి కాశిలోను
సేవించి ఆరునెలలు సమీపము లెక్కను
గురుతెరిగి మాగ మాసము గురులింగమూర్తి!
యేటి పీంద ఆరునెలలు యీశ్వర మహిమ
యంటనె నిజవార్త వినగద్దు తమకు
యేడూడు వెళ్ళిన ఆరునెలల లోను
దండిగా భాద్రపదము దగ్గర నుండి
మాఘానికి ఆరునెలలు మతమున సరియు
దశమి యేకాదశి ద్వాదశి త్రయోదశి
చెతుర్దశి నాటి మాపు
ప్రొద్దుకూకేటప్పుడు తల్లి ప్రొద్దు పొడచి రాంగ

సిద్ధము అమావాస్యనాడు చారంగ
తమకు
పాడ్యమినాడు ధవముకొండకు
ప్రవేశ మవుదాము
దివినండి దేవతలు దిగివొచ్చి
రనుకుంటిని''
ఆ సమయమున అయ్య వున్న
హరిశివాపురము
ఆ లింగాల కొండకు యీ గంగాల
కొండకు
యిన్నాట యనక్షై ఆమట లెక్కను
కలని వుండి వినివుండే కంటమాల
గురువు

శంకరుడు రాగి శాసనాల మీదను
లెఖ్ఖ అంత వ్రాసుకొనెను
నీలకంటుండు
యీ లెఖ్ఖ వ్రాసుకొని నిజము
కీర్తించి
పల్లికొండ-భక్తుండు భాషించుకొనిరి
యిద్దరు యెరుగుట యితరులు వినుట
బుద్ధును దెలసిన వురహరులు
యిద్దరు
భాషించి అందరు ప్రజాభణముగాను
దేశాత్రి అయగారు చెప్పె నొక మాట

## పాపనూకను దయతో చూడుడని భక్తిరన్న చెప్పుట

"వో బావ! పల్లికొండ! వో యత్త!
కొమరక్క!
నా బుద్ధి వినవమ్మ నా తల్లి సిరిదేవి!
తమ్ముడు అయితన్న! దయవుంచ
వోయి!
నమ్మించి తెచ్చిన నాతి వున్నది
పాపనూక వున్నది బాంధవులార!
కాపాడుక రారె వో కన్నతల్లి!
పాలు గెలచి తెచ్చిన పాపన్న మీద
జాలిమితో అందరును దయవుంచ
రమ్మ!
అగుమంచిని పాపను అమ్మరో! నీవు

వొక్క సమానముగ జూచి వుంచవే
దయను
వుసూరు మంటేను వొమ్మది తనకు
అప్పకూతురు వని నీవు అదలించ పోకు
పాపన్ని వలపక్షము ఆడితిరైన
ఆపద ముందర అయిపుట్ట కుండీనె?
పతిసతి పాపమ్మకు బ్రహ్మదేవుండు
జత గూర్చిన దనుక దయ
వుంచరమ్మ!
కొమరక్క వో యత్త! నీ కోడలి మీద
చాల దయవుంచు'' మని చెప్పిన
వేళను

## భక్తిరన్న కాశికి పయనమగుట

ఆవేళ భక్తిరన్న ఆనతిచ్చిన వెనుక
శిశువులకు భక్తిరన్నకు సిరిదేవి
యప్పుడు
పొసగంగ అన్నము బోంచెయ్య
బెట్టెను
వొక్కరొక్కరు తమ యోగవాగాలు
గ్రక్కున పుచ్చుక కదలిరి వేగ
కొమరక్క సిరిదేవి గోత్రాల
పెద్దలు
ప్రియముతో సిరిగిరమ్మ
పెండ్లిచవిక వద్దను
అందరిని తిరుగనంపి అయ్యవారు
కదిలెను
పందముల పల్లికొండ బాలరాజు
అయితన్న
అందరు వొచ్చిరి అయగార్ని
గొలచిరి
సంగట పల్లికొండ సరస అయితన్న
గంగరావుల నీడ బొంగరాల
బయలు
రంగు మీరగ నిలచి రఘుపతిని
బిలచి
"వుండుడా! ధనముకొండను
పూర్ణతముగాను
దండిగ ఆచంద్ర తారార్కముగను
యేలుడా పట్నంబు యీశ్వరు
కృపను

బాలరాజు లందరికి భయ భీతులు
కలుగును
రఘుపతి నడిపించు రాజ్యభారంబు"
అగణితముగ పల్లికొండ అయితన్న
పెద్దలు
తమ్ములు మరుదులు దణ్ణమని
మ్రొక్కిరి
సమ్మతిగ నంపిరు సర్వేశ్వరునికి
వందనము చేసిరి వొచ్చిరి మగడి
బంధువుల తిరుగనంపి బత్తినయ్య
గదిలె
ముమ్మయ్య పోచయ్య ముద్దుబాల
లిద్దరు
నెమ్మిగా గదలిరి [illegible]
కందర్ప సంహారుడు కనకంతు
గొలిచి
నందుకురువ వద్దను నటవొచ్చి
రిద్దరు
అల్లుని తమ్ముని అటు బిలచి వేగ
వల్లవుల పుణ్యగురువు వొకవార్త
చెప్పెను
"యిక్కడి అక్కడి యోగక్షేమంబు
ఘక్కున బాలలార! కనివుండరోయి
దక్షణాది వార్త ధనముకొండ వార్త
నిశ్చలంగ కాశిలో నేనున్న వార్త
యీ యోగక్షేమంబు యిద్దరు
మీరు

5. ఇమ్ముగా, 6. పడికల

అగతి వినివుండుడీ అన్నలార!
మీరు"
చెల్లెలి కొడుకు పోచయ్యను
చిన్ని మమ్మయ్యను

మళ్ళసంపి బత్తినన్న మరిపోయ
కాశీ
బాలలు ధనముకొండ పట్నముకు
వొచ్చిరి.

## భక్తిరన్న దారిలో గల పుణ్యక్షేత్రములను దర్శించుట

కాలాంత పుణ్యంబు కదిలె
త్రిపురాంతకము
చేరి సర్వేశ్వరుని సన్నుతి చేశను:
''హరహర గౌరీశ! అంగజవైరి
త్రిపురాలు కొట్టిన దిట్టమౌ స్వామి!
కృపచూడవే మమ్ము గౌరాజగమున!''
అని సన్నుతించి అతివేగమున
గదలె
చెన్నుమీరగ వొచ్చి చేజర్ల నిలిచె
కబోది లింగము[7]కు కరకంతుసకు
మొక్కి
సద్భక్తిగా నిలచి ప్రార్థన జేసె:
"కాశికి సరిపట్నము కావలసి నీవు
వాసిగా యిచ్చట వ్రతము
నిల్పుకొని
జపతపములు చాల శివునికి మెప్పించి
ఆ పక్షిని రక్షించి హరిహరాజులకు
మేతదేగకు శిరస్సు మెదడు
యిచ్చినావు
నూతికెక్కిన శివచక్ర కీర్తినిగాచి[8]
నిబ్బరంగ చేజర్ల నిలచి వెలసినయట్టి

కబోదీశ్వర! కరుణించు మమ్ము''
మర్నాడు బత్తినన్న మరి తర్లిపోయ
ధర్నాల కోటను తగువేట్క నిలిచె
అమరేశ్వరుని జూచి హస్తముల్
మొగచి:
''ప్రమథుల పోషకుండ!
భక్తవత్సలుడ!
సమసారము యింతిని
చక్కబెట్టినావు
జముఖాళము పులితోలు చదురుగా
జేసి
కరుణించి ముక్కంటివై కన్నట్టి
స్వామి
ధరణికోట అమరన్న!
దయవుంచవన్న!''
అని స్తవుత్యము చేసి అచ్చోట తర్లి
మరునాడు వుంద్రవెల్లిని
మహాఘనుడు నిలచె
వర్ణించి యా పద్మవల్లభుని వేడె:
''శంఖు చక్రావతార!
జలధిశయనుండ!

7. కపోతలింగము, 8. నుతికెక్కిన శిబి చక్రవర్తిని గాచి

పంకజ రుద్రుండ! బ్రహ్మాండ
నాయక!
లంక సంహారక! రావణవైరి!
పొంకముగ అయోధ్యపుర నివాస!
చిక్కబట్టిన దాని చెలికాడివయ్య!
బొంకించి బలునిగొట్టి భూమికొలచిన
యట్టి
సీతామనోహర! క్షీరాబ్ధిశయన!
నాతులకు ప్రియుండ! పద్మనాభుండ
శరణు!"
అనంత శయనుని వేడి అయగారు
పోయి
స్నానానకు బెజవాడ దరిజేరె గురువు
క్రిష్ణాస్నానము చేసి కీలాద్రి పర్వతాన
విష్ణుతో వెన్నంటి వేడె నావేళ:
"పైడివాన గురియించి
భక్తులనుగాచి
కైలాస మిచ్చిన ఘనుడవయ్య నీవు!
చినుకు తులమెత్తు స్రిష్టిలో
కురియించి
కనక నిక్షేపము కాజేసినావు
నిజముగ నీకీర్తి నిండి లోకాన
బెజవాడ పాలై పెంపొందినావు
నిండు వేడుకతోను నిఖిలంబు
ఎరుగ
పాండవుల తపసును పండించినావు
బెజవాడ మల్లేశ్వర!
నిజమూర్తివయ్య!"

బెజవాడ తర్లిపోయ పీతాంబరుండు
రాజమహేంద్రానకు రమణి[9]తో
కదిలెను
గోదావరి స్నానము గురువు తా చేసి,
"మోదముతో సారంగుని మోక్షాన
బొందించి
ఆదరించిన యట్టి అమ్మవు నీవు"
గోదావరి తర్లి శ్రీకాకుళము కేతెంచి
సూర్ణముకి స్నానము నేర్పుతో చేసి
వొర్లించి యా తెనుగు వల్లభుని వేడి
"యిల్లు[10]విరచి తాటకి చీరివొయిచిన
మేటి
వల్లభుడ! వోస్వామి! వందనము
నీకు
రాతికి ప్రాణంబు రాజేసినావు
సీతాపతి! తెలుగురాయ! శరణు
వో స్వామి!"
పరుష వేది లింగముల పయనంబు
దర్లి
కరపట్నాన నిలచి కరకంతుడు
వొచ్చి
చిలుక సముద్రాన చేసె స్నానంబు:
"బెణుకు చూపులతోడ తళుకులు
గలిగి
చిలుక సముద్రవమ్మ! శరణు
వో యమ్మ"
పణతి సముద్ర దేవిని ప్రస్తుతి చేసి

9. రమణ 10. విల్లు

మాణిక్య పట్నముకు పోయను
మహనీయ మూర్తి
మణికేశ్వరుని జూచి మరి మ్రొక్కి
నిలచి
వేడంగ సాగెను యీశ్వరుని అపుడు
"కరకుట్లు తెచ్చిన కన్నప్పను
మెచ్చి
తరుణి చంట పలికిన ధాతవు నీవు"
ప్రాకటముగ దేవుని ప్రార్థన జేసి
యేకాంబరుండు యేతెంచి వేగ
శ్రీపురుషోత్తము చారంగ వొచ్చి
ఆ ప్రొద్దు యింద్ర జింహ్వారుడు
గట్టించిన
ఇఘపరములు యిచ్చేటి యెప్పుయిన
నదిని
అయఘళం బనిజేటి ఆ నదిన
స్నానము
చేసెను కటకాన చేరెనా గురువు
మహనదిన స్నానము మరిచేశ గురువు
బహువిధమున జగన్నాథుని ప్రార్థన
చేశను:
"పాండవుల పక్షవాడి! ప్లైమలాద
వొరుద:[11]
పుండరీ కాక్షుండ: భూజన
రక్షకుండ:
ద్రవుపతి అభిమాన! ధనర్వవేద
బ్యాసి:[12]
గోవర్థన గిరికొండ గొడుగుగా
యెత్తిన
జీవుల రక్షించిన శ్రీహంవయ్య!
వటపత్ర శెయన: వాలిని వేసిన
యట్టి
కటుక జగన్నాథ! కరుణించ
వయ్య"
అతివేగమున కాశి ఆది మార్గమున
అతి సాగరమునకు పొయ్య అయ్య
భక్తివయ్య.
వేయుపాయలై వొచ్చి వేరులు[13]
గలసిన
చయ్యన స్నానము సముద్రాన చేశను
సముద్రాల దేనిని సవుక్యంబు
చేశను:
"అమర సాగరమునకు అన్నింటికి
కర్తవు
కూలాబ్ధి సాగర: కోటిపావనేశ!
కలియుగం వారికి కన్నతల్లివి నీవు
గాంభీర్యము గలిగిన ఘనపుణ్య
నదివి
అంబుజ జలరాశి! అమ్మశరణార్థి!"
తేజు ప్రార్థన చేసి తెరువు సాగినదచి
రాజమహాలు చూచి నది సంతసించి
పయనము స్తీదులై భక్తినయ్య తర్లి
గయలోకి పోయను కాలాంత పుణ్యుండు
భార్గవ నదిన భక్తినయ్య అపుడు
స్వర్గానికి మోక్షమని స్నానంబు
చేశను
ప్రెహతా పర్వత మెక్కి భక్తినయ్య
దిగెను

---

11. ప్రహ్లాద వరద! 12. ధనుర్వేదాభ్యాసి 13. ఏరులు

అతినిష్ఠ బ్రెంహ్మగుండాన
ఆడె స్నానంబు
గయ వర్జితము చేసి కాశిలో నిలచను
ప్రయాగ చూచెను భక్తిరన్న
అపుడు
గంగాస్నానము చేశను ఘనుడు
భక్తినయ్య

సంగతిగా యమున సరస్వతిని
జూచెను
ఘనమైన పుణ్యనదులను కంటమాల
గురువు
స్నానంబు చేశను సరగ భక్తినయ్య

## భక్తిరన్న కాశి చేరి క్షేత్ర దేవతలను ప్రార్థించుట

ఆనంద కాశి, అతిముక్య కాశి,
తితారామ కాశి, శివరామ కాశి,
భార్గవ నదిన పరుగస్నానంబు
చేశను
నిర్గయలో గయవాసులకు నిచ్చె
దానంబు
గోగయ సీతగయ రామ గయాయని
పరుగంగ చూచి
అంచితముగ యా ముక్తి యీశ్వరుని
చూచి
ప్రార్థన చేశను పరిపరి విధములను:
"మూర్తులకు మోక్షము ముందు
యిచ్చినావని
వార్త చప్పంగను వాస్తిని నేను
కీర్తి పొందించు అపకీర్తి లేకుండ
నీ తీర్థ ప్రసాదము దేవ! కావలసి
వొచ్చినాను
వొచ్చినాను మోక్షము యిచ్చి
రక్షించు"

వందనము చేశను వొల్లవుల గురువు
అందముగ ప్రార్థన అయగారు
చేశను:
"మూషక వాహన! ముక్కంటి
పుత్ర!
శేష భూషణుండ! శరణార్థి నీకు!
కొంచపు బొజ్జయు గుజ్జరి రూపు
మంచి సజ్జనుండ! మహాఘనుడ
వయ్య!
వీశ్వర వొరపుత్ర! వీరహోంకార!
భూత పుణుకుల పేరు, చాత కరువాలు,
ఘాతగా భూతాల కండించినావు
కయిలాస మేలిన కరకంటకుండ!
బైరవుండ! చేపట్టు పరగ శరణార్థి!"
కాశిలో హరిచంద్ర స్తంభాలు చూచి
వాశిగా వీరన్నను కయిహారంబు
చేసి!
"శంకరుని శమటను జన్మించినావు
శంకలేక ధానవుల చీలివొయిచినావు

కరువాళము సింగళిని కనక
త్రిశూలము
పరువాదులకు వొయిరు శరభావతార!
వీరన్న శరణార్థి!" అని సన్నుతించి
వొన్నెగా భక్తిరన్న వొచ్చి
విశ్వనాథు
సతియైన అన్నపూర్ణకు సాష్టాంగ
మొక్కి—
"సతులైన యింద్రాది సకియలలోను
కన్నతల్లివై నీవు కాశిలోనిలచి
పన్నుగా నున్నట్టి ప్రమథాదులకున
పిన్నలకు పెద్దలకు బీదసాదులకు
అన్నము నీపేరు అష్టదిక్పాలకులకు
బోనం గలిపించిన పూబోణివమ్మ!
రాజీవనేత్రి! నాతల్లివి నీవు"
అన్నపూర్ణను వేడి ఆ విశ్వనాథు
సన్నుతిగా వొచ్చెను సద్భక్తితోను
విశ్వనాథుని జూచి వినుతులు చేశ
బసువవాహన స్వామి! పరమేశ!
యీశ!
వాసిగా శివయోగి వ్రతమున బొంగి
గవిరీ మనోహరుడ! గంగాధరుండ!
శెవ్వవర్తనుండ! చిత్రకర్ణుండ!
పైనిండ పులితోలు ఫణిరాజలోలు
నయశాలి కాశివిశ్వనాథుండ!
శరను!"

## భక్తిరన్న కాశిలో ఏటిమీద ఆరు నెలలుండుట

అమరంగ ప్రార్థించె అయ్య
భక్తినయ్య
'స్వామి! నీ సన్నుతిన[14] జాగా
విప్పించుమ'
మరివేగ నంతను మటము యేర్పాటు
ఘనవేగ విశ్వనాథుడు కల్పించ
మటము
మటము గలిపించుక మహదేవ
దేవునికి
పటుతరముగ పూజ భక్తినయ్య
సేయుచు
అక్కడ యేటిమీద ఆరునెలలు
దనుక
గ్రక్కున తతికాలము కానవొచ్చ
గనుక
అంకసరి సమీపము అయగారు
చూచను
శంకరుడు నాలుగు మూడు దినముల
సమీపమాయనని

14. నీ సన్నిధిని

## పెద్దలకు పిండప్రదానము చేయుటకై భక్తిరన్న గయకేతెంచుట

"మనుపటి వారిని యిక్కడ
మోక్షాన పొందించి
వెనకటి వారికి తీర్థము వేగంబె కొంచు
బోవలె'' ననుచును తపము చాలించి,
నభవపానుండు గయలో నట వొచ్చి
నిలచి
గయాశూరుని[15]వొద్ద కడు మోక్ష
మనియు
అయగారి భుక్తిముక్తి అ తావున
నిలిపి,
వాసికెక్కిన మంచి వల్లవుల గురువు
కాశిలో అన్నంబు కావించె నపుడు
తండ్రివంక వారికి తల్లిపంక వారికి
చంద శాసనుండు అరు శెలములు[16]
దీసి
అరు నైతలువేసి అన్నము వొడ్డించి
యేడు తరాల వారికి యిలగురువు
భక్తినన్న
వలచాత డాచాత అన్నంబు బట్టి
తలచెను భక్తినన్న చనిపోయిన
పెద్దల:

## భక్తిరన్న, వలురాజు వల్లమ్మలకు అన్నము వేయుట

"దూర్వాసు శాపంబుతోడనే తగిలి
అరుధి నీరుతుంగ చాత హతమై
పోతిరి
ద్వారక యేలిన తరమునాటి
పెద్దలార!
కాశిలో అన్నంబు గైకొండు మీరు!
కరణాల కొరకై కరసి దండెత్తి
కందె మొండాల యేలేటి కలభూత
గంగురాజు మీద
అలంబుచేసి హతముగా చెల్లితిరి
మెండైన శాలమీద మెరసి దండెత్తి
దండి శానలమీద తగ పోరి పోరి
వొళ్ళుళ్ళగాయాలు వుక్కుటలుగులు
నాటి
వొలురాజు! వో తాత! వొసుధపై
వొరిగితివి
అగ్నినోములు నోమితివి హరహరా
యనుచు
బొగ్గుల పాలైపోతివి పొలతి
వల్లమ్మ!
కాశిలో అన్నంబు గైకొండుమీరు!

15. గయాసురుని 16. ఛెలములు

## సింహాద్రిరాజు సింహాద్రి సీతలకు అన్నము వేయుట

వొల రాజును చంపిన వొయిరుల
ద్రుంచి
కల్లరి రిపులను కండించి నరికి
పురవడి బాణాలు నీ వురివి[17]పై
నాటి
తరిముత్త వో తాత! ధరణిపై
వొంగితివి
నీకు అర్ధాంగ లక్ష్మి నీతిమంతురాలు
చేకొని అగ్నిలోను చెదరక మనస్సు
మండేటి మంటలలోను మడిసింది
వల్లమ్మ!
కాశిలో అన్నంబు గైకొందు మీరు
గుండానకు యిద్దరు కుమిలి కాలితిరి!
శ్రీకూర్మము మీదను చెలగి దండెత్తి
శ్రీవైష్ణవులగాయ సింహాద్రి రాజు
సింధు బల్లాణుని శిరసును నరికి
మూకలై వొక్కొక్కరిని మొనకట్టి
చంపితివి
చేకొని వారిని చెండాడి చంపితివి
బారలకు యెదిరించి ప్రగతుల
ద్రుంచి

దురములో రిపులను త్రుళ్ళణచి నీవు
చంద్రాయుధాలు తాకి చెల్లితివి నీవు
సింహాద్రి వో సీత! సిరిగల కాంత!
అయ్యగూడి ప్రాణంబు వొప్పగించితివి
హంసవలె వో తల్లి! అగ్నిలో
మడిస్తివి
నిమిషంబు లోపల నీరై పోతివి
కాశిలో అన్నంబు గైకొందు మీరు
భూమాటి శంకరయ్య! పుణ్యాత్మ!
ధీర!
ధీమంతుడగు రాజు వోర చెల్లితివి
నీవు
భూమాటి శంకరమ్మ! నీ పురుషుని
కొరకు
అగ్నినోములు నోమితివి అత్త!
శంకరమ్మ!
చిత్తరు ప్రతిమెవలె చిచ్చున
వొరిగితివి
కాశిలో అన్నంబు గైకొందు మీరు!

## పెద్దిరాజు పెద్దమ్మలకు అన్నము వేయుట

కట కట పెద్దన్న కల్యాణము
పోతివి

పోరాడి రాజులను పొట్టలు చించి

17. ఉరము

గోర యుద్ధముచేసి కుంబిళ్ళు
తెగటార్చి
ఆరెమాని పీర వొయ్యాళి బయటను
అంత రాజుల వొద్ద చెల్లితివి అన్న
పెద్దన్న
పక్షులకు గాను నీ ప్రాణంబు యిచ్చి
మీ వొళ్లు పోట్లునాటి వొరిగితిరా
తండ్రి!
మాభూములకు మీరు మళ్ళిరాక తల్లి
శోభనాల గుండము సొదలు
యేర్పరచుక
మంచి గంధపు మాకులు మగువ నీ
గుండాన
కొంచాలుగా నరికి కుదురుగా చేర్చి
అందు లోపల తమ అయ్యను వుంచి
యెరువైన సొమ్ములు వెలదులకు
పంచి పెట్టి
వదలక బాలల వద్దవారికి
వొప్పగించి
దండమొప్పగ బెట్టి ధర్మసభ కెల్ల
గుండంబు లోపల గుప్పున వొరిగితివి
మంటల లోపల మడిస్తివి నీవు

కంటికి రెప్పవలె కాచితివి మమ్ము
ఆరిన గుండములోను అమ్మ!
నీ రూపు
ధారుణి సభవారు తల్లడ పడగాను
గుగ్గిలపు పొగవలె గుబగుబా
యెగిస్తివి
బొగ్గు లెల్లను తామర పువ్వులై
వుండు
నా పంతము యీడేరిస్తివి ననుగన్న
తల్లి!
బాలల వొప్పగిస్తివి ప్రక్యాతి గాను
భూలోకము వారెల్ల పొగిడేరు నిన్ను
కాశిలో అన్నంబు గైకొంటు మీరు!
దామసాని వోమామ! సరిగడలు
నాటి
రామ రామాయని వొరిగితివి
రాజువొద్ద నీవు
పొసగంగ దామసాని పోతి!
వో యత్త!
మసియై పోతివి మంటల లోను
కాశిలో అన్నము గైకొండు మీరు!

## యరనూక రాజు_యరనూక సీతలకు అన్నము వేయుట

యేనుగునాథు కొండమీద యరనూక
తండ్రి!
అవనిలో రిపులను హతముగా నరికి
యెదురొమ్ము పోట్లతోను యేగితివి
తండ్రి!

పతి కూడి కలియ గాలితివి పడి
మంటలోన
రతిదేవి బోలిన రవణ యరనూక!
కాశిలో అన్నంబు గైకొండు మీరు!

పులిమద్దుల రాఘవుండు! భూమి
గంపింప
చలమున రాజుల చంపి చెండాడి
ధిక్కరించిన రిపులను తెగటార్చి
నీవు
అక్కడ సరికల్లుగాను అయ్య వద్దను
చెల్లితివి

పులిమొద్దుల దేశమ్మ! నీ పురుషుని
కొరకు
పతిబోయి సతివుంద పరుగ
నీతిగాదనుచు
గుండము లోపల కూలితిరి మీరు
కాశిలో అన్నంబు గైకొండు మీరు!

## నలనూకరాజు-నలనూక సీతలకు అన్నము వేయుట

నలనూక! వో తండ్రి: రాజుల
నురుమాడి
నీ పయినుండ పీటెలు బల్లేలు నాటి
దిగ్వి దేవుని పెంటకాడ చెల్లితివి నీవు
అగ్ని నోములు నోమితివి అమ్మ!
నలనూక!
కాశిలో అన్నంబు గైకొండు మీరు!
నలనూక రాజులకు నమ్మిన ప్రధాని
విలసితముగ కీర్తులు వెలసిన
మనుడవు

పట్టపు యేనుగుల నరికి ప్రగతుల
ద్రుంచి
ఘట్టిగా యెదురొమ్ము గాయాలు నాటి
చట్ట మారయ్య! నీవు సరికల్లుగా
చెల్లితివి!
అట్టె నిప్పులకు ప్రాణము
వొప్పగించితివి
సట్ల మారమ్మ! సకియరో! నీవు
కాశిలో అన్నంబు గైకొండు మీరు!

## భక్తిరన్న తన తండ్రి పోలురాజుకు అన్నము వేయుట

లింగమంతులకు గాను నిలచి
చెరుకూర
జంగాల వెనుక వేసుక చోడాని మీద
సమరంబు చేస్తివి సరికల్లుగాను
శ్రీమంతుడ! చెరుకూర చెల్లితివి నీవు!
భక్తుల నందరిని పర్వతానకు పంపి

కత్తులపాలై పోతివి వో కన్నతండ్రి!
తిరుగ వారు చెల్లిన తిరుమందుల
మామలార!
వీరులై చెరుకూర వెలసితిరి మీరు
దండిగా గంగరేగు ఛాయాయ మీకు

తండ్రి పోలురాజ! నీతనయుడని
నేను
కాశిలో అన్నంబు గైకొండు మీరు!

## కల్లందుల మారినేడు-మారెమ్మలకు అన్నము వేయుట

ఒల్లికురువ వీరులై పక్యాతికెక్కిరి
కల్లందుల మారినేడ! ఘనుడ!
వోమామ!
అల్ల చిచ్చుల నోమితివి అత్త!
మారెమ్మ!
కాశిలో అన్నంబు గైకొండు మీరు!
వాసిగా జాంభవ వామిశ వార్తనుడు
మసిలమ్మ వో పుత్ర! మాతంగి
గోత్ర!
అయిదు రణాల కైన అయ్య!
నీ రణము
వాహి కీర్తి మూర్తులు వొచ్చి
నీ నుండి
యెద్దులు గోసంగులు యాదవులు నీవు
యుద్ధంబు చేస్తిరి వీరులై వెలసితిరి
అతనికి కులసతి అరుంధతికి సాటి
వొత్తువని యెంతురు వో యమ్మ
నిన్ను
సామజ నడుపుల తల్లి! (సాధ్వి)
మారెమ్మ!
సామాద్రి కిరియ చొచ్చి పతి
గూడుగొని
పుత్రుల వొప్పగించి పోతివి నీవు
దత్రాన నీపేరు దాచినాము తల్లి!
లింగమందు అయిపోతివి నెలత
మారెమ్మ!
కాశిలో అన్నంబు గైకొండు మీరు!

## కల్లందుల పోలినేడు-చిటినూకలకు అన్నము వేయుట

రాళ్ళ దిండి భైరవరాజు కురువ వొద్ద
జలోధీరుని చంపి శానల నరికి
పొట్లునాటి కల్లందుల పోలినేడా!
చెల్లితివి
నిప్పుల లోపుల నిలచి కాలితివి
అప్పొ చిటినూక! నీ అబ్బురపు
కొడుకును
చెల్లెండ్లకు వొప్పగించి చిచ్చులో
పడితివి
కలకంటి! చిటినూక! కాంతరో! నీవు
కాశిలో అన్నము గైకొండు మీరు!''

18. వంశవర్ధనుడు

## అన్నములకై బాలరాజులు చేతులు చాచుట

తరమునాటి పెద్దల తలచ భక్తినన్న
పరుగంగ అన్నము పాళ్ళుగా చేశను
ఆకొన్న పెద్దల అందరిని బిలచి
అన్నము పెట్టగాను ఆవేళ బాలలు
ఆస్త్రాలు చాచిరి
తాపు యెరిగిన బాలలు తమ నిష్టలు
చూపిరి
జొత్తువలె రక్తంబు జొబ్బటిల
కురియంగ
భక్తునికి పొడకట్టిరి బాలలు
యిద్దరును
వాలుజడలు గలిగిన వల్లవుల
భక్తినన్న
నీళ్ళలో భక్తినన్న నిష్టలు చూచి
మంచువలె రక్తము మామ అల్లుని
మీదను
నిలచి కురియంగ సాగెను నీళ్ళ
లోపులను
పొడిచిన పోట్ల వెంటను పోచయ్యకు
ముమ్మయ్యకు
జొడ జొడ రక్తంబు జోరున
గురిశను
"తమ్ములు మరదులు దక్షణాదిన
వుంచి
నిర్మలముగ కాశిలోను నీవు యెట్లు
వున్నావు?

వొద్దు ఆనంగ కాశాత్ర వొస్తివి నీవు
యుద్ధంబు చేసింది యెరుగ కున్నావు
పల్లికొండ రఘుపతి, పద్మ
నాయుడును,
చల్లవారి బొల్లేవు, సరుగ బీరన్న,
కాటమరాజు అయితన్న,
కరియావులరాజు
భట్టావుల వల్లభన్న, పరగ
యర్రయ్య
యాత్రికోట్ల యాదవులు నీకు
యెదురుచూచేరు
శాంభవుండ! పోదా"మని చెప్పిరి
బాలలు.
"దావు యెరుగడు కాబోలు కాశి
పోయిన గురువు
అని బావ పల్లికొండ అంపితే
వొస్తిమి
దాహంకొని వున్నారు దక్షణాదిన
తమ్ములు
కుప్పెల తీర్థము కొంచు పదవయ్య
లెక్కవాసుక వొస్తిమి యిక్కడేల
వున్నాము
కాలపక్వము వొచ్చెను పదభయ్య
నీవు"

## భక్తిరన్న బాలరాజులకై దుఃఖించుట

ముమ్మయ్య పోచయ్య ముచ్చటలు
వినియు
సొమ్మసిలపోయి భక్తిరన్న శోకింప
సాగెను
అల్లునిచాత వున్న ఆస్త్రరేక చూచి
వల్లవుం పుణ్యగురువు వాగిసి
దుక్కించి
తమ్ముని చాతనవ్ను దామరపద్మము
చూచి:
"మచ్చరేకలు గలిగిన మరి ముద్దు
బాలులార!
మీ వక్షాలు పోట్లునాటి వారిగితిరా
శిముడ!
కాలము కురదలించెను గంగ
దయతప్పెను
నీలకంటుని సముకాన నేను యిచట
వుండగాను
యీలోను చేటువార్త యెట్లు పట్టెనో
శిముడ!
ముమ్మరముగా పోట్లు మీ
యెదురొమ్ములు నాటి
తమ్ముడ! ముమ్మయ్య! జెయ రేఖలు
దెస్తివి
బల్లేల పోట్లు మీ యెదురొమ్ములు
భారముగ నాటి
వొళ్ళున రక్తంబు వుబ్బి కురియ
గాను
చెల్లెలు కొడుకు పోచయ్య! చేటు
వార్తలు దెస్తివి
కాలమానం దెస్తిరి వో బాలలార!
మాలె కొండల వలెను మీ భుజములు
పెంచుకొని
పారేటి రక్తాన పడి పీదులాడి
ధనముకొండ వార్త దక్షణాది వార్త
ఆనవాలు దెస్తిరా! అన్నలార! మీరు
చెల్లిన పెద్దలకు అన్నము పెట్టగాను
అల్లుడ! పోచయ్య! ఆనవాలు
దెస్తివా?
చల్లంబో! అన్నము యెవరికి
పెట్టుదాము?"
పరితాపించి భక్తిరన్న 'సరమేశ్వరా!'
యనెను
తమ అత్తచేతి అన్నము తమ
అమ్మచేతి అన్నము
తమ్ములున్న తావుకు తా కొంచపోయి
చనిపోయిన వారికి మనివున్న వారికి
పాలేట అన్నము పెట్టేనని భక్తిరన్న
అపుడు
నల్ల చెరువు కట్టయెక్కి నిక్షేపము
చేశను
'ఆనవాలు దెస్తిరి ఆలసించ రాదు
ధనముకొండకు పోదాము తర్లరోయి
బాలలార!

## భక్తిరన్న కాశిని వదలుట

పదిరెండు కుప్పెల పట్టి కాశి తీర్థము
కదిలెను భక్తిరన్న కావడి యెత్తుక
మునుల ప్రార్థనచేసి ఘనుల కీర్తించి
వినయముతో కాశి విశ్వనాథునకు
మ్రొక్కి
కాశి మునుల ప్రార్థించెను ఘనుడు
భక్తిరన్న:
"వాసికెక్కిన యట్టి వ్రతమునులార!
ఖేచర పతులార! గిరిధరు లార!
ఆచార్య పతులార! హరిహరులార!
యెతీశ్వరులార! యేకాంగులార!
శిరస్సు కిందుగావున్న జపయోగు
లార,
యిరువంశముల వారికి
యిఘపరములకు త్రోవ
కలుగజేసేరని కాశాత్ర వాస్తిమి
పిలిచినవారు వుండంగ పిలవని
వారు వొచ్చిరి
కాశిలో పొడగట్టిరి కదలి పోవలెను
మీ సెలవు దయచేసి మేఘరథమిచ్చి
పంపుడా ధనముకొండకు పట్నముకు
తనను
యింపారగా మీరు యిందరు
తనమీదను
కృప చాల వుంచుమని గొబ్బున
పంపుడా!
శాపాన వుగ్రగ సమర్థులు మీరు
చల్లనివేళ తర్లి తెల్లవారక తొలికి
తల్లివున్న ధనముకొండకు
తా పొయ్యేటందుకు
యోగవాగాలు తమకు యిచ్చి
దయ సేయుడీ!"
బాగుమీరగ మునుల ప్రార్థన చేసె
వెనయంగ యిచ్చిరి తమ
యోగవాగాలు
వనరంగ యిచ్చిరి వల్లవుల గురువుకు
మేఘరథము కదిలెను మెరసి
ధనముకొండకు
మటయోగి చెతుర్దశి నాటి మాపు
చాలించి వినుదు[19] మేరువ
దాటగువేళ
ఘాలిమేఘ మనే రథము గ్రక్కున
యెక్కెను
మేఘరథము కదిలెను మెరసి
ధనముకొండకు

---

19. ఇనుదు

## భక్తిరన్న మేఘరథముపై ధనకొండ చేరుట

బాగొప్ప ఖేచర భాగంబు బట్టి
తెల తెల వారంగ దేశాంత్రి వొచ్చి
వల్లవుల భక్తినన్న వాలించ రథము
నందుల కురువ వద్ద
నడలింగమూర్తి
అందముగ దిగనురికి ఆశిశువులుదాను
మల్లనంపెను రథము
మహనియ్య మూర్తి
తిలకుండు వాక కుప్పె తీర్థంబు తీసి
ఆనంద పురహరుని ఆ
నందీశ్వరుని
'దీనమందార! నందీశ్వర! శరణు'
నందుల జలుకము నయమొప్పచేశను
సమంధాల శిశువుల సంకలో నిమిడి
క్రమమున భుజమున కావడి వుంచి
పరువున తర్లెను అన్న భక్తినన్న
పోటపాటి మిట్టలోను ప్రొద్దు
వుదయించను
పోటపాటి వీరన్నను భక్తినన్న
తాను
అతివేగ ప్రార్థించను అన్నభక్తినన్న
"వో వీరభద్ర! వోఈశ్వరాపుత్ర!
కావి పట్టుకాశ కలియుగంబున నీకు
నీపేరటివాడు నీ పరపుత్రుండు
బీరన్న అనేవాడు బిరుదుగల
శవరి[20]
క్షేమాన వున్నాడు శరశాపమూర్తి?
ప్రమద రక్షకుండు ప్రగ్యసే
ఘనుడు
భద్రేశ ఆయుధాలు భద్రేశమూర్తి!"
నంది కుప్పెల తీర్థము నమస్కరించి
వెనయంగ నొదుటను విభూది
ధరియించి
"సెలవు దయసేయు' మని
చయ్యన కదిలెను.

## పొటుబడినట్లున్న ధనకొండను చూచి భక్తిరన్న విచారించుట

పల్లజడలు కలిగిన బడుగుల
భక్తినన్న
నల్లచెరువు కట్టయెక్కి నాదించ
శంకు
శంగల్వాలు మంచి శామంచి పూలు
శృంగారమై వుండు తీగె మల్లెలును
పొసగంగ మంచి జాజులు బొండు
మల్లెలును

20. శారి

వెసగంగ నేల్రవాలి వాడి విగసించి
వెల వెల బ్రోవుచు వెరగంది
చూచను
"బాలరాజు అయితన్న పట్నాన
లేడు గాబోలు
రాలిన పువ్వులు రాసులై వున్నవి
నాప్రాణలింగాలు ధనముకొండను
లేరు గాబోలు
జాజులు వాడి సంపెంగలు వొరిగి
వున్నావి
రాజు అయితమరాజు పట్నాన
లేడు గాబోలు"
నడలింగమూర్తి నల్లచెరువు స్నానము
తా చేళ భక్తినన్న చయ్యన విభూది
అంచితంబుగ [illegible]
తాను
కావిధోవతులతోను కరకంటుతోను
శివలింగమూర్తి చయ్యన కదిలెను
అని చింతింపుచు అచోట కదిలెను
ఘనవేగ వల్లవుల కంటమాలగురువు
చెల్లెలు అగుమంచి కట్టించిన
సెంగల్వల బావిజూచి
"భామలు నీళ్ళు మొయ్యరు గాబోలు
భావులు పాడుద్రోచిని
క్షేమాన వున్న ధనముకొండకు చేటు
పుట్టకుండీనః"
చలగి అచోట తర్లి శిషువులు తాను

బాలలు బొంగరాలు అడిన గరిడి
వొద్ద నిలిచను
"రంధు లారగ బాలలు రణశూరులై
వున్నాళ్ళు[21]
బొంగరాలు ఆడుదురు బోరు
కలుగంగ
యీశ్వరుడు దయ తప్పెను
యాదవ్వులకు అయితన్నకు"
అనుచు వివిధంబునను ఆత్మలో
తలపోసి
వెనయంగ భక్తినన్న శిషువుల
పిలచి
'అగుమంచి శివరాత్రి అయ్యగాండ్ల
కెల్లను
లింగ వస్త్రము [illegible]
అగణితముగ పోయి అన్నము
బొంచేసి
మగిడిర'మ్మని శిషువుల మహనియ్య
మూర్తి
అంపిన శిషువులు అతివేగ పోయిరి
శిషువులు జంగాలలోను గ్రమే
బొంచేసి
తేజముతో గురువు వున్న తావుకు
వొచ్చిరి
వొచ్చిన శిషువులతోను వార్తలాడు
కొనుచు
ఘనవేగ భక్తినన్న కావడి శిషువులకు

---

21. వున్నవాళ్ళు.

హనుమంతు ధరియించెను అయగారు
తాను
సన్నుతిగ విభూది జలకంబుతోను
వెనయంగ హనుమంతుని వేట్క
సేవించి
కాలాంత పుణ్యుండు గంగ నగిరికి
వొచ్చి
కావడి అటు దించి గంగను ప్రార్థించె:
''అవనిలో తమయింటి ఆదిలక్ష్మి
గంగ!
జలజాక్షి! పూభోణి! జమదుర్గి
రాణి![22]
భూలోక రంభవు! పూభోణి వమ్మ!
కినసి వొయిరులబట్టి గిరిరాజుపట్టి!
దొనకొండ నెలకొన్న దుర్గ
వోయమ్మ!
పావణమూర్తివి భాగీరథి! శరను!
భూమిని కల్పతరవుకొమ్మ!
పుత్తళిబొమ్మ!
పురహరుని యింతి! పుష్పాల బంతి!
కరవాలు, సింగణి కనక త్రిశూలము
సురువు కంటిమీద సుదతి నీయిల్లు
సొగసైన మెరుపులు చూపులు గాంగ
వరషమేతు పురావాస గాంగాను
ధరగల కొండలెల్ల దంతములుగాంగ
సాగరంబు లెల్ల శక్తి! నీరూపు
భాగీరథివై వచ్చి బతికించి మంచి
ఘనతతో దొనకొండ గంగ
వొనరంగ
విలవేలుపు నిన్ను నమ్మి యిటు
కాశిపోతి
చలపట్టి బాలల చంపితివె గంగ!
యిద్ధరంగమున వల్లవుల
తిరుమందుల
బద్దిగొర్ల చేస్తివటే భాగీరథి గంగ!
కాశి తీర్థమున గంగను జలుకంబు
చేసి
నొసుటను విభూది నయమొప్ప
ధరియించి
హస్తముకెత్తి మొక్కి అయగారు
నిలచ
కస్తిపడెను గంగ కరకంటుని జూచి
వక కంట రక్తము వకకంట
వుదుకము
గ్రక్కున జారంగ గంగ తానపుడు
పొలపొల కురియించె పువ్వుల వాన
కలకంటి దొనకొండ గంగ అడలంగ
శిశువులు భక్తిన్న చింతించి
కదిలెను
వెసగంగ శెంభుని గుడికి యేతెంచ
గురువు
చేతులు ముకళించి శెంభుని పూజించె:
'అరయంగ తీర్థము అలర విభూది
పుత్తడి పరుషంబు పులితోలు కాశ

22. 'జమదగ్ని రాణి' (పాఠాంతరము)

చిత్తజ సంహార! త్రిశూల ధార!
పుణుక వేరుల (దాల్చు)
భూతనాథుండ!
గణపతి జనకుండ! కరిచర్మధరుడ!
నందినొప్ప నెక్కి నరమామసంబు
విందులు భోంచేసిన యీశ్వర!
శరను!
పార్వతి న్నొకచంక, పణతి
జాన్నవి గంగను
శిరస్సున వుంచిన శివయోగి
శరణు!'
శెంభుని జలకము చేసె భక్తినన్న
శెంభుని గుడిలోను సమంధాలు
వుంచి
ఆవేళ శివుల అందరిని బిలచి
'శివరాత్రి సమానము సిరిదేవి నగురు
విపరంగ బోంచేసి వేగంబె రాండి'

అతివేగ శివుల అందరిని బిలిచె:
'అనలింగ! సినలింగ! హరి
శివలింగ!
రుద్రుడ! భద్రుడ! రూఢి విరూపాక్ష!
చన్నమల్లు! రామలింగ!
జనపాలనాథ!
శివయోగి! విరూపాక్షి! శివులార!
మీరు
శివరాత్రి జంగాలతో శీగ్రంబె పోయి
ఆరగించి ర'మ్మని అతివేగ పంపె.
అక్కడ సమంధాలు
అయ్యవద్ద నుంచి
గ్రుక్కున అమ్మకూటాలకు కదిలి
వచ్చిరి జంగాలు
జంగమూర్చన చేసిరి దేవినగరు
కడువేగ వచ్చిరి కరకంఠుని కడకు
వాసిగా శివులు వచ్చిన వెనుక

## భక్తిరన్న అర్ధరాత్రివేళ ధనకొండ వీథులలో భిక్షమడుగుట

నిజ్జ సమయము వేళ నీలకంఠుండు
దొనకొంత పట్నము సోమవీథులూను
నానా దిక్కులులూను నాదించ శెంఖు
కాంతలు మేలుకొని గ్రక్కున
వొచ్చిరి
కరకంఠుని ఘంట ఘణఘణ నాదించి
'తిరుమందులవార! వల్లవులవార
అలరంగ భిక్షము అయిదువులార!
తేరె

కాశినుండి రాంగాను కడుప్రొద్దు
గూకె
వాసికెక్కిన యట్టి వొజితలార!
భిక్షము
కోరి భిక్షము తెచ్చిన కోటివొక్క
ఫలము
నారీమణులార! తేరె నడనడిచి
భిక్షము

పళ్యాన భిక్షము పరమేశ్వరునికి
అర్పించరె
తల్లులార! భిక్షము ధర్మమెరిగి
తేరమ్మ!
మగడ కోటవార! మరి నేతివార!
తెగువతో భిక్షము తేరమ్మ మీరు
ఇట్టిబోయిన వార! జెడదారి వార!
సుట్టానికి భిక్షము సూక్షాన తేరె!
శెంకుదార వార!
సంగమేశ్వరునివార!
పొంకముగ భిక్షము పోవలె
తేరమ్మ!
దామసానివార! దండె బోయినవార!
అలరంగ భిక్షము అమ్మలార! తేరె
[illegible]వార! [illegible]వార!
తెల్లవార వొచ్చను తేరమ్మ భిక్షము
ఆవ పువ్వులవార! అచ్యుతునివార!
నవ్వుత భిక్షము నాతులార! తేరె
రుద్రాక్షునివార! వో భద్రాక్షునివార
నిద్రలేచి భిక్షము నెలతులార! తేరె
కల్లందులవార! ఘనుసటవార!

తలకొని భిక్షము తనకు తేరమ్మ!''
అని అలాక్షన చేశను అపుడు
భక్తినయ్య
ధనముకొండ భిక్షము తాను
అడుగసాగెను
ఘంటనాదులె కాని ఘనుడు
కానగరాడు
యింటిమని తమలోను యెదికేటివారు
శెంకునాదులె కాని సదాశివుడు
కానగరాడు
కోకాన అటుసిటు సోలేటివారు
అలాక్షనేగాని అయగారు
కానంగరాడు
ఆలింగి తమలోను [illegible]
మాయల జంగ[illegible]
పాయక శివుడని ప్రేమిసేటివారు
దరవాదులు సొచ్చి తల్లికూటాలకు
వొచ్చి
'సిరిదేవి! భిక్షము శీఘ్రమే తేవె
కాశినుండి వొస్తిని కన్నతల్లి!తేవె
దేశాంత్రి భిక్షము తేగదె నీవు'

## అన్నముగలదా యని సిరిదేవి కోడంట్రడను ప్రశ్నించుట

గ్రక్కున లేచి కన్నతల్లి
మేలుకొనెను:
'వొక్కడు యీవేళ వొచ్చగాబోలు
అక్కడ శివరాత్రికి అయ్యలకు
అన్నంబు పెట్టితిని

కటకటా ఆరగింపుకు అయగారు
కదమాయగాబోలు
రచ్చవీథులవెంట రాచ అంగళ్ళ
భక్తుడు అగసాల కోమటి
బ్రాహ్మణ పంచలను

మరచి నిద్రబోయెను మహాఘనుడు
యితడు'
గురుతైన తన పెద్ద కోడలిని బిలచి
'భద్రాక్ష తావళాల భక్తుని సల్లమేడ
రుద్రాక్ష తావళాల రూఢి నల్లమేడ!
శివపూజ భక్తులార! శిలామంతులార!
శివభక్తి గలిగిన సిరిగల మేడ!
నిద్రమేలుకొని రావె నీరుజగంధి!
అంటుపడ్డ అన్నము అయ్యలకు
పెట్టంగరాదు
జంగమార్చన కడసూయ సకియరో!
మనకు
అల్ల సిరియాలుడుని పూఘనము
ఆరగించిన ఘనుడు
మల్లప్ప వొచ్చెను మాయ వేషమున
ప్రాణంబు అడిగిన ప్రార్థన చేశను
వేడి బోనము కావించు వేగంబె
కోడలా!'

## భక్తుని భార్య మేడాంబ భక్తునకు అన్నము పెట్టబోవుట

అంతట మేడాంబ అత్తగూడి
పలికేను
'చింతించ నీకేల? శముని దూరనేల?
దాచినాను తొణకని అన్నము నేను
యామార్లక అన్నము యప్పటికి
దాతునమ్మ!'
'భామా! నీవు దాచిన పనియేమి
చెప్పవె?'
'ఉత్తర కాశికి పోయిన
నీ పుత్రుముడు వొచ్చునోయని
సత్యాన అన్నము దాచినాను అమ్మ!
ఆకొని పాలేట నుండి మా అన్నలు
వొస్తురోయని
పేకొని బోనము చేసినాను మీకుగాను
పాటించి దాచినాను పరమేశ్వరుని
ఆన!'
'సత్యమైన బోనమైతేను సఖియ
నీసాక్షి!'
అనిన సంతోషించి అతివేగమునను
వొడ్డించి రమ్మనె వొణిత సిరిదేవి
ఘడియలో మేడాంబ కరకంటుని
దలచి
వొట్టి వేళ్ళ సిబ్బిలో అన్నము
వొడ్డించుకొని
పట్టు వస్త్రము అన్నముపయి
గప్పుకొని
వనజాక్షి మేడాంబ వవ్వార్లు వెడలి
తాల్మితో శిసునికి తాగొంచ రాంగ

## భక్తిరన్న అన్నముపై విభూతిచల్లి పోవుట

ఆ లాషణ చాలించి తమ
అయిదువులు దెలసి
'మెండేల చెల్లిన పెద్దలకు
మేనత్త చేతి అన్నము
కాండ్యాల చెల్లిన పెద్దలకు కన్నతల్లి
చేతి అన్నము
భామ చేతి అన్నము పాలేటికి కొంచ
పోరాదు
యేమని చెప్పకుందు? యేమిటికి
అంపితివి తల్లి?
పోట్లు సాటిన తమ్ములు బోనము
యవరిచేతి దంచేను
మాట్లాడతావు లే'దని మరియు
చింతించె గురువు
ఆదిమాయల గురువు అన్నము
మీదను
విభూది వేశను విశాలు గమ్మెనెను
కూడుమొలచిన అమ్మనగురు
గుగ్గిలపు వృక్షాలు కావలెను
పువ్వల వనము గావలెనని భూదేవి
శపియించెను
భువన శంకరుండు భక్తిరన్న తాను
వాడవాడలు గడచి వొచ్చను మగడి
గంటనాదులు సాలించి కాలాంత
పుణ్యుడు
మరి వేగ శివుడు వున్న మటముకు
వొచ్చను
గురువు మళ్ళిన వెనుక కులసతి
మేధాంబ

అన్నము మిల్లగొంచు అత్త
సముకమాయను:
'జంగాలు మళ్ళిరి సకల ధ్యానము
దెలశను
అంటుపడ్డ అన్నము కొంచపోతివి
నీవు'
'అంటు బడ్డ అన్నముగాదు
అమ్మగారి తోడు!
లింగమాన! జంగమాన! నీలకంటుని
అన!
బంగారు లోపుల అన్నము
పదిలముగ దాచినాను
సంగతిగ నిష్టతోను దాచినాను అత్త
కాశాత్ర పోయిన నీవుకన్న
కుమారుడు కాబోలు
దేశాంత్రి అయితేను దూషించదమ్మ
పరిదేశి జంగమయితేను
పట్టుబోనంబు
శాపాన వ్యాగసముర్దులు గాంగ
సదీశాయక పోయను భూములు
చలియించి
చరియించిన జంగమయితేను
పుచ్చుకునేను బోనము
యేమి సోద్యమోగాని
యెగ్గులెన్ననమ్మ'
'పరిదేశి జంగమవుట భక్తినయ్యా
అవుట
యెరుగరాదబె విభుని గురుతు
యలనాగ మేధ'

'పొదల మెకము శాలు
పుట్టుకుండలాలు
జడ జడను అయిదేసి చంద్రకాంత
లింగాలు
వొళ్ళెల్ల విభూది యోగవాగాలు
కుడి యడమ గట్టిన కుంజరపు
బొంత
కప్పెర డాచాత కనకత్రి శూలము
అప్పడె మళ్ళి పోయ యెరుగనమ్మ
గురుతు'

## అన్నపు మెతుకులను మొలకెత్తించుమని సిరిదేవి మేడాంబను పరీక్షించుట

'సత్యమైన బోనమయితె సకియ
నీసాక్షి
భక్తుడు అయితేను పాలించగలడు'
నీరాళ్ళమశల కాడికి అన్నము
నిక్షేపము చేశను
'నేరము సత్యము నే జూడ వలెను
చాలుబట్టి అన్నము చక్కగా
మొలచితేను
మేలు నీ సత్యంబు మెచ్చగద్దు
తమకు'
రోటబోసి కాశిరోకండ్ల త్రొక్కి
తాటించి తొలచి కడిగి ద్రాళ్ళమీద
బెట్టెను
'వొండిన బోనము వుండునా మొలచి
దండిగా వెదబెడితేను తెగమొలుచు
గాకను
నేకొంచు బోయింది నేరమాయ
తనకు
అదియేమి సోద్యమో అన్నము
మొలచీని!'

## గౌతమ సాటువ

"మధురాక్షి! వినగదె మరివొక
కథయు
భక్తి జూచే కొరకు పరుగ దేవతులు
వొచ్చి
సత్యమాహ గవుతుని అన్నము
సరుగ నడిగితేను
సంతోషాన వొచ్చెను సత్యమా
గవుతుడు
పాల చవుడు గాకుండ పల్లంబు
గాకుండ
నేల మంచిదిగాని నెరియులు లేకుండ
పరుగ వెట్టుకవాగు పయిన రాకుండ
యఱ్ఱబీళ్ల గాకుండ యేర్చ
గవుతుండు
కొర్ర పెడితేను యీతావున
కుప్పలుగా పండున్న

అచ్చమయిన కృష్ణరేకడకు
గవుతమ్మ అది కొనివచ్చెను

## మఱ్ఱి వర్ణన

వెలికొండ పడమర వెలశ నొకమఱ్రి సూడవేడుకయి వుండెను సొంపయిన
వాలాయము ఆ మఱ్రి వర్ణమట్లు అనిన మఱ్రి
రథమెక్కి విహరించు లాయవున్న మఱ్రి కుంజరములకు యిరవు గురుతయిన మఱ్రి
పగులెంచవొచ్చును మహా ఖుఖుపయిన మఱ్రి పెంజర గున్నలకు పెనపాము పిల్లలకు
పాదు చూచితే మఱ్రి పదిలమై వుండెను అంటికి[26] తాయిరువు అయివున్న మఱ్రి
పాతాళలోనంటి పారి వుండును వేళ్లు అంచితముగ రాహుచే అవిధి బెట్టు
కొమ్మలు చూచితేను గురుతయిన కొరకు
మఱ్రి ఖావించి పుట్టలోను ప్రభళి వున్నట్టి
ఆ మఱ్రికి ఆకులు అపనెల్ల దేవతామఱ్రికి ధీటయినమఱ్రి
యెరుగును పాటించి కు ప్రతివొచ్చు యీపుట్ట
రమణి(ణ)తో వేదాలు మహామేరువకు సాటి మరివొచ్చి
వ్రాశి(సి)నట్లు వుండెను వెలికొండ
వెరశి(సి) యనభయి యేడు లక్షల రాహువుకు సాటయిన శివతా
లెక్కను పుట్టలోను
పండ్లును కాయలు ప్రభళి[23] యామఱ్రి శేషుడు తా యిరువు చేసుకొని వుండు
నిండిన పరుణవేది[24] లింగాలు వలె విషపు వానలు పొగలుచు
నుండును కురియగాను
పూడలు కొమ్మలు వొప్పయిన మఱ్రి ఘట్టిగా మఱ్రికి కావలయి వుండును
వింజాద్రి[25]మలలలోను తిరువయిన గరుటుడు పావురాయులు కబోధి
మఱ్రి పక్షులు

---

23. ప్రబలి 24. పరుసవేది (?) 25. వింధ్యాద్రి 26. అన్నిటికి

యిరువు చేసుక వాన రౌంతులయి
వుండును
పావురాయల జోళ్లు పాయకే ప్రొద్దు
గురుచున నుండేటి గురుతయిన మర్రి
కోగెలలు చిలుకలు గూబ కంకణాలు
పమిడి కంబెలకు యిరువు బాగయిన
మర్రి
భయిరవుండు దుర్గ పయి కావలయి
వుండును

## గౌతముడు మఱ్ఱిని నరుకబూనుట

మర్రి వొద్దికి వొచ్చి గవుతుడు మరి
నిక్కిచూచి
అలుచుక పక్షులు అపదలు పడెను
దండిగా పక్షులతోను సమిదెలు
పలికెను
మర్రిగొట్టి గవుతుడు మరి
పాడుచేశను
కురచలుగానరికి గూళ్ళతో కొమ్మలు
అడకాడకు నుగ్గుచేసీ అగ్నితగిలించి
ఊడిదె రాసులు నేల పోగులు చేశి
చల్లార్చి యాబోడు చక్కగా దున్ని
'కులగిరుల నడుమను కొర్రపెట్టవలెను
వెర్లుగాక పక్షులార! వేగంబె మీరు
మర్రి విడచి పొ'మ్మని మరిసాటె
గవుతుడు
ఆమాటలు విని పక్షులు అలమరుగ
సొగెను
మూకలయి పక్షులు ముచ్చటలాడెను
వేకమయి పక్షులు యెలుగెత్తి
అడిలెను
మర్రినుఅడ పక్షులు మండలింప
సొగెను

## పక్షులు గౌతముని శపించుట

'హరహరా'యని పక్షులు ఆ గొబ్బు
గాను
'కటకటా'యని పక్షులు కన్నీరు
పెట్టెను
పొట పొటా నీళ్ల వాలిచి పొగిలెనా
పక్షులు
గూళ్ళమీది పక్షులు గుబ్బటిల
సొగెను
పిల్లల మీది పక్షులు పికపికలాయెను
తల్లటపడి పక్షులు ధరణిపయి
వొరిగెను
'అయ్యయ్యో గవుతమ్మ హత్య
గట్టుకుంటివి
చయ్యన విను పాల సముద్రము
ఛీదను

వటావ్రిక్షమనే మర్రిన వొక తరము
వుంటిమి
చేటుబట్టి ఆ మర్రి జలధిలో గలిశను
యిటువిను గవుతమ్మ యికనొక
మనిమి[27]
జంబోది వనమందు చల్లనయి
వుండగాను
అంబుధి దాటి యెరుకవాడు హత్య
గట్టుకునెను
శాపాన ఆ మర్రి జలధిలో గలిశను
ఆపదలేక వొకతరము అల్లోనేరటి
వుంటిమి
దేవతులు ఆ శెట్టుకు శాపంబు బెట్టిరి
దీవులు విడచి అంబోది దిశలు
యిరువు చేసుక
ఆ బెళమున వొ్రకతరము ఆపదలేక
వుంటిమి
దేవతలు ఆ బెళముకు శాపంబు
బెట్టిరి
అవులెల్ల రాళ్ళు అయివుండె నాడు
వుండ యిరువులు లేకను వాన
యండలు తగిలి
వుండేమని యిక్కడికి వొస్తిమి
మేము
జగతిలో సత్యంబు శెవ్వ్రతంబు
కలిగిన ఘనుడవని ఘనపుణ్యశాలి
చలి శీమను చాల చేపట్టే నంటివి

సత్యమహ గవుతుడవని చప్పంగ
మేము
బ్రతికేమని వొచ్చి యీప్రిస్థాన
చేరితిమి
కృతాయుగమునాడు గీములు
యేర్పరుచుక
వుత్తమా గుణముల వుండంగ మేము
సామి ద్రోహానకు తమమీద నీవు
గీములు యడిపించ కంకణము
గట్టుక
దేవుతుల చాత వొరము
పుచ్చుకొన్నావు
తావులు యడపించేది ధర్మంబుగాదు
తల్లుల బిడ్డల సమజూడ వొస్తిని
చల్లంటో గవుతమ్మ చేటు అయిన
పుట్టును
యేపున గవుతమ్మ నీయిల్లు
చెడిపోవును
తనకు వొచ్చిన ఆపద నీ
తరాతరమందు
భూమెల్ల యెరుగంగ పుట్టు
నీయింటను
సొంపు దప్పి నీయింటను శోక
మెడలేకను
అంప కోలంత పొగ అయి పుట్టు
ముందర

27, మనవి

గోఅత్య బ్రంహ్మత్య నీ కొడుకు
తరాన
భావించి నీ యింటను పశిరికె
పాములయి
తగులను గవుతమ్మ తప్పదు
యీమాట
యేమోయి గవుతమ్మ! యింత
పాపంబు
తాణికేది మంచివి మణికేది వేల?
పునుక గొట్టిన శిముడు పోద
దిషానకు[28]
అంతవారికి సకల ఆపద గలిగి
యింత పాపము నీకు యిదియేమి
మేలు?
పుణ్యభూములు విడచి పుత్రుల
వెరబాసి
వొన్నెగా నీ కొడుకు వొక్కడు
వొచ్చి
సీకటికోనలోను జపము శాయగలడు
పీకెతో దేవతులకు యిందు[29]వొప్పి
నీవు
యిటువలె నీ కొడుకు యిందువొప్పి
ముందర
పట్టుదప్పి తల గొట్ల పాలయి
పోగద్దు
జమదగ్ని అనువానికి జెన్మించి నట్టి
కొడుకు వొక్కడు చాత కోతలు
పడిపోవును

యిడువక మీకు మా విష వాక్కులు
తగిలి
యేనుగ తొండమంత సొద వెగసు
నీయింటను
పోశెముక నీ మటము పోవు
నేటితోను
పక్షిశాపము తగిలి బలుపయిన
మటము
చిచ్చుల మంటలయి శివలింగ
మటము
భగ్గు భగ్గున మండి
భస్మమయిపోను'
తెగువ చేసుక పక్షులు తిట్టె
ముందరికి
'పాపపు గవుతమ్మ పట్టు శాపంబు'
ఆపదబడి పక్షులు ఆడుమాటలు
వినియు
శాపంబు పెట్టేది తమముల చావ
తిట్టేది
'యీపట్ల మీమీద యీశ్వరుడు
దయతప్పినాడు
అలిగినాడు పక్షులార! అనుకోంగ
వొచ్చినాడు
తొలిగిపోయి పక్షులార! వెలికొండ
చేరుడి
డొంక బెట్టుగ శిముడు మీమీదగ
తోలినాడు రథము
చీకటి కోన చేరుడి శిశువులు మీరు

---

28. భిక్షానకు 29. ఖిందు

దీపాంత్రానకు పోంది దేవతా
పక్షులార!
నీళ్ళుపాలు చేసుక నిమ్మలాన మీరు
గూళ్ళమలకు చేరుడి గొబ్బున పోయి
సర్వాత పక్షులార! శివుడు దయ
తప్పినాడు
పర్వతముల చేరి పదిలాన వుండుడి
నేరము తనవల్ల లేదు నేడు
పక్షులార!
తిరుమలగిరి చేరి క్షేమాన వుండుడి
మంటలలోను మడియ నేల
పక్షులార!
కోర్కెతో మంతనాల కోనకు
యేతెంచుడి
యింటమని యినమనక విడిచి
పోంది మత్రి'
పక్షుల పొమ్మని పలికె గవుతమ్మ
గవుతమ్మ మాటలకు గమము
లన్నియూను
'సావుకు వెరచి యేదేశము వెళ్ళేము
వృక్షము కన్నతల్లి వినగ గవతమ్మ!
సచ్చేము మత్రితో శాపంబు నీకు
రక్షకుడు వ్రాశినాడు రార
గవతమ్మ!
పక్షుల చంపేనన్న ప్రజ్ఞనీకు చాలు
వుండేము చాలుగాని వోయి
గవుతమ్మ!
మంటలకు వెరచి యేదేశము
యెళ్ళేము
చుట్టక పోయేము చూడు గవతమ్మ!
మంటల కుములకు మీకు మావుసురు
తగిలి
తాచేకు మంటలయి తగులు
మీయింట
గట్టిగా గవుతమ్మ! పట్టు శాపంబు
మత్రి చెడ్డ కొన్నాళ్ళకు నీ మటము
చెడు గవుతమ్మ!
కొల్లు చడ్డ కొన్నాళ్ళకు నీ కోన
చెడు గవుతమ్మ!
యిరువు చెడ్డ కొన్నాళ్ళకు నీయిల్లు
చెడు గవతమ్మ!'

## గౌతముడు మత్రిని నరికించుట

శాపంబు బెట్టిన పక్షుల సమయ
జూతుననుచు
కోపాన గవుతమ్మ గొబ్బున వొచ్చి
మొత్తంగ సరిపించ మెరుగు పొడి
ఘోఘుంచి
సత్యమా గవుతమ్మ సరిపించ
గొడ్డండ్లు
దారలు పట్టించ తగకోట కత్తులు
పొందుగా బోటికి బోనమరించి
చంద్రవొంక గొడ్డండ్లు చేపట్టి కత్తులు

మునికొమాళ్ళ గవుతుడు మూకలు
చేసుకొని
ఘనమయిన మర్రికి కాలము నిండె
గనుక
మహావేగమున వొచ్చి మర్రి వొద్ద
నిలచి
'హర హర మహదేవ! హర హర
శిముడ!
ధీకొని నరక'మని చలవు యిచ్చె
గవుతుడు
ధీకొని మర్రిమీద తిరుగ బాగు కొనిరి
గొదకొని మర్రి మీద గొడ్డండ్లవారు
ఘద్దించి మర్రిమీద ఘాతలు చేసిరి
పుట్టలో శేషుడు బుసపెట్టు కొనుచు
చెట్టు కిందికే మద్సుల[80]
చేరిరాకుండ
మర్రి కిందికే గవుతుడు
మరి దారకుండ
అత్రు తొం త్రి పడిగె ఆడింపసాగె
మునికొమాళ్ళ శేషుడు మూకలు
చేసుకొని
ధేనువ వెంటబడి తరిమినారీతి
చేరి ముని కొమాళ్ళ శేషుడేడేట
తూరిగొడ్డండ్ల వారు తునియలుగ
నరికిరి
శేషుడు సమిశెను చేటుబుట్టెను
మర్రికి
యెసగంగ మర్రికి యిండెలు చూపిరి

బళువమున యామర్రి పడగ
నరికి రంత
కూతలు చేశి మర్రి కూలంగ నరికిరి
అతల కుతల మయి మర్రి
అవనిపయి వొరిగెను
పండ్లతో కొమ్మలు పడె భూమి మీద
ఆకులు కొమ్మలు అంతింతగాను
కోట కత్తులు వారు కొంచముగ
నరికిరి
మంత్రించి వీభూతి మర్రిమీద
చల్లెను
అగ్ని తగులుపడి కాలె ఆకాశము
పొడవు
మంటలు వెగశను మింటి
పొడుగునాను
కూకుటేళ్ళతో[81] మర్రి కుమిలి
కుమిలి కాలెను
పెంకముగ నిప్పులు పొగులయి
వుండెను
గూళ్ళను పిల్లలు గుబ్బతిల సాగెను
దొడ్డుగా యేడ్చుచు దొరకొని
పక్షులు
చీకాకు పడితాలీ చిటపటా యనుచు
యెదలేక కాలెను యేడుకోట్ల పక్షులు
పడెను మంటలోను పదికోట్ల పక్షులు
కొమ్మ కొమ్మ సందున కోటివేల
పక్షులు

---

80. మనుష్యుల 81. కూకటి వేళ్ళతో

ఆకు ఆకు సందున అరపయివేల పక్షులు
కుమ్మరామము చిచ్చువలె కుమారిల సాగెను
కలియగాలి యామ్మిరి కణుకులయి వుండెను
చలపట్టి గవతమ్మ సమయించి మర్రి
పోటిమీద వరషము పొల్లుగురియించ

## గౌతముడు తన భార్య జలకన్యను విత్తనములు తెమ్మనుట

సత్యమా గవుతుడు తన సఖియను బిలచి
విత్తనాలు తెమ్మన్ని విచారము చేశను
జలగన్య వేగమె జమిలికాదేవి
అలరంగ దీవించి అడిగె విత్తనాలు
'గిరిరాజ నిజరాణి! వో కీరువాణి!
పలికిన కీర్తులు ప్రభవినాదమ్మ
వార్తకెక్కినయట్టి వాణితె జమిలికాదేవి
మూర్తులు మీయింట ముచ్చటలు వినియు
అన్నము గొబ్బున అడిగిరటవారు
వొన్నెగా మీ అన్న వొప్పినాదమ్మ
కొత్తపంట్ల అన్నము కోరినారు వారు
విత్తనాలు గావలెనని విచారము చేశను
మారుమాటాడక మగువ తెమ్మనెను'

## వేయించిన కొఱ్ఱలను విత్తి జలకన్య పంట పండించుట

జలగన్న సత్యంబు శిముని ముఖ్యంబు
అలవేణి తా చూడ వలెనని అపుడు
వేడిమంగళాన వేంచిన కొఱ్ఱలు
వనరంగ జలగన్నె వొడి బడబోసి
తన సత్యముచాత తరుణి మాట్లాడక
మాడిన కొఱ్ఱలు మగువతాదెచ్చి
దండిగా పతిపతి సత్యానవొచ్చి
పతి గొఱ్ఱు దున్నంగ భామ యెదబెట్టి
సత్యాన కొఱ్ఱలు చక్కగా పండెను
అమనిగ కొఱ్ఱలు అతివిష్టిగాను
నోచివుండంగ గదా యేంచినా పండుట
నోచని వారికి వేంచినా పండవు
యాచకున్నా పండవు
'పన్నుగా శిమునికి భక్తిపరులార!
అన్నము మొలిపించవె అతివె మేడాంబ!''

# మేడాంబ అన్నపు మెతుకులు మొలకెత్తించుట

ఆ త్తమాటలు మేడాంబ ఆలించి
వినెను
బ క్తితో శివుని దలచి భామతా వొచ్చి
సీరాళ్ళ మళికాడికి నిష్టతో బోయను
సరివి తోడుత మూడు సాళ్ళుగా
చేశను
ముగ్గురు మూర్తుల దలచి మూడు
పాళ్ళలోను
అగళితముగ అన్నము అర్పణము
చేశను
నల్లగొలును ఆమీద నయమొప్ప
గప్పెను
జలకము చిలకరించి సాంబ్రాణి
వేశను
కావొచ్చి నిద్రించ తరుణి మేడాంబ
పాలించి శివుడు వొచ్చి
ప్రత్తెషమాయ
అన్నము బాళ్ళవెంట అతివిష్టిగాను
మొలచను అన్నము మూర్తుల
పంపున
యలమితో ప్రిషాలు వికసించినట్లు
గోరంట రుద్రాక్ష కొమరొప్ప తులశి
పరమేశ్వరుడు విష్ణు బ్రహ్మదేవుండు
సంతోషమందిరి సంగతిగా నపుడు
బాబల తెల్లవారె పశువులు అరచ
పక్షులు రాణించ భానుడు
వుదయించ
నక్షత్రములు పలసనాయ
నలితములు యెక్క
పయినమయి రథమెక్కి
భానుడు వుదయించ
నయమొప్ప సిరిదేవి నాతులందరును
అంతట లేచిరి అన్నము
ప్రథలివుండె
భ్రాంతిపడి చూచిరి పణతులందరును
'నాతిరో! వో మేడ! నానోముకన్న!
నీతిమంతురాల! నీనోము యెక్కువ
సీతకు సరివొచ్చు'నని సిరిదేవి
మెచ్చను
కోడలను మెచ్చంగ కూతురు
అగుమంచి
కడువేగ పలికెను కన్నతల్లితోను:
'వోయమ్మ సిరిదేవి! వొక
విన్నపంబు
నీ కోడలటె మొలిపిచ్చింది
గురువుగాబోలు
మేడటె మొలిపించింది నీవు
మెచ్చితిపిగాక
అన్న భక్తినన్నగాకుంటె అమ్మ
సిరిదేవి!
అన్నము మొలుచునా? నీవు
అంటివి గాక?'

## సిరిదేవి భక్తిరన్నను తన మేడకు రప్పించుట

కూతురు చెప్పిన కృప నందులనూక
రాత్రి భిక్షమడిగిన రక్షకుడిని
యక్కడనయిన
వెతకి తోడకరమ్మని వేగంబె
పంపె
అతివేద కులవారి ఆ నాగినేని
భక్తిరన్నను పిలువమని పంపె
సిరిదేవి
గొబ్బున నాగినేని కూటాలు వెళ్ళి
శెంబుని గుడిలోను శివులు
భక్తిరన్న
వున్నంగ చూచను వొప్పుగా నపుడు
దండములు బెట్టెను దగ్గరనిలచి
'సిరిదేవి పిలిచేని శివులులార! మీరు
వేగంబె పద'మని విన్నపము చేశను
నాగినేని గూడి నదలింగమూర్తి
మునుపు యెరగని మూర్కుల
యింద్లకు
యెనక వొచ్చేది యేమి కారణాను?

ఆతావున వుండరాదని అన్న
భక్తిరన్న
మటయేష్యముతో మరి కదిలి
వొచ్చను
అమ్మవున్న నగరికి అయగారు
వొచ్చను
అగుమంచి మొదలయిన అర్ధాంగ
లక్షిమి
ప్రకటితముగ యాదవ
పణతులందరును
శ్రీలక్ష్మి కొమరక్క సిరిదేవి
యపుడు
సమర్పణములు చేసిరి సరివేశ్వరుణికి
దివ్యరత్నాలు దాపిన త్రివాశి
పరిపించె
త్రివాశి వల్లక త్రిపురాంతకుండు
శివుడు కూర్చుండెను పులి చర్మము
మీద

## సిరిదేవి భక్తిరన్నను గుర్తించలేకపోవుట

కరుణతో సిరిదేవి కన్న కొమారుడు
అవుట
వొర్పింప లేక వొణిత యిట్లు
అనియె
కాశిలో వార్తలు గయిలో వార్తలు

వాశిగా అడిగెను తల్లి వొర్పింపలేక
'తన కొడుకు వొక్కడు తపస్సుల
గూడి
కడువేగ వొచ్చను కానవా తండ్రి?
అమ్మరో! అతడని అనవెరతు నిన్ను

వాలాయముగ యడబాశి వుత్తర
ప్రయాగ
నేటికి యేటి మీద ఆరునెలలాయ
నేటికి రాడాయ నేనేమి చేతు!
చేటివా ర్తకోకాని సంతోషానికో కాని
కూడు మొలచను తండ్రి! కొడుకు
రాడాయ॥
కొడుకున్ను తలుచుకుంటేను
కుమ్మరామము చిచ్చు
తగిలించి నట్లు వుండు తనకు
వో తండ్రి
మిగులు కొడుకు రూపు నీరూపు
వొక్కటేను
గురుతించలేను గాని కొడుకురో!
నిన్ను
నీరాడి వెలశినట్ల నిండె కన్నీరు
పట్టరాదు దుక్కంబు ఐక్తి నన్నను
తలుచు కుంటేను
మటపతి రాడాయ మాఅయ్యా! నీవు
కనివుంటె చెప్పుమా కడలేని
పుణ్యము
మోక్షము కలిగేని మా అయ్యా! నీకు
కల్ల బొంకులేని ఘనులయ్యా మీరు
వల్లవుల గురువును వో అయ్యా!
చూడవా
పరమాత్ముడవని నిన్ను పరికింప
వెరతు
శిరస్సున అయిదు జడలు చిత్ర
కన్ను గద్దు
పరుషంబు సంగతుల భద్రేశ! కాశి
అనవెరతుగాని అయ్యరో! నీరూపు
తనయుని చూడవా మాత్ముడవి[32]
నీవు'
అప్పుడు సిరిదేవి ఆడిన మాటలకు-
'వివేకము యరగవు వినవె వో తల్లి!
అడుగుచున్నావటె అమ్మరో! నీవు
చూడవా చూడవ యని సోదించి
అడిగేవు
యక్కడ నని చూతుమమ్మ!
యడలేదు కాశిలోను
లెక్కలేని మటములు నేను యెక్కడ
చూతును
కలరు కాశిలోను మహాఘనులు
వున్నారు
వినయము యవరని వివరించ
గలము!
కాశిపట్నమనగ ఘనలింగ వీడు
దేశాంత్రుల తీరు తెలియంగ రాదు
జోగుల బోగుల చూడ సోద్యంబు
గగన చుక్కల నయిన కలగన
వొచ్చును
కాశిలో మత్ములు కలగనే వారు
వాశిగా కొడుకుల గన్నవారెరుగ
లేరు

32. మహాత్ముడవు

పరుల వారికి మరియు
భక్తిరన్న యాల?
కొడుకులగన్న తల్లి గురుతెరుగ
కుంటేసు
కడమ వారికి యాల? వో కన్నతల్లి!
కన్నతల్లివి నీవు కానవు గాక
వెనయంగ కడలవారు యెరుగుదుర
గురుతు?
మధురాయె ద్వారక మరి పెద్దతావు
వెనయంగ వెరిగింతు యలమంచి
తావు
పుట్టుపంపాద్రి మా భూములతావు
హరియేలు పట్నము మా అయ్యల
తావు
నాటివున్నా తావు నా తల్లి నీతావు
భ్రాంతిపడి అడిగేవు పణతిరో!
యెరుగవా?
కాశి నా తావు వో కన్నతల్లి!
భాషించి అడిగేవు పణతిరో!
యెరుగవా?

తండ్రి వున్నతావుకు
తర్లిపోవుచున్నాను
పుంద ప్రొద్దులేదు వో యమ్మ!
తనకు
అమ్మా! భిక్షము పెట్టి
అంపవే మమ్ము
తమ్ములు మరుదులు దక్షణాదిన
వున్నారు
అందరిని కన్నుల చూచి అమరపురికి
తోడుక
పొందుగా బోవలెను ప్రొద్దు లేదు
తనకు
మాయమ్మ! నీతోను మాట్లాడ
తీరదు
అయ్యను చూచేనని ఆపేక్ష కలిగేని
గ్రక్కున బోవుచున్నాను వో
కన్నతల్లి!
మక్కువతో భిక్షము మాయమ్మ!
తేవె'

## యరణప్ప భక్తిరన్నను గుర్తించుట

గురుతించలేక కౌమారుని గూడి
యెరుగక సిరిదేవి విచారము
కాయంగ
పాలసముద్రము - యతణప్ప
పందుముల యరణప్ప

వాలాయముగ తల్లితో వొర్నించి
పలికె:
'భాషించ నీకేల? భాగ్యము
సిద్ధించును
కాశి బోయిన పుత్రుని కానవా తల్లి?

సిరుసున పల్లజడలు శివయోగి
కళలు
గురుతెరుగవ? పయి కుంజరపు శాలు
భస్మాంగము వాళ్ళను భైరవ కత్తి
హరియ రాజులు 88 మెచ్చి
ఆనవాలు యిచ్చిరి
కూర్మితో కొడుకుల గురుతు
యెరుగనివారు
వెనయంగ లోకాన యెవరయిన
గలరా?'
కూతురు చెప్పిన కృప నందుల నూక
భూతళమున పయిబడి పొర్లంగ
సాగెను
వాడిన చేను మీద వాన కురిసిన
యట్లు
నీడలకు పక్షులు నిండిన చందాన
కరువుకు జనులు అన్నము
కన్నచందాన
సిరిదేవి కొడుకువంక శిరస్సుయెత్తి
చూచను

కరములు ముకుళించి
కన్నకొమారునికి
దండములు బెట్టెను తల్లి సిరిదేవి
తల్లి నొదట యీభూతి దరయించ
గురువు
పొలపొల బోవుచు పుత్రుని చూచి
'కానలేను కొమార? కడు శోకమాయ
ధనముకొండను వుండి దక్షణాదిన
బాలలు
కదిలి పోయిన నుండి కడలేని
శోకము!
ముద మొప్ప కాశాత్ర నీవు పోయిన
నుండి
వుడగదు కన్నీరు వో కొడుక?
తనకు
బాల రాజులు దండుపోయి పదియేను
దినములాయ
యేలాగు దరయింతు'నని యెలిగెత్తి
అడిలె.

## పాపనూక యేది యని భక్తిరన్న తల్లిని ప్రశ్నించుట

తల్లి మనుస్సు గురువు తహ తహ
పరచి
'నీవు దుక్కించప నేటికి నేడు
వో తల్లి?
కాశి తీర్థము యిచ్చేను గ్రక్కున
రారమ్మ

కంచి అంత బలగము కన్నవారిని
జూస్తిని
వంచనా రుగలయట్టి వాదినెల జూస్తిని
అప్పల చెల్లిండ్ల అందరిని చూస్తిని
అమ్మా! నిను కనుగొంటిని అప్పల
జూస్తిని

88. హరిహరాదులు

నమ్మితి గదె పాపనాతి యేదమ్మ?
పందుములవారి బలుగాన్ని చూస్తిని
యెందున పొడగాన యేదమ్మ పాప?
వల్లవులవారి బలుగము వోరుసతో
చూస్తి
తల్లి పాప యేదమ్మ? తడువాయ
రాదు!
తిరుమందులవారి తీరెల్ల చూస్తిని
తీరుగల నాచెల్లెలు దివాణాన లేదు?
అంది మ్రొక్కినయట్టి అప్పల
చూస్తిని
యింతి పాప యేదమ్మ?
యెంత సేపాయ!
చేరి మ్రొక్కినయెట్టి చెల్లిండ్ల చూస్తి
గార్బపు పాపమ్మ గానరాదమ్మ?
నేతివారిని చూస్తి, నాతుల చూస్తి
క్రాంతి అయ్యేని చెల్లెలు పలికించు
నాతోను!
మర్ల వారిని చూస్తిని, మగువల
చూస్తిని,
పొర్లేను నా మనస్సు పొడగాన
నయితి!
చల్లవారిని చూస్తిని, సఖియల
చూస్తిని,
నలినాక్షి చెల్లెలు యేదమ్మ?
నాతులలో లేదు!

ముచ్చటలయ్యె పాపన్న ముచ్చటలు
వించేను
దయవొచ్చు చెల్లెలిని తలచిన
యపుడె
దవ్వుగ కాశిలోను తలతు చెల్లెలిని
ఆపొద్దు మనస్సున బాయదు
అషమయిన చెల్లెలు
తల్లిదండ్రులు లేని తన చెల్లెలమీద
వుల్లములో బుద్ధి వున్నాది తమకు
యేవేళ దేవపూజ యెలమితో చేసిన
ఆవేళ చెల్లెలు తమ ఆత్మలో
వుండును
అగుమంచిని పాపను అమ్మరో!
నిన్ను
వక్కసమానముగ చూడమంటి
నేను'
భూతేశు భక్తినన్న పొలతి
పాపన్నను
ఆత్మలో తలపోసి అడలంగసాగెను.
తెల్లముగ నరిసిన దేవసతి యరణప్ప
ఆ సమయమున భక్తినన్న ఆడు
వాక్యములు వినియు
యెనయంగ బలికెను యిందీవరాక్షి
చంద్రశేఖరునికి చెప్పంగ సాగెను:

## యరణప్ప భక్తిరన్నకు పాపనూక వృత్తాంతము చెప్పుట

'వల్లవుల భక్తినయ్యః నీకింత
వలపొయ్యనేలః
చెల్లెలు పాపమ్మ కత చెప్పెద
వినుము —
ఆరువేల తిరుమందులు, అన్న
భక్తినన్నః,
ఆరువేల వొల్లవూలు అమర
యాదవులు
పల్లికొండ రఘుపతి పలికిన వార్తలు
చెల్లెలిని మనువివ్వరాదని చెప్పిరి
బ్రాహ్మలు
పాలుగుణము అమావాస్య బవుళ
బుదవారమునాడు
జెన్మ నక్షత్రము చెప్పంగ సాగిరి
పుట్టు బుదవారమునాడు
పట్టపగిటివేళ
పుట్టుత పాపమ్మ భూమిదన్నింది
యెదురుగాళ్ళతోను యేక
పునికితోను
యెతుల శాపముతోను యిందీవరాక్షి
మజ్యానపు యాల మగువ జెన్మించ
ఆ పాప పుట్టిన అయిదు దినములాకు
అప్పుడు తండ్రులు అయిదు
కాండ్యాల
చిత్రవిత్తుగ పోట్లాడి చెల్లిరి వారు
మత్తగజయానను మనువివ్వరాదు
యిల్లిటము లివ్వవొచ్చు యిలు
వెళ్ళరాదు
యిచ్చిన వారిల్లు యిలమీద కుంగును
పుచ్చుకున్న వారిల్లు భూమందు
వెలసును
మనము యిల్లెటము మరి
యివ్వకుంచేను
కినక మేడన వుంచమనిరి కళ్యాణపు
చెల్లెలిని
ఆ మాటలకు వో అన్న భక్తినన్న!
మీ అమ్మ సిరిదేవి నీ తమ్ముడు
అయితన్న
బంగారు జలపోత పషిణి స్తంభాది
కట్టించ అయితన్న కనక మేడ
చెల్లెలికి
నెట్టుకొని పాపను నీవు
వొచ్చినదనుక
ఆరూఢిగా మేడమీద మీ అమ్మ
వుంచినాది
నేరము అందరిది యిది నీకు
చెప్పేను'

## పాపనూకను మేడ బెట్టినందులకు భక్తిరన్న దుఃఖించుట

పాపను మేడ బెట్టినారంటె పాపపు
తల్లిమీద
కోపంబు-చేసి భక్తినన్న
గోడుగోడున అడిలెను

మంధ్రయాసంగిలో[84] మంట
మండిన యట్లు
నిండుకొనె భక్తిరన్నకు నిలువెల్ల
శోకము :
'వోతల్లి! సిరిదేవి! వాక
యిన్నపంబు
చెల్లెలిని మేడబెట్టుట చేటు
యెరగరయితిరి
అప్పలు చెల్లిండ్లు అమ్మకు
విన్నవించి
చప్పరయితిరి వొకమాట వో అప్ప!
యరణప్ప!
వల్లఫులవారి గోత్రాలు వొయినాన
పాడగాను
యెల్లలోకాలకు యెన్నికయ్యే
కావుననుచు
తల్లి మేడ బెట్టుట తలుచుటా యెరుగ
అందరు గలిగి చెల్లెలికి ఆపద
చేసిరి
పంతముగల యట్టి పమిడి కడియాల
చెల్లెలిని
యింత కట్టడి బ్రంహ్మ యెట్లు
లిఖియించ
చేపట్టి మేడ బెట్టుట చెల్లూనా మీకు
దుక్కమెంతయు లేక దోషము
అనక
వెక్కసమాయన పాప?
యేణ్యమాయనా నీకు?

వుక్కున బుట్టిన గుండెలు వురివిలో
తల్లికి!
తల్లిగూడి వకమాట తగ
చెప్పరయితిరి!
హారిగురువు పల్లికొండ అట్టె
వూరికె వుండెన?
సిరిదేవికి వకమాట చెప్పడాయన
బావ!
కాదని చెప్పడాయన కన్నతల్లికిని!
మేడమీద చెల్లెలు
మండలించకుండేన?
కొండబే తల్లి మనుసు గుండెలు
చెదరక!
కూడు మీకు యిమిడెన కృప నందుల
తల్లి?
కన్నకూతురు పొడుగు కడ
మేడమీద వుంటేను
నీ కడుపు యెట్ల ధరయించు, వో
కన్నతల్లి?
పాపను గన్నతల్లి పణతి పెద్దమ్మ
వుంటేను
ఆపదన్న పడుగాని అంపునా
మేడకు?
ఘనమైన చెల్లెలిని కనక మేడ
బెట్టితిరి
ధనములు నిత్యమనుకుంటివ తల్లి
సిరిదేవి?

84. ఘుంఘు ఫేసని

కూటాలు నిత్యమనుకుంటివ తల్లి
సిరిదేవి?
కూటాలు ఒక గడియలో కుమిలి
కాలేని!
సంపదలు నిత్యమనుకుంటివ తల్లి
సిరిదేవి?
సంపదలు ఒక గడియలో సొంపనిగి
పోవును
భక్తినన్న వొచ్చినాడని పాపను
రమ్మనుచు
సత్యముగల చెల్లెలిని సమ్మతించి
మీరు
అప్పలు చెల్లింద్రు అందరు బోయి
పదివేల వందనములు పాపమ్మకు
చెప్పి

మదిరాక్షిని తేరమ్మా! మగువలు
మీరు
వాశిగల చెల్లెలు మేడ దిగకుంటేను
కాశితీర్థము యిచ్చి గ్రక్కున
రారమ్మ!
కాలహేష్యము యెరుగును కళ్యాణపు
చెల్లెలు
పాలేటి వార్తలు పాపమ్మను
అడిగిరాండి!'
అప్పల గారవించి అతివేగ పిలచి
అప్పల చేతికి కాశితీర్థము అందించ
గురువు
పవిణి గిన్నెలతో పట్టుకుని
కాశితీర్థము

(అసంపూర్ణము)



# శాసనములు – కైఫియతులు

# అనుబంధము VI (i)

## గుండ్లపాలెము శిలాశాసనము–యాదవవంశ వర్ణనము

( నెల్లూరు మండల శాసనములు – రెండవ సంపుటము
సంపాదకులు : బట్టర్వర్త్ – వేణుగోపాల శెట్టి )

''యాదవ జన్మం వైశంపాయిండు పరీక్షిత్తుకు యిట్లనిఎ. అదితికి కశ్యపునకు పుట్టిన వైవస్వతుండను మనువునకు యెముండును శనెశ్వరుండును యెమునయుం దపతియుం బుట్టిరందు వైవస్వతుండను మనువువలన బ్రహ్మ క్షత్రియ వైశ్య సూద్రులైన మానవులు అనేకులు పుట్టిరి. వారికి శే(వే)న ప్రముఖులైన రాజులు యనమండ్ర పుట్టిరి. ఆ ముని పుత్రియైన యిలగన్య సోమపుత్రుండైన బుధునకు పురురవ చక్రవర్తి పుట్టె. పురూరవునకు వూర్వ సికి నాయువుంఉ పుట్టె నాయువునకున్ స్వర్భాయికున్ నభిషుండు పుట్టి రాజ్యంబు సేశె నభిషునకున్ ప్రియ మో(మ)నునకున్ యయాది పుట్టి యనా (నే)క యాగంబులు సేసెను. యయాడికిని శుక్రుని పుత్రియైన దేవయానకున్ యదువు జన్మించెను. శీలముగల యదుకులాత్మజుండు యాత్రియగోత్రజుండు ఆ సూరూనుండనువాడు మధురా పురంబుం దనకు రాజధానిగా మాధురంబులు సూరసేనంబులనియెడి దేశం[బు*] లేలె పూర్వ కాలమున ఆ సూరునునికి పుత్రుం[డు*] వసుదేవుండు అచట

"రాజేంద్రవినుదొల్లి రాజలాంచ్ఛనంతో వేల సంఖ్యలు దైత్య విభు లుం దన్ను ఆక్రమించిన భూమి భార మానం జాలక గోరూపయై బ్రహ్మం జేరం బోయి కన్నీరు మున్నీరు రోదనం శాయ కరుణతో భావించి కమల భవుండు ధరణి నూరడం బల్కి ధాత్రియును వేల్పులు కదలిరా విష్ణునిం గాన నేంగి పురుష సూక్తంబు చదివి యద్భుద సమాధినుండి యొక మాంట విని ఖాళిజోద్భవుండు ఘనుండు వేల్పులును ధరయును నేవిన్నయెట్టి పలుకు విష

రించెదనని ప్రీతిం బలికెం దెలియ॥ యాదవకులమున నష్టురులు మేందినిపై బుట్టం జనుండు మీ యంశమునన్ శ్రీ దైతుండు వసుదేవున కాదరమునం బుట్టి భార మంత్రయుం బాపును॥ హరి పూజార్థం పుట్టుండు సురకన్యలు భూమి యందు సుందరతనులై హరి కగ్రజుండై శేషుండు హరికళతోం బుట్టి భార మంతయుం బాపును॥ అవనీశ విను ద్రోణుండను వాండు వసువులయందు ముఖ్యుండు ధరఅతని భార్య ఆ వేల్పులపెద్ద ఆ ద్రోణుండు యీ నంద్ద గోప కుండై జన్మించె ధరయియ్యె హరియోగమాయ యశోద మండుక్కడుగాయై జెన్మించె యల్ల ధేనవలెల్ల ఋషుల అంశమున జన్మించె సురతెల్ల గోరక్ష పాల కులై జన్మించె.

"దేవకియను తొల్లి స్వాయంభుమను నంతరంబున పృస్తియను ప్రతివ్రత వసుదేవుండ్డను సుతపుణ్యుండను ప్రజాపతి రెండవ జన్మమున అదితియుం గస్యపుండను మూండవ జన్మమున వసుదేవదేవకి రామక్రిష్ణులు వుద్భవించిరి అక్ష(చ్చ) రాంగనలు గోపకన్యలై వుదయించిరి. రామక్రిష్ణులు మొదలైన సర్వయాదవులు గో గోపాలలుక్కడాంపార అంత్యమున కూడ వర్తించి అచటం గొన్నాళ్ళు దుర్యోధనాదులం ద్రుంచి పాండ్డవుల పరగ బట్టంబుగట్టి సంతోషమ్ము వచ్చె ద్వారకాపురికి కణ్వమహామునుల గాంధారి శాపం వంకను మునుకొని యన్నంగ ముప్పదియారు వర్షములు శ్రీక్రిష్ణ మొదలైన సర్వ యాదవులు రాజ్యంబు సేసిరి. శేయంగ నొక్కనాడు వుత్పాతములు వొడయెను. వృష్ణి వంపున జాతరలు శయ్యను ద్వారవతి కదలిరి. శ్రీక్రిష్ణ యాదవులు సముద్రుని కడకు జలధి తీరమున సవపానమత్తులై విష్ణు భోజాంతక వీరులెల్ల మునివర నిర్దిష్టమున నిర్దిష్ట ముసలాంత్మ కృముల్లైన ముయ్యంచ్చ తుంగ్గల మోందులాడి మృతునైరి అంత తా(దా)రకుండు చని పాండవుల తెరింగించె,

"అర్జునుండ్డు ద్వారావతికి వచ్చి వసుదేవునింగనె శ్రీక్రిష్ణ పరమమూర్తిం గలసె యాదవులు దేవగణానం గలసిరి ద్వారావతి వనధి ముంచునని ఆక్షణమె బాలవృద్ధులాను అక్షరాంగనలాను గోపాంగనలాను గొంచ్చు అర్జునుండు యింద్ర ప్రస్థ[మున*] కుందెచ్చెను. ఆ (యా)దవ కులకరుండైన వజ్రధరునిం బట్టంబు గట్టెను. యాదవ గోపికా పౌత్రవని నేమించ్చి గోవులకు గోరక్షపాలకునిం జేసి గోవులం గాపాడుమని ఘనవిరపురంబ్బున అమృత గోవిందుని అభిషిక్తుం

జేసెను. యాదవులు అందరిని అక్కడ అక్కడ నిలిపి అర్జునుండు హస్తినా పురికిం బోయి ధర్మజుకు యెరింగించ్చెను యాదవులు పాండవర్లు స్వర్గాదిబోగానకు బోయిన వెనుక నన్నూరు యేండ్లకు కలియుగం చొచ్చెను.

“వజ్రదేవుని పుత్రుండు దధి సంగ్గుండనంగ గోపికల పౌత్రకుల వంశకరులు బృందావనమునం బ్రిధివింబెంపొంద్ది నందవ్రజంబ్బుకు నలినొప్పు చుండు ఆవుల మేపుత నలరి గోపకుల దైవతాచలమున రంజలుచున్న యాదవులకు దైవమెంతయు నొప్పు అమృత బాగేశ్వరుం డంద్దు వెలిసున్న వసుదేవ నందనులు తొల్లి శ్రీవిష్ణుముంతరం గోర్క్యులు మీర ప్రతిష్టలు శేశిరి ప్రభ మీరి వెలయ గోవిందు మనమండు వుపనంద్దు పుత్రుండ్డు అమృతాంబోజుండని ఆదేవు పేర వెలయంగ బెట్టెను విశదంబుగాను.

“అతని పుత్రుండు విజయాంభోజుండు సంతోషమున నుండ్డ జనమేజయండు యజ్ఞంబుసేయ నెల్లరాజులను రప్పించి యజ్ఞముండగంజేసె విజయాంబోజుని మెచ్చి వారణాపురంబ్బున పట్నస్వామిగా జేసి కొంత్తగాలం రాజ్యంబ్బు సేసిరి.

“కలియుగాద్దాః సూద్రకి రాజ్యకాలమున విజయాంబోజాద్దాః 530. కనకాంబోజాద్దాః 490. విక్రమార్క్యని కాలమున గజయాంబోజాద్దాః 430. రాయాంబోజాద్దాః 420 రత్నాంబోజాద్దాః 402 వీర విజయః రాజాద్దాః 390. శాలివాహనుని కాలమున పద్మన రాజాద్దాః 354. శ్రీకూర్మిరాజాద్దాః 340. బోజరాజు కాలమున సింహాద్రి రాజాద్దాః 300. చోడని కాలమున వల్లురాజాద్దాః 195. పోలురాజాద్దాః 82. వోరుగంట ప్రతాపుని కాలమున కాటమరాజు 32 రాజ్యంచేసి లింగాలకొండ యఱ్ఱగడ్డపాటను నలసిద్ధిరాజుంగూడి యుద్ధంబుచేసి బడుగులవారు చనిపొయ్యేనాంటికి కలియుగం చొచ్చి 3965 యేండ్లాయెను. వీరుల మహత్వం ఆదిపర్వ సకలభూత సంభవ అనుశాసనిక భాగవత దశమస్కంధ మవుసలాన వెళ్లిన శాస్త్రధర్మమిది.

“త్రిమూర్తులు కారణమున గోస్పృంగ పర్వతాన తొల్లి యాంభోజ రుషి మొదలైన రుషుల సంతతిని ధేనువులున్ క్రిష్ణావతారంన గూడి దేవతఋ షూశ

వర్తించిరి. ద్వాపర అంత్యమున జన్మించిరి. అధ (యాద) వు కులమున చంద్ర నందను పురూరవ చక్రవర్తి యయాధి (తి) యదుకులోమ్మజు సూరశేను వసుదేవు పుత్రం శ్రీక్రిష్ణమర్గ క్రిష్ణదుర్గ వీరికి నడిచి దెఖై రెండు నియోగాలు బడుగుల వారికి చెల్లును వీరు యయాది (తి) వంశం శాపకారణమున గోవుల రక్షింప గోరక్ష పాలకులం జేసిరి వెలసిరి గోపకులు వెయివేల సంఖ్య" శ్రీ శ్రీం జేయునూ.

"అత్రియెముని సంతతి రాజులు యేలిన పట్టణ భూములు అత్రియ నేత్రపుత్రుడు భూలోక మెల్లాడి పించెను. ఆ చంద్రనందను పుత్రుపురూరవుండు భూచక్రమెల్ల యేలెను. ఆ పురూరవ పుత్ర పౌత్రుండు యయాది రాజుయై నవఖండ పృధివి యెలె. యయాది పుత్రుండు యధువు యేనాక భూములు యేలెను. యెదుకులోంత్మజు సూరశేను మధుర మాధురంబులు సూరసేనంబు లనియెడి దేశంబులు యేలెను. ఆతని ఆత్మజుండు వసుదేవు మధురా పురంబు యేలె. అతని బంధువు నందగోపకుండు రేవుపల్లె యేలె. వసుదేవు పుత్ర శ్రీక్రిష్ణ ద్వారవతి యేలెను. క్రిష్ణగోపి కావ పుత్రులు వజ్రధరు అమృత గోవిందు అంభోజు లార్గురు యింద్రప్రస్థ ఘనవీరపురి రాజ్యంబు సేశిరి.

"పద్మనాభుండు యేలె యంద్దలి రాజ్యంబు కొంత యేలె వీరవిజయుండు యేలెను న। శ్రీ కూమ్మర్ండేలెను అరుంటులకోన అమరవతి సింహ్యాద్రి యెలమంచ్చి యేలెను. వల్లురాజులె ఆలవల్ల పురము అచట కొన్నూళ్ళు అడిదె విచేలెను. ఆలపోలురాజు ప్రతాపుని కాలమున యెదుకులాత్మజులు దనుముకొండ మందలుడ, పినయెర్ర పెదయెర్ర యేలంగ యెర్రలకు అనావ్రిష్టి దాంకి ధేనువు లకు మేంత లేదని రాజున్ పద్మనాయుండున్ వివరించుకొని ధేనువులున్ దారు కదిలిరి. పాంకనాడు సిద్ధిరాజుకు పుల్లరి వొడంబడి భూమిచొచ్చి మేపిరి. మేపుత నలనన్న ధేనువులుందాను దక్షిణాదనువు కోటికి కదలిపోయి దనువుకో వల్లభుని దర్శించి నలనన్న ధేనువులుం దాను మరిలి దిన నిధుల మీందగం గదిలివచ్చి పెన్నవెంట విడిసిరి. నలసిద్ధివారు యెద్దుల యెసిరి ఆదవుల వందను అందం తరుచాయ ఆడవుల వంక రంతు వడె నెల్లూర ధేనువులుం వారు కదిలి యఱగడ్డ పొట్ల నిలిచెను. నలసిద్ధి రాయభారి పుల్లరికి వచ్చెను. దట్టించి రాయభారిని పుల్లరి

లేదు పొమ్మనిరి. లేదు పొమ్మంటేను నెల్లూరి నలసిద్ధిరాజు యఱగడ్డ పాటికి యెత్తి వచ్చెను.

''స్వస్తి శ్రీ శాలివాహన శకవర్షంబులు 1170 అగునేంటి కాళయుక్తి సంవత్సర కార్తిక శు. ౯ గు నెల్లూరి నలసిద్ధిరాజు సర్వసన్నాహం మెరసి లింగాలకొండ యఱగడ్డపాటి కూడలి సోమేశ్వరుని సందలిన నాన ఆత్రియగోత్ర యాదవ క్షత్రియ మధురాపురమందీశ్వర శ్రీ విష్ణుయోగమాయ దివ్యశ్రీ పాదక ప్రకట శాత్రవభంజన నచ్చెరువుంది పౌత్రలాయత్తవం గౌరవ పౌరవుండు ద్వారకా పురి గోపికావల్లభుని పౌత్రుండు వల్లురాజు లతని సుతులు పోలురాజు పెద్దురాజు వారిపుత్రులు మొదలైన యాదవులు నలసిద్ధిం గూడి యుద్ధముసేసి మృతులైరి. యదువంశమునకు భయంబు దొలగునని త్రిమూర్తులున్ యోగమాయాదేవిని యిట్లనిరి. గోపికాజనములు గోపాలకులుంన్న పసులమందకు నేంగు భద్ర సీవు వసుదేవ నందనులకు గర్భపుత్రికవై నానావిధ సంపదలకు స్తాలకమై మానవులు భక్తిం గొలుతురు కానకలును బలులు నిచ్చి పద్దెనిమిది నామంబుల కొనియాడుదురు. ఇయ్యాస్తానంబులు యెరింగించ్చవుమి పిఠాపురి హేంకృతి దనువుకొండం ప్రత్యక్షమై పాలేటి తీరమున భాగిరతై నిలిచి భక్తునికి ప్రత్యక్షమై త్రిమూర్తుల మెప్పించి వీరమహత్తు ఇప్పించెను. భాగీరతి దుర్గస్తానం కొండయ్య కొడుకు రామయ్య వుద్దరించిన శాసనం''

# అనుబంధము VI (ii)

## స్థానిక చరిత్రలు - (18 వ సంపుటము)

## రణతిక్కన వృత్తాంతము

"నల్లసిద్ధి దేవ చోళమహారాజు నెల్లూరి పట్టణమందు సింహాసనారూఢుండై పృథివీ సామ్రాజ్యము సేయుచుండగాను వారివద్ద రణతిక్కన్న అనే బ్రాహ్మడు సేనాధిపతి. ఇతనికి ఖడ్గతిక్కన్న అని పేరు కలదు. అప్పుడు యాదవ వంశోద్భవుండైన కాటమరాజు, ఇతని పిన తండ్రి పోలమరాజు, ఈ పోలమరాజు కుమారుడు కరి ఆవులరాజు—వీరు లంకమల, పాలకొండ, నల్లమల మొదలైన పర్వత ప్రదేశములందు అరణ్యాలలో పచ్చికపట్లను తమయొక్క విస్తారమైన గోగణమును సంరక్షణ చేసుకొంటూ నల్లసిద్ధి చోళ మహారాజుకు పుల్లరికి గానున్ను తమ మందలో పుట్టే కోడెదూడలను కొన్ని యిచ్చేటట్టున్ను వారి దేశమందలి వుండే కసవు పచ్చికపట్లు తమ గోగ్రాసమునకు గాను ఇచ్చేటట్టున్ను నిర్ణయించుకొని కొంతసైన్యం అందలాలు ఏనుగులతో ప్రసిద్ధిగా వుండేవారు. మరికొన్ని దినములకు [గోవులు] ఆమదశవల్లను-గ్రామములో ఎక్కడెక్కడ ఉన్న సస్యాదులను-మనుష్యుల అంకిలిలో నిలవక మేసేది గనుక ప్రజలు రాజుతో ఈ సంగతి విజ్ఞాపనం చేసుకొన్నయెడల "బీడు పచ్చికపట్లు యావత్తు కాటమరాజువారిగోవులు మేపుకొనే లాగున మాటయిచ్చినాము. పైర్లు వారు మేపుకోవలసినది కాదు; అయినా కాని మీరు పైర్లు జాగ్రత్త చేసుకొనేది" అని శలవు యిచ్చి "మీరు పైర్లు మేపవద్దు, బీడుపచ్చిక మేపుకొనేది" అని కాటమరాజు గారికిన్ని వ్రాసి పంపించిరి. ఇదిగాక అరణ్య ప్రదేశమందుల కాటమరాజుగారి విస్తారమైన గోగణం తిరిగి మేస్తూ వుండేది మొదలుకొని గో సంరక్షణార్థమై కాటమరాజువారు క్రూరమృగములను అగుపడ్డచోట వారే వధ చేస్తూ వచ్చేవారు గనుక నున్ను అరణ్యమునందు గోగణపాలకులయొక్క సమ్మర్దము విస్తారమైనందున సాధారణముగా మృగములు అరణ్యమందు నిలవకపోతూ వచ్చినందుననున్ను మృగవధ చేసుకొని తత్సామాన్య వృత్తివల్లను జీవనోపాయం కనివుండే కిరాతకులకు జీవనహాని అయినందుననున్ను ఆ కిరాతకులు కాటమరాజుయందు ద్వేషులై వుండిరి. ఇదిగాక నల్లసిద్ధిరాజుగారు వుంచుకొన్న

బోగముదాని వద్ద వక పెంపుడు చిలక వకనాటి కాలమందు మ్యాడలోనుంచి తప్పించుకొని వచ్చి అరణ్యశుకములను కూడి కాటమరాజు అవులమందల సామీ ప్యములకు సమూహముగావచ్చి ధ్వనులుచేయగా కొన్ని గోవులు బెదరి ల్యాగ లను కలగదొక్కుకొని పారిపోయినవి. అప్పుడు కాటమరాజు పినతండ్రి అయిన పోలమరాజు చూచి బాణము సంధానము చేసి వేసినందున ఆ బాణము సమూహ ములో వుండే పెంపుడు చిలుకకు తగిలి ప్రాణం విడిచెను. ఆ చిలుక కాళ్లకు గజ్జెలు, అందెలు వుండేది పోలమరాజు చూచి యది పెంపుడుచిలుక అని నిశ్చయం చేసెను. అంతట ఆ సామీప్య మందునవున్న కిరాతకులు నల్లసిద్ధి రాజు ఉంచుకొని వున్న బోగముదానివద్దకు ఆ చిలుకను తీసుకొనిపోయి ఆగపర్చి "నీ చిలుక తప్పివచ్చినంతట అన్యాయంగా కాటమరాజు పినతండ్రి అయిన పోలమరాజు బాణప్రయోగం చేసి చంపినా"దని చెప్పినంతట అది చాలా దుఃఖితురాలై అరణ్యంలో వుండే క్రూరమృగాదులను వధ చేసేటటుగాను వ్యాట లాడుతూ వుండి కాటమరాజుగారి గోవులనున్ను వధియించమని వుపదేశించెను. గనుక ఆ కిరాతకులు కాటమరాజు వద్దకు వచ్చి మేము సామాన్య మృగములను వధచేసుక జీవనం చేస్తున్నామని మనవి చేసినంతట కాటమరాజు అనుకూలించి శలవు యిచ్చినందున ఆ కిరాతకులు ఆరణ్య మధ్యమందు మృగాదులను చంపి నట్టుగా వుండి కొన్ని గోవులను గుండుతో వధచేసిరి. ఈసమాచారములు కాటమ రాజు విని చాలా ఆక్రోశముతో ఆ కిరాతకులను చంపించి తదారభ్యం నల్లసిద్ధి రాజుకు యిచ్చే పుల్లరియివ్వక నిలిపెను. అంతట నల్ల సిద్ధిరాజు పుల్లరి యివ్వమని అందుకు ఆవులమందలలో వుండే కోడెదూడలు తమకు తోలి అంపించమని వర్త మానం అంపించగా అందుకు కాటమరాజు మీ సీమలో మా అవుల మందలకు నిరోపాదిగా వుండినట్టయితే మీకు పుల్లరి యివ్వవలసిన కర్తవ్యం; అటుగాక మీ దేశములో వుండే కిరాతకులు మా అవుల మందలకు వుపద్రవంచేసి కొన్ని ఆవులను నిష్కారణంగా వధించినారు గనుక మేము పుల్లరి యివ్వవలసిన నిమిత్తం లేదని ఖండనగా వ్రాసి పంపించినందున అదివరకు మందలలో వున్న కోడెదూడలను తోలుకరమ్మని కొంత సైన్యమును నల్లసిద్ధిరాజు పంపించినందున వారు వచ్చి కోడెలను తోలుకపోవచ్చినంతట కాటమరాజువారు వచ్చిన సైన్య మును లక్ష్యం చేయక తిరుగాకొట్టినారు. గనుక వారు తిరుగా నల్లసిద్ధిరాజువద్దికి పోయి యావర్తమానములు ఎరుకచేసినంతట నల్లసిద్ధిచోళ మహారాజులుంగారు

ముఖ్య సేనాధిపతి అయిన రణ తిక్కన్నతోకూడా కొంత సైన్యమును కూర్చి "కాటమరాజువారు సమాధానముగా కోడెలు ఇచ్చినట్టయితే వుత్తమం. అటుకాని పక్షమందు వారి మీద కార్య పెట్టి వున్న కోడెలు యావత్తు మళ్ళించుకర"మ్మని పంపించిరి. అదే ప్రకారం సేనాధిపతి రణతిక్కన్న వచ్చి సమాధానంగానే విహితంతో ఎప్పుడూ వచ్చే ప్రకారం మందిలలో కోడెలను ఇప్పించమని కాటమ రాజు వద్దకు వర్తమానం అంపించగా వారు అనుకూలించక ప్రతిఘటించి వుత్తరువు ఇచ్చినందున కార్య(ఖడ్గ)తిక్కన్న యుద్ధ సన్నద్ధుడాయెను. ఈ యత్నము విని కాటమరాజు వారున్ను వారికి విహితులైనవారిని కొందరిని సహాయముగా కూర్చుకొని బలిమిగల ఆవులు మేలైన కోడెలు సహా వెంట కూర్చుకొని యుద్ధ సన్నాహమై నిలిచిరి గనుక ఉభయ పక్షముల వారికి అఘోరమైన యుద్ధ మాయెను. ఆ యుద్ధ సమయమందు కాటమరాజు వారి గోవులు యుద్ధ భూమిని వచ్చి నిలిచి యెదిరి సైన్యములో కొంతమందిని హతం చేసినవి. అంతట రణ తిక్కన కార్యం నిర్వహించ లేక తిరిగీ స్థళంలోకి లేచిపోయెను. ఇంటివద్ద భోజన సమయమందు తిక్కన్న భార్య తాను స్నానం చేసే రహస్య స్థళమందు రణతిక్కన్నకు స్నానానికి నీళ్లువుంచి స్నానం చేయమని చెప్పినంతట అత డక్కడికి పోయి చూచి అక్కడ నాకు నీళ్లువుంచిన కారణం ఏమి అని అడిగెను. అంతట తిక్కన భార్య ప్రత్యుత్తరం ఇచ్చిన క్రమము. ఏ స్థళం అయితే నేమి, రూప భేదం వల్ల విశేషం లేదు గనుక ఇక్కడనే స్నానం చేయవచ్చును అని చెప్పినంతట తాను కార్యములో నుంచి తిరిగి వచ్చినందున భార్య యీ మాట చెప్పినది అని తెలుసుకొనెను. స్నానానంతరం భోజన సమయమందు తిక్కనకు తల్లి విరిగిన పాలు వడ్డించి నందున ఆతనుచూచి విరిగిన పాలు వడ్డించిన కారణం ఏమని అడుగగా "ఈ దినమందు మన గోవులున్ను మేతకు నీవు పోయిన పొలానికే పోయివచ్చినవి" అని చెప్పింది గనుక తాను కార్యములో నుంచి తిరిగి వచ్చి నందున ఇందుకు దృష్టాంతముగా తల్లి ఆ మాట చెప్పినదని గ్రహించిన వాడై భోజనానంతరమందు తిరుగా కొంత సైన్యమును కూర్చుకొని యుద్ధానికి పొయ్యేటప్పుడు తన తల్లిని భార్యను పిలిచి

"పూర్వమున ఒక భట్రాజు నామీద కృతిగా వక పద్యం చెప్పవలెనని ఉద్దేశించి నాల్గు చరణములు చెప్పినాడు. అవి యేవంటే

ధైర్యంబు నీమేనఁ దగిలియుండుటఁ జేసి
చలియించి మందరాచలము దిరిగె
గాంభీర్యమెల్ల నీకడనె యుండుటఁ జేసి
కాకుత్స్థుచే వార్ధిగట్టు వడియె
అలలక్ష్మి నీయందు నలరియుండుటఁ జేసి
హరిపోయి బలిదాన మడుగుకొనియె
ఆకారమెల్ల నీయందు నుండుటఁ జేసి
మరుడు ధూర్జటి కంటిమంటఁ గ్రాఁగె

ఈ ప్రకారంగా భట్రాజు నాల్గు చరణములు చెప్పినందున అతనికి ఎనిమిదివేల వరహాలిచ్చినాను; ఈ పద్యానకు ఇంకా నాలుగు ఎత్తుగీతలు చెప్ప వలసింది; అవి చెప్పలేదు. తరువాత నాలుగు ఎత్తుగీతలు (ఎత్తుగీతి చరణ ములు) చెప్పి తీసుకవచ్చినపుడు ఆ భట్రాజుకు మరిన్ని నాలుగువేల వరహాలు ఇప్పించమని చెప్పినంతట ఆ ప్రకారం అంగీకరించిరి..........అంతట తిక్కన యుద్ధానకు తర్లివెళ్ళి కాటమరాజు వారి సైన్యమున కభిముఖుడై కార్య పెట్టి అఘోరమైన యుద్ధంచేసి అనేక మందిని హతంచేసి (వీరస్వర్గం పొందెను). రణతిక్కన్నకు కృతిగా చెప్పిన పద్యం సంపూర్ణమయ్యేటందుకు భట్రాజు చెప్పిన నాల్గు ఎత్తుగీతలు ఇవి :

తిక్కదండనాథ ! దేవేంద్రపురము నీ
వరుగుటెఱిఁగి నగము తిరుగుటుడిగె
అబ్ధికట్టు వాసె అచ్యుతక్కటి తీఱె
మరుఁడు మఱలఁ బుట్టె మగలరాజ !

ఈ ప్రకారము భట్రాజు పద్యము పూర్ణముగా నాల్గు ఎత్తుగీతలు రణ తిక్కని తల్లివద్దికి పోయి చెప్పగా ఆమె బహు సంతోషవంతురాలై నా గర్భ వాసమందు పుట్టిన పుత్రుడు సుపుత్రుండని రణతిక్కన పూర్వమందున చెప్పిన ప్రకారంగానే నాల్గువేల వరహాలు భట్రాజుకు ఇచ్చి మరిన్ని తగిన బహుమతు లున్ను చేసెను. అంతట రణతిక్కన యొక్క భార్య తనపతి అయిన రణతి

క్కనతో సహగమనం చేసే నిమిత్తమై సచేల స్నానంచేసి అనేక దానములున్న బ్రాహ్మలకు ఇచ్చి రణభూమిని ప్రదక్షిణ నమస్కారములు చేసి తన పతి యొక్క కళేబరము గురుతు కనబడక ఉన్నందున స్వామిని ప్రార్థించి నేను పతివ్రతనైతే పతియొక్క శిరస్సు కనబడునని రణతిక్కన్న। అని నంతట అరణ తిక్కని శిరస్సు యుద్ధభూమిని పడివున్న కళేబరముల మధ్యనుంచి పైకి ఎగిసి పడినవి గనుక ఆ శిరస్సు గుర్తుపెట్టి తీసుకవచ్చిన దానితో కూడా అనుగమనం చేసినది.''

—: o :—

# అనుబంధము VI (iii)

## పట్టపు రావి కైఫీయతు - ఖడ్గతిక్కన వృత్తాంతము

''పొత్తపినాటిసీమ మల్లదేవుడు సోమదేవుడు అనేరాజులు యేలుకుంటూ వుండగాను కాంచీపుర వరాధీశ్వరుడైన భుజబలవీర నల్లసిద్ధదేవ చోళమహా రాజులు నెల్లూరి పట్టణమునందు సింహాసనస్థుడై రాజ్యం యేలుచూ వున్నప్పుడు వారివద్ద రణతిక్కన అనే అయన జాతిలో బ్రాహ్మడు సరదారుడై వుండేవాడు. అప్పుడు పట్టపు రావి గ్రామానకు ఉత్తరభాగమందు పినాకినీ నదికి వుత్తరము పైపునను రెండు పరుగుల దూరమునను పర్వతం వకటి కలదు. ఆ పర్వతము యొందు సామీప్యస్థళమైన అరణ్యముల యందుంను తృణ కాష్టజల సమృద్ధిన్ని అనేక వృక్షఛాయా సమృధింని అయి వుండేది గనుకను ఆ స్థళము యెందు కాటమరాజు అనే యాదవరాజు తనయొక్క విస్తారమయిన గోగణమును సంరక్షణ చేసుకుంటూ ఆకొండపైన తెట్టెలు పెట్టుకొని అక్కడ నివాసము చేసుకుని వుండేవాడు. వాడ పినతండ్రి కొమారుడు కరి అవులరాజు అనే వాడున్ను వుండెను. వాళ్ళకు బిరుదు కారుణ్య రఘురాములు అని వాడికె కలదు. వాళ్ల గోగణము సంరక్షణ చేస్తూ వుండేవారు అనేక మంది కాపరులు వుండేవారు. ఆ గోగణము మిక్కిలిన్ని వృద్ధిపొంది వుండగా యీ స్థళము యెందు వాటికి గోగ్రాసము చాలక వున్నందున నెల్లూరి నల్లసిద్ధదేవ చోళమహారాజుల వారిలో సీమ అరణ్యములు బీళ్ళు మొదలైన పచ్చికపట్టు స్థళములు యావత్తు తమ గోవులకు గ్రాసాస్పదముగా యిస్తే అందుకు ప్రతి సంవత్సరమున్ను పుల్లరి నిర్ణయించి యిస్తున్నామని కాటమరాజు వర్తమానం అంపించుకోగా నెలూరి సిద్ధ దేవ చోళమహారాజుల చెప్పినమాట. మీ మందలలో మాసీమలో మేసినన్ని దినములలో ఆవులకు జన్మించిన కోడెదూడలు మాకు యిచ్చేటట్టు అయితే మాసీమలో గోగ్రాసముకల స్థళములు యిస్తున్నాము. గాని పుల్లరిగా పైండి నిర్ణయించుకొని యివ్వవలసినది లేదని తిరుగా వర్తమానం అంపించగా ఆమాట లకు కాటమరాజు కరి ఆవుల రాజు అనేవారు వుభయులు అమోదించి ఆ ప్రకా రం-నిర్ణయించుకుని-వొడంబడికె - యిచ్చి గోగణము అంతా నెల్లూరి సీమకు

తోలించి సంరక్షణ చేసుకుంటూ మందలో పుట్టిన కోడె దూడలన్నీ నెల్లూరి రాజుకు యిచ్చి అవులు మాత్రము తమ స్వాధీనములో వుంచుకొని వుండిరి.

ఈ ప్రకారం కొన్నిదినములు జరిగిన తరువాతను నెల్లూరి సీమలోను మహత్తు అయిన క్షామం వచ్చి వర్షం లేక పచ్చికపట్లు యెండిపోయి అరణ్యముల యందున్ను కసవు లేక కాటమరాజు వారి గోసంరక్షణ అయ్యేది బహుప్రయాల సము కాగా నెల్లూరి సీమలో కపిల భావుల ఆసరాను యేరుల ఆసరాను యెక్క డెక్కడ ఆకరం చేసిన పైరువుండగా కాటమరాజు వారు గోగణమును ఆపైరు లకు తోలుకపోయి పొలాలు మేపినారు. అందువల్ల నెల్లూరి నల్లసిద్ధదేవ చోళమహా రాజుల వారికిన్ని కాటమరాజు వారికిన్ని విరోధం పుట్టి కాటమరాజు వారు తమ గోగణమును అదివరకు మందలోవున్న కోడెదూడలు సహా మళ్లించు కొని నెల్లూరి సీమ విడచి పట్టపురావికిన్ని పినాకినీ నదికిన్ని వుత్తర భాగమం దుల పైన ప్రాసిన పర్వత ప్రదేశముకు లేచి వస్తూవుండగా ఆమందలలో విస్త రించి కోడెదూడలు వుండినవి గనుకను వాటిని మళ్లించుకు పోగలందులకు నెల్లూరి సిద్ధదేవ చోళమహారాజువారి తట్టునుంచి కొంత పౌంజువచ్చి అడ్డగించు కుంటే నిలువక గహిచేసి కాటమరాజు కరి అవులరాజు వుభయులు గోగణముతో కూడా వచ్చి స్వస్థళమందు ప్రవేశించినారు. తరువాత నెల్లూరి సిద్ధదేవ చోళరాజుల వారి తరపునుంచి వారివద్దవుండే రణతిక్కన అనే ఆయనను కొంత సైన్యమునుకూర్చి కాటంరాజు వారి మీద యుద్ధమునకు అంపించగా వచ్చి పట్టపు రావి అనే గ్రామానికి యీశాన్య భాగమున పరుగు దూరమున పినాకినీ నదికి వుత్తర భాగమందు సోమశిల అనే పట్నము నెల్లూరి సీమలోనికి అడకమై వుండేది.

అక్కడ రణతిక్కనకున్ను కాటమరాజు కరి అవుల రాజులనే యాదవ రాజులు వుభయులుకున్ను చాలా యుద్ధము అయినది. (ఇక్కడ నుంచి రణతిక్కన అపజయము పొందిన వృత్తాంతము). ఖడ్గతిక్కన తిరుగా సైన్యమును గూర్చు కుని బయలు వెళ్ళి యుద్ధ సన్నద్ధుడై రాగాను కాటమరాజు, కరి అవులరాజు వుభయులు యీ వర్తమానం విని వారున్ను యుద్ధ సన్నద్ధులై వచ్చిరి. వుభ యులకున్ను సోమశిల పట్నము వద్ద పినాకినీ నదీ తీరమున యుద్ధ ప్రసక్తి కాంగా కాటమరాజు వారి సైన్యమునున్ను మరిన్ని వారికి సహాయంగా వచ్చిన చల్లా వారిని కూడా విరగ బొడిచి సోమశిల పట్నము గడచి పట్టపుర్రావి అనే గ్రామముకు హమీప్యం వుత్తర భాగమందు పినాకినీ నదీతీర పర్యంతమున్ను

తిక్కన అనే ఆయన వెనుదగిలి పోడుస్తూ రాగాను అంతట తిక్కనకు దైవ బలం చాలక పోయినది గనుక ఆతన్ని కాటమరాజువారు తలకోసినారు......

"తిక్కన కాటమరాజు గార్లకు యుద్ధమై తిక్కన పరలోక గతుడైన స్థళము యిప్పుడు పట్టపురాయి గ్రామానకు తూర్పుభాగమందున పినాకినీ నదీ తీరమందున పూర్వమందు పరశురామ దేవరకు నందన చక్రవర్తి ప్రతిష్ఠ చేసిన స్థళము. అది యిప్పుడు స్థళజ్ఞులు ఆ జాగాపేరు తిక్కన పాడు అని చెప్పు కుంటూ వున్నారు. ఆ స్థళమందు వఖర్రాయి మీద గుర్రమును అందుపైన వఖ సవార్ను చెక్కివున్నది. అది తిక్కన మంత్రి ప్రతిమె అని స్థళజ్ఞులు వాడుకుంటూ వున్నారు''

—: o :—

# అనుబంధము VI (iv)

## ఖడ్గతిక్కనను గూర్చిన చాటు పద్యములు

### (కీ. శే. చిలుకూరి వీరభద్రరావుగారి 'తిక్కన సోమయాజి' గ్రంథమునుండి)

యుద్ధమున పరాజితుడై తిక్కన పారివచ్చుటను గాంచి వీరపత్నియైన జానమ్మ స్త్రీలకుంచినట్లుగా రహస్య స్థలమున నీళ్ళ బిందెనుంచి, దానికి నులక మంచమును చాటుపెట్టి దానిమీద పసుపు ముద్దనుంచినది. తనభార్య చెయ్యమును చూచి తిక్కన ఖేదపడుచుండగా జానమ్మ భర్తనుగాంచి యెకసెక్కములాడినది:

క. "పగఱకు వెన్నిచ్చినచో
నగరే నిను మగతనంపు నాయకు లెందున్
ముగు రాడువార మైతిమి
వగపేటికి జలకమాడ వచ్చిన చోటన్."

వీరమాతయైన ప్రోలమ్మ తిక్కనకు అన్నమున విరిగిన పాలుపోసి పరిహాసముగా నిట్లనినది:-

క. ''అసదృశముగ నరివీరుల
బస మీఱగ గెలువలేక పంద క్రియన్ నీ
వసి వైచి విఱిగి వచ్చిన
బసులున్విఱిగినవి తిక్క! పాలున్విఱిగెన్॥''

తిక్కన మరణవార్తను వినిన బంధుమిత్రాదుల పురజనులు అతనిని పరిహాసించి అపచారము చేసినందులకు పశ్చాత్తప్తులై పరిపరి విధముల విలపించిరి:-

ఉ. "వెన్నెల లేని రాత్రియు, రవిప్రభలేని దినంబు, నీరులే
కున్న సరోవరంబు, కడునొప్పగు దీపములేని యిల్లునై,
విన్నదనంబు నొందె మన విక్రమ సింహపురంబుఁ జూడఁగాఁ
బున్నమ చంద్రుఁబోలు మన ప్రోలమ తిక్కనలేమి నక్కటా!"

—:o:—

# అనుబంధము VI (v)

## సిద్ధవటము కైఫీయతు - ఆవులపరుపు

''కాటమరాజు వారి సైన్యంలో హతశేషులైన యాదవులు యుద్ధరంగమందు తమతో కూడా నిలిచి శత్రువులను హతం చేసిన వారియొక్క రూపములు శిలలపైన చెక్కించి [ రి* ] వీరులు అనే ప్రతిమలు తాలూకు మజుకూరు 'సగిలిపాయకట్టు' మౌంజే కుంభగిరి అనే గ్రామములోను వున్నవి. ఇదిగాక యుద్ధరంగమున ప్రాణములు వదలి సద్గతిని పొందిన గోగణముల యొక్క శిరస్సులు శృంగములతో కూడా తీసుకవచ్చి వాటికి పసుపురాచి నిత్యసాంబ్రాణి ధూపములు యిచ్చి యిండ్లలో వుంచుకొని,—యిదిగాక గోవుల ఆకృతిగా శిలలపైని చెక్కించి అవిన్ని వఖస్తళమందు వుంచి పూజలు చేస్తున్నారు. ఆ శిలలు వుంచిన స్తళానకు జనులు ఆవులమాలె అని చెప్పుకుంటున్నారు. ఆ ఆవులమాలె వద్ద పైని చెప్పిన యాదవులు ప్రతిసంవత్సరమున్ను తాళమేళములు పంబజోళ్ళు వీరతాళ్లు జమిడికెలు వురవన మద్దెళలు-యీ వాద్యములతో సంభ్రమం (సంబరం) చేస్తున్నారు. ఈ సంభ్రమానకు వారి సంబంధీకులైన వారున్ను వారు కట్టించిన ఆవులమాలెయందు అభిమానం గలవారున్ను యెంత యెంత దూరంలో వున్నాగాని వారిని కాటమరాజు గారి పాంగెస్తులని వాడుతున్నారు. ఆలాగంటి పాంగ్యస్తులు అయిన వారికి పసుపు గుడ్డను అక్షతలు కట్టి సంభ్రమం చేసే దినం నిర్ణయం చెప్పి పంపించీ వార్ని పిల్వానంపించి అందరు గుంపుగూడి ఆవులమాలె వద్ద సంభ్రమం చేసేటప్పుడు పాంగ్యస్తులు అయిన వారిలో వారి వారికి తానకములు అనే నిర్ణయం కలదు. తానకమనగా యేమంటే వెల్లియెద్దు తానకం, బొల్లెద్దు తానకం, బోడి యెద్దు తానకం, కరెద్దు తానకం, పైయెద్దు తానకం—యీ ప్రకారం అనేక తానకములు అనే నిర్ణయం కలదు. తానక సౌజ్ఞ యేమంటే వెల్లెద్దు తానకం వాడు ఆవులమాలె వద్దికి వచ్చి నిలిచి వున్నప్పుడు పంబకారు అంటే పంబజోడు వాయించే వాడు వెల్లెద్దు పరాక్రమం దలచి ఆ ఆవుమేయుట నీరు త్రాగుట గంతులు వేయుట అక్కడక్కడ దిరుగుట తుదను యుద్ధరంగములో చేశిన పరాక్రమము సహాగా పొగడితే ఆతానకం అను

సరించి వుండేవానికి శివం వచ్చేది కలదు. యీ ప్రకారం కొంతసేపు తానకములు పాడిన తరువాత కాటమరాజు వారి పరాక్రమమున్ను సుద్దులు అని పాడేది కలదు. యీ సంభ్రమములోను యిండ్లవద్దవుండే శృంగ సహితములైన గోశిరస్సులు తెచ్చి మాలెలో వుంచేవ కలదు. అందుకు శనగలు పెసలు నానవేసి శిలపైని వుండే ఆవుల ప్రతిమల కున్ను దేవరావులు అనే గోశిరస్సులకున్ను నైవేద్యం చెల్లించి ఆ పణ్యారం బ్రదికివున్న గోవులకు తినిపించేది కలదు. ఈ సంభ్రమం (సంబరం) పేరు ఆవులపరుపు అని వాడుకునేవారు."

—:o:—

# కంసుడు కథ

## [ విష్ణు భాగవతము ]

### ఇష్టదేవతా ప్రార్థనము

క. శ్రీరామ రామ యనుచును
ఏ మానవుడైనగాని యేర్పడ మదిలో
ఆ రామ విభుని దలచిన
కారాకులు డుల్లునట్లు కర్మము డుల్లున్‌।

క. హరి దలచిన సిరి గల్లును
హరినామ స్మరణచేత ఆపద లణుగున్‌
హరియన్న పాయు పాపము
హరినంత్యము నందలచిన హరిపురి గల్గున్‌।

శ్రీరమ్య వత్సలుడు[1]
శ్రితవత్సలుండు
వారుజనేత్రుండు వనజ గాత్రుండు
సౌందర్య వరమూర్తి శాష్వతకీర్తి
కందర్ప జనకుండు కనకాంబరుండు
సురవంద్య విహితుండు సుభ
సమేతుండు
కరుణాంత రంగుండు కలుష
బంగుండు
లీల జగంబుల నేలినట్టి గనుడు
పాలమున్నీటిలో ప్రెవశించు వాడు[2]
పదహారువేల గోపస్త్రీల గూడి
విదితంబుగా బూవి[3] విహరించువాడు
సొరది నేలిపుడు దాసులు
బోచువేలు
శ్రీకరంబగువాని శిరిగల వాణి[4]
జోకు శ్రితులకు సుభమిచ్చు వాణి
నాడు వరంబిచ్చునను దాసుగాను
చేకుని కృష్ణుని చెన్నందదలచి
పరికింప శ్రీవిష్ణు బాగావతంబు
క్రమమొప్ప ద్విపదగా కావింతు
వినుడా

1. 'శ్రీరమ్యవతుండు' 2. ప్రవశించువాడు 3. భువి 4. వాని

శ్రీ నీలకంఠుండు శిద్ధవర్ణుండు
ఘనుడు విద్యల గుర్వ్య
గణపతిందలచి
చవతి దివసము గంగ చవితిన్
పుత్రుండు
సభలెన్న విఘ్నస్వామికి మ్రొక్కి
తాత యాగముకేగి తాతలమనగ
తాతను తమ్ముని తలద్రుంచినావు
యగ్గున దక్షుని యగ్ఞంబులోనిధను
విఘ్నంబు చేసిన విఘ్నేశ్వరుండు
గంద్రచెరుకులు చప్పిడి పుంద్రముల్
మెసగి

తంద్రి పెండ్లికి నడిచి తంద్రికి
మ్రొక్కి
మీసంబుగల యట్టి మూషకమునెక్కి
శేషుని బొజ్జను చేర్చిన దేవ!
చెతుర్ముఖుని సతి శారద దేవికి
సాష్టాంగము మ్రొక్కి సన్నుతి చేసి
హరి హర బ్రహ్మాదుల అఖిల దేవతుల
చరణముల్ పూజించి కవి జనులకు
మ్రొక్కి

## కవి వంశాదికము

శిరి వరుల దయ కన్య శిరుల
గోత్రుండు
వారధి కనకబండి వంశవర్ధనుండు
కొండయ్య నందనుండు కుల
పావనుండు
అండజముఘజయ్య హరిశావ గోరె
వేయు సిరసులు రెండువేల
జింహ్వలుగల
ఆదిశేషువు హరిని కొనియాడలేగ
లేడు
తప్పులు యెన్నైనన హరిదలచిన
యపుడె
వప్పితం బన్నది వక్కలె యెరిగి

దురితములెన్నైనన తుదబాయు
ననుచు
గోపాలకృష్ణమ్మ గురుతొక్కలెరిగి
నేరక చెప్పిన నేరంబులన్ని
హరి తనకు హితవన్న ఆవార్త
వినియు
నేర్చి చక్కగ బలుక నేరక నేను
హరి మరుగు జొచ్చి నే ఆనతిచ్చదను
విన్నవారరు సకల విభవమై
యుండుడి
ధనధాన్యులై ఆచంద్ర
తారార్కముగను
శ్రీ ఆదివిష్ణువు జన్మంబు లెన్న

ఛే. సవతి

ఆదిమి బ్రహ్మకు అలవిగా దిపుడు
కొద్దిగ నాకృతి కొనియాడి మ్రొక్కి
భక్తులకు అమృతము భాగవతమనగ
అఖిల పాపక్షయము హరియుని
భజన
విష్ణుదే కృష్ణుడు యీ కథ వినుడి:

## రాక్షసులు తనకు భారముగా నున్నారని భూదేవి బ్రహ్మతో మొరపెట్టుకొనుట

అసుర లందరు రాజులై అవనిలో
బుట్టి
చేసేటి దోషములు భేదింప లేక
భూదేవి వోర్వలేకపుడు బుద్ధి
చింతించి
బాధలచే అలశి భారంబు వలశి
రక్కసుల మోయను వెక్కసం
బనుచు
వెక్కసుల మోయను కక్కసమై
తనకు
తన ఆపద కొరకు తరుణి రూపమున
కనుగొన యాబ్రంహ్మ
కడకునేతెంచి
బ్రంహ్మతో భూలక్ష్మి భాషించ
దొణగె:
"చెతుర్ముఖముల బ్రంహ్మ!
శారదాపతివి!
భూతలంబున నాభిని పుట్టినస్వామి!
హంసవాహన సకల ఆదర్యు నీవు
నిముషంబు తనమొర నిలచి
పాలించు
పుట్టింప రక్షింప భువన భువనములు
కట కటా! అన్నిటికి కర్తవు నీవు
తనదెస తనబర్వు తన ఆపదెల్ల
విని రక్షింపకున్న వేగుము కడకు
కృంగింతు ధరయల్ల కూలు లోకంబు
ముందర దెలశి నామొర ఆలకించు"
శారద పతియైన బ్రంహ్మ కరుణించి
"ధరణి! లోకాలకును తల్లివి నీవు
నీకేమి బరువాయ నిజమాడవమ్మ!
పర్వతంబులు గిరులు పక్షులు
వృక్షములు
బరువై వున్నార బ్రంహ్మరుద్రాదులు
సప్తసాగరములు సకల మునిరుషులు
యంత బరువయిరి నీకు యెరిగింప
వమ్మ!
యవ్వర యోగమో యెరిగింపు"
మనిన
"బ్రంహ్మ! విను, వీరు తనకు
బరువు గారయ్య
యిమ్మహి వీరంత యిష్టమే తనకు
బరువుగాదు వీరిమొయ్య భారమే
తనకు

బరువెల్ల చెప్పేను బ్రంహ్మా! యిటు
వినుమ
పుణ్యాత్ములచాల పుట్టించక నిట్లు
కణగి పుట్టిస్తివి పాపకర్ముల చాల
బాణాసుర నరక పౌండ్రక వాసుల
అరక్షణము మోయలేను ఛేదించకున్న
కంసుడు మహాగర్వ కాలయముడు
నాకు
నిముషంబులో వాని నిర్జింపవలయు
బకుడను రాక్షస ప్రలంబుడను వాడు
వకనాడు నేమొయ్య వాపలేనయ్య

దనబరువు ధేనుకాసుర దంత
వక్త్రుండు
విని శాల్యుడు మురదైత్య
వీరదానవులు
పుట్టిరి రాక్షసులు భూపారమందు
చేటుకు పాపములు శేయు చున్నారు
భూపారమున య............
పాపాత్ములమ్రోవ బరువాయ తనకు
అసుర లందరిని హతా హతము శేయు
దెసపాప''మని బ్రంహ్మ దేవునికి
మ్రొక్కె

## రాక్షసులను వధింపుమని బ్రహ్మాది దేవతలు విష్ణుమూర్తిని ప్రార్థించుట

అనిన భూలక్ష్మితో యాబ్రంహ్మ
బలికె:
''వశము గాదు వారిని వధియింప
తనకు
మసలుచు వారిని మదమణచు విష్ణు
చింత నీకేటికి? క్షితికాంత! యింత
యీ పనిగాజేతు విష్ణుకు
విన్నవింతు''
కనుగొని యా బ్రంహ్మ ఘనుడు తా
బలికె
అని దేవతలు బ్రంహ్మ దేవుడు గూడి
వేవేగ నందరు విష్ణుపురి కరిగి
భగవంతు కనుగొని ప్రణమిల్లి
మ్రొక్కి

పొగడి స్తుతియించిరి పుండరీకాక్షుని:
''పరబ్రంహ్మమైనట్టి
పద్మనాభుండ!
పరికింప ఆపద బాంధవుడవు నీవు
హరి హర ముకుంద! ఆది దేవేశ!
గరుడ వాహన! కరివరద!
కారుణ్యమూర్తి!
లోక కంఠకుల గూల్చి
లోకముల్నిలుప
నీకు చెల్లునుగాక నిర్జరుల కోశమే!
వేదముల కొరకై వెదకి సోముకుని
వాదణచి చంపిన వనజ నాభుండ!
సురలు అంబుధి తరచి సుడి
శృంగినాను

ధర కూర్మమై మోచిన దాతవు నీవు
కోపించి హిరణ్యాక్షు కొట్టి చీరిన
యట్టి
దాపైన వరహావతారుడవు నీవు
కరుణించు ప్రహ్లాదు గాచిన తండ్రి!
వడుగవై బలిని వసుధదాన మడిగి
అడుగున పాతాళము కణచిన దేవ!
వికశించు కార్తావీర్యార్జుని బట్టి
పరశురాముడవై బాహులు ద్రుంచితివి
రామావతారమున రావణు గూల్చి
క్షేమంబుగై కొన్న శరణాగతుండ!
ఔతారమున దుష్టుల హతమణచిన
స్వామి!
నీవుండగాను మరి నిలచి రాక్షసులు
బలియులై భూమేలి బాధ పెట్టగను
యిల యిసికి వేసారితిమి యిందరి
దాత
స్వామి! యీ రాక్షసుల
సమయించు'' మనిన

## విష్ణువు యాదవకులమున కృష్ణావతారమెత్త నిశ్చయించుట

తెలసి విష్ణు బ్రహ్మదేవుని బిలచి:
''బాలాయము(గ యాదవకులము)ందు
శూరసేను మహారాజుకు
సుందరియైన
మారుష తానితోటి మగువకు నీవు
వసుదేవుడవై పుట్టు వారి గర్భమున
దేవకుడను రాజుకు దేవకి యను పేర
కోరి శారదాంబను ... .... ...
తన గర్భమునందు నాభిపుట్టితివి
నీ గర్భమునందు నేడు జన్మింతు
నాడు నీకు తండ్రినై నదులు నిధులు
సాక్షిగా
నేడు నాకు తండ్రివై నేజెప్పినటుల
... ... ... ... ... గర్భమున
కృష్ణావతారమై కీర్తి జన్మింతు
సురలు గోపాల్కులు సురకాంతలు
గోపికాస్త్రీలు
యరగకుండ బుట్టించు యాదవులు
గాను
వేదములు ధేనువులుగా వెలయ
బుట్టించు
... ... ... వెలయ బుట్టించు
శివుడు నీవు నే పడిమారి సిద్ధంబు
గాను
కొట్టి యా రాక్షస కోట్ల నణగింతును
పరమ రహస్యమిది''యని బ్రహ్మ
కెరిగింప
సరగున భూదేవి సముఖాన నిలచి

.... ... .... ... అందరు జనిరి
కమల సంభవుడన్ని క్రమములచాత
అమరులు యాదవులై పుట్టిరపుడు
ఘన వేదములు గోగణములై పుట్టె
ఆనాఁ వేగమున బ్రంహ్మ అతడు
పడిమారి

వసుదేవుడై పుట్టె వసుమతి మీద
రశికుడయైనట్టి రాజు గర్భమున
శారద దేవకై జన్మించ నపుడు

## కంసుడు దేవకిని వసుదేవునకిచ్చి వివాహము చేయుట

గారవమున బెంచ కంసుడు చెల్లెలిని
తెలివైన చక్కని దేవకీ దేవిని
చలగి యా వసుదేవునికిచ్చి
చేశిరి పెండ్లి
వసుదేవునకు పదియేడుగురు
వనితలు ముందు
యనగ దేవకితోను యేడ్గురు సతులు
మరిదికి చెల్లెలికి మణిభూషణాలు
అరుదైన సొమ్ములు ఆభరణములు
అర్థములు గోవులు అరణంబులిచ్చి
చీని చీనాంబరములు చీరె రవికెలును
వనితలు అనియేక వస్తువులు నిచ్చి
పంచమవాయిద్యములు పరిపరిగతుల

మించి మ్రోవగాను మేదినీశ్వరుండు
పరివార మిరువంక కలసి కొల్వంగ
ధరణీశు కంసుండు
తగువేట్కతోను
వసుదేవు దేవకి వైభవంబులను
పశిడి రథమెక్కించి ప్రఖ్యాతిగాను
రథము కంసుడు తోల రాజితంబుగను
మధురాపురిలోన మరదిని చెల్లెలిని
పదివేల విధముల పట్న మేగించ
ముదమున దేవతలు మెచ్చట పడగ
భోరు కలుగంగ సకల
భోగములతోను
సకల సన్నాహముతో సఖియ నేగించ

## దేవకి అష్టమ గర్భమున జన్మించువాడు కంసుని వధించునని ఆకాశవాణి పలుకుట

అప్పుడు విష్ణుమాయల నాకాశవాణి
చెప్పి చేశిన పని శంఖుటేదనుచు

పలికెను దివినుండి బ్రంహ్మాండ
మదుర

"వోరోరి కంసుడ! వోరి
రక్కసుడ!
వోరి దూరము చూడు వుండనేరవు
నీవు
కంసుడ! ముందు కానకున్నావు
వసుధీశ! ఆకాశవాణిని నేను
చెల్లెలిని పెండ్లి చేశితివిపుడు
చెల్లెలి గర్భాన జన్మించు నొకడు
యెనిమిదోవాడు నిన్ను యేపడగించు
చెల్లుదువు ముందరి చేటెరిగియుండు
ఘనుడు మేనమామ గండాన బుట్టి
నిన్ను సంహారించు నిజము నామాట

సఖియకు యనమండ్రుగురు మొగ
సంతాన ఫలము
పరగ యేడ్గురు నీకు పగవారుగారు
ఆర్గురు నీ చాత హతము గాగలరు
పరిణాన యిద్దరు బ్రతకనున్నారు
కాంతకు యెనిమిదో గర్భంబునందు
అత్తమామను చంపే అధికుండు
బుట్టు
నిన్ను సంహారించు నిజము
నామాట"
అనియిట్లు ఆకాశవాణి బలికి
అదృశ్యమాయ

## కంసుడు తన చెల్లెలిని నరుకబోవుట

అన విని కంసుండు అదరిపడి
బెదరి
గుండె చదరి కడుపు గుభులణచి
లేచి
పొదవు తేరున నుండి పుడమిపై
దుమికె:
"పరివార వీరులార! ప్రధానులార!
వీరు వారనకుండ వింటిరే మీరు
వాలాయముగ ఆకాశవాణి యిట్లనగ
చాలదు ధైర్యంబు చాడి జెప్పంగ
చెల్లెలిని పెండ్లి శాయంగ నేల?
చెల్లెలికి కొమాళ్ళు జన్మించ నేల?
గండాన బుట్టనేల? తనను
ఖండించనేల?

వుండనేల దేవకి ప్రాణము
వుంచ నే వెరతు
చచ్చేంత కలగంటి సర్వధా యిపుడు
హెచ్చరికె ముందర మేలుకోవలెను"
ఝుడిశి ఖడ్గము దూశి ఝళిపించి
కదశి
వడిశి చెల్లెలి గొప్పు వురవడి బట్టి
సిరసు తెగవేతునని చేముష్టి పూనె
చేరి నరుకగ 'అన్నా' యని
రెండు చేతులు బట్టి
దేవకి కస్తిపడి దెసపడి మ్రొక్కె
"రావే అన్నా! మొగరాజు నీవు
దాయ చెల్లెలిని గాని పగదానిగాను
న్యాయమా చెల్లెలిని నరకంగ నీకు

అడబడుచు మీద ఆయుధము చాప
తోడబుట్టిన తోడు దోషమోయన్న!
సాటి రాజనుగాను సహిదోడ నీకు
మాట చెప్పెద అన్న! నామనవి
వినుమ
చెల్లెండ్ల పెండ్లిండ్లు చేశేటి అన్నలు
చాల సొమ్ములు యిచ్చి సంతోష
పరచి
అర్థములు గోవులు అరణంబులిచ్చి
చిత్తగించి పట్టుచీరె రవికెలును
కన్నుల చల్లగ జూచి కట్నాలు
యిచ్చి
వేడుకపడి అన్నలు వేగ చెల్లెండ్ల
అత్తవారిండ్లకు అంపంగ వారు
తెలియదా చప్పంగ నీ వెరుగవ
అన్న!
యంత దయలేదు అన్న! యేమి
శేయుదును
ఆకాశవాణి మాటలు అవి
నిజము గావు
నీకు మ్రొక్కెద అన్న! నిజము
నామాట
మాను చంపక అన్న! మముజూడు
అన్న!
చేపట్టు అన్నా!" యని రెండు
చేతులెత్తి మ్రొక్కె

## తనకు పుట్టిన పిల్లలనిత్తునని వసుదేవుడు కంసునికి వాగ్దానము చేయుట

దేవకి ఆపద వసుదేవుడు జూచి
తా వచ్చి కంసునితో దయ బుట్ట
బలికె
పెండ్లికూతురి జూచి ప్రేమతో
విభుడు
"మండలాపతి! బావ! నా మనవి
వినుమ
యిచ్చి పెండ్లిచేశి యింతలోపలను
వచ్చింపగా నరుక వద్దె వోబావ!
తలకాస రాలేదు తల్లిదండ్రి బాయుదు
పోలులో యిటువంటి బోర్పెంపులేం?
చేతి కంఖణము బావ! చాతయున్నాది
భక్తి లేదా నొప్పి భాషికము చూడు
కట్టిన భాషికము కంఖణము తోను
కొట్టి చంపుదురె పెండ్లి కూతురునిట్లు
అందరు వినగ బలికె ఆకాశవాణి
అందుకు భయపడకు అనుమాన
ముంచకు
పుర్వీశ! క్షేమాన వుండవలె నీవు
పరిణాన బ్రతకవలె బావరో మేము
వసుధీశ! మేము పగవారము గాము
వేసారి తముచంప విహితంబుగాదు
తమకుగల పుత్రులు (తప్పక యిత్తు)

(బ్రతుక వలదు బావ) పగ వారు
అయితె
చక్కగా నరుకు బాలల
చంపవద్దనము
పుట్టిన బాలల పూని నీకిత్తు
వద్దనము చంపుకో వకరిని
చిక్కకుండ
నీకు పగవారు అయితే వారు తనకేల?
తనకుగల కుమాళ్ళ తప్పక నిత్తు
మనవి విను'' మని మ్రొక్కెను
మరది వసుదేవు.

మరది చెప్పిన మాట తన మనసుకు
వచ్చి
మరిదిని చెల్లెలిని మధురలో నుంచ
కొడవండ్ల అంతేశి కోరదానవుల
చుట్టు కావలి బెట్టె శూరుల నపుడు
ఝుడిశి కావలి జెట్టి జతనమని చెప్పె
గుట గుటమని యేటి గుర్ల
దైత్యులను
పెట్టె కావలి వుంచ భువి పొతకుండు

## దేవకి గర్భవతియగుట

కేళికా గృహములో కలశిరిద్దరును
మరియును సంసార మార్గంబు
జరుప
కాంతకు తొలిచూలు గర్భంబు
నిలిచె
పలు బలచ బారెను పడతి దేహంబు
తెల్లనై మొక కళల్ దీప్తి చేనొందె
వాకరలు మెండాయ వాంఛలు గోరె
వానీట చేనోట వరుదలై పారె
యేవేళ పులుచకై యింతితా గోరు
మందమాయను నడుము మన్నను
మంటిపై బారె
వదనంబు వడిలెను వాచవులు గోరె
వేడి త్రాగిన కడుపు-వింతలై
యుండు

పైయ్యద పైకొంగు పైట నిల్వదును
రొమ్మున నకుదు బుట్టు రోజు
నా సఖియకు
నద్దికూడు గోరు పులిచల్ల గోరు
బాలకు అంతట ప్రబల గర్భంబు
వెక్కసంబై కడుపు వికసించునాభి
కాళ్ల చేతులు నొచ్చు గడియ
నడిచినను
అంతకంతకు నిద్ర అతిశయమై వచ్చె
మీగాళ్లు పైవాసె మిసమిస మనెను
ముదము దీపింపగా మూడవ నెలను
సుదతికి నొక కొంత చూలు
యేర్పడెను
నడుము గొప్పదై - పెద్ద నడుపులు
నడిచ

పడతికి చెక్కిళ్లు పలు బలుచ వారె
నాతి తా వైఖరి నారొవ నెలను
నాతికి చనుమొనలు నల్లనై యుండె
యిరువంద దేవకికి యెనిమిదో నెలను
అరయ లోపలి శిశువు అటునిటు
బొర్లె
నెలకొని తొమ్మిది నెలలు నిండినను
పొలతి దేవకి దండి నొప్పుల బడల
ధృతకి శ్రీమంతుడు తొలుత
జన్మించె

## పుట్టిన బిడ్డను వసుదేవుడు కంసుని కప్పగించుట

వానిపై గటిగి పట్టు వస్త్రమున
చొదిగి
ఆనోవేగమున వసుదేవు
ఆడి తప్పకను
ముందుగా గలిగిన మోహంపుసుతుని
బందిగములో నెత్తుక బావకడకేగి
వసుదేవుడు కంసుని వద్దికి తెచ్చి
కసి గందును చూపి "కంసుడ!
వినుమ
నమ్మిక నీ చెల్లెలిని నరికేటి వేళ
భామను చంపంగ అడ్డుపడి మనవి
చెప్పితిని
ప్రీతి లేక తాముగన్న బిడ్డలందరిని
యిత్తునని పల్కితిని యిదుగోను
శిశువు
చంపుకో నుంచుకో తొలుత
తానన్న మాట
సత్యంబు దప్పక వప్పగించితి'' నని
కొంపోయి కంసుని కొల్వులో నుంచె

## కంసుడు మంత్రులతో నాలోచించుట

కన్నులు దెరవని నెత్తురు కందును
జూచి
తనకు తా వెరగంది దయవచ్చి పలికె
"మంత్రి వర్గమా! బుద్ధిమంతులు
మీరు
సంతత పుణ్యులు చనువరులు
దొరలు
వీర పరివారమా! విప్రపుంగవు
లార!
సరి సమానము తనకు సాటైనవార!
ప్రజలార! దుర్గాధిపతులార! వినుడి
నిజముగ వసుదేవు నిలిపె సత్యంబు
ముందుమేర పలికిన నెత్తురు ముద్దను
తెచ్చి

ముందరనుంచె పుత్ర మోహము లేక
కన్న కొమారునిదెచ్చి ఖండింపు
మనుచు
చిన్నిబాలుని తన చేతికి నిచ్చె
యితనిదే సత్యంబు యితనిదే కీర్తి
యితడె సాహసఘనుడు యిందరు
వినుడి
వధియింతునా వద్దా వాపోవు వీని
మదిలోన నొక కొంత మమత
బుట్టినది''
అనిన ఆస్తానము వారందరు లేచి
''విను కంసభూపాల!
విన్నవించదము
ఆకాశవాణి పల్కులు అవి కల్ల
లనరాదు
వెక్కసుడై పుట్టు యెనిమిదోవాడు
నీగండమున బుట్టు నిజము.
మా మాట
వెరచి పలుకముగాని వీనికి పనిలేదు
పగవాని చంపవలె నీపగ దీరవలయు
పగలేని బాలల పాపంబు చంప''
అనుచు వుపకారపు మాటలు
ఆడి రొకకొంత

## మొదటి ఏడ్గురి సుతులను చంపనని కంసుడు వసుదేవునకు వాగ్దానము చేయుట

కంసుడు వినితాను కరుణించి పిలచి
రమ్మని వసుదేవరాజు కిట్లనియె:
''ఆపదవేళ నీవు ఆడినమాటలు
తప్పవైతివి వసుదేవ! --
మహా తగువరివి నీవు
వీని దొర్లబెంచుకో వినుమ వసుదేవ!
కన్న యేడ్గురిని బెంచుకో
కపటంబు వుంచ
యేడ్గురిని బెంచుకో యెనిమిదోవాని
కడాసారివానిదే ఖండించివేతు
గండమట వాడును గండమట తనకు
కొడుకును గని తెమ్మ కొట్టివేశదను
శిశువును తిరగనిచ్చి
నీచిత్తమందుంచి
పోషించి పెంచుకో పో''మ్మని అంపె
కొడుకు నెత్తుకొని వచ్చి కోమలిని
గలశ

## దేవకికి ఆర్గురు కొడుకులు పుట్టి పెరుగుట

కడ గెలచి పులినోటి ఖండ వూడినట్లు భారంబు గడిచనని బహు విధంబులను

కోర్కెతో తొలుచూరు కొడుకును
బెంచగాను
యాచేట వొకరొకరు యనయంగ
గలిగిరి
పుట్టిరి అర్గురు పొలతి దేవకికి
ఆర్గురు కుమాళ్ళకు అధికులపేర్లు
పేరుపేరు వరుసలపేరు బెట్టుకొనిరి
ధృతకీర్తిమంతుడు కొడుకు
తొలుచూరు
మలుచూరి పుత్రుండు
మాల్యుడనువాడు
బాలార్కశేనుండు భద్రశేనుండు
చక్కని రుజుయుండు
సముద్రుడనువాడు
యెక్కువగ ఆర్గురు యింతి
కుమాళ్ళు
దేవకి గన్నట్టి దివ్యరత్నములు
సరమున బెరిగిరి సకలభోగముల
రత్నఖచితమైన రావిరేఖలను

పుత్రడికంచెలు పులిగోళ్ళు మెడల
అందెలు గజ్జెలు హస్తకడియములు
కుందనపు మెడనూలు
ముద్దుటుంగరములు
భూషణంబులతోను భోగములచాత
వాశిగ బెరిగిరి మామవద్ద బాయక
మేనమామను గలశి మెలగిరల్లుండ్లు
చనువున కంసుని చదరెక్కియాడ
కంసుని తొడలపై గారవించగను
హంసలవలె అల్లుండ్లు
ఆటతమి నుండంగ
తనయులు యీడేరిరని
తల్లిదండ్రులును
మనస్సున వుబ్బుచు మరచి
రాపదలు
కొమ్మ తను గన్న ఆర్గురి
కొమాళ్ళ జూచి
నమ్మి సంతోషమున నుండె
అందరిని జూచి

## నారదుడు కంసుని కడకు వచ్చుట

అంతట నారదముని
అమరలోకముననుండి
వర్ణించి కాషాయవస్త్రములుగట్టి
పల్లజడలు మకుటంబు పసిడి
జంధ్యంబు
చల్లని యా గోపిచందనము నొదుట

మండలం బెరుగంగ కమండలము
బట్టి
విడువక హరికీర్తన వీణె మీటుచును
ఆడుచు పాడుచు
అమరలోకమునుండి
పుడమికి డిగ్గి మధురాపురికి నేతెంచె

కనుచూపుమేరను కనిరి నారదుని
యెదురుగ బోయి మ్రొక్కి
కంసుండు
పాదార్చనము చేశి
అర్ఘ్యపాద్యంబు లిచ్చి
సింహాసనముపై నిల్పి శావలు చేశ
వాహిని లోకాల వార్తలు నడిగె
మునికంసునికి లోకముచ్చటలు
చెప్పె
అనవిని కంసుడు ఆనందమందె
"యిక్కడికి స్వామి! మీరు
వేంచేయుటాకు
అక్కర యేమొ మాకది
తెల్పు"మనిన
"సరసంబు మెరయ నీ జననంబు
నీదు
మరణంబు దెల్ప సమ్మతి
వచ్చినాడ"
ననిన భయమంది యా భోజవిభుడు
మునినాథు కనుగొని మ్రొక్కి
యిట్లనియె:
"నలువంద నా జనన ప్రకారంబు
కలరూపమెల్ల చక్కగ దెల్పు"
మనిన

## నారదుడు కంసుని జన్మప్రకారంబు చెప్పుట

అనవుడు యోగీంద్రు డతనితో
బలికె:
"విను కంసభూపాల!
విన్నవించదను
నీరజముఖులతో నినుగన్న తల్లి
పారియాత్రంబనే పర్వతంబునను
వెలయ వేడుకతోను
విహరింపుచున్న
చెలియకు నావేళ చెరుగు మాశినను
యువిదలందరిని వకచోట నునిచి
కువలయ దళనేత్రి కొలనులో జొచ్చి
చలరేగి స్నానము సేయుచున్నంత
బలుపరాక్రమ కళాపాండిత్యశాలి
రణభీకరుండనే రాక్షసాధిపుడు
ప్రణుతించి సతిరూపు భావించి
పొగడి
చిత్తజుకారికి చిక్కి పోలేక
చిత్తంబులు పొంగి చింతించి చూచె
ఘనుడుగ్రసేనుని కామిని యగుట
తనదు మాయాద్రిష్టి తగ
నిశ్చయించి
వెస నుగ్రసేనుని వేషంబు దాల్చి
కుసుమకోమలియున్న కొలనటు జేరి
నలరు విల్తునికేశి నెలమి భోగింప
పట్టి నుంకించిన పంకజనయన
యిట్టట్టు సల్పి నన్నంట రాదనియె
వెలవెలబోయిన వెలదిని జూచి

''వెలరు పూవులబంతి!
వెలరుల దంతి!
పరికింపగా సతిపతులకు నెందు
మరుని పాదములాన
మరి యంటులేదు
పంతమేటికి అంటుపడిన కానిమ్ము
కంతుబారికి నోర్వకంగిలిమ్మనిన
పొలుపొందు నొకపువ్వు
పొదరింటిలోన
బలిమి పువ్వుల శయ్యపై నంటబట్టి
కలయ నాతని తమి దరగకయున్న
కనుదోయి బిగమూసి గాఢబంధమున
తన రూపమున గ్రమ్మె
ధవళాక్షిగూడి
గజిబిజి గావింప కనులెత్తి చూచి
"క్రూరాత్మ! దుర్మార్గ!
కుటిల దానవుడ!
చేరి నా వ్రతమెల్ల చెరచితివనిన
యా రాక్షసాధిపుడు యతివ నూరార్చి
"కారణమున్నదో కమలాయతాక్షి!
వకపుత్రు డుదయించుచున్నాడు నీకు
సకలలోకాల కసాధ్యుడు వాడు
వానిగొల్తురు రాజవర్యులందరును
వానికి దిక్పతులు
వణుకుచుండుదురు'
యని బాల నుతియించి
యతివ నూరార్చి
చనుదెంచె నంతట రాక్షస చక్రవర్తి
కావున రమణికి గర్భంబు నిలచి
నీవు గలిగితివయ్యా నిఖిలైకవీర!
దానవేంద్రుండు మీ తల్లియుదక్క
నేనాటి నీ మర్మమెరుగ లెవ్వరును"
అనవిని కంసుడు అప్పుడిట్లనియె·
"మునినాథ! మరణంపు ముచ్చట
దెల్పు"
కలహము ప్రియవాది ఘనుడు
నారదుడు
కలహమంచే పెండ్లి కలుగునను
వాడు
కలహము తలపెట్టి కదిలిపోవుచును
''వింత వింతలు బాలలు వీరంత
యవరు?
వింతచూడ తనకు వేడుకయ్యాని
వీరి తలిదండ్రి యవ్వరు? యేమి
కావలె నీకు?''
"నారదముని! వినుమ నాచెల్లెలైనట్టి
కోరి దేవకి కన్న కొమాళ్ళు వీరు
అర్గ నా మేన అల్లుండ్లు గార?
మరిది వసుదేవుని మమత పుత్రు''
అనగ

## దేవకి సుతులందరిని చంపుమని నారదుడు కంసునికి చెప్పుట

కంసుడు చెప్పిన క్రమమంత
వినియు
అంతట నారదుండు అప్పుడిట్లనియె:
''ఘేమి బుద్ధి రాజ! యరగకున్నావు

నీ చెల్లెలి కడుపున జన్మించిన వారు
పల్లదంబున నీకు పగవారు గారె
దేవకి కొమాళ్ళు తెగటార్తురనుచు
ఆ వివరము చెప్పెను ఆకాశవాణి
పలికి నందుకు వీరు పగ నిజంబాయ
చెలిమి చేశిపెంచి చెట్టు గొనుకొంటివి
మరచితివో వళ్ళు మరచివున్నావొ
వెర్రివై వున్నావొ వివరంబు లేక''
అనిన నారదమునికి హస్తములు
మొగిచి
''కన్న యేడ్గురికి తనకు కలహంబు
లేదు
విరసము లేదయ్య వీరికి తనకు
గండ మట యెనిమిదో గర్భంబు
వాడు
హరషమై వున్నారు అర్గురు తనకు
యనిమిదోవాడు యెప్పుడు బుట్టునో
కదముట్ట నియ్యను కలిగిన యపుడె
యాదమరువను పుట్టంగ యెనిమిదో
వాని
చిదుపలుగ నరుకుదు చేమరచి
యుండ
పగవాని చంపవలె నాపగ దీరవలయు
తగ పిండ్లకు తనకు పగలేదు
స్వామి!''
కంసుని మాటలకు నారదుడు
కళ కళ నవ్వి
''భూమీశ! యీ పట్ల బుద్ధి లేదాయ
మతి దప్పెనో వెర్రిమాటలాడేవు
చాతనై తే వంశము క్షయము
కాయ వలెను
అప్పు దీర్చవలెను హరుల పోరి
పూర్చవలెను
అప్పు చిచ్చు పగ హతమణచ కుంటె
చెప్పితి యివి మూడు చేటు
ముందరికి
అన్నలార్గురిని పెంచి అష్టమ గర్భ
మందు
కన్నవారిని చంపంగ కాచేర వీరు?
తల్లి నాపద బెట్టి తమ్ముని చంపంగ
బలము గలవారు నిన్ను బ్రతక
నిచ్చేర?
కలబంద మట్టలు నాల్గు గుమిగూడి
యున్న
యేనుగ వంగ దొక్క వెరచును
రాజ!
సకల నేర్పులు దెలసిన మహా
సరసుదవు నీవు
నీకు దెలియని బుద్ధి నిఖిలమున
గలదె?''
అని కంసునికి చెప్పి అరిగె
నారదుండు

## కంసుడు వసుదేవుని మభ్యపెట్టి కుమారులను తోడి తెమ్మనుట

నారదుని మాటలు కంసునికి
నారసాలాయ
గార దాగిన చాప క్రైవడి బోలి
గర్భములో చై బెట్టి కలిపి నట్లాయ
గుభులు పుట్టి అడవిలో ప్రొద్దుగ్రుకి
నట్లాయ
"అల్లుఁడ్ల చాతనే హతముగా నేల?
చల్లంబో నారదుడు చెప్పినది
నిజము'
అని తలపోయుచు అంతరంగమున
కనిలి వసుదేవుని కడువేగ బిలచి
'రావోయి నా మరది! రాజ వసుదేవ!
యేవేళ యేకాల మెట్లుండ గలదో
చదువులు నీ సుతులు సాములు చూడ
హృదయంబు సంతోష
ముబ్బుచున్నాది
అనగ నీసుతుల అర్గుర్నిపుడు
వెనువెంట దోట్కొని వేవేగ రమ్ము
అర్గురికి అరూళ్ల అమరమిచ్చెదను
నార్గురిని తోడితెమ్ము యిది మంచి
లగ్నము

మందను వార్కి మహిదానమిత్తు
నందులను తోడితెమ్ము నాకుప్రియ'
మనిన
విని మది వసుదేవు విస్మయ మంది
తన దేవి నగరికి తర్లి వసుదేవు
చదరంగ మాడుచు సకియంను గూడి
వదలక యున్న తమ వనిత
కృపజూచి
'మిక్కిలి మనమీద మీయన్న
కంసుడు
యక్కడి దయ బుట్టె యెరుగంగ
రాదు
బాయని శత్రువులైన మన
బాలులకును
ఆయితమైనట్టి ఆరుగ్రామాలు
యిచ్చెదనన్న నేనిటు వచ్చినాను
మచ్చక నీసుతుల మగువ నాయంట
పంపిన చేకూడు భోగ భాగ్యములు
మనకు
పంపకున్నను స్నేహ పాత్రంబు
తొలుగు'

## ఆటలాడుచున్న కొడుకులను దేవకి పిలిపించుట

పతి జెప్పగా విని పణితి వుప్పొంగె
సుతులు మీద ప్రేమ సొంపుదీపింప
పురవులు వుబ్బుచు వుప్పొంగి మేను

తన దేవకీదేవి దాదుల బిలచి
పరుసడి సంతోషమున పరగ
నిట్లనియె:

'అంగణమణులార! అంగడివీధి
చంగలింపుచు బాలలు యే
చెంతనున్నారో
అన్నల దోడ్కొని అతివేగ రారె!'
ఆమాట విని దాదులు
అలవేగ్రమునను
వేమారు వెతుకుచు వెలద లడుగుచును
మున్నాది దాదులు ముంగిళ్ళవెంట
కాలిచప్పుడు విని కాంతలడుగుచును
చూచుచు పిలచేరు సుదతులందరును
వీథులు అంగళ్లు వెతుకుచు రాగ
సాదనలు జేయుచు జగదీశు కంసు
వాకిట నుండంగ వార్ని కనుగొనిరి
'హో కేళ గోపాళ! హోయన్నలార!
మీ తల్లి దేవకి మిమ్ము బిలచేని
మా తండ్రి ర'మ్మని
మగువులందరును
పిలిచిన ప్రియముతో పలుపల
నవ్వేచు
వెలదుల వెంటను వేతెంచగాను

తనయులు రాకటకు తల్లితండ్రులు
చూచి
పెనుగొన్న ప్రియముతో పిలిచిన
సుతుల
తల్లిమాటలు విని తనయు లార్గురును
ఘల్లుఘల్లున మొలగంటలు గదుల
గుప్పించి వెగయుచు
కుందెకుందెనుచు
తప్పెనని నవ్వుచు తనిమి వచ్చేటి
కొదము సింహ్మములవంటి
కొడుకుల చూచి
యెదురేగి దేవకి మెచ్చి నవ్వుచును
'స్వామి! వచ్చితి'రని
సంతోషమునను
కోమలి యుప్పొంగి గొబ్బున నవ్వి
ముద్దుల కొమాళ్ళ జూచి
భుజముల నందుకొని
ముద్దులాడుత వొచ్చి ముదిత
కూర్చుండి

## దేవకి కొడుకులను అలంకరించుట

'తరుణులార! బాలలు
దాహముగొన్నారు
వేగ దాహము తేరె! వో
పణుతులార!'
అని చెప్పినను విని అతివెలు వేగ
తేట ఘృతకమ్ములు తెప్పించియిచ్చిరి.

'మెప్పైన బంగారు మేడలకేగి
శిరసులంటను నూనె శీఘ్రమె తేరె'
నురికి దాదులు వేగ నుబ్బుచు బోయి
పాడుచు గిన్నెలు బామలు నూనె
వేట్కతో తెచ్చిరి వేగ శిరసంటి
ఆనికంబు ఛాడించి జపములు దీర్చితి

జంతారు చీరెలు సన్నవలిపములు
గట్టిరి
కరమొప్ప తిలకములు కాంతలు
దీర్చిరి
పట్టు వస్త్రములు పైబార గప్పి
అన్నంబు పాయసం ఆవులపెరుగు
అన్నం బోంచేసి అస్తములు కడిగి
మొల్లలు గంధము మొగిలి
పువ్వులును
తల్లి దేవకీదేవి దరియించె రత్న
పుత్తళి కంటెలు పులిగోరు మెడన
అత్తరు పన్నీరు అస్తకడియములు
దరయించి రత్నాల తాళిచొకట్లు
వరచి చక్కదనము వర్ణించసాగె
'వలురాజుతో వీరు వాసవాసుతులో
నలకూబరులో వీరు నా
చిన్నసుతులో
వృథురాజులో వీరు యీ
వున్నతంబు
పుడమి నా గర్భాన పుట్టినారో లేక'
అని యిట్లు దేవకి ఆశ్చర్యమంది
తన ద్రిష్టి కొడుకులుకు తాకెనో
యనుచు
ద్రిష్టి బొట్టును బెట్టి దీవించ తల్లి

## దేవకి కొడుకులకు బుద్ధులు చెప్పి దీవించి పంపుట

అర్గురి కొమాళ్ళ దేవకీదేవి
డాయంగ బిలచి
'వినరోయి కొమాళ్ళార!
వివరంబుగాను
మీ మేనమామ కొలువుకు మీరు
కదిలిపోతువున్నారు
మెచ్చి మీ మేనమామ
సీమ బూములిచ్చునో
సింహాసనమే యిస్తూవున్నాడో
బొక్కిస బంగారు బోనకావుళ్ల
యిస్తూవున్నాడో
సామిన గుర్రాలు సవురాజములు
పెట్టెలలో సొమ్ములు పెద్దగుర్రాలు
యిస్తూవున్నాడో
యే రవుతును యే రాణువును
యిస్తూవున్నాడో
దూరపు బూములు కోరవద్దు
కొమాళ్ళార! మీరు
లాయాన అశ్వాలు కోరవద్దు
కొమాళ్ళార! మీరు
దూరపు బూములు కోరితిరైన
తల్లితండ్రులు మీరు తర్లి పోలేరు
కడుపు సోకము చింత కడతేరలేను
మల్యాల పాన్పుమీద నా మనసు
యెట్లాపొందును
లాయాన అశ్వాల కోరితిరైన
గణితిబత్యము గద్దె మన నగుర
లేకయున్నది

పరకలు మేసి పడివుండే ఆశ్వాల
కోర'మని పలికెను
అని యిట్లు కొమాళ్ళకు బుద్ధి
మతిచెప్పెను
తన దృష్టి కొడుకుల్కు తాకెనో
యనుచు
ద్రిష్టిబొట్టును బెట్టి దీవెంచె తల్లి
కష్టుడు పాపిష్టి కంసుని కొలువుకు
జాతరకు పొట్టేళ్లు సాగినరీతి

మాతల్లి దేవకి సుతుల మరివేగ
పంపించె
తనయులు వసుదేవు తర్లిరాగాను
కంసుని కొలువుకు కదిలి
వొచ్చినారు
కంసుని కొలువున గ్రక్కున
నిలచిరి
అర్గురు బాలలు చాలుగా నిలిచిరి
'సలాము మామా! సలాము' అనిరి

## కంసుడు తన మేనల్లుండ్లను పువ్వుల తోటకు తోడ్కొని పోవుట

అంతట నారదుడు చెప్పినమాట
తన మనసుకు వొచ్చెను
అళ్ళు అళ్ళున నవ్వి 'యిప్పుడే
నా అల్లుండ్లు
అద్రువంచి సలాము
శాయలేకపోయిరి
చేటు యెరుగక బుద్ధి
చెడిపోతూవుండే'
అని కంసుడు బెదిరి అదిరిపడి లేచి
నారదులు చెప్పినమాటలు
నారసములై నాటె
గారదాగిన చాప కై వడి పొర్లెను
పెదవులు కొరుకుచు పెక్కున
నవ్వుచును
చరుగుప్పున దుమికి
సమయింతు ననుచు

యెంచి యేడు అడుగులు
యెదురుగా వొచ్చి
మంచి మాటలుగాను మరదికి చెప్పి
'నీ సుతుల చదువులు సాములు
రూపరేక సముందర్యము యిటు
మాచితేను
పాచిపట్టిన రాళ్లు పగులు జనద్రిష్టి
అనుమానపడవద్దు అవనీశు నీవు
పనసలు నిమ్మలు పాటలి
వాకుళాలు
వనములో నీడను వొప్పిన కతలు
వినవలయు వసుదేవు యిప్పుడు వేగ'
అని మంచి మాటలుగాను అతనికి
చెప్పి
ధర్మసింహాసనము గుప్పున
ధుమికి

తన చేతి కడ్గము వడి నందుకునెను
రత్నకంబడి తన బుజమున జేర్చెను
ఆర్గురు అల్లుండ్లు యంటపెట్టుకుని
తను వేయించిన పువ్వుల వనముకు
కదిలిరాగాను
పువ్వుల వనాంత్రముకు పువ్వుల
వనాంత్రముకు
మధురాపురి పట్నానకు సందున
గొడుగు చింతల వీరబయళ్ళకాదను
కముశునికి అతి శగును మాయను
తిరిగి మదురాపట్నము వంక
కన్నుల చూచను
తన మరిది వసుదేవరాజు రాగాను
చూచి
'రావోయి'! వసుదేవ! రాజువు నీవు'
వనముల కరిగిరి వసుదేవు తాను
వనము శృంగారము యెటువల.
వున్నదంచేను
పొన్నలు పొగడలు పోకమాకులును
గెన్నేరు వగుళ్లు కారు గోగులును
మారేళ్ల నేరేళ్ల మంచి గందములు
నారికేళములు నాగమల్యాలును
పున్నాన వనములు బూరి సంపంగ
వున్నతంబైనట్టి సురపొన్న
వ్రిక్షములు
మావులు జంబీర మాలూర
వనములును
గంగరేగులును వుసిరికె
చందనములు
రంగైన బూరగలు అందమైనట్టి
యేపెలు యిప్పలు యేరు పనసలును
దాపైన మంచి మందార వ్రిక్షములు
బద్రాక్ష సరువులు బల్లాకములును
రుద్రాక్ష మాకులు రూడి శేషములు
కదళేని పరిమళ్లు నడిమి వ్రిక్షములు
పువ్వుల తోటకు పోయిన మీదట
నవ్వేచు కంసుడు నతనికిట్లనియె:
'చయ్యన వసుదేవ! చమవులు
నీవిన్న
వయ్యన నిద్రిష్టి వారికి తాకును
కల్లనక తాకును గడియపులిచింత
గొడుగు చింతల వీర బయటనే
కూర్చుండు పరగ వసుదేవ!'

## కంసుడు బాలురను పువ్వులు కోయ నియమించుట

కఠినచిత్తుడు కంసని కంఠసంబు
నాను
ఆర్గురి అల్లుండ్ల యంట పెట్టుకొని
తాను వేయించిన పువ్వుల వనముకు
పువ్వుల వనముకు యేతెంచ
బూనాయకుండు
పువ్వుల వనము దర్వాజ బోరున
ధీయించినాడు

కలపొన్న వ్రిక్షము కాడికి గ్రక్కున
వచ్చినాడు
కలపొన్న వ్రిక్షాన తనచేతి
గాండీర్యము
తనచేతి గాండీర్యము గ్రక్కున
వుంచినాడు
రత్నకంబడి బూమ్మీద పరిచినాడు
రత్నకంబడి మీద రాజు కొలువుదీరె
ఆ కంసు బూపాలు కొలువున్న
కొంత సేపుటికి
ఆర్గురి అల్లుండ్లను తను దాయ బిలచి
'వినరోయి అల్లుండ్లార! వివరంబు
గాను
నేను వేయించిన పువ్వుల వనమున
మీకంటికి యేమి పువ్వులు కోరి
వున్నారో
కోరిన పువ్వులు గొబ్బున కోయ'
మని పలికె
ఆ వార్త విని బాలలు అతికె
సంతోషమునను
చేటు యెరుగక బాలరాజులు చెలగి
వొళ్లు గట్టిరి

బొడ్డు మల్యాలు చాల కోయించినాడు
చెండు మల్లెలు చాల కోయించినాడు
మంచి మల్యాలు చాల కోయించినాడు
రత్నకంబడి మీద రాసులు
పోయించినాడు
రాశి పువ్వులు యెత్తి చెండ్లు
కట్టించినాడు
ఆర్గురి అల్లుండ్లకు ఆరు చెండ్లు
వారి చాతలకు యిప్పించినాడు
ఆర్గురికి ఆరుపువ్వులు తోరణాలు
దరియించినాడు
తనచేతి గాండీర్యముకు పువ్వుల
చెండ్లు కట్టించినాడు
తన బుజానకు వక చెండు
కట్టించినాడు
తాను పువ్వుల తోరణాలు
దరియించినాడు
ఆరు పువ్వుల చెండ్లు వారి అస్త్రాల్కు
అందించినాడు
ఆరు పువ్వుల తోరణాలు వారి
మెడల్కు చుట్టెను

## కంసుడు బాలురను బంధించి నరుక బోవుట

రత్నకంబడి మీద నుండి ధిగ్గున
లేచెను
తానుకట్టి వుండేటి నలభై మూళ్లది
నల్లపట్టు దట్టి బిర బిర యిప్పెను

దామెనుకు యాటలు తగజేర్చి నట్లు
అన్నలు చూడగాను తమ్ముల
బంధించెను

తమ్ములు చూడగాను అన్నల
బంధించెను
దడి తెరుగున అర్గుర్ని దాయంగ
ఫెణిచి
కడ్గము తీసుక కంసుడు కత్తి
జళిపించె
ధళ ధళ మనగ వక అల్లద
వహిచెను
పల్లడ దుమికెను పల్లడ వహిచెను
జార్చంద్ర దొక్కి మారు బందన
నిలచెను

మార్చంద్ర చొక్కి జార్చందన
నిలచెను
యీ విదమున కముసుడు సాము
చేసేటి సమయంబున
అదరి బెదరి దద్దటిర్లి అటు నిల్వలేక
కాళ్లు గడగడ వణికి కడు నిల్వలేక
అర్గురు చూచిరి మామ మొకారవిందం
గుండె జల్లు మనె

## బాలురు మేనమామను దీనముగా ప్రార్థించుట

''యేమిసేతు దయభమా! యవ్వరు
లేరు
మామరో వోమామః వో మేనమామ!
నీ తోడబుట్టు దేవకీదేవికి తనయులు
మేము
మామః మామీద మరియాద లేక
కత్తి వెత్తి నరుకను చెల్లునా
వో మేనమామః
యింత యింతల బాలల యీడేర్చి
నావు
అన్న వస్త్రము యిచ్చి ఆదరించినావు
వుగ్గు బోసేనాడు వుగ్గుపోసి సాకితివి
పాలు పోసేనాడు పాలుపోసి సాకితివి
బువ్వ దినేనాడు బువ్వబెట్టి సాకితివి

అబరణ బూషణాలు దిళియించి నావు
వో మేనమామ!'
'మామ! మామా'! యని బాలలు
మందలించ సాగిరి
'బ్రెంమ్మ దగ్గిర వరములు యిట్లా
తీస్తివా వో మేనమామ!'
నెత్తి ధరణిపై గొట్టి నేంపై వొరిగిరి
కావు కావున ప్రెళాపించ సాగిరి
బాలలపుడు
'దరియించ లేము వో మేనమామః
నిలువు శక్యముగాదు నిముష
మిచ్చోట
పలువించి దేవన పాలుగాలేదు'

అడలుచు పుత్రులు 'హాహా దైబమా'
యనుచు
నేలలు పుణుకుచు బాలలు
బ్రెమజెందిరి
'పుడమీశః మాకు యీ బోగంబు
చాలు
అడవులలో కేగి ఆకు అలుమైన
కుడిచి వుండెదము వోమామ! మేము
కువలయా దీశః
తడయక విడిపించు దయ విచారించు
విరసంబు చాలించు వో మేనమామ!'
గుప్పు గుప్పున రొమ్ము గమ్ముక
బాలలు
శికలువూడి వెంట్రుకలు కొట్లు
మిట్లాడి
పడి పొర్లాడుచు బాలలు మూర్ఛిల్లి
రపుడు
వాలు కన్నుల నీళ్లు వరుదలై పారె
మామ వున్న చందంబు కుములుచు
చూచి
కుములుచుచూచి 'గొబ్బున యిన్నాళ్ల
మామ మముబెంచి నిటలకు
మమ్ముల
నిటలకు మమ్ముల బదిగొర్లగా
జేస్తివి
పాలు వెన్నలు తాగి బాగుగా
బెరిగి
బాల ప్రాయమున మాకు నేల
పాలాయన మామః
యీ వసుధలో పుట్టిన హిరుగలరు
లోకముల
యన్నంగ ఖాపాప మెవ్వరికి లేదు
పుడమిని పలమైన బూరగ రీతి
ఆయను మా బ్రతుకు అన్యాయమే
మామః'
మామ మామా!' యని మందలిస్తు
వుండగాను
దురములో పగతుల ద్రుంచిన యట్లు
ఆ వసుదేవుని ఆర్గురి కొమాళ్ల మీద
కల్లు సారాయి నల్ల మందుతిన్న
పచ్చితురకవలె పళ్ల పట పట
కొరికి కత్తి జళిపించె
అంతట యా బాలలు కంటికి
పుట్టెడు కన్నీరు వుంచిరి
ప్రలాపించుచు బాలలు మన భాగ్య
మింతేను
పొల పొల పోవుచు పొగలి
దుక్కాన
'మేమేమి చేతుముః మాకెవకు
దిక్కుః
యవ్వరిని దూరుదుముః
యవ్వరున్నారుః
మేము నోచిన నోము మాకు సిద్ధించ
శివుడు యీరీతి చేసెనో మాకుః
తల్లిలేక తండ్రిలేక అన్యాయముగా
మాకు!
బ్రహ్మ వ్రాతకు పలుకంగ నేల?
పూర్వకాలము పుట్టిన యపుడు

మేము చేసిన పూజ తప్పునా మాకు?
పూజకు మిక్కిలి నడుచునా మాకు?
గొబ్బున మామ! మమ్ముల యింత
బాద పెట్టనేల?
వొప్పుగా బెహ్మ దేవుడు వ్రాసిన
వ్రాలు
ఆతికిదవ వచ్చునా హరి హరులకైన
యదపడి యిక్కడ మేము యంత
దూరినాను
తల్లి తండ్రి వుండంగ దయ వచ్చునా
మామ!
తర్లపించంగ యవ్వరు మా పేరు
మామ!'
యిట్లు వలపోవుచు బాలలు
వకరి మొకార బిందము వకరు
తప్పక చూచిరి
గుప్పు గుప్పున రొమ్ము గుద్దుకో
సాగిగి
పొల పొల దుక్కాన ప్రళాపింప
సాగిరి:
'కాని వారము కాము మామ! కడ
వారము కాము
నీ చెల్లెలు దేవాకి కన్నట్టి
కొడుకులం మేము
నారదులు చెప్పిన మాటలు విని
మమ్ముల నరుకను న్యాయమా నీకు?
మాతల్లి తండ్రు రాజులకు నీసుతుల
యిద్దెలు బుద్దులు వినవలనంటివి వో
మేనమామ!
వనము లోపలికి మమ్ముల వనర
రప్పించి
యింత శిశు అత్య శాయ ధర్మమా
నీకు'
అని గోడు గోడున దామరాకులో
నీళ్లు
తర్లడించినయట్లు బాలలు దరికొన
సాగిరి
'యీ అర్దోన అరణ్యమున మనము
దుక్కపడితేను
మనము దుక్కపడితేను మనకు
యవ్వరు దిక్కు?
పురహరుడు దయతప్పె మనకు
పూజ యింతేకాక
ఆదినారాయణుడు యీ కంసుని
సాదించి నరుకును గాక!
మనకు వశముగాదు ఆదినారాయణ
హరిన్నారాయణ'
అనే వాక్యము బాలలు ఆలాపన
శాయ గాను

## కంసుడు మేనల్లుండ్ల నార్గురిని వధించుట

'హరినారాయణ! హరిన్నారాయణ!'
శబ్దంబు యిన్నాడు కముసుడు
అగ్రుడై మండి
కుడిమీసం వడివేసి గుడ్లు య్రెరజేసి
మీసంబు పడదిప్పి దూళ ఖడ్గంబు
సారాయి పోస్తూ గంజాయి అములు

నీరు యేమి చారని నిఖరంపు కల్లు
త్రాగి లావారి హెచ్చి తమకంబు
మించి
తూలుచు కడుపచ్చి తురక
చందమున
చెడు వెర్రికై తోడు శివమెత్తి నిప్పు
కడుద్రొక్కి సర్పంబు గరచి
తేల్గుట
కుక్కలు మొరగిన కౌనగొమ్మ
నుండి
కొక్కతింపుచు గండుకోతి
చందమున
పెదవులు గొరుకుచు ఫెళ ఫెళా
మనుచు
గద్దించి మరిలేచి ఖడ్గమంకించి
మగువ పెద్ద కుమారుని మసలక
పట్టె
'మామయ్య! మామయ్య!
మన్నించవయ్య
చేకొని మముగావ చెల్లు మామయ్య
మావంటి బాలకుల చంపితే మామ
కంసుండ
యిలమీద వానలు యేలీల కురియు
ఫలియించునా భూమి? ప్రజలు
నమ్ముదుర?
నీళ్లు మోసువారు నిరుపేదవారు
కట్టెలమ్ముువారు కసువమ్మువారు
బీదసాదలలోన మము చకరిగా
చూడవే మామ!
కాకనీవు యెక్కే సింహాసనము
యెక్కేమ మామ!
కాక నీతోటి కయ్యము చేసేమ?'
అని యిట్లు బలికిన ఆపెద్ద కుమారుని
కనులుచు పదునైదు ఖణియలుగ
నరికె
ఖరవాలు ఝళిపించి కదమ కుమాళ్ల
అరచిన యేడ్చిన అయ్యోయ్యో
యనిన
మొరలు పెట్టుచు చేరి మ్రొక్కిన
గాని
పరువులు బారిన బయలు బాకినను
తడియక వెన్నంటి తగిలి పోనియ్యక
చెరుకు పిచ్చలరీతి చెలరేగి నరికె
వలపల చూపెను దాపల గరీన
ఖండించినాడు
దాపల చూపెను వలపల గరీన
ఖండించినాడు
నరికెను అర్గుర్ని నజ్జు నజ్జు గాను
త్రుళ్లోటి అల్లండ్ల తునియలుగ
నరికెను
కదగి కంసుడు రణకల్లిగా బొడిచ
పొడిచెను అర్గుర్ని పోగులు వేళ
ఆర్గురిని ఆరు గుట్టలు పెట్టెను
తనచేతి రక్త నెత్తురు గాండీర్యము
మొండ్యాల్కు తుడచ
కత్తి వరలో వేసి కంసుడు
వయ్యన కచిల
వక్కడే కదిలెను వంటిపులి వలెను

## కొడుకుల చావు చూచి వసుదేవుడు దుఃఖించుట

గొడుగు చింతల పీర బయళ్లనుండి
వసుదేవరాజు గొబ్బున చూచెను
నాగుపాంవంటి నడుము నక్కున
విరిగెను
'యేమందు యీశ్వరా! యేమందు
నేను
కంసునికి యెదురుగా కదిలిపోయి
యిపుడు
యేరీ తన కొమాళ్లు? అని అడిగితినైన
పాపాత్మ కులద్రోహి గాండీర్యము
తోను కండించునో యనుచు
కంసునికి ముందర మదురుకు
పోగాను చూచి
పాపాత్మునితోగూడ మల్ల
వనాంతానికి
పోయిన బాలలు తిరిగి రాలేదు
యనుచు
వారి చావు పుట్టుక కన్నుల
చూచే'నని
కన్నతండ్రి వసుదేవు పువ్వాల
తోటకు కదలి వచ్చినాడు
కలపొన్న వ్రిక్షము కాడికి కదిలి
వచ్చినాడు
కొడుకులు చచ్చిన గోరంపుచావు
వసుదేవురాజు కన్నుల చూచెను
గుప్పు గుప్పున రొమ్ము గుద్దుకో
సాగెను

నిట్టూర్పు లూరుస్తు నేలపుణుగుచును
అటు యిటు పుణుగుచు హర హరా
యనుచు
చేతులు బిసుకుచు ద్రేహంబు మరచి
'అకిల లోకేశ్వర! ఆదివిష్ణుండ!
సురులార! మునులార!
సూర్యచంద్రులార:
పరమేశ్వర! యిష్ణు! బ్రెంహ్మ
దేవుండ!?
అని యిట్లు వసుదేవు గోడు గోడున
దుక్కించసాగె
కదులుచునున్న కుమాళ్ల అందంబు
చూచెను
యేనుగ కుంబ స్తళములవంటి యెగు
బుజములు చూచెను
అంటి మాకుల వంటి పెను తొడలు
చూచెను
తామర రేకులవంటి కనుసోగలు
చూచెను
అద్దములవంటి అరి పాదములు
చూచెను
బొజ్జల మీద చెయ్యవేసి బుజ్జగించె
కొమాళ్ల
'యేమి సేయుదు కొమాళ్లార!
యేమందు నేను?
యెవ్వరిని మరుతునో యెవ్వరిని
దలుతునో కొమాళ్లార!'

అని యిట్లు మక్కించె ఆ రాజుగనుడు
తన దుక్కము వసుదేవు తానే
శాంత పడెను
ఆరు ఆరు పన్నెండు మొండ్యములు
తన కమిగిటజేర్చి
గోడు గోడున అడలి గ్రక్కున
విడిచి
'కనలేదు పెంచలేదు కొమాళ్లార!
మిమ్ము

పుట్టలేమ పెరగలేదు కొమాళ్లార మీరు
బూమి మీద నామనసు నిల్వలేదు
కొడుకా! మీగర్బములు మేము
కన్నుల చూడలేదు'
అని యిట్లు వసుదేవు అటు తల్లడించెను
ధరణిపైనబడి తాను లేచి నిలిచెను
జలధి లోపుల జొచ్చి స్తానంబులాడి
తడి వస్త్రాలతోను వసుదేవు తన
నగరి కేతెంచెను

## దేవకీదేవి దుస్స్వప్నమును గనుట

ధర్మమార్గమున ఆవేళ దేవకీదేవి
అతివిలతోను
బావించి మల్యాల పానుపు మీధ
నీరుబుగ్గవంటి కన్నులకు నిద్రయిన
వొచ్చెను
కలువ రేకులవంటి కన్నులుక్క
కప్పెను నిద్ర
వాలారి కన్నులకు వొచ్చెను నిద్ర
చామంచి రేకులవంటి కన్నులుక్క
చేటు నిద్ర వొచ్చెను
నిద్రించి మేలుకొనెను నిమిష
మాత్రముననను
కలగని మేలుకొనెను కాంత దేవాక్షి
దాదుల బిలచెను తరుణి దైర్యములేక
గ్రక్కున యిపుడు రారమ్మ!
దాదులార! వో తరుణులార!

పుట్నింటి వారు యిచ్చిన పుణ్యపు
దాదురార!
అత్తవారు యిచ్చిన అవసరపు
దాదురార!
పున్నిజిబంతు లార! పూబోణు రార!
వినరమ్మ దాదులార! మీకు
విన్నవించేను
కలగన్నప్పట నుంచి కాలు
నేలబొంద దు
తనకు కన్నీరు తరగదు వో
బామలార!
గుండె పగిలి కడుపులో గుభుల్న
కుడిచీని
జాము జాముకు నావొల్లు జాలి
పుట్టించె
నా కల యిప్పుడు నలినాక్షులార!

అని యిట్లు దేవకీదేవి అనిన
మాటలుక్కా
'యేమి కలగంటివి? యేమి వార్త
వింటివి?
నీవు కన్నకలలు మాకు చెప్పినాను
తెలివిగా యిప్పేము తెలిసినట్లుగాను'
అని యిట్లు దాదులు అనిన మాటల్లు
కన్నకల చెప్పసాగె కాంత దేవాక్షి
'వినరమ్మ దాదులార! వివరంబు
గాను
కుడిసంటి అమృతం కురియగ
కలగంటి

యడమ సంటి అమృతము యేరులై
పారకలగంటి
కారిన సన్నిపానము కరుడు గట్టి
కలగంటి
వో దాదులార! నేను కన్నకలలు
యవ్వరికి పడునో యెరిగింపవమ్మ!'
ఆవార్త విని దాదులు అప్పుడిట్లనిరి:
'నీవుగన్న కలలు నీకు పడవమ్మ
యవ్వరికో పరవారికి పడును
పణతిదేవాక్షి!'
అని యిట్లు దాదులు దేవాక్షికి
కల యిప్పగాను

## [illegible] గుడ్డదగాసును విని దేవకి శోకించుట

అంతట వసుదేవు తడి పస్త్రిలతోను
తన నగిరికి తర్లిరాగాను
యేనుగ పొడుగు మొగసాలకాడికి
దేవాక్షి దాదులు యెదురుగా వొచ్చిరి
'యేరి మన కొమాళ్లు?' అని
అడిగినంతలోనే
వసుదేవరాజు పొలపొల పొగిలిపడి
బూమిమీద
గుడ్లను కన్నీరు గోళ్ళ పమ్ముచును
'యేమి జెప్పుదు బామా: యేమందు
నేను!
మన కొమాళ్ళ అర్గురిని మీ యన్న
కముసుడు

పువ్వుల వనాంత్రములోన అతముగా
నరికెను"
అని యిట్లు వసుదేవు అనిన
మాటలుక్కా
వసుదేవు వార్తలు దేవకీదేవి
యిన్నపుడే
వసుదేవి వరిగెను కాంత దేవాక్షి
గుప్పగుప్పున రొమ్ము గుమ్ముకొనె
యింతి
కొప్పూడి వెంట్రుకలు కొట్టు మిట్లాడ
పాయని పుత్రులపై మోహముననను
అవు లేగను గని అలుముకున్నట్లు

తన అన్న కంసుడు కొమాళ్ళ
నరికిన వార్తవిని
పడి పొర్లాడుచు పణితి మూర్ఛిల్లె
నేలలు పుణుకుచు నెలత బ్రెమజెంది
వాలుకన్నుల నీళ్ళు వరదులై పారె
మిణుకుచు యింతి మోమెత్తి
యిట్లనియె:
'గొబ్బున యిన్నాళ్ళు కొడుకులార!
మిము పెంచి
కంసుడికి మిము బద్దిగొర్లగా జేస్తి
వకసారి ఆర్గురు వరిగిరంచేను
దుఃఖము ఆకాశమునకు
తుదముట్టదాయ
ఆర్గురు సుతులార! వోయన్నలార!
యేరీతి గడుపుదు యీ దుఃఖ
వారధి
అన్న ఆయుధానికి అయ్యేలార!
మిమ్ము
గొనకొని బారిగొర్లగా జేస్తి
ఖర్మడు కంసుడు తనను
ఖండించరాగ
ఆర్గురిని తన చావుకు అడ్డంబు వేస్తి
అలనాడు ఆకాశవాణి అన్నమాటలకు
తల్లికి ప్రాణాలు దారబోస్తిరి మీరు
అన్నల నరుకంగ తమ్ము
లేమంటిరో
చిన్నితమ్ముల నరుకంగ అన్న
లేమంటిరో
కని గొడ్రాలనైతి కన్న
కొడుకులార!
తనయులార!' యనుచు
తల్లెదలసాగె[6]
"కట్టడి కంసుడు కరుణ
యింతయులేక
పుట్టిన బిడ్డల..................
..................యనిపించి
యీరీతి కంసుడు యీదెనా పగయు
నీ పగ యీదేర నిద్రబో అన్న!"
గుప్పుగుప్పున రొమ్ము గుద్దుకునె
తల్లి
కన్న బిడ్డల దలచి కన్నీరు బెట్టె

## వసుదేవుడు దేవకిని ఓదార్చుట

అనవెరచి దేవాక్షి అలమటపడగ
నంత వసుదేవుడా దేవదేవకిని
యంతయు కౌంగిట యెత్తి లాలించి
"వినుమెంత వగచిన వేవేగనిటకు
మన పుత్రులునుగారు మత్తేభగమన!
మన ఖర్మ మిట్లుండె
మన కుమారులకు
వనజాసనుడు వ్రాయువ్రాత
లిట్లుండె
మర్మమెరుంగవు మానిని నీవు

---

6. తల్లి + అదలసాగె

ఖర్మమెవ్వరికైనను గడపఁగవలదు
ముందుచేశిన ఖర్మముల వచ్చిన
ఫలము
అనుభవించక తీరదు అజునకునైన
హరిహర బ్రంహ్మాదులకునైన
కర్మంబు
పరికింపగా పరబ్రహ్మంబుకైన
చేశినవారికి చేశినంతయును
వ్రాశినాడే ముందు వనజసంభవుడు
తలపోశి చూడను తరుణులెవ్వారు
తలిదండ్రు లెవ్వరు? తనయు
లెవ్వరును?
మాయసంసారము మాయలో చిక్క
పాయని భ్రమలచే ఫలియింప దగదు
ఆకాశవాణి తానాడిన మాట
యేకాంతములు గావె యిందీవరాక్షి!
యశరీరి వాక్యములవి యన్ని
నిజము
కుసుమకోమలి! తాళుకొను మింక నేల
యెందుకు శోకంబు యిందీవరాక్షి!
చందనగంధిరో! చాలించు వగపు"
అని భామనూరార్చి అటు విలాపించి
వనజ పాణులనెల్ల వగపుచాలించి
తనయుల మొండెములు
ధరలోన మాడి
తన నివాసంబున తగయుండిరంత

## ఉగ్రసేనుడు కంసుని దూషించుట

తనయుని పాపప్రతాప విస్ఫూర్తి
మనమలు చిదుపలై
మహి గూలుటాయు
పురజనులు పొక్కిపోవుట యల్ల
సరభసంబున జేరి చారులు దెలుప
విని వుగ్రసేన భూవిభుడు కోపించి
ఘనముగ కోపించి కనులెర్రసేసి:
"వోరి క్రూరాంతక! వోరి దుర్మార్గ!
వోరి కులాంతక! వోరి పాపాత్మ!
కోపించి నెత్తురుకూనల చంప
యేపాటి పౌరుషము వచ్చరా నీకు?
చిన్ని అన్నల నిట్లు చెల్లించివైచి
యన్నాళ్ళు బ్రతికేవు విరసుడ నీవు!
పెక్కురీతుల ముద్దుబెట్టుచు వచ్చు
చక్కని తండ్రుల జంపుదురటర?
ఆ చక్కనన్నల అవలీల జంప
నీ చేతు లెట్లాడె నీచమానసుడ!
కందు బాలల జంప కర్ముడవు నీవు
యెందుకు యీ ప్రాణము యాల
యీబ్రతుకు
సంపన్ను లెన్ను నా సద్వంశమునకు
తెంపుతో అపకీర్తి తెస్తివి నీవు
తనయుడవని నిన్ను
దయఘూడవలదు

తునుమాడపలె నిన్ను దుష్టవర్తనుడ!
అందందు పురజనులు అందరు
నిన్ను
నిందించి తుప్పన నీమీద నుమియ
నీ రాజసంబేల? నీ భాగ్యమేల?
నీ రసజ్ఞత యాల? నీ ప్రాణమేల?
పొమ్ము యక్కడనైన పోవక నీవు
నమ్మి యిక్కడవున్న
నిను గావనింక"

## కంసుడు తండ్రిని బంధించుట

అనిన రాజును జూచి ఆ కంసుడలిగె
కరుకుపగ్గముల తమ తండ్రిని
కట్టివేయించ
గిరికొన్న పెద్ద సంకెండ్లు బంధించ
ఆరాజు మంత్రుల అతని
అప్తులను
చేరి నందరిని మహ చీకాకు జేశ
చలగి మధుర బెదరె
చేటుబుట్టుకొరకు
వుదరి యాదవులంత వుణ్ణంగ వెరచి
మందలు దర్శించి మగువలు దాము
యెందెందు వనవాసములకు
యేగిరంతటను

## బలరాముని పూర్వజన్మ వృత్తాంతము

అంత కొన్నాళ్ళకు ఆ దేవదేవకికి
కాంతకు యేడవ గర్భంబు నిలిచి
ముందు కంసల్యకు
ముదమొప్పనంత
దశరథ రాముడు దనుజులగూల్ప
వసుమతి జన్మించ వనధిబంధనుడు
ఆదిలక్ష్మి సీత అమ్మవారులను
క్రోధించి రావణు కొంపోయ చరలు
అంతట రాఘవుండు ఆ వార్త
వినియు
శంఖలేక వనచర శానలుగూర్చి
హనుమంతుచే కార్యమంతయు దెలశి
లంక ముట్టడివేళ రావణుగూల్ప
పగను యింద్రజిత్తు
బాహుబలియుండు
మొయిలులో రాముతో మొనమయి
పోరె
రామచంద్రునితో బోరె రావణు
పుత్రుండు
యింద్రజిత్తుతో పోరి
రామచెంద్రుండు అలశి
గగన భాగముచుండి కప్పి
బాణములు

అందున్న విభీషణుని అడిగె
రాఘవుండు
'యెదురొచ్చెనె యుద్ధానికి
యవ్వడోవీడు
చదరక నాతోటి చేశ కయ్యంబు'
అడిగిన విభీషణుండు హస్తములు
మొగిచి
'వాడె రావణబ్రంహ్మ వరమ
పుత్రుండు
వాడె యింద్రజిత్తు వాడె దృఢజిత్తు
నిజముగ పధ్నాల్గుయేండ్లు నిద్ర
అన్నము లేని
వారి చాతనుగాని వాడు కూల'దన్న
విని రామచెంద్రుండు విచారపడుచు
ధనుర్బాణములు తమ్ముని కందించి
'నిద్ర (అన్నము) లేక నిలచినవారు
యీధర రాజులలోన యరుగను
తాను'
అడిగిన లక్ష్మణుండు అన్ననుజూచి
ఘనరాఘవునికి పాదక్రాంతుడై
నిలచి
"అన్న! నేనిద్ర ఆహారము లేక
వున్నాను నీ చరణములు
హృదయమందుంచి''
విని రామచెంద్రుండు వీనులుమూశ
'యన్నడు నిద్రహారము యరుగక
తమ్ముడ!
యీతెరంగున'కష్టము యాల
చేశితివి?
నాతోను చెప్పుమా నాతోడునీడ!
'పర్ణశాలలో నీవు పవళించువేళ
కన్నులకు నిద్రలేక కాచితినన్న!'
'నిద్ర కంటికిలేక నీవు పధ్నాలుగు
యేండ్లు
భద్రముగ వుంటివే పర్ణశాలలోను
వుపవాస మెటువలె వుంటివో నీవు
అపరాధమాయను ఆనతి'మ్మనిన
అనిన లక్ష్మణుండు తమ
అన్నతోననియె
"అమ్మవారికి మీకు ఆహారంబుగాను
కొమ్మలెక్కి పండ్లు కొయ్యనేబోయి
వదినెకు అన్నకు వాచవిగాను
మీదైన ఫలములు మీకు నేదెత్తు
అశిధారవ్రతముగ అడవిలో తినక
విస్తారముగ ఫలములు యిస్తి
పధ్నాలుగు యేండ్లు
వనమున భోంచేశి వచ్చినాడనుచు
అన్నసీత మీరు ఆరగించుదురు
అడవిలో భోంచెయ్య అడగను
మిమ్ము
యడచేశి ఆరగించితే
యంగిలయ్యాననుచు
అన్న మీ ఆజ్ఞలేక ఆరగించలేదు
నన్ను మీరడగరు మిమ్ము
నేనడుగ
అన్న మీపాదాల ఆదరువైన యుంటి''
"అవునోయి తమ్ముడ!
అయోధ్యరామునికి

శాయరాని వుపకారము చేస్తి పీలాగు
నీకీర్తి జగమెల్ల నిల్పితివౌను
యిటు విను ద్వాపారయుగంబునందు
బలభద్ర రాముడవై పరగ
వసుదేవునకు
చెలువుడ! అన్నవై పుట్టు శేషావతార!
నీకు తమ్ముడనై నేను జన్మింతు
యెన్నెన్ని జన్మాల యీ రుణము
బోదు
గోపాలకృష్ణుడనై కోరి జన్మింతు

ద్వాపారయుగమునగాని
బాపుకోలేను
'నమ్మ యీ రుణము నాటికే కాని
పాటించి యిప్పుడు బాపుకోలేను''
రాములు చెప్పినట్లు లక్ష్మణ
పిరమాళ్ళు
పరగ యా లక్ష్మణుండు
బలరాముడయ్యె
కయ్యమున దేవకి గర్భమున బుట్టె

## దేవకి ఏడవ గర్భమును రోహిణి గర్భమునందు చేర్చుటకై విష్ణువు యోగమాయను నియమించుట

యీ కథ అంతాయు విష్ణు తా దెలశి
యోగమాయల శక్తిని వేగ పిలిపించి
"కమలాక్షి! దేవకికాంత గర్భమున
తమినున్న శేషావతారమును
నెత్తురు ముద్దను నే జెప్పినట్లు
యెత్తుక కొంపోయి యాదవులున్న
పశువుల మందకుబోయి పరగ
అక్కడను
వసుదేవు సతులు రేపల్లెనున్నారు
యన్నంగ దేవకి యవ్వరి నెరుగకుండ
ఘనముగ రోహిణి గర్భమున దాచు
వనిత నందుని భార్య వనర
యశోదకు
ఆడబడుచవై యుండు అఖిలంబు
తెరుగ

వేడి కొల్తురు నిన్ను ఆదివేల్పవని
మొక్కి
వోదుర్గ! భద్రకాళి! వోజయావైష్ణవి
కృష్ణవేణి! మాధవి! మాయకన్యక!
అంబిక! శారదాంబ! యీశ్వరి!
నారాయణి!
గంగా! యమునా! యని పిలిచి
కానుకలిచ్చి
కోరి తన చెల్లెలని కొల్తురు జనులు
దేవకి గర్భంబు దేవంగ నిన్ను
దేవతా గంగాదేవి నీపేరు
ఆదిమూర్తి చెల్లెలని అఖిలంబు
తెరుగ
ఆదివేల్పవని కొల్తురు
యాదవులు నిన్ను

కడుపు వేగ దేవకి కాంత గర్భంబు
యేడోగర్భము శిశువు
యీడేరవలయు"
ఆదివిష్ణు చెప్పినట్లు ఆ యోగశక్తి
కలినమున దేవకి గర్భంబు దేలి
వాహిని కలుగంగ వాయువేగమున
రోహిణి గర్భమున రూఢిగా నుంచె
నందుని మందను ఆనందముగాను
యోగమాయ శక్తి యశోద
గర్భమున
ఆడబడుచై యుండె అపనెల్లమరుగ.

## దేవకి అష్టమ గర్భమున పుట్టబోవు శిశువును చంపుటకై కంసుడు కట్టాయత్తపడుట

కావలి వారంత గ్రక్కునలేచి
కటకటాయని వగచి కావలి సతుచు
కటూవా దేవకి గర్భము దిగెను
కడుపు దిగబడెనని కల్వరంబంది
వడివచ్చి కంసునికి వార్త
వినిపించిరి
కవకవ నవ్వి కంసుదేమనెను:
"పుట్టినప్పుడె చంపుదుపూని
యాబాలను
అట్టె విరుగడాయె అదికొంత
లెస్సాయె
చిందాయె తనకు మేలు
నిందె రాకుండ
కందుబోయను తన కర్మంబు బాళ
యెప్పుడు బుట్టునో యెనిమిదోవాడు
అప్పుడే చంపుదు అని పండ్లు గీటె
గండపు బాలుడు కలిగిన యపుడె
ఖండించి యింతేసి కణికెలు సేతు
యాదమరువను పుట్టంగ
యనిమిదోవాని
చిదుపలుగ నరుకుదు చైమరచి
యుండ"
ఘనమైన రాక్షసుల కావలి వుంచ
కల్లరియేనుగును గమిడి వాకిటనుంచి
గాలిచిచ్చు అనియేటి గజముల బిలిచి
'పగవాడు జననమైతే బందిఖానలోన
వుంఘే వుంఘే యని వూరికుండక
మీరు
బలుఘీక పెట్టుడీ బాలరోద మీర
అల్లుడని కాయను హతము జేశదను'
గార్దభమూర్తిని కంసుండు బిలిచి
'గద్దరి యా బొల్లి గార్దభమః నీవు
పదిలెమయి వుండుమా
బాల బుట్టిన యపుడే
కదశి కూయుమా
గాంధ్రదు గ్రాంధుమని నీవు'

కొట్టి రాక్షసుల కోటకొమ్మలనుంచ
పన్నిద్దరు మంత్రసానుల పదిలాన
బిలిచి
"పోలగంగ అంకమ్మ! బొడ్డమ్మ!
దక్కమ్మ!
పాలేటివారి తల్లి!
కొంపలమారి తిమ్మ!
యల్లావుల యల్లక్క!
యీదర గుర్వ!
కుర్రిమాచక్క! బైటగూడెపు యర్వ!
మిట్టపాలెపు కొండు! మిర్రెడ్ల సర్వ!
తోడేండ్ల శిద్ధక్క! తొలుచూరి నాగు!
ఆడేండ్ల మైసక్క! అరుట్ల తిప్పు!
కాంత గర్భితోనున్న కాలకూటవిషము
విషమిచ్చి పిండమును విఘ్నము
సేయుడీ!
విషముచే చావకున్న యిప్పుడే వాని
తలద్రుంచి తెచ్చితే తప్పక మీకు
తలయెత్తు బంగారు దానికిచ్చేదను
ప్రసూతి గాగాను బాల మెడబిసికి
శిశువనకె చంపితే సీమెల్ల యిత్తు
జతన"మని చెప్పెకు సకలనేర్పులను

## శ్రీ కృష్ణ జననము

అంతట దేవకి అష్టమగర్భమున
వసుదేవు చేసిన పుణ్యవశమునగూర్చి
వసుధ భారము గడప వారి
గర్భమున
భువిలోకములెల్ల పొంగుచునుండె
వడి పారిజాతములు వరుషములు
గురియ
దేవదుందుభులు మ్రోవ దేవతులు
పొగడ
దీవించి బ్రంహ్మాది దివిజులందరును
హసురలు తల్లడిల్ల అవని విలశిల్ల
శేషువు ఫణియెత్తి కావ గొనియాడ
మాధవుడు శ్రావణ మాసంబునందు
నడురాత్రి రోహిణి నక్షత్రమునను
పుడమిలోకము లేలు పుండరీకాక్షు
అష్టమ గర్భమున గోకులష్టమినాడు
భగవంతు వెడలెను పదహారు
ఘడియల వేళ
అష్టలోకములెల్ల అంగిట నిల్పి
కృష్ణుండు బుట్టెను దుష్టుల గూల్ప
దాసుల రక్షింప దైత్యుల ఛేదింప
వసుదేవు పుత్రుడై యదువంశమున
బుట్టె
గోపాల వరులకు గోగణంబులకు
గోపాల చూడామణియై కోరిజన్మించె
ఆ సమయమున మంత్రసాను
లందరును
తాము దొమ్ములాడిరి తమ ఆశల
నొక్కొక్కతో బాలను నొక్కుదా
మనుచు

త్రొక్కులాడుచు శిశువును తొణక
వచ్చినను
విష్ణు మాయలచాత విరిగి రందరును
పట్టు వచ్చిన మంత్రసానుల
పండ్లూడదన్నె
కన్నులు నిట్ట పొడిచి కల్వడంబొంది
ముండలు చాల్పుగబడి మూర్ఛపోయి
రంత
కదలక మెదలక కన్నులు దెరవక
బందిగములో వళ్ళు పరవశంబయి
నోళ్ళను దెరచుక నుచికిళ్ళు గమ్మి
కళదప్పి పడిరపుడు కృష్ణమాయల
చాత
శిరివరదుడైనట్టి శ్రీకృష్ణమూర్తి
కారణమున కృష్ణుండు బందికానలో
బుట్టె
వనజనాభుడు నీలవర్ణంబు మేను
అనువంద నాలుగు హస్తములతోను
తిన్నని తిరమణి తిరుచూర్ణము
నొదుట
కన్నులతనికి సోమ కాంతితో బుట్టె
కట్టిన కనకాంబరములు పుట్టు

కుండలాలు
మామను కొట్టుదామని పిడి కోరల
బుట్టె
ఆదిమూర్తి బుట్టిన అవార్తలన్ని
కంసునికి తెలియకుండ కప్పెను
మబ్బు
మబ్బు బుట్టెనో నిద్ర మబ్బు
అసురులకు
గుభ గుభమని వురిమె
కుంభవర్షంబు
పిడుగులు వడిగాలి బిన్నున విసిరె
వడి కావలి వారు ప్రాణాల కొరకు
రేరాత్రి వేళను రేపల్లెలోను
మరి యోగమాయను మాయల శక్తి
ఆ యశోద గర్భమున హరి
చెప్పినట్లు
పశిబాల దుర్గ ఆడపడుచై పుట్టె
మధురలో కృష్ణుండు మందలో దుర్గ
చెదరక ... .... .... ... ...
... ... ... ... ... ....
... ... ... ... ... ....
గడ గడ వణకుచు కన్నీరు బెట్టిరి

## శ్రీకృష్ణుడు తల్లిదండ్రులకు విశ్వరూపము చూపుట

శ్రీకృష్ణ భగవానులు చిరునవ్వు
నవ్వి
తడబడు యా తల్లిదండ్రులజూచి
"మీరేల యేడ్చేరు? మీకేల వెరపు

నా రూపు చూడుడీ నను ......"
... ... ... ... ... ....
— — — శంఖ చక్రములతోడ
రొద్దయిన బంగారు దుప్పటములతోన

బొడ్డు తామారమీది పుత్రుని తోడ
చెన్నుమించిన నాలుగు చేతులతోడ
పెన్నురంబునయున్న పిన్నాపెతోడ
కళలు గులికెడు వేయు కన్నులతోడ
మొలక నవ్వుల వేయు మోములతోడ
బలితంపు లఘు వేయు పదములతోడ
తెలివైన తెల్లని తిరుమణితోడ
హద్దుగా నుదుట యదురాకు
వెడల్పున
దిద్దిన పచ్చ తిరిచూర్ణము తోడ
కెళవుల తనువున కీళ్ళు కీళ్ళందు
వెస మద్ది కాయలు వ్రేలాడినట్లు
పొసగంగ తూలెడు మహా
భువనముల తోడ
తన రూపు కృష్ణావతారమై హరియు
తనరంగ జూపె నా తల్లిదండ్రులకు
ఆ వసుదేవుడు జూచి హాశ్చర్య
మందె
"పావన పరమాత్మ! పాపసంహార!
కమలాక్ష గోవింద! కౌంస్తుకాభరణ!
కమలా మనోహర! గరుడా
తురంగ!
క్షీరాబ్ధి శయన! రాజీవదళాక్ష!
వారిజోధర! జగద్వంది!
వైకుంఠవాస!
శ్రీవత్సలాంఛన! శేషఫణితల్ప!
రావణాంతక! శౌరి! రక్షోవిదారి!
నేను గృతార్థుడనైతి స్వామి! మిము
చూడగంటి
హోకృపానిధి! కంసు
డొక్కింతపిన్న
యంత చేసునో బుద్ధి యేమి తమ"
కనిన
అంతట శ్రీహరి ఆరూపు మాని
మన్నించి బాలుడై మధురలోనుండె
'తనను గొంపోయి కిన్నత్వంబుగాను
వనరంగ యశోద వద్దనువుంచి
గరిమెతో చప్పుడు గాకుండ నీవు
ఆ యశోదకు బుట్టిన యట్టి బాలికను
హోయయ్య! తెమ్మని వయ్యన
పలికె
అప్పుడు కంసుడు హరి చాత
జచ్చునని
తప్పదంచును భూమి దడ దడ
వణికె
సొరది కంసుని యింట నెత్తురువాన
గురిశ
కెరళి మింటను ధూమకేతువు
బొడిమె
వారధు ఉప్పొంగ వసుధ చలంగ
భోరునచంద్రుండు పొడసూపె మింట
సొరది పూవుల వాన జోరున గురిశె

## తనను రేపల్లెలో యశోదకడ దాచుమని శ్రీకృష్ణుడు తండ్రికి చెప్పుట

భక్తితో వసుదేవు బాలుణ్ణి జూచి
ముక్తి రక్షకుంతని ముదమొప్ప
దెలిశి
'భూతముల చంపను పుట్టితి'ననుచు
పలికెను తండ్రితో బాలకృష్ణుండు:
'త్రుంచి యా భూతకిని త్రుళ్ళడతు'
ననుచు
'అత్తమామను చంప అల్లుడనైతి
పోతరం బణచక పోనియ్యవాని
యీ మాస మీ దిన మీ ఘడియలోన
ప్రియముతో యశోద ఆడబడుచుసు
గన్నాది
గోపెంమ గంనట్టి[7] కూతురిని దెచ్చి
పాపను బెంచిన పని సఫలమౌను
రాతిరే తనను కొంపోయి రేపల్లెలోన
దాదెంమ[8] కంగిట దాచిరంమనిన[9]
వసుదేవు దేవకి వలపోసు కొనుచు
'యశోద తన బిడ్డను యాలయిచ్చిని
యీసంది దెలసితే యిచ్చినా
యివ్వదో'
అనిన తండ్రితోను బాలకృష్ణుడు
యిట్లనియె:

## యోగమాయ యశోద గర్భమున పుట్టుట

'వసుదేవ! విను తాను వైకుంఠ
మందు
యసగ భూదేవి బ్రంహ్మ వేడిరి
తనను
రక్కసుల బాధపడ రాదని వారు
దిక్కుగంమని బ్రంహ్మ దేవుడు వేడె
విష్ణు స్వరూపమైతి యీ పగదీర్పన్
కృష్ణావతారమైతి దృష్టుల[10] గూల్ప
అమర లోకమునందు ఆ
యోగశక్తికి తనకు
మాట పట్లుంనావి మాధవికి తనకు
అష్ట భుజముల దుర్గ అంమ'' [11]
తానై పుట్టె
అంనకు [12] తన ప్రాణము అడ్డము
వేతునని
నంమించి [13] యుంన్నాది నా
తోడునీడ
తడవేల కొంపోయి దాచిరం"
మనిన

7. గోపెమ్మ గన్నట్టి 8. దాదెమ్మ 9. రమ్మనిన 10. దుష్టులు
11. అమ్మ 12. అన్నకు 13. నమ్మించి

## శ్రీకృష్ణుని మహిమచే చెరసాల తాళములు ఊడిపడుట

చోద్యపడుకొనుచు తన సుతునికై
జూచి
వేదాంత వేద్యుని వేడి యిట్లనియె:
''బందిగము తిరుగువార బలువైన
యట్టి
కొండ పొదవున
యినపకోట యున్నాది
తలుపులకు వుక్కుతాళము లున్నావి
వెళ్ళ తెరవు లేదు వెరతును తాను''
''తనను యెత్తుక తండ్రి తలుపు
తాళములకు
పనివడి తన పాద పద్మములు మోపు
వుండవు తల్పులు వూడు తాళములు''
కొడుకన్న మాటలకు గొబ్బున
వసుదేవు
గోకులాష్టమినాడు కొడుకునెత్తుకొని
వుక్కుతల్పులకు పాదములు
వయ్యన మోపె
చిక్కు తాళములు వీడి తల్పులు
దొలగె

## వసుదేవుడు గాలిగానిని తప్పించుకొనుట

బాలుని పురిటిల్లు బందిగం వెడలి
గాలిగాని చూచి గడ గడ వణికె
'వసుదేవ నీవేల వణుకు చున్నావు?'
'శివవరో! నీకేమి చెప్పుదు' ననెను
అందెంది కూయుమ యనుచు
మీమామ
గాలిగాని వాకిట కావలి యుంచ
యేలాగు కొంపోదు? నే యక్కడ
దాతు?'
'గాలి గానికి గాల కవళంబు బెట్టు
బెల్లము చక్కెర శనగ బేడలను
మొల్లమైన గొప్ప మోరుండ లెల్ల
లంచంబుబెట్టి మాతెర్వురాకు మనుచు
పంపనున్న గాలిగాని ప్రార్థన
శేయు'
కొడుకు చెప్పిన అం ... ... ...
కడువేగ వక యదరు[14] గంపలో బోశి
శివును కావుమని చెప్పెను మనవి
కార్యము కట్టుపడ్డ దనుక ఘనుడు
వసుదేవు
వెరచి యాగాలిగాని వేడి తాగదిలె

— — — — — — —

మేపు సందడిబడి లెస్స
మెక్కుచునుండె
తర్లిరి అచ్చోటు తండ్రియు
కొడుకు

## మత్తగజములు శ్రీకృష్ణుని కోటదాటించుట

కల్లతి యా మత్త గజముల జూచి
వెనక వెనకకు వచ్చి వెరచి వసుదేవు
తనయుడు మరి నవ్వి తండ్రితో
ననెను:
'తొడిబడి మళ్ళను తొలగ నీకేల?
మరువకు నేనొక మాట చెప్పెదను
గజము ప్రాణము ముందు
కాచితి తాను
గజము తన ప్రాణము కాచీని నేడు
వుపకారముకు ప్రతివుపకారమౌను
అపకారము శాయదు ఆ భద్రగజము'
వసుదేవు తాబలికె వైకుంఠపతి జూచి
'యారీతి గజములకు యేరీతి నీవు
చేరి వుపకారంబు చేస్తి వేలాగు?'
'కారడవిలో తండ్రి! గజరాజు వచ్చి
వారధిలో చొచ్చి నీళ్ళుత్రాగంగ
కరిని మకరిబట్టి కదలంగనియక
తలఁదీశి ముంచ తన బలంబునను
తొండముతో చుట్టి తొణికి
యా గజము
వడ్డుకు ముసలిని[15] వయ్యాన యీడ్వ
ముసలి[16] యేనుగను బట్టి మొర
పెట్టగాను

తీశి నీళ్ళలో ముంచ తిరుగ
యా గజమును
కరి గట్టుకు తియ్యంగ ముసలి
గువికి యీడ్వంగ
పట్టి యీరీతి వెయ్యేండ్లు తన
బలమున బోరె
నీళ్ళ ప్రాణము వుంచి నిర్జీవితోను
చాల వోడి హరీయని సారె మొరపెట్టె
కరి మొర ఆలించి కరికడకు యేగి
కరి గాచి మకరిని ఖండించినాను
కరి వకరి వలెగాదు కాచీని పదుమ!
కరివరదుడు తాను కదలి రాగాను
యేనుగులు రెండు యదురుగా వచ్చి
పిన్న పాపనికి మ్రొక్కి ప్రియ
భక్తితోను
అప్పుడు తుండము అటు సాచి పైన
కుంభ స్థలముమీద కూర్చుండ
బెట్టుక
చప్పుడు గాకుండ సాగ నంపించ
యప్పటి తావున యేనుగలు వుండె

## శ్రీకృష్ణునకు శేషుడు తన పడగలతో గొడుగు పట్టుట

యింతలో బొల్లుగాలి యీదర బెట్టి
అంతంత మబ్బుగ్రమ్మి అంధాకారమాయ

15, 16. మొసలి

మేఘములు వడి తీగె మెరుపులు
మెరిశ
బెడిదంపు వురుములు పిడుగుల
వలెను
శంభుని మకుటమున నుండి
జాల్వారి జారె
కుంభ ద్రవణముగాను[17] కురిచ
వరషంబు
పామును వేలాడ పట్టిన విధము
భూమిని వుదకంబు బోరున బారె
విష్ణుకు దేవేంద్రుడుకు విశ్వాసము
గాను
పట్టించ వరషము మహ ప్రళయము
గాను
అడగిరి అసురలు మణిగిరేదేడ
కడలేని నిద్రచే కావలి మరచి
పడిరి కృష్ణుడూయల పై కోకలెరుగక
గుట గుట మనువారు గురుపెట్టు
వారు
కొట్టివేశిన యట్లు గొందులలో బడిరి

వసుదేవుడు గాలి వానలో చిక్కి
ఆ సమయమున బలికె యా శిశువు
గూడి:
'మిత్రు పల్లమనక మించ వుదకంబు
యేరులో కుంటలో యరుగంగ రాదు
బావులో చెరువులో భావింపరాదు
అడుగు బెట్టగ రాదు అంధకారంబు'
అక్కడ తర్లకున్న ఆ బాల
యేమనెను?
'వేయు సిరసులు రెండు వేల
జింహ్వాలుగల
పడిగె శేషుడు మనకు గొడుగుబట్టిని
వివరముగ అతనితో ... ... ... ..
... ... ... ... నీ కన్నులాను
ఆమడ పొడువున అటుకాన వచ్చు
యేమి విచారములేదు యెత్తుక
పదుమ!'
అని పైనమయిరాగ ఆఫణీంద్రుండు
పడిగెలు గొడుగుగా పట్టుకొని వచ్చ

## శ్రీకృష్ణుని మహిమచే వసుదేవుడు యమునానదిని దాటుట

నడిప్రొద్దు ఆ యమునానది జారవచ్చి
గముకమౌ యాపచ్చ గడ్డలు ముంచి
పాము ముక్కు తెగి పారగా చూచి
'యమున యమదూత యిక్కడ
యెదురు పడ్డాది
కంసుచే చావక కడబడి వస్తిమి

కంసుడు యేరై యిక్కడ కాచి
వున్నాడు'
నీళ్ళకయి జాచ నా నీలవర్ణుండు
బాలకృష్ణుడు తండ్రికి భయమెల్ల
దెలిపె:
'పూని తన పాదమున పుట్టిన గంగ

17. కుంభద్రోణముగాను

నను జూచి వేట్కతో నది వుబ్బిపారె
మామను కూడను మనకు పనిలేదు
యమునకు తన పాదములు
యెదురుగా బట్టు'
అనియెదురుగా బట్టిన
హరిపాదములు

పలుమారు ఆయమున పాయలుగ
విచ్చ
కాల్త్రోవ వేర్పడెను కనక రేపల్లెకు
వాయువేగమున యేరు వసుదేవు దాటి
భయమింత లేకను రేపల్లె జొచ్చె

## వసుదేవుడు శ్రీకృష్ణుని యశోద ప్రక్కలో నుంచుట

పాయక యుందురా రేపల్లెలోను
గోపకాంతలు మేల్కని
గొలగొలలాడు
'యెటువలె సందని యక్కడ దాతు
పట్టవెరతును ఆడభామలు నడుగ'
'అందుకు అనుమానము అయ్యె నీకేల
పద్మనాభుడః తన పాదపద్మములు
గడిగి
మేలైన గోపెమ్మ మేడల మీద
కడిగిన వుదకంబు గ్రక్కునచల్లు'

బాలకృష్ణుండనిన పాదములు గడిగి
మెల్లనె కూటాలమీదను చల్లె
తల్పులు ముయ్యక తావు తలంకను
మేడల కోటి బాంధవులు కూడి
సౌఖ్యబట్టిరె
కాంత యశోద గోపకాంతలూను
మతాన బాంధవులు మదిదప్ప
యుండిరి
మెల్లనె వసుదేవు మెదలకుండాను
బాలుని గోపెమ్మ పక్కలో నుంచె

## యోగమాయ శ్రీకృష్ణుని ఆక్షేపించుట

పొత్తులలో బావాయనని పొత్తులలో
బాల
యెత్తుకోంగ నవ్వి యేడ్చ రంతునను
కిసరు పొరగ రామకృష్ణుడు
వినియు
'యీ సమయమున నవ్వి
చెల్లెలా యాల యేడ్చితివి?'

'అన్నా! నీ ప్రాణముకు నన్ను
అడ్డమెయ్యగాను
నవ్వితి నేనందుకు
నలినాయతాక్ష!''
'సర్వదా కంసుడు చంపడు నమ్ము
'యేమి మాటలాడేవు
యాదవచంద్ర!

కంసుడు ఆర్గురిని వక్క ఘడియలో
చంపె
అన్న! మనకు అన్నయిన
ఆ బలభద్రుండు
కానకుండ రోహిణీ గర్భమున దాగె
నీ యంత వాడవు నిజరూపు దాచి
భయపడి వచ్చి రేపల్లెలో దాగితివి
బాధ దప్పించుకుంటిరి బలభద్రు
నీవు
వాదుకు వెరచి పిన్నవారై వుంట్రి
అడబడుచును వాని ఆయుధముచాత
కడబడలేని కంసునికి వెరతు'

## కంసుని ధిక్కరించి పలుకుమని శ్రీకృష్ణుడు యోగమాయకు చెప్పుట

చెల్లెల వెరపకుమని శంఖచక్రములు
మోపె
"కల్లరి తమ మామ ఖండించు కొరకు
మన తండ్రి వసుదేవు మధురలో
నిన్న
చెల్లెలా! దేవకి చేతికిచ్చిని
యింతకన్న దెలశి యిది మామ
కనుచు
అంతంత పోరుబెట్టు అందరు వినగ
కావలివారు విని కంసునికి చెప్పేరు
తీవరంబున వచ్చి దేవకిని బిలచి
పగవాని చేతికి పట్టియిమ్మనిన
వెరచి మనతల్లి వానికిచ్చిని
వాని తలదన్ని వాయువేగమున
కడువేగ ఆకాశ గంగవై నిలువు
చేసువను నిల్వకు చెడుగు కంసుండు
ఖరవాలమున వేసిని కల్లరివాడు
మను లక్ష సూర్యమండలం
పొడుగు
సూర్యుని వద్ద నీవు చుక్కవై నిలచి
మామతో యదరించి మాట్లాడు
చెల్లెలా!"
'యేమందునే అన్న! యెరిగింపు'
మనిన
'ధీకొని కంసుని తిట్టు వెధరించు
వాకు నిష్ఠూరంబు వలశినట్లాడు
మీ యసుర పాపాత్ముల హతము
శేయుటాకు
కంసుడ! మాయన్న కాచియున్నాడు
మీ రాక్షసి వంశము రాము డాకాల
శిక్షింప నున్నాడు సిద్ధమీ మాట
యీ దేరుచున్నాడు పగ
యీదుకొరకు
యేదేడు - జగములు యేలుచున్నాడు

## యాదవుల ఆలమందలో గంగవై వెలయుమని శ్రీకృష్ణుడు యోగమాయకు చెప్పుట

అని చెప్పి చెల్లెలా అంభోది
బెళముల
ఆవులు యాదవులు వున్న
ఆ మందలోన
భావించి పల్లజడల బాలవై నిల్వు
వేవేగ పాలు నెయ్యి వెంగిలి సేయు
విఘ్నంబు శేయుమ యా
పుడియలోను
వేల్పులు కాలావులు యాకపొయ్యాని
శివపూజ ధేన్వులు చిన్నబొయ్యాని'
'చేశినవారేమి శేతురోయన్న!
యీసందు దెల్పుమ యిందు కేలాగో'
''దుర్గ యిటు వినుమ! దృష్ట
గోపాల్కులు
భగ్గుభగ్గునమండి పట్టుకుందమనుచు
పురుదాళ్ళు దీసుక వూరికి వచ్చేరు
తరిమిన పాతాళమునకు చొరబడి
పొమ్ము
పారలతో గడ్డపారల త్రవ్వి
పారిపోనివ్వక పట్టవచ్చినను
తొలగిపోక యాదవులకు దొరుకు
మా చెల్లెలా
శిలప్రాణవట్నమై వారి
చేతిలో నిల్వు
శిలగన్న యప్పుడే వారికి
శివాలు బుట్టు

కాలునేల నిల్వక కన్నీరు బెట్టేరు
వెర్లుబుట్టి యాదవులు వెరచి
వణుకుచును
ఆదిమహాశక్తి ముత్తువ అమ్మవునీవు
ఆదివేల్పువౌట యరగము మేము
అపచారులమైతిమి
అభయమిమ్మనుచు
శాంభవి కావుమని శరణు
శరణనుచు
కొట్టవచ్చిన వురుదాళ్ళు
కుప్పలుగ వేశి
కొట్టుమాతల్లి! నీ కోపంబుదీర
నినుగొట్ట వస్తిమి నీ రూపు తెలియక
జాంహ్నవి కొట్టుమని చేతులెత్తేరు
కొట్టకుమీ చెల్లెలా కొట్టుమన్న యపుడె
నెట్టణమున గోపాల్కులు నెగడక
పొయ్యేరు
శక్తివై యాదవులకు
శివశక్తివైనిలచి
వరచి చూచితిరి నన్ను
వరియ వచ్చితిరి
వోరి నేచూడంగ వరుసుకోండి మీరు
వారిలో వారిని వరుసుకొమ్మనుమి
శివుడు విష్ణు బ్రంహ్మపేర మూడు
సిరసులు నిల్పి

తరాతరము పాపచాల తల్లివని
కొల్తురు
నాలుగు లక్షల ముప్పదిరెండు వేల
యేండ్లు
కారణమున నిన్ను గంగవని
కొల్తురు"

## గంగ కీర్తిని స్థిరము చేసెదనని శ్రీకృష్ణుడు చెప్పుట

'నమ్మదునా అన్న!'—''నమ్మము
చెల్లెల నీవు
అమ్మరో! వకమాట ఆనతిచ్చెదను
మాయ భూతకిని చంపి
మామను ద్రుంచి
జయముగ యా వుగ్రసేనునికి
మధుర
పట్నంబు గట్టి నా ప్రజ్ఞ యీడేర్తు
ఘట్టిగా ద్వారకి కట్టి యీడేర్తు
తూర్పుద్వారము దుర్గ నీకిత్తు
నేర్పుతో కొలుతుము మేము
యాదవులు
వికల్పములు లేని విధియాయ చాత
శంఖు ద్వారావతి చెల్లించుకోని
అన్నయిన బలభద్రుడు ఆవులు
యాదవులు
కొన్నాళ్ళు దూర్వాసు కోనలో నుండి
దృష్ట గోపాల్కులు దూర్వాసును
జూచి
దూషింతు రా ముని దృష్ఠ మెరుగలేక
గరికెవెళ్ళరు సముక
మండలము నిండి
పొంగుచు నురుగు లుప్పొంగగా జూచి
కల్లుత్రాగినవాని కల్లపరతామనుచు
కలికి గోపాల్కుని కన్యగా జేశి
పోతరంబున వుక్కుపొత్తరము గట్టి
ఆవలిగా నిల్పి అడ్డతెర బన్ని
మహాత్ముడ! వో దూర్వాసు
మహామునివి నీవు
యీచిన్నది ప్రసూతి యన్నాళ్ళ
కయ్యానో
ఆడబిడుచో మొగవాడో
ఆనతిమ్మనిన
అడిగిన దూర్వాసు హోగ్రుడై మండి
మిమ్ము యేలినవారు మీరు
యాదవులు
నమ్మిడి వీనికి నుక్కుపొత్తర బుట్టు
అమ్మహ కోపమున ఆ మౌని బలికె
అమ్ములై నీరు తుంగచాత
హతము గాగలరు
చెల్లుదురు పొత్రాన శాపము దగిలి
వాలాయముగ తుంగచాత వారు
చెల్లిగాను
అరికాలు వేటుబడి ఆరముడిగి

ధర అగ్నిదేవునిలో తానూను గలశి
నరులకు నాపేరు కృష్ణానది
యనిపింతు
వేర్పాటుగ నూటయెనిమిది
దివ్యతీరపతుల
అరుదైన పుణ్యనది అనిపింతు చెల్లెల
శివుని పేరు నీ పేరు సిద్ధంబుగాను
నవ్వుగాదు వక్కటిగ నడిపింతు
చెల్లెం!''
'వోయన్న! ముగ్గురిపేరు వక్క
నదిలోన
కాయరాదు ముగ్గురిని చెప్పు'మని
యడిగె
'అమ్మ! నీపేరు గంగాదేవి
యనిపింతు
నమ్మ నాపేరు కృష్ణానది
యనిపింతు
శక్తి పేర శివశక్తి యనిపింతు
భుక్తిముక్తులు గలుగు
యీలోకమందు
కృష్ణవేణియన్నను కీర్తిలోకముల
బాపుదు ముగ్గురిపేర
పాపపరిహారంబౌను'
వుప్పొంగి చెల్లెలు వుబ్బుచు నవ్వె
అప్పుడు కృష్ణుండు ఆడె నొకమాట
'ఔత్తారము వీడుచు అష్టభార్యలను
పాండవ అర్జునునికి పట్నంబు గట్టి
అది యాదమండలమై అవని
విలశిల్లు
కటక జగన్నాథుడనై
కలియుగమునందు
యిటువలె దుర్గవై తన
యంటనే యుండు
పరంజ్యోతివి నీవు
పరబ్రహ్మంబు తాను
వెలతము లోకమున వేర్పాటుగాను
వలపట సీతాళ కలిశమై నావద్ద
బాయకుమీ
నీలు పాలు గలశినట్లు నీవు
నే నుందుము
చెల్లెలా! నే జెప్పినట్లు సారెకు నమ్మ
తడవాయె పొ'మ్మని తలన చే...

## వసుదేవుడు యోగమాయను చెరసాలకు చేర్చుట

వడి బాల నెత్తుకొని వసుదేవు గదిలె
అరిగి యా యమున దాటి తిరిగి
చూడకను
పరువున వసుదేవు బందిగము చొచ్చి
చప్పుడు కాయక సతికి నందించ
గువ్వున యా ప్రేమ కొలది
పెంపెక్కి
పొదిగిపట్టుకనపుడు పొలతి చన్నిచ్చి

కుదులుచు వడ్డిచన్ను
కుడిచి యేడ్చినను
చలగి బ్రహ్మాండ మదిరె
చంద్రుండు గ్రుంకె
ఘనఘీక పెట్టెను గజములు యపుడు
వినయమున గార్దభము వింతగ
గూశ

విని కావలి సతులు వీథులు బట్టిరి
వగిరించి తలపీడ వలువలు జార
పగబాల బుట్టెనని పరువున వచ్చి
'కమ్మకమ్మమ నీవు
కంసభూపాల!
అమ్మ నీశ్కాదెను అయ్యా వేంచేయు'

## కంసుడు శిశువును చంప వచ్చుట

చెప్పిన కంసుడు సింహాసనంబు
ఘుప్పున పడదుమికి గుడ్లెర్రజేశె
మీసంబు వడిద్రిప్పి దూశ ఖడ్గంబు
విసరుచు కోపాన వింటి వింటి నసుచు
కలిగెనా బాలుండు కలిగె పగదీర్ప
బలురక్కసుడు నేలబందిగము చేరి
కంసుడు చెల్లెలిని కన్నుల జూచి
బుస లుప్పతిల్లగ పొలతి
కిట్లనియె:
'ఈమి బిడ్డనుగంటి వలివేణి
తె'మ్మనెను
'అన్నరో! వో యన్న!
ఆడపడుచన్న!
కన్నాను నేచిన్న కందు నో యన్న!
పడుచ పుట్టింది మాట ప్రతిలేదు
అన్న
యవ్వరిలోది ఆడపడుచు
నిన్నేమి చేశెని?
ఆకాశవాణి కల్లలాడింది నేరతు

గండంబు లేదు మొగవాడు కాడు'
అనిన చెల్లెలితోను ఆ కంసుడు బలికె:
'పెద్దతనములు చెప్పేవు పెదవులు
తడిపేవు
యంత చెప్పేవు బాలను యాల
యిటు తెమ్మ!
పూని అష్టమ గర్భమున
పుట్టినవాని
మానక చంపుదు మాట లేమిటికి?
ఆడబడుచైతేను అత్త గండంబు
నేనేల విడిచేను నేరవు తెమ్మ!'
'అర్గురు మొగవారిని అన్న!
చంపితివి
మాగుమాటాడి నీకు నేమనవి
చెప్పితినె
నెత్తురుముద్దను నే బెంచుకుందు
బ్రతకని"మ్మని చెల్లెలు
బ్రతిమాలసాగె
'చెడుబుద్ధి యేటికి చెల్లెల నీకు

విడువను బాలను వినుము నామాట
వగిశేవు ఆకాశవాణి యేమనెను
వగవవె తనమీద వసుదేవు నీవు
బిడ్డ ప్రాణము నీకు ప్రియమాయ
నటవె
దొడ్డగ నా ప్రాణము దోషమా నీకు?
నను చూచు చెల్లెల! యీ నశిగందు
యాల?'
అనినంత దేవకి అన్నకు వెరచి
కని వెనుక చూచివ
వెన్ను కానంగరాదు
దిక్కుగా పుట్టింటి దివ్వె జూచిన
చాలునని

పక్కనున్న బిడ్డను పట్టమని
యపుడు
క్రుంగుచు కన్నీరు గ్రుక్కుచు తల్లి
బంగిగములో నుండి బైటికంగించ
అందుకొనె కంసుడు ఆయుధము
చాత
పంజరనము ఆడబడుచును నరక
చట్టుతో కొట్టుదు చంపుదు ననుచు
పట్టెను శిశువును యడమ పాదంబు
బగను

## యోగమాయ ఆకాశమున కెగిరి శ్రీకృష్ణుడు కంసుని చంపనున్నాడని చెప్పుట

విశిరి కొట్టబోగ విడదన్నె బాల
ఆసమయమున వెగిశ ఆకాశమునకు
కంసుడు చూడంగ కలకల నవ్వి
అష్టభుజముల దుర్గ అమ్మ తా
నిలచి
చాతను శూలము శంఖు చక్రము
గదయు
శార్జంబు ఖడ్గంబు ధనురుకం
శరము
కరముల బట్టి ఘాతకొని యార్చి
'మామ! బెదరక నామాట
ఘుట్టు వినర!

కాళ్ళు బట్టుకోంగను గాచితిగాని
తలవూడ దన్నిదు తమ అన్నతోడు
మేనగోడల నీకు మేలు చేశినాను
కోడల గాగాను కొంచి స్త్రిగాని
పండ్లూడదన్నుదు యడమ
పాదంబుతోను
మాయన్న శలవు యే మాత్రమైన
కాయను నీ ప్రాణి కాతును తాను
వెనక నిను చంపేవాడు వేరె
యున్నాడు
భాషింప నాకేల పాపాత్ముతోడ
అసురవైరి వకచోట అడుచున్నాడు

చిక్కని రాక్షసుల చీరనున్నాడు
యక్కడ బెరుగునో
యాద మరువుకమి
అధికుండు నిను జంప ఆయుత
పడ్డాడు
వకచోట బెరుగుచు వో మామ!
యున్నాడు
నీకు చెప్పితి మామ! నిజము
నామాట
వెదక నంపి నీవు వెదకు
వో మామ!'
అని యిట్లు వినిపించి ఆ శక్తి వేగ
మనుజలోకము కేగె మహి యల్ల
వినగ
ఆకాశమున బాల ఆడివందులకు
ఆ కంసుడు ఝడశి అలమట పడెను
'వసుదేవునకు దేవకికి వారికి
పగజేస్తి
చెల్లెలిపై తెగి శిశుహత్య జేస్తి
చలమున ఆకాశవాణి చాడి చెప్పంగ
ఆముని నారదుండు ఆడిన బెదరి
నమ్మించి చంపితి నాబుద్ధి తప్పె
పుత్రశోకము చాత పొరలంగ నీరు
కార్చారుండ బ్రాహ్మణ గురుదోషి
తాను
వేరె పగ బుట్టె నేనేమి శేయుదును!
చెల్లెలా! రమ్మని చేతులు బట్టి
కాలి సంకెండ్లూడ గొట్టి కడ
బార వైచ
మరదిని కౌగలించి మనుములు
చెప్పి
అలమటపడి కంసుడు
అంతఃపురంబునను
తలపోశి చింతించి తానంతటుండె

## నందుడు బలరామ కృషులకు పుత్రోత్సవము చేయుట

నందనుడు కలిగెనని నందుండు వేగ
అందరు యాదవులు ఆనందమంది
వడి వడి రేపల్లె వాడల్ల చాటి
యడతెగక గోపాల యాదవ సతులు
వారు గోపాల్కులు వాయువర్తనాల
వరుసతో కుంకుమ వసంతములాడి
కొందరు కస్తూరి కొల్లులో దించి
పసపూను జవ్వాజ పన్నీరు చాత
వాశిగ కుంకుమ వసంతములాడి
విప్రులందరిని బిలచి
వినయంబుతోను
తప్పక శోడశదానములు చేశి
బాలుణ్ణి తలగడిగి పసపు నీరార్చి
జలకముల్ పోశి జయమని పొగడిరి
గొల్లభామలు పైడి గొలుసుల
తొట్లలోన

తెల్లపట్టు పొత్తిలలోన దేవాది దేవుని
పన్నుగా దేవుని పండంగ నుంచి
చెంచితలు చెలికాని కావలు చేశి
జోలబాడ పూని జోకొట్టి రపుడు
"జో అచ్యుతానంద! జోజో ముకుంద
రార పరమానంద! రామగోవింద!
||జో జో||
జోస్కల జగదీశ! సూర్యసంకాశ!
శ్రీ సఖీహృదయేశ! జితదానవేశ
||జోజో||
శృతులు ౖముచ్చిలి నట్టి
సోముకాసురుని
అతిమీనమై వాని హతమణచితౌను
అతివేగమున బ్రంహ్మకు వేదములు
నొసగి
మతి నొసంగిన స్వామి మము నేలు
ధరణి ||జోజో||
ప్రమదమున భక్తులను పాలింప
దలచి
విమదాది రిపులను విదళించి వైచి
కమఠమై భూమి పొంకముగ
ధరియించి
రమణ బ్రోచిన స్వామి రార ఆలించి
||జోజో||
వరుసతో తన సుతుని
వధియింప బూని
పరమ బాధలుపెట్టు పాపాత్మ చుట్టి
సరసమున జఘములను చంపిన
జగద్భుట్టి

నరసింహ్వరూపమై నమరిన వేళ
||జోజో||
జగతిలో దురితములు చెండుచును
భంగి
వగలు మించిన ధరణీవరులతో
నలగి
రఘునాయక పరశురాముడవై
మెలగి
పగదీర్చుకొన్న శ్రీపతిరార చలగి
||జోజో||
దశరథా సుతుడవై ధరణి వర్తించి
పశుపతి విల్లిరచి పట్టిధట్టించి
వశముగా జానకి వనిత వరియించి
విశదముగ శ్రీరామ వినర కరుణించి
||జోజో||
అని యిట్లు జోలలు అతివెలు బాడ
వేగ నందుడు సకల వేట్కలతోను
గర్గాది భూసురుల కరుణించి పిలచి
పూజ నమస్కారంబు పురుడు
పుణ్యము దీర్చి
ప్రజలెల్ల భాగీరథికి పబ్బిములు
బెట్టిరి
పౌలతి రోహిణి గన్న
పుత్రరత్నమును
బలభద్రుడను పేరు ప్రబలంగ జేశి
యెదువంశధీశుని యశోద సుతుని
పది నామముల కృష్ణభగవాను లనిరి
నామకీర్తనల్ చేశి నమస్కరించి
క్షేమాన రేపల్లె జయమున నుండె

వడివేగ రేపల్లెకు వసుదేవుడు వచ్చి
అన్ననందునితోను
అతి ప్రియంబునను
తాను ముచ్చటలాడి తనయుల జూచి
బలభద్ర కృష్ణుల భక్తితో జూచి
కలియ బలికి సుతుల కనిపించుకోని
విందులు భోంచేశి నందుని నగర
అందముగ కట్నాలు అంది వేగంబె
మధురకు వేంచేశి మగువను కలశి
కలశి ముచ్చటలాడి క్రమమున
నుండె

## కంసుడు బాలకృష్ణుని చంపుటకై భూతకిని పంపుట

ఆవేళ కంసుడు అసురసురు మనుచు
భావించి తన మంత్రి
బంధువులతోను:
'వినుడి తన పాలికి విధాత్మడైన
మరి యముడై పుట్టె మామను జంప
అల్లుడు పెరుగుచున్నాడని
ఆ యోగమాయ
తెల్లమిగ జెప్పెను తెగటార్చుననుచు
కావలశి తనకిపుడు కలిగిన వారు
సీమలో గలయట్టి శిశువులనెల్ల
చప్పన్న దేశముల సందుగొందులను
శిశువులందరిని జంపి శీఘ్రగమె రాండి'
అసురులకు శలవిచ్చి అఖిల
దేశములకు
'వేసారక తిరిగి విహరించి రాండి'
కంసుని మాట విని పూతన కడిగి
యిట్లనియె
'నిన్న మొన్న బుట్టిన నిశి గంద వేగ
నిన్నేమి శాయను నేర్చును వాడు
ఆ శిశువు పనియంత ఆ పని యంత
యీ శిశువును చంపి పగ యీడేర్చి
వత్తు
వలవేశి రేపల్లె వాడ శోధించి
చాల కూర్చిన విషము తన
చన్నుల నిమిడి
యెన్ని మాయల ప్రాణము యెదురు
నెట్టుకొని
చన్నిచ్చి మాపటికి చంపి వచ్చెదను'
భూతకి ఆడిన బుద్ధులు వినియు
అంతంత కంసుడు హల్లున నవ్వె
'భూతకి! నీరూపు భూమికి వింత
భీతున నినుజూచి బిడ్డలు రారు
కుడుతురా విషములు కూర్చిన చన్ను
నీరూపు చూచిన నిల్వక వెరచి
మారు పొలములు బట్టి మందలించేరు
చిర్రవెంట్రుకలు గున్నచింతవలె
శిరస్సు
దొరవుల వంటివి కాళ్ళు గాబు తొట్టి
వలె నోరు
పగిలింప ఫెనగడి బద్దలవలె పండ్లు

చారరాని యట్టి తెరనోటి కంపు
పేలురాలేటి తల పెడతట కణితి
యముఁరాలః నీరూపు యేమి
యెన్నుదునె?
తూములే ముక్కులు తుమ్ములే
పిడుగులు
ముక్కులో వెంట్రుకలు యేదు
ముండ్లను బోలు
చక్క బొంతల వంటివి చేతులు
కాళ్ళు
వెక్కసమైన నడుము వేలాడు
కుచములు
కరుకు యేస గనల్పు కాంతః నీమేను
కురుచని పాదాలు గుది గాళ్ళు నీకు'
అటువలె తనవిభుడు ఆడిన నవ్వి
'యిటు విను కంసుడః యీ రూపు
మాని
విడిచి చక్కని గొల్ల వేషంబు దాల్తు
పడిమాలి తానొక్క బాలింత నౌదు'
కామరూపిణి సుందరికాంత తా నాయ
పుణ్య శ్రీరూపము పూనినయట్లు
అన్ని యాభరణాలు అలంకరించ
పుల్లిపూసల పేర్లు వల్లల్ల పసుపు
కలికి కన్నుల సన్నపు కాటుక దీర్చి
కాయము పుక్కిట విడెము
కర్ణముల దూది
మై వాసనరవికె మరకల చీరె
పొలతి యా భూతకి బొట్టు నొదుట
నుంచ
పిడుగులవలె చల్లపిడతలు వడిలో
కడవ నెత్తిన చల్లకాగువలె నుండె
భూతకి గొల్లరూపు పూని పుచ్చుకొని
సతి పతి యదటను చల్లమ్మ సాగె
కంసుడు భూతకిని జూచి
కడుపుబ్బ నవ్వె
'నిమిషమున బాలలు నీకు చిక్కేరు
కనుగలగి పొమ్మని గంధవిడెమిచ్చె
అనిపెను కంసుడు అతివెను వెడచేశి

## భూతకి గొల్లభామ వేషమున రేపల్లెకు వచ్చుట

భూతకి పాదముల పుట్టె రవధూళి
ఘాతగా మింటను కావురుగప్పె
పరువునవచ్చి రేపల్లెలో జొచ్చి
అరిగి బాలల రొద ఆలకింపుచును
గొల్లవాడలు తిరిగి గొందులు వెదకి
'చల్లో' యని భూతకి చల్లమ్మసాగె
'చల్ల గొనరో యమ్మ చల్లగొనరమ్మ
యలమితో యీ చల్ల యచరు
త్రాగినను
తెలివినుందురు తెగులు తెంకటి లేక'
చల్లయవ్వరు గొనరు సరుకు
శాయరన్ను

పిలచి యవ్వరు గొనరు పిడితెడు
చల్ల
నాతి యా గోపెమ్మ నగరుముందరను
అంతట భూతకి చల్లమ్మంగ సాగె
బంగారు తొట్లలో బాల కృష్ణుండు
దిగ్గునలేచి దివ్యజ్ఞానము జూచ
'రేపల్లె గోపికలు రేపకడ పోయి
సంపద పట్నాల చల్లమ్మి వత్తురు
పాలు పెరుగున (పొంగు)
రేపల్లె వాడ
అమృతమున రేపల్లె ఆమరావతి
యనగ
తులతూగు చున్నది తృప్తిని బొంది
యిప్పుడు రేపల్లెకు యీ క్షణమందు
యేమిటికి చల్లమ్మ యవ్వతొ వచ్చ
పగలు వచ్చను తనకు పగలాయ'
ననుచు
మొయిలు ముట్టగ నేడ్చె మొదటి
పగ దీర్ప
పిట్టను యాటకాదు పిలచిన విధము
గుట్టునాడు భూతకిని రాబిలిచ
నపుడు
గజవరదుడు అసుర గజయాటకాడు
గజము పంగిణి దోలి కట్టిన యట్లు
చుట్టమో మేనత్తొ సుడిసి పోగాను
యట్లు దీని చంప యవ్వరు లేరు
అంతంత రొదచేశ అంత కృష్ణుండు
బాలరొద భూతకి ఆలకింపుచును
వత్తెనె గోపెమ్మ వావారి చొచ్చ

నేరని దానిపలె నడవ నేరని యట్లు
వారచూపులు బాలను వరుసుకొని
వచ్చ
యేలు చెక్కిటబూని వెరగంది
యపుడు
కాలు నేలను చమరి కడవ తా దించి
'చిచ్చో బాల'యని శిరిసుఖము
దుడిచి
'వచ్చెరా ముద్దు సేపువచ్చె చన్నులకు
ఆకలి గొన్నావ అయ్య నా తండ్రి!
పొక్కుచు ప్రేపులు పొర్లీర తనకు
వినవచ్చ నీయేడ్పు విని వస్తిని తాను
కన్నార నీవంటి కందును తాను
బిడ్డల తల్లినిగాగ పిల్వందె వస్తి
యాద్వకు మీతల్లి యాల ఝుడిశీని
పాపః నీకన్న పని యెక్కువాయెనా?
వోపోవ దయ.లేదు వో యన్న అదిర
నేజెల్ల గోపెమ్మ నెలవంటి సుతుని
బిడ్డల తల్లినిగాగ పిల్వందె వస్తి
బుజ్జగించవమ్మ! పుచ్చుకోవమ్మ!
యెత్తుకో సీపని యంతైనగాని
భక్తిలేదటవమ్మ! నీపని బంగారుగాను
చిన్ని నాతండ్రికి చన్నివ్వవమ్మ!
తన నేల చూచేవు మీతల్లి యుండగాను
ముద్దురాదటవమ్మః యీ ముద్రుణ్ణి
చూచిన
యెదురుగ వస్తేను నేనెత్తుకుందు'
వగచుచు దగ్గెరవచ్చి తా మెచ్చి

జోలలు పాడుచు సొలయుచు
మతిదప్పి

మాయభూతకి కడుమాటలకు భ్రమసి
మగువ లెవ్వరు మారు మాటాడరైరి

## పాలు కుడిచి బాలకృష్ణుడు భూతకిని చంపుట

మసలుచు నీరాళ్ళ మసిలి తానెక్కి
పశిబాలకిసరని పాలిండ్లు గడిగి
పికక్కటిల్లుచు ముత్యాలపీట
జేర్చుకొని
కోక త్రాడలపైన గోసిగా ద్రోచి
అరిచాత చమిరి హరి నెత్తుకొని
నెరులు ముఖము దుడిచి నేర్పులు
బలికి
కాలకూట విషము కలిపిన చన్ను
తొలకిందచై వుంచి తానిచ్చు చన్ను
విషముగా దెలిసి విష్ణు కోపగించి
వేషధారి చన్ను వెళ్ళంగ వూసె
'వేసాల వాడ'వని వేళ పిడి చంప
అడ్డపట్ల చన్ను అప్పుడు తానిచ్చ
మాకు మేనత్తో మామసతో లేక
వకట రెంట మరియు వోపిక నుంటి
చంప వచ్చిన దాని చంపుదే
తెన్నయనుచు
తప్పు విషము వక దవడను
వుంచి
చన్నులు బిగబట్టి సల్పులు బుట్ట
చన్ను పీల్వగ గుండె ఝల్లున
బిగిలె

'పడితి పడితి' ననుచు బిత్తిమాల
సాగె
'కుడువకుండేను మానె విడవరా
చన్ను!
వడలు జోగడ బోయ వార్వలే'
ననగ
నెత్తురు మాంసము నెరి యమకలెల్ల
పెటపెట మనగాను పీల్చ నొక
గుటక
నక్కిళ్ల గడబడి యెక్కిళ్లు బుట్టె
చిక్కతినని గుడ్లు చేశ యింతేశి
కాళ్లు విలదన్ని గాండ్రున యెగిరి
వంటి గుటకతోను వరిగె నా అసుర
పెటపెట కోపాన పండ్లు దా గొరికి
విల విల దన్నుక విడిచ ప్రాణములు
వొళ్లు మరచి కృష్ణా యనిన వయ్యావె
విడిచ
పడెను నిజరూపున పర్వతాకారమై
కూలెనా భూతకి కూటాల నడుమ
నీలవర్ణుడు దానిమీద నేరనట్లదగి
యుండె
గోపెమ్మ తా ఝడిశి గోపకాంతలు
దాను

పాపని యత్తుక పరితాపమంది
ఆపద పడుకొనుచు అసురుసురు
మనుచు
'వెరవకు నాతండ్రి! వెరవకో
కొడుక!
వెరవకు కృష్ణా!'యని వెన్ను తా
జరచి
'ఝడియకు నాయన్న!
ఝడియకు బాల!
యేడ్వకు'మని తల్లి యదమందు
జేర్చి
'కడుపు బగిలెనో దాని కనుగొని
సుతుడు
కుడిచెనో చన్ను భీతుకుడిచెనో
తండ్రి!
పగదానినై దానికి పట్టిస్తి కొడుక!
వగచుచు నుంటిరా వోయన్న!
మతిదప్పి
చిన్నబోయున్నాడు చిన్ని కృష్ణుండు
నేనేమి సేతునే వో నెలతలార!'
గోపకాంత లందరు గుంపులు గూడి
'పాపడు ఝడిశీని పల్కరించకమ్మ!'
వకరి చేతి కృష్ణుని వకరందుకునిరి
పొక్కుచు నుండిరి పొలతు
లందరును
దగ్గెర రావెరచి దాని దిట్టుచును
'ఒగ్గిబడెగా దీని బలుపెంత బలుపె
భయమౌను చూడను బడది [illegible]
పిక్కలును

యేపె మొద్దుల వంటి వింతేశి
తొడలు
యేరూపు చూచిన యేదురోమములు
అందరిది ఆడపుట్టుక అనరాదుగాని
కందువ చన్నులు దీనివి కాగులంతేశి
త్రొరినోరు గాబుతొట్టి వలె యున్నాది
పెకళి అడుగుబోయిన పెనమువలె
చెవులు
కల్లగాదు బండికమ్మ లంతేశి
బండి పేర్పుల వంటి
బజగాడిముండ!
పాడు దొరవుల వంటివి పొరగట్టిన
కన్నులు
ఝడిశి అందరివళ్లు ఝల్లుమనె నమ్మ!
యేటి పాలుగాను దీని తల
యన్న వోయమ్మ!
చెట్టు మొలశిన రీతి కొండఘట్టు వలె
యున్నది
మాయలాడిగాని యిది మనిషియు
గాదు
అసుర గాని యిది ఆడస్త్రీ గాదు
దైత గాబోలనుచు తలపొయ్యగాను
మందనుండి వచ్చి నందుడు వేగ
మైళంబె పురిజొచ్చి వచ్చి శిశువును
జూచి
కొందరిని అదలించి కొందరిని బిలిచి
కొందరిని గొట్టి కొడుకు నెత్తుకొని
'యందరు మీరుండి దీని యిల్లు [illegible]
చొరనిస్తిరి

నందను మరచితిరె మీరందరు
వుండి'
కలినీళ్ళపై గడిగి ఘనుడు యా తండ్రి
బాలకు ద్రిష్టిదీశ పరిహారంగాను
పెట్టించ వీభూతి కట్టించ రక్ష
పట్టుమని తల్లి చేతికి
పదిలమని యిచ్చ

గండ్ర గొడ్డండ్ల కోటకత్తులతోను
కీళ్ల కీళ్ళకు నరికించ కీడు భూతకిని
బండిన బెట్టించి పారవేయించ
అక్కడ తర్లి నందుడు అరిగె
మందకును
అసుర చెల్లినవార్త అవని విలశిల్లె
కంసుడు విని చింతాక్రాంతుడై వుండి

## చిన్నికృష్ణుడు శకటాసురుని పరిమార్చుట

కంసుడు ఆవేశ ఘనకోపమునను
శగటాశూరుని సీఘ్రమే పిలిచి
'బాలకృష్ణుని నీవు పట్టి వధియించి
శీఘ్రమే ర'మ్మని శలవిచ్చె వానికి
శగటాశురుడు మచ్చర
మెచ్చరింవుచును
ప్రకటితంబుగ నొప్పబండియై వచ్చ
మేదిని కృష్ణమ్మ మీదను దొల్లె
తాచి తనకాల తన్నెనా బండి
యిరుసును గాండ్లు పరమింతయు లేక
నెరయు చిదుపల్లై నేలపై గూలె
కూలిన బండిజూచి గోపకాంత
లందరును
జాలిబడి కృష్ణుని చంకబెట్టుకునిరి
పాపనిమీద యీ బండి పారెను
యనుచు

దాపున వున్నకాంతలు తల్లడించగను
పరువున నాడేటి బాలలు వచ్చి
'విరిగిన బండివార్త వినవె యశోద!
వుయ్యాల తొట్లలోవున్న నీ కొడుకు
గయ్యాళి యాబండి కాలబడదన్నె
వకరంత చూస్తిమి వనర యశోద!'
గోపెమ్మ తా బలికె గోపకాంతల
తోడ
'పడుచువారి మాటలు
పాటి యటరమ్మ!
బండియంత బరువు?
బాలుడు యంత?
కానక చూడని కడపటి మాటలు
మాను'మని గోపమ్మ తన
మందిరమునుండె

## చిన్ని కృష్ణుడు తృణావర్తుని పరిమార్చుట

శగటాశూరుడు చెల్లినవెనుక

మరియు కొన్నాళ్ళకు మధురలోపలను

ఘోరదానవుడు కంసుని
కొల్వులోనిలచి
'భూపాల కంసుడ! భూతకిని
చంపిస్తివి
ఆపదబొంది తన శ్రీహత్య చేస్తివి
వేస్తె వెయిరూపుల
వీరరాక్షసు లుండంగ
వాసిగ నీయింటి వనిత నంపితివి
ముందుగ నన్నంపక
మోసబోయినావు
యిపుడైన తననంపు
యిక చూరు ముందు
తగు వేట్కతో వాని తలతోను బట్టి
ప్రాణముతో దెత్తు నీ పాదాలకడకు
తృణావర్తుడ నేను త్రుళ్ళేటివాలుని
సురగాలియై వాని సుడసుడి పత్తు
విడెమిచ్చి సైనంబు వేగమే పంపు'
అనిన వాని బిలిచి అతిగారవించి
పునుగును గంధము పోకలాకులు
నిచ్చి
పోయిరమ్మని చాల పోషించి పంపె.
భావించి తాగదిలి బలువు రాక్షసుడు
క్రోధించి సురగాలి కొండపొడుగున
వెరిగె
మాకులు తల్లడిల్లి ఆకులు రాల
మూకపికాదులు గుంది సొడిబడగ
పల్లెకు నేతెంచ పగ దాటుకొనుచు
బాలుని ముద్దాడి పలికె గోపెమ్మ

ముదియుచు తొడలపై ముందర
నిముడుక
కురులు దువ్వుచు చన్ను
కుడుపుచుండగను
రక్కసుడు రాగాను కృష్ణరాయలకు
దెలిశి
'యిక్కడ తొడలపై
యిపుడుంటినైన
భావ్యంబుగాదు తాను బరువుగాకున్న
ద్రోణపర్వతము రీతి తల్లి తొడలపై
యుండె
ప్రాణయోష్టయు పొంది పడవైచ
తల్లి
హరో హరుడో యం
బ్రహ్మదేవుడో తెలియ
మహిమ వంగి తిసమిచ
బడ్డట్లుగానుండె
తెప్పున విడిచెను దెలి సురగాలి
అప్పుడే హరిగొనుచు ఆకాశ మెగిశ
చెప్పుడు లేదని చేసినచోట
'నేనేల విడిచితి నేరంబు చేస్తి
యిక్కడ విడిచితి యిక్కడలేడు
యక్కడ లేడని తల్లి
అలమటపడగ
తృణావర్తుని గళము తొలగి
పోనివ్వక
తృణముగ పరిచను దుత్తుమురుగాను

అసుర తల క్రిందుగా బడి అవనిపై చెల్లె
వసుదేవు సుతుడు వానిపైనుండె
భీతిల్లి గోపెమ్మ బిడ్డన్నిజూచి
చేతులు బిసుకుచు చిన్నికృష్ణుని జూచి
వగచుచు గోపికె వనితె లందరును
జగదీశు నెత్తుకొని జనిరి వారంత

## యశోదకు చిన్నికృష్ణుని నోటిలో సమస్తలోకములు కనబడుట

అంతఃపురంబున అంత నొకనాడు
యంతయు మోహమున యాదవు సుతుని
సెలినాక్షి ముద్దాడి నవ్వించుకొరకు
గిలిగింతలు చక్కిలిగింతలు బెట్టె
తల్లిని చక్కగ జూచి తాను కలకల నవ్వె
చిన్ని కృష్ణుండు కడుపుబ్బ నవ్విన యపుడె
ఆ నోటిలోపల అంబుధుల్ నదులు
మౌనులు గిరులు బ్రంహ్మలున్నెరులు
ద్వాదశాదిత్యులు తరులు ఖేచరులు
మేదిని స్తలములు మిన్నులు సురలు
చంద్రసూర్యులు జగజ్జాలముల్ దిశలు
యింద్రాది దేవత యీశ్వర అజులు
రాక్షసులు సురలు రంభాది సతులు
పక్షులు యక్షులు పన్నగ వయుగములు
ద్వీపంబు లడవులు ధ్రువు మండలంబు
ఆ పధ్నాలుగు లోకములు తన అంగిట చూపె
బ్రంహ్మాండములు జూచి భ్రమసి యా తల్లి
'దేహములో మాయ తెలియక యుంటి
విష్ణు తా కృష్ణుడు విశ్వంబునందు
దృష్టముగ బుట్టె నీ దేవదేవుండు
మనుజుడై పుట్టెను యిన్ని మాయలను'
అనుచు యశోద తన ఆత్మందువుంచి
'నిన్ను నేనెరుగని నీచాత్మురాలః
అపరాధి అజ్ఞాన్ని హరి కావు కావు
వనజాక్షః గోవింద! వైకుంఠవాస!
వినయ భూషణ వేద వేదాంత
సనకాది యోగీంద్ర సకలదయాళః
అని సన్నుతించను అప్పుడా తల్లి
కపటబాలుడు తల్లికి అజ్ఞానము బొందించి

శబరుడై తన రూపు చాలించి చిన్ని బుడతడై యుండెను
ప్రొద్దుమోదమున

## బలరామ కృష్ణులు బాలురతో ఆటలాడుట

మనకాడు పెరిగెను మామను గొట్ట
పొత్తుల లోపల పొరలి పొరలాడు
క్రొత్తకకవలెను కూర్చుండ నేర్చె
చన్నుయిచ్చె రమ్మని తల్లి
చప్పట్లుగొట్ట
అని తల్లి చైజాప దోగేడనేర్చ
'నెయ్యిబోసేను నిలువు కృష్ణా!'
యనిన
అయ్యడ విద్యలు ఆడంగ నేర్చె
తప్పటడుగులు బెట్టి తమతల్లి
చూడంగ
అప్పుడు గునగున ఆడంగనేర్చ
ఘల్లుఘల్లున మొలఘంటలు బలుక
తల్లి వెనువెంటను తా నడవ నేర్చ
బలభద్ర కృష్ణుల భామలు బెంచిరి
నేలంటు బాసిరి నెలతలు చూడ
ఆరేండ్ల బలభద్రు అయిదేండ్ల కృష్ణు
యీ రీతి పెరిగిరి యశోద నగర
రవిబోలు రత్నములు రావిరేకలును
వసుపరి మెదనూలు
వల్లభూషణములు
సంకుదండలు పాలసంకుల పేర్లు
అందెలు గజ్జలు అమిరె పాదముల

యశోద సుతులు యెదిగి యీడేరిరి
బాలలు తమయీడు బాలల గూడి
భూమి ఆవులదొడ్డు పొదులు
యేర్పరచి
ఆనుకొని బాలల ఆవుల చేసి
రభసంబుతో బసవరాయుండ తాను
రంకెలు వేయుచు రాచబాలుండు
మోకాళ్ళు చేతులు మోపుక నడిచె
'చిన్నవాండ్లు మీరు సింబోతు తాను
వెనువెంట రొదసేయు వేడుక కాద
మీకు నే రాజును మీరు నా భటులు
నాకు మ్రొక్కి పనులు నడిపించు
మనుచు
కూడి పణతుల పెండ్లి కూతుళ్ళ చేసి
కోడిగాలకు పెండ్లికొడుకాయె తాను
బొమ్మరిండ్లలో నిద్రబుచ్చి బాలకులు
సొమ్ములెత్తుక పోవు చోరకుడ
ననుచు
ఆటలు తలపెట్టి మొదటి ఆటలకు
మల్లె
మేదిని తానేసని మెలిగాడ సాగె
పుద్దులు బట్టించి బుద్ధులు చెప్పి

గదిమి చిడుగుడులాడు ఘనుడు
శ్రీకృష్ణు
గచ్చకాయలాడు గండచెరలాడు
బంతులాడుచు వింత పదములునాకు
అంటుముళ్ళుదన్ని ఆలంకులాడు
మంటి చల్లులాడి మరి త్రుళ్ళి త్రుళ్ళి
కుప్పె గంతులురికి గుడిగుంచమాడు
... ... .... ... ...పట్టుచును
వురువడి పిల్లదీబు వుయ్యాల లూగి
గొంటుకాయలాడి గంతుబేయుచును
యర్రరెక్కి తేజీని యెక్కుడుచూను
కర్రి గుర్రము నెక్కి
కల్కిరూపమున
కొమ్మన గంతులు చిరుతన
గొడియ లాడి
చిటికెన మొటికలు చేసరస మాడి
దాగిలి మూతలాడి తాను బాలలును
వుప్పరి పట్టెలాడి వుడాయింపుచును
ఆటలు తలపెట్టి అటునిటు చేసి
వామన గుంటలు వడ్డుబిళ్ళలాడు
ఆమనిగ కుప్పిళ్ల అచ్చనగండ్లు
సరిబేసులాడి సారెతా గెలుచు

యంత భాగ్యము చేసిరి యాదవ
బాలలు
కదసి నాతో నాడ కారణముండె
యీ విధంబున నాటి యిల్లిల్లు తిరిగి
దొరబిడ్డ నని యిండ్లలో
చొరబడ సాగె
కంతలు ద్రొక్కుచు గోపకాంతల
యిండ్లు
వంతు కలియ దిరిగె వారు వీరనక
బాలులు తా గూడి పాలు నేతులును
వారబట్టుక త్రాగి వలగ
కొంత బోసు
పచ్చి వెన్నలు దిని పాలు నెయ్
త్రాగి
పచ్చిగ తిరిగెడు పడుచులు దాను
సంగడీలు కొలువంగ సఖియల
యిండ్లు
దొంగ బాగుల డిరిగె దొరక
డెవ్వరికి
రేయును పగలును రేపల్లెలోను
అయ్యాడ మగువల అభిమానములు
గొనెను

## గోపకాంతలు శ్రీకృష్ణుని దుడుకు పనులు యశోదకు చెప్పుట

కాక తోడుత గోపకాంత లందరును
మూకలై గోపెమ్మ ముందర నిలచి

"యెన్ని నోములు నోమి యెన్ని
వ్రతములు బట్టి

తమకాన గంటివే దయ్యపు సుతుని
మానముల్ గొనెను అభిమానంబు
లేద
దినగండమాయెను తెలివిగా వినుమ
దానవుడె కాని వీడు తనయుడు గాడు
చిన్నవాడటమ్మ యిన్ని చిన్నెలవాడు
యన్నడు చూడము యిటువంటి
ఝూటను
వోర్చుక యుంటిమి యశోద! నీకు
వక్కడే కొడుకనుచు
కార్చిచ్చునైన మ్రింగి కదబడగలడు
విడుతుమో రేపల్లె విడుతుమో సిగ్గు
ఒదతడు మమ్మింత బులిగావు చేశ
పాల దాగనివ్వడు వెన్న
పిడత బడనివ్వడు
నిలచిన చోట మమ్ము
నిల్వనివ్వడమ్మ!
పొమలలో లేగల ప్రొద్దున్నె విడచి
మందలావుల పాలు అందరికి
ప్రితుకు
ప్రితుకుక త్రాగితే బ్రతుకుదుము
తల్లి
వతలు బెట్టి బోయుల వేట్కాలి
బడద్రోచు
త్రోచిన వాడు తాను తొలగి
చక్కబోక
కసి గందంపుగ మీద కంప
యెత్తినాడు

యెత్తిన వెరచి మేము యేమనక
యున్న
అత్రింటి కోడండ్ల బిత్తలుగ చేశ
చేసిన మేమేమి చేతుమో తల్లి!
కసి గాటుగా మోవి కరిచ యిటు
చూడు
కరచినవాడు తా కడ తొలగిపోక
మరచి నిద్రబోగ మరి యేమొ చేశ
చేసినంతట బోక దాని చాకట దెంచి
కూర్చిబాలలకు మొలపూసలకు నిచ్చు
యిచ్చినవాడు తా పురిటిల్లు జొచ్చి
వచ్చి బాలింతల పట్టెనో యమ్మ!
పట్టిన రొమ్మెండి పాలు లేపనగ
కోడిగాలు చేసి కూడినాడమ్మ!
కోడలి మెడవంచి కొడుకు చూడంగ
ఘోరముగ కుచములు తన గోరులు
చీరె
గోర చీరినవాడు కొడుకును గొట్టి
మరియును యిద్దరి శిశులకు ముళ్ల
వేసినాడు
వేసినంతటబోక తమ వెంగన్న జుట్టు
వది లేగ తోకకు ముడివేసినాడు
కోడెగాలకు వేగను తోలినాడమ్మ!
పడుచువాడు కాడు బాలకృష్ణుండు
పిన్నవైసు[18] వాండ్లు పిడకలేరంగ
తాను గంప యెత్తేనని దగ్గిరికి వచ్చి
కట్టిన కోకలు విడిచి కాళ్ళకు చుట్టి
చప్పట్లు గొట్టుచు సరిపెనగు నమ్మ!

18. పిన్నవయసు

మంద నుండి వస్తినని మాయలు
బన్ని
ఆలి ప్రక్కలో మొగని అటు పడ
దోచి
బాలుని తానేనని పవళించునమ్మ!
సరిపొద్దు నాలి మొగని సరసంబు
వినియు
వారి వారికి చెప్పి యా వాడెల్ల చాటు
మంచము తర్వాత మాటలు వినియు
పొంచులు విని యిరుగు పొరుగుకు
చెప్పు
సంధ్య వేళ్ల మేము జలకమాడంగ
యెందుండి వచ్చునో వలువ లెత్తుక
వురికె
వక్కడే చూచితే వో గోపి దేవి!
యెక్కడనో వుండెనో యేమి
మహిమో గాని
మాపు జలకమాడంగ నన్ను
సహగాను
యీపు దోమేననెను వినవె యశోద!
చెరుగు మాసినాము యిక్కడ
చారకు మనిన
చెరుగు మాసిన తావు చెప్పుమని
అడుగు
గర్భిణితోనున్న కాంతల జూచి
నీకు గర్భము యెటువలె నిలిచనని
కందువ లడుగు
సంతానము లేదని సఖియ లనుకోంగ

కాంతలార! తనను పొందుడీ కలిగీని
సంతాన మనెను
మొగడు దగ్గరలేని మగువల జూచి
పగలే తనను పొందుమని పట్టి
విడువడమ్మ!
యీదేరని కాంతల యిండ్లు తా జొచ్చి
బలిమి తేళ్ల గరిపించి పారిపోవునమ్మ!
పెండ్లికు బిడ్డల ప్రియముతో జరచి
పెండ్లి కొడుక ననుచు పెట్టిన పూసి
తమ యిండ్లలో చొచ్చి తలుపులు
మూసి
దొమ్ములాడుమ దొంగ దొరికె
నంటేను
విడుపకుడి నేనొస్తినని పీథిలో
నుండు
గడుచు కృష్ణుడు తాను కానట్లగె
యుండు
యేలాగు పోవునో యేలాగు వచ్చునో
సటకాడు తా సత్యచారివలె నుండు
జొరబడి యిండ్లలో దొరకొని చొచ్చి
పేరి పేరని మంచి పెరుగు తా త్రాగె
బిడ్డదన వచ్చునా? పసిబిడ్డదా
యితడు?
చక్కని వకవేశ్యతో సరసము లాడి
కుక్కి విరిచిపోయ కృష్ణుడో యమ్మ!
చల్ల గంగాసాని చాపట్లు పొయ్యంగ
మెల్లనె తాపచ్చి మెక్కి వచ్చునమ్మ!
చద్దవారమె మీకు చప్పవెరతుము గాని

కుండ నెయి దెచ్చి అందరికి బోసి
పొరుగు యింటను బెట్టి వారి వీరికి
పోరులు జేసు
తరులాక్షి! గోపెమ్మ తమ మాట
వినుమ॥
చెంబోతువలె వచ్చి చెబ్బరింపుచును
కుంబెరుగు చుట్టును కుందేడు నమ్మ!
తరిచుట్టిన వెన్న తల్పులుండ గాను
యరగ కుండగ వచ్చి యెత్తుకొని
వురికె
యీడు బాలలు తాను కూడుకొని
వచ్చి
వెన్న ముద్దలతోను వేట్లాడునమ్మ॥
ఆ వుట్టి వేవేగ అందకుంటేను
వంగ వకని బెట్టి వానిపై నెక్కి
దొంగవుట్ల నెయ్యి దొరికించుకొని
అంగన॥ నీ కొడుకు అమ్మరో॥
వినుమ
వార బట్టుక త్రాగి వచ్చనో యమ్మ!
సుందరి॥ యిటు వినుమ సుదతి
గోపెమ్మ॥
కందువ మాటలు కారద్ధ మనక

పాలు పెరుగు జుర్రి పణతి యశోద!
వెంగిలిచై తమ యల్లికి చమరి
మొనసి కోడలిదాని మూతికి రాచి
కుండతో దినియేటి ముండబిడ్డ
యనుచు
మగనికి దెలిపి లెస్సమొత్తించి నాడు
మరదండ్ల యిలు జొచ్చి మాట
యున్నదనుచు
బిరుసులో లేతలోయని పిసికి
తా గసికె
అయ్యయో మఱుగుడుపు అల్లుండ్ల
నెల్ల
కుయ్యో మొర్రో యనగ
గుద్దినాడమ్మ॥
తీనె యెక్కి దేవండ్ల తీసి వెలపటవేసి
వెరవక పొడిజేసి యెలుగులో బోసి
వేల్పును తానే ననెను వెన్నముచ్చమ్మ॥
చేసినవి తమకే చెప్ప సిగ్గౌను
యశోద॥ నీసుతుని యగ విడిచినావె
అదలించవు తిట్టవు అదటోకనవు
బుద్ధిచెప్పవు విడిచి పోదుమో లేక"

## యశోద శ్రీకృష్ణుని రోటికి కట్టుట

యంత కోపముతోను యశోద కినిశ
సుదతులందరు అంటె సుతుని
సాధింప
'కొలము వారిని యింత కుసి
గుంపులు గ కాంపు

యాలరా కృష్ణ॥ నీకేమి చెప్పితిని?
ఆటలుమాని వకరి ననవద్దు
యనుచు
సారెకు చెప్పితి తన సాటి వారనుచు
గొంటుతనంబున గోపికల యిండ్లు

చూరలాడ నీకేల? చూడరట నన్ను
రట్టేల? వారిని రవ్వశాయ నేల?
పాలు వెన్నలు సకల భాగ్యంబు
గలిగి
చల్లంబో! నీకేమి చెప్పితిర కృష్ణ!
యింతట నుండి గొల్లయిండ్లకు బోకు
వేతునా చెంపలు వెన్నదిన్న దవడలు
దుండగిడ! మీ తండ్రి రానిమ్ము!

కన్నుల మిరియము బెట్టి కట్టి
కొట్టింతు'
అని వెరపించే కొరకు ఆ సుతుని
జూచి
మనసు పట్ట గొల్లమగువలు చూడ
ఆడికె లాయనని అందుకునె త్రాడు
నడుము బిగ్గిరె గట్టి నల్లని కృష్ణుని
మాట వినుమని తల్లి మానిరోటను గట్టె

## శ్రీకృష్ణుడు మద్దులను పడగొట్టుట

వణుకుచు వెరచు వానివలె తాను
ఝడిసి తల్లి గొట్టెనని జరజరనీడ్చె
చవడి మద్దుల సందు నిరికించి
దేవకితనయుడు తన లఘువున
యిగ్గ
పెకళి కూకటేళ్ళకు పెళ్ళగిలె
మద్దులు
భూకాంతపై నొరిగె బోరు కలుగంగ
కొండలు ధ్వనులిచ్చ కుంభిణి బెదరె
నిండిన గోపికలు నిర్విణ్ణు లయిరి
మద్దులలో నున్న మరి
దివ్యపురుషులు
యిద్దరు వెడలి సర్వేశు నుతియించి
నారద ముని చెప్పినట్టి శాపమున

భోరున యడబాసి పోయిరి దివికి
పడిన చప్పుడువిని పల్లెగోపికలు
వడివచ్చి యశోదకు వైళంబె
చెప్పిరి
వెంటనే గోపెమ్మ వెతపడుకొనుచు
'కట్టి చంపుదు గదా కట్టడి
దాన'నని
కట్టిన తాడు విడిచి కడ బారవైచ
ఆటలు యింతకు వచ్చనని
చంకబెట్టుకొని
నంద గోపకులు నందుండు అందరు
బాంధవులు వగచేరు పసిబాలుని
జూచి

## నందుడు రేపల్లెను విడిచి పరివారముతో బృందావనము చేరుట

'పాపనికి యంతేసి భారముల్
గడిచె

కాపాడి యే దేవుడో గండములు గాచ
పసిబాలుని భూతకి పట్టెను వకటి

వశముగాని బండి వడి విరిగి పడెను
సురగాలి వక్కటి సుడిసి పడగొట్టె
భారంపు మద్దులు పై బడత నుండె
నందుండ యుందుండ
న్యాయంబు గాదు
బృందావనంబునకు పోవలె మనము
వలసినట్లు తొలకరి వానలు గురిశ
పొలము యక్కడెక్కడ పూరియు
నీరు
యామారక వుదకము యంతయు
మేపు
అమనై యున్నాది ఆవులకు మనకు
విడిచి పోదాము మనము వీరు
వారనక'
వడి వడి రేపల్లె వాడలదాటి
యడతెగక గోపాల యాదవసతులు
వారు గోపాల్కులు వాయువర్తనాల
వరుసతో కుంకుమ వసంతములాడి
తడబడుచు కదిలెను దామెనబండ్లు
యడతెగక మంకెన యెడ్లు గుడార్లు
గొడుగులు అరిగెను కోరకావళ్లు
ఆకుల మావటీలు పోకల పెరికెలు
పీకతో పడిగెలు విండ్లు బల్లెములు
బొక్కిశల కోకలు బోనగావళ్ళు
కిక్కిరిసి కదిలెను బుక్కాయి
పెట్టెలు

గోనెల బియ్యాలు నేతి కావళ్ళు
వెలలేని రథములు వేట్కతో గదిలె
పరగంగ ముత్యాల పట్టు గుడార్లు
విస్తీర్ణమైనట్టి వెల్లగుడార్లు
కొమరొప్ప చక్కని కురువేరు
పెట్టెలు
అగరు గంధము మంచి అలరు
భూతియును
పీరణంబులు డోళ్లు విరివి కైవళ్ల
నరగలు రుంజలు నమర
స్వన్నాయులు
సన్న పీరణంబులు చెంకులవు
జయములు
కనక తప్పెట మేటికాలి
కొమ్ములతో
పంచమ వాయిద్యములు మించి
మ్రోవంగ
యంచగల వేట్కతో యపుడు
నందుండు
గోపాలవరులును గోపకన్నికలు
సంపదలు ఆయమున సమీపమున
దిగెను
వేగమే దొడ్లు వేసిరి పొదులు
వారంత బృందావనములో దిగిరి

## బలరామ కృష్ణులు బృందావనములో విహరించుట

యెనిమిదేండ్ల బలభద్రుడు యేడేండ్ల
కృష్ణు
వనములో తమయాడు వారును
బాము

దూడల గాయుచు త్రుళ్లులాడుచును
వాటముగ పిగిలి పువ్వుల బంతులు
చుట్టి
చుట్టిన పికిలి పించములు చుట్టును
తలను
బాలలు వుంగరపు బంతులు చేసి
యాల పదములు బాడి యెక్కిరి
వృక్షములు
క్రొతకక పిల్లన గ్రోవు లూదుచును
తూత కొమ్ములు వూది
తుదిపదముగాను
అవి వూది ఆకు తీగె వుయ్యలలూగి
సరస గోపాల జనపాలకులూను
పదాలు బాడుచు పసిబాలకూలు
మసలుచు గోపాల మనుజవర్గంబు
కోడె దూడల నెక్కి కొట్టి
తరుముచును
పొదలెక్కి పువ్వుల పొదరిండ్లు దూరి

మధురమైన పండ్లు మానెక్కి
తినుచు
దొప్పతేనెలు త్రాగి
దొమ్ములాడుచును
కుందెన గొమ్మలు గోరటాయులు
దినుచు
మడుగు పడ్డున నిలచి మడుగులో
దుముకుచు
కుప్పించి పురుకుచు కూత
లేయుచును
అప్పుడు మచ్చము రీతి
అవతారమునను
మునిగి యీదులాడుచు
మురిశాడుకొనుచు
తొణికి బాలలనుంచి
ధుముకు లాడుచును

## బలరాముడు వత్సాసురుని చంపుట

ఆలాగు విహరింప అంత నొక నాడు
వత్సాసుడుందు వచ్చి కంసునితోటి
యిచ్చకంబులు బలికె 'యిటు
విను రాజ!
పోలు పొందు లేక భూతకి చెల్లె
క్రమమున తృణావర్తు
గాలియై పోయె
తాను: వక మాయతో నేడు
యీ పగయు

యీడేర్చి వత్తును యిమ్ము తనకు
సెలవు'
ఆశచే కంసుడు అవుడిట్లనియె:
'వెస మాయరూపున యెక్కడవు
నీవు
మదమణిచి చంపేటి మరిరూపు
చూపు' మనిన
'దుండగీడు కృష్ణుండు దూడల
గాయుగా

దూడరూపమై తాను దూడల గలసి
పడుచువాడు కృష్ణుండు పట్టవచ్చినను
పూడదన్ని శిరసు వుక్కణచి వత్తు'
అని వచ్చాసురుడు అంపించుకోని
తాను దూడల గలసి తర్లకయుండె
ముత్తరిపి దూడయై ముందరుండగను
అంతట కృష్ణమ్మకు ఆ మాయ దెలశ
హరి బలభద్రునికి ఆ సూత్ర మెరిగించ

వారి పగదీర్ప వచ్చిన హసురను
వడిసి నాలుగు కాళ్లు వకచాత బట్టి
యడమ చాతను బట్టి యదటవున్నట్టి
పొడుగు యలగకు గొట్టె పోయ ప్రాణములు
తన్నుక తన్నుక తాను బొర్లాడి
కన్నుల ప్రాణములు గ్రక్కునవిడిచె
అసుర చెల్లిన బాలలు ఆర్చి కూయుచును
కొసరక చప్పట్లు కొట్టి అరిగిరిని

## శ్రీకృష్ణుడు బకుని సంహరించుట

వకనాడు కంసుని వుగ్రకొల్వులోను
బకుడనే వాడు బలువు రాక్షసుడు
'నేడు నా ప్రతిజ్ఞ నేర్పుతో వినుము
దూడలు బాలలు త్రుళ్ళేటి కృష్ణ
పాలము మేపుక వాడు పొదులకు రాగ
తాను కొంగరూపున తర్లనివ్వక పట్టి
మెల్లెనె యీకెలు దువ్వి మేరువగతిని
ఆకాశమున పెదవి అవనిపై శలవి
పరచుక తస నోరు తెరుచుక యుండి
హరిని దూడల బాలలు అందరిని మింగుదు
మాధవు బాలలు మాయ యెరుగలేరు'

బకుడు ప్రతిజ్ఞ బలికి అంపించుక వచ్చి
ఆమడ పొడువున అవని మిన్నంది
బకుడు గళము దెరిచ బెళము చందమున
హరిబలములు యపుడు ఆ మాయ తెలియక
బెదరక చొచ్చిరి కొండ బెళము లోపలను
ఆదిమూర్తి కృష్ణమ్మకు ఆ మాయ దెలిశ
కదల నివ్వక పెరిగె వాని గళము లోపలను

గళములో కార్చిచ్చు కాలాగ్ని
వలెను
పదిలెముగ వుండిన బకుడు తా వెరచి
వొప్పుగ గ్రక్కెను వకరిని
చిక్కకుండ
అప్పుడు కృష్ణుండు అతిధీరుడగుచు
హరి బకుని శలవులు హస్తముల
బట్టి
చేరిపోనివ్వక చలగి కృష్ణుండు
చీరి పారంగ వైచ శ్రీష్టి పొగడంగ
గోపాల్కులు ఆర్చిరి కోపంబుతోను

## శ్రీకృష్ణుడు పామును చంపుట

చెప్పిరి కంసునికి బకుడు
చెల్లినవార్త
బకుని తమ్ముడు అన్నపగ
యీదుకొరకు
చుక్కల పొడువున సూర్యుని
పగిది
పెనుబామును కంసుడు పెట్టెంపె
నపుడు
వాయువేగమున వింజాద్రి నడుమ
వనచరులు భూమికి వచ్చిన రీతి
పరిచను నాలుక బాటల వెంట
ఆకాశము భూమి అంటించి నోరు
భీకరంబుగ గాచి పెనుబాము
యుండె
వలలో బద్దరీతి వారందరూను
బాలలు దూడలు పదిరి నోట్లోను
యెరిగి కృష్ణుండు వాని య (దమున
నిలిచె)
గుటగుట పాముకు గుక్కిళ్ళు బుట్టె
పెట పెట యముకలు ఫెళ్ళున విరిగె
వేగమే వూపిరి వెళ్ళక మరియు
పగిలి పామువెన్ను పాయలై పోయ
వెన్నున అందరు వెళ్ళిరాగాను
వెన్నుని పేరని వెలసె కృష్ణుండు
అక్కడ నిర్వహించి అందరిని గాచ
అసుర చెల్లిన సురలు ఆనందమందె
పుష్ప వర్షములు గురిశ
పొగడి రందరును
రంభ వూర్వశి మేనకాప్సరస శ్రీలు
రంగుగా నందరు శ్రీరాముని బాడ

## శ్రీకృష్ణుడు గోపాలురతో గూడి చల్దులారగించుట

నఖాసురుని జంపిన నల్లని తండ్రి
వేగమే వక కొలనుకు వేంచేయు
కృష్ణ
దూడలకు బాలలకు దూపక దీర
అక్కడ అమృతము త్రాగి అలమట
దీర్చి

వడియ బోసిన పెరుగు వాసించు
నట్టి
మీగడ పెరుగును మేలైన యట్టి
సరసమున వూరుగాయ సద్దులు
గుడిచి
హరి బంతిని గుడిచిరి ఆ బాలకూలు
వకరిచేత సద్ది వకరు భుజియించిరి
వికవిక నవ్వుచు వీరు వారనక
వూరగాయల నోరు వూరించు
కొనుచు
వోరి యని కృష్ణుని వరిశాడు
కొనుచు
బాలలు అందరు హరిబంతిని గుడువ
అంభోది బిలములో అమృతము
బుట్టె
కుంచెవుగు చుట్టును కూడి రందరును

యాదవులు సురలుగా యెరిగి
మాధవుండు
మది సమ్మదమునొంది మనుజుల
గూడి
చెర్లించి త్రుళ్లంగ చెదరె దూడలును
తర్లి అవియన్ని తలచెడి పోయ
పచ్చిక మేయుచు పశువులు
గలియక
అచ్చట లేకున్న అందరు జూచి
యిది పచ్చితెమ్మరి యిట
చూడుమనుచు
యందు బోయనొ యనుచు
యీగి పొదరిండ్లు
చెట్లెక్కి కృష్ణుని చేరి పిలుచుచును
గట్లెక్కి చూచిన కానరాకున్న

## బ్రహ్మదేవుడు శ్రీకృష్ణుని పరీక్షించి పరాభూతుడగుట

భావింప శారదపతియైన వాడు
దేవదేవుడు యా బ్రంహ్మదేవు
డిట్లనియె:
'వేదాంత వేద్యుడో వేరె మరివకరో
యితడు మచ్చావతారుడో
మనుజుడో లేక
మాకు తెలియవు విష్ణుమహిమెలు
తరుచు'
చక్కగా యీ సంధి తానూను దెలిసి

అడవిలో దూడల ఆ బాలకూల
తాను వక బెళమున దాచె నా
బ్రంహ్మ
గోవిందుడా బ్రంహ్మ గుణము
తా నెరిగి
భావజు జనకుడు బ్రంహ్మ
నోడింప
యే యావుకు యే దూడొ
యెటువంటి రూపొ

ఆయాదూడల రూపు అన్నియు
తానె
యే తల్లికి యే పుత్రుడొ
యెటువంటి పిలుపొ
అంత బాలల రూపులన్నియు తానె
మునపటికన్న అధికమై మోహంబు
హెచ్చి
కన్నుల గప్పక గారవమున బెంచ
ఆ ధేన్వ లప్పుడు అలిమి లేగలను
పొదిగి కుడువ పాలవర్షంబు గురిశ
దాచిన దూడలకు తగిన బాలలకును
ఆపు దాపై యుండె హరియు
శ్రీకృష్ణు
బడిదప్ప కుండ బ్రతుకులు గలిగి
యాడాది వర్తించి చెరుగక మాయ
చిన్నబోయి బ్రంహ్మ సిగ్గున నోడి
చిన్ని కృష్ణుని జూచి శ్రీహరి యనుచు
స్రిష్టి నిర్వహించె స్రిష్టీశుడనుచు
సాష్టాంగ మొసగి యా
సర్వేశ్వరునకు
'కావు ధర భక్తగజ వరద! నన్ను
కావవే వైకుంఠ ఖగపతి! నన్ను
కావు కమలనాభ! కావు నా తప్పు
నీవే ఆదిమూర్తివి నీవే సకలంబు
నీవే యుగములు నిల్పిన తండ్రి
నీవు నను మన్నించు నీలవర్ణుండ!
తెలిసి తెలయుగలేను దిక్కు దేవేశ!'
చలగి ప్రార్థనజేసి శారదపతియు
బాలల దూడల బ్రంహ్మ తాదెచ్చి
బాల వేడి హరి సన్నుతిని[19] నిలిపె
కమలనాభుడు బ్రంహ్మను కరుణించి
తాను
తమ దూడలు బాలలు
తమరంత కూడి
తమ యిండ్లకేతెంచి తల్లుల గలసి
యాడాది నాటి మాటలు యీ ప్రొద్దె
యనచు
ఆడుచు బాలలు అతివేగిరమున
తల్లిదండ్రుల గలసి తమ
ముచ్చటలు చెప్పిరి
చిన్నవాండ్ల దూడల చెట్లలోపలను
మిన్నంది పెనుబాము మ్రింగెను
తమను
చిన్ని కృష్ణుడు తాను చీరి తా చంపె
అందరి తల్లులు అలమటపడుచు
కీర్తింపుచుండిరి కృష్ణరాములను

## బలరాముడు ధేనుకాసురుని వధించుట

కౌన్నాళ్ల యాదవకుల పుంగవులకు
పన్నెమీరగ యవనవైసులు[20] వచ్చి
బలభద్ర కృష్ణులు ఆట
పాయంబుతోను

19. సన్నిధిని 20. యౌవనవయసులు

కదసి గోవులచాల కాయంగ బట్టిరి
ఆ లక్ష గోపాలుర్కలందరు మరియు
కొలచి కాచిరి మరియు
గోగణంబులను
పనివడి చేయుచు భక్తి యాదవులు
వెనువెంట దిరుగుచు విహరించి రంత
అంత శ్రీకృష్ణుడు
అమరవల్లభుండు
వంతుకెక్కిన తాటివనముకు వచ్చి
చెప్పిన నందరు చెర్లింపుకొనుచు
శోధించి యావనము చొరబడి పోయి
బలరాముడా తాళ్ళుపట్టి సందిళ్ళ
జలజల రాల్చుచు చెయిముట్టి తినుచు
చెర్లించి యా వనము చలమున
శోధించి
తర్ణక ఫలములు తా మారగించిరి
దేవతులకు వెక్కసి ధేనుకాసురుడు
ఆ వనము చొరను హరిహరుల
వశమె
హరి బలభద్రుని యాదవుల నెల్ల

కరచి చంపుదు ననుచు
ధేనుకాసురుడు
గార్ధవం రూపున గాండ్రు
గాండ్రు మనుచు
పెద్ద రంతున గుయ్యి పెకళె
వృక్షములు
అదిరెను గిరులు అసుర ఆర్పిళ్ళచాత
తరిమి కరుతుననుచు దైత్యుంతురాగ
పరుతెంచి బలభద్రు పట్టుకునెవాని
పదరనివ్వక సింహపరాక్రమము
చేసి
ధేనుకాసురు బట్టి విసిరె బలరాము
వాని తాటితొ గొట్ట వాపోవుచు గూలె
వాని బంధువులు ఆ వనము దిగనాడి
కనిపించుకో వెరచి కదలి
రందరును
అన్న బలరామునకు అంత
కృష్ణుండు
ఘనమైన మందుకాయ మిప్పించి
వినయంబుతోడుత యింటికి బనిచి

## శ్రీకృష్ణుడు కాళింగుని మర్దించుట

తన గోపకులు ఆవులు తానును వేగ
కానరాని మడుగు కాళింగుమడుగు
కాళింగు చాతను కాలాగ్ని పొగలు
నీళ్ళలో పొగలెగసి నిలిచను 'మింట

అదిజూచి మాధవుడు
యాదవులతోను
'యీ విధంబున పొగలు యేమిటను
[illegible] వెగచు

మడుగు లోపల చిరుమంట
లెక్కడివి
వడిగొని కాళింగు వుండుటే నిజము
తెరలి భూచర జలచర
ఖేచరంబులను
బొరయుచు మడువులో
బొరసియున్నాడు
ప్రాణికోట్లను వీడు బ్రతుకనిచ్చినె
వీని చాత జీవజంతువులు బ్రతుకు
టేలాగు?
కాళింగు మర్దింతు కాతు శరణన్న
వెళ్ళగొట్టకున్న వివరంబుగా'దని
చోరరక్కసుడై సోముఖాసురుడు
అరిగి వేదములు గొనుచు అంబుధి
కరిగె
జలములో మచ్ఛమై సాధించినట్లు
చెర్లించి వక కడిమిచెట్టు తా నెక్కి
కాళింగుపై ధుమికె ఘనుడు శ్రీకృష్ణ
కాళింగు దప్పుడు కడు వుగ్రముకను
విసిరి తోకనుగొట్టె విషపుకోరలను
గాసిలి కృష్ణని కరచిన యపుడె
వజ్రదేహము కరువు వశముగాదాయ
దంతములు వదిలెను దవడలు
నొచ్చె
అంత శేషు చిక్కి హరిని
చుట్టుకునెను
మెదలకుండగ పట్టె కాళింగుడపుడు
గోవిందుడని తెలియక
గోపాలవరులు

తావుదర్శి వురికి తల్లడగొనుచు
ఝుడిసి యా రేపల్లె చాటి వేగంబె
వడివచ్చి నందునికి వార్త వినిపించిరి
నందుండు భయపడి నందగోపకులు
శ్రీబాలగోపాల శేకరు చూడ
నాబాల గోపాలు లందరు గదలి
యదువంశము తాము యశోద వచ్చి
వెతపడుచు ఆ మడుగు వెలపట
అడల
లేగలు ఆవులు లెఖ్ఖింపరాదు
వగచుచు యా మడుగు వద్దున
నిలిచి
పక్షులు వెలవెలపాటున నపుడు
వీక్షింపుచుండె నా వెన్నుని జాడ
పశు పక్షి జనముల పరగు ఘోషంబు
విశదమై యా మడుగు వెల్లివిరియంగ
దివ్యమూర్తి కృష్ణుండు దేహంబు
పెంచ
కవగొని మెలగిన కాళింగుడపుడు
నడుముపూసలు కవెలి నలినలి ఆయ
వడిబడి కాళింగు వుడిగె నచ్చటను
పద్మనాభుండు పడిగెపై ద్రొక్కె
పద్మాసనాదులు ప్రస్తుతి శాయ
తక్తధిమికి తోరిగణ తధిగణ యనుచు
ముక్తిపదమును జంద ముష్టి
పాదిముల
తాండవంబాదంగ శేషని తరుణులు
వచ్చి
కాళింగు భార్యలు కన్నీరు బెట్టి

'శరణు ఆదిమూర్తి! శరణు విష్ణుండ!
శరణు కటాక్షణ! శరణు రక్షింపు
కావున అపరాధి కఠిన చిత్తులము
కావవే విషపాది ఖర్మలము మేము
పురుష భిక్షము బెట్టి మా పురుషుని
గాయు
పురుషోత్తమా మాకు బుద్ధి చాలదును'
ఫణిరాజ సతులిట్లు ప్రార్థింపగాను
ప్రాణములు గాచె నా పద్మనాభుండు
'యిపుడు వారధి కడకేగుడి
యిచ్చట నుండక
కోర జంతువులకు ప్రాణము
కొద్దిక యున్న
కదులు' మన్న యపుడె కాళింగు
సతులు
'నీ పాదములు సోకె నిహపరములు
గలిగె
స్వామి! మాకిప్పుడు వక సద్గతి
చూపు'
బాల కృష్ణుడు పాము భార్యల కనియె:
'వాలాయముగ అష్టదశ వర్ణముల
వారు
పురగంబు పేరను పురుదాళ్లు పెనసి
కోరి మిమ్ము వరుసుకుందురు
నమ్మడి'
అని మడుగు వెళ్లి హరి తాను రాగ
గొనకొని యాదవ గోపకాళ్లు
అబాల గోపాల అమ్మ యశోద
అప్పుడు నందుండు యెదురుగా వచ్చి
యదురుగ వచ్చి యెత్తుకునె కృష్ణుని
'అందేల పోతివి నందన! నీవు
కఠిచెగా కాళింగు వెరచితివా తండ్రి!
బారి గడచి పాముచే పద్మనాభుండ!'
మరి కుమారుని గలసి మమత
గోపెమ్మ
వగచను రోహిణి వగచ నందుండు
వగచిరి గోపాలవరులు గోపికలు

## శ్రీకృష్ణుడు కార్చిచ్చును మ్రింగుట

కలసి అందరురాగ కంసమాయటను
వళేకారముగా[21] వచ్చ కార్చిచ్చు
మంది మీదను పెనుమంటలై రాగ.
చిందర వందరలైరి చెదరి
గోపాలుౘలు
హరికి మొర బెట్టుచు అలమట
పడుచు
'కరుణించు వో కృష్ణ కార్చిచ్చు వచ్చె
దిక్కుమము కావవే దేవ దేవేశ!
యక్కడ యరుగ' మన్న యాదవుల
జూచి
తన గోపకుల తల్లి దండ్రులను
వెన్నుడు అందరిని వెరవకు మనుచు
హరి ఆకాశముకు అంటను బెరిగి

21. వలయాకారముగా

మీరి వచ్చిన కార్చిచ్చును మ్రింగె
నా కృష్ణుడు
ప్రానంబు చేశ దిక్పాలులు బొగడ
చిన్ని కృష్ణమ్మకు చెయ్యెత్తి
మ్రొక్కిరి
కన్నతల్లి వారు గారవింపుచును
భయ భీతు లేక రేపల్లెకు వచ్చిరి

## బలరాముడు ప్రలంబాసురుని చంపుట

ఆనందములు ఆ వనమున ఆవులు
గాయ
ప్రళయకాలాభీల పటుశక్తి మెరసి
ప్రలంబు డనేవాడు పలికె కంసుని
తోటి
'చలమున ధేనుకాసురుని చంపిన
కృష్ణుండు
బలభద్రుడు తాను పరిణేన యుండె
తన చెలికాడు ధర గూలగాను
తనకు అన్నము గుడువ ధర్మమా
బ్రతుక
బలభద్ర కృష్ణుల ప్రాణంబుతోను
తెల్పి చెప్పినవార్ని తెత్తునా బిరుదు
గోపాల వేషంబు గొబ్బున దాల్చి
అంపించు'మనె తిరిగి అరిగె
వెనువెంట
తిరుగంగ ప్రలంబుడని తెలిశ
కృష్ణుండు
శౌరి బలభద్రునికి ఆ సూత్ర
మెరిగించ
గుట్టు ప్రలంబుడు కూడి వారితోను

ఆటలు తలపెట్టి బంతు లాడుద
మనుచు
బంతు లాడుదామని పందెములు వేసి
'వచ్చించక యీయాట యవ్వ
రోడినాను
చింత బొంకిగ నాల్గు చేవాట్ల మేర
వంతున గెంచిన వారి మోసేది'
అనుచు వృద్ధిలు సయ్యన బట్టించి
కినిసి ఆడిన ఆట గెలిచె బలభద్రు
ప్రలంబు డోడెను బలభద్రు డెక్కె
ఆకాశము పొడువు ఆ రక్కసుడు
బెరిగి
యెక్కడ యెదురు లేక యెత్తుక
వురకంగ
కోపించి బలరాము పీపుననుండి
దీపింప మరియును దీప్తులు మెరియ
కాకతోడుత నెత్తురు గ్రక్కను గుద్దె
అక్కడ ప్రలంబుడు అవనిపై గూలె
కూలిన గోపకులు కొండకూతలు
పెట్టిరి

యలమి సంతోషమున యెదువంశ
మంత
గోపాల్కులు విహరించిరి కొన్ని
దినములకు
రేపల్లె కేతెంచి కూడుదామనుచు

## గోపికా వస్త్రాపహరణము

కాపాడుచు ధేన్వల గాయుచు
కృష్ణుండు
వేసంగి కాలంబు వేట్కలు మీర
ఆ సతులు భ్రమయించి రంత నొక
నాడు
ముదముతో పసపార్చి ముచ్చట
పడియు
సుదతు లందరు తాము
చోద్యవేద్యముగ
తెగ వెండిన మానుల తమిని
చిగురొత్త
మగువ లందరు తాము మరి
చోద్యపడగ
వేళపాలలు యెరిగి ఆలాపమునను
కల కల గంధర్వ గానంబు గాను
వేణునాదము బట్టె విరహములు
బుట్ట
యనయంగ సుదతులు అందరు
మరియు
మోహించి యాధవ ముదిత
అందరును
మహిమెల మాధవునికి మర్లుకొనిరంత
నాతులు వుబ్బుచు నదికి యేతెంచి

అంతట యమునలో అలదుర్గను
నిలిపి
వీర గంధముశాస విరుల దండలును
పరపూర్తి బోనములు పబ్బములు
చేసి
'భూమేలు శంకరునికి
పుణ్యాంగణయై
జడ కొప్పు గృహముగా చేసిన
గంగ
గోపాలుడు విభుడుగా కోరిన కోర్కె
మాపాలిట గలిగి మది వస్త్రి వైన
ముత్యసరి చీరెలు ముత్యాల పోలు
ముత్యాల నివ్వాళి మురియుచు మేము
బారి కొండలుగ బారి గౌరియలను
కోర్కెతో యింటింట కొమ్ము తగళ్ల
కొలుతుము మేమన్న కోర్కె లీడేర్చ
వో కృపాజలరాశి వో తల్లి మాకు
శ్రీకృష్ణు మొగడుగా చేసి రక్షించు'
అని మ్రొక్కి అచ్చోట అనువైన
మడుగు
ఆనోవేగ జలక్రీడ లాడుదా మనుచు
పట్టు చీరెలు విడిచి పసపు తా మలడి
కోట మేటాడుచు కొలనులో చొచ్చి

పైనీళ్లు చల్లుచు పరువు లాకుచును
'వో యక్క! కృష్ణుని వలవతె'
నసుచు
మునిగీదు లాడుచు మురిశాడు
కొనుచు
యమునలో యీదుచు
హెచ్చరింపుచును
కిలకిల నవ్వుచు జలక్రీడ సల్పుచు
జలములో చెలాలిట్లు చెర్లింపుచున్న
తెలసి కృష్ణుండు తన చెలికాండ్ర
విడిచి
వడి నవ్వుచు వచ్చి వలవ లెత్తుకొని
అంగణలు గట్టినవి అవి మైల యనక
దొడ్డుగా కంగిట దొరకొని చేర్చి
మగువ లెరుగకుండ మానికడ కేగి
కానరాని గుబురు కడిమి చెట్టనగ
పొన్న యెక్కి అలదు
పొదగాన కుండ
పొన్నచెట్టు యెక్కి పొంచి తానుండె
స్నానము చాలించి సఖియ లందరును
వలువలున్న చోటికి పనితెలు వచ్చిరి
యిక్కడ నున్న కోకలు యక్కడ
బోయ
యవ్వరెరుగ కుండ యెత్తుక పోయిరి
పొదరిండ్లలో ప్రొద్దు పొడుపు
కానరాదు
యిందెవ్వ రొచ్చిరే
యిందుముఖులార!

అందరు అన్ని ముఖములయి అటు
పారజూచిరి
మాధవుని కనుగొని మడుగులో
ధుమికిరి
నిలువక కూర్చుండిరి నీళ్ల లోపలను
నెలత లందరు తాము నెరిసిగ్గుతోను
వదిగి కూర్చుండి తలవంచి సిగ్గునను
తత్తరపడుచు యా తరుణు
లందరును
ముక్కు మీదను వేలుమూసి
నవ్వుచును
చెక్కిట చెయి జేర్చి సిగ్గుల పడుచు
వకరి చాటుకు వకరు వదిగి
అలుకుచును
'కొమ్మలార! వినరె కొమ్మల నడుమ
నెమ్మది నున్నాడె నీలవర్ణుండు
పిన్నవాడె చూడ పొన్నపైనున్నాడు
నన్నేమి జూచెనో నల్లని హరియు'
అచ్యుతుడు చూడంగ అప్సరసస్త్రీలు
కుచములు చూపక కురులు గప్పు
కొనిరి
కొమ్మనాంగణు లపుడు కొమరవైను
స్త్రీలు
తామరపాకులు దెంచి తమ రొమ్ములు
దాచిరి
అంగమొలతో నున్న అంగనామణులు
భంగపడుచు అంగ భంగములు
మూసిరి

సిగ్గు చాతను మరియు శిరసెత్త వెరచి
మగువలందరు యా మాధవునితో ననిరి:
'రవ్వశాయకు కృష్ణ రాయుడ! మమ్ము
అత్తింటి కోడండ్ల మందరము తాము
అత్తమామల చాత ఆరడి శాయకు
పుట్టింటి బిడ్డలము పుండరీకాక్షః
యెట్లు వస్తిమి మేము యెరిగి యరగకను
యిల్లిటపు వారము యిలు వెళ్లరాదు
తల్లిమరుగు బిడ్డలము తమకోక లిమ్ము
మోసపోతిమి తాము మొగి నాండ్లమయ్య
వసుదేవపుత్రః మా వస్త్రంబు లిమ్ముః
మనుములు గుడిచేది మావారు విన్న
వెన్నుకలకు లోనైతి యదుకులోత్తముడః
మొగవారు విన్నాను మోసంబు తమకు
నగుబాటు శాయక మాచీరె లియ్యవయ్యః
యిరుగు పొరుగు వారు యీవార్త విన్న
పరాచికంబౌను వో పద్మనాభః
యాలయ్య మా పట్టుచీరె లియ్యవయ్య
నీళ్ళలో తడవాయ నిలుచుండలేము
వెళ్ళి వచ్చేమయ్య మా విపన్నము వినుమ
చెప్పిన పని తాము చేసేము స్వామిః
బొప్పళి చీరెలిచ్చి పొమ్మనవయ్య!
వాలాయముగ రమ్మన్న వచ్చేము కృష్ణ
చలమేల మ్రొక్కేము సన్నలేలయ్య
నిత్య నీ శావ జేతుము నీలవర్ణుండ!
శ్రీకృష్ణ వల్లభః మా చీరె లియ్యవయ్య
యేటికి యిట్లాడ యాలయ్య కృష్ణ!'
గోపకాంతల జూచి గోవిందుడు నవ్వె
భామలు యీ రీతి బ్రతిమాలగాను
స్వామి పక పక నవ్వి చప్పట్లు గొట్టె
గోవిందుడు తా బలికె గోపకాంతల గూడి:
'మొలబంటి నీళ్ళలో వెళ్ళి ముదితలారః మీరు
సీలబంటి నీళ్లలోకి శీఘ్రమె రారె
మూకగా మీరంత మునువెనుక రాక
వకరి చాటుకు నొకరు వయ్యనబోక
చాటుగ వకచెయ్యి చాటుబెట్టుకోక
బట్ట బయిటికి రారె వో భామలారః
వలువలు యిచ్చేను వాలాయముగను'
కేరుచునున్న యా కృష్ణుని జూచి

తరుణులు యిక తమకు తరము
గాదనుచు
నీళ్ళలో వెళ్ళి వచ్చిరి నెలతలువేగ
కాళ్ళు కూడబెట్టి కలికి సుందరులు
బేడిశనప్పుచ్చి బెల్లముల్లపైన
చాట్లుగా చేతులు సవరించుకొని
భామలు మ్రొక్కిరి బాలకృష్ణునికి
'వంటి చాత మ్రొక్కితే వప్పదు
తనకు
రెండ్రు హస్తములెత్తి మ్రొక్కుడీ
వో నెలతలార!

తరుణులు యిక తమకు తరము
గాదనుచు
చేతులెత్తి మ్రొక్కిరి చెలియ
లందరును
పక పక నవ్వెను భావజగురుడు
ఫిక ఫిక నవ్వెను వెలదుల జూచి
కోకలు యిచ్చి కరుణించ
గోపకాంతలను
వలవలు ధరియించిరి వారంత వేట్క
చెలియలు రేపల్లె చేరి సుఖియించిరి

## శ్రీకృష్ణుడు విప్రకాంతలకు వరమిచ్చుట

అంతట చెలికాండ్లు అందరు శ్రాము
వంతుమీరగ ధేన్వలవారు
గాయుచును
గోప్పాల్కు లాకళ్ళ గ్గొంటిమి యనిన
అప్పుడు కృష్ణుండు యాదవుల
కనియె:
'రార్తోయి నాథక్షు రావుల వనములో
చేరువ యాగంబు సేయుచున్నారు
మా పేరు చెప్పిన మంచి యన్నంబు
విప్రకాంతలు దెత్తురు వేంచేయు' మనిన
పోయి యాదవులు భూసురుల
నడిగిరి
'యగ్నసిద్ధంబైన యట్టి యన్నంబు
అగ్నానులగు గొల్లలు అడుగంగరాదు

కుడువబెట్టగరాదు కుడువంగ రాదు
పొమ్మన్న వారు వచ్చి
పురుషోత్తముకు చెప్పిరి
చెప్పిన వారితో చెప్పె కృష్ణుండు
'విప్రుల నడుగకుడి విప్రకాంతల
నడుగుడి'
అప్పుడు నడిగిన ఆ విప్రసతులు
పప్పుకూరలు మంచి
ఫలరసాన్నములు
మెప్పుగల వస్తువులు మేలైన
పిండివంటలు
పరిమళాన్నములు పణతు లందరును
కోరి బిందెల జేర్చి గొబ్బున లేచిరి
పుణ్య సంధ్యలు దీర్చి భూసురులంత
కణగి మధ్యాహ్న కాలంబునందు

బాలలు పతులును బంధుజాలంబు
వలవదు యిటు రమ్ము వద్దన్న
వినక
వచ్చిరి కాంతలు వల్లవుల వెంట
తెచ్చిన వస్తువలు తేనె అరిటిపండ్లు
అప్పుడు కృష్ణునకు అర్పణ చేసిరి
గోపాల్కులు యాదవులు గుంపులు
గూడి
అన్నము భుజియించి
అభయ స్తమిచ్చ
అప్పుడు విప్రకాంతలు అడిగిన
వరము
కరుణతో తానిచ్చి కదిలె
మాధవుండు

## ఇంద్రుని పూజింపవలదని శ్రీకృష్ణుడు యాదవులకు చెప్పుట

తల్లి మందకు వచ్చి తానున్న వేళ
నందుడు మొదలైన
మంద యాదవులు
యింద్రుని ప్రార్థించి అందరు ననిరి
'ప్రళయంబుగా తమ పశుబాలలూను
యేమి కొదవయు లేక వెలయు
మందలును
అమనిగ పూరి నీరు అన్న
మమృతంబు
క్షేమాన వుంటిమైన సేతుము
యాగంబు
దేవేంద్ర పబ్బము దిశలెల్ల యెరుగ
వేవేగ సేతు' మనిన విని కృష్ణుండు
నవ్వి
'చంద్రశేకరుడేకాక
యింద్రు డెవ్వరును?
మందలకు వాడెవరు? మన కేల
నతడు
కాలమునకు కర్త కాలకంధరుడు
కాలము మేలైతె కలుగు వర్షంబు
ధారుణి పండును ధన ధాన్యమూలు
యీ రీతి పూరి నీళ్ళకు యీశ్వరుడె
కాక
యింద్రునికి పనియేమి
యీ లోకమందు
యెందున యీదేరదు
యింద్రయాగంబు
'చంద్రశేకరు నెరుగము యింద్రుడె
కాక'
సతులు పురుషులు సంభ్రమంబునను
యింద్ర యాగానికి విందులు చేసి

శంకరుడు లేక కొనసాగవు పనులు
పంచ పదార్థములు పరపూర్తిగాను
కొంచరాండి మీరు గోవర్ధన గిరికి
సకల లోకారాధ్యు సర్వేశ్వరుండు
ఆకడ నున్నాడు అనుమానము లేదు'
ఆచివిష్ణు యిట్లనిన యాదవ వరులు
పలికిరి యాదవులు బాలకృష్ణుని
తోటి:
వెయి వేల విధముల వేట్కతో
వచ్చి
చెయ్యెత్తి మ్రొక్కుచు చలగి
గోవర్ధన గిరికి
వలంపూరి తిరిగి వారు పూజించి
చాల పదార్థములు సమర్పించి వేగ
గోపెమ్మ నందుడు కోరి వేడంగ
అక్కడ కృష్ణుండు తన ఆప్తుల
బిలచి
'మ్రొక్కులకు కర్తను ఆదిమూర్తిని
తాను
తాను వుండంగ పరదైవము గొలువ
విహితంబు గాదు వినుడి చెప్పెదను
నేను చెప్పిన మీకు నేరంబు లేదు
యింద్ర యాగంబంత యెందు
బొందకుండ
విందులు చెరుపు'మని గోవిందుడు
శల విచ్చ
గోపాల వర్గంబు గొదకొని యార్చి
యా పదార్థము కొల్లలాడి
భుజియించిరి
యేతెంచి నారదుడు వింతయు చూచి
'యింత యెరిగింతును యింద్రుని'
కనుచు
కొండీడు దేవేంద్రు కొలువుకు వచ్చి
'వుండుమ సురరాజ! వక చెరుగ లేవు
నిన్ను తిరస్కరించి నిన్ను బోనాడి
చిన్ని కృష్ణుడు యంత చేసినా చెల్లె
పండు వంటి యగ్నము ఫలాములు
చేళ
దుండగీడు కృష్ణమ్మ దూషించ నిన్ను
ఘోరతనంబున కొల్లలాడించ'

## ఇంద్రుడు కోపించి యాదవులపై రాళ్లవాన కురిపించుట

అన్నంత దేవేంద్రుడు హాగ్రుడై
మండె
'పుడమిన యగ్నము పూజ జరచిన
వాని
యజ్ఞంబు చెరచిన యాదవపతిని
యీ ఘడియలో కూల్చకున్న
యిద్రుండగాను'
ప్రళయమైన మేఖముల పైనంబు
చేసి

'ప్రళయమైన వరుషము పట్టు
పో'మ్మనిన
రవగాలి మేఖములు రథములు
గదిలె
కావురుగప్పి వానకాళ్లు దిగె మించి
మేఖము పడమర నడిచ మోళ
వర్షంబు
యుగము చూపి మెరిశ
యీశాన్యమునను
గుభ గుభామని వులిమె
గుభులు కొనగాను
వడిగండ్లు పిడుగులు వానయు గాలి
రణకల్లుగా గురిశ రాళ్లవానయును
తండోపతండమై గజము తొండము
రీతి
కడు వర్షధారలు కాల్వలై పారె
ఫణిశేషువును వేల పట్టిన యట్లు
బెగడెను కులగిరులు బెగడె కూర్మంబు
బెగడెను దిక్కులు పెళ్లగిలె
వృక్షములు
మేరదప్పిన వానచే మేడలు గూలె
గుళ్లను మిద్దెలు గృహములు నిండి
వూళ్లన్ని నీళ్లచే వూళ్లెత్తి పారె
ఘాలి వానకు చాటుకానరు ప్రజలు
తల్లి ముఖము బిడ్డలు తమరు కానరైరి
అన్నియు చల్లారె ఆపద పడిరి
మృగములు పక్షులు మూర్ఛలు పోయ
విరివిగ వారధులు వెళ్లి విరిసినయట్లు
యేరులు కుంటలు యేకార్ణమాయ
యీతలాయ ధేన్వలకు యిదియది
యనక
వడి తరుపు కోడెలు వరదన గలిశ
తడసి లేగలన్ని ధరణిపై గూలె
అంభోయని అరిచ అంబోతులెల్ల
కుంభద్రవణముగాను కురిచ
వర్షంబు
లేగలు ముత్తరిపి లేగలన్నియును
లేగలు నీళ్లలో తేలాడ సాగె
కొంగర్లు బోయను గోపకాంతలకు
రవి బొడుచు రవిగ్రుంకు రాత్రి
పగలనక
దేవేంద్రు రాళ్లవా నేడు దినములు
కురియింప

## శ్రీకృష్ణుడు గోవర్ధనగిరి నెత్తి యాదవులను రక్షించుట

జడివాన గురియంగ ఝుడిశ
నందుండు
అచ్చట యాదవులు ఆపద పడిరి
కృష్ణుని పొడగని కిన్నులైరంత
'దృష్టముగ మాపాలి దేవదేవేశ!
వో స్వామి! యిటువంటి వాన
యన్నడు యరుగము మేము
ఘనుడ! వానగాదు కార్చిచ్చు గాని

కొరగాము వానచే కూలె ప్రాణములు
సురభులు చిక్కెను సొమ్మసిలి
రంత
నిద్రాహారము లేదు నీరు వేరు లాయ
బాధ వచ్చెను కృష్ణః బ్రతికింపు
మమ్ము
గోవుల రక్షించు గోపాల్కుల కాయు
జీవంబు నిల్పుమా జీవజంతువులకు
యేతీరున గాచేవొ యవసతి సుతుల
మాధవః వోకృష్ణః మమ్ము రక్షింపు
పశుపుత్ర బాంధవుల పశువులనెల్ల
కాచి రక్షింపు మని కరములు మొగిచ
మొరపెట్టగానంత మురహరుడు లేచి
'వెరవకుడి వెరవకుడి వెతయాల
మీకు నేగలిగి'
అనుచు గోవర్థనగిరి అవలీలగాను
వెన్నుడు గొడుగుగా వేలను యెత్తె
గోవులు గోపాల్కులకు
గోపకాంతలకు
భావజగురుడు ప్రాణభయము
లేకుండ
ప్రాణికోట్లకు యెపుడు ప్రాణముబు
గాచ
వడిగండ్ల వానకు వైర వర్గము లేక
అవని పులి పిల్లలు ఆవుల గుడువ
మేకలు తోడేళ్లు మేలమాడుచును
యేకమై మృగములు యేమి
కొదవలేక

పముజులు గట్టుక ప్రాణభయము లేక
యేనుగులు సింహ్వాములు యేకమై
వుండె
ఘన శరభ శార్దూల
గండభేరుండములు
తమలోన వుచిత మార్గమై తగు
వేట్కనుండె
వసుధ జీవులకు వైరమార్గము
లేకుండ
యీ రీతి కాచను యిలధరుం డపుడు
దేవకిసుతు మాయ తెలసి దేవేంద్రు
ప్రణయమైన పిడుగును పంపెను
వేగ
తురమంతుడనే పిడుగు తురుతున
వచ్చి
మెండుగా యాగిరి మీది కేతెంచి
తోరమౌ యా కొండ తొలుసుక రాగ
పాటించి పిడుగని పట్టి బంధించ
చర్చర బంధించ చన్నార దాని
గరిమె తోడను విశ్వకర్మ రావించి
అచ్చుతుని పేరను ఆ కోడి కత్తి
అమరేంద్రు పేరిట అటు పందివాలు
వీరభద్రుని పేర వెలయ ఖరవాలు
గోసంగి పేరను కొంగవాల్గత్తి
వాసుదేవుడు యిట్లు వసుధ
సేయించ

## ఇంద్రుడు శ్రీకృష్ణుని శరణువేడుట

అంతట దేవేంద్రుడు అది తాను
దెలసి
వేవేగ రాళ్ళవాన వెలయంగ జేసి
పాక శాసనుడు సిగ్గుపడి తాను వచ్చి
ముకుళిత హస్తుడె ముందర నిలచి
'నాతప్పు కావవే వేయునామముల
తండ్రి!
నా తప్పు లెన్నకు నలినాయతాక్ష!
కల్లచేస్తిని నిన్ను కానక నేను
కిల్లలన్నియు గాచి కరుణించు నన్ను
దశకంధరు వైరి! దశరూపు నీవు
దశరథాత్మజుడ! దయజూడు నన్ను
యాదవుడ వని నిన్ను యరగక నేను
క్రోధించి యిటువలె క్రొవ్వి చేసితిని
నీ మహిమ యెరుగక నేరంబు చేస్తి'
వెరచి సురరాజు తాను వేడంగ
కృష్ణుని
కరుణవుంచి తప్పుకాచి రక్షించి
సురరాజును బంపె స్వామి
తానపుడు
గిరియప్పటి తావున కృష్ణుండు దించె
పరిణేన పక్షిమృగముల పంపెను
వేగ

## శ్రీకృష్ణుడు వరుణుని బారినుండి నందుని రక్షించుట

వారంత బృందావనములో
చెరియింప
ఆరూఢి యాదవులు హరివాసమునకు
వకనాడు నందుండు వక్క్రప్రొద్దుండ
నందుండు యమునలో
స్నానమాడుచు నుండ
జలములలో వర్ణు జాడ బట్టుక వచ్చి
పల్లదంబున వచ్చి పట్టుకుని నందుని
వాడు యెత్తుకపోయె యా
వరుణపురికి
జాడగని కృష్ణుండు సయ్యన నేగి
వరుణు మదిలో నున్న వాంఛలు
దీర
కరపర్తి పూజించి గ్రక్కున నంపె
సాధించి తమ తండ్రిని సయ్యన
దెచ్చె
ముదమున గోపాలముఖ్యుడు తాను
కృష్ణుండు వనములో క్రీడింపుచుండె

## రాసక్రీడ

నుండిన యాదవ నెలత లందరును
బృందావనములో నుండి మరునాడు
కందు వెన్నెలయ కమలనాభుండు
వేణునాదము బట్టె వెలదులు భ్రమయ
ప్రాణపదంబైన పణతు లందరును
వనములు చిగురొత్త వారధులు పొంగ
వనమృగములు చాల వాంచనలు గొనగ
గోపకన్యకలు మర్లుకొని మాధవునికి
అపుడు మర్లుకొని హరియంట దిరుగ
బాల యౌవన ప్రౌఢ కాంతల నెల్ల
నిలచి అన్నిరూపుల నిర్మించ కృష్ణు
వారి వారికి తగిన వైసులతోను
కోరి కృష్ణలీలలు కోర్కెలు దీర్చి
మరల బంపెను వారి మందల కడకు

## శ్రీకృష్ణుడు విద్యాధరుని శాపవిముక్తుని చేయుట

మరునాడు నందుండు మంచి దివసమునను
అంబికె వనములో ఆవులు తాము
వుబ్బి జాతర శాయ వురగంబువచ్చి
పెనుబాము నందుని పెనచి పట్టుకొని
ఆనోవేగ మ్రింగగా హరి తెలసి వచ్చి
తమ తండ్రిని విడువమని తన్నినయపుడె
పాము నందుని విడిచి బతికితి ననుచు
పురుష రూపమున నిలిచి పొగడి యా కృష్ణుని
'వురగ రూపము బోయ వారి యవ్వడవు నీవు?'
'విద్యాధరుండ విను కృష్ణ! నేను
యాదవ దేవేంద్ర! వినిపింతు నీకు
అగ్నిరుషీశ్వరుల బ్రాంహ్మల హాగ్రము తెలియక
యెగ్గు చేసితి తాను యెరుగక స్వామి!
కేకలేసి నవ్వి గేలి చేసితిని
అగ్ని రుషీశ్వరులు ఆ విప్రవరులు
పట్టమని శాపంబు పెట్టిరి వారు
పురుష రూపము బోయి భుజగము రూపు

అవునని శపియించిరి ఆ విప్రవరులు
శపియించిన ఘనుల శేవించి తాను
ఘనుల వేడి మోక్షగతి అడిగితినయ్యా!
అడిగిన యా రుషులు అభయ స్తమిచ్చిరి
దేవకి తనయుండు కొన్ని దినములకు

పొమ్మన శాపము పోవు పొమ్మనిన
అటుగను పాముసై మీ యయ్యను బట్టితి
దయపర మూర్తిరో! తన్నితివి నీవు
నీ పాదము సోకె నిహపరము గలిగె
స్వామి! నా కిప్పుడు వక సద్గతి చూపు'
వేడిన వానికి వైకుంఠ మిచ్చె.

## బలరామ కృష్ణులు శంకరాసురుని వృషభాసురుని సంహరించుట

వెన్నెల గాయగా వెస నొక్కనాడు
గొల్లలు బలభద్ర గోపాలకృష్ణ
చలరేగి అందరు చెల్లింపు చుండంగ
శంక లేనట్టి శంకరాసురుడు
బొంకించి గోపకాంతల పోనివ్వక పట్టి
కొంపోవగ మొరపెట్టిరి గోపకాంతలంత
గోపాలమూర్తి తాను గొబ్బున వచ్చి
అప్పుడు వానికి అడ్డ మేతెంచి
రమణతో వాని శిరస్సు రక్తాన తెంచి
కొమ్మని బలభద్రుకు గోవిందుడు శలవిచ్చె
అంతట వృషభాసురుండను రక్కసుండు

పోతరంబున వాడు ఆంబోతుయై వచ్చి
కొమ్ములు భూమి గ్రుచ్చి యెగచిమ్ముచు
ఘాతగా రంకెలు గట్టు దరవెగియ
మంది నందరిని తరిమి మందకు రాగ
చిందర వందరలైరి చదరి గోపకులు
'భూతంబు గాని ఆంబోతు గాదు'
అంత మొరపెట్టగా హరి తెలసి వచ్చి
కృష్ణుండు తా వచ్చి కుటిల రాక్షసుని
బిర బిర ద్రిప్పుచు పిడివాత వాని
పుడమికి గొట్టిన పొలి పొలి ఆయ

గుండెలు యమకలు గుల గుల
లాయ
విడిచెను ప్రాణములు
ప్రవిషభాసురుండు

క్షేమాన అడవులలో చేరి
సుఖియింపుచు
రామకృష్ణులు మందకు రాజులై
వుండిరి.

## నారదుడు రామకృష్ణుల విషయము కంసున కెరిగించుట

యున్నంత నారదుడు వుబుసుపోక
నంత
వన్ని కలహము బెట్ట
భగవంతు డతడు
కల్ల పల్కులు లేనివి కల్పన
శాయడు
కలహము బెట్ట నారదుడు కంసుని
కడకేగి
'యెరుగుదువో యరగవో
యాద మరచితివో
అన్నియు ఋటు విను ఆకాశవాణన్న
మాటలు నిజము
దేవకి గర్భమున దేవదేవుడు బుట్టి
తావుదీర్చి నిన్ను దండించు ననుచు

అటువలె కృష్ణుండు ఆ మేర బుట్టి
పట్టణానికి మేటి పణతి భూతకిని
పట్టి చంపినవాడు బాల కృష్ణుండు
రాజ నీ యంతేసి రక్కసుల నెల్ల
వారిని చంపినవాడు కృష్ణుండు
కోరి నీ ప్రాణాలు కొనను
యున్నాడు
వున్నాడు నిను బట్టి వుక్కడగించు
వున్నారు రేపల్లెను అన్న దమ్ముడును
కలలోన మరువకు నీ గండమున
బుట్టిరి
బలభద్ర కృష్ణులు పగవారు నీకు'
తేటతెల్లమిగాను తెలిపి నారదుండు
పుటమెగసి తా నమరపురికి నేతెంచ

## రామకృష్ణులను తోడితెమ్మని కంసుడు అక్రూరుని రేపల్లెకు పంపుట

యటులరాజు చెప్పిన యంతనే
ఝుడిసి
వెతపడి కంసుండు విరహంబుతోను
వసుదేవు దేవకి వైరంబు బూని

కాకతోడుత వారిని ముకాకు
చేయించ
చెడుగు కంసుడు వుగ్రసేనుని
దెప్పించి

అక్కడ తమ తల్లిదండ్రిని అరాగ్జ
బెట్టించ
మధురలో కంసుండు మానవుల
దెచ్చి
బందిఖాన బెట్టించ బాధలు చేశ
తన బుద్ధిమంతుల తన ప్రధాను
తన యిష్ట బాంధవుల దాయంగ
బిలిచి
క్రూరుడై కంసుడు అక్రూరుని
బిలచి
'పరువున అక్రూర! రేపల్లెకు బోయి
బలు గర్వమున నున్న
బలభద్ర కృష్ణులు
చలమున తను చంప
జాలియున్నారట
తనపేరు చెప్పి అన్నదమ్ముల
నిద్దరిని
అనోవేగ నందుని యాదవులనెల్ల

తన కార్యము చెప్పి తడవు శాయక
నీవు
వెనువెంట తోడితే వేగిరంబునను
వచ్చిన తన పగవారి నందరిని
మచ్చరంబులు వుడుగ మట్టింతు
చూడు
అక్రూరు డంతట అనుమానపడుచు
'పోకున్న తను జంపి పోరిమార్చు
వీడు
చుట్టాల జూచినట్లు వెట్టికి బోయినట్లు
మాట వచ్చిని కంసునితో మరుమాట
లేల?
బలభద్ర కృష్ణుల జూడ భాగ్యంబు
గలిగె
బలరాముల పాదపద్మములు
పొడగందు'
అనుచు శలవు బుచ్చుక ఆ మందకు
గదిలె

## రామకృష్ణులు అశ్వరక్కసుని చంపుట

ఆ సమయమున కంసుని
ఆత్మబాంధవుండు
అశ్వరక్కసుండను వాని బిలిచి
వధియించి రమ్మన్నవాడు
అశ్వరూపున
మాయవేషము చాత మందకు వచ్చి
చౌకళించిన వారు
సఘుఘశాఘక ఘున్న

నొక్కి కరుతుననుచు నోరు
దెరచుకొని
రాగాను జూచను రామకృష్ణుండు
వేగమె వానికి యెదురుగావచ్చి
చూచినవాని అటు చుట్టి పట్టుకొని
కరమున చక్రంబు కడువేగ బూని
వురుపడి చై నోట్లో వుంచినయపుడె
పొఘలుగ యిచ్చి పండ్లూను డుల్లె

అక్కడ అక్రూరకుసుండను వాడు
చెల్లె,
దేవతలు నారదుడు దివినుండి చూచి
దేవకితనయుని దీవించిరంత

## రామకృష్ణులు అక్రూరునితో మధురకు వచ్చుట

వచ్చి అక్రూరుండు వారి పొడగాంచి
పక్షముతోడుత బలభద్రకృష్ణుల
వేయు విధంబుల వినుతులు చేశ
'పరగంగ మీ పాదపద్మములు
పొడగంటి
నిత్యకర్మము చాళ మిమ్ము
చూడగంటి
కృతార్థుడనైతి'నని అక్రూరుడు
బలికె.
మ్రొక్కి కంసుడు బలికిన
ముచ్చటలన్ని
అక్రూరుడు బలభద్రుకు
హరికి విన్నవించె
హరి కట్నంబు లిచ్చి అక్రూరుని
మన్నించి
కలుపు చమురులు మంచికావళ్ల
నంపించి
కలిగిన భూషణాలు కట్నాలతోను
ఆవులు లేగలు అప్పనము గొంచు
వేవేగ కృష్ణుండు వెస సంతసమున
వెన్నడు అక్రూరుని వెంటబెట్టుకొని

అన్నయు తా గదిలె యాదవులు
గొలువ
కాళింది వద్దను కడు వేట్క నిలిచి
అక్కడ స్నానముచేసి
అనుష్ఠానము దీర్చి
మక్కువ అక్రూరుండు మహిమె
కీర్తించె
రథమెక్కి బలభద్రు రామకృష్ణుండు
అతివేగమున మధురకు.
హస్తమానముకు వచ్చి
మధురలో వున్నట్టి మగువలు
పురుషులు
పదివేల విధముల ప్రార్థనలు చేసి
కానుక తాంబూల గంధ పుష్పములు
జనులంత యిచ్చిన సంతోషమంది
మధురలో వీధిని మాధవుడు రాగ
కొదలేక చాకి తెల్లకోకలు తేగ
అపుడు కృష్ణుండు అన్నియు తాను
గోపాలుర చాత కొల్లలాడించి
వస్త్రంబు లన్నియు వారు ధరియించి

## కృష్ణుడు కుబ్జను అనుగ్రహించుట

ము స్త్రీమతై యున్న తమ ముందు
నొక సఖియు
మంచి పుష్పబంతులు మల్లెలు తేగ

అచ్యుతుడు ధరియించ అన్నియు
తాను
మరుగుజ్జు రూపైన మగువ ఆవేళ
గారవమున కస్తూరి గంధము తేగ
కంసునికి గొంపోవ కనియు
కృష్ణుండు
మర్మముల కృష్ణ యా మగువను
జూచి
తనకు యిమ్మని అడుగ తరుణి
ధరియించ

బలరామకృష్ణుల పై నింద నలదె
పొలతి నీ మరుగుజ్జు రూపు పొమ్మని
పట్టిడువ
ఆక్షణమున అప్సరస శ్రీయై
నిలచను వేగ
ఆ రాత్రి మధురలో అష్టభోగముల
వారకాంతల వీధి వసియించి
యుండిరి

## కంసుడు పూజించెడి విల్లును శ్రీకృష్ణుడు విరుచుట

ఆట యేకువను లేచి అనుష్టానము
దీర్చి
పటశక్తి ఆయుతపడి రందరూను
మామ వున్నట్టి ఆస్థాన
మంటపంబునకు
స్వామి వేంచేశను సహోదోడు తాను
విచిత్రమైనట్టి విల్లు కంసుండు
పూజింపుచుండెను పుడమెల్లయెరుగ
వీకె విల్లు జూచి విష్ణు తానంది
యెక్కుబెట్టగ విరిగి యేడు
తుంటలయ్యె
వింటి కావలియున్న వీరరాక్షసులు
కంటి కంటి మనుచు కాలు
దువ్వుచును

విల్లు విరచినవాని వీధిలో చంపక
యాల పోనిత్తుమని వెధరించినాను
కోపించి బలరాము గోపాలకృష్ణ
యేపుతో తమను వెధరించు వారిని
కొందరిని పట్టుచు కొందరిని
గొట్టుచు
కొందరిని చంపుచు గుమలు
గ్రుచ్చుచును
వధియించ రక్తము వరదగ బారె
సదమదముగ వాండ్ల చంపిన వెనక
చెల్లంగ చిక్కిన చిల్లరిమూక
తలలు వీడగ కంసుని తావుకు
నురికె.

## కంసుడు రామకృష్ణులను తన కొలువుకూటమునకు రప్పించుట

ఆ వార్త చెప్పిన హాగ్రుడై మండె
కాలాగ్ని కోపాన ఘనుడు తానెగిరి
మండుచు ఛాణూర మల్లుల బిలిచి
గంధ పీద్యంబులు కట్నంబు లిచ్చి
'యిదిగోను నాకుగల పగ యీదేర్చ
 మీరు
దిట్టముగ చంపిన దేశంబు లిత్తు
మల్లయుద్ధంబున గొల్లల
 మడియించవలెను
మరువకుడి మీ చెయ్యి మరి
 రంగమధ్యమున'
ఆయుత పరిపించి అపుడు కృష్ణుండు
తరుచైన రత్నాల తమకంబు మీద
ధర వెక్కసుడైన కంసుడు
 తమకంబు చాత
వీరరక్కసుడైన కంసుడు వేగ
 కొల్వుండె,
వెక్కసులైనట్టి రక్కసుల బలము

కిక్కిరిసి కొల్వువుండె
 వుక్కుపొడి రాల
మన్నీలు సామంతులు మంత్రివర్గంబు
తన హిత బాంధవులు డాసి
 కొల్వంగ
వరుసతో యాదవవరుల రప్పించి
సరస కూర్చుండుమని చనువిచ్చె
 నపుడు.
కంసుడు అట్లుండ కడు వేగిరమున
రమ్మని పిలిపించ రామకృష్ణులను
వైనాన గోపాలవరులు నందుండు
పైనమై కట్టాయిత పడిరందరూను
బలభద్ర కృష్ణుల బహుళమై
 కొలువ
యిలలోన యాదవులు విష్ణుమూర్తిని
 గొల్వ
గోపాలు దేతెంచ గొల్లలు దాను
మామను చూడను మాధవుడు వచ్చె

## రామకృష్ణులు కువలయాపీడమను ఏనుగును చంపుట

వారు రాగాను కంసుని వాకిట యున్న
పేరైన కువలయంపీఠ మను గజము
కావలి వుంచిన క్రమమున నంత
మావంతు ఢీకొలిపె మదమునేనుగను
శలవులు కొప్పరించి చీదర రేగి

గోపాల కృష్ణుల కొమ్ముల గ్రుచ్చి
చంపి మట్టుదుననుచు చాపె
 తుండంబు
భద్రగజమును జూచి బలభద్రు
 కృష్ణు

యెదురెక్కి గజముతో యెనియేక పోటి
వడిచి కుంభస్థలం వప్పులుగ గుద్దె
తుండంబు తెగదీసి తునియలు చేసి
దంతములు బెరికి దవడలు చీరి
మత్తులై వున్న యా మల్లుల జూచిరి

## రామకృష్ణులు చాణూర ముష్టికులను సంహరించుట

మసలుచు యా రంగమధ్యమున నున్న
కంసుడు చాణూరుల కనుసైగె చేశ
మదహత్తి ఝుట్లు మరి రంగమధ్యముగ నిలచి
చెతురు లాడుచు తొడలు చరుచుక వచ్చి
బలభద్ర కృష్ణులపై బలిమి చూప
రంగమధ్యమున వున్న రణఝుట్ల జూచి
చాణూరునితో బోరె శ్రీచన్న కృష్ణ
బలురాముడు ముష్టికు పాల్పడి నిలిచె
కదసి పోరాడంగ కదిలెను గిరులు
కుంభిణి యిట్టట్టాయ గుద్దు లాడంగ
అంబర వీధిని అమరులు ఝుడియ
పెనుగు లాడగ బూమి ఫెళ ఫెళ అదిరె
ఆదిశేషువు వణక అంబుధులు తొణక
కూర్మంబు బేధెల్ల కులగిరులు తర్ల
పర్వతంబులు వుర్ల ఫణిపతి చెర్ల
ధరణి ధూమ్రంబెగయ దానవు లదర
గ్రక్కున చుక్కలు గదితప్పి రాల
జనులు తల్లడిల్ల ఝుట్లతో గదిసి
చెర్లించి కృష్ణుడు చాణూరుల బట్టి
నేర్పున వాండ్ల బట్టి నేలకు గొట్టిరి
సందుసందులు విరిగి చాణూరులకును
బొందులు విడిచి పోయ ప్రాణములు.
చాణూర ముష్టికులు చెల్లిన వెనక
చిక్కిన యా ఝుట్లు చెట్లకు నురికిరి

## శ్రీకృష్ణుడు కంసుని వధించుట

యట్లాగు యని ఝడిసి యూరడ యిక దాగను
ధీరుడు కంసుని గుండె దిగులన గాను
నారాయణుడు సింహ్వానాదంబు చేశ
గజము సింహ్వము జూచి కల్వరించినట్లు
భుజ మప్పళింపుచు బుస లుప్పతిల్ల

రాజసభ శలవిచ్చ రణరంగమునకు
గజ తురంగంబులు కాల్బలంబులును
రథములు గుర్రాలు రణవీథి యందు
పృథివి యీనిన యట్లు భువి
పిక్కటిల్ల
మూల బలము గదిశె ముహూర్త
మాత్రమున
బలభద్రుడు కృష్ణుడు భవరంబులోన
అలకడ చిడుగుడు లాడిన భంగి
పొర్లి బెదరిన ఆవుల పోలించినట్లు
వుర్లి గిరుల రాళ్లు వగి జారినట్లు
తతి వచ్చిన పైరు తగ గోసినట్లు
అతి ప్రళయమున జీపములు
హతమైన యట్లు
గజ తురంగముల గొట్టి కాల్బలంబుల
మొట్టి
గజిబిజియై బలము కల్వడంబంద
కొట్టిరి శత్రువులు గుట్టలుగాను
మట్టిరి పగతుల మంటను గలియ
కొట్టిరి గజముల కుంభ స్తలములు
బగుల
విప్ర వీగుచు శత్రువుల యిలమీద
గూల్చిరి
ప్రరుగ రక్తము వాగులై పార
పక్కెచాపల బోలి పరగ భూషణాలు
పెక్కు యుధంబులు చొక్కమౌ
ఛత్రములు
వారాశి తేలిన వై ఖరి నుండె
యీ రీతి యుద్ధము యిసకక
మరియు
అనియేక యుద్ధము చేశ ఆవేళ
కదసి
దేవకితన యుంతు తెలసి కోపమున
వురిమి పిడుగు వచ్చు వురవడితోను
వురికెను తమ మామ వున్న
తమకమునకు
కంసు ఖడ్గము దూసి కంటి కంటి
ననుచు
తామంత లేచియు తర్లి రాగాను
'లేవకు మామ'యని నేర్పున కృష్ణ
ఆదిమూర్తి కంసుని శిరస్సుపై
హస్తము వుంచె
విదళించి కంసుని విగతుని చేశ
పళిది తమకము చుట్టున్న
పరివారమూను
తీసి భూమికి గొట్టె తిమిరి
కృష్ణుండు
వధియించ నప్పుడు వాని పేరడగె
మదమడిగి కంసుడు మడిశె నావేళ.
శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ

## రామకృష్ణులు తల్లిదండ్రుల చెరలుబాపి ఉగ్రసేనునికి పట్టము గట్టుట

తమ మామ కూర్చున్న తమకము
యెపుడు
యిమ్మహి యాదవులకు యల్లడ చేశ

రామకృష్ణులు యిచ్చిన రత్నాల
తమకము
క్షేమాన యాదవులు చెల్లించుకొనిరి
అన్ని దేశముల నున్న
అల ప్రజలంత
అప్పుడు సంతోషించి ఆనంద
మందిరి
ఆనంద భరితులై అమరులు మెచ్చి
కురియించిరి వారిపై కుసుమ
వర్షంబు
మెరశను వుత్తరం మిన్ను మ్రోతలు
మ్రోసె
బరువు వుడిగె నని భూమి ప్రజలు
సంతసించిరి
కంసుని సతులు కళదప్పి శోకించిరి
ప్రలాపించిరి తమ ప్రాణేశు కొరకు
బలరామ కృష్ణులు యా పణతుల
జూచి
వలదు దుఃఖింపకుడని వారి
నూరడించి

అంతట కంసునికి అన్నదమ్ములకు
కీర్తిగా పరలోక క్రియలు చేయించిరి
ఆ కంసు అగ్గచే ఆపద పడుచున్న
దేవుడు వసుదేవు దేవకీదేవిని
రామకృష్ణులు వారిని రప్పించి వేగ
తమ తల్లిదండ్రులకు దండంబు
బెట్టిరి
కలసి మెలసి వారిని గారవింపుచును
అలర సంతోషమున ఆనందమందిరి
శరణన్న యా వుగ్రసేనుని కపుడు
పరిపూర్తి యా మధుర పట్నంబు
యిపుడు
వెయాతి శాపము యాదవులకెల్ల
యివరాజు పట్టణము యాలవలె ననుచు
చెన్నొంద యా వుగ్రసేనుని
కపుడు
పనివడి యా మధుర పట్నంబు గట్టె
పాపఖర్ముడు కంసుని బాధలచాత
ఆపద పడిపోయిన మానవుల దెచ్చి
కాపాడి కృష్ణుండు కాయుచునుండె

## రామకృష్ణులు నందుడు మొదలగు యాదవులను సత్కరించి రేపల్లెకు పంపుట

వినయమున నందునికి గంధ
పీద్యంబు లిచ్చి
తనయులము మేము తల్లిదండ్రులు
మీరు

ప్రేమ పుత్రమోహమున పెంచితిరి
మీరు
గోపెమ్మ మొదలైన గోపకాంతలకు
అప్పుడు చెలికాండ్ల అందరిని బిలిచి

ప్రేమకట్నాలు యిచ్చి పెద్దిరికెము చేసి వేంచేయు'దని రేపల్లెకు పిట్కాల్పె వారిని

నందునితో బలికె నందనందనుడు: శ్రీ శ్రీ శ్రీ శ్రీ

'మామ యేలిన పట్నము మధురలోపలను మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ జేయును

శ్రీకృష్ణార్పణమస్తు

మేము కొన్నాళ్ళు వుండను మేరయున్నాది

భావనామ సంవత్సర ఆషాడ శుద్ధ సప్తమి పూజరి పోలయ వ్రాసినది.

—:o:—

[కాటమరాజు కథలు సర్వము సంపూర్ణము]

'భుగ్న పృష్ఠ కటి గ్రీవః
స్తబ్ధదృష్టి రథోముఖః
కష్టేన లిఖితం గ్రంథం
యత్నేన పరిపాలయేత్'